తెలుగులోనే మూలము వ్రాయబడ్డట్లుగా — గమించవలెననే ఉన్నతాదర్శము అప్పటికి ఏర్పడియుండలేదు. పిమ్మట దీనిని సవరించి కొన్నిప్రకరణములను శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారిచే ప్రకటింపబడుచుండిన 'కాంగ్రెస్' సంచికయందు 1921–22 సం॥ ప్రాంతములో ప్రచురించితిని. అంతట కొంతకాలము ఈ కవిలికట్ట మూలబడియుండెను. అనంతరము శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్యగారి ప్రోత్సాహమువల్ల దీనిని తిరిగి బయటికి తీసికొనిరావలసివచ్చి, అప్పుడు దీనిని సంస్కరించుటకు ఆంధ్రదేశమునకు చిరపరిచితులున్ను, అనేక గ్రాంధగార్ల గ్రంథములను తెలిగించినవారున్నునగు మానికొండ సత్యనారాయణశాస్త్రిగారికి దీనిని యప్పగించి సంస్కరింపజేయుట యుక్తమనితలచి, 1928 సం॥లో వారిపరం చేసితిని. అయితే నా తర్జుమాను సవరించుటకు సాధ్యంకాలేదు. కావున శాస్త్రిగారు గ్రంథము నంతను మరల నామూలాగ్రముగ తెలుగులో మూలము వ్రాయబడ్డట్లుగ రచియించిరి. ఈ సంగతి ఎక్కడైన ఏరెండు వాక్యములు చదివినను పాఠకులకు సులభముగ విదితమగును. శాస్త్రిగారి భాషాస్వాధీనము సంస్తవనీయము. వారి పరిశ్రమజ్ఞానమును గురించి చెప్పవలసిన పనియే లేదు.

ఈ రోజులలో వ్రాసినగ్రంథములను గమనించి, సాధారణముగ ముద్రింపించువారు బహు కొలదియుంది. ఇట్టి స్థితిలో ఈ గ్రంథముయొక్క మూలము యేడు సంవత్సరములనుండి తనయొక్క ప్రకాశమునకు తపస్సు చేస్తూవున్నదా యన్నట్లు వేచియున్నది. సభ్యతవహించిన సర్వదేశములలోను, గ్రంథకర్త యెన్నడును గ్రంథముయొక్క ప్రకాశకుడు కాడు. గ్రంథకర్తయొక్కపని గ్రంథరచనయే; ప్రకాశకుని పని ప్రకటనయే. రెండది వ్యాపారరీత్యా జరిగినా జరుగవచ్చును; అభిమానరీత్యా జరిగినా జరుగవచ్చును. కాని, ఈరెండు ఒకరే చేసికొనవలసివచ్చినప్పుడు ఇరుకుపరిస్థితులు ఎంత క్లిష్టమగునో యోచింపుడు! శాస్త్రిగారే గ్రంథమునువ్రాసి, అయినదే అచ్చువేయించుకొని, ప్రకటించుకొనవలసివచ్చుట మిక్కిలి కష్టతరమైనపని. కాబట్టి, ఆంధ్రలోకము ఈగ్రంథము నాదరించి, వారికిట్టి నష్టము కలుగజేయకుండ చూచెదరని ఆశపడుచున్నాను.

ఆంధ్రదేశముపై ఒక దోషారోపణకలదు. రెండుకోట్ల జనాభా గలిగిన ఈ ఆంధ్రదేశము ఒక్క ఆంధ్రపత్రికను దినపత్రికగ పోషించలేకుండె

వున్నది. అరవదేశంలో జనాభా ఒక కోటి అరవైలక్షలు మాత్రమే అయివున్నను, అయిదు దినపత్రికలు పోషింపబడుచున్నవి. అక్కడపత్రికలకు వేలకొలది చందాదార్లు గలరు. అటులనే గుజరాతు, మరాటా దేశములలో పత్రికా ప్రచారం స్వయంపోషకముగ నుండుటెంతయు ఆశ్చర్యకరం— ఎంతయు సంతోషదాయకం. ఇంకబంగాళీ, హిందీభాషలగురించి చెప్పనక్కరలేదు. ఆంధ్రులంత పేదవారున్ను కారు; నాగరికతలో వెనుకపడ్డవారు కారు; చదువులేనివారుకారు. విత్తము, విద్య, సభ్యత కలిగినటువంటి వీరలు భాషాపోషణ యేలచేయరో కారణము దురూహ్యముగనున్నది.

ముందుముందు పుస్తకము లెన్నియో అచ్చుపడవలసి యున్నవి. విద్యావ్యాపకం యావత్తు— విశ్వవిద్యాలయములలో కూడ— మాతృభాషద్వారానే జరుగవలసియున్నది— జరుగనైయున్నది. ఇందుకు తెలుగు పుస్తకములు అత్యంతావశ్యకములు. పుస్తకములు లేవని విద్యాలయములు తమ పద్ధతులను మార్చుకొనజాలకున్నవి. విద్యాలయముల ఆదరణ, విద్యార్థులకొనుబడి లేదని పుస్తకములు బయలుదేరుటలేదు. అదిగాక కాలములో అధాత్తుగ తెనుగు పుస్తకములకు ఒక్కపెట్టున డిమాండు (గిరాకీ) వచ్చిపడుననుటకు సందేహములేదు. కావుననే, ఉద్యోగంలేదని విలపించెడి విద్యావంతులకు నేను యిచ్చు సలహా సామాన్యంగా యిదే. "పుస్తకాలు వ్రాయండి"— అని చెపితే, కొనేవారు లేరని బదులుచెప్తారు. లేకపోయినా వ్రాయవలసినదని నామతం. "ఏం ప్రయోజనము" ని అడుగుతారు. ఊరికే కూర్చుంటే ప్రయోజన మేమిటని ఆలోచించవలసి వస్తున్నది. యువకులకు ఒకవిధమైన నిరాశ కలిగినది. నిరాశనుండి జడత్వమేర్పడినది. దీనినంతను పారద్రోలుటకు భాషాపోషణమే సాధనము.

అందులో టాగోరు వ్రాసిన "ఎన్సైక్ ఇన్ ఏషియా" వంటి పుస్తకం ఇంతకాలము తెనిగించక పోవడం, తెనిగించిన తరువాత ఇంతకాలం ముద్రించకపోవడం ఆలోచించగ ఆశ్చర్యవిషాదములు కలుగక మానవు.

ఆంగ్లేయులు సామ్రాజ్యస్థాపకులు. సామ్రాజ్యస్థాపనకు కార్యసాఫల్యతయే యెక్కువగ గమనింపబడునుగాని, సాధనవిధానముల యొక్క యుక్తాయుక్తతలంతగ వివేచింపబడవు. కాని, ఉద్గ్రంథరచన యందు మాత్రము ఆంగ్లగ్రంథకర్తలు సత్యాన్వేషణంగావించి, సత్యమునే ప్రకటిం

కురని చెప్పుటకు సందియములేదు. ఇందుకు ఈ గ్రంథమే నిదర్శనము. స్కూలుపుస్తకాలమాట మనం మాట్లాడడంలేదు. చరిత్రకారులు పరిశోధన చేసి వ్రాసినగ్రంథములలో మాత్రము — అభిప్రాయభేదముల కవకాశమున్న సందర్భములలో తప్ప — తక్కిన సందర్భములలో సత్యనిరతినే చూపించుచున్నారు. భారతదేశములో బ్రిటిష్ శకారంభ కాలమునాటి చరిత్రము ఈ గ్రంథమునందు నిష్పక్షపాతముగ 1872 సం॥ లోనే పార్లమెంటుమెంబరైన టారెన్సుగారిచే వ్రాయబడియుండ, అందలి సారాంశమును మన యువకులకు యింతకాలము అందజేయలేకపోవుట మన లోపమని చెప్పక తప్పదు. అట్టిలోపమును శాస్త్రిగారు తీర్చినారు. ఆంధ్రులుకూడ తమ యందెట్టి లోపము నుంచుకొనక ఈ గ్రంథముకొని, చదివి, జీర్ణించుకొని, ప్రయోజనమును పొందెదరుగాకయని ప్రార్థించుచున్నాను.

బందరు
౨౩-౬-౩౬

భో. పట్టాభిసీతారామయ్య



# అనువాదకుని విజ్ఞప్తి



"లోహేకే చనా"—'ఇనుప గుగ్గిళ్లు' సుమాయివి, వీని నెట్లు తెలుగుపాకము పట్టెదవో, అను నీ మాటలతో పట్టాభి సీతారామయ్యగారు ఎంపైర్ ఇన్ ఏషియా "**Empire in Asia**" **by Torrens M. P.** అను ఆంగ్ల గ్రంథరాజమును **1928** సం వత్సరములో నేను బందరులోని కృష్ణా కో ఆపరేటివు బ్యాంకులో ఉద్యోగమునకు కుదిరిన కొలదిదినములకు ఒకనాటి ఉదయ మున నా చేతనుంచిరి.

ఇది చరిత్రగ్రంథము. భరతఖండమున ఆంగ్లపరిపాలనా స్థాపనకు సంబంధించి, **1757** సం|| ప్లాసీయుద్ధము మొదలు **1857** సం|| సిపాయిల కలహము నాటివరకుగల ఒకశతాబ్ది చరిత్ర యిందు చిత్రితము. ఇది 'టారెన్సు' అను ఒక ఆంగ్ల పార్లమెంటు సభ్యునిచే మ్యూటినీ జరిగిన కొలదికాలమునకు **1872** సం|| లోనే వ్రాయబడెను. గ్రంథకర్త ఉదారభావ సమన్వితుడు. భరతఖండ మును కుంపిణీవారు ఆక్రమించుకొనుటలో గావించిన చర్యల నీతడు గనులకు గట్టినట్లు వర్ణించినాడు.

తనజాతివారు చేసిన చర్యలకు ఆగ్రహము, పతిత భారత జాతియెడ సానుక్రోశము--మొదలగు మహోన్నత భావములిందు ఇమిడియుండుటచే భాషయు మహోన్నతశైలి నధిరోహించెను. పదములు గుంభితమై వగులగొట్టిన కొలది మృదుమధుర గంధ

భావముల జిమ్ముచుండెను. అందుకొరకే పట్టాభిగారి భాషకు "లోపాకేచనా" యనిరి. అంగ్లమునందిమిడియున్న యిట్టి గుంభిత భావములను తత్తుల్యమగు తెలుగుభాషలోనికి దింపుటదురట కార్యమయ్యెను. భాష భావముననుగమించును గావున నీ తెలుగురచనయు మాతృకయగు యింగ్లీషురచన ననుసరించి ప్రౌఢపాకమున బడినది. అయితే, ఆంధ్రభాషకుగల సహజమాధుర్యముకూడ చేర్పబడుటచే నవలినకొలది దీనిమాధుర్యము పాఠకులకు ఆనందము గూర్పగలదు. మొత్తముమీద పట్టాభిగారు ఆశించినట్లు ఈ ఇంగ్లీషు యినుపగుగ్గిళ్లను తీయని తెలుగుపాకములోనికి దింపగలిగితిననియే తలంచుచున్నాను.

ఈ చరిత్ర కేవలము యుద్ధములు, సంధులు మొదలగు పొడిపొడి యంశములతో కూడినదికాదు. మానవుని మనోక్షేత్రమందు సత్వరజస్తమో గుణము లెట్లెట్లు చెలగాట లాడుచుండునో ఈ గ్రంథకర్త ప్రతిఘట్టమందును చిత్రించినాడు. ఇందలి ప్రతిపాత్ర యొక్కయు అంతరంగ బహిరంగ ప్రవృత్తులు కండ్లకు గట్టినట్లు వర్ణింపబడినవి. ఇందలి ఘట్టములు దృశ్యప్రబంధములుగ, నవలలుగ, రచింపతగియున్నవి. పాత్రల "స్వగతములు" నాటకకారుడు వేరుగవ్రాయనక్కరలేకుండ ఇందేరచింపబడియున్నవి. ఆంధ్రదేశమందలి కవిరాజులు ఇందలి ఇతివృత్తముల కొన్నింటిని దీసికొని చక్కనిచరిత్రాత్మిక నాటకములుగ రచించిన యెడల ఆంధ్రభాషకు, దేశమునకు ఎంతో సేవజేసినవారగుదురు. "బ్రిటిష్ పీరియడ్" కు సంబంధించిన చరిత్రాత్మిక నాటకములు, నవలలు లేనికొరతను ఆంధ్రకవులీపట్టున తీర్చురుగాకయని సవిన

యంమంగ వేడుకొనుచున్నాను. వారికి గ్రంథము ఒక గనిగ నుండ గలదు.

ఇండియాలోని స్కూళ్ల ఉపయోగార్థమై కొందరు ప్రచురించిన చరిత్రలలో సురాజ్ ఉద్దౌలా మున్నగువారి బొమ్మలను భయంకర రాక్షసరూపములుగ ముద్రించిరి! ఒక పురాతనచిత్రము నుండి గ్రహింపబడి ఈ గ్రంథమందు ముద్రింపబడిన సురాజ్ ఉద్దౌలా బొమ్మచూచినయెడల నాతని సౌమ్యరూపము వ్యక్తమగును.

ఇందలి **21, 22, 23** అధ్యాయములను మామిత్రులు భాస్కర్ల గోపాలకృష్ణమూర్తిగారు రచించి నాకెంతయు సాయపడినందుకు వారికి కృతజ్ఞుడను.

బందరు<br>**26—6—36**

మానికొండ సత్యనారాయణశాస్త్రి,<br>అనువాదకుడు.





హిందూ దేశము
1757–1857
70
80
90
100
30
20
10
టిబెట్
పంజాబు
లాహోర్
క్వెట్టా
ఢిల్లీ
మధుర
ఆగ్రా
భరతపూర్
నేపాళము
భూటాన్
బెలూచిస్థానము
కరాచి
గుజరాత్
మాల్వా
ఇందూర్
నాగపూర్
అస్సాము
పాట్నా
బక్సార్
కలకత్తా
ముర్షిదాబాద్
బంగాళాఖాతము
బొంబాయి
పూనా
హైదరాబాదు
కర్నూల్
రాజమహేంద్రము
అరేబియా సముద్రము
గోవా
మంగుళూరు
మైసూర్
శ్రీరంగపట్నం
మద్రాస్
పుదుచ్చేరి
మాహి
అండమాన్

# భరతఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన



## మొదటి అధ్యాయము



### ( ఉపోద్ఘాతము )

[ మనము ఇండియా ప్రజల కొక విధమగు దుర్బోధనము చేసితిమి. ఎట్లన, " మీరు మీ రాజుక్రిందనే యుండుడు. ఆయన మీకేమైనా అపకారము చేసిన యెడల మాతో వచ్చి చెప్పుకొనుడు. మేము మిమ్ము రక్షింతుము. మీ రాజును మీరు లోబరచుకొనుడు. మేము మీకు సహాయులుగ నుందుము. ఆయన మిమ్మును పీడించిన యెడల మేము మిమ్ము విడిపింతుము " అని ప్రజలకు దుర్బోధజేసి రాజులపై ప్రేరేపించితిమి. కాని, ఆరాజుల వదలి వాని స్థానే మనమే రాజులమై, మనమే ప్రజలను బాధింపసాగి నప్పుడు ప్రజల కిక దిక్కెవ్వరు? ప్రజలకును మనకును జరుగు ఒడంబడిక లను తప్పకుండ అమలు జరిపించు వాఁడెవఁడు? మనము ప్రభువులము, సర్వం సహాధికారులము—ప్రజలు నిస్సహాయులు. వారికి దిక్కు లేదు. మన నిరంకుశాధికారపు దయాదాక్షిణ్యము తప్ప వారికి ఒక హక్కు గాని, ఒక వ్యక్తిత్వముగాని, యెంతమాత్రము లేదు. ఎంత దారుణము! ఎంత దుస్సహము! ఇంత స్పష్టముగ గన్పట్టుచున్న ఈ ఘోర కార్యమును బుజువుపరచుటకై నేనేల యింత కాలము వృథచేసితినని నాలో నాకే సిగ్గగుచున్నది. " అని ఫాక్సు మహాశయుడు వ్రాసియుండెను. ]

## కథాభాగము.

17వ శతాబ్దారంభమందు భారతవర్షము యూరపు ఖండవాసులకు అజ్ఞాతభూమిగ నుండెనని చెప్పవచ్చును. భారతవర్షపు ప్రాచీన ప్రఖ్యాతినిగూర్చి గ్రంథములందు చదువుకొనిన యే కొలదిమంది పండితులకో లేక ప్రాచ్యఖండ తీరములనుండి అప్పుడప్పుడు వ్యాపించుచు వచ్చిన విస్మయ జనకములగు పుక్కిటిపురాణముల విన్నవారికో తప్ప, భారత దేశపు పేరు ఆంగ్లేయ ప్రజల కెవరికిని తెలియనే తెలియదు. ఈ భారతదేశమువల్ల తనకు గాని, తన దేశమునకు గాని, కించిత్తయినను, లాభము కలుగ గలదని ఆనాడే యింగ్లీషు వాడును, కలలో నైనను, అనుకొనలేదు. ఈ భారతదేశము యింగ్లీషువారికి అందుబాటులో లేకుండెను, వారు దానిని చూడనూలేదు. అందుచే వారికి దానియందు ఆశగలుగుట కవకాశమూ లేకుండెను. ఈ కారణముచే, భారతవర్ష మప్పటికి క్రైస్తవరాజ్యముల దురాశకు గురిగాక సురక్షితముగ నుండెను. "పరుల సొమ్మునకు ఆసపడకు" అని యేసుక్రీస్తు చెప్పిన మాట, మన మెన్నడు చూడని వానినిగూర్చి చెప్పిన మాట కాదు. ఏలననగ, చూడనివస్తువునందు ఆస కలుగక పోవుటలో గొప్ప యేమియు లేదు. మనకంటికి యింపుగా నున్నట్టియు, జిహ్వకు రుచిగ నున్నట్టియు పదార్థములందే మనము దురాశకలుగకుండ నిగ్రహించుకొనవలెను. అదియే నిజమగు నిగ్రహశక్తి. కావున, ఒరుల సొమ్మునకు ఆశపడరా దను మాట మన కందుబాటులోనున్న వస్తువులగూర్చి చెప్పిన

మాటయే గాని, దూరమందున్న వానిని గూర్చి చెప్పిన మాట కాదు.

కాని కాల మొక్క-రీతిగ నుండదు. ఇదివరలో పాశ్చాత్యుల దురాశావశము గాక, దూరమందెచ్చటనో, చాటుగ, సుశోభితకళలతో నొప్పుచున్న భారతవర్షము ఒలందా (హాలండు) బుడతకీచు (పోర్చుగీసు) నావికుల ప్రియత్నముల చే, పాశ్చాత్యులకు సమీపస్థమయ్యెను. భయంకరమగు తుపానుల చే భయానకముగ గన్పట్టుచు వచ్చిన దక్షిణాఫ్రికాగ్రిమును సరుకు పూటీ ఓడలలో సులభముగ దాటవచ్చునని ఒలందా నావికులు గనిపెట్టిరి. వెంటనే యీ దేశ ద్రిమ్మరులు మిడుతల దండువలె వచ్చి సమస్త ధనధాన్య సంపదలతో నొప్పుచున్న తూర్పు సముద్రపు లంకలపై వ్రాలిరి. అచ్చటి ధనధాన్య సంపత్తుల జూచి పరమానందముతో కేలింతలు గొట్టిరి. ఈ కోలాహలము విని నిస్సారమగు శీతల ప్రదేశములనుండి యిట్టివే అనేక రకపు దండ్లు గుంపులు గుంపులుగ బయలు దేరివచ్చెను. ఈ దండ్లలో మొదటవచ్చిన ఒలందా వారికి కొందరు మిత్రులును, కొందరు శత్రువులును కూడ నుండిరి. తమ కందరికి యిక్కడ తగినంత అవకాశ మున్నదని గ్రహించి క్రమక్రమముగ వీరంద రిక్కడ స్థావరముల నేర్పరచుకొనిరి. వీరిలోవీరు తగు కట్టుబాట్లను, ఒడంబడికలనుగావించుకొనిరి— అవసరమువచ్చినప్పుడు, వాటమును కనిపెట్టి—వీనిని త్రోసి పుచ్చుచు కూడ నుండిరి! ఈ విధముగ వారు తమ కత్యంత

లాభకరమైనట్టియు, ప్రపంచ చరిత్రయం దెక్కడను కని విని యెరుగనట్టియు, వర్తకాధికారమును స్థాపించుకొనిరి.

ఈ ప్రయత్నమందు యింగ్లీషువారు క్రమక్రమముగ వృద్ధిబొంది, తుదకు సంపూర్ణ జయముగాంచిరి. మొట్టమొదటవచ్చిన బుడతకీచులను వీరు క్రమ క్రమముగ రంగమునుండి నెట్టివేసిరి. కొంచెమాలస్యముగవచ్చిన ఒలందావారు చాలవరకు పెనగులాడిరి. కాని, వారుకూడ తుదకులొంగిపోయి, హతశేషమగు ఏ కొలదిస్థానములనో యింగ్లీషువారి దయాదాక్షిణ్యముచేత మిగుల్చుకొనియుండిరి. స్పెయిన్ దేశస్థులు యిక్కడిస్థానములగూర్చి అంతగ శ్రద్ధవహింపక, తమదేశపు గొడవలలోనే పడియుండిరి. ఫ్రెంచి (పరాసు) వారు మాత్రము తమకిక్కడ గొప్పఅదృష్టము పట్టగలదని ఉవ్విళ్లూరుచుండిరి. తదనుగుణముగ, కొంతకాలమునకు ఫ్యాక్టరీలు, కోటలు, గొప్పపలుకుబడి, మహాభారతసామ్రాజ్యము, సుళువుగ తమచేత చిక్కగలవను సూచనలుకూడ వారికి స్పష్టముగ గన్పించెను. ఇంగ్లీషువారుమాత్రము కొంతకాలమువరకు వెనుకబడియుండిరి. ఫ్రెంచివారికి కలిగినంత లాభముగాని, పేరుప్రతిష్ఠలుగాని, వీరికి లభించలేదు. అందరికంటె వీరిక్కడికి ఆలస్యముగవచ్చిరి. అందుచే, చాలకాలమువరకు వీరికి గిట్టుబాటు లేకుండెను. ఇంగ్లాండులో అంతఃకలహములవల్ల దిట్టమైన ప్రభుత్వము లేకుండెను. ఇండియాలోని పరిస్థితులగ్రహించి, తదనుగుణముగ వివేకముతోను, చాకచక్యముతోను మెలగువారక్కడ లేకుండిరి. అందుచే, అక్కడివారికి తగిన చేయూత లేకుండెను. ఇంగ్లాండులో "స్టూ

ఆర్టు" వంశస్థులు రాజ్యముచేసినంతకాలము యిక్కడ యింగ్లీషువారు ప్రజలతోను, రాజులతోను, ఏదోవిధముగ క్రింద మీదపడుచు, నెట్లెట్లో సరిపెట్టుకొనవలసినవారైరి.

భారతదేశమందు తమ మహాసామ్రాజ్యమును నెలకొల్పుటకుగాను తామొకస్థలమును నిర్దేశించి, అందు శంకుస్థాపన గావించుచుంటిమని ఆపదునేడవశతాబ్దములో ఆంగ్లదేశములో నెట్టిరాచకీయ ధురంధరుడుగాని, యేప్రతిభాశాలిగాని, కలలోనైనను తలంచియుండలేదు. ఆ సామ్రాజ్యమెట్టిది? కేవలము పట్టిసముద్రములపైనను, లంకలపైననుగాదు— సమస్త వస్తుసంపాదకమగు వర్తకరాజ్యము మాత్రమే కాదు- కేవల భుజబలము చేతనే లోకమంతటిపైనను నిరాటంకముగ స్థాపింపబోవు మహాసామ్రాజ్యమిది ! ఇట్టిమహాసామ్రాజ్యాధిపత్యమువహించి, తాము లోకమంతటిని పాలింపబోవుచున్నామని ఆనాడే యాంగ్లేయుడును కలలోనైన తలంచియుండలేదు.

భరతఖండమందలి దక్షిణ భూభాగ మా శతాబ్దమందు స్వతంత్రులగు పలు రాజులచే పాలింపబడు చుండెను. వీరు భిన్నమతములకు, భిన్న సంప్రదాయములకు చెంది, పలుతెరగులుగ పాలించుచుండిరి. గర్వాంధులై, రాజ్యకాంక్షాపరులై, ఒకరితో నొకరు తరచు కలహించుకొనుచుండిరి. ముసల్మాన్, మహారాష్ట్ర సామ్రాట్టులకు వీరు సామంతులైయుండి, యుద్ధసమయములందును, పరరాజ్యములతో జరుపు రాజ్యాంగ తంత్రములందును మాత్రము వారి ననుసరించుచుండిరి. అయినను, స్థానికముగ వీరు సర్వస్వతంత్రులై

యుండిరి. తమ చుట్టునున్న ప్రజలకు తామే సామ్రాట్టు లుగనుండి, వారిచే సర్వవిధ మన్ననల బడయుచుండిరి. ప్రభువు తమ వృత్తులపై నెన్ని పన్నుల విధించినను, ఆ ధన మంతయు తిరిగి తమ రాష్ట్ర ప్రజలే యనుభవించుచున్నారు గదా యని ఆనాటి ప్రజలు సంతుష్టి గలిగియుండిరి. పశ్చిమ యూరపుఖండమందు కూడ ఆనాడిట్టి పరిస్థితులే ప్రబలియుం డెను. ఇక్కడ హిందూదేశములో మహారాష్ట్ర, ముస ల్మాన్, సామ్రాట్టులకు లోబడియుండినట్లే యూరపునందు కూడ కైజరు మున్నగు క్రైస్తవ సామ్రాట్టులకు లోబడి అనేక చిల్లర సామంతరాజులు పాలించుచుండిరి. 15 లక్షల చదరపుమైళ్ళ వైశాల్యము గలిగి, 30 కోట్ల జన సంఖ్యచే నొప్పారుచు, ఆసేతుశీతాచల పర్యంతవ్యాప్తంబైన భారతభూమి నేడొక్క ఆంగ్ల మంత్రికి లోనై, అనేక ఖండ ములుగా చీలి, అక్కడక్కడ పాతశేషములగు చిల్లర అస్వా తంత్ర్య రాజ్యములు గలిగి దీనదశయందున్నది !

ఆహా ! ఒక్క శతాబ్దమాత్రకాలమునం దిట్టి విపరీతపు మార్పు గలిగినది లోకచారిత్రమునం దెచ్చటను గాన్పింపదు. ఈ మార్పు 1757 సం॥ లో ప్రారంభమై, 1858 సం॥ లో విక్టోరియా రాణీ పట్టాభిషేకముతో పరిపూర్తియయ్యెనని చెప్పవచ్చును. మొట్టమొదట 1757 సం॥ లో హిందూదేశ మనునది ఆంగ్లేయులకు కేవల నామమాత్రమగు భూభాగ ముగ నుండెనేగాని, వారి రాచకీయములందు దానికి ప్రసక్తి యే లేకుండెను. ఆకారమాత్ర స్థూలరేఖలపై వర్ణములను, ఛాయలను కల్పించి చిత్రకారుడు తన మనోగతమగు రూప

మును నిర్మించునటులే, చరిత్రకారుడును పలువిధ స్థూల చరిత్రాంశముల గైకొని వానిపై తన స్వకపోల కల్పనల బరపి, తన మనోగతమగు చరిత్రరూపమును చిత్రించును. నిస్సంశయమును, నిర్వివాదమును నగు అంశములపై చరిత్రకారుడు పలురంగుల బూసి క్రమముగ వర్ణించుటలో తుదకు విపరీత చరిత్ర స్వరూపమును కల్పించును. ఈ చరిత్రకారుడే ఆ చరిత్రాంశములనే అవి జరిగినప్పటి సమకాలిక దృష్టితో చూచిన యెడల అతనికే ఆశ్చర్యము గలుగక మానదు. తాను వ్రాసినది తప్పని గ్రహించగలడు. భారతవర్షమందు మనము (ఆంగ్లేయులము) సామ్రాజ్యమునెట్లు సంపాదించి, యెట్లు నిలుపుకొనగలిగితిమో తెలిసికొనిన యెడల భావిసంతతులేమని భావింతురు? ఈశ్వరదృష్టి కది యెట్లు గాన్పించును?

ఇవన్నియు వినోదార్థము సోమరిపోతులకు తోచు శంకలుగావు. నీతియనునది ఒకటియున్నట్లయిన-, మనజాతికి అంతరాత్మయొకటి యున్నట్లయిన-, మనము యీశ్వరుని యెదుట సమాధానము చెప్పవలసియున్నట్లయిన, స్వాతంత్ర్య ప్రియులమగు మనము ఆశియాఖండమందు భారతరాజ్యము నెట్లు సంపాదించితిమో- వారి క్షేమార్థమును, మనక్షేమార్థమునుకూడ మనము వారినెట్లుచూడవలెనో- మనస్సాక్షి పూర్వకముగ మనమాలోచించవలసియున్నది.

భిన్నమత రాచకీయసంప్రదాయములతో, అతివైశాల్యముతో, నొప్పుచున్న "బ్రిటిష్ ఇండియా"ను ఆంగ్లేయులు జయించినరీతికిని ఫరాసుదేశపు నెపోలియన్ వీరుడు యూరపు

ఖండమును జయించిన రీతికిని విశేషసామ్యముగలదు. నెపో లియన్ విజయయాత్ర యిటుపడమట "కాంపోఫోర్మియో" నుండి తూర్పున "డార్డెనల్సు" తీరమువరకును, ఉత్తరమున "లాప్లాండు" నుండి దక్షిణమున "టేగస్" నదీముఖము వరకును అవిచ్ఛిన్నముగ అతనికనుసన్న మాత్రమున సాగెను. నెపోలియన్ తనవిజయ యాత్రయందు జయించిన రాజ్యముల నెల్ల తానుకలుపుకొనక అచ్చటనున్న రాజుల నూడబెరికి వారి స్థానే తనప్రతినిధుల నిలుపుచువచ్చెను. ఆరాజ్యముల ప్రత్యేక రాచకీయ వ్యక్తిత్వములగాని, సాంప్రదాయముల గాని, రూపుమాపయత్నింపలేదు. నేపుల్సు, స్పెయిన్, హాలండు, వెస్టుఫాలియా రాజ్యములకు స్థానిక స్వాతంత్ర్యమిచ్చి వాని ప్రత్యేక వ్యక్తిత్వమును నిలువబెట్టెను. కొలది రాజ్యములను మాత్రము తన ఫ్రెంచి సామ్రాజ్య ములో లీనము గావించుకొని వివేకదృష్టితో సంతుష్టుడయ్యెను. ఇదియది యనక తాను జయించిన రాజ్యము లన్నిటిని తానే దిగమ్రింగి తన సామ్రాజ్యమున లీనమొనర్చుకొన దలచినచో నిజముగ ఆతని నడ్డువారెవరు? కాని, అట్లుచేయుట రాజ్య తంత్రదృష్టిలో కేవలము అవివేకమని ఆతడు గ్రహించెను. కాని, ఆతని మనస్సున మాత్రము యూరపుఖండ మందంత టిపై సర్వంసహాధికారము వహింపవలెననెడి కాంక్ష లేక పోలేదు. ఈ సంగతి ఆతని చెయిదముల వలనను, ఆతడు ప్రవాసమునం దున్నప్పుడు తలపోసిన తలపోతల వలనను స్పష్టము కాగలదు. ఆతడీ రాజ్యముల నన్నిటిని జయించి నది కేవలము వీనికి ఫారావాడుగ నుండుటకు కాదు.—వీనిపై

సర్వంసహాసార్వభౌమాధికారము వహించుటకేయని గ్రహిం పవలెను. నెపోలియన్ వీరుడు స్థైర్య ధైర్య గాంభీర్యముల కునికిపట్టు. రాజ్యకాంక్ష అతని మనస్సున దృఢముగ నాటుకొనెను. రాజనీతి ధురంధరున కుండదగిన ఔదార్యము, దూరదృష్టి, పరిశీలనాశక్తి, అతనియందు మూర్తీభవించెను. యూరపు ఖండమందంతటను దూరముగ చెదరియున్న రాజ్యముల కన్నిటికి ఒక్క తన "ప్యారిస్" నగరమునందే కేంద్ర రాజ్యమును స్థాపించుట కేవలము రాజనీతికి దూరమనియు, దురాశాభూయిష్ఠమగు మహాలోపమనియు నెపోలియన్ శూరుడు గ్రహించెను. అందుచే తనకు లోబడియున్న రాజ్యము లన్నిటియందు స్థానిక ప్రభుత్వముల నేర్పరచెను. తనకు వశులైన రాజుల కెల్ల రాజాధిరాజు, తనమాట కెదురు లేని తీర్పరియై, యుద్ధరంగములందు సర్వసేనాధిపతియై, కీర్తిగాంచుటయే యాతని పరమ సంకల్పము. వివిధ సామంత రాష్ట్ర ప్రజలకు తమతమ స్వీయ సహజ సంప్రదాయములందును, స్థానిక స్వాతంత్ర్యములందును గల ప్రీతికిని, తాను స్థాపింపదలచిన సామ్రాజ్యము నెడ భక్తికిని, రెంటికిని సామరస్యము కుదిరినచో అంతవరకే తనకు సర్వసమ్మత సార్వభౌమత్వ సిద్ధి గలుగుననియు, అంతవరకే దానికి సుస్థిరత్వమనియు నెపోలియను స్పష్టముగ గుర్తించెను. ఇదియే యాతని పరమ సంకల్పమని అతని మాటల వలనను, వ్రాతల వల్లను గ్రహింపగలము. నిజముగ నతని యీ దీక్షను దూషించుటకు వీలులేదు. ఈ విషయమున అతనియూహ, కృషి, ప్రశంసనీయము. అందెట్టి లోపమును లేదు. అతని పరా

మాత్రము, "దైవసంకల్పమున కేమిచేయగలము" అనాదినుం దలి మత గురువులు శ్మశాన వైరాగ్యమును బోధించు చుండిరి. కాని, పిల్లైనప్పుడు మాత్రము, నాటిచేదిలోని ఔష ధమును, బొడ్డులోని ముల్లెను, లాగికొనుట జననమును కీర్తిదాయకమును కాదని మాత్రము అనాటి మతగురువు లెవరుకూడ చెప్పిన పాపమున బోలేదు! నిజముగ, [illegible] గురువు లానాడట్లు చెప్పియుండినచో [illegible] యంతయు ఈ రీతిగ నుండెడిది కాదు. దానిని మరియొక రీతిగ మనము వ్రాయవలసి వచ్చెడిది. [illegible] యెవరికిగాని సమూలముగ [illegible]. [illegible] విఖ్యాతి గాంచిన మహామహులు [illegible] కానివారరుదు. ఆంగ్లేయ [illegible] చేసి, అనేక కష్టనష్టములకు గురియై [illegible], మిక్కిలి అయిష్టముతో [illegible] స్వతంత్ర్యమును ఒప్పు కొనుచు సంధిపత్రముమీద సిధలేక సంతకము [illegible] వచ్చిన ఆంగ్లమంత్రి నార్తుప్రభువు [illegible] దేశమును గోల్పో యినందుకు ముజరాగా [illegible] భారత రాజ్యమును [illegible] మింప నుద్యమించెను.

సామంతరాజ్యములు [illegible] విన్నప్పుడు తనకు చాల [illegible] లేనప్పుడు శలవిచ్చిన "పెద్ద పిట్టు" [illegible] తుదకు తానే మంత్రిపదవికి వచ్చినప్పుడు "[illegible] సామంత రాజ్యములను వదలరాద"ని వాదించెను. అతనికంటె ఘనుడైన అతని కొడుకు "చిన్నపిట్టు" దొరగారును

యుద్ధములంటే యిష్టములేనివాడే; పరరాజ్యాపహరణము కూడదని మొదట శ్రీరంగనీతులు పలికినవాడే కాని, యీాయనయే పిమ్మట మంత్రియైనప్పుడు క్రమముగనో, అక్రమముగనో తన తాబేదారులు సంపాదించిపెట్టిన భూములలో ఒక్క వాడి సూదిమొనమోపినంత మేరయైనను వదలిన పాపమున బోలేదు. ఇటీవల ఆంగ్లేయ రాజ్యాంగధురీణులు తామెక్కువ ఉదారవంతులమని ప్రకటించుకొనజొచ్చిరి. ఎందువల్లననగ, జావా లంకను డచ్చివారికిని, సిసిలీలంకను ఇటలీవారికిని యిచ్చివేసిరట! ఇందుచే ఆంగ్లేయులు గొప్పవారని లోకమందు ప్రఖ్యాతిగాంచిరట! కాని, యీ కొంచెపు గొప్పతనమును వారు యిండియాలో గావించిన అకార్యములవలన దుమ్ములోగలిసి పోయెను. ఇట్టినిదర్శనముల ననేకములజూపవచ్చును. కాని యిది అనవసరము. ఏలననగ ప్రతిఆంగ్లమంత్రియు, ప్రతిఆంగ్ల సేనానియు నిట్టిదుష్కృత్యముల గావించినవాడే. వీరిలో ఒకడు దుర్మార్గముచేసినాడనిగాని, యింకొకడు చేయలేదనిగాని, తారతమ్యము లెంచవలసిన పనిలేదు. అందరు ఒకటే.

( ఈ సందర్భమున గ్రంథకర్త తన స్వదేశస్థులగు ఆంగ్లేయులకు నిట్లు ఉద్బోధించుచున్నాడు :- )

" ఈ పట్టున యితరులను విమర్శించుట మన కర్తవ్యముకాదు. ఆత్మపరీక్ష గావించుకొనవలెను. దురాశకు లోబడవలదు. క్షమింపరాని సోమరితనముచే గాని, అంతకంటె నీచమగు పిరికితనముచే గాని, ఉదాసీనతచేగాని, మనము సత్యమును ఒప్పుకొనుటకు జంకరాదు. మనమిప్పుడు

గతమును మార్చలేము. వెనుక జరిగిపోయినదానికి మన మిప్పుడు బాధ్యులముకాము. కాని, యిక ముందుమాత్రము స్వాతంత్ర్యప్రియులమని పేరుపెట్టుకొన్న మనపేరట జరుగు ప్రతికార్యమునకు మనమే బాధ్యులము. ఇదివరకు జరిగిన చరిత్రను మన మిప్పుడు న్యాయబుద్ధితోడను, నిర్మలాంతఃకరణాతోడను పునర్విమర్శ గావించవలసియున్నది. మనము న్యాయబుద్ధి గలవారమే మైనచో అట్టి విచారణ గావించకుండ నుపేక్షింపజాలము. అట్టి విచారణ సలిపిన పిమ్మట, మన మిదివరకు భారతదేశమునెడ గావించియుండిన ఘోర దురంతముల కన్నిటికి తగు నష్టపరిహార మొనర్చు బాధ్యత మనపై గలదని—వెనుక బర్కు, ఫాక్సు, బెంటింకు, మిల్లు, కాబ్డెన్ మున్నగువార్లు గట్టిగ నమ్మినట్లే—మనకును స్పష్టముగ తోచ గలదు. మన మనస్సుల కిట్లు స్పష్టముగ తోచిన తక్షణమే మన మిదివరలో హరించిన వానియందు యెవరెవరికి యే యే హక్కులను న్యాయముగ నిచ్చివేయవలయునో ఆ ప్రకార మిప్పించివేయుట మన విధాయకము. ఇదివరలో భారతప్రజ లెవరి యధిరాజ్యమునకును సమ్మతించి యుండలేదు. కాని, నేడేలనో మన యధిరాజ్యమునకు మాత్రము వారందరేకముగ సమ్మతించుచున్నారు. ఇట్లు అపూర్వరీతిగ వారంగీకరించిన యీ యధిరాజ్యమును మనము (ఆంగ్లేయులము) చక్కగ కాపాడుకొనుచు, వారి వారి రాష్ట్రములందు శాంతి భద్రతలకు భంగములేని రీతిని వారికి స్థానిక స్వాతంత్ర్యముల నిచ్చుట మనకు విధాయకమై యున్నది."

ప్రప్రథమమున ఇండియాకును, ఇంగ్లాండునకును సంబంధ మెట్లు కలిగినదో యిట క్లుప్తముగ వివరించుట అవసరము. మరియు, పరదేశస్తులు మెల్లగ, నీ దేశమం దెట్లు అడుగిడిరో,—అప్పటి భారత ప్రజలతోడను, భారత రాజ్యాంగములతోడను పోల్చి చూచినప్పు డీ పరదేశస్థు లేస్థితిలో నుండెడివారో—యీ భారత రాజ్యామిషంబునకై యీ పర దేశస్తులు తమలో తామెట్లు కొట్లాడుకొను చుండిరో—యిట కొంత వివరించుటయు అప్రస్తుతముకాదు.



# భరతఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన

## రెండవ అధ్యాయము

### సముద్రతీరమున అడుగిడుట.

[ "యూరపులోను ఇండియాలోను గల అన్ని తరగతుల జనులను పోల్చి చూచిన యెడల, యూరపుఖండ వాసులు తాము గొప్పవారమని యేవిధము చేతను అహంభావ పడుటకు కారణము గన్పట్టదు." ]

సర్. జె. మాల్కామ్.

పోర్చుగల్ దేశపు రాజగు "ఇమ్మానుయేలు" కాలములో "వాస్కోడిగామా" యను నావికుని యాధిపత్యమున సాయుధములగు నాలుగు ఓడలు దేశాన్వేషణకై మహోదధుల దరియింప బయల్వెడలెను. ఈ నావికాదళము పెక్కు దినములు భయంకరములగు సముద్రములందు ప్రయాణ మొనర్చి, తుదకు ఆఫ్రికాఖండపు దక్షిణాగ్రము చేరెను. అచ్చటనుండి సముద్రము అల్లకల్లోలముగ లేక శాంతముగ నున్నట్లు కన్పట్టెను. అందుచే ఆ మార్గమున పోయిన యెడల ఇండియాకు చేరవచ్చునను ఆశతో తెర

చాపలనెత్తి వీరు కతిపయ దినములలో మలబారు తీరమును జేరిరి. అచ్చట వాస్కోడిగామా కొద్ది దినములుండి తిరిగి ఐరోపాకు వెళ్లెను. ప్రాగ్దేశములకు మార్గము దొరికెనని పోర్చుగల్ దేశస్థులు ఆనందభరితులైరి. ఇంక అపారమగు భాగ్యమును, అనంతమగు యశస్సును వారి సొమ్మేయని సంత సించిరి. క్రొత్త నావికాదళముల సన్నిద్ధముచేసి తక్షణమే పంపుచో తమ యైశ్వర్యమును నిరోధించువారెవరు ? అని ఉప్పొంగిరి.

ప్రాగ్దేశముల కనిపెట్టుట కిదియే ప్రథమము. సూర్యో దయకాలమునందువలె ప్రతి వస్తువును నూతనారుణకాంతు లతో నెక్కువ శోభస్కరముగ మెరయుచుండెను. ఈ ప్రాగ్దే శములను వారెన్నడు చూచియుండక పోవుటచే, దూరమున తమ యజ్ఞానమను మంచు పొగచాటున యేమైన—యే పెన్ని ధులైన—నుండవచ్చునను ఆశ వారికి గాఢముగ జనించెను. కాని, జ్ఞానతేజస్సు హెచ్చినకొలది ఉషఃకాలపు స్వప్నములు అంతరించెను. మంచుపొగ మెల్లగ వీడెను. ఇండియాలోని నిధులు తామనుకొన్నంత సులభముగ తమ చేత చిక్కునవి కావని వారికి బోధపడెను. వాటముగ, సులభముగ దోచు కొనిపోవుట కేమియు యిక్కడంత తేరగ పడియుండలేదని వారికి తెలిసివచ్చెను. కాని, కష్టములకు జంకక, ధైర్య సాహసములతో, పరిశ్రమ చేసికొన్న యెడల న్యాయమగు లాభముల పొందుట కిక్కడ చాలా అవకాశము గలదని వారికి తోచెను. ఎవరి చేపట్టిన వారిచే మోసపోవుటకు హిందూ దేశస్థులంత చేతగాని వారు గారు. వీరికి వారు కారు.

అనాదినుండి వాణిజ్యాది కళాకౌశలములు గలిగి ఖండాంతరములతో వ్యాపారము సలుపుచు ప్రఖ్యాతిగాంచిన భారతదేశమిది. భారతీయులు విజ్ఞానమునందేమి, రాజనీతియందేమి, ప్రపంచమం దెవరికిని తీసిపోని మహోత్కృష్టతగాంచిరి. ఇట్టి భారతదేశమును యెవరుగాని బందిపోటు దొంగలవలెవచ్చి కొల్లగొట్టి మూటలు వేసికొని పోవుటకు వీలులేదనియు, కాని మర్యాదగ వాణిజ్యము మున్నగు వృత్తులచే క్రమముగు రీతిని యిచ్చట ధనమార్జింపవచ్చుననియు పాశ్చాత్యులు గ్రహించిరి. వెంటనే, యీ బుడతకీచులు భారతదేశమందలి చిన్న చిన్న రాజులతో వర్తకరీత్యా సంబంధ మేర్పరచుకొనిరి. తుదకు సార్వభౌమ స్థానమగు ఢిల్లీఫాదుషాతో కూడ నేస్తము గట్టిరి. వర్తకములో గొప్పతనము సంపాదించుటకే వారు ప్రయత్నించిరి. ఇతర యూరోపియను లెవరైనను తమ జోలికి వచ్చినప్పుడు మాత్రము వారితో పోరాటము సలుపుచుండిరి. ఇట్లు బుడతకీచుల వర్తకమునకు అడ్డు తగిలినవారిలో ముఖ్యులు డచ్చివారు. వీరు బుడతకీచులతో చాలకాలము పోరాడి వారిని తుదకు పూర్తిగ ఓడించిరి. 1611 సం॥ రంలో వీరు పోర్చుగీచులను ఓడించి సూరతును లాగికొనిరి. ముందు వచ్చిన చెవులకన్న వెనుకవచ్చిన కొమ్ములు వాడి యన్నట్లు తమకంటె ముందువచ్చిన బుడతకీచులను వెనుకకు నెట్టివేసి డచ్చివారు పైకి వచ్చిరి. తమ గోవా, ఆర్మజు పట్టణములలో తమ ఫ్యాక్టరీలచుట్టు యింకా యెక్కువ ప్రదేశమును డచ్చివారు సంపాదించెడివారే. కాని, యింతలో వారికన్న హిందూమహాసముద్ర మధ్యమందున్న రమ్యమగు

లంకలపైపడెను. అందుచే, వారచ్చటికి పరుగెత్తిరి. ఈ సందు చూచుకొని యిక్కడ యిండియాలో ఫ్రెంచి, యింగ్లీషు వారలు వ్యాపారములు సాగించిరి.

ఆంగ్లదేశపు సముద్రాధిపత్యమును పెంపొందించుటకు "కాల్బర్టు" అను రాజనీతిజ్ఞునిచే పన్నబడిన పతకములలో ప్రధానమైనది "యీస్టిండియా కంపెనీ" నిర్మాణము. మొదట యీకంపెనీ సరిగ నడువలేదు. అయినను, దానిని విడిచిపెట్టక ఆంగ్లమంత్రిలు యెట్లెట్లో లాగికొని వచ్చిరి.

ఇప్పటికి మున్నూరేండ్ల క్రిందట, కొందరు ఆంగ్లేయ వర్తకులు భారతసామంత ప్రభువులను సమీపించి, "మమ్ము మలను మీప్రజలతో వర్తకము చేసికొననీయండి" అని బహు వినయవిధేయతలతో బ్రతిమాలుకొనిరి. అట్టి యీవర్తకులిప్పు డేమని ప్రగల్భములు కొట్టుచున్నారో చూడండి! "దక్షిణ మున కాన్యాకుమారీయగ్రము నుండి, యిటు ఉత్తరమున హిమాచలము నతిక్రమించి త్రివిష్టప (టిబెటు) దేశమువరకు గల భూభాగమంతయు మాసామ్రాజ్యమే" యని వీరు సగర్వముగ పలుకుచున్నారు. ఈవాక్యములతోనే ఒకబ్రిటిషు చరిత్రకారుడును తన చరిత్రను ప్రారంభించెను. ఇండియాతో వర్తకము చేసికొనుటకు యీస్టిండియా కుంపిణీవారికి 1600 సం॥ లో వర్తకపు పట్టా యీయబడెను. ఈపట్టాయం దప్పుడంతగ నెన్నదగిన విశేషము లేమియులేవు. కాని, ఆ నాడు కుంపిణీవారు కేవలము వర్తకము కొరకే యీపట్టాను కోరితెచ్చుకొనిరని స్పష్టముకాగలదు. ఏలననగా, యీపట్టా

నిచ్చిన ఆంగ్లేయ ప్రభువులు తమ కొలువులోనున్న ఆశ్రితు నొకని రాజకీయోద్యోగిగ తమ వెంట యిండియాకు పంపుదుమని చెప్పినప్పుడు, "మాకీ రాజకీయోద్యోగి యెందుకు? మా కక్కర లేదు. మా వర్తకపు పనిని మా మనుష్యులచేతనే చేయించు కొందుములెండి" అని కుంపిణీ వారనిరి. దీనినిబట్టి, కుంపిణీవారికి ఆదియందు యే విధమైన రాజకీయ ప్రసక్తియు లేదని స్పష్ట పడగలదు. చాలకాలము వరకు వీరు ఓడలలో సరుకుల నింపి, ఇండియాకువచ్చి, అమ్ము కొని, యేమైన లాభము వచ్చిన యెడల పంచుకొని, అంత టితో తృప్తి నొందుచుండిరి. వీరి కప్పటికి వర్తకమునందు బుడతకీచులు ఒలందాలును మాత్రమే పోటీగ నుండిరి. ఈ బుడతకీచులకును, ఒలందాలకును, కోస్తాల వెంట, పలుతా వులలో అనేక ఫ్యాక్టరీలును డిపోలును ఉండెను. వీనినిచూచి, తమ సరుకులకు కూడ ఫ్యాక్టరీలున్న యెడల బాగుండునని యింగ్లీషువారును తలంచిరి. ఒలందాలకును, ఆంగ్లేయుల కును స్పర్ధలు యెక్కువైనకొలది ఆంగ్లేయులు యెక్కువ ఫ్యాక్టరీలను కట్టి వాని నెక్కువ భద్రముగ కాపాడు కొనవలె నని నిశ్చయించుకొనిరి. అప్పుడు యింగ్లండు దేశమునకు రాజుగనున్న జేమ్సు, "విఖ్యాతి గాంచిన సోదరుడా" యనిసం బోధించుచు "మా ప్రజలను రక్షించు భారము మీదే" యని ప్రార్థించుచు భారత సార్వభౌముడగు మొగలాయి చక్రవర్తికి జాబు వ్రాసికొనెను. సూరత్, క్యాంబే, అహమ్మ దాబాదు నగరములందు స్థావరముల నేర్పరచుకొనుటకు భారత సార్వభౌముడగు జహంగీర్ పాదుషా యింగ్లీషువారికి అనుజ్ఞ

నిచ్చెను. 1613 సం॥ లో యీస్థానములను వారికి ఖాయా పరచుచు ఫర్మానా జారీ చేయించెను.

1615 సం॥ లో యింగ్లండు రాజు వద్దనుండి "సర్ తామస్ రో" యనునతడు ఢిల్లీ దర్బారునకు రాయబారిగ వచ్చెను. ఢిల్లీపాదుషా అతనిని సగౌరవముగ సన్మానించెను. మరు సంవత్సరము యింగ్లీషువారు మరియొక ఫ్యాక్టరీని కట్టు కొనిరి. 1616 సం॥ లో వీరు కళ్లికోట వద్దను, మచిలీబందరు లోను స్థావరముల నేర్పరుచుకొనిరి. కుంపిణీవారు తమ నౌక ర్లపై తామే సివిల్ క్రిమినల్ చర్యల జరుపుకొను నధికార మును పాదుషానుండి సంపాదించుకొనిరి. దూరమందున్న ఫ్యాక్టరీలలో, పరదేశస్తులమధ్య మెలగుచున్న కుంపిణీనౌకర్లలో- సముద్రి మధ్యమందున్న ఓడలోని జనులలో వలె— అల్ల రులు జరుగకుండ భద్రిపరుచుట కష్టమని కుంపిణీవారు పాదు షాకు నివేదించుకొనిరి. వారి యిబ్బందిని గ్రిహించి, న్యాయ బుద్ధి గల పాదుషా వారి కోరిక ప్రికారము అనుజ్ఞ యిచ్చెను. కాని, యిట్టి అనుజ్ఞనాధారము చేసికొని యీ యింగ్లీషువారు తన ప్రజలపైనను, తన సంతతివారిపైనను, అధికారమును చలాయించి, అందుల కొడబడనివారిని కారాగృహముల బం ధించి హింసింతురని ఆ నాడు పాదుషా—పాపము— కలలో నైన తలంచియుండలేదు.

1639 సం॥ లో చెన్నపురిలో కుంపిణీవారు సేంటుజార్జి కోటను కట్టిరి. పిమ్మట అది రాజధాని యయ్యెను. అనగ, చుట్టుపట్టుల కుంపిణీవారికి గల యావత్ప్రదేశములపైనను అధి కారమువహించి చక్కబెట్టు ముఖ్యాధికారికి నివాసమయ్యెను.

మొదటి నుండియు కుంపిణీవారు వర్తకములో తమ వారిని తప్ప యితరులను దరికి చేరనిచ్చెడివారుకారు. తమ ఓడలు తప్ప యితరుల ఓడలు యేవి ఒడ్డునకు వచ్చినను కుంపిణీవారు గోలపెట్టుచుండిరి. ఆ ఓడలలోనివారివద్ద కత్తులు కఠారులు లేనిచో కుంపిణీవారు మహాధైర్యముతో వారిపైబడి వారిని దూరముగ తరుముచుండిరి. కాని అది సాధ్యము కానప్పుడు, పాదుషావద్దకు పరుగెత్తి మొరపెట్టుకొనుచుండిరి. ఒలందాలు (డచ్చివారు) తమకంటె సరుకులను తక్కువధర కమ్ముచున్నారని యీ కుంపిణీవారు గొణుకుకొనుచుండిరి. ఈ కుంపిణీలో చేరినవారు తప్ప యితర యిఙ్గ్లీషు వర్తకులెవరైనా స్వతంత్రముగ బేరసారములు నడుపుకొనుచున్న యెడల "వారు ఓడదొంగలు" ని నిందించి, వారిని యీ కుంపిణీవారు హింసించుచుండిరి. ఈ విషయములో కుంపిణీవారు చేసిన దురంతములకు మేరలేదు. వీరు చేయు క్రూరకృత్యములకు ఒలందావారు తీవ్రముగ రోషావేశులై యుండిరి. ఇందులకు తగిన ప్రతిక్రియ యొనర్చుటకుగాను మంచి యదనుకై పొంచి యుండిరి. ఇట్టి యవకాశము వారికి చిక్కినప్పుడు యీ ఒలందాలు కుంపిణీవర్తకులను పట్టుకొని "అంబాయినా" యను లంకలో చిత్రవధ గావించిరి. ఈ సంగతి యంతయు ప్రతి విద్యార్థికి తెలిసిన విషయమే. ఆ కాలమందలి నిజపరిస్థితులను ఆంగ్ల చరిత్రకారు డొకడు స్పష్టముగ నిట్లు వర్ణించుచున్నాడు. " కుంపిణీవారు ఆకాలమున తమ దేశస్థులపైననే, తమ స్వంత నౌకర్లపైననే చెప్పరాని చిత్రవధల గావించిరి. కుంపిణీవారికి సైనిక శాసనాధికారము లభించిన

పూర్వమే వారు యెవరినైన వదల్చుకొన దలచినప్పుడు వారిని చచ్చువరకు కొరడాలతో చావబాదుచుండిరి; లేక తిండి పెట్టక మాడ్చి చంపుచుండిరి. ఇట్టి కృత్యములు వారికి నిత్యాచారములయ్యెను. ఓడదొంగలను ఉరిదీయుట కొసంగబడిన యధికారమును దుర్వినియోగము గావించి, తమకు పోటీగనున్న స్వతంత్రవర్తకులను కూడ ఉరిదీయుచుండిరి."

మహారాష్ట్ర నాయకుడైన శివాజీ 1664 సం॥ లో బొంబయిపై దాడి వెడలినప్పుడు ఆంగ్లేయ గవర్నర్ తమ సూరతు ఫ్యాక్టరీని ధైర్యముతో రక్షించుకొనెను. అందుచే, ఇంగ్లీషువారి పరాక్రమ మప్పుడు ప్రసిద్ధమయ్యెను. ఈ ధైర్య సాహసములకు మెచ్చి అప్పుడు ఢిల్లీ పాదుషాగానున్న ఔరంగ జేబు వారికి బహుమానముగ క్రొత్త హక్కులను తనంతట తా నిచ్చెదననెను. అప్పటికి బొంబయి బుడతకీచుల వశమందుండెను. దానిని పోర్చుగీసురాజు తనకూతురునకు కానుకగ నిచ్చెను. అందువలన అది ఆంగ్లేయ రాజగు రెండవ చార్లెసునకు చెందెను. దానిని తమ కీయవలసినదని కుంపిణీవారు చేయి జాచి అడుగగ యీ బొంబయివలన యేమాత్రము లాభములేదని యనుకొని రాజు దానిని వారికిచ్చివేసెను. ఈరీతిగ, యిండియా దేశమందడుగిడిన మొదటి 80 సం॥ లలో కుంపిణీవారు కొంతధన మార్జించిరి. కొన్ని ముఖ్య స్థలములందు స్థావరముల నేర్పరుచుకొనిరి. శత్రుమిత్రభేదమును గమనింపక యేకరీతిని అవకాశము చిక్కినప్పుడెల్ల అందరిపైనను అంతులేని అక్రమముల గావించుచుండిరి. అంతియేగాని, అప్పటి కింకను ఆకాలపురాజుల కన్నెరకు గురికాలేదు.

కొంత కాలమైన పిమ్మట, బొంబయిలో వారొనర్చిన దుండగములు మొగల్ ఫాదుషాకు కోపకారణములై, ఆతడు వారిపై దండెత్తునట్లు చేసెను. దేశాక్రమణోద్దేశములోనున్న కుంపిణీవారిని తనదేశమునం దుండనిచ్చుట తనరాజ్యపు భద్రతకు భంగకరమని ఫాదుషా ప్రకటించెను. వెంటనే వారిని సూరతునుండి పారద్రోలి, బొంబాయిని ముట్టడించి, విశాఖ పట్టణమునందును యితరస్థలములందును నున్న కుంపిణీవారి ఫ్యాక్టరీలను ఫాదుషా స్వాధీనపరుచుకొనెను. కాని, అప్పటికే కుంపిణీవారు యేయెండకా గొడుగుపట్టుట నేర్చుకొనిరి. అందుచే, అతినీచమగు ఆశ్రయింపులకును, వంచనకును పాల్పడిరి. ఆశ్రిత పక్షపాతియగు ఫాదుషా వీరి దీనాలాపము లాలించి సూరతును తిరిగి యిచ్చివేసెను. వారి కీమధ్య గలిగిన వర్తకనష్టమే తగిన శిక్షయనియు, ఆశిక్షయే చాలుననియు ఫాదుషా ఉదారతవహించెను. కుంపిణీవారు తనకు పూర్తిగ వశులైరనియు వారింక తలయెత్త జాలరనియు, ఒకవేళ యెత్తినను వారిపొగరు ఒక్కక్షణములో అణచివేయవచ్చుననియు ఫాదుషా—పాపము—నమ్మియుండెను.

కాని, బంగాళాదేశపు రాజులు మాత్రము తక్కిన రాజులకంటె యింగ్లీషువారి విషయమై యెక్కువ జాగ్రత్తగ నుండిరి. పరదేశస్తులు వచ్చి తమకోస్తాలలో ఫ్యాక్టరీల నిర్మించుకొని, నానాటికి బలిష్టులగుచుండుట చూచినప్పుడు వారి హృదయములందు ఆందోళన పుట్టెను. కుంపిణీవారివలన తమ కెక్కువ వర్తకలాభమును, యెక్కువ శిస్తును వచ్చుచున్న మాట వాస్తవమే. కాని, యీ శిస్తులకంటె, యీ లాభముల

కంటె మించిన అపాయము వచ్చునేమోయని వారు లోలోన అనుమాన పడుచుండిరి. ఇట్టి అనుమానముల వలన కుంపిణీ వారికిని, బంగాళా రాజులకును చిల్లర మనస్పర్థలు క్రమముగ హెచ్చి తుదకు బహిరంగ విరోధమేర్పడెను. ప్రప్రథమమున జరిగిన పోరాటమునకు సద్యస్కారణములు మనకు తెలియవు. మొన్న మొన్నటివరకు ఒక పక్షమువారు చెప్పిన కారణములే తప్ప రెండవపక్షము వారివాదన లెవరికి తెలియవు. కాని, నిజమెట్లో బయటపడక తప్పదు. కుంపిణీ ఉద్యోగులు పొరబాటున బయట వేసికొనిన మాటలవలనను, వారిలోవారు జరుపుకొనిన ఉత్తర ప్రత్యుత్తరములందిమిడియున్న అంతరార్థములను బట్టియు, అసలు నిజము బయటపడుట కవకాశ మేర్పడెను. భారతీయుల కీర్తి నెంత నలుపు గావింప దలచినను,— కుంపిణీ వారు లోకమున కెరుకపడకుండ మూసిపెట్టిన ఘోరదురంతము లన్నియు బయటపడిన యెడల,— యెవరికీర్తి నలుపైనది తెలియగలదు. అప్పుడు భారతీయుల కీర్తినంత నలుపుగా వర్ణింప నవసరముండదు.

ఇంతవరకు కుంపిణీవారు భారతదేశపు రాజులకు విధేయుల మనియు, నౌకర్లమనియు చెప్పుకొనుచుండిరి. కాని, బంగాళా నబాబుతో పోట్లాడిన పిదప, నూతనయుగము ప్రారంభ మయ్యెను. ఇంక యెంతకాల మీ కపటవేషధారణ మనియు, డచ్చివారిపైనను, తమ దేశీయులగు యింగ్లీషు వర్తకులపైనను తిరుగబడిన రీతిగ నబాబులపై గూడ తిరుగబడిన పనికిరాదా యనియు కుంపిణీవారు తమలోతాము సగర్వముగ ఆలోచింప సాగిరి. ఇట్టి యోచనల కనుగుణముగ కుంపిణీవారు 1685

సం॥ లో "చిటగాంగు" పై నొక దండయాత్రను సన్నాహాము చేసి పంపిరి. చిటగాంటు నగరమును పట్టుకొనవలసినదనియు, అక్కడ తా మింతవరకు యే ప్రజలమధ్య శాంతముగ నివసింపుచుండిరో అట్టి ప్రజలపై యిచ్చవచ్చిన రీతిని దురంతకృత్యముల గావించి హింసించవలసినదనియు, కుంపిణీ వారు తమ సైనికులకు ఉత్తరువులు గావించిరి. తొందరపడి గావించిన యీ బహిరంగ దండయాత్ర విఫలమయ్యెను. అది నిజముగ జయప్రదమై యుండిననే యుండియూకు శ్రేయస్కరముగ నుండెడిది. ఏలననగ, హిందూస్థానపు రాజులందరప్పుడు నిజముగ కండ్లు తెరచి రాగల అపాయమును స్పష్టముగ గుర్తించి, కుంపిణీవారియెడల మిక్కిలి హెచ్చరికతోడను, అప్రమత్తతతోడను ఉండెడివారు. కుంపిణీవారియెడ యేమాత్రపు కనికరముగాని, ఉదారతగాని చూపుట బుద్ధి పొరబాటని తెలిసికొనెడివారు. కాని, విధినిర్ణయము వేరుగ నుండెను. "జుజులీ" లంకను పట్టుకొని "బాలసోరు" నగరమును కుంపిణీవారు దగ్ధము గావించినపిమ్మట వారిసేనలకు చెప్పరాని అపజయము గలిగెను. పాట్నా, కాశింబజారు నగరము లందలి ఫ్యాక్టరీలు వారి స్వాధీనమునుండి తొలగిపోయెను. అందువలన కుంపిణీవారికి దిక్కులేక, నబాబుల శరణుజొచ్చిరి.

ఆరోజు నుండియే కుంపిణీవారి పన్నాగములన్నియు కేవల వర్తకాభివృద్ధినుండి రాజ్యాక్రమణతంత్రమునకు మార్పునొందెను. 1689 సంవత్సరమునందు యింగ్లాండు నుండి యిక్కడి కుంపిణీవారికి వచ్చిన యుత్తరములో భావగర్భితమగు యీక్రింది వాక్యములు గలవు:—

"వర్తకలాభమువలెనే, రివిన్యూవృద్ధికూడ, మా లక్ష్యము. వర్తకములో మనకు వేయి ఆపత్తులు గలిగినను మనను రక్షించునది రివిన్యూయే. దానివల్లనే ఇండియాలో మనమొక జాతిగ నిలువబడగలము. అదిలేనియెడల, మనము కేవలము కౌలు (పట్టాను) పొంది వారిదేశములో వర్తకము చేసికొన వచ్చిన పరాయిలుగ మాత్రమే యుందుము. అట్టిచో మనము యెవరికి పనికిరానిచోట్ల మాత్రమే వర్తకము చేసికొన వలసి వచ్చును." ఈపైవాక్యములను తు, చ, తప్పకుండ తర తరములుగ కుంపిణీ నౌకర్లు అనుసరింపుచు వచ్చిరి. అప్పటి నుండి, వర్తకము కేవలము వర్తకము కొరకేగాక, రాజ్య తంత్రములందొక యెత్తుగనుండెను. రాజ్యాక్రమణకే వర్తక మనునదొక పాచికగ పనికి వచ్చుచుండెను. ఇటీవల పాదుషా తో జరిగిన పోరాటములోని అనుభవము పాదుషాకు సుబోధ కము గాకపోయినను, కుంపిణీవారికి మాత్రము సుబోధక మయ్యెను. వారు దానిని చక్కగ వినియోగించుకొనిరి. తామిక్కడ క్రొత్తఫ్యాక్టరీలు కట్టుకొనుటకును, వానిప్రక్కనే కోటలుకూడ కట్టుకొనుటకును, 1699 సం॥ లో కుంపిణీవా రెట్లో పాదుషాను ఒడబరచిరి. "ఇక్కడి ప్రభువులకు అను మానము కలుగకుండు రీతిని అతిజాగ్రతగను, నెమ్మదిగను, యీపనిని ప్రారంభించిరి" అని కుంపిణీ పక్షపాతియగు చరిత్ర కారు డొకడు వ్రాయుచున్నాడు.

ఔరంగజేబు మనుమడగు అజీంషా బంగాళాదేశమునకు సుబేదారుగ నున్నప్పుడు ఆతడు కుంపిణీ వారివల్ల గొప్పనజరుల నంది వారికి గోవిందపురం, కలకత్తా, చోటినట్టి యనుగ్రామ

ములను మామూలు షరతులపై— అనగ క్రమముగ కప్పము కట్టుచు రాజభక్తులుగ నుండు షరతులపై— జాగీర్లుగ నిచ్చి వేసెను. ఈ శతాబ్దాంతమున కుంపిణీ నౌకర్లు హుగ్లీనదీ ముఖమందున్న యీ గ్రామములందు కాలక్షేపము చేసిరి. పిమ్మట సుబేదారుని యనుజ్ఞపుచ్చుకొనియో, లేకయో, కోట కట్టడముల ప్రారంభించి తమదేశపు రాజగు విలియంపేరట దానికి "విలియంకోట" యని పేరు బెట్టిరి.

రోమక మహాసామ్రాజ్యము స్థాపనమైనది మొదలు లోకములో సామ్రాజ్య నిర్మాణ చారిత్రమందింతటి మహత్తరమగు పరివర్తనమెద్దియు సంఘటిల్లి యుండలేదు. అయినను యిట్టి మహత్తర విషయము ఆ కాలమున యింగ్లాండులోని రాజ్యాంగ వేత్తల దృష్టినాకర్షింపలేదు. ఇది ఆకాలము నందంత ప్రాముఖ్యమైన విషయమని యెవరును పరిగణింపకుండుటచే, నిప్పటికిని ఆ కోట నేసంవత్సరములో కట్టినదియు కూడ ఖచితముగ నెవరికిని తెలియదు. పాపము— అనేక సముద్రములుదాటివచ్చి, సముద్రపుటొడ్డుకుగ్రామములలోకొంచెము తలదాచుకొందుమని తన నతిదీనముగ ప్రార్థింపగ తానంగీకరించిన యీ క్రొత్త యిజారాదార్లను గూర్చి దూరమున నెచ్చటనో ఢిల్లీ నగరమందున్న మొగలాయి ఫాదుషా అప్పుడే మరచిపోయెను. ఒకవేళ యెవరైన, "యీ యిజారాదార్లు సముద్రపు టొడ్డునగోడలను, కోటలను కట్టుకొనుచున్నార"ని చెప్పినను, "పోనీలే" అను నిర్లక్ష్యముతో ఫాదుషా ఊరకుండెను కాబోలు. బహుశః, చుట్టునున్న తన ప్రజలే వారిపై యీర్ష్యచే తనతో యీ చాడీలు చెప్పుచున్నారేమో

యను భావముతో కూడ షాదుషా చూచీ చూడనట్లు ఊర కుండెను కాబోలు. "పరదేశస్థులు అంతమాత్రము స్వర క్షణ కేర్పాటు చేసికొన కూడదా యేమి" యని యూరకుం డెను కాబోలు. "పాపము—వారు దూరదేశము నుండి వచ్చినారు. వారందరు కష్టపడి పని చేసుకు నేవాళ్ళులాగ కనిపించుచున్నారు—పాపము—వారితో యేమిటి ?" అను కొని షాదుషా ఉదారత వహించెను కాబోలు.



భరత ఖండమున

# ఆంగ్లరాజ్య స్థాపన

## మూడవ అధ్యాయము

(కయ్యమునకు కాలు ద్రవ్వుట)

## 1701—1756

[ ఈస్టిండియా చరిత్రయందిప్పుడు నూతనయుగము ప్రారంభమైనది. ఇంతకుముందు వీరు కేవలము వర్తకులుగ నుండి బహు వినయవిధేయతలతో రాజుల నాశ్రయించి దేశమందెట్లో కాలూని నిలిచిరి. ఇప్పుడు వీరు దేశమందలి రాజులపోరాటములలో తాము కూడ కల్పించుకొని, రణరంగముల ప్రవేశింపసాగిరి.]

—జేమ్సు మిల్లు.

18 వ శతాబ్దారంభమందు ఔరంగజేబు మరణానంతరము బలిష్టమగు కేంద్రప్రభుత్వము సడలనారంభించెను. ఔరంగజేబుయొక్క మతోన్మాదముచే సామ్రాజ్యమందలి రాష్ట్రములన్నియు సామ్రాజ్యమందు విముఖత్వము వహించి చెల్లాచెదర గాజొచ్చెను. ముఖ్యముగ, యీ యవినీతివలన బంగాళారాష్ట్రప్రజల రాజభక్తి చలించెను. బీదలును, అజ్ఞానులు,

నగు ప్రజలు తమ యజమానుల కఠోర శాసనములకు లొంగి పోయి, మహమ్మదీయ మత మవలంబించిరి. బ్రాహ్మణులు యుక్తితో దీనిని తప్పించుకొనిరి. భాగ్యవంతులు లంచములిచ్చి తప్పించుకొని యెట్లెట్లో తమ సంతతివారికి వైష్ణవమతమును నిలుపగలిగిరి. తదితర రాష్ట్రములలోని ప్రజలు చాలవరకు తమ పురాతనాచారముల నిలుపుకొనగలిగిరి. దక్షిణదేశమం దంతటను మొగలాయి సామ్రాజ్యము నెడ విముఖత్వము మెల్లగ ప్రాకెను. మహారాష్ట్రులు తాము దాడివెడలిన చోటుల నెల్ల, "హిందూమతమును రక్షించెదము"ని కంకణముగట్టి పలుకుచుం డిరి. వీరిధాటి కెదుర్కొనలేక మొగలాయి సేనాధిపతులు తమ సహనమును చూపక తప్పదయ్యెను.

ఔరంగజేబు మృతినొందిన నాటినుండి మొగలాయి సామ్రాజ్యపటిమ, అయిక్యత త్వరితగతిని కరగిపోయెను. ఆతని సంతతి వారికి "అలంఘీర్" అను వట్టి బిరుదు మాత్ర ముండెను. కాని, తమ రాజ్యమందలి మంచిచెడ్డల తమ యిచ్ఛానుసారము శాసించు పూర్వపు టధికారము నానాటికి క్షీణింప జొచ్చెను. దూరమందున్న పెద్దరాజ్యములు ఢిల్లీ యందున్న చక్రవర్తికి అలవిగాక స్వతంత్రత వహించెను. అచ్చటచ్చట స్థానికముగ పలుకుబడియున్న వారిచేతులలో పడి యీరాష్ట్రములు స్వాతంత్ర్య సామంతరాజ్యములుగ పాలింప బడ జొచ్చెను. కాని, యీసామంతరాజులు "సుబేదారు"అను పూర్వపుపేరును మాత్రము వదలకుండ పెట్టుకొనుచునే యుం డిరి.అయినను, యీ "సుభా" లలో అక్రమపాలన జరిగినప్పుడు దానిని విచారించుటకు ఢిల్లీపాదుషాకు అవకాశము లేకుండెను.

ఎప్పుడైన సాహసించి ఫాదుషా యిట్టి విచారణ చేయబూని నప్పుడు సుబేదార్లు దానినెట్లో మాయోపాయములచే తప్పించుకొనుచుండిరి; లేదా, వీలైతే యెదిరించు చుండిరి. అందుచే గుట్టుగ నెట్లో తమ సార్వభౌమత్వ గౌరవమును మాట మాత్రమునకైన నిలువబెట్టు కొందమను నాశతో ఢిల్లీ దర్బారువారు యీ సామంత రాజ్యములపై నిజమగు నధికారమును చలాయించుట మానుకొనిరి. ఈ సందు చూచుకొనియు, ఫాదుషా యందున్న తడితరలోపముల కనిపెట్టియు, సుబేదారు లందరు ఢిల్లీ దర్బారును లక్ష్యముసేయక స్వతంత్రులైరి. దక్షిణమున నైజామును, ఉత్తరమున అయోధ్యవజీరును, తూర్పున బంగాళానబాబును, యిట్లే తమతమ "సుభాలలో" తామే స్వతంత్ర ప్రభువులై, వంశ పారంపర్యపు హక్కులుగల సొంత రాజ్యముల స్థాపించుకొనిరి. కాని, పైకి మాత్రము తాము మొగలాయి చక్రవర్తికి సామంతులమనియే చెప్పుకొనుచుండిరి. అందుకు నిదర్శనముగ కప్పము కట్టుట కూడ మానకుండిరి. చక్రవర్తి యెప్పుడైన తమరాజ్య వ్యవహారములందు జోక్యము కలుగ జేసికొన్నప్పుడు వద్దని కూడ ననెడివారుకారు. ఢిల్లీ ఫాదుషాయిచ్చిన బిరుదులనే పెట్టుకొనెడివారు గాని స్వతంత్రించి తమకు తామే "ఫాదుషా" యను పెద్ద బిరుదును పెట్టుకొనెడివారుకారు. ఏలననగా: ఢిల్లీ ఫాదుషాకు తాము తాబేదారులమని యొకవంక చెప్పుకొనుచు యింకొకవంక తామే "ఫాదుషా" ల మని యెట్లు పేరుపెట్టుకొందురు? ఇది పైకి విరుద్ధముగ గన్పించును గద. కాని, పైకి మాత్రము ఫాదుషా యను బిరుదు పెట్టుకొనక పోయినను, నిజమునకు,

క్రియలో మాత్రము రాజ్యాధికార మంతయు వీరే చలాయించుచుండిరి. అందుచే, కుంపిణీవారు తాము దక్షిణ దేశములో స్థిరముగ నుండ దలచుకొన్న యెడల అచ్చటనున్న నైజాముతో మంచిమాట చేసికొన్నగాని లాభము లేదని గ్రహించిరి. అట్లే కలకత్తాలో నున్న కుంపిణీవారు కూడ తాము ఢిల్లీపాదుషా నాశ్రయించుటకంటె లక్నో మూర్షిదాబాదు నగరములందున్న నబాబుల నాశ్రయించుటయే యెక్కువ శ్రేయస్కరమని కనిపెట్టిరి.

తదనుగుణముగ, ఆయారాష్ట్రములలో నున్న కుంపిణీ యుద్యోగులు తమ కవసరమగు శివిల్ ఉద్యోగుల నియమించుకొనుటకును, స్వరక్షణ కవసరమగు సైన్యముల నిర్మించుకొనుటకును, సీమయధికారులతో చెప్పకయే అవసరానవసరములను బట్టి దేశీయరాజులతో కలహించుటకును, నేస్తము గట్టుటకును సీమలోని కుంపిణీ యధికారులు యిచ్చుటి వారికి సంపూర్ణాధికారముల నొసంగిరి. ఆకాలమందు యూరపుఖండములో యింగ్లీషువారికిని ఫ్రెంచివారికిని, నిరంతరము పోరాటము జరుగుచుండెను. అందుచే ఉభయరాజ్యాంగములును తమకున్న సేనలలో కొంతభాగమును ఇండియాకు పంపుచుండిరి. అందువలన రాజ్యకాంక్షాపరులగు కుంపిణీ గవర్నరులకు దేశీయ రాజుల పోరాటములలో కల్పించుకొనుటకు మంచియవకాశము చిక్కెను. మంచిచెడ్డల బాధ్యతలేనట్టి దురాగతులకు చేతినిండ సైన్యమున్నప్పుడు యెవరిమీదనో యొకరిమీద పడుటకు నేదో వంక దొరకకుండునా?

ఇండియాలో రాజ్యస్థాపన చేయుదమను బుద్ధి మొట్ట మొదటగ పుట్టినది ఫ్రెంచివారికి. ఫ్రెంచివారి స్థానములపై చాలకాలము "డూప్లే" యను నాతడు సర్వాధిపతిగ నుండెను. ఈతనికి రాజ్యతృష్ణ, అధికారతృష్ణ మెండు. రాజ్యస్థాపనకువలయు సూక్ష్మబుద్ధియు, ధైర్యసాహసములును యీతనియందు మూర్తీభవించి యుండెను. దీనికితోడు యీతడు యీదేశమందే ఒకయున్నత వంశపు కన్యను పెండ్లాండెను. అందువలన అతనికి గొప్ప సంపద లభించుటయేగాక యిక్కడి రాజవంశముల లోతుపాతులుకూడ బాగుగ తెలియ వచ్చెను. ఈకన్య సహజముగ మంచిసామర్థ్యము గలిగియుండెను. ఆమె రాజ్యతంత్రములందు బాగుగ మెలగినదగుటచే మరి యేయితర తెల్లవానికి ఆకాలమున సాధ్యముకాని రీతిని తనపెనిమిటికి రాజ్యతంత్రి వ్యవహారముల నన్నిటిని నిత్యము నడపించి పెట్టుచుండెను. రాజ్యాధిపత్యమునకై ఫ్రెంచివారికిని యింగ్లీషు వారికిని జరిగిన పోరాటము దీర్ఘమై, బహురక్తపాతయుతమై యుండెను. ఆంగ్లనావికాదళము నోడించి, ఫ్రెంచిసేనాని "లెబార్డనీ" 1746 సం॥ లో మదరాసు పట్టుకొనెను. కాని, ఆతడిచ్చట తన గవర్నర్ అగు డూప్లేతో కలహించినందున ఫ్రెంచి ప్రభుత్వమువా రాతనిని యింటికి తిరిగి రమ్మనిరి. ఫ్రెంచిప్రభుత్వమువా రతనిపై నేరమారోపించి జెయిలునందుంచిరి. అతడా దుఃఖభారముచే మరణించెను. ఇండియాలో కొంతకాలము వరకు డూప్లే ప్రభ వెలిగెను. కర్ణాటకరాజ్య సింహాసనమునుగూర్చి దేశీయరాజులలో కలహములు గలిగినప్పుడు డూప్లే "చందాసాహెబు" అను

వానిపక్షమున బహిరంగముగ చేరెను. అతని ప్రతిపక్షియగు రాజు ఆంగ్లేయుల నాశ్రయించెను. ఈపోరాటములలో కర్ణాటక రాజధానియగు ఆర్కాటు నగరము పలుమార్లు ముట్టడియై ఒకప్పు డొకరికిని, మరియొకప్పు డింకొకరికిని స్వాధీనమగుచు వచ్చెను.

మొట్టమొదట తూర్పు తీరమున యింగ్లీషువారితో నేస్తము గట్టినది తంజావూరు మహారాజు. 1742 సం॥లో తంజావూరు రాజ వంశమునందు కలహము గలిగెను. అదివరకున్న "సాహూ" యనువానిని తొలగించి ప్రతాపసింహుడు సింహాసనమును వశపరుచుకొనెను. ఈ వ్యవహారములో మదరాసులో నున్న కుంపిణీవారికి సంబంధమేమియు లేనందున, వారీ క్రొత్తరాజునే సంతోషముతో నంగీకరించిరి. ఈ ప్రకారము యేడేండ్లు మైత్రితో ఉభయులకును వ్యవహారములు నడిచెను. అప్పుడు, రాజ్యభ్రష్టుడైన 'సాహూ' యింగ్లీషువారి నాశ్రయించి తంజావూరునందు విప్లవము గలిగించుటకై సహాయము కోరెను. దీనికి ప్రతిఫలముగ దేవకోట జాగీరును, అందలికోటను, ఆంగ్లేయులకిచ్చి, యుద్ధపు ఖర్చులన్నియు తానే భరించుకొనెదనని సాహూ చెప్పెను. ఇందులకు కుంపిణీ వారంగీకరించిరి. ప్రతాపు డింతవరకు మిత్రుడే! ఫ్రెంచి వారితో కలహించినప్పుడు మొన్న మొన్ననే ఆతని సహాయమును పొంది యుండిరి కూడాను! అట్టి మిత్రునిపై దండెత్తుటకు యింగ్లీషు వారికెట్టి కారణమును గన్పట్టదు. అయినను, అట్టి "మిత్రుని" సింహాసనము నుండి కూలదోయుటకు కుంపిణీవారు దండునంపిరి!

ఈ దండు ఓడిపోయెను. అంతటితో " సాహూ " ను సింహాసన మెక్కించుపని యింగ్లీషువారి దృష్టినుండిపోయి, వారికన్ను దేవకోట జాగీరుపై పడెను. అందుచే, యీ పనికై రెండవ దండయాత్ర బయల్వెడలెను. కుంపిణీవారు దేవకోటను ముట్టడించి స్వాధీనపరచుకొనిరి. ఇది కాగానే, యింగ్లీషువారు తిరిగి ప్రతాపసింగుతో రాజీచేసికొనిరి. ఏమని? ఇకముందు కలహములన్నియు మానివేయు నట్లును, ఇదివరకు తాము సహాయపడుచున్నట్లు నటించిన సాహూను వదలివేయు నట్లును సాహూను చంపకుండ ఆతనికి కొంత మనువృత్తి నిచ్చు నట్లును, యిందులకు ప్రతిఫలముగ ప్రతాపసింహుడు కుంపిణీ వారికి దేవకోట రాజ్యమును, కోటను పూర్తిగ యిచ్చివేయు నట్లును, ఒడంబడిక చేసికొనిరి. భారతరాజ్యమును దిగమ్రింగుట కిదియే ప్రథమ కబళము.

1751 సం॥ వరకు ఫ్రెంచివారికి ప్రతిచోటను విజయము కలుగుచుండెను. కాని, ఉన్నట్లుండి అదృష్టరేఖ హఠాత్తుగ మారిపోయెను. ఇంగ్లండునుండి క్రొత్త సేనలు దిగెను. అప్పుడు చెన్నపురిలో నున్న కుంపిణీ గుమాస్తా యొకడు తనకీ పాడు గుమాస్తాపని రుచింపనందున కలము క్రింద పారవేసి, కత్తిబట్టి తానుకూడ సైన్యమందు చేరెదనని బయలుదేరెను. అప్పుడాతని యూరు పేరు యెవరును యెరుగరు. ఊరుపేరు లేని యీ బుడతడే భారతరాజ్యమునకు విధి నిర్ణేతయయ్యెను. ఈతనిపేరే క్లైవు. 1740 సం॥ములో యీతడు యింగ్లాండునం దొక పల్లెటూరిలో సోమరిపోతుగను,

దుండగీడుగను తిరుగుచుండెను. ఈతడాయూర చిల్లర దొంగతనములను, దోపిడీలను చేయుచుండెను. ఈతని దుండగములకు, అల్లరులకు ఆ గ్రామవాసులు సహింప జాలకుండిరి. "వీడిక యెందుకూ పనికిరాడ" ని తండ్రి విసగుజెంది, యెట్లో తంటాలుపడి కుంపినీకొలువులో యేదో గుమాస్తాపని యిప్పించెను. బల్లముందర కూర్చుని, గుమాస్తాగా, యేవో కాగితములు వ్రాయు నీరసపుపని ఆతని దుడుకుబద్ధికి రుచించలేదు. ఆతనికి ధనార్జనయందు బుద్ధి లేకపోలేదు. కాని, ఉగ్రమగు దుడుకుచేష్టలయం దాతనికి అభిరుచిమెండు. ఆత డప్పుడప్పుడు తన తోడివారలతో కుస్తీలు పట్టుచుండెను. కాని, దీనివలన ఆతని భుజములతీట తీరలేదు. అందుచే, సమయముదొరకగానే, కలము క్రిందపారవేసి, అత్యుత్సాహముతో యుద్ధరంగమునకు పరువెత్తెను. ఆతని సహజ చాతుర్యము, ధైర్యసాహసములు చప్పున పైకివచ్చెను. డూప్లే ప్రభ మహైశ్వర్యముగ వెలుగుచున్న కాలమున యింగ్లీషు వారి దేశమునుండి తుడిచిపెట్టుకొని పోకుండ కాపాడిన దీతడే యని చెప్పిన అతిశయోక్తి కాదు.

1754 సం॥ లో యింగ్లీషువారికిని ఫ్రెంచివారికిని యూరపులో సంధి జరిగినప్పుడు యిక్కడ యిండియాలో ఎవరిస్థానములు వారికే మిగిలెను— గాని, యెవరికిని యెక్కువేమియు లభింపలేదు. కాని, ఒక గొప్ప విషయము మాత్రము యీ పోరాటములలో దేశీయులకును యూరోపియనులకును తెలియవచ్చెను. అదేమనగా: యూరోపియను సైన్యముల క్రమశిక్షణ ముందర దేశీయమూకలు నిలువజాలవని యెల్లరకు

స్పష్టమయ్యెను. "ఎంత పరాక్రమవంతులైనను, విదేశీయుల సైన్యములతో పోరాటము దేశీయులకు సాధ్యము కాదయ్యెను. అదిగాక, తక్కువ సంఖ్యగల విదేశసైన్యములు యెక్కువ సంఖ్యగల దేశీయసైన్యముల నోడించినప్పుడు వారి యందు గలిగిన భయోత్పాతము యినుమడించెను. క్రమశిక్షణ పొందిన కొద్దిసైన్యములు యేకమనస్సుచే నడిపింపబడు సహస్రబాహువుల పగిది చెల్లాచెదురుగ నున్న మూకలమధ్య నిశ్చలముగ, చెక్కుచెదరక నడుచుచు పోవునపుడు యెక్కడి మూకలక్కడ విచ్చిపోవుచుండెను" అని ఒక ఆంగ్లచరిత్రకారుడు వ్రాసెను. కాని, మరొకరిట్లు వ్రాయుచున్నారు. "భారత పుత్రుల తోడ్పాటు లేనిదే భారతమాత విదేశీయుల చేత చిక్కెడిది కాదు." మొట్టమొదట ఆర్కాటు నబాబు నడంచుటకు కుంఫిణీవారికి నైజాము తోడ్పడెను; పిమ్మట నైజాము నడంచుటకు ఆర్కాటు నబాబు తోడ్పడెను. అట్లే, మహమ్మదీయుల నడంచుటకు మహారాష్ట్రులును, మహారాష్ట్రుల నడంచుటకు మహమ్మదీయులును కుంఫిణీవారికి తోడ్పడిరి. తిరిగి, వరుస తప్పకుండ, హిందువుల నడచుటకు ఆఫ్గనులును, ఆఫ్గనుల నడచుటకు హిందువులును కుంఫిణీవారికి తోడ్పడిరి. అదిగాక, యిక్కడింకొక సంగతి కూడ మరచిపోకూడదు. అదేమనగ: క్రమశిక్షణ నొందిన యూరపియన్ సేనల జయింప నెవరితరమూ కాదను భావమొకటి పవిత్రమమున దేశీయుల మనస్సునందెట్లో నాటుకొనెను. ఆ కారణముచే, దేశీయరాజులు తమ శత్రువులపై పోదలచినప్పుడు యీ యూరోపియన్ సేనలను తమ వెంటబెట్టుకొని వెళ్లిన యెడల

తమకు జయము తప్పక గలుగునను గట్టి నమ్మకమొకటి వారి కేర్పడెను. అందుచే, అవసరమైనప్పుడెల్ల విదేశీయుల సాయము దెచ్చికొనుటకు యీ దేశీయ రాజు లందరు ఒకరి కంటె ఒకరు ముందుగ ఆతురపడుచుండిరి.

1754 సం॥ లో ఫ్రెంచివారికిని, యింగ్లీషు వారికిని జరిగిన ఒడంబడికలో ఉభయులుకూడ దేశీయరాజుల పోరాటములలో నెంతమాత్రము జోక్యము కలిగించుకొనకుండుటకును, ఇండియాలో నిక రాజ్యపరిపాలన సాగించు ఉద్దేశమును పూర్తిగ వదలుకొనుటకును ఉభయులు ఒట్లు పెట్టుకొనిరి. చందాసాహెబు చనిపోయెను. ఇంగ్లీషువారి మిత్రుడగు మహమ్మదాలీ కర్ణాటక నబాబయ్యెను. ఇకముందు రాజ్యపరిపాలనాశ తమకు లేదను నంశమును ఋజువు పరుచుటకును, యింగ్లీషు వారితో సరిసమానస్థితియందుండుటకును,—పాపము— ఫ్రెంచివారు తామీ మధ్యయుద్ధములలో సంపాదించుకొన్న నాలుగుజిల్లాలను వదలుకొనిరి. కాని, యీ సంధి పత్రముపైని సిరా యింకను ఆరకమునుపే యింగ్లీషువారు మహమ్మదాలీపెట్టిన యెరకులోనై ఫ్రెంచివారితో చేసికొనిన యొడంబడికను నీటగలిపిరి. "తన సామంతులు కొందరు తన కెక్కువగ కప్పములు బకాయపెట్టియున్నారనియు, ఆబాకీలను రాబట్టుకొనుటకుగాను తాను వారిపై దండెత్తదలచితిననియు, నీదండయాత్రలో తన కింగ్లీషువారు గనుక సహాయపడిన యెడల తాను కొల్లగొట్టిన ధనములో వారికి సగ మిచ్చెదన" నియు మహమ్మదాలీ కుంపిణీవారికి ఆశపెట్టెను. ఈయాశచే ఇంగ్లీషు వారి నోరూరెను.

కండ్లు చిరుతలు క్రిమ్మెను. తక్షణమే వారిందుల కొడంబడిరి. ఫ్రెంచివారు సంధి షరతులనెత్తిజూపి, యీసంధికొరకై తాము నాలుగుజిల్లాలను వదలుకొన్న సంగతినికూడ యింగ్లీషు వారికి జ్ఞాపకముచేసిరి; యీ సంధిషరతుల ప్రకారము యింగ్లీషువారు మహమ్మదాలీకి మద్దతు చేయరాదని నిష్కర్షగ చెప్పిరి. కాని, ప్రయోజనము లేకపోయెను. అందుచే, ఫ్రెంచివారు మరియొకసారి కత్తిపట్టవలసి వచ్చెను. కాని, యీపర్యాయము డూప్లేలేడు. ఆతని స్థానమందుండిన ఫ్రెంచి గవర్నర్ దక్కనులో వేరొకచోట మిక్కిలి క్లిష్ట స్థితియందు చిక్కుకొనెను. అందుచే, ఫ్రెంచివారిపని నిరాశ కాజొచ్చెను. కాని, యింతలోనే, యింగ్లీషువారి దృష్టి ఆకస్మికముగ యింకొక చోటికి మరలుటచే ఫ్రెంచివారికి కొంచెము ఊపిరి తీసికొనుటకు అవకాశము చిక్కెను.

ఢిల్లీ చక్రవర్తి కొడుకు అజీంషా కొంతకాలము బంగాళా దేశమునకు సుబేదారుగ నుండెను. ఆతని తరువాత సుజాఖానును, ఆతని దత్తపుత్రుడు సెరాఫెరజును సుబేదార్లయిరి. సుజా కాలమందు ఉమ్రావుగ నున్న ఆలివర్దీఖాన్ అనునతడు మిక్కిలి సామర్థ్యముగల వాడగుటచే బీహారురాష్ట్రమునకు "నాయబ్‌గ" నియమింపబడెను. ఆతడు క్రమముగ 1739 సం॥ లో సదరు రాష్ట్రమునకు సుబేదారు డయ్యెను. ఆతడు రాజ్యపాలనయందు నిష్కంపిత స్థైర్యము జూపినను, ఆతని సుగుణ సంపత్తివలన ప్రజలెవ్వరు ఆతనిపై తిరుగబడలేదు. ఆతడు రాజ్యము చేసిన 18 సంవత్సరములు దేశము సుభిక్షముగ

నుండి ప్రశాంతముగ జరిగిపోయెను. ఆతడు చిల్లరనాయకుల తిరుగుబాట్ల నణచివేసెను. ఆ కాలపు సుబేదారులందరిలో యీతడే వివేకవంతుడనియు, దయార్ద్రహృదయుడనియు పేరు గాంచెను. కుంపిణీవారు సరిగ వర్తకము చేసికొనుచున్నంత కాలము యీతడు వారిజోలికి పోక, మైత్రినే పాటించి యుండెను. వారి హక్కులను కాపాడుచు అవసరమైనప్పుడు వానిని వృద్ధిచేయుచుండెడివాడు. కాని కుంపిణీవారు తన యధికారమును మన్నింపనపుడు మాత్ర మాతడు సహించెడివాడు కాడు. కుంపిణీవారు తన ప్రజలను బాధించినపుడుగాని, వారి వల్ల బలాత్కారముగ ధనము లాగికొనినపుడుగాని, యీతడు వారిపై తగిన ప్రతీకారము చేయక యూరకుండెడివాడు కాడు.

ఇట్లుండగ 1749 సం॥ లో యింగ్లీషువారు అప్పుడు తమకు విరోధులైన ఫ్రెంచివారి ఓడలని మిషపెట్టి కొందరి ఆర్మీనియన్ హిందూవర్తకుల యోడలను పట్టుకొనిరి. ఆ వర్తకులు వచ్చి నబాబుతో ఫిర్యాదు చేసికొనిరి. ఆతడు వెంటనే వారి యోడలను వారికిచ్చివేయవలసినదని యింగ్లీషు వారికి హుకుం జారీ చేయించెను. ఆహుకుమునందిట్లున్నది:—

“ ఈ ఆర్మీనియన్ హిందూవర్తకులు మా రాజ్యమునకు లాభము చేకూర్చువారై యున్నారు. వారి యొగుమతి దిగుమతుల వలన ప్రజలెల్లరికి మేలుగలుగుచున్నది. ఇట్టి వారు పడుచున్న బాధలు మాకు చాల సంతాపమును గలిగించినవి. వానిని మేము గమనింపకుండ నుండజాలము. కుంపిణీవారు ఓడదొంగతనములు చేయవీలులేదు. కావున, ఈ హుకుం అందిన వెంటనే ఆ వర్తకుల సరుకులను, యితర

యావదాస్తిని యెవరివి వారి కిచ్చివేయవలెను; లేనియెడల, మీరెన్నడును అనుకొనని రీతిని మీరు దండనకు పాత్రులగుదురని తెలిసికొనవలెను." నబాబు తమయెడ చాల తీవ్రముగ రోషావేశుడైయున్నాడని కుంపిణీవారి హుకుమువలన గ్రహించిరి. ఆతని నెట్లయిన శాంతింప చేయుటకై ఆయనకొక అరబ్బీ గుఱ్ఱమును, వజీరుకు గొప్ప నజరులను, బహుమతిగ నిచ్చిన బాగుండుననని కుంపిణీసొకర్లు తమలో తాము గుస గుస లాడుకొనిరి. ఆర్మీనియన్ వర్తకుల బెదరించి, కుంపిణీవారు చేసినది సరిగానే యున్నదనియు, తమకేమియు నష్టము జరుగ లేదనియు వ్రాసి యిచ్చునట్లు కలకత్తాలోని కుంపిణీ ప్రెసిడెంటు వారిని నిర్బంధించెను. అట్లు వ్రాసి యీయనిచో తమ నలసల నుండి వెడలగొట్టెదమని కుంపిణీవారు ఆర్మీయనులను భయపెట్టిరి. ఈ బెదరింపులకు వారు లొంగలేదు. నబాబు ఆలివర్దిఖాన్ వెంటనే కాశింబజారులో నున్న యింగ్లీషు వారి ఫ్యాక్టరీని పట్టుకొనెను. అప్పుడు కుంపిణీవారు శాల్తిబేరమునకు వచ్చి 12 లక్షల రూపాయల నష్టపరిహార మిచ్చి బయటపడిరి. ఇదిగాక, యిట్టివే కుంపిణీవారితో నబాబున కనేక స్పర్థలు గలిగెను. కాని, వారు తన రాజ్యమునకు వర్తకరీత్యా లాభదాయకముగ నున్నారని యెంచి, వారితో పూర్ణముగ కలహించుట తనకే మంచిది కాదను తలంపుతో వ్యవహారములు బెడియువరకు నొక్కక నబాబు జాగ్రత్తగనే యుండెను. ఈతని రాజ్య కాలమున కుంపిణీ వారెక్కువ రాజ్యమును సంపాదింపకపోయినను, వారి ఐశ్వర్యము మాత్రము మిక్కిలిగ వృద్ధి నొందెను.

అలివర్దీఖానునకు సంతానము లేనందున తన సోదరుని పుత్రుడగు "సురాజ్ ఉద్దాలాను" తన యనంతరము సుబేదారు పదవికి వారసునిగ నియమించెను. చిరకాలానుగతముగ వచ్చుచున్న వీరి సంతతివారి భక్తివిశ్వాసములకు మెచ్చి ఢిల్లిపాదుషాయు యీ వారసత్వము నంగీకరించెను. అంతట ఫ్రెంచి, డచ్చి, యింగ్లీషు గవర్నరులు ముందు రాజ్యమునకు రానున్న యువరాజగు "సురాజ్ ఉద్దాలా"ను హుగ్లీనగరమున దర్శనము చేసికొనిరి. వీరి ముగ్గురిలోను యింగ్లీషు గవర్నర్ పట్ల సురాజ్ ఉద్దాలా యెక్కువ గౌరవమును జూపెను. ముగ్గురు గవర్నరులును మామూలు నజరానాల చెల్లించిరి. ఇంగ్లీషు గవర్నరును, ఆతని తోడి యుద్యోగులును యువరాజు సందర్శనానంతరము సంతృప్త హృదయులై యిల్లుచేరిరి. తరువాత వారీ రీతిగ సీమలోని తమ కుంపిణీ డైరెక్టర్లకు వ్రాసికొనిరి :— "ఈసారి నజరులకుగాను మేము వెచ్చించిన ధనమునకు ప్రతిఫలముగ మనకు నబాబువలన గొప్ప ప్రసాదము లభింపగలదు. కొంత కాలమువరకు యీతనివలన మన వర్తకమున కెట్టి యభ్యంతరము లేక నిరాటంకముగ సాగగలదని మే మెంతయో సంతోషపడుచున్నాము."

ఇక్కడ కుంపిణీ నౌకర్లు ప్రదేశములలో పుట్టకపోయినను, యిక్కడి సంగతులు చక్కగ నేర్చుకొనిరి. రాజులను దర్శించునపుడు వారికి బంగారు నజరులను నర్పించుటయే గాక, దానికితోడు స్తోత్రపాఠము లనబడు ధూపములు వేయుట కూడ నేర్చుకొనిరి. ఈ రాజదేవత యొక్క నైవేద్యములకు రొఖ్ఖ

రూపముగ చెల్లించిన సువర్ణదక్షిణ మాత్రము 15,560 రూపాయ లయ్యెను. కాని, ఆ దేవత ప్రసాదించునని వా రనుకొనిన వరములేమియు లభింపలేదు. తన పినతండ్రి తన కింత జాగ్రతగ విద్యాబుద్ధులు గరపినను "సురాజ్ ఉద్దౌలా" కు తన పినతండ్రి సుగుణములలో నొకటియు అలవడ లేదు. 1756 సం॥ లో యీతడు రాజ్యమునకు వచ్చినప్పుడు యీతనికి ప్రపంచానుభవ మేమియు లేకుండెను. కాలపరిస్థితులు క్లిష్టముగ నుండెను. ఎట్టి ప్రజ్ఞావంతు నైనను చీకాకు పరుచునవిగ నుండెను. ఈతనియందు పెక్కు దుర్గుణములు గలవను వాడుక పుట్టెను. అన్నియు కాకపోయినను వానిలో నిజముగ కొన్ని యైన నుండియుండవచ్చును. స్వార్థపరులు పెక్కుమంది యీతనియం దనేక దోషారోపణల గావించినను, వానిని ఋజువు చేయలేకపోయిరి. ఈతనియందు సహజముగ నున్న లోపములమాట యెట్లున్నను, యీతనికి చిన్నవయస్సు నందు ఆకస్మికముగ, ఒక్కసారియే, గొప్పరాజ్యాధికార పదవి లభించెను. చేతినిండ కావలసినన్ని ధనరాసులుండెను. విస్తీర్ణమగు రాజ్యమున కధిపతియై యెల్ల ప్రజలచే మొక్కులు గొనుచు యెదురులేని సార్వభౌమపదవియం దోలలాడు చుండెను. ఇట్టి పరిస్థితులలో నాతనికి ఓర్పు వివేకము, శాంతము యెట్లబ్బగలవు? కాని, యిట్టి పరిస్థితులలో రాజ్య చక్రము త్రిప్పుటకు యీ సుగుణములే యెంతయో అవసరమయ్యెను. కుంఫిణీవారికి కలకత్తా, కాశింబజారు మున్నగు ప్రదేశములలో సిరిసంపదలతో తులదూగు చున్న ఫ్యాక్టరీలుండెను. ఫ్రెంచివారికిని హుగ్లీ, చంద్ర

నగరములందు ఫ్యాక్టరీలుండెను. ఈ కాలములో యింగ్లీషు వారిపని అంత బాగుగ లేకుండెను. నబాబునకు ఇంగ్లీషు వారియందు యీర్ష్య జనించెను. ఫ్రెంచివారును ప్రాగ్దేశములలో తమకు పోటీగానున్న యింగ్లీషువారిపైబడి రూపుమాపుదమని కనిపెట్టుకొని యుండిరి. ఇందులకు ఫ్రాంసు దేశములో సన్నాహములు జరుగుచుండెను. ఇంగ్లీషువారి స్థితి క్లిష్టముగ నుండెను. కలకత్తాలో యింగ్లీషువారిసేన బహుతక్కువగ నుండెను. ఇంగ్లాండులో కొత్తసేనల నిర్మించుట కష్టముగ నుండెను. దూరదేశములనుండి యెక్కువ వ్యయప్రయాసలకోర్చి సైన్యముల తెప్పించుటకును సాధ్యము గాకుండెను. ఇట్టి క్లిష్ట పరిస్థితులలో 1756 సం॥ డిశెంబరు 29 వ తేదీన సీమలోని కుంపిణీ డైరెక్టర్లు కలకత్తా కుంపిణీ వారికి యీ రీతిగ వ్రాసిరి:— “మీరు అక్కడి పరిస్థితుల ననుసరించి, జాగ్రత్తగనుండి బంగాళాదేశములోనున్న మన స్థలములను, ఆస్థిని యెట్లు కాపాడుకొందురో మీదే భారము. మీ శాయశక్తుల వినియోగించి నబాబెట్లయిన మనకు తోడ్పడునట్లు గట్టిగ ప్రయత్నింపవలెను. మన ఆస్థిని దక్కించుకొనుటకు మన కింతకంటె వేరుగతిలేదు.” ఈ ఉత్తరము కలకత్తా చేరకమునుపే కుంపిణీవారిపని మరింత అధ్వాన్నమయ్యెను. సురాజ్ ఉద్దౌలాకు తన పినతండ్రి కుండిన వివేకము లేకపోయెను. ఇంగ్లీషువారు కలకత్తా కోటను మరమ్మతు చేయుట చూడగానే, సురాజ్ ఉద్దౌలాకు అనుమానము పుట్టెను. “మేము ఫ్రెంచివారి బాధ నుండి తప్పించుకొనుట కీపని ప్రారంభించినాము” ని యింగ్లీషు

వారు చెప్పిన సమాధానము నబాబుకు నచ్చలేదు. ఇట్టి అనుమానములతో నున్న సమయమున లంచగొండిగ పట్టుబడిన నబాబు ఉద్యోగస్థుడొకడు పారిపోయి కలకత్తాలో యింగ్లీషువారి కోటలో దాగికొనెను. ఈ నేరస్థుని తనకు వప్పగించ వలసినదని నబాబు కోరెను. కాని, అక్కడి యింగ్లీషు గవర్నర్ నబాబు కోర్కెను తిరస్కరించుటయే గాక, యీ కబురు తెచ్చిన నబాబు నౌకరునుకూడ అవమానపరచెను. కుంపిణీవారు తనయాజ్ఞ నిట్లు తిరస్కరించినందున అదియే యుద్ధప్రకటనగ భావింతునని నబాబు తెలిపెను. అప్పటికిని కుంపిణీవారు తమ పట్టును వీడలేదు. వెంటనే నబాబు సేనల నడిపించి మే 30 వ తేదీన కాశింబజారులోనున్న యింగ్లీషువారి కోటను పట్టుకొనెను. ఆతడీ కోటముట్టడియందు నిర్నిమిత్తముగ రక్తపాతము గావించెనను నిందకు పాల్గాలేదు. కుంపిణీ గవర్నర్ వాట్సు, వారన్ హేస్టింగ్సు తదితర కుంపిణీ యుద్యోగస్థులు ఖైదీలుగ పట్టుబడిరి. కాని, నబాబువారిని గౌరవముగనే చూచెను.

కుంపిణీనౌకర్లు ఖైదీలుగ పట్టుబడిరను వార్త వినగనే కలకత్తాయందు గగ్గోలు పుట్టెను. ఇంగ్లీషువారి ఫ్యాక్టరీలో నున్న సైన్యదళము మిక్కిలికొద్దిగనుండెను. వారికిని తగినఆయుధములు గాని, శిక్షణగాని లేకుండెను; తగిననాయకులు లేకుండిరి. ధైర్య సాహసములతో నిలువబడి యెదుర్కొను వాడొక్కడును లేకుండెను. హాల్వెల్ అను ఒక ఉద్యోగస్థుడు తప్ప తక్కిన ఉద్యోగస్థులందరు మెల్లగజారి పడవలెక్కి యెక్క

డికో యెవరికి తెలియకుండ పారిపోయిరి. కోట నిరాధారమయ్యె ను. హాల్వెల్ మాత్రము ధైర్యముగ నిలువబడి, కొందరిని నిలువ బెట్టచూచెను. కాని, ఆతనికి తోడుపడువారు లేనందున ఆతని యత్నము నిష్ఫలమయ్యెను. అక్కడ నున్న కొద్దిమంది సైనికులును కోటలోనున్న సారాకొట్టులో జొరబడి పూర్తిగ త్రాగి, తందనాలుత్రొక్క మొదలిడిరి. అంతట హాల్వెల్ చేయునదిలేక, తాను లొంగిపోయినట్లుగ తెలుపుచు ఒక కాగితమును కోట గోడమీద నుండి పడవేసెను. ఈ విధముగ విలియంకోట 1756 సం॥ జూన్ 20 వ తేదీన సురాజ్ ఉద్దౌలాకు కష్టము లేకయే స్వాధీనమయ్యెను. హాల్వెలును, ఆతనితోపాటు మరికొందరు కుంపిణీ యుద్యోగులను పట్టుకొని కాలుసేతులు బంధించి నబాబువద్దకు తీసికొనివచ్చిరి. ఆతడు వెంటనే ఉదారమగు వీరపురుష లక్షణముతో వారి బంధముల విడిపించి, వారికి అభయహస్త మిచ్చెను. ఆంగ్ల చరిత్రకారు లీతని కారోపించిన క్రౌర్యమునకును యీతడీపట్టున చూపిన కరుణకును ఎంతవ్యత్యాసముగలదో పాఠకులే గ్రహింతురుగాక.

తదుపరి యారాత్రిసంభవించిన ఘోర సంఘటనమునకు నబాబు బుద్ధిపూర్వకముగ నెంతమాత్రమును కారకుడుగాడు. అది ప్రమాదవశమున దైవికముగా జరిగినవిపత్తు. దానిని తీసికొనివచ్చి యీ యనకు ముడిపెట్టుట యెంతమాత్రము న్యాయముగాదు. ఆరాత్రి హాల్వెలు మొదలగు 146 మంది ఖైదీలను భద్రపరుపవలసివచ్చెను. అప్పు డక్కడ దానికి తగిన స్థలము దొరకలేదట. అప్పుడాకోటలో ఒక చిన్నఖైదీల కొట్టు మాత్రముండెను. అది 18 అడుగుల చదరము గలిగి

రెండు చిన్నగవాక్షములు మాత్రము గలిగియుండెను. ఇదియే * "కలకత్తా చీకటికొట్టు" ని చరిత్రయందు దుర్యశముగాంచెను. ఈ చీకటికొట్టులోనికి యీ 146 గురు ఖైదీలను త్రోసి తాళము వేసిరట. నడివేసవి రాత్రి యంతయు యీ చిన్న యిరుకు చీకటికొట్టులో యీ 146 గురు ఖైదీలును మలమల మాడి ఉడికిపోయిరి. ఏడుపులు, పెడబొబ్బలు, ప్రార్థనలు, వేడికోళ్లు, లంచములు—యివియేవియు అక్కడనున్న యమభటసదృశులగు ఫారావాండ్ల మనసుల కరగింపలేదు. తెల్లవారి తాళములు తీయుసరికి 23 గురు మాత్రము కొనయూపిరితో బైటపడిరి. మిగిలినవారు మడసిరి. నబాబు యొక్క అనుజ్ఞ పుచ్చుకొనకుండ తెలివితక్కువగను, క్రౌర్యముగను, ప్రవర్తించిన ఆఫారావాని యవివేక కార్యముచే పాపము నూటయిరువదిమూడు నిండుప్రాణములు నశించెను. మానవచరిత్ర యందిట్టి ఘోరవిషాద సంఘటనము మరచిపోవుద మన్నను మరపునకు రాదు. ఇట్టి అసురకృత్యము క్షంతవ్యముగాదు. కాని కేవలము ముసలమ్మ కథవలెగాక సత్యాన్వేషణ దృష్టితో చరిత్రను వ్రాయదలచు కొనినయెడల, పాక్షిక దృష్టితో ఒకపక్షమందే నేరమారోపింపక ఉభయపక్షములందలి సత్యాసత్యములను మిక్కిలి నిష్కర్షగా పరిశీలించి మరీ చరిత్ర వ్రాయవలసిన బాధ్యతగలదు. ఏలననగ సురాజుద్దౌలా యీ క్రూరకృత్య మొనర్చినాడని నాడును నేడును నిందించుచున్న ఆంగ్లేయులకు తమదేశములో తమ ప్రభువులు

---

* ఈ "చీకటికొట్టు" కథ కేవలము అసత్య కల్పనయని 'బాసూ' మున్నగు చరిత్రకారులు ఋజువు పరచుచున్నారు.

యింతకంటె ఘోరముగ బుద్ధిపూర్వకముగ, గావించిన అసురకృత్యములు అంతలో మరపునకు వచ్చెనా? ఆంగ్లమంత్రి యొకడు "ఆర్గల్‌షైర్" లోయలోని నిరపరాధులగు గ్రామవాసులను నాశనమొనర్పదలచి, కొందరు మొరటు సైనికులను అర్ధరాత్రివేళ పంపి, వారి నచ్చట తలదాచుకొన నివ్వవలసినదని గ్రామవాసుల మోసగించుటయు, ఈ మోసము తెలియక గ్రామస్థులు సదరు సైనికులకు తమ యిండ్లలో తావొసంగుటయు, అంతట నిశీథమందు సైనికులు లేచి యిండ్లలో నిద్రబోవుచున్న వారినందరిని నరికి పారవేసి, గ్రామమంతయు నెత్తురుకొల్లు చేసి, స్త్రీలను, పసిబిడ్డలను, ముదుసలివర్గులను యిండ్లలో నుండి బయటికి గెంటి వడవడ వణకించి మంచులో మరణించునట్లు చేయుటయు—మున్నగు యీ ఘాతుక కృత్యములు ఆంగ్లచరిత్రకారులకు మరపునకు వచ్చెనా? ఇట్టి ఘాతుక కృత్యమునకు ప్రతీకారము జరిగినట్లు ఆంగ్ల చరిత్రయం దెచ్చటనైన కలదా? ఇట్టి ఘోర దురంతమునకు బుద్ధి పూర్వకముగ కారకులైన రాజులుగాని మంత్రులుగాని తదితర ప్రముఖులుగాని తగురీతిని శిక్షింపబడినట్లు ఆంగ్ల చరిత్రయం దెక్కడనైనగలదా? ఈ ఘోరకృత్యము యెట్లు యెవరివల్ల జరిగెనను విచారణయైనను జరిపిన పాపమున యెవరైనపోయిరా? అయితే, ఆంగ్ల చరిత్రయందు జరిగిన యీ దురంత కృత్యమును నే నిచ్చట యెందుకు యెత్తి చూపుచున్నాననగా కలకత్తా చీకటికొట్టు దురంతమును సమర్థించుటకుగాదు. ఒక నేరము ఇంకొక నేరమును యెన్నడు సమర్థింపజాలదు. ప్రమాదవశమున జరిగిన యీ చీకటికొట్టు నేరము

నకు శిక్షగా—ప్రతీకారముగా-భారతదేశమునంతను దండెత్తి, నాశనము చేసి, జయించి, ప్రజల స్వాతంత్ర్యమును శాశ్వతముగా హరించి, వారిని సదా బానిసలుగ చేయబూనితి మని చెప్పుట ధర్మముకాదని నిరూపించుటకే నేని "ఆర్గైలుషైరు" లోయలోని దురంతమును యెత్తిచూపుచున్నాను. చీకటికొట్టు నేరమునకు శాశ్వత బానిసత్వమే తగు శిక్షయని ఆంగ్ల చరిత్రకారుడు సత్యముగ, న్యాయముగ సమర్థింపబూనినచో తాను తన దేశచరిత్రలో జరిగిన "ఆర్గైలు షైరు" దురంతమునకు గూడ ఇట్టి శిక్షనే విధింపవలసి యుండునని చెప్పవలదా? చరిత్రకారుడు సత్యమును న్యాయమును పాటించువాడే యైనయెడల యీ తప్పున కిట్టి శిక్ష ఎవరికిగాని సరియైనది గాదని స్పష్టముగా తీర్పుచెప్పును. ఏల ననగా ఇట్టి తప్పులు చేయనివారు లోకమం దెవ్వరుగలరు? ఇట్టి తప్పులు చేయని జాతులేవైన నున్నచో గుండెపై చేయివైచికొని ధైర్యముగా యెదుటకు వచ్చి చెప్పవలసినదని చరిత్రకారుడు సవాలు చేయును. విషాదపూరితమగు కలకత్తా-చీకటికొట్టు ఖైదీల యవస్థ యెవరి మనస్సుల కరగింపదు? కాని ఎవరుగాని సత్యమును స్వప్రయోజనార్థమై వికృత మొనర్పతగదు. ఆంగ్ల చరిత్రకారులు దీనికి తరచుగా విపరీతార్థముల కల్పించి యుండిరి. ఇది న్యాయముగాదు. ఏలననగా ఇట్టి ప్రమాదము జరిగెనను సంగతి పాపము నబాబుకు తెలియనే తెలియదు. అంతయు జరిగిపోయిన వెనుక ఆతనికి తెలిసెను. పాపము! దాని కప్పు డాతడేమి సేయగలడు? అంతకు బూర్వము గాని

తదుపరి గాని ఆతడు కలకత్తాలో గాని, కాశింబజారులో గాని ఖైదీల నెవరిని అవమానపరచినట్లు గాని, హింసించినట్లు గాని లేదని స్పష్టమగు సాక్ష్యముగలదు. నిజముగ ఆతడు యీ దిక్కుమాలిన ఖైదీలను చంపనేదలచిన యెడల ఆతని చేతి కపుడు అడ్డు యెవరు ? మిగిలిన 23 గ్గురిని కూడ అక్కడనే నరికి పాతివేయించెడివాడు గదా ! అట్లుగాక యీ 23 గ్గురు పోయి లోకములో నీదుర్వార్తను యేల చాటనిచ్చెడి వాడు ? కాబట్టి, సురాజుద్దౌలాపై హేయమగు నీ దోషారోపణ చేయువారు కేవలము నిష్పక్షపాతులని గాని, నిర్దోషులని గాని చెప్పుటకు వీలులేదు. ఈ దిక్కుమాలిన ఖైదీలయం దింత కరుణరస మొలుకునట్లు వగచుచున్న కుంపిణీ సిబ్బందియే మొదట వీరి గతిని చూడక తమ ప్రాణముల రక్షించు కొనుటకై దొంగతనముగా పారిపోయి యుండక యుండినచో నీ ఖైదీల కీ దుర్గతి పట్టియుండెడిది గాదుగదా ! కాని వెంటనే తమ కేదో స్వలాభాపేక్ష యెదుట కాన్పించినపుడు కుంపిణీ సిబ్బంది యీ విషాద నటనమును మరచి యీ దురంతము నెడ తాటస్థ్యము యెట్లు వహించిరో తదుపరి చరిత్రవలన తెలియ గలదు.

కలకత్తాలో చీకటికొట్టువార్త వెంటనే మద్రాసు చేరెను. అప్పుడు కర్ణాటక వ్యవహారముల తొందరలోనున్న కుంపిణీవారి దృష్టి కలకత్తావైపునకు మరలెను. తక్షణము 900 ఐరోపీయ సైనికులను, 1500 సిపాయిలను తీసుకొని, క్లైవు మెట్టదారినిన్నీ, " వాట్సను " దొర 5 ఓడలను తీసికొని

కోస్తా వెంబడినిన్ని కలకత్తాను తిరిగి పట్టుకొనుటకు బయలు దేరిరి. 1756 డిసెంబరు 20 వ తేదీన వీరు హుగ్లీచేరిరి. అప్పటికి కుంపిణీ ఉద్యోగస్థులు కలకత్తానుండి పారిపోయి కొన్ని మైళ్ల దూరములోనున్న "ఫుల్టా" యను కుగ్రామమున తల దాచుకొని యుండిరి. వీరందరును అక్కడ సమావేశమైరి. కలకత్తా కోటను పట్టుకొనుటకు పదిరోజులు సన్నాహపరుచు కొనిరి. "ఫుల్టా" గ్రామమందున్న ఒక చిన్నకోటను స్వాధీనపరచుకొని సైన్య శిబిరముల నేర్పరచుకొని, కలకత్తాపై దాడివెడలి 1757 సంవత్సరము జనవరి రెండవ తేదీన కలకత్తా కోటను స్వాధీనపరచుకొనిరి. సురాజుద్దౌలా తదుపరి యుద్ధ ములం దోడిపోయి క్లైవుచే నడిపింపబడు సైన్యములధాటికి కోర్వ లేక సంధికొడబడెను. కంపెనీవారికి పూర్వపు వర్తక సౌక ర్యము లన్నిటిని తిరిగి యిచ్చునట్లును, కోట తన స్వాధీనమం దున్న కాలములో కుంపిణీవారికి గలిగిన నష్టమునకు పరి హార మిచ్చునట్లును, కోట మరమ్మతులకు అభ్యంతర పెట్ట కుండునట్లును, సురాజుద్దౌలా ఒడబడెను. సంధి ఫిబ్రవరి 9 వ తేదీన జరిగెను. గౌరవప్రదముగను లాభకరముగను సంధి జరిగెనని క్లైవు సీమలోని కంపెనీ డైరెక్టర్లకు వ్రాసెను. ఆ నెలలోనే సురాజుద్దౌలాపై దండు వెడలుటకు యింకొకరితో కుంపిణీవారు సంధిచేసికొనిరి. (దాని యుదంతము తరువాత తెలుపగలను.) పలాయనులైన కుంపిణీ యుద్యోగస్థులు తిరిగి తమ తమ పదవులలో ప్రవేశించిరి. ముట్టడి కాలమునందు తమకు గలిగిన నష్టమునకు పుష్కలముగ పరిహారము లభిం

చుటచే వారు సంతృప్త హృదయులైరి. వీరిని గూర్చి క్లైవు వ్రాసిన వ్రాతలు చాల వినోదకరముగ నుండును. మద్రాసు గవర్నరుకు రహస్యముగా వ్రాసిన యుత్తరములో ఇట్లున్నది. "ఈ యుద్యోగస్థులగూర్చి మీరు బహు మెళుకువగా నుండవలెను. వారు చెప్పెడిమాటలు నమ్మవద్దు. వారు మంచివారు కారు. వారు కుబుద్ధులు. వారు కలకత్తాలో చేసినపనులు ఘోరముగానున్నవి. అవి వారిలో వారికే అసహ్యముగా నున్నవి. నాకు మేరువపర్వతము లభించినను వారిమధ్య నుండనొల్లను." ఓహో! క్లైవూ! ఏమి నీ సుగుణసంపద! నీలో లేని సుగుణ సంపద నేల వెళ్లబోసెదవు! కాంచనమందు నీకంత మోహము లేదా? మేరు పర్వతము దుర్గమముగు ధ్రువమండలమం దుండుటచే దానియందు నీ కాశ కలుగక పోవచ్చును. కాని ఇక్కడ బంగాళా దేశములో, నీచేతికింద నీ కందుబాటులో, నిన్నెవ్వరు చూడకుండ నున్నప్పుడు— నీచే కుబుద్ధు లనిపించుకొనబడిన నీ వారుతప్ప నిన్నెవ్వరు చూచుచుండనప్పుడు, నీ యెదుట రాసులుగా పడియున్న బంగాళాదేశపు ధనరాసుల సంగతి యేమి? ఈ 'కుబుద్ధులు' నిన్ను మదరాసు పోనీకుండ చేసి, తమలోనే యుంచుకొని నీవుకూడ వారితోపాటే యగునట్లు చేయలేదా? తొందరపడి ఇప్పుడేల నవాబుతో సంధిచేసి కొంటిమి? నవాబు మనకిప్పుడు స్నేహితుడే! ఆతడన్న మాట ప్రకార మంతయు జరిపినాడు. మన మాతనికి వ్రాయు ఉత్తరములలోను, మాటలలోను, "మిత్రమా" యని పిలుచుచునే యున్నాము. అయితేనేమి? ఆతనివద్ద

చాల తరుగని ధనరాసు లున్నవట. ఏదో వంకపెట్టి వాటిని మన మేల హరింపరాదు ? మనకేదైన వంక దొరకకుండునా ? మనకు ఆతడు పుష్కలముగా ధనమిచ్చి యున్నాడు. మన మాతనితో నేస్తము గట్టినమాట వాస్తవమే. కాని అయితే యేమి ! అతనివద్ద చాల ధనమున్నదిగా ! దానినిబట్టి యాతడు క్రూరుడని చెప్పవచ్చుగా ! కాబట్టి మన మీవిషయమై ఆలోచించి లోకోపకారము యెందుకు చేయరాదు? దీని విషయమై మీరందరు యేమంటారు ? అని క్లైవు అడుగగా "కుబుద్ధు"లందరు ఒక్కసారి లేచి యేకగ్రీవముగా "భళా, భళీ" యనిరి. మొట్టమొదట సురాజుద్దౌలా కలకత్తా మీదికి వచ్చిపడునను వార్త తెలియగనే, కుంపిణీ ఉద్యోగస్థులకు గాబరాపుట్టి, తమ్ము రక్షించవలసినదని అప్పుడు తమతో యుద్ధము చేయుచున్న ఫ్రెంచివారిని, తమతో స్నేహముగ నున్న డచ్చివారిని కూడ కుంపిణీ ఉద్యోగస్థులు ఆశ్రయించిరి. కాని, డచ్చివారు మాత్రము "మా వల్లకాదని" నిర్మొగమోటముగ చెప్పివేసిరి. "కలకత్తాను మాకిచ్చివేసి, చంద్రనగరమును గనుక మీరు తీసికొనేయెడల మీకు సహాయము చేతు" మని ఫ్రెంచివారనిరి. కాని యీ షరతుకు వప్పుకొనుటకు కుంపిణీ ఉద్యోగస్థులకు అధికారము లేకుండెను; కావున యింత యెక్కువధర పెట్టి వారి సహాయమును కొనుక్కొనుటకు కుంపిణీ ఉద్యోగస్థు లంగీకరింపలేదు. ఈ తరుణమున ఫ్రెంచివారు నవాబుతో కలసిన యెడల వారు తమ శత్రువులగు ఇంగ్లీషువారిని పూర్తిగా దేశము నుండి తరిమివేసెడివారే. కాని ఫ్రెంచివారు మహోదారభావముతో అట్టి పని చేయదలచుకొన

లేదు. తాము తటస్థముగ నుందుమని కుంపిణీవారితో ఒడంబడిక చేసికొనగోరిరి. అందులకు ఉభయులు ఒడంబడి షరతులను గూడ ప్రమాణముచేసి వ్రాసికొనిరి. కాని, యింగ్లీషువారి నౌకాదళాధిపతియగు వాట్సన్ మాత్రము యీ యొడంబడికకు అంగీకరింపలేదు. నిరపాయకరమగు యిట్టి ఒడంబడికకు కూడ తాము ఒప్పుకొనకున్నందున యీ కోపముతో ఫ్రెంచివారు నవాబుతో చేరుదురేమోయను భయోత్పాతముచే తామేముందుగ యెదురెత్తుగా ఆకస్మికముగ పోయి ఫ్రెంచిస్థానమగు చంద్రనగరముపై పడుదమని క్లైవు దుర్మార్గమగు సలహాచెప్పెను. ఇట్టి దురాగతమునకు "వాట్సను" మొట్టమొదట అంగీకరింపలేదు. కాని తుద కంగీకరించెను.

1757 సంవత్సరం మార్చి 4 వ తేదీన క్లైవు కలకత్తా లోని కుంపిణీ యుద్యోగస్థుల కిట్లువ్రాసెను:—"ఫ్రెంచి వారు కోరిన తాటస్థ్యమునకు మనము అంగీకరింపని పక్షమున మన మిప్పుడు తక్షణమే చంద్రనగరముపై పోయి పడుట అని వార్యమగుచున్నది. కాని, ఈ విషయమై మన ప్రవర్తనను గురించి లోకమే మనుకొనునోయను విషయమును గూడ మీరందరాలోచింపక తప్పదు. ఫ్రెంచి గవర్నరు తాటస్థ్య మును గోరుచు మనకు లేఖ నంపినపుడు, మనము దానికి అంగీ కరింపలేదా! ఉభయులకు తృప్తికరమగు షరతులను గూడ పత్రములపై వ్రాసియుంటిమిగదా! అందులోని ప్రతిషరతు నకు ఉభయపార్టీలు అంగీకరించి సంతకముచేసి, ప్రమాణములు

చేయుటకు అంగీకరింపలేదా ! ఇట్టి సమయములో మనము మాట తప్పినయెడల నబాబేమనుకొనును ? మేము ఫ్రెంచి వారి విషయమై తటస్థముగ నుందుమని నబాబుతో చెప్పి, ఆతడుకూడ వారివిషయమై తటస్థముగ నుండునట్లు వాగ్దానము చేయించుకొని ఇప్పుడు మనము ఆమాటలనన్నిటిని తప్పినయెడల, ఆతడును, లోకమును గూడ మనము శుద్ధ నీచులమనియు, మాట నిలకడ లేనివారమనియు, తలంపక మానరు. ఫ్రెంచి వారు కోరుచున్న తాటస్థ్యమును మన మిప్పుడు తిరస్కరించిన యెడల ఫ్రెంచివారు వెంటనే మనకు వ్యతిరేకముగా నవాబుతో చేరెదరు. ఆతడుకూడ యిదివరలో మనతో చేసికొన్న సంధిని యేమాత్రము త్రోసిపుచ్చవలెనని కోరిక యున్నను ఆతడు ఫ్రెంచివారి సహాయమును తప్పక అంగీకరించును. "వాట్సను" మనము కోరినప్రకారము ఫ్రెంచివారితో తాటస్థ్య సంధికి అంగీకరించియుండి యుండిన యెడల యెంతయో బాగుండెడిదిగదా యని మనమప్పుడు అనుకొనవలసి వచ్చును. కాబట్టి మొదట అనుకొనిన ప్రకారము ఫ్రెంచివారితో సంధికి ఒప్పుకొన వలసినదని మన మందరము కలసి " వాట్సను " గారిని ముఖ్యముగ మూడవసారిగూడ కోరుదము. అప్పటికిని ఆతడు అంగీకరింపనియెడల "వాట్సను" తక్షణమే నౌకాదళ ముతోపోయి చంద్రనగరమును ముట్టడించు నట్లును, నేను నా సైన్యముతో మెట్టదారినిపోయి దానిని పట్టుకొనునట్లును, మన మందరమును కలసి యాతని ఒప్పింపవలసియుండును." కాబట్టి ఫ్రెంచివారితో సంధి చేసికొనుటకు " వాట్సను " ఒప్పుకొన లేదు గనుక తదనంతర కర్తవ్యము ఆకస్మికముగ ఫ్రెంచివారిపై

పడి వారిని వెముకలు విరుగగొట్టి నాశనము చేయవలసినదే! దీనికి వాట్సను అంగీకరించెను. పాపము! ఫ్రెంచివారి ఔదార్యమునకును, శాంతిని కోరుటకును ప్రతిఫలముగ వారికి లభించిన దేమి? చంద్రనగరు కోటనుండి తరుమబడుటయు అక్కడి తమ యిండ్లు వాకిళ్ళు యావత్తు నేలమట్టము గావింపబడుటయేనా? ఫ్రెంచివారు నవాబురాజ్యములో శాంతముగా నివసించుచుండిరి. వారిని సంరక్షించు బాధ్యత నవాబు వహించియుండెను. కాబట్టి ఇంగ్లీషువారు చేసిన యీ దురాగతమును ప్రతిఘటించుటకు ఫ్రెంచివారికి నవాబు యొక్క అనుజ్ఞ అవసరమయ్యెను. అందుచే ఫ్రెంచివారు నవాబుయొక్క అభిప్రాయమును అడిగిరి. ఇంగ్లీషువారు చేసిన పని తప్పని నవాబు నిష్కర్షగా చెప్పెను. అంతట ఇంగ్లీషు సేనాని వాట్సను నవాబుపై ఎదురొత్తు చేసెను. ఏమనగా "మనముభయులము ఒకరికొకరు సహాయము చేసికొనుటకు వెనుక సంధిచేసికొంటిమి గదా! మీరు ఇప్పుడు పాట్నాపై దండెత్తబోవుచు మా సహాయమును కోరితిరిగదా! కాబట్టి ముందుగా మన మిద్దరము గలసి చంద్రనగరమును పట్టుకొందము! ఆ పిమ్మట మీతో పాట్నాకే కాదు—ఢిల్లీ చక్రవర్తిపై కూడ దండెత్తుటకు మేము సాయపడెదము! మన ఉభయులలో ఒకరికి శత్రువులగువారు ఉభయులకు శత్రువులే యనియు అట్లే ఒకరికి మిత్రులగువారు ఉభయులకు మిత్రులేననియు మనము అనుకొని ప్రమాణములు చేసికొని యుండలేదా! మన ప్రమాణములను తప్పిపోయిన యెడల భగవంతుడు మనలను శిక్షింపడా?" అని

నవాబు ఫ్రెంచిసేనానులకు వ్రాసిన యుత్తరములలో కలదు. నవాబువలన నెంతమాత్రము దోషములేదని క్లైవు తనవారికి రహస్యముగ వ్రాసిన యుత్తరములలోనే కలదు. "నబాబు సంధిషరతులలో అనుకొన్న మాటలప్రకారము ఒక అక్షర మైనను తప్పకుండ అంతయు నెరవేర్చినాడు. వాట్సన్ మూడు లక్షల రూపాయలిచ్చినాడు. తాను పట్టుకొన్న కోటలన్నిటిని వానిలోనున్న పూరిపుల్లతో సహా, తిరిగి మనకుయిచ్చివేసినాడు. ఆతనియం దేమాత్రమును లోపము లేదు" అని క్లైవు వ్రాసెను. కాని నవాబుకు వ్రాసిన జాబులలో మాత్రము క్లైవు వేరు విధముగా వ్రాసియుండెను. క్లైవు ఇప్పుడు కలకత్తా యుద్యోగస్థులలో నెల్ల నోరుగలవాడై యుండెను. ఏవిధము చేతనైనను రాజ్యము సంపాదించి అధికారము చెలాయింప వలెనని ఆతడు పూర్తిగా పట్టుపట్టెను. రాజ్యాక్రమణయను దురాశ యాతనికి అంతకంత కెక్కువయ్యెను. దానిని దీర్చు కొను మార్గము కనుపడలేదు. కావున నెట్లైనను నవా బును పొడిచి, లేపవలెనను దుర్బుద్ధిపుట్టెను. ఫ్రెంచివారికున్న ఇతర ఫ్యాక్టరీలన్నిటిని గూడ నాశనము చేయింపవలెనని నవా బును గోరెను. సురాజుద్దౌలాకు ఒడ్లుమండెను. కుంపిణీ వారిని తీవ్రముగ తిట్టుచు తాను ఆపని చేయనని కబురంపెను. కాని, మరునాడే యాతని మనసు ఆందోళితమై తానన్న మాటల నుపసంహరించుకొనుచు తాను పంపిన రాయబారిని వెనుకను పిలిపించుకొనెను. ఈ దుర్మార్గము చేయజాలనని

మరల కబురంపెను. మరల ఉపసంహరించుకొనెను. ఈ రీతిగా పాపము నబాబు ఏమిచేయుటకు దోచక డోలాయమానమానసుడాయెను. ముందురానున్న ఘోర విపదాంధకారచ్ఛాయ లాతని మనోక్షేత్రముపై గ్రమ్ముకొనజొచ్చెను. తాను గొప్ప మోసమునకు లోనైతిననియు, తన్ను సర్వనాశన మొనర్చువరకు కుంపిణీవారు తృప్తి నొందరనియు నబాబుకు స్పష్టమయ్యెను. కాని, ఇట్టి విపత్తు అంత త్వరలో అతనిపై వచ్చి పడునని ఆతనికి కొంచెమైనను తెలిసి యుండినచో ఆతడు తగు జాగ్రత్తలో యుండి యుండెడివాడు. కుంపిణీవారు దేశాక్రమణాకై, క్యయమునకు కాలు ద్రవ్వ దురాగతపు టెత్తులకు సురాజుద్దాలా అంత సులభముగా అంగీకరించువాడుకాడను సంగతి కుంపిణీవారికి పూర్తిగ తెలియును. కావున, బహిరంగముగా గాక, రహస్యముగ నవాబు కొలువులోని వారిని కొందరిని చీలదీసి, వారికాశలు గొలిపి, వారితో రహస్యపు టొడంబడికల గావించుకొని, తమ "ప్రాణ స్నేహితుడగు" నబాబును బంగాళా సింహాసనమున నుండి తల్లక్రిందుగా పడద్రోయవలెనని క్లైవు కంపెనీవారికి సలహా చెప్పెను.

తన పినతండ్రికున్న మనస్థైర్యము, పాలనాదక్షత సురాజుద్దాలాకు లేనందున అతని రాజ్యము ప్రజారంజకముగా లేకుండెను. ప్రజలయందు అసంతృప్తి వ్యాపించెను. తన దర్బారులోనే తనచుట్టు మోసగాండ్రును, స్తోత్రపాఠకులును, దొంగస్నేహితులును గుమిగూడియుండిరి. ఇంగ్లాండులో

పడి వారిని యెముకలు విరుగగొట్టి నాశనము చేయవలసినదే! దీనికి వాట్సను అంగీకరించెను. పాపము! ఫ్రెంచివారి సౌహార్ద్యమునకును, శాంతిని కోరుటకును ప్రతిఫలముగ వారికి లభించినదేమి? చంద్రనగరకోటనుండి తరుమబడుటయు అక్కడి తమ యిండ్లు వాకిళ్ళు యావత్తు నేలమట్టముగా వింప బడుటయేనా? ఫ్రెంచివారు నవాబురాజ్యములో శాంతముగా నివసించుచుండిరి. వారిని సంరక్షించు బాధ్యత నవాబు వహించియుండెను. కాబట్టి ఇంగ్లీషువారు చేసిన యీ దురాగతమును ప్రతిఘటించుటకు ఫ్రెంచివారికి నవాబు యొక్క అనుజ్ఞ అవసరమయ్యెను. అందుచే ఫ్రెంచివారు నవాబుయొక్క అభిప్రాయమును అడిగిరి. ఇంగ్లీషువారు చేసిన పని తప్పని నబాబు నిష్కర్షగా చెప్పెను. అంతట ఇంగ్లీషు సేనాని వాట్సను నవాబుపై ఎదురొత్తు చేసెను. ఏమనగా "మనముభయులము ఒకరికొకరు సహాయము చేసికొనుటకు వెనుక సంధిచేసికొంటిమి గదా! మీరు ఇప్పుడు పాట్నాపై దండెత్తబోవుచు మా సహాయమును కోరితిరిగదా! కావున ముందుగా మన మిద్దరము గలసి చంద్రనగరమును పట్టుకొందము! ఆ పిమ్మట మీతో పాట్నాకే కాదు—ఢిల్లీ చక్రవర్తిపై కూడ దండెత్తుటకు మేము సాయ పడెదము! మన ఉభయులలో ఒకరికి శత్రుస్థులగు వారు ఉభయులకు శత్రువులే యనియు అట్లే ఒకరికి మిత్రులగువారు ఉభయులకు మిత్రులేననియు మనము అనుకొని ప్రమాణములు చేసికొని యుండలేదా! మన ప్రమాణములను తప్పి పోయిన యెడల భగవంతుడు మనలను శిక్షింపడా?" అని

పడి వారిని యెముకలు విరుగగొట్టి నాశనము చేయవలసినదే! దీనికి వాట్సను అంగీకరించెను. పాపము! ఫ్రెంచివారి ఔదార్యమునకును, శాంతిని కోరుటకును ప్రతిఫలముగ వారికి లభించినదేమి? చంద్రనగరకోటనుండి తరుమబడుటయు అక్కడి తమ యిండ్లు వాకిళ్ళు యావత్తు నేలమట్టము గావింపబడుటయేనా? ఫ్రెంచివారు నవాబురాజ్యములో శాంతముగా నివసించుచుండిరి. వారిని సంరక్షించు బాధ్యత నవాబు వహించియుండెను. కాబట్టి ఇంగ్లీషువారు చేసిన యీ దురాగతమును ప్రతిఘటించుటకు ఫ్రెంచివారికి నవాబు యొక్క అనుజ్ఞ అవసరమయ్యెను. అందుచే ఫ్రెంచివారు నవాబుయొక్క అభిప్రాయమును అడిగిరి. ఇంగ్లీషువారు చేసిన పని తప్పని నబాబు నిష్కర్షగా చెప్పెను. అంతట ఇంగ్లీషు సేనాని వాట్సను నవాబుపై ఎమరెత్తు వేసెను. ఏమనగా "మనముభయులము ఒకరికొకరు సహాయము చేసికొనుటకు వెనుక సంధిచేసికొంటిమి గదా! మీరు ఇప్పుడు పాట్నాపై దండెత్తబోవుచు మా సహాయమును కోరితిరిగదా! కావున ముందుగా మన మిద్దరము గలిసి చంద్రనగరమును పట్టుకొందము! ఆ పిమ్మట మీతో పాట్నాకే కాదు——ఢిల్లీ చక్రవర్తిపై కూడ దండెత్తుటకు మీకు సాయపడెదము! మన ఉభయులలో ఒకరికి శత్రువులగు వారు ఉభయులకు శత్రువులే యనియు అట్లే ఒకరికి మిత్రులగువారు ఉభయులకు మిత్రులేననియు మనము అనుకొని ప్రమాణములు చేసికొని యుండలేదా! మన ప్రమాణములను తప్పిపోయిన యెడల భగవంతుడు మనలను శిక్షింపడా?" అని

"వాట్సను" నవాబుతో బహు టక్కరితనముతో వాదించెను. ఇట్టి విపరీత వాదనకు నవాబు ఆశ్చర్యపడెను. సంధి షరతులకు యిట్టి విపరీతార్థము చేయబడునని ఆతడు ఎన్నడు కలలోనైన యనుకొని యుండలేదు. కావున ఇట్టి మోసమునకు హర్షించుటకుగాని, లోబడుటకుగాని, ఆతడు కించిత్తైనను అంగీకరింప లేదు. స్తోత్ర పాఠములు, టక్కరి యెత్తులు నవాబు ముందర సాగనందున, "వాట్సను" బెదరింపులకు సాగించెను. మార్చి 7 వ తేదీన వాట్సన్ నవాబునకు యీ రీతిగ వ్రాసెను. "జాగ్రత్త! మా సైన్యములు వచ్చి పడుచున్నవి! దేశమంతటికి నిప్పుపెట్టి అగ్నిజ్వాలల ప్రజ్వలింప జేసెదను! ఈ మంటల నార్పుటకు మీ గంగానదిలోని నీళ్లన్నియు పోసినను చాలవు!!!"

ఇంత తొందరలోనే తిరిగి యుద్ధమునకు పోవుటకు నవాబు సాహసింపలేక "కేవలము మీస్వరక్షణార్థము మీరేమి చేసికొన్నను సరే; నే నడ్డురాను" అను నంతవరకు ఒప్పుకొనెను. ఇదియే నవాబుయొక్క యనుజ్ఞయను సాకు చెప్పుకొని కుంపిణీవారు చంద్రనగరమును ముట్టడించి, ధ్వంసము చేసిరి. ఒక్క యిల్లుకూడ లేకుండ పట్టణము నంతయు నేలమట్టము గావించిరి. నవాబునకు మిక్కిలి కోపము వచ్చెను. ఫ్రెంచివారియెడ తనకుగల సానుభూతిని తెలియపరచ కూడ లేక పోయెను! చంద్రనగరమునుండి పారిపోయి వచ్చిన ప్రజలకు తలదాచుకొనుటకు తావిచ్చెను. "కుంపిణీవారు నా రాజ్యమం దల్లకల్లోలము చేయుచున్నారనియు, వారు చేయు దురాగతములు ఇంతింతని వ్రాయ నలవికాదనియు"

నవాబు ఫ్రెంచి సేనానులకు వ్రాసిన యుత్తరములలో కలదు. నవాబువలన యెంతమాత్రము దోషములేదని క్లైవు తనవారికి రహస్యముగ వ్రాసిన యుత్తరములలోనే కలదు. " నబాబు సంధిషరతులలో అనుకొన్న మాటలప్రకారము ఒక అక్షరమైనను తప్పకుండ అంతయు నెరవేర్చినాడు. వాట్సన్ మూడు లక్షల రూపాయలిచ్చినాడు. తాను పట్టుకొన్న కోటలన్నిటిని వానిలోనున్న పూరిపుల్లతోసహా, తిరిగి మనకుయిచ్చివేసినాడు. ఆతనియందేమాత్రమును లోపము లేదు " అని క్లైవు వ్రాసెను. కాని నవాబుకు వ్రాసిన జాబులలో మాత్రము క్లైవు వేరు విధముగా వ్రాసియుండెను. క్లైవు ఇప్పుడు కలకత్తా యుద్యోగస్థులలో నెల్ల నోరుగలవాడై యుండెను. ఏవిధము చేతనైనను రాజ్యము సంపాదించి అధికారము చెలాయింపవలెనని ఆతడు పూర్తిగా పట్టుపట్టెను. రాజ్యాక్రమణయను దురాశ యాతనికి అంతకంత కెక్కువయ్యెను. దానిని దీర్చుకొను మార్గము కనుపడలేదు. కావున యెట్లైనను నవాబును పొడిచి, లేపవలెనను దుర్బుద్ధిపుట్టెను. ఫ్రెంచివారికున్న ఇతర ఫ్యాక్టరీలన్నిటిని గూడ నాశనము చేయింపవలెనని నవాబును గోరెను. సురాజుద్దౌలాకు ఒడలుమండెను. కుంపిణీ వారిని తీవ్రముగ తిట్టుచు తాను ఆపని చేయనని కబురంపెను. కాని, మరునాడే యాతని మనసు ఆందోళితమై తానన్న మాటల నుపసంహరించుకొనుచు తాను పంపిన రాయబారిని వెనుకను పిలిపించుకొనెను. ఈ దుర్మార్గము చేయజాలనని

మరల కబురంపెను. మరల ఉపసంహరించుకొనెను. ఈ రీతిగా పాపము నబాబు ఏమిచేయుటకు దోచక డోలాయమానమానసుడాయెను. ముందురానున్న ఘోర విపదాంధకారచ్ఛాయ లాతని మనోక్షేత్రముపై గ్రమ్ముకొన జొచ్చెను. తాను గొప్ప మోసమునకు లోనైతిననియు, తన్ను సర్వనాశన మొనర్చువరకు కుంపిణీవారు తృప్తినొందరనియు నబాబుకు స్పష్టమయ్యెను. కాని, ఇట్టి విపత్తు అంత త్వరలో అతనిపై వచ్చి పడునని ఆతనికి కొంచెమైనను తెలిసి యుండినచో ఆతడు తగు జాగ్రత్తలో యుండి యుండెడివాడు. కుంపిణీవారు దేశాక్రమణాకై, క్యయమునకు కాలు ద్రివ్వ దురాగతపు ఎత్తులకు సురాజుద్దాలా అంత సులభముగా అంగీకరించువాడుకాడను సంగతి కుంపిణీవారికి పూర్తిగ తెలియును. కావున, బహిరంగముగా గాక, రహస్యముగ నవాబు కొలువులోని వారిని కొందరిని చీలదీసి, వారికాశలు గొలిపి, వారితో రహస్యపు టొడంబడికల గావించుకొని, తమ "ప్రాణ స్నేహితుడగు" నబాబును బంగాళా సింహాసనమున నుండి తల్లకిందుగా పడద్రోయవలెనని క్లైవు కంపెనీవారికి సలహా చెప్పెను.

తన పినతండ్రికున్న మనస్థైర్యము, పాలనాదక్షత సురాజుద్దాలాకు లేనందున అతని రాజ్యము ప్రజారంజకముగా లేకుండెను. ప్రజలయందు అసంతృప్తి వ్యాపించెను. తన దర్బారులోనే తనచుట్టు మోసగాండ్రును, స్తోత్రపాఠకులును, దొంగస్నేహితులును గుమిగూడియుండిరి. ఇంగ్లాండులో

రెండవ జేమ్సు రాజునకువలెనే యీతని ప్రధానోద్యోగులును, బంధువర్గములోనివారును, ప్రాణమిత్రులని చెప్పుకొనువారును, యితనిని ఏక్షణము పట్టిన ఆక్షణమందు విడిచిపెట్టి పోవుటకు సిద్ధముగానుండిరి. రాజ్యమందు విప్లవమును అల్లకల్లోలమును గూడ తెచ్చిపెట్టుటకు జేమ్సు రాజు కాలములోని పరిస్థితులే ఇక్కడ గూడ నుండెను. కాని, బ్రైటనుండి సహాయము వచ్చువరకు ఇతని రాజ్యములోని వారు పైకి యేమాత్రమును కదలుటకు సాహసింపలేదు. కాని, బ్రైటనుండి యేమాత్రము సహాయము లభించినను నవాబు యొక్క సైన్యములో సగమువంతు చీలిపోవుటకు సదా సిద్ధముగా నుండెను. అంతటితో వారనుకొనిన పని సులభముగా పూర్తి యగుటకు అవకాశముండెను. ఈ విధముగా సురాజుద్దౌలాను రాజ్యమునుండి కూలద్రోయుటకు ఆతని యుద్యోగస్థులే కుట్రపన్న నారంభించిరి. ఈ కుట్రకు నబాబు మేనత్త మగడు 'మీర్జాఫరు' ప్రధాననాయకుడుగా నుండెను. ఈ రీతిగా, కుంపిణీవారు రాజబంధువులలో నొకరిపై నొకరిని ఉసుగొల్పి దేశీయరాజ్యముల కూలద్రోయ జొచ్చిరి! 'మీర్జాఫరు' నవాబునకు సైన్యాధిపతిగ నుండెను. సురాజుద్దౌలాను కూలద్రోసిన యెడల బంగాళా రాజ్యము తనకు కట్టిపెట్టెద మని క్లైవు మీర్జాఫరుకు ఆశగొల్పెను. ఈ ఆశకు లోనై మీర్జాఫరు క్లైవుతో చేరెను. క్లైవు ఆకస్మికముగ వచ్చి నవాబు సేనలపై పడునట్లును, అప్పుడు నవాబు సేనలలో పెక్కింటిని తాను క్లైవు వైపునకు తిరుగదీసికొని



నబాబు సురాజ్ ఉద్దౌలా—(హతభాగ్యుడు.)

వచ్చునట్లును మీర్జాఫరు క్లైవుతో బాసచేసెను. ఈ కుట్ర పైకి తెలియకుండుటకును, రాజ్యచ్యుతి బొందనున్న నష్టభాగ్యుడగు సురాజుద్దౌలాకు యీ విషయమై యెట్టి అనుమానములు నైతము తట్టకుండునట్లును, క్లైవు పడినపాట్లు ఇంతింతయని చెప్పనలవిగాదు. ఆతడు యీ కుట్ర కాలమందు వ్రాసిన యుత్తరములలో ఆతని తెలివితేటలు, మంత్రాంగశక్తి, యెవరికైన విడ్డూర్యము గొలుపక మానవు. తమకును నవాబుకును "అత్యంతమైత్రియు, ప్రేమయు, ఒలికిపోవుచున్న" దని క్లైవు ఒక ఉత్తరములో వ్రాసెను. ఆ రాత్రి నవాబును ఇక కూల ద్రోయబోవుచున్నారనగా ఆతనికి కించిత్తైనను అనుమానము కలుగకుండ నుండుటకై, క్లైవు ఆ పగలు నవాబుకు బహు తియ్యనిమాటలతో జాబు వ్రాసెను. ఈ జాబు వలన "ఆతనికి మనయెడ యెట్టి కోపమున్నను శాంతించునట్లుగా వ్రాసితి" నని క్లైవు చెప్పుకొనుచున్నాడు. కోపమా! ఎందులకు? మనయెడ నాతనికి కోప ముండవలసిన కారణమేమి? మన మేమైన తప్పులు చేసినామా? మన మాతని యెడ చేసినతప్పులేమి? కాలహారణము చేసిన యెడల యీ కుట్ర బైటపడునేమో యని కంపెనీ యుద్యోగస్థులు మిక్కిలి భయపడ జొచ్చిరి. క్లైవు యీ రహస్యపు సంగతులను కాగితము మీద వ్రాయవలదనియు, అట్టి రహస్యములను నమ్మకస్థులగు గూఢచారుల వలన కబురంపించుచుండ వలసినదనియు, కంపెనీ యుద్యోగస్థులు

క్లైవును మరిమరి బ్రతిమాలుకొనిరి. కాని ఆతనికి ఆ భయమేమి యు లేకుండెను. ఈ "కుబుద్ధుల" పిరికిమాటలకు ఆతడు నవ్వి యథారీతిని తనయిష్టము వచ్చినట్లే చేయసాగెను. 1757 సం॥ జూను 13 వ తేదీన, సర్వము సన్నద్ధమయ్యెను. నవాబు మీాదికి దండు నడువనారంభించెను. డోలాయమాన మానస ముతో యేమి చేయుటకు తోచక, చికాకుపడుచు, సురాజు ద్దౌలా శత్రుసైన్యముల నెదుర్కొనుటకు తాను కూడ వెడ లెను. మిర్జాఫరు తన క్రింద నున్న నవాబు సేనలతో వచ్చి "కట్వా" గ్రామమువద్ద కుంపిణీ సేనలతో చేరునట్లు లోగడ యేర్పాటు జరిగి యుండెను. కాని, కుంపిణీ సేనలు ఆ గ్రా మము చేరునప్పటికి అనుకొన్న ప్రకారము మీార్జాఫరు సేనలు వచ్చి యుండలేదు. అంతటితో క్లైవుకు గాబరాపుట్టెను. మీార్జాఫరు సైన్యములతో వచ్చుటకుబదులుగా ముందు యుద్ధ రంగమున తోడ్పడెదనని క్లైవుకు చీటిమాత్రము వ్రాసిపంపెను. కాని, ద్రోహచింతతోకూడుకొన్న క్లైవుకు లోకమంతయు ద్రోహముగానే కనిపించెను. మిర్జాఫరు చీటీలోనిమాటను ఆతడు నమ్మలేకపోయెను. అప్పుడు అచ్చటనున్న కుంపిణీ సేనా నాయకు లందరు కూడబడి తక్షణము వెనుకకు పారిపోవుద మనియు, లేని యెడల తమ కొద్దిసైన్యము తుత్తునియలై పోవు ననియు యోచించిరి. క్లైవు కూడ మొదట యేమిచేయుటకు దోచక తటపటాయించెను. కాని తిరిగి తనలో తా నాలో చించుకొని తనకుతానే ధైర్యము తెచ్చుకొని ఏమైనను సరే

మీర్జాఫరుమాట నమ్మరాదమనియు, యుద్ధరంగమున ఏమైనను సరే పోరాడుదమనియు క్లైవు నిశ్చయించుకొనెను. ఇట్టి నిశ్చయముతో, వేయిమంది ఐరోపీయ సైనికులును, 2,100 సిపాయిలును గల తన చిన్నసైన్యముతో ముందునకు సాగి, రాత్రి రెండుజాములు దాటినపిమ్మట 'ప్లాసీ' యను చిన్న కుగ్రామము చేరిరి. అచ్చట నవాబు సైన్యములు 50 వేలు పదాతులు, 18 వేల గుఱ్ఱపు దళములు, 50 ఫిరంగులు, కందకముల వెనుక రక్షితులై బలిసియుండిరి. జూను 23 తేదీన పొద్దు పొడుచుసరికి నవాబుసైన్యములు కందకముల విడిచి శత్రుసైన్యములపై బడెను. యుద్ధవిూరీతిగా ప్రారంభమైన కొంచెము సేపటిలోనే మీర్జాఫరు తన క్రిందనున్న పెక్కుమంది గుఱ్ఱపు దళములతో చీలి కుంపిణీసైన్యములకు సాయము చేయబోయెను. ఇంతటితో కథ అడ్డముగా తిరిగెను. యుద్ధరంగమందు — భారతదేశమందు — కుంపిణీవారి అదృష్టరేఖ బైటపడెను. ఒక్కుమ్మడి, కుంపిణీ సైన్యములు హూంకరించి నవాబు సైన్యముల నెదుర్కొనునట్లు క్లైవు సింహనాదము చేసెను. స్వపక్ష సైన్యమున గలిగిన ద్రోహముచే నవాబు సైన్యములు ధైర్యము చెదరి, స్థైర్యమును గోల్పోయి, చిందరవందరయ్యెను. నవాబు రెండు వేల సైన్యముతో పారిపోయి తన రాజధానిచేరెను. కాని అక్కడ హతభాగ్యుడగు యీతనికి మిత్రులు కరవైరి. అంతట వికల మనస్కుడై ఫకీరు వేషముతో తనను బాయలేని ఇరువురు సేవకులు వెంటరా తనకు సాయబడ వచ్చుచున్న ఫ్రెంచివారితో చేరుటకై

కాలినడకను పోవుచుండెను. కాని, మధ్యత్రోవలో శత్రువు లీతని గుర్తించి పట్టుకొని రాజధానికి తీసికొనివచ్చి, అచ్చట హాతము గావించిరి.

జంతువు పడెను. చర్మము ఒలుచుకొని తినుటయే తడవుగా నుండెను. క్లైవు కతిపయ సైన్యముతో జూను 25 వ తేదీన రాజనగరు ప్రవేశించెను. 29వ తేదీన బంగాళా, బీహారు, ఒరిస్సా రాజ్యములకు మీర్జాఫరుఖాను నబాబుగా సింహాసన మందు కూర్చుండపెట్టబడెను. ఈ పదవికి తాను వచ్చుటకై కుంపిణీవారు పెట్టిన ఖర్చుల బిల్లును (జాబితాను) క్లైవు మీర్జాఫరు యెదుట బెట్టెను. ఈ బిల్లు మిక్కిలి భారముగానుండెను. కుంపిణీ ఉద్యోగస్థులు తమస్వంతమునకుగాను పన్నెండు లక్షల ఎనభైవేల రూపాయలు అక్కడ పెట్టమనిరి. ఆ ప్రకారము మీర్జాఫరు చెల్లించుకొనెను. ఈ మొత్తములో డ్రేకు, క్లైవు గార్లు చెరి రెండు లక్షల ఎనభై వేల రూపాయిలు తీసికొనిరి. వాట్సు, బీచరు, కిల్పాట్రికుగార్లు తలొక రెండు లక్షల నలభై వేలుపుచ్చుకొనిరి. ఇవిగాక, క్లైవు అదనముగా లక్షా అరవై వేల మొహిరీలు క్రొత్త నవాబు నుండి బహుమతిగా తీసికొనెను. ఇంత విపరీతపు బహుమతిని యేల తీసికొంటివని పార్లమెంటు వారు తదుపరి సీమలో క్లైవును అడిగినపుడు "నవాబు రాజధానియగు మూర్షిదాబాదు ఖజానాలో కోట్లకొలది రత్న రాసులు పడియున్నవి. ఇంత తక్కువ ఎందుకు తీసికొంటినా యని నాకే ఆశ్చర్యమైనది" అని జవాబు చెప్పెను. ఈ

సమాధానముతో అక్కడి పెద్దలందరు సంతృప్తిపడిరి. క్లైవు నిజముగా డబ్బుయందాస లేని వాడనే నమ్మిరి. ఇందలి ధర్మ సూక్ష్మమును, ధర్మశాస్త్రజ్ఞులే నిర్ణయింతురు గాక ! కాని, చేతినిండ డబ్బుదొరికి పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొనుటకు వీలుగా నున్నయెడల దేశములో అంతఃకలహముల గల్పించుట కంటె లాభకరమగు మంచి వ్యాపారముండ బోదని యీ చరిత్రవలన మాబోటి సామాన్యప్రజలు ఊహించుకొందురులెండి! కంపెనీ యుద్యోగస్థులు యీ విధముగా ప్రైవేటుగా జేబులోవేసికొన్న 12 లక్షలపై చిలుకు గాక, కంపెనీకి కోటిరూపాయలును, లోగడ నవాబు కలకత్తా నాక్రమించుకొన్న రోజులలో అందలి యిరోపియనులకు గలిగిన యిబ్బందికి పరిహారముగ వారికి 50 లక్షలును, ఆర్మీనియనులకు 20 లక్షలును, సైన్య నౌకాదళములలోని వారికి సంభావనలు పంచిపెట్టుటకు 50 లక్షల రూపాయిలును దాఖలు చేసికొన వలసినదని కుంపిణీవారు నవాబును కోరిరి. ఈ మొత్తములు అంతయు కలసి వెరసి 26,97,750 నవరసులయ్యెను. ఈ మొత్తములన్నియు చెల్లించుటకు నవాబు ఖజానాలో తగినంత ధనములేకుండెను. చాల దినములు కుంపిణీ యుద్యోగస్థులకు నవాబుకు పెనుగులాటలు జరిగిన తరువాత తుదకు యీ మొత్తములో సగము తగ్గింపబడెను. ఈ ప్రకారము ఫైసలు చేసికొన్న మొత్తములో 5 లక్షలు రొక్కముగను, మిగిలిన మొత్తము రత్నములు, జవాహిరీ (నగలు) రూపముగను నవాబు చెల్లించుకొనెను.

ఈ నాటక మంతటికి రక్తి కట్టింపగల రంగము ముందున్నది. సురాజుద్దౌలాపై పన్నిన కుట్రలో మీర్జాఫరుతో పాటు "ఓమిఛందు," "జగత్సేటు" అను ఇరువురు షాహుకారులు గూడ షరీకుగానుండిరి. ఆరోజులలో వీరు రాజులతోను నవాబులతోను యెక్కువ స్నేహమును, పలుకుబడిని గలిగియుండిరి. వారివద్ద కుబేరసంపద కలదను ప్రతీతి ఆకాలమందుండెను. అయినను వారి సంపద కెట్టి యిబ్బంది లేకుండ భద్రముగ నుండెను. వారికి ఆనాటి ప్రభుత్వములతో రాజకీయ సంబంధమగు పలుకుబడియు నుండెను. అజ్ఞానులు కొందరు చెప్పునట్లు ఆనాటి ప్రభుత్వములు నిజముగ యథేచ్ఛాపరులగు నిరంకుశ ప్రభువులచే పాలింపబడుచు క్షణభంగురములై శాంతిభద్రతల గాపాడ నసమర్థములేయై యుండియున్నచో, ధనాఢ్యులగు నిట్టి షాహుకార్ల కెట్లు భద్రతయు, పలుకుబడియు నుండియుండెడిది? కావున అట్టి అజ్ఞానుల వాదము సరికాదని చెప్పుట కిదియే ప్రబల నిదర్శనము. పరపతియను నది చాల సున్నితమైనది. దాని కెట్టి ముప్పము రాకుండ కాపాడవలెనన్నచో సూక్ష్మగ్రహణ శక్తియు బలిష్టమునునగు నాగరక ప్రభుత్వ ముండవలెను. దేశమందు యేమాత్రము దౌర్జన్యముగాని అల్లకల్లోలము గాని పుట్టినయెడల వడ్డీవ్యాపారమునకు యెంతయో ముప్పముకలుగును. ప్రభువులు నిరంకుశముగ వర్తింపదలచినంత మాత్రముననే యీ వ్యాపారము నశించుననుట నిశ్చయము. ఇండియా దేశమునుండి సీమకుతీసికొనిపోయి అద్దపు టిండ్లలో భద్రముగా పెంచు మొక్కల శోభ, వానిని

బయటకు తీసికొనివచ్చిన యెడల అచ్చటి అతిచలిచే ఎట్లు క్షణములో మాడిపోవునో, అట్లే ఆకాలమునాటి భారతవర్ష పు షాహుకార్లకు రాజులరక్షణయే యుండియుండనియెడల వారు కూడ దండగీడుల దురాగతములకు ఎరయై వారిధనధాన్య సంపత్తిని యెన్నడో గోల్పోయియుండెడివారు. వారికీ రాజ్యాంగమందెట్టి పలుకుబడియు నిలిచెడిదిగాదు. ఈ షాహుకార్ల ధనమంతయు చాలవరకు ప్రజలలో రాజు మొదలు రంగప్పవరకు అన్ని తరగతులవారియొద్దను హామీా అప్పులుగ నిలచియుండెననుటవల్ల వారికాకాలమందుగల నిర్భీతియు భద్రతయు తేటతెల్లమగుచున్నది. ఈషాహుకార్ల సహాయము లేనిదే ఆరోజులలో యేరాజ్యాంగమును పెద్ద పెద్దపనులకు పూనుకొనెడిదిగాదు. రాజ్యచక్రమును త్రిప్పు మంత్రులు వీరిసహాయమును సదా అపేక్షించుచుండిరి. రాజులును వీరల మొగమోటమును అపేక్షించుచుండిరి. రాజ్యములలోని లోతుపాతులను విశేషరహస్యములను తెలిసికొనుటకు అందరికంటె వీరి కెక్కువ అవకాశము లుండెను. రాజ్యముల మధ్య మంత్రాంగముల నడపుటకు వీరు మంచి రాయబారులుగ పనికివచ్చుచుండిరి. వీరు సాధారణముగ, మోసమునకు లోనయ్యెడివారుగారు. అందుచేతనే సురాజుద్దౌలాను కూలద్రోయ సంకల్పించిన కుట్రదారులకు మూర్షిదాబాదునందున్న "జగత్సేటు" ను కలకత్తాయందు వ్యాపారము చేయుచున్న "ఓమిచందు" ను అవసరమైరి. ఈ కుట్రలో యీయిరువురు షాహుకార్ల నెట్లయిన కలుపుకొనుటకు

కుట్రదారులు ఆత్రపడిరి. ఓమిచందుకు అత్యంతమగు దురాశను కల్పించిరి. అతడు తక్షణము యీ కుట్రలో చేరి అందరి రహస్యములనెల్ల పూర్తిగా గ్రహించెను. అందుచే కుట్ర దారులకు యీతడు లేకుండ యేపనియు సాగదయ్యెను. నవాబునొద్దకు ఎప్పుడుపట్టిన అప్పుడు పోవుటకు ఇతనికి సంపూర్ణ అవకాశము లుండెను. నవాబునూ ఇతని మాటలను విశ్వసించుచు, యితనిని తన అంతర్యములోని వాడుగా భావించుచుండెను. ఈ ప్రకారము యిరుపక్షముల రహస్యములును యీతని వశమై యుండుటచే, ఇరువురను బెదిరించి కావలసినంత ధనము లాగుకొనవచ్చునని యీతనికి దురాశయు, దురాగతపు టాలోచనలును మెండయ్యెను. "నవాబును కూలదోసిన పిమ్మట వచ్చుధనములో విశేషభాగము తనకే ఇవ్వవలసినదను షరతును మిర్జాఫరుకును కుంఫిణీవారికిని జరుగు ఒడంబడిక పత్రములో ఖచితముగ వ్రాయవలసిన దనియు, లేని యెడల యీ కుట్రనంతయు బైట పెట్టెదననియు" ఓమిచందు బెదరించెను. ఆ పరిస్థితులలో అతనిమాటనే చెల్లుబడిగావలసి యుండెను. అతడు చెప్పినట్లు ఒప్పుకొనుట తప్ప వేరు మార్గము కుంఫిణీవారికి తక్షణమందు కనుపించలేదు. ఇట్టి సందిగ్ధావస్థలనుండి తప్పించుకొనుటకు చదరంగపు ఎత్తుల వేయుటలో క్లైవు పెట్టినదిపేరు. తక్షణమే యీతడు రెండు పత్రములను—ఒకటి తెల్లకాగితము మీదను, ఇంకొకటి ఎర్ర కాగితముమీదను— వ్రాయించెను. ఒకదానిమీద ఓమిచందు కోరిన షరతును ఉదాహరించిరి; రెండవదానిలో విడి

చిపెట్టిరి. ఈ రెండు కాగితములమీాద ఉభయ పక్షములవారు సంతకముల పెట్టిరి. కాని యీా మోసమునకు "వాట్సను" సంతకము పెట్ట నిరాకరించెను. "వాట్సను" సంతకము లేని యెడల ఓమిచందు అనుమానపడు ననుభయముచే "వాట్సను" సంతకమును క్లైవు ఫోర్జరీ చేసెను. పాపము! ఈ మోసము తెలియని ఓమిచందు అంతటితో సంబరపడెను. కాని, నవాబు రాజ్యములో కొల్లగొట్టిన ధనమంతయు పంచుకొనవలసిన సమయము వచ్చినపుడు తనకు వ్రాసియిచ్చిన పత్రములో ఓమిచందు కోరినషరతు "లేదు పొమ్మ" ని క్లైవు దుబాషీ ద్వారా ఓమిచందుకు చెప్పించెను. "నీపేరుదహారించిన పత్రము దొంగపత్రము, పో! దురాశగా నీ వెక్కువసొమ్మడిగినావు. గావున నీ కసలే దమ్మిడీయైన యీాయము. పో! అని క్లైవు ఓమిచందుకు చెప్పించెను. తన మానసవీథియందు కల్పించుకొనిన కాంచనరమ్యహర్మ్యములన్నియు ఒక్కుమ్మడి యిట్లు కూలిపోవుటచే ఓమిచందు నిశ్చేష్టుడై నేలకూలెను. కొంత సేపటికి నెమ్మదిగా మూర్ఛ తెలిసెను. కాని ఆతడు మరణించువరకు మతిదప్పి పిచ్చివాడై తిరుగుచుండెను.

కలకత్తాకోట తిరిగి కంపెనీ వారికి స్వాధీనమయ్యెననియు సంధి పొసగెననియు వార్త ఇంగ్లాండు చేరగానే అచ్చటివారందరికి సహజముగా సంతోషము పట్టరానిదయ్యెను. కంపెనీ డైరెక్టర్లును మంత్రులును, యీా వార్తను ప్రకటింపగనే దేశమంతటను ప్రజలు సంతోషపారవశ్యమున నోలలాడిరి. కాని,

ఇందలినిజము మాత్రము ప్రజలకెవరికిని చెప్పకుండచాలకాలము దాచి యుంచిరి. నూతనరాజ్య లాభముచేతను, విజయోత్సాహము చేతను వారికండ్లు మిరుమిట్లుగొనెను. ఆకాలమందు రాజ్యము చేయుచున్న రెండవజార్జి రాజును, అతని మంత్రులును, కుంఫిణీ డైరెక్టర్లును ప్రజలతోపాటు తమకును నిజము తెలియదని నటింప గలిగిన యెడల ఇట్లు మోసపుచ్చబడిన ఆంగ్లజాతి యొక్క సచ్చారిత్రమును ఆంగ్లప్రజల కీర్తియు నిష్కళంకముగా నుండెడిది.



## భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన



## నాల్గవ అధ్యాయము

(దోపిడీ రోజులు.)



[“అజేయమగు భుజబలముతో కూడుకొని నాగరికములని చెప్పుకొను రాజ్యాంగములు దయాదాక్షిణ్యములు లేక ప్రవర్తించు నెడల లోకమున కంతకంటె భయానకమగు ఘోరవిపత్తు ఇంకొకటి యుండబోదు. అట్టి విపత్తు బంగాళారాజ్యమందు సంభవించియుండెను. లోకమందు అన్ని నిరంకుశ ప్రభుత్వములకును ఒకకొంత అదుపుగలదు. అది సంపూర్ణమగు అదుపు కాకపోవచ్చును. దానియందుగూడ గొన్ని లోపములుండవచ్చును. దానివలన గొంత హానిగూడ కలుగవచ్చును. అయినను సంఘము అధోగతిపాలు కాకుండ మాత్రము రక్షించుటకు అవకాశ ముండును. ప్రభుత్వములు నిరంకుశముగ పాలింపజొచ్చినపుడు ప్రజలు యీపీడను సహించి పడు కష్టములకంటె ప్రభుత్వముపై యెదురుతిరిగి అందువలన కలుగు కష్టనష్టముల భరించుటయే సులభమనుబుద్ధి ప్రజలలో ఒకానొకప్పటికైనను పుట్టును. ప్రజలలో అత్యంతముగా గలిగిన భీతియే ఒక విధమగు ధైర్యముగ పరిణమించును. ప్రజల రౌద్రోద్రేకము ఒక్కుమ్మడి తరంగితమై లోక కంటకులను

రాజులను ముంచివేసి ప్రజల మొర్రపనకుకూడ మితిగలదు సుమా యని వారలకు నచ్చజెప్పును. కాని ఆ కాలమందు బంగాళాను వేధించిన దుష్ప్రభుత్వము ఎవరుగాని ఎదుర్కొనుటకు వీలులేనిదై యుండెను. తమను పీడించుచున్న వారి ఉత్కృష్ట శక్తియుక్తులు సామాన్య ప్రజలకు వారింప శక్యముగానిదిగా నుండెను. బంగాళీలకును, ఆంగ్లేయులకును జరుగు పోరాటము గొర్రెలకును తోడేళ్ళకును జరుగు పోరాటమువలె నుండును." మెకాలె.]

మీర్జాఫరుకును కంపెనివారికిని జరిగిన ఒడంబడిక నోటిమాటలవలన గాక, కాగితముమీద 13 షరతులుగా 1757 సంవత్సరము జూను నెలలో జరిగియుండెను. అందలిషరతులకు తప్పమని అల్లా మహమ్మదుల పేర్లు చెప్పి మీర్జాఫరును, ఏసుక్రీస్తు బైబిలుపేర్లు చెప్పి కుంపిణీవారును, ప్రమాణములు చేసిరి. కంపెని తరఫున సేనాధిపతియగు క్లైవును, నౌకాదళాధిపతియగు వాట్సనును, గవర్నరగు డ్రేకు, వాట్సు గార్లును యీ పత్రముపై సంతకములచేసిరి. "బంగాళా బీహారు, ఒరిస్సా రాష్ట్రములపై నవాబుపదవి మీర్జాఫరుఖాన్ బహాదరు గారికి లభించుటకుగాను తమ సర్వశక్తులతో కుంపిణీవారు సహాయపడునట్లును, తరుపరి, కోరినప్పుడెల్ల నవాబు యొక్క శత్రువులపై పోవుటకు నవాబుకు తోడ్పడు చుండునట్లును" కుంపిణీవారు సదరుపత్రములో ఒప్పుకొనిరి. ఇందుకు ప్రతిఫలముగా నవాబు ఈ క్రిందిషరతుల కంగీకరించెను. కుంపిణీవారితో నేస్తము గట్టి, ఫ్రెంచివారికి గల యావదాస్థులను తాగీరాని కుంపిణీవారి కిచ్చునట్లును, తన రాజ్యములో ఫ్రెంచివారికి నిలువ నీడలేకుండ చేయు నట్లును, ఇదివరలో నిర్ణయిం

చుకొన్నరీతిని నవాబే అన్నిఖర్చులు భరించునట్లును, కలకత్తా కోటచుట్టు 600 గజముల మేర వారి కిచ్చునట్లును, కలకత్తాకు దక్షిణముననున్న ప్రదేశమంతటిపై రెవిన్యూ వసూలు చేయు అధికార మిచ్చునట్లును, తన కొలువులోనున్న రోజులలో కుంపినీ సైన్యముల ఖర్చంతయు నవాబే భరించుటకును, హుగ్లీనదికి దక్షిణమున నవాబు యెట్టి కోటలను కట్టగూడదన ట్లును నవాబు అంగీకరించెను. ఈ ఒడంబడిక యొక్క సిరాకు వెనువెంటనే మాసిపోవ జొచ్చెను. డబ్బిచ్చునంతవరకే కుంపిణీ వారు నేస్తము జూపుచుండిరి. తాను మిత్రులని నమ్మి యుండిన కుంపిణీవారు పయోముఖవిషకుంభములని రాను రాను నవాబుకు తెలియవచ్చెను. ఎంతయెక్కువగా లెక్క వేసికొనినను ఇండియాయందు దురాశావశులగు కొందరు యూరోపియనులు అనుకొనినట్లు అంతులేని బంగారపుగనులు లేవు. విదేశీయుల దండయాత్రల వలనను, అంతఃకలహముల వలనను ప్రజల వృత్తులకు హానికలిగి దేశసంపద క్షీణించెను. అందుచే నవాబున కాదాయము తక్కువై ఒడంబడికలో అను కొన్న ప్రకారము నవాబు కంపెనీవారికి సొమ్ము చెల్లింపలేక బకాయిపెట్టెను. మీర్జాఫరు యుద్ధరంగమందు పోరాడగల యోధుడేగాని డబ్బును కూడబెట్టగల ఆర్థికవేత్త గాడు. కుంపిణీ వారు తమ సొమ్ము "తే, తెమ్ము" ని, లగాయింప సాగినప్పుడు, ఇదివరకే పన్నులభారముచే కుంగుచున్నప్రజలపై మరిగొన్ని పన్నులు వేయుటతప్ప ఆతనికే యింకొక మార్గము తోచలేదు. ఇంకొకప్రక్కను నెలజీతములు సరిగా ముట్టుటలేదని సైన్య ములు తిరుగుబాటుచేయ మొదలిడెను. ఎక్కడజూచినను

రాజ్యాంగమంతయు చీలలూడిన బండివలె సాగకుండెను. అయి నను, కలకత్తా ఉద్యోగస్థుల వత్తిడి తగ్గలేదు. ఈ వత్తిడికి సహింపక, కుంఫిణీవారిచే నవాబుగా చేయబడిన మిర్జాఫరు ఖాన్ సదరు కుంఫిణీవారిని కడుపుమంటచే దూషింప సాగిం చెను. ఇది ఇట్లుండ ఢిల్లీపాదుషా కుమారుడగు "షహాజదా" యను నతడు అయోధ్యనవాబుతో గలసి బంగాళాపై దండె త్తెను. మొదట నేర్పరచుకొన్న షరతుప్రికారము కుంఫిణీ వారు మిర్జాఫరుకు సహాయముచేసిరి. అయోధ్యనవాబు క్లైవుకు హితుడగు కల్నలుఫోర్డుచే పూర్తిగా ఓడిపోయి చాల నష్టపడి వెనుకకు మరలెను. దీనివలన దేశీయుల దృష్టిలో బ్రిటిషువారి పరాక్రమము, ప్రతిష్ట మరింత హెచ్చయ్యెను. కొలదిమంది విదేశీయులు దేశమందు ధైర్యసాహసములతో చొరబడి రాజదుర్గముల భేదించి రాజ్యాంగమును అవలీలగా వశపరచుకొనుట చూచినప్పుడు ప్రజలకు మరింత ఆశ్చర్యము గలిగెను. క్లైవుయొక్క ధైర్యసాహసములకు మెచ్చి మిర్జా ఫరు యీతనిని తన దర్బారులో నొక "ఉమ్రావు" గా నియ మించెను. ఈ క్రొత్త పదవికి తగిన దర్జా నిలుపుకొనుటకు గాను తనకు పెద్దజాగీరున్న గాని వీలులేదని క్లైవు పట్టు పట్టెను. అంతట నవాబతనికి సాలునకు 27 వేల నవరసుల రాబడిగల జాగీరునిచ్చెను.

ఈ లోపుగా దక్షిణాదిని అదృష్టము తిరిగినది. బహు ప్రజ్ఞావంతుడును, అపూర్వ సాహసికుడును అగు "లాలి" యను నతడు ఆ కాలమందు ఫ్రెంచి సేనానిగా నుండెను.

ఇదివరకు ఫ్రెంచివారికి గలిగిన నష్టముల నన్నింటిని కూడ దీయుటకు యీతడు ప్రతిజ్ఞపట్టెను. ఈతని ప్రతిజ్ఞ నెర వేరునట్లుగూడ గాన్పించెను. ఇంగ్లీవారి "దేవిడుకోట" పట్టుబడెను. మదరాసు ముట్టడింపబడెను. కాని సమీప ముననున్న "కాండూరు" వద్ద జరిగిన యుద్ధములో ఫ్రెంచి వారు పూర్తిగ నోడిపోయిరి. అంత అడ్మిరలు "పోకాకు" వచ్చి మదరాసును విడిపించెను. తదుపరి 1759 వ సంవత్స రము 7 వ ఏప్రిలు తేదీన "ఫోర్డు" సేనాని మచిలీపట్టణ మును ముట్టడించి పట్టుకొనెను. సైనికులు చాల ధనమును దోచుకొనిరి. అప్పటినుండి కోస్తా వెంబడి 80 మైళ్ల పొడు గును 20 మైళ్ల వెడల్పును గల ప్రదేశమునకు నైజాము ఒప్పా దలతో కుంపిణీవారు శాశ్వత హక్కుదారులైరి.

మీర్జాఫరు తాను బొందిన సైనిక సహాయమునకు గాను విదేశీయులకు యెక్కువగా ఋణగ్రస్థుడై, తన రాజ్య మందు వచ్చు ఆదాయము నంతను వారికి తనఖాయియుం చుటవలన తాను ప్రజల దృష్టిలో న్యూనత పొం దవలసి వచ్చుటకు మనస్సునందు చాల గుందు చుండెను. అయినను తనయొక్కయు తనవంశము యొక్కయు దర్జాను యెట్లో నిలుపుకొనుచుంటినిగదా యని మనసులో సమాధానపడుచుండెను. కాని, తానుఇంతవరకు అవి వేకముతో మితిమించి ఎవరిని నమ్మియుండెనో వారే తనను తన వంశమువారిని రాజ్యభ్రంశము నొందింప రహస్యముగా కుట్రలు పన్నుచున్నారని పాపము, ఆతడు తెలిసికొనలేదు. 1759 వ సంవత్సరము జనెవరి 7 వ తేదీన క్లైవు సీమలోని పిట్టు

మంత్రికిట్లువ్రాసెను. "నవాబు పరిపాలన చాల లోపభూయిష్టముగా నున్నది. అతనితో సులభముగ గిల్లికజ్జా పెట్టుకొనవచ్చును. నవాబు కుమారుడు "మీరాన్" మన యెడ చాల విరోధముగా నున్నాడు. ఇతనిని రాజ్యమునకు రానిచ్చుట మనకు చాల అపాయకరము. రెండువేల యూరపియనులతో రాజ్యమును మనమే కాజేయవచ్చును. ఈ పని చాల భారమైన పనియని అనుకొనవద్దు. దీనిని ఆధారము చేసికొని ఇకముందు అనేకరాజ్యములను స్వాధీనపరచుకొన వచ్చును. ఇంత, కోట్లకొలది జనులతోడను, ధనరాసులతోడను తులదూగుచున్న దేశము మనస్వాధీనమందున్న యెడల సీమలో మన ప్రభుత్వమునకున్న ఋణభారము గూడ చాలవరకు సులభముగ తగ్గింపవచ్చును." ఈ లేఖను క్లైవు తన అంతరంగిక కార్యదర్శి యగు "వాల్షు" చేత మంత్రికి పంపించెను. ఈ లేఖను గూర్చి మంత్రిపడిన యభిప్రాయమును "వాల్షు" వ్రాసగుర్చినట్లు చెప్పుచున్నాడు. "ఈ భారతదేశమందు రాజ్యభారమును చక్రవర్తి పేరిట వహించుటకు పిట్టు మంత్రి మొదట అంతగా యిష్టపడలేదు. ఈ నూతన రాజ్యము వలన వచ్చురాబడి యంతయు పార్లమెంటునకు చెందక స్వంతముగా చక్రవర్తికే చెందవలయునను వివాదము వచ్చునేమో యని యాతడు భయపడెను." అదిగాక కుంపిణీవర్తకులకు విశేషధనము లభించి, అందువలన వారుకూడ దేశమందు పేరు ప్రఖ్యాతులు గణించినయెడల, అదివరకు జన్మతః ప్రభుస్థానముల నలంకరించి చిరకాలమునుండి రాచకీయాధికారము నంతను తామొక్కరే మిరాశీగా యనుభవించుచున్న ప్రభు

సంతతుల వారందరికి యీర్ష్య జనించునేమోయను అనుమానము కూడ పిట్టుమంత్రికి యుండియుండవచ్చును. ఇట్టి యనుమానము నిరాధారము గాదు. ఏలననగా యిండియాలో లభించిన భాగ్యములతో సీమలోని సామాన్య ప్రజలు వేష భాషలయందు ప్రభువుల ననుకరించుచు తమ ధన బలిమిచే పార్లమెంటునందు పలుకుబడిని, అధికారమును సులభముగా సంపాదించుకొనుచున్నప్పుడు జన్మతః ప్రభువులై పుట్టిన వారికి యెంతసులభముగ ఈర్ష్యజనించెనో తదుపరి చరిత్రవలన స్పష్టము గాగలదు.

1760 వ సంవత్సరము ఫిబ్రవరిలో క్లైవు ఇండియాను విడిచి వెళ్ళెను. తన యత్యద్భుత సాహసకార్యములవలన గడించుకొనిన ప్రఖ్యాతిని, విశ్రాంతిని హాయిగ అనుభవించుటకై ఆతడు స్వదేశమును చేరెను. కంపెనీ డైరెక్టర్లు ఆతనికి రత్నముల పిడిగల ఖడ్గమును బహుమతి చేసిరి. మూడవ జార్జిరాజు ఆతనిని ప్రభువర్గములోనికి చేర్చుకొనెను. ఆతని సౌశీల్యమునకు, ఆత డొనర్చిన ఘనకార్యములకు, రాజతని నెంతయో మెచ్చుకొనెను. పిట్టుమంత్రి పార్లమెంటు సభాముఖమున యీతనిని మిక్కిలి ప్రశంసించెను. క్లైవున కిప్పుడు 40 వేల నవరసుల ఆదాయ మేర్పడెను. ఈ నడమంత్రపు సిరితో నీతిబాహ్యమగు జిల్లాల ఓట్లనుకొని తన పార్టీవారితో 1761 వ సంవత్సరమున క్లైవు కామన్సు సభలో ప్రవేశించెను.

ములు" అను ఒక కాగితమును "హాల్వెలు" అను నతడు 1760 వ సంవత్సరము నవంబరు 10 వ తేదీన తయారుచేసెను. లోకములోనున్న తప్పులన్నీ ఆతడీ కాగితములో నవాబుమెడకు చుట్టెను. [illegible] నవాబు నిష్కారణముగ మనుష్యుల ప్రాణములు తీయుచున్నాడని నేరము మోపెను. అందులో మాన్యులు ఎవరుండుగురు పెద్దమనుష్యుల పేర్లు గలవు. [illegible] 70 మంది నవాబుయొక్క పిచ్చియుత్తరవుల వలన [illegible]. ఈ మాటలన్ని శుద్ధ అబద్ధములని [illegible] పిమ్మట ఆరేండ్లకు కౌన్సిలువారు [illegible] ఒప్పుకొనిరి. దానినిగూర్చి 1766 సంవత్సరము సెప్టెంబరు 30 వ తేదీన కలకత్తాలోని కుంఫిణీ కౌన్సిలు వారు సీమలోని డైరెక్టర్లకిట్లు వ్రాసిరి "పాపము! గతించిన మీర్జాఫరు నవాబును గూర్చి మన మన్యాయము ఆడుకొనరాదు. [illegible] మే మిప్పుడు వెల్లడింపవలసిన [illegible] కంపినీ డైరెక్టర్లకు హాల్వెలు వ్రాసిన యుత్తరములో నుదహరింపబడిన ఘోర హత్యములలో దేనిని నవాబు గావించియుండలేదు. ఇవన్నియు శుద్ధ అబద్ధములు. నవాబు సౌశీల్యమును మిక్కిలి క్రౌర్యబుద్ధితో, మరీన మొనప్పుటకై పలుకబడిన దురాగతపు పలుకులివి. నవాబు చంపించెనని చెప్పిన 78 గురులో 76 గురు యిప్పటికి బ్రతికియే యున్నారు. ఇద్దరుమాత్రము యెట్లో నవాబుకు తెలియకుండ నవాబు అనుమతి లేకుండ చంపబడినట్లు తెలియుచున్నది. ఈ బ్రతికియున్న 76 గురను జెయిలులోనుండి మొన్న మొన్ననే క్రొత్త నవాబు విడుదలచేసెను. దీనిని బట్టి

తనరాజ్యమున కెట్టి మొప్పును కలిగినను కుంపిణీవారు రక్షింప గలరను నమ్మక మితని కున్నదని తెలియుచున్నది.''

పాశ్చాత్యులు ప్రాగ్దేశములందు గావించిన ఇట్టి నీచకృత్యముల అసహ్యత పైకి కాన్పించకుండ పైపూతలు పూయు చరిత్రకారులలో కూడ మీర్జాఫరునెడ గావించిన యీ ఘోరకార్యమును సమర్థించువారెవరును కానరారు. మీర్జాఫరుతోడి సంధి అప్పటి అమలులో నుండెను. ఆ సంధియుండగా కుంపిణీవారిట్లు నీచముగా వర్తించుటకు కారణ మెంతమాత్రము గన్పట్టదు. ఈ లోకములో అన్ని యుగములందును, దేశముల జయించిన విజేతలు అంతర్జాతీయ నీతిధర్మములను పేరిట కొన్ని ధర్మసూత్రముల నిర్వచించుట ఆచారముగా వచ్చుచున్నది. ఈధర్మసూత్రములకు ఖచితములగు ప్రమాణములు లేవు. అవి విజేతల వీలునుబట్టి వారిచేతులలో నెటుబట్టిన అటుసాగుచుండును. ఇంత అధ్వాన్నముగానున్న యీఅంతర్జాతీయ నీతిసూత్రముల ప్రకారముగ నైనను కుంపిణీవారు మీర్జాఫరుపై యిట్టిద్రోహమును చేయుటకు అవకాశము గనుపించదు. మీర్జాఫరు కుంపిణీవారిని నమ్మి భగవంతునియెదుట ప్రమాణ పూర్వకముగ తన నెత్తురుతో నేస్తముగట్టెను. మనిషియైనవానికి విశ్వాసము మాటయైన నుండవలెనను యింగితజ్ఞానము ఉండవలెనన్నచో కలకత్తా గవర్నరును, కౌన్సిలును మీర్జాఫరుతో చేసినసంధికి కట్టుబడియుండవలెను. అట్లయ్యును కుంపిణీ యుద్యోగస్థులు "మీర్ఖాసీము" ఇచ్చిన రెండు లక్షల సవరసులకును, మూడు జిల్లాలకును లోబడి తమను నమ్ముకొనిన

ప్రాణమిత్రుని అమ్మివేసిరి. మీర్జాఫరుతో చేసికొనిన షరతులను కాగితముపై వ్రాసిరి. కుంపిణీవారు చేయు సహాయము అతని జీవితాంతమువరకే. కాని కుంపిణీవారికి యిచ్చివేసిన బర్ద్వాను, మిడ్నపూరు, చిట్టగాంగు అను ఫలవంతములగు జిల్లాలు మూడును పూర్తిగా, శాశ్వతముగా వారికిచ్చివేయునట్లు యేర్పాటుజరిగెను. మీర్జాఫరును బెదరించి రాజ్యమునుండి వెడలగొట్టుట యందు చాకచక్యము చూపిన "వాన్సిట్టార్టు" 58 వేలును "హాల్వెలు" కు 30,937 ను "సమ్నరు" కు 28 వేలును, "కెయిలాడు" కు 22,916 సవరనులును యింకను చిల్లర యుద్యోగస్థులకు వారివారికి తగినట్లు సంభావనలనిచ్చి మీర్జాఫరు వారిని బహూకరించెను.

మీర్జాఫరును బంగాళా తఖ్తునందు నవాబుగా మార్చుటకు కావలసిన ఫర్మానా ఢిల్లీ చక్రవర్తినుండి కొనితాబడెను. బంగాళారాజ్యమందు గలిగిన యీ పరివర్తనమును గూర్చి కుంపిణీవారు సీమప్రభుత్వమునకును తమ డైరెక్టర్లకును వివరముగా వ్రాసి పంపిరి. క్రొత్తనవాబుగారు సింహాసనము నలంకరించిరి. అతని పరిపాలనాదక్షత వెంటనే విశదమయ్యెను. ప్రజలు తన యధికారమునకు వాంఛియుండునట్లు చాకచక్యము చూపెను. దేశముయొక్క పూర్వపు జవసత్వములను పునరుద్ధరించుటకును రాజ్యమునకు వచ్చుటలో తానొనర్చిన దుష్కార్యములను ప్రజలు వీరైనంతవరకు మరచునట్లు చేయుటకును, పరిపాలింపగడంగెను. రాజ్యాంగము యొక్క వ్యయము ఖచితముగ క్లుప్త

పరచి, సేనలకు చిరకాలమునుండి బాకీయున్న జీతములనిచ్చి వేసి సేనల పటిమను పెంపొందించెను. కంపెనీ బాకీల వెంటనే తీర్చివేసెను. తన ప్రజలయొక్క లోటుపాటులను కష్టనిష్ఠురములను గ్రహించి, వానిని సవరించుటకు వెంటనే పూనుకొనెను. ఆతడీ విషయమున నిష్కర్షగా జూపిన పరిపాలనా సామర్థ్యమే తుదకాతని యెడ విషమించి, తనమిత్రులని చెప్పుకొను కంపెనీవారితో కలహమునకు కారణమయ్యెను. కుంఫిణీ వారు మొట్టమొదట బంగాళాదేశములో ప్రవేశించినపుడు కంపెనీ సరకులపై రోడ్లపైగాని, ఓడలపైగాని, శాయిరీ(పన్ను)వసూలు చేయకుండ నుండునట్లు నబాబువల్ల ఫర్మానాను పొందిరి. కుంఫిణీవారి ఫ్యాక్టరీ యజమానులు యిచ్చిన దస్తకు (చీటీ) చూపినయెడల, అవి కుంఫిణీ సరకులుగా భావించి, వానిని వదలి వేయుచుండిరి. ఈ చీటీ పద్ధతి నాధారము చేసికొని, ఫ్యాక్టరీ యజమానులు తమ క్రింది నౌకరులకు నామమాత్రముగ జీతములిచ్చి రహస్యముగా స్వంత వర్తకము చేసికొనుటకు చీట్ల నిచ్చుచుండిరి. ఈ పద్ధతి రానురాను యెక్కువై, ఇటు కంపెనీ వర్తకమునకు నష్టము గలిగించుటయేగాక, దేశీయ వర్తకులనుగూడ పీడించుటకు గారణమయ్యెను. కుంఫిణీ ఫ్యాక్టరీ యుద్యోగస్థు లిచ్చిన యీ చీట్లమాటున ప్రైవేటు నౌకరులుగూడ పన్ను లేకుండ తప్పించుకొని పోవుచుండిరి. ఈ పద్ధతి దేశమంతటను వ్యాపించెను. ఈ చీట్లు సరియైనవి గావని టోలుగేట్లవద్ద నబాబు యుద్యోగస్థులు సరకుల ఆటంకపరచినపుడు కుంఫిణీ నౌకరులు వారిని కాలుచేతులు బంధించి బందిఖానాలోపడవేసి బాధించుటయు

జరుగుచుండెను. ఈ రీతిగా, దేశమందలి యావత్తువర్తకము కంపెనీ నౌకర్లే అరికట్టి, నవాబుకు చెల్లుబడియగు పన్నును కృశింపజేసిరి. గస్తీపోచకూడ చేయని ప్రతిఇంగ్లీషు ఏజెంటును తానును కంపెనీభాగస్వామి యంతటివాడనని డంబములు పోవుచు. అందలి లాభమును పొందుచుండెను. ఈ రీతిగా ప్రతియోజనుడును క్షణములో యెవరికీ తెలియకుండ యెట్లో కావలసినంత సిరియెత్తుకొనెను. ఇంతధనము వీ రెట్లు గడించిరో అడుగువారే ఆరోజులలో లేకుండెను. ఎవరికి చేజిక్కినది వారు కొల్లగొట్టుకొనుట విచ్చలవిడియయ్యెను. కొల్లభారముచే విసిగినప్పుడుగాని, కొట్టుకుతిను శ్రమచే అలసినప్పుడుగాని, విశ్రాంతిగైకొనుటకు మాత్రము వీరు ఇంటికి (ఇంగ్లాండు) చేరుచుండిరి. ఆ అన్యాయార్జిత విత్తముతో సంతృప్తి జెందక, ఇంగ్లీషు యోజనులు యింకొకమెట్టుదాటి, ఊరూర జొరబడి, అక్కడకూడ పన్నులెగఁబెట్టి, వర్తకము చేయుటకు సాగించిరి. ఇందువల్ల ఇంగ్లీషువర్తకులు దేశీయవర్తకులకంటె అన్నిసరకులను చౌకధరలకు అమ్ముటకువీలయ్యెను. తాము నిర్ణయించిన ధరలకే దేశీయులు తమవద్దసరకులను క్రయవిక్రయములొనర్చుకొనుటకు ఇంగ్లీషువర్తకులు బలాత్కరించుచుండిరి. దేశీయులిందుకు ఒడబడనప్పుడు వారిపైపడి దౌర్జన్యము గావించుచుండిరి. ఈ విధముగా, వేధించి పీడించుచున్న ఆంగ్లేయులనుచూచి దేశీయులు భయభ్రాంతులై తిరుగబడ సాహసింపకుండిరి. కంపెనీవర్తకులు పెట్టు ఘోరబాధలు దేశమందలి అన్నిమూలలనుండి ప్రతిదినము నవాబునకు వినవచ్చుచుండెను. ఇట్టి ఘాతుక కృత్యములను ఖండించుచు, నవాబు

కలకత్తా గవర్నరుకు తెలిపెను. ఈ దురాగతములగావించిన వారిలో అగ్రగణ్యుడు పాటలీపుత్రమందున్న "ఎల్లిసు" అను వాడు. కాని కలకత్తా కంపెనీ యుద్యోగస్థులందరూ గూడ యిట్టి దురాగతముల గావించినవారేయగుటచే వీరు "ఎల్లిసు"ను మందలింపలేకపోయిరి. అందుచే, దేశమందిట్టి అన్యాయములు జరుగుచుండుటయే లేదని బొంకసాగిరి. పైపెచ్చు నవాబు కంపెనీవారియెడ కృతఘ్నుడై వారిపై నిట్టి నిందల మోపుచున్నాడు గావున నవాబునే దండింపవలసియుండునని గయ్యాళితనముగా యెలుగెత్తి చాటసాగిరి. నూటికి 9 వంతున రవానాపన్ను కంపెనీవారిచ్చుకొనిన చాలునని నవాబనెను. అదియు దేశీయవర్తకు లిచ్చుపన్నుకంటె చాలతక్కువయని మరువరాదు. దీనికికూడ కంపెనీవారు ఒప్పుకొనక ఒక్కఉప్పు మీద మాత్రము నూటికి రెండున్నరవంతున యిత్తుమని మిక్కిలి అయిష్టముతో బేరము చేసిరి. తుదకు నవాబు ఏదోవిధముగా ఒడంబడి, కుంఫిణీ వారు దేశములో చేసికొనువర్తకముపై కొద్ది మొత్తము నిచ్చునట్లు 1762 డిసెంబరులో కుంఫిణీ వారిచే పత్రము వ్రాయించుకొనెను. కాని, నబాబునెడ ప్రజలకు గల అనురాగమును అతని రాజ్యపాలనా దక్షతను చూచి కుంఫిణీ కౌన్సిలు యీర్ష్యనొందసాగెను. అతడు తాముచేయు మోసములను దౌర్జన్యములను చూచీ చూడనట్లు పోవువాడుగాడు. కావున ఈతనితో, ఎట్లయినను, గిల్లికజ్జా పెట్టుకొన వలెనని కంపెనీ యుద్యోగస్థులు నిశ్చయించుకొనిరి. వెంటనే, నబాబుకు వ్రాసియిచ్చిన పత్రముపై సంతకము చేయుటకు కంపెనీ ప్రెసిడెంటుకు అధికారము లేదనియు, కావున సదరు పత్రము

చెల్లనేరదనియు, అందుచే దానిని రద్దుపరచితిమనియు కుంపిణీ కౌన్సిలు ప్రకటించెను. నవాబు యిట్లు తృణీకరింపబడుటకు సహింపక వెంటనే దేశీయవర్తకులపై కూడ పన్నులను రద్దుచేసి ఫర్మానా జారీ చేయించెను. ఇందువలన ఇంగ్లీషు వర్తకులతో పాటు దేశీయ వర్తకులకు కూడ సమానమగు సౌకర్యముల నేర్పరచెను. ఈ ఫర్మానాను రద్దు చేయవలసినదని కంపెనీవారు నిక్కచ్చిచేసిరి. అందుకు నవాబు సమ్మతింపనందున యిరుపక్షములును యుద్ధ సన్నాహముల గావించుకొనిరి. కుంపిణీవారి ఓడలు కొన్ని ఆయుధ సామగ్రిలతో పోవుచుండగా నవాబు వానిని పాట్నావద్ద ఆపించెను. కాని పిమ్మట వదలివేసెను. కాని, దీనినే సాకుగా పెట్టికొని కుంపిణీవారి ఐరోపీయదండు పాట్నా దోచుకొనెను. ఇంతలోనే నవాబు సైన్యములు వచ్చిపడుటచే కథ అడ్డముగా తిరిగి కుంపిణీవారు కాళ్లబేరమునకు రావలసివచ్చెను. అట్టివారిలో పాట్నాయందు యిదివరలో చెప్పరాని దుండగము లొనర్చిన "ఎల్లిసు" అను వాడుకూడ నుండెను. బంగాళా దేశమందున్న ప్రతి ఆంగ్లేయుని పట్టుకొని, బందిఖానాలో పడవేయవలసినదని హుకుంజారీ యయ్యెను. కాని ఉభయ రాజ్యాంగములకు మధ్యవర్తిగానున్న "అమ్యత్" అను నాతడు తప్ప ఇంకెవరి ప్రాణములకు హానికలుగలేదు. ఈతడైనను తనతోనున్న రక్షక సైన్యము యొక్క తెలివితక్కువచే శత్రువుల బారి పడవలసిన వాడయ్యెను. లేకున్న, ఈతడైనను చావవలసిన వాడుగాడు.

మీర్ఖాసీము తన సేనలను ఐరోపీయ పద్ధతులపై తరబీదు చేయుటకు చాల యత్నించెను. కాని, విజయలక్ష్మి యాతని వరింపలేదు. జూను 19 వ తేదీన అతని రాజధాని పట్టువడెను. ఆగస్టు రెండవ తేదీన "గరియా" యను ప్రదేశమున జరిగిన యుద్ధములో నబాబు ఓడిపోయెను. ఈ యుద్ధమందాతని సేనలు అప్రతిమానమగు పరాక్రమమును జూపెను. కంపెనీవారు ఇంత పరాక్రమముగల దేశీయ సేనలతో యింతవరకు పోరాడియుండలేదు. 'ఊడ్వా' కనుమ వద్ద నబాబు అతిధైర్య సాహసములతోను పట్టుదలతోను నెలదినములు నిలిచి పోరాడెను. ఆతని రెండవ రాజధాని యగు "మాంఘీరు" పట్టణముగూడ అక్టోబరులో శత్రువులచే జిక్కెను. తనబలములు తగ్గిపోవుటయు, తన యదృష్ట రేఖ తప్పుటయు, గాంచి మీర్ఖాసీము నిరాశాహతుడై రోషావేశముతో తన పతనమునకు మూలకారణుడగు "ఎల్లిసు" ను, ఇతరఖైదీలను ఉరిదీయించెను. పిమ్మట, మీర్ఖాసీము కొంతకాలము అయోధ్యలో దాగియుండి 1777 లో అనామకుడుగను, దరిద్రుడుగను, మరణించెను. మీర్ఖాసీము తనదేశముయొక్క శ్రేయస్సును విదేశస్థుల శ్రేయస్సునకు లోబరచు వాడుగాడని కుంపిణీవారు గ్రహించిన తోడనే, తామిదివరకు కూలద్రోసిన మీర్జాఫరుతో బేరములుసాగించిరి! బంగాళా తక్తుపై మీర్జాఫరును కూర్చుండబెట్టుటకు 1763 సంవత్సరము 10 వ జూలై తేదీన కుంపిణీవారతనితో క్రొత్త ఒడంబడిక చేసికొనిరి. అందులకు ప్రతిఫలముగ, మీర్జాఫరు లోగడ 1757 లో తాను చేసిన సం

ధిని ధృవపరచెను. కుంఫిణీవారి సేనల ఖర్చునిమిత్తమై మీర్జా సీము యిచ్చియున్న బర్ద్వాను, మిడ్నపూరు, చిట్టగాంగు జిల్లాలను తిరిగి వ్రాసియిచ్చెను. ఏ విధములగు పన్నులు లేకుండ నిరాటంకముగ దేశమందు వర్తకము చేసికొను హక్కును ఖాయపరచెను. ఒక్క ఉప్పుమీాద మాత్రము హుగ్లీ బజారు ధరమీాద నూటికి 2½ చొప్పున మాత్రము కుంఫిణీవారు నబాబుకు పన్ను చెల్లింపవలసిన ఏర్పాటు మాత్రముండెను. "పూర్ణియా" జిల్లాలో దొరకు సురేకారములో సగము కుంఫిణీవారి కిచ్చివేసెను. ఆ సరకును తదితరు లెవరును కొనరాదని శాసించెను. "సిల్హెటు" జిల్లాలోని సున్నములో సగము 5 యేండ్లపాటు వారి కిచ్చివేసెను. ఈ మూడు జిల్లాలలో కంపెనీతాలూకు 12 వేల గుఱ్ఱపుదళమును 12 వేల కాల్బలమును నవాబు పోషించునట్లు అంగీకరించెను. ఇందుకు ప్రతిఫలముగా నవాబుకు కావలసివచ్చినపుడు కంపెనీసైన్యములతనికి తోడ్పడవలెనని కూడ యేర్పాటుండెను. నవాబు రాజధానిలో కుంఫిణీవారి తరఫు రాయబారిని యొకనిని, అట్లే కలకత్తాలో నవాబుతరఫు రాయబారిని యొకనిని యుంచుకొనునట్లును ఒడంబడిరి. దేశీయ వర్తకులమీాదకూడ పన్నులతీసివేసి అందరిని సమానస్థితియందుంచిన మీర్ఖాసీము శాసనము రద్దుపరచునట్లును, తిరిగి పూర్వమువలెనే దేశీయవర్తకులపై యెక్కువపన్నులవేసి కుంఫిణీవర్తకులపై తక్కువ పన్నువిధించునట్లును నవాబు వప్పుకొనెను. యుద్ధపుఖర్చులకుగాను ముప్పదిలక్షలు నవాబు యిచ్చునట్లును అంగీకరించెను. కంపెనీతాలూకు మనుష్యు

లకు గలిగిన నష్టములకు ద్రవ్యరూపకముగగాని, భూమిగాని యిచ్చి పరిహారము చేయుటకును, ఫ్రెంచివారు కోటల కట్టు కొనుటగాని, సేనలనిలుపు కొనుటగాని, భూములను జమీ లను సంపాదించుటగాని లేకుండునట్లు నిర్బంధించుటకును, అవ సరమైన యెడల ఫ్రెంచివారు పన్ను చెల్లించి యథారీతివర్త కము చేసికొనవచ్చుననియు షరతులు నిర్ణయింపబడెను. కుం పిణీవారు గావించిన వాగ్దానములు నమ్మతగినవిగావని ముసలి నవాబుకు స్వానుభవమువలన తెలిసియేయుండెను. అందుచే రోజురోజును మారిపోవు కలకత్తా కుంపిణీయుద్యోగస్థులు సం తకము చేసిన కాగితములోని మాటలకంటె యెక్కువ నమ్మకము గల అధికారులద్వారా యీ షరతులను ఖాయపరచుకొనవలె నని నవాబు సంకల్పించుకొనెను. కౌన్సిలు అంతయు అంగీక రించిన ఈ ఒడంబడికకు అనుబంధముగా చేర్చబడిన నవాబు యొక్క యీ కోర్కెనుబట్టియే కుంపిణీయుద్యోగస్థుల ద్రోహ బుద్ధియు, వారు నిరంతర మొనర్చుచు వచ్చిన వాగ్దాన భంగము లును, లోకమునకు స్పష్టమగుచున్నవి. కంపెనీవారి దుష్ప్రవర్తన లోకచారిత్రమందు కళంకమైయొప్పుచున్నది.

నవాబుకోరిన కోర్కె యీ దిగువరీతిగా గలదు. "నేనిప్పుడు మనవిచేయున దేమనగా, మీరు సీమలోని మీ కుంపిణీ యజమానులకును మీ రాజునకును ఇక్కడ మనమేర్ప రచుకొన్న షరతులగూర్చి సరిగా వ్రాసికనుగొనండి. నాకును ఇంగ్లీషువారికిని మధ్యయెట్టి భేదముగలుగదని నామనసుకు నిశ్చ యముగలుగునట్లు అక్కడనుండి వ్రాతమూలకముగా నాకు వ్రాసితెప్పించండి. ఇక్కడనుండు ప్రతిగవర్నరు కౌన్సిలరు,

ఉద్యోగస్థుడును వారి తదనంతరము ఆస్థానములకు వచ్చు వారునుగూడ నాయందు సుముఖులై స్నేహముతోనుండునట్లు గ్యారంటీయిచ్చుచు సీమకువ్రాసి తెప్పించండి." ఉభయపక్షములు పరస్పరమైత్రిని సహానమును పాటించవలయుననియు, క్రిందియుద్యోగస్థులు పైవారియెడ తగు గౌరవమర్యాదలతో మెలగవలెననియు, నవాబుకోరెను. ఆయారీతులనెల్ల నాతడు స్పష్టముగా వివరించెను. ఈ యొడంబడికలోని షరతులలో నొకదానినిగూడ నవాబుగాని ఆతని సంతతివారుగాని కించిత్తైనను తప్పుటకు ప్రయత్నించినట్లు అప్పుడుగాని ఇప్పుడుగాని యెవరును చెప్పియుండలేదు. అయినను బలిష్ఠులగు కుంపిణీ వారు ఇందలిషరతులలో నొక్కొక్కదానినే క్రమముగా జారవిడిచి దుర్బలుడగు నవాబుపక్షమునకు తీరని నష్టమును వాటిల్ల జేసిరి. ఈరీతిగా, కొంతకాలమగు నప్పటికి యీ యొడంబడికలోని షరతులను, మూలసిద్ధాంతములను తీసి దూరముగా పెట్టవలెనని సీమలో నొకమంత్రి మెల్లగా సూచించెను. కాని, యీ సూచననెట్లో పైకిరాకుండ తొక్కి యుంచిరి. 1763 వ సంవత్సరములో అనేక జాగీరులను, సౌకర్యములను, యిచ్చినదే చాలునను సంతోషముతో యే ప్రభువునుండి కుంపిణీవారు తీసికొనిరో, అట్టి బంగాళా ప్రభు పదవి మీర్జాఫరు అనంతరము నామరూపములు లేకుండ తుడిచివేయవలెనని యీమంత్రి సలహానిచ్చెను. ఇట్లు చేయుట సీమలోని అప్పటి ఆర్థిక పరిస్థితులనుబట్టి అవసరమని ఆతడు కారణము చెప్పెను.

పరాజితుడైన మీర్ఖాసీమునకు అయోధ్యవజీరు అగు "సుజాఉల్‌దాలా" శరణ్యమిచ్చెను. ఇందులకై కుంపిణీ వారు "సుజాఉల్‌దాలా" ను బెదరించిరి. కాని ఆతడీ బెదరింపులకు జంకక కుంపిణీవారి కుచ్ఛితపు కుట్రలను నిందించుచు జవాబిచ్చెను. "మీరీ దుర్మార్గముల నన్నింటిని యెందుకు చేయుచున్నారో నాకు తెలియదా? ఢిల్లీ పాదుషాను కేవలము తృణీకరించి, దేశమునంతను మీరే కాజేయవలెనని మీకు దుర్బుద్ధి పుట్టినది. దేశమందు ఈ అల్లకల్లోలము లన్నియు మీ దుష్కార్యములవల్లనే కలిగినవి. కావున, ఇంక ఇంతటినుంచి అట్టిపనులను మానివేయుడు. రాజ్యాంగ వ్యవహారములలో మీరు జోక్యము కలిగించుకొనకుడు. దేశమందు అన్నిప్రాంతములనుండి మీవారిని పిలిపించి సీమకు పంపివేయుడు. మీ కుంపిణీ వర్తకమును పూర్వము వలెనే చేసికొనుడు. మీ వర్తక వ్యాపారముతప్ప, మీరు రెండవజోలికి రాకుడు." బంగాళా వ్యవహారములజూచి ఢిల్లీ పాదుషాయగు 'షా ఆలం' కూడ భీతావహుడై, అయోధ్యవజీరుతో కలిసి గొప్ప సేనను కూర్చుకొని 1764 లో బంగాళామీదికి వచ్చెను.

చాల నెలలవరకు చిన్నచిన్న పోరాటములు జరిగెను. వీనివలన కంపెనీ సేనలకు చాల క్షోభగలిగెను. కాని, బక్సారువద్ద జరిగిన యుద్ధములో కంపెనీవారు జయమందిరి. వజీరు సంధిచేసికొన గోరగా, అయోధ్యనుండి మీర్ఖాసీమును తరిమివేసిన పక్షముననే సంధి కంగీకరింతుమని కంపెనీ వారనిరి. పాదుషాగూడ కంపెనీతో వేరుగా రాయబారము

జరిపి తన షరతుల తాను నిర్ణయించుకొనెను. చివరకు, వజీరు అలహాబాదు, కోరా జిల్లాలను పాదుషా కిచ్చిన మీదట సంధి పూర్తియయ్యెను. ఈ రాయబారములు జరుగుచుండగా, 1765 లో మీర్జాఫరు చనిపోయెను. అతని కుమారుడగు 'నూజముల్ దౌలా' నవాబయ్యెను.



భరత ఖండమున

# ఆంగ్లరాజ్య స్థాపన



## ఐదవ అధ్యాయము.

### దివానీ 1765.



ఇంగ్లీషుకంపినీవారు చేసిన సహాయమునకు ప్రతిఫలముగా వారికి బంగాళా, బీహారు, ఒరిస్సారాష్ట్రముల 'దివాన్గిరి'ని దానముగా నొసంగితిమి. ఇందుకుగాను ఆ కంపెనీవారు మా రాజ్యాంగపు టాదాయముగ సాలుకు 26 లక్షల రూపాయలిచ్చునట్లు జవాబుదారీ చేయుట అవశ్యకము. ఈ మొత్తము నవాబు "నజూమల్ దౌలా బహద్దరు" వారిచే నిర్ణయింపబడినది. బంగాళా దేశముకొరకు కంపెనీవారు గొప్ప సేనను ఉంచవలసియుండుటచే యీ మూడు రాష్ట్రములపై వచ్చు ఆదాయమునుండి 26 లక్షలు మాకు నిచ్చి బంగాళా నవాబు వ్యయమునకగు సొమ్ము నేర్పాటుచేసి, పిమ్మట మిగులు మొత్తము నంతను తాముంచుకొనునట్లు కంపెనీవారి కిచ్చివేసినాము.

షాలం చక్రవర్తి ఫర్మానా.

కొల్లగా పండిన మొదటిపంటలోని భాగస్వాములు ఆగంతుకముగా వచ్చిన ధనరాసుల బరువుమూటలతో నింటికి

(సీమకు) చేరుకొన్నప్పుడు అచ్చటివారు దిగ్భ్రమచెందిరి. కొందరికాశ్చర్యమును, మరికొందరికి వింతయు, కొందరికి ఓర్వలేమియు, మరికొందరకు "మనముకూడ పోయి సంపాదించుకొందమను" నాశయు జనించెను. ఇట్టిభావములతో సీమప్రజలమనస్సులు నిండిపోయెను. ధనకాంక్షచే క్రొత్తదేశముల కనిపెట్టవలయునను తలంపుతో మహోదధుల దరియించి అమెరికా ఖండమందు బంగారుగనులు గలవని "సర్ వాల్టర్ రాలే" కనుగొనివచ్చి చెప్పిన రోజులలోను, ఖండాంతరములకు బయలువెడలిన యెడల అచ్చటనుండి బంగారు ముద్దలను ఊరక త్రవ్వుకొని రావచ్చునని మాటలనుచెప్పి "లా" యను నతడు లండను వాసులందరి నోళ్లను ఊరించి సమ్మోహింపచేసినప్పుడును, సీమప్రజల తాండవింపచేసిన యుత్సాహము సాహసోద్రేకము, తిరిగి యీనాడు పిన్నపెద్దలయొక్కయు, పేదసాదలయొక్కయు మనోవృత్తుల నాశ్రయించెను. సముద్రమున కావల దూరదేశమందెచ్చటనో అంతులేక పడియున్న రత్నరాసులగనిని స్వదేశీయుల లాభముకొరకై పెకలించి వచ్చిన మహావీరపురుషుడని క్లైవును సీమప్రజలందరు పూజింపసాగిరి. శ్రమలేకయే, రత్నరాసుల నింటిలో వేసికొనుటకును, యోగ్లకొలది తరబీదుగాని చదువు సంధ్యలుగాని లేకయే యెకాయెకిని అధికారస్థానమున కూర్చుండుటకును సులువగు మార్గమేర్పడెను. ఇట్టిస్థితిలో ఇండియాకు వెడలిన యెడల "లాటు" దొరకక పోవునాయను యాశ యెవరికి పుట్టదు? ఇండియా దూరమందున్నది; చాలదినములు సముద్రముమీద కష్టములకోర్చి ప్రయాణము చేయవలెను.

అక్కడ యెండలు తీవ్రముగా నుండును. ప్రజల ఆచార వ్యవహారములు వింతగ నుండును. కాని ఏమాత్రము ధైర్యమున్న పోకిరీయు, దమ్మిడీపుట్టని ప్రతి దివాళాకోరును, లంచమిచ్చిగాని, మోమాటపెట్టిగాని జీతమెక్కువ చేయించుకొనలేని ప్రతినిర్భాగ్యుడగు సిపాయియు, సంక్షుభితమై, భయానకముగా గన్పట్టు జర్మను సముద్రమందు అతి చలిచే శీతకాలపు రాత్రులందు అల్పవేతనములకు ఓడల నడపి నడపి విసికివేసారి దిక్కుగానకయున్న ప్రతి పల్లెవాడును, పెద్ద కుటుంబమునపుట్టి సంతోష సౌఖ్యములందు పెరిగి, కష్టమను నది యెరుగక, జ్యేష్టపుత్రుడుగామిచే పిత్రార్జితమందు భాగములేక, రాజుకొలువులో పెద్దజీతముగల యుద్యోగముదొరకక పనిలేని ప్లీడరుపనియైన చేయలేక పెద్దఆస్తికి కర్తయగు పెండ్లామైనను దొరకక, నానా అవస్థలుపడు ప్రతియువకుడును—ఈ రకపు అనాధలందరు బంగాళాకుగాని దక్కనుకుగాని పోయి నాలుగు నెత్తురుచుక్కలను చిందించి యెకాయెకీని ప్రభుపదవి కెగురవచ్చునని ఉబ్బిట్లూగ సాగిరి. ఎంతసాహసము !

ప్రాగ్దేశములందు దోచుకొన వచ్చునను ఆశ అంటు జాడ్యమువలె వ్యాపించెను. తదితర అంటుజాడ్యముల వలెనే యిదికూడ కొన్ని కుటుంబములలోను, కొన్ని తరగతులలోను సర్వ సాధారణమును, పారంపర్యమును అయ్యెను. స్థిరత్వము లేని తర్కమువలన వృధాకాలయాపనయేగాని యెవరును దానికి బద్ధులగు వారు లేకుండిరి. వ్యక్తులకుగాని, జాతులకు గాని, సక్రమమెద్దియో, అక్రమమెద్దియో యను యుక్తాయుక్త వివేచనము నిరర్థకమగు పిచ్చియూహాగా భావింప

బడును. మూడవజార్జిరాజు రాజ్యమునకువచ్చిన కాలమందు అచ్చటి రాజకీయ బృందముయొక్క నీతి యిట్టి భావాభ్యు దయమునకు మిక్కిలి అనుకూలముగ నుండెను. వెనుకటి రాజు కాలములో విచ్చల విడిగా చెలరేగిన దుర్నయములకు తోడుగా ఈ రాజు కాలమందు నీతి నియమములేని అభిప్రాయ ములు తీవ్రముగా చెలరేగెను. వీనికి రాజుగారి దర్బారుకూడ ప్రోత్సాహము నిచ్చుచుండెను. మతాధికారులు గాఢ నిద్ర యందుండిరి. "వెస్లి" మతాచార్యుడు బయలుదేర దీసిన మతోద్ధరణమునం దెట్టి అభివృద్ధియు కానరాకుండెను. ఆకాల మందు బానిసలను అమ్ముకొను వర్తకమువలన సులభముగ యెట్టి కష్టములేకయే, ఊరక, కనకవర్షము గురియుచుండెను. అందుచే కష్టపడ నొల్లని షోకీలాలందరు యీవ్యాపారము సాగిం చిరి. అమెరికాలో చెరుకుపంటపండించి, దానివలన లాభము తీయుట కష్టపు పనిగా కనిపించెను. అందుచే తేరగా కనక వర్షము గురియు బానిస వర్తకమునకు రుచిమరగిన రాజ్యాంగ ధురీణులు, రాజసభికులు మున్నగు పెద్దలందరు కష్టముతో గూడిన అమెరికా వ్యవసాయమును నిరసించిరి. బానిస వర్తకము వలన తేరగావచ్చు ధనమునంతను ఇంటివద్ద విచ్చలవిడిగా దుర్వ్యయము చేయుట పిన్నపెద్దల కెల్లరకు పరిపాటియై పోయెను.

ఇదివరకున్న బానిసవర్తకమను విషవృక్షము వలన తేరగా వచ్చుచున్న పాపపు ద్రవ్యముతోపాటు, యిప్పుడు యిండియా యందేర్పడిన పరిస్థితుల బట్టి, క్రొత్త విషబీజముల నాటి విషఫలముల పంట విరివిగా పండించుటకు క్షేత్రమును

బుతువునుగూడ మిక్కిలి అనుకూలముగా నుండెను. ఈ నూతన క్షేత్రమందు పంట వెనుకటికంటె మిక్కిలి విరివిగా పండగలదని సీమ ప్రజలందరు ఉవ్విళ్లూరుచుండిరి. తమ ప్రజలు ఆశియాఖండమందు గావించిన ఘనకార్యములును, వాని వలన తమకు కలుగబోవు లాభములును ప్రజల చిత్తవృత్తులయందు గాఢముగా నాటుకొనెను. దేశమం దంతటను విరివిగా వ్యాపించిన యీభావముతో ఆనాటి గ్రంథములందును నాటకములందును వేదాంతోపన్యాసము లందును తరుచు గానవచ్చెను. పరిహాస నాటకములందు మూడవ అంకములో అనామకుడగు ధూర్తునొకని తీసికొని వచ్చి వానిని నవాబు వేషముతో కూర్చుండబెట్టెడివారు. ఆతడు ఇండియాయందు తేరగా దోచికొనివచ్చిన సొమ్ముతో తన పిత్రార్జితమును తాకట్టునుండి విడిపించుచున్నట్లును, తా నొల్లని దుష్టుని బారినుండి సౌందర్యవతియగు కులీనను విడి పించు ఘనకార్యము లొనరించుచున్నట్లును ప్రదర్శించుచుండిరి. హిందూదేశములో నిరర్థకముగా విగ్రహముల కర్పింపబడు ద్రవ్యమంతయు యీశ్వరుడు కరుణాపూరితాంతరంగముతో సీమలోని భాగ్యవంతులకిచ్చి వారిచేత దానధర్మముల చేయిం చుచున్నాడని ఉపన్యాసములందు మతాచార్యులు దేవుని సంస్తుతించుచుండిరి. భాగ్యవంతు లొనర్చు దానధర్మములను స్తోత్రపాఠ మొనర్చుచుండిరి. ఇదియే వారికి పరమోత్కృష్ట మగు ధర్మోపన్యాసముగ నుండెను.

'వాన్సిటార్టు' పరిపాలన అతని సంబంధీకుల కందరకు మిక్కిలి వాటముగానుండెను. దోపిడీలకది ఉచ్చ కాలముగా

నుండెను. మూర్షిదాబాదుపై పడి దోచుకొన్నప్పుడును, యుద్ధసమయములందును, అంతయెక్కువ ధనము కంపెనీకి దొరకకపోయినను, అందలి నౌకరులకు మాత్రము కావలసినంతధనము తేరగా చేజిక్కుటకు అవకాశమేర్పడెను. రైతులకు దిక్కులేక, వా రేడ్చుచుండిరి. వారియేడ్పు వినువారు లేరైరి. విదేశీయుల రాజ్యాక్రమణ వ్యాప్తినిజూచి భాగ్యవంతులగు రాజులును జమీందారులును భయకంపితులై పలుకకుండిరి. తమ మొరలను సీమప్రభువులకు వినిపించుకొను మార్గమెరుగక వారు దిక్కుమాలినవారైరి. కాని తాము తమ బాధలను సీమప్రభువులకు చెప్పుకొనలేకపోయినను అవియెట్లో తమ్మును హింసించిన ఈ కుంపిణీయుద్యోగస్థుల మూలముననే సీమప్రభువుల చెవినిబడెను. ఈదోపిడిగాండ్రు తమలో తమకు భాగములు తెగక వివాదపడి ఒకరొనర్చిన దుష్కృత్యముల నొకరు అక్కడసీమలో బైట బెట్టుకొనుచుండిరి.

కుంపిణీవారిన్ని ఘోరకృత్యము లొనర్చినను వానిని గూర్చి సీమలో నిజముగ యెవరును పాటించెడివారు కారు. కాని, అట్లు ఊరకుండుట కొక ఇబ్బంది కలిగెను. ఏలననగా ఈ కంపెనీ నౌకర్ల ప్రైవేటు దోపిడివలన అసలు కంపెనీ డైరెక్టర్లకు నష్టమువచ్చెను. అందుచేవారు ఉలికిపడి యీ ఘోరదురంతములగూర్చి కొంచెము విచారింపవలసివచ్చెను. ఈ దోపిడీ లాభమంతయు కుంపిణీడైరెక్టర్లకే వచ్చియుండిన యెడల తమ నౌకరులు ప్రజలపైగావించిన దురంతములు వారికంత తప్పుగా కాన్పించెడివిగావు. తమకు నష్టము వచ్చుటయే పెద్ద తప్పయ్యెను. అందు చే వారు మేల్కొనిరి. ప్రతికంపెనీ నౌకరును

మోయలేనన్ని ధనపుమూటలను భుజమున వేసికొని యింటికి చేరుచుండెను. ఇట్టివారి సంఖ్య నిరంతరము హెచ్చుచుండెను. కాని కుంపిణీడై రెక్టరకుమాత్రము వట్టి కాగితముల రికార్డులు కొదువలేకుండ వచ్చుచుండెను. కృతఘ్నులగు ముసల్మానుల పైనను, నికృష్టులగు ఫ్రెంచివారిపైనను కుంపిణీవారు పొందిన మహత్తరమగు విజయపరంపరల గూర్చిన చక్కని వర్ణనలతో నిండిన లేఖలకు మితిలేకుండెను. తియ్యని కబురులతో నిండిన యీ వట్టి మాటలేగాని డబ్బుమాత్రము కుంపిణీకి ఒక దమ్మిడీ యైనను యెక్కువరాకుండెను. జీతములకు, లంచములకు, తాగి తందనాలాడుటకు మాత్రము యెక్కడలేనిడబ్బు ఇండియాలోని కంపెనీయుద్యోగులకు చాలకుండెను. జీతభత్యములను తగ్గించుకొనవలసినదని చేసిన నియమములన్నియు పాటించువారు గానరైరి. ఇండియాయందు దోపిడీయను పంటఫలించినపుడెల్ల గట్టి కాయధాన్యములన్నియు అక్కడి కుంపిణీ నౌకర్ల పాలగుటయు, పనికిమాలిన ఆకు అలము అంతయు కుంపెనీ డైరెక్టరకు చేరుటయు జరుగుచుండెను. కట్టుదిట్టములులేని యీ రకపు దోపిడీవలన కంపెనీ భాగస్వాములకు తగిన లాభము వచ్చుటలేదని స్పష్టమయ్యెను. కావున, యీ దోపిడీని యే రకముగా మార్చిన లాభకరముగా నుండునోయను సమస్య అప్పుడు సీమలో కంపెనీవారికి కలిగెను.

అప్పుడు వారి దృష్టియంతయు క్లైవువైపు తిరిగెను. ఆతడప్పుడే తాను సంపాదించుకొనిన భాగ్యమును హాయిగా అనుభవించుటకు ప్రారంభించెను. "బర్క్లే బజారు" లో

పెద్ద భవంతినికొని, నౌకరులను చాకరులను విరివిగా పెట్టుకొని, దర్జాగా కాపురము చేయనారంభించెను. ఆతని దుస్తులును రోజునకొక విధముగా మారుచు ఆతని నడమంత్రపు సిరిని వెల్లడించుచుండెను. పార్లమెంటులో ఈతని క్రింద చెప్పుచేతలలో నున్నవి పన్నెండుసీట్లు. అందుచే యీతని ప్రత్యర్థులు యీతని ఆశ్రయమును కోరుచుండిరి. యుద్ధరంగమందు నిలిచి గెలిచినవాడు ఆ రోజులలో బ్రతికి యున్నవారిలో నీతడొక్కడే సేనాని. కావున, అశ్వదళాధిపతు లీతనిని గొప్పవానిగా చూచెడివారు. దేశఋణమును వృద్ధిచేయకుండ, బ్రిటిషు సామ్రాజ్యమునకు క్రొత్తదేశమును సంపాదించిపెట్టినది యీతడొక్కడే. అందుచే, మూడవ జార్జిరాజీతనిని దర్బారునందెక్కువగా ప్రశంసించుచుండెను. ఆతని ప్రక్క వీధిలోని వారందరు ఆతని జూచి పరిహసించుచున్నను, నాగరిక స్త్రీలు "ఈతడు మొదటినుండియు పోకిరీగా తిరిగిన వాడ" ని నవ్వినను, ప్రజాసమూహ మితనిని గొప్ప వీరునిగా జూచుచుండిరి. రాచకీయవేత్తలు "ఈతడు ప్రజ్ఞావంతుడగు పరిపాలకుడ" ని ప్రశంసించు చుండిరి. కావున ఈతని నెట్లైనను తిరిగి బంగాళాకు పంపించినయెడల అక్కడి వ్యవహారములన్నియు చక్కబడునని కంపెనీ డైరెక్టర్లు తలంచిరి. కాని కంపెనీకి అధ్యక్షుడగు 'సల్లివాను' నకును క్లైవునకును సరిపడకుండెను. తక్కిన డైరెక్టర్లుగూడ "ఈతనిని ఇండియాకుపంపించిన యెడల తమమీద నెక్కి త్రొక్కునని" భయపడుచుండిరి. కాని, ఇం

డియా వ్యవహారము నానాటికిచెడుచుండెను. వ్యవహారములు క్షీణించి రాగమునబడుచుండెను. కంపెనీ భాగస్వాము లైనను నూటికి 10 రూపాయల లాభము పంచుకొనవలెనని పట్టుబట్టిరి. కాని అదిజరుగుటెట్లు? ఈ విషయమై సీమలో ఇండియా ఆఫీసువద్ద కంపెనీడైరెక్టర్లు తమలోతాము ఛడామడా కొట్లాడుకొనిరి. "సల్లివాను" ను అధ్యక్షపదవినుండి లాగి పారవేయవలెనని క్లైవు పట్టుపట్టెను. తుదకు క్లైవును కలకత్తా పంపుటకు నిశ్చయించుకొనిరి. ఆశియాఖండమందున్న ఇంగ్లీషు వారి సేనల కన్నిటికి సర్వసేనాధిపతిగా క్లైవు చక్రవర్తిచే నభిషిక్తుడయ్యెను.

భావికాలమున కంపెనీ వ్యవహార నిర్వాహణములో ప్రాగ్దేశపు రాజులతో నెట్టిసంబంధముండవలయునను విషయమునుగూర్చి క్లైవు తాను ఇంగ్లాండులో నుండగా కంపెనీ అధికారులతో ప్రసంగించియుండినమాట నిజమే. కాని ఇంకా యెక్కువదేశము నాక్రమించుకొనుటను గూర్చి క్లైవు తన మనసునం దప్పుడెట్టి నిశ్చయము చేసికొనినదియు చెప్పుటకు సాధ్యముగాదు. విలాసములందును, కుట్రలయందును నిమగ్నులై యున్న మూడవజార్జి రాజుయొక్క మంత్రులు ఇండియా యొక్క భావిగతిని నిరూపించుటకు వారికవకాశమున్నదనుకొనుటకు వీలులేదు. కవ్వించి కలహముల పెంచి దేశముల నాక్రమించుకొనుటకు క్లైవు ఇండియాకు వెడలివచ్చెను. తాను త్రొక్కవలసినమార్గమును నిర్ణయించుకొనుటకు అతనికెక్కువ కాలము పట్ట

లేదు. "రాజు" అను డైరెక్టరునకు క్లైవు వ్రాసిన ప్రైవేటు ఉత్తరములో ఈ విధముగా నున్నది. "నేను చిరకాలము నుండియు కాంక్షించుచున్న సందిగ్ధస్థితి ఇప్పుడు వచ్చినది. సర్వమును మనమే పరిగ్రహింపవలయునా యను సమస్యను మన మిప్పుడు తేల్చుకొనుట అవసరము. మనము కావలయు నన్నయెడల మొగలాయి సామ్రాజ్య మంతయు రేపే మన చేతిలో వచ్చి పడునన్న అతిశయోక్తి గాదు. మన మింత వరకు పోయిన పోకడలనుబట్టి మన యాశ లపారములని హిందూదేశపు రాజు లీపాటికే గ్రహించి యుండవలెను. మనము కొలదిపాటి రాజ్యముతో సంతృప్తి పొంది యుండువార మని యనుకొనుటకు వారి కెక్కడను దృష్టాంతము కనుపింపదు. మన మిప్పుడు మద్దతు చేయుచున్న నవాబులే మన యధికార బలమును చూచి ఈర్ష్య నొందవచ్చును. కావున, నామ మాత్రముగగాక, నిజముగ మనమే నవాబులము గావలెను."

మీర్జాఫరు మరణానంతరము "వాన్సిట్టార్టు" అధ్యక్ష పదవినుండి విరమించెను. క్లైవు వచ్చువరకు తాత్కాలికముగా బొంబాయినుండి వచ్చిన "స్పెన్సరు" అధ్యక్షపదవియందుండెను. పసివాడును అనుభవశూన్యుడును అగు మీర్జాఫరు కుమారుడు నవాబుగిరికి వచ్చియున్న యీ యవకాశమును జారవిడువక, అతనిని బెదరించి మరికొంతదేశము ఆక్రమించుకొనుటకు కంపెనీవారు ఎత్తుయెత్తిరి. 1765 వ సం॥ 20 ఫిబ్రవరి తేదీన క్రొత్త నవాబగు "నజాముద్దౌలా" తో క్రొత్తసంధి గావింపబడెను. 1757 సం॥ లో తన తండ్రి చేసిన ఒడంబడికను ఖాయపరచుచు

1763 వ సంవత్సరపు సంధి షరతులలో పెక్కింటిని కూడ క్రొత్తనవాబు ఖాయపరచెను. ఇదికాక, కంపెనీవారికి ముఖ్య స్నేహితుడును, ఢక్కాకు "నాయబు" ను అగు మహామ్మదు "రజాఖాను" నకు ప్రధానమంత్రి పదవిగూడ క్రొత్త నవాబు యిచ్చెను. పాతనవాబుకాలములో ముఖ్య మంత్రిగా నున్న "నందకుమారుడ" ను ధనాఢ్యుడగు బ్రాహ్మణ మంత్రి కంపెనీ వారి యెడ సుముఖుడుగా నుండనందున ఆతని నా స్థానమునుండి తొలగించుటకై కంపెనీ వారీ పన్నుగడను పన్నిరి. మొగలు చక్రవర్తియు, అయోధ్యవజీరును బంగాళము పై కిరాకుండ కాపాడుచున్నామను మిషపెట్టి కంపెనీవారు మీర్జాఫరునుండి నెల కైదు లక్షలరూపాయలు లాగుచుండిరి. ఈ మొత్తమును క్రొత్తనవాబుకూడ యిచ్చుట కంగీకరించెను. ఇట్లు ఈయన జరుపుట కంగీకరించి కంపెనీసేనలు రాష్ట్ర రక్షణకు చాలియున్నవనియు, వానిని తన స్వంత సేనలుగా భావింతుననియు చెప్పెను. కావున, తన రాష్ట్రమందు పన్నుల వసూళ్లకును తనయొక్కయు, పరిపాలనయొక్కయు హోదాను నిలుపుకొనుటకును ఆవశ్యకమగు సేనలను మాత్ర ముంచుకొనుటకు నవాబుసమ్మతించెను. ఈ రీతిగా దేశసం రక్షణకు కంపెనీవారు కంట్రాక్టరులైరి. తక్కిన ఆర్థికన్యాయ శాఖలు నవాబువశమందేయుండెను. "ఇకముందెట్టి తగాదాలు రాకుండుటకుగాను నవాబుసమ్మతితో న్యాయమును తృప్తికరమును అగు యేర్పాటులు జరుగువరకు దేశములోనికి పన్నులు ఇవ్వకుండ వర్తకపు సరకులను రహస్యముగా ప్రవేశ పెట్టు దురాచారమును మాన్పుడ" ని డైరెక్టర్లు సీమనుండి

ప్రత్యేకముగ నెన్ని యుత్తరవుల పంపినను, ఉప్పుమీద నూటికి రెండున్నర తప్ప తక్కిన అన్ని పన్నులనుండి స్వంత వ్యాపారముచేసికొను ప్రతికంపెనీ నౌకరుకు మినహాయింపు చేయు షరతును కంపెనీయుద్యోగస్థు లిక్కడ క్రొత్తనవాబుతో చేసికొనిన ఒడంబడికలో నిమిడ్చిరి. కంపెనీవారితోడి నేస్తము కొరకు కంపెనీ యుద్యోగస్థులకు వేరు వేరుగ మామూలుగా చెల్లించవలసిన నజరానా ముడుపులనన్నిటిని రెండులక్షలకు పైగా క్రొత్తమంత్రిగారును నవాబుగారును చెల్లించిరి.

1765 సం॥ మే 3 వ తేదీన క్లైవు కలకత్తా చేరెను. ఈతనివెంట "సమ్నరు, సైక్సు" అను మరియిరువురుగూడ వచ్చిరి. ఈ ముప్వురుగాక, "కార్నకు, వెరల్స్టు" అను మరి యిద్దరను గలిపి ఈ అయిదుగురితో సీమలోని డైరెక్టరులు ఒక కమిటీని నియమించిరి. గోలగానున్న యనేక అక్రమములను విచారించి, దేశశాంతిని పునరుద్ధరించుటకు వీరికి అసాధారణాధికారములొసంగబడెను. తమ నెత్తిపై ఈ అయిదుగురు కమిటీవారులను తెచ్చిపెట్టినందులకు కలకత్తాలోని తక్కిన యుద్యోగస్థులందరు మొదిరింప మొదలిడిరి. కాని, క్లైవు వారిని అదమాయించి, గట్టిగా నిలబడుటచే వారేమియు చేయలేక లోలోన గొణుగుకొనుచు లొంగిరి. ఈ కమిటీవారు మొట్టమొదటగా ఉద్యోగములందు మార్పుల గావించిరి. కంపెనీ నౌకర్లు ధనాఢ్యులగు దేశీయులనుండి బహుమతులను పేరుతో విపరీతపు ధనమును లాగుచుండుటచే, యీ దురాచారమును మాన్పుటకు ప్రతినౌకరునుండి

ఒక ఖరారునామా తీసికొనిరి. కంపెనీ డైరెక్టర్ల అధికారము లేనిది యే నౌకరుగాని దేశీయు లెవరివద్దనుండి భూమిగాని, ధనమునుగాని, మరియే యితర ఆస్తినిగాని, కొంత కొద్ది మొత్తమునకుమించి, బహుమతిగా నంగీకరింపరాదని యీ ఖరారునామాయందు ఉదహరింపబడెను. ఈ ఖరారునామా ఫారములు జనవరిలోనే కలకత్తాకు చేరినను అచ్చటి కౌన్సిలు ఉద్యోగస్థులు వానిని పాటింపక క్రొత్తనవాబునుండియు మంత్రినుండియు తమ యిష్టమువచ్చినంత డబ్బును లాగికొనిరి. ఈ ఖరారునామాలోని షరతులను ఒప్పుకొనకుండ యెదిరించు నుద్దేశముతో ఆ ఫారముల నట్లే తొక్కిపట్టియుంచిరి. కాని, ఈ కమిటీ వచ్చినపిమ్మట ప్రతి నౌఖరు చేత బలాత్కరించి యీ ఖరారునామాలు వ్రాయించిరి. ఇందుల కెదురు తిరిగిన ధూర్తులను డిస్మిసు చేసియు, సస్పెండు చేసియు, బలవంతముగా సెలవిప్పించియు, మిగిలినవారిచే ఖరారునామాలు వ్రాయించిరి. అందుచే కొంతకాలము వరకు శాంతియు, క్రమపద్ధతియు యేర్పడెను.

సైనిక వ్యవహారములునూ వృద్ధిపొందెను. కాని రాజకీయవేత్తగను సైన్యాధిపతిగను తనకున్న అసాధారణ ప్రజ్ఞాబలములను ప్రదర్శించుటకు తన కప్పుడేమియు అవకాశములు దొరకకుండెనుగదా యని క్లైవు లోలోన గుంజుచుండెను. కాని, ఆత డింతలకై చిరకాలము వేచియుండ నక్కరలేక పోయెను. బంగాళాను జయించుటకు మహారాష్ట్రుల సహాయమును బడసి వచ్చిన అయోధ్యవజీరు అప్పుడే తీవ్రపరా

జయమునొంది యెట్లైననుసరే సంధి చేసికొనవలెనని యాతురపడు చుండెను. ఈసంధి షరతులను నిర్ణయించుటకు క్లైవు పయనమై వెళ్లెను. ఓడిపోయినవానినెక్కువగట్టిగానొక్కుట అయుక్తమని తలచి ఆతనిపై 50 లక్షల రూపాయలు యుద్ధపు జరిమానాగా విధించుటకును, అలహాబాదు, కోరా జిల్లాలను ఆతడు వదలుకొని కంపెనీ కిచ్చుటకును క్లైవు షరతుల నేర్పరచెను. ఈ రెండు క్రొత్త జిల్లాలను కంపెనీవారు తమకు ఉంచుకొన కుండ ఢిల్లీపాదుషాకు లంచముగానిచ్చి, ఆతనినుండి విలువగల క్రొత్తహక్కులను సంపాదించుటకు క్లైవు పన్నుగడ పన్నెను. ఈ ప్రకారము పాలంచక్రవర్తితో ఒడంబడిక జరిగెను. ఈ రెండు జిల్లాలను కంపెనీవారు చక్రవర్తి కిచ్చునట్లును, సాలుకు 26 లక్షలు కప్పముగ గట్టునట్లును, కంపెనీవా రొడంబడిరి. ఇందుకు ప్రతిఫలముగా బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రములపై పన్ను వసూలు చేయు కట్టుబడిదారులుగ కంపెనీ వారిని నియమించుచు పాలంచక్రవర్తి ఫర్మానా జారీ చేసెను. ఇందువలన బంగాళా నవాబుయొక్క అధికారమునకును హోదాకును భంగము కలిగింపకుండునట్లును, ఆతని పరిపాలనమును పోషించుట కంపెనీవారు తమ శాశ్వత కర్తవ్యముగ భావించుటకును, తామెట్టి లాభమును స్వయముగా గైకొనక పూర్వము నవాబు ఖర్చులనన్నిటిని కంపెనీవారు పూర్ణముగ భరించునట్లును, ఈఫర్మానాయందు షరతు లేర్పరుప బడెను. అపూర్వమగు యీ వ్యవహారమే "బంగాల్, బీహారు, ఒరిస్సా,

రాష్ట్రముల దివానీగిరియందుమార్పు”గా చరిత్రప్రసిద్ధిబడసెను. దీని ప్రాముఖ్యతనుబట్టియు, వింతయగు స్వభావమునుబట్టియు, దీనికి పలువురు పలువిధములుగ అపార్థములు గల్పింప సాగిరన్నచో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. నిజముగా, అప్పటికి 7 సంవత్సరముల క్రిందట పన్నబడిన పన్నాగముయొక్క పరిపక్వదశయే యీరీతిగా పరిణమించెను. దీని యంకురము 1758 లో కలకత్తా కౌన్సిలువారు తమయింటికి వ్రాసినయుత్తరమునందే కాన్పించుచున్నది. “మేమిప్పుడు పొందిన ఈజయమువలన మాప్రఖ్యాతి ఢిల్లీచక్రవర్తికి తెలియవచ్చెను. కలకత్తానుండి తమ చక్రవర్తికి చెల్లవలసిన కప్పము సరిగా చెల్లుచుండుటకు బంగాళములో కంపెనీవారు అధికారమందున్న యెడల యెంతబాగుండునోయని చక్రవర్తి మంత్రులు తలంచుచున్నారు. బంగాళమునుండి రావలసిన కప్పమును మీరు తప్పకుండ కట్టునట్లు పూచీపడునెడల దివానీ అధికారమును, బిరుదమునుకూడ మీరే పొందవచ్చునని చక్రవర్తి మంత్రులలో ప్రధానుడను “సీతాబ్‌రాయి” గారు మాతో అనేక సారులు సూచించియున్నారు. “దివానీ” యనగా రాజ్యములో రాజుతరువాత రాజంతవాడు. కాబట్టి అట్టి హోదా మనకిక్కడ యున్నయెడల భారత సామ్రాజ్యమందు కంపెనీవారికి అసాధారణమగు గౌరవమేర్పడును. దానిని తీసివేయుట కెవరికిని సాధ్యముగాదు. కాని మనమీ పదవి నిప్పుడంగీకరించినయెడల మనపై నవాబునకు ఈర్ష్యగలుగ వచ్చును. ప్రస్తుతము మావద్ద కొద్ది సైన్యములు మాత్రము గలవు. అవియు వేరొకచో పనియందున్నవి.

మీరో, మేమెంత యెత్తుకొన్నను సైన్యముల పంపుదురను ఆశలేదు. కాబట్టి ఈ స్థితిలో, దివానీగిరి నంగీకరించి నవాబుయొక్క ఈర్ష్యకు గురియగుటకు మా కిష్టము లేదు."

కాని 8 ఏండ్లనాటికి పరిస్థితులు మారినవి. సీమనుండి సైన్యములు వచ్చినవి. తలదాచుకొనుటకు, బసకోసము వచ్చినవారు ఇంటి తాళపు చెవులను సంగ్రహించిరి. అంత టితో, నిరభ్యంతరముగా ఇంటిలో ప్రవేశించి అధికారము చలాయింపసాగిరి. దివానీలోని ఈ మార్పునూ తుదకు దానివలన కలిగిన మార్పులును, భారత భాగ్యరేఖ తొలగి పోవుటకు ప్రధానకారణమయ్యెనని నిస్సంశయముగా చెప్ప వచ్చును. ఏ దృష్టితో జూచినను ఆకాలమున ఢిల్లీదర్బారు నందు రాజకీయాధికారము పటుత్వము తప్పి జారిపోయెనని తలంపకుండుటకు వీలులేదు. మూడురాష్ట్రములపై దివానీ గిరిని తీసికొనిపోయి విదేశస్థుల చేతులలో పెట్టుటయే యీ రాజకీయాధికార పతనమునకు ప్రబల నిదర్శనము. ఢిల్లీ దర్బారునందు హాయిగతాగి తందనాలాడుటకు కావలసి నంత ధనము యెట్లో వచ్చినదియే చాలుగదా యను సంబర ముతో సామ్రాజ్య గౌరవమును, దేశాభిమానమును, ప్రజా ధర్మమును, రాజనీతిని, ఆత్మగౌరవమును గంగపాలు చేసి నిన్నటి వరకు గర్భశత్రువులుగానుండి దేశము నంతను గబళింపవలె నను దురాశతో నిండియున్న విదేశస్థులకు మూడు పెద్దరాష్ట్ర ములపై ఇట్టి అసాధారణమగు అధికారముల నిచ్చివేయుట యెంత ఘోరము! అయినను, ఫర్మానాలోని షరతులను అందు నిరూపింపబడిన నియమములను పరిశీలించినను, వానినిగూర్చి

కుంపిణీవారు రహస్యముగ వ్రాసికొనిన యుత్తరములలోని మాటలను గమనించినను, సదరు ఫర్మానాలనుబట్టి కంపెనీకి మూడు పెద్దరాష్ట్రములపై పరిపాలనాధికార మొసగబడినదని చెప్పుటకు వీలులేదు. అట్టి అధికారదానము అందు ఉద్దేశింపబడి నట్లుగాని, దానిని కంపెనీవారు అడిగినట్లుగాని, అందుకు చక్రి వర్తి సమ్మతించినట్లుగాని, ఇచ్చివేసినట్లుగాని, పైకిని సూచించుటకైన ను వీలులేదు. కాని కుంపిణీవారీ ఫర్మానాను అపార్థములతో దుర్వినియోగపరచినమాట వాస్తవము. మొదట రహస్యముగా నెమ్మదిగను, తరువాత వడివడిగా నిర్దాక్షిణ్యముతోను, కంపెనీవారు వినియోగపరచుకొనిరి. కాని క్రియ జరుగువరకు తామీ యుద్దేశముతో చేయుచున్నట్లెవరికిని తెలియనిచ్చిన వారుకారు. బెంగాలు, బీహారు, ఒరిస్సారాష్ట్రములపై ఢిల్లీ చక్రవర్తి దివానిగిరీ కంపెనీవారి కిచ్చినంతమాత్రమున ఆ రాష్ట్రములను కేవలము సర్వహక్కులతో తాను వదలుకొని కంపెనీ వారికిచ్చివేసినటుల అపార్థము గల్పించుట కేవలము అన్యాయము; హాస్యాస్పదము. అట్లైనయెడల ఇంగ్లాండులో రెండవ ఛార్లసురాజు కాలమున రాజును మంత్రులును యితర ప్రముఖులును తమ భోగములకై డబ్బుకావలసి వచ్చినప్పుడెల్ల ఇంగ్లాండులోని తమ ఎస్టేటులను ఫ్రెంచిరాజునకు తాకట్టుపెట్టి డబ్బు తెచ్చికొనినట్లు అనేక దస్తావేజులు, రసీదులు కలవు. "లూయీ" రాజును ఇంగ్లాండురాజగు ఛార్లసుకు రహస్యముగా వేలకొలది ధనమిచ్చి అనేక పత్రముల వ్రాయించి కొన్నట్లు నిదర్శనములు గలవు. ఛార్లసురాజు దర్బారులో అనేకమంది మంత్రులును యుద్యోగస్థులును, ఫ్రెంచిరాజు

నుండి అనేకలంచములు దానములు పుచ్చుకొని పత్రముల వ్రాసియిచ్చిరి. ఇంగ్లీషురాజు, మంత్రిలు, ప్రముఖులు, యుద్యోగులు యీ రీతిగా వ్రాసియిచ్చిన పత్రములనుబట్టి ఇంగ్లాండు భూమియంతయు దానాదమన విక్రియాది సమస్త హక్కు భుక్తములతో ఫ్రెంచిరాజునకు వశమయ్యెనని యెవరైన అర్థము చెప్ప సాహసింతురా? అట్లెవరైన సాహసించిన పరిహాసాస్పదముగ నుండదా? అయినను, దివాన్గిరీనిగూర్చి ఢిల్లీ చక్రవర్తి వ్రాసియిచ్చిన ఫర్మానాయును, ఛార్లసు రాజు వ్రాసియిచ్చిన పత్రములును ఒకటే స్వభావము గలవైనను వానికి ఆంగ్లేయులు వేర్వేరు అర్థముల గల్పింప జూచుట ఆశ్చర్యము. ఢిల్లీ చక్రవర్తి దర్బారును, ఛార్లసు రాజు దర్బారును, సమానస్థితియందుండెను. త్రాగితందనాలు త్రొక్కుటకు ఇరువురకు యెక్కడలేని ధనము చాలకుండెను. అందుచే సర్వాధికారులగు నీయిరువురు రాజులు తమరాజ్యములో కొంతభూభాగమును పరులకు యేమోషరతులపై వ్రాసి యిచ్చిరి. కాని యీ రెంటికి అర్థము చెప్పుటలో ఆంగ్లేయులు ప్రాచ్యఖండస్థుడగు మొగల్ చక్రవర్తినిగూర్చి అన్యాయార్థము చెప్పిరి.

కలకత్తా కౌన్సిలువారు సంతోషము పట్టజాలకపోయిరి. తమకి దివాన్గిరి వచ్చినదను సంతోషవార్తను తెలుగుటపాలో తక్షణామే సీమకంపిరి. దాలిగుంటలోని కుక్క తనయొడలి దుమ్మునంతను దులుపుకొనునట్లు, తామిదివరకు చేసిన పాపములన్నిటిని ఒక్కసారి దులిపివేసికొనవలెనని కలకత్తాకౌన్సిలు వారు తలంచిరి. తమకును మనస్సాక్షి యనునదొకటియున్న

దని తమ జన్మలో మొట్టమొదటిసారి నటింపజూచిరి. తామింతకాలము నుండియు కుంపిణీ నౌకరులనుండి దమ్మిడీ యైనను పన్ను వసూలుచేయక దేశీయులనుండి మాత్రము అన్యాయముగా రకరకముల పన్నులను వసూలు చేయుటయు దానివలన దేశీయులకు కలిగిన ఘోరబాధలును, కౌన్సిలు వారి దృష్టిలో ఆకస్మికముగా నొక్కపర్యాయము అన్యాయముగా కనుపడెను! పన్నులవిషయమై యిదివరలో జరుగుచున్న అక్రమములన్నిటిని తొలగించుటకును, నవాబునకును కంపెనీకిని తగాదాలకు కారణమగుచున్న యీసమస్యను పరిష్కరించుటకును కంపెనీ కౌన్సిలువారు ఒక్కటే మార్గమును (మందును) కనిపెట్టిరి. అది యేదనగా, తామే పన్నులు వసూలుచేయు అధికారులయినయెడల యీ తగాదాలన్నియు రూపుమాయునని తామప్పుడే గ్రహించినట్లు కంపెనీవారు ప్రకటించిరి. ఇంతటి దురాలోచనతో నిర్లజ్జగా కంపెనీవారు గావించిన ప్రకటనలోని నిజభావము కేవలము మాటలతో చెప్పిన తీరునదిగాదు. ఇందునుగూర్చి కలకత్తా కౌన్సిలు వారు సీమడైరెక్టర్లకిట్లు వ్రాసిరి. "పన్నుల వసూళ్ల విషయములో నవాబునౌకర్లకును, కంపెనీ ఏజంట్లకును నిరంతరము పోరాటము జరుగుచున్నది. కంపెనీ యేజెంట్లు ప్రజలనుండి బలాత్కారముగ లంచములలాగియు మరి యితరవిధములను వారిపై గావించు దుర్నయములు మితిమీరినవి. ఇట్టి దుర్నయములను రూపుమాపుట యెటులాయని మేము చాల దీర్ఘాలోచన గావించితిమి. ఈ చెడుగులనెల్ల మూలచ్ఛేద మొనరించుటకు బెంగాలు, బీహారు, ఒరిస్సారాష్ట్రములపై

దివానిగీరీ కంపెనీవారి చేతులలోనికి వచ్చిననేతప్ప వేరొండు మార్గము లేదని కౌన్సిలువారెల్లరు యేకగ్రీవముగ అభిప్రాయ పడిరి. మొగలాయి చక్రవర్తియొక్క అధికారము మూలద్వారా బంగాళమునందు స్థాపన యగుటవలన అతని వాక్కులు కూడ అక్కడ సక్రమమయ్యెను. తన యధికారమును మన మిక్కిలి స్థాపించినందుకు చక్రవర్తి మనయెడ కృతజ్ఞతను, న్యాయమును, నీతిని పాటించి. దివానిగీరీయను యీ ముఖ్యోద్యోగమును మనకంపెనీ కిచ్చుట యుచితమని తలచెను.

యీమూడు రాష్ట్రములపై పన్నులను వసూలుచేయుటయు, సైన్యములకును బంగాళాశాతక్కుకును కావలసిన ఖర్చులుపోను మిగతా సైకమునంతయు ఢిల్లీకిగాని, చక్రవర్తియుండు మరి యొక చోటునకుగాని, లేక చక్రవర్తి పంపమన్న యితరచోట్లకు గాని పంపుటయు ఈ యుద్యోగముయొక్క ముఖ్యలక్షణములు. ఈ ఖర్చులుపోను, మిగతా ధనమంతయు శాశ్వతముగా కంపెనీ వారికే చెందునట్లు చక్రవర్తి తన సన్నదులో నుదహరించిన కొన్ని షరతులపై అంగీకరించెను. వసూలైన రెవెన్యూలో నుండి సైన్యపుఖర్చులను కంపెనీవారే భరించుకొని బంగాళా నవాబుకు అతని దర్జాను నిలుపుకొనుటకును ఇతర చిల్లర ఖర్చులకును సాలుకు 53 లక్ష లిచ్చునట్లు నవాబు అనుమతితో మేము షరతుల నేర్పరచు కొంటిమి. ఇట్టి షరతులతో నవాబు పరిపూర్ణ సంతుష్టి నొందుటకు తగిన కారణములున్నవి. ఏలననగా, తనకెట్టి కష్టమును అపాయమును లేకయే తన యిచ్చవచ్చిన రీతిని దర్జాగా భోగములం దోలలాడుటకు కావలసినంతసొమ్ము తేరగా లభించుచుండెను.

ఇంత కెక్కువ బాధ్యత యున్నయెడల ఆతని భోగములకును, తక్తునకును భంగము కలుగవచ్చును. కంపెనీ వారెంతయో ద్రవ్యమును, రక్తమును ధారవోసి తనకు సంపాదించిపెట్టిన యధికారమును భోగమును నశింపవచ్చును." ఈ దివానీగిరీ సంపాదించినది మొదలు తమ యీ యధికారమును పెంపు చేసికొని, నవాబు అధికారమును క్రమముగా తగ్గించుట యెట్లాయని కంపెనీవారు ఆలోచనలు సాగించిరి. ఈ విషయమై తమ యుద్దేశములను వారు విస్పష్టముగా డైరెక్టర్లకు సూచింపసాగిరి. కాని, డైరెక్టర్లు దివానిగిరీ యధికారమును సంపాదించినందులకు సంతోషించుచు దానిని రాజకీయ ప్రయోజనములకై దుర్వినియోగ పరచు నుద్దేశమును మాత్రము ఆమోదింపరైరి. ఇది గమనింపవలసిన విషయమే! ఈ సందర్భమున కంపెనీ డైరెక్టర్లు కలకత్తా కౌన్సిలువారి కిట్లువ్రాసిరి. "నవాబు దర్జాను నిలువబెట్టి, రాజ్యాంగమును పూర్వపు ఆకారముతో నిలుపుట మాకు పరిపూర్ణముగ సమ్మతమే. దివానిగిరీ యుద్యోగమును కేవలము పన్నుల జమాఖర్చుపై అజమాయిషీకి మాత్రమే వినియోగించ వలసియుండునని మా అభిప్రాయము. దివానీ యుద్యోగమంతయు ఇంతియే తప్ప ఇంత కెక్కువ లేదని మా యభిప్రాయము. న్యాయపాలనము, ఉద్యోగ నియామకము, జమీందారీల నిర్ణయము మున్నగు సివిలు పరిపాలన మంతయు నవాబు యొక్కయు ఆతని మంత్రుల యొక్కయు చేతులలోనే యుండవలయును."

చక్రవర్తి ఫర్మానాను అనుసరించి మూడు రాష్ట్రముల పైవచ్చు పన్నులలో నుండి నవాబు ఇంటిఖర్చుకు 17 లక్షలును, నవాబు దర్బారు నిలుపుటకు కావలసిన రక్షకభటులు పోలీసులు వగైరాసిబ్బందికిగాను 36 లక్షలును వెరసి 53 లక్షల రూపాయలు కంపెనీ ప్రతిసాలున చెల్లించులాగున ఒడంబడిక జరిగెను. మూడు రాష్ట్రములపై వచ్చు అమాంబాపతు శిస్తులు రెండుకోట్లకు తక్కువకాదని అంచనా వేయబడెను. పన్నులను వసూలుచేయు వివరములను, విధులను దేశీయులకే వదలివేయవలెనని సీమ డైరెక్టర్లతోపాటు క్లైవును అంగీకరించెను. కంపెనీనౌకర్ల ప్రైవేటు వర్తకమును నిలిపివేయుట అవసరమని క్లైవు సీమలో నున్నపుడు డైరెక్టర్లతో గట్టిగా వాదించుచుండెను. "ఉప్పు, తమలపాకులు, పొగాకు వ్యాపారము వలన నవాబుతో ననేక కలహములు కలుగుటకు కారణమయ్యెను. కావున కంపెనీ నౌకర్లెవ్వరు యీ మూడు వస్తువులలో వర్తకము చేయరాదని గట్టిగా నిషేధించుచు, వీనిని నవాబు వర్తకులకే వదలివేయవలెను; ఇట్టి ముఖ్యమగు వస్తువులపై సర్వాధికారములు విదేశీయుల చేతులలో నుండుట నవాబున కెంత సిగ్గుగానుండునో వేరుగా చెప్పనక్కరలేదు" అని క్లైవు సీమలో నుండగ శ్రీరంగనీతులు చెప్పెను. కాని యీ నీతులన్నియు ఇండియాకు రాగానే ఇక్కడి వేడికి కరిగి నీరయ్యెను. ఆత డిక్కడకు వచ్చి నెలరోజులైనా కాకపూర్వమే, సైకన్సు, సమ్నరు మున్నగువారి మందలో చేరి తానుకూడ ఉప్పువ్యాపారము చేయసాగెను. ఈ వర్త

కములో వచ్చినలాభములో తానేమియు మిగిల్చికొనలేదనియు, పేదవారగు తనచుట్టాల పోషణమునకై సీమకు పంపుచుండెననియు, కొందరందురు. దేశీయరాజులనుండి కావలసినంత ధనము ఎక్కసముగా దోచుకొన్న ఈ క్లైవునకు ఉప్పులోవచ్చు లాభమెంత! కావున ఆతడు దానిని తన పేద బంధువుల కిచ్చెనన్నచో ఆశ్చర్యములేదు. దేశీయరాజుల నుండి లోగడ బహుమతులను మిషతో తానెంతధనముల గైకొన్నను, తన తర్వాతవచ్చిన యుద్యోగుల విషయములో మాత్రము ఈ బహుమతులపద్ధతి కూడదని క్లైవు తీవ్రముగా పట్టుపట్టి నిషేధించెను. బహుమతులతో పాటు ప్రైవేటు వర్తకముగూడ నిషేధ్యమేయని కంపెనీడైరెక్టరులు ఉత్తరువులు పంపిరి. కాని యీ యుత్తరవులను, తానిదివరకు సీమలో చెప్పిన నీతులను, క్లైవు ఒకకపెట్టున తోసిపుచ్చి, తనవారి లాభముకొరకై ప్రైవేటువర్తకమును ధారాళముగా సాగించెను.

1766 సం॥ మేనెలలో నవాబుచనిపోయెను. ఆతని తమ్ముడు "సైఫుల్‌దౌలా" రాజ్యమునకువచ్చెను. కంపెనీ వారికిని క్రొత్తనవాబునకును తిరిగి క్రొత్తఒడంబడిక జరిగెను. లోగడ తన తండ్రితోను అన్నతోను గావింపబడిన ఒడంబడికలను క్రొత్తనవాబు ధృవపరచెను. ఇదివరకు సాలుకు 18 లక్షల ఖర్చుతో నవాబునకు అంగరక్షకులుండెడివారు. వారిని తీసివేసి యీ ఖర్చును తగ్గించుకొనవలసినదనియు, ఆపనిని కంపెనీ సిపాయిలే చేయుదురనియు కంపెనీవారు

నవాబుతో బేరములు సాగించిరి. ఈ క్రొత్త మార్పును గావించుట కిదేమంచిసమయమని కంపెనీవారు తలంచిరి. ఆప్రకారము నవాబుఖర్చునకిచ్చు మొత్తములో 12 లక్షలు తగ్గించుటకు క్రొత్తనవాబుతో చేసికొన్న యొడంబడికలో క్రొత్త షరతు నేర్పరుచుకొనిరి. కాని ఈ విషయమై ఖర్చు తగ్గించినామని యిక్కడి కంపెనీయుద్యోగులు మెహార్బానీగా చెప్పుకొన్న మాటలకు సీమలోని డైరెక్టర్లు అంతగా సంతోషించలేదు. ఈ విషయమై డైరెక్టర్లు యీ విధముగా వ్రాసిరి. "నవాబుదర్జాను నిలుపుకొనుటకై మనమిచ్చు డబ్బులో నుండికాక అనవసరమగు సిపాయిలను తగ్గించుట మూలముగా మీరీ పన్నెండులక్షల ఖర్చును తగ్గించినామని చెప్పినందున మేము దీనికి ఆమోదించుచున్నాము. కాని ఇక ముందుమాత్రము ఆతని కిచ్చుమొత్తము నెన్నడును తగ్గింపవద్దు. ఏలనన ఆతడు తన ప్రజలయెదుటను విదేశస్థుల యెదుటను గొప్పగా కనుపడి తన నవాబుదర్జాను నిలువబెట్టుకొనవలెనని మేము మిక్కిలి కుతూహల పడుచున్నాము. దీనికొరకు ఆతనికి డబ్బు కావలయును గాన ఆతని వేతనమింక తగ్గింపవలదని ఆజ్ఞాపించుచున్నాము."



## భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన

## ఆరవ అధ్యాయము.

### ప్రజలగతి 1767—1770



కంపెనీ వారి వర్తకపు పట్టాను గూర్చిన పార్లమెంటరీ చర్చలును, అప్పుడప్పుడు ఆశ్చర్యముగా గన్పట్టు యుద్ధకార్యములును తప్ప వేరే భారతవర్ష చరిత్ర లేదని ఆంగ్లేయ చరిత్రకారుల తలంపు. అందుచే, ఈ రెండును లేని విషయములను వారు వర్ణింపు చుండెడివారే గారు. భారతవర్షమునుగూర్చి విపులముగను యథార్థముగను అనేకవిషయముల వ్రాసియున్న మిల్లు దొర గారు కూడ పార్లమెంటరీ చర్చలు, యుద్ధములుతప్ప మిగిలిన వానిని గూర్చి అయిదుపంక్తులైనను వ్రాయలేకపోయెను. ఇప్పుడింత కాలమైనపిమ్మట మన పరిపాలనయను విశాలాకాశమునందు చిన్నిమబ్బుగా తేలుచున్నట్లు కనుపించుచున్న యీ విపత్తు (బంగాళాకాటకము) ఆరోజులలో భయంకర పరిణామముగా గన్పట్టెను. ఈ విపత్తు తదుపరి 40 సంవత్సరములవరకు బంగాళా చరిత్రయందు మరువదగని విషయముగానుండెను.

డాక్టరు హంటరు

క్లైవు లేనికాలమున యిచ్చట నీచమగు పద్ధతులచే వాన్సిట్టార్టు మున్నగు కంపెనీ యుద్యోగస్థులు సంపాదించిన రాజ్యము నంతను దిట్టపరచుటకు క్లైవు రెండవసారి ఇండియాకు వచ్చెను. ఈ పర్యాయ మాతని పరిపాలన సుమారు రెండు సంవత్సరములు మాత్రముండెను. ఆతని యనంతరము "వరల్స్టు" ను, తదుపరి "కార్టియరు" ను కలకత్తాయందు క్రమముగా కంపెనీకి అధ్యక్షులుగ నుండిరి. వీరంత దురాశావశులుగాక శాంత స్వభావులగుటచే చరిత్రయందు అంతగా గమనింపదగిన విశేషము లేమియు జరిగియుండలేదు. చక్రవర్తికిని కంపెనీకిని గల సంబంధములలో ఆకస్మిక మగునట్టిగాని, అద్భుతమగునట్టిగాని, మార్పులేవియు జరిగియుండలేదని మాత్రము చెప్పవచ్చును. ఏలననగా, చరిత్రాంశములు రెండు రకములుగా నుండును. కొన్ని పైకి ఆర్భాటముగా గాన్పించును. కొన్ని లోలోపల నిశ్శబ్దముగా జరుగుచుండును. ఈ రెంటిలో పైకి ఆర్భాటము లేకుండ నిశ్శబ్దముగా జరుగు విషయములే యెక్కువ ప్రధానమైనవి. ఈ కాలమందు బంగాళాదేశమున గొప్ప పరివర్తనమొకటి నిశ్శబ్దముగా జరుగుచుండెను. మానవ లలాటపత్రమునందు నూతనరేఖలు నిశ్శబ్దముగా ఒక్కొక్కటియే బయల్వెడు చుండెను. భిన్నమైనట్టియు, ప్రత్యక్ష విరుద్ధస్వభావముగలట్టియు, రెండు రాజ్యాంగములు బంగాళా ప్రజలపై నేలుబడిసాగించెను. వీనిలో ఒక రాజ్యాంగము దేశీయమై యింతవరకు సర్వాంసహాధికారియై యుండెను. ఇక రెండవది విదేశీయమై

యింతవరకు మొదటిదానికి సామంతమైయుండి రానురాను కాలుద్రొవ్వుచు అనివార్యముగ కవ్వించి పైకివచ్చుచుండెను. ప్రాచీన సాంప్రదాయములందు గౌరవమును దేశాభిమానమును గలవారు ఆరిపోవుదీపమువలె వెలవెలలాడుచున్న నవాబు దర్బారుపై తమ దృష్టుల నిలిపిరి. అట్లే, కొందరు వర్తక లాభము గలుగునను నాశతోను, మరికొందరు ఉగ్రశాసన భీతితోను కంపెనీవారిని జూచుచుండిరి. ప్రజలభావములు సహజముగ పూర్వాచారములకును పూర్వశాసనములకును బద్ధమైయుండెను. కాని, కలకత్తానుండి విదేశీయులచే తమపై జారీచేయబడు వింతయుత్తరవులు ప్రజలకు దురవగాహములై భీతిని గొల్పుచుండెను. అగమ్యగోచరములుగానున్న యీశాసనములలోని నిజార్థము తెలిసికొనుటకు వారనుదినము ఆతురతపడుచుండిరి. కంపెనీవారు యెక్కువ బలవంతులనియు, వారినెదుర్చుట నిష్ప్రయోజనమనియు కేవలము బెదురుచే ప్రజలెట్లు కంపెనీవారికి వశమైనదియు, యీరీతిగ కొన్ని సంవత్సరములు జరుగునప్పటికి మారుపలుకకుండ అణగిపడి యుండుటయే ప్రజలకెట్లు సహజస్వభావమై పోయినదియు, చెప్పదలచుకొనిన చాల గ్రంథమగును.

అక్కడక్కడ చిల్లర రాజులయొక్కయు, సామంతులయొక్కయు దౌర్జన్యములవలనను, అంతఃకల్లోలముల వలనను స్థానికముగ ప్రజలకు యిదివరలో గలుగుచుండిన యిబ్బందులన్నియు పైనుండివచ్చిన యీ విదేశీయుల యధికారముచే కొంతవరకు మాటుమణగెను. అందుచే ప్రజలీ యధికారమును మొదట కొంతవరకు సంతోషముతో నాహ్వానించిరి. స్థానిక

ముగ నక్కడక్కడనున్న చిల్లరరాజ్యములన్ని తుడిచివేయబడు టచే దేశము మొత్తముమీాద కొంతమేలు కలిగెనని చెప్ప వచ్చును. కాని, యీా లాభమైనను స్థానికముగ ప్రజలకుగల హక్కులను ఆస్థులను వ్యక్తిస్వాతంత్ర్యములను కంపెనీవారుభంగ పుచ్చకుండ భద్రముగ కాపాడిన చోట్లనే గలిగెను. విదేశీ యులు తమ స్వప్రజలపై దౌర్జన్యముగ ప్రయోగించిన యధి కారము వలన కొందరికి కొన్ని కొన్ని చోట్ల కొన్ని మేళ్లు కలిగినవని చెప్పవచ్చును. అందుకు నిదర్శనములు లేకపోలేదు. కాని, కొంతకాల మగునప్పటికి యిందిమిడియున్న మానహీనత ఆమేళ్లను పొందినవారికే తెలియవచ్చెను. మానమును, దేశ గౌరవమును పోగొట్టుకొని పొందు లాభ మేటిలాభమని వారికే క్రమముగ తెలియవచ్చెను. పోనీ, యీా రీతినైనను కలిగిన మేళ్ళయినను యెక్కువగ లేవు. అవియు బహు అరుదుగ నుండెను. ఈ మేళ్లనుపొందిన వారిలో ఒక్కరైనను వానిని కృతజ్ఞతతో స్వీకరింపను లేదు. అట్టి కృతజ్ఞతకు విదేశీయులు నిజ ముగ, న్యాయముగ పాత్రులయియు నుండలేదు. ఏలననగ, న్యాయపరిపాలనము నందును, స్థిర చరాస్థులకు సంబంధిం చిన వ్యవహారములందును అనాదినుండియు పారం పర్యముగ వచ్చుచున్న చట్టముల నన్నిటిని మధ్యవచ్చిన యీా విదేశీయులు దౌర్జన్యముగ తీసిపారవేయుచుండిరి. అట్టిచో ప్రజలెట్లు యీా విదేశీయులయెడ కృతజ్ఞులై యుండగలరు? కేవలము, సింహాసనములపై కూర్చుండు రాజులలో యెన్ని యుపద్రవపు మార్పులు గలిగినను, సాధారణముగ ప్రజల సౌఖ్యమున కెట్టి భంగమును కలుగదు—కనీసము తాత్కాలి

కముగనైనను,—పైకికనుపడునంతగనైనను—కలుగదని చెప్ప వచ్చును. కేవలము, రాజులకు రాజులకు —ప్రభుత్వములకు ప్రభుత్వములకు—జరుగు వ్యవహారములు ప్రజలకంతగ పట్టవు. రాజులు తమదేశమందు పరిష్కరించు పెద్ద పెద్ద రాజకీయ సమస్యలు సైతము సాధారణముగ ప్రజల కంటవు. కాని, తమ నిత్య కృత్యములలో వారు జోక్యము కలిగించు కొన్నప్పుడు మాత్రము రాజనువాడొకడు గలడనియు, తమపై ప్రభుత్వ మనునదొకటి గలదనియు ప్రజలు గుర్తింతురు. అప్పుడే రాజు "నేనొకడను పైనున్నా" నని ప్రజలకు స్ఫురింపజేయుటకు గాని, తద్వారా వారిపై తన యధికారమును పలుకుబడిని చలాయించుటకుగాని వీలేర్పడును. ఇతర సమయములందు రాజుకును ప్రజలకును సంబంధమే యుండదు. చిల్లర సామంతరాజ్యము లన్నియు, క్రమముగ సరిగ సార్వభౌమాధికారము క్రిందికి రాకతప్పదనుమాట నిజమే; మరియు, "యథారాజా తథాప్రజా" యనునట్లు సార్వభౌమాధికార మెట్టి లక్షణములతో కూడుకొని యుండునో, సామంతరాజ్యములును అట్టి లక్షణములతోడనే కూడుకొని యుండును. కాని సాధారణముగ యీ రహస్యమును గుర్తించుటకు ఎంతో కాలముపట్టును. ఎంతో అనుభవముమీదను, సూక్ష్మమగు యోచనమీదనుగాని, యీ రహస్యము తేటపడదు. విదేశీయులు తమ బుద్ధిసూక్ష్మముచేతను, వివేకముతోను, జాగరూకతతోను పరిపాలనయందు అనేకమగు మార్పులగావించిరి. ఇవి ప్రజల యనురాగమునకు ప్రేమకు పాత్రములుగా లేకున్నను, వారల బుద్ధికి మాత్రము మెప్పు

గలిగించునవిగ నుండి యుండవచ్చును. ఈ మార్పులవలన ప్రజలకు గలుగు లాభములు బుద్బుదప్రాయములును, క్షణభంగురములునైనను అదివరకు చెడుపరిపాలనచే విసిగి వేసారియున్న ప్రజలకు యివే మహాప్రసాదములుగ గన్పట్టియుండ వచ్చును. పరదేశస్తులు యింటిలోదూరి చేయుమేళ్లు కేవలము కృత్రిమమైనవనియు, మేడిపండువంటివి సుమా యనియు కించిత్తైనను గ్రహించక, కేవలము అవిచారముగ, అప్పటికి గల అవస్థనుబట్టి, సంబరముతో చంకలుకొట్టుకొనుచు, భారతప్రజలు స్వీకరించిరని మన మనుకొనవలసి వచ్చుచున్నది.

ప్రాచ్యఖండముల జయించుటలో మనకు (ఆంగ్లేయులకు) మొగమాటముగాని మంచిచెడ్డలుగాని పాటింపనవసరము లేకుండెను. ప్రతిరాష్ట్రమందును రాజకీయాధికారములను కూలద్రోయుటయే గాక దేశీయుల ప్రాచీనధర్మములను చరస్థిరాస్థులకు సంబంధించిన చట్టములను, పన్నులవిధించు పద్ధతులను సమస్థమునుగూడ కూలద్రోసితిమి. ఒక్కమారుగా నిట్టి విప్లవకరమగు మార్పు లేలగల్గెనో తెలిసికొనుటకు అప్పటికంపెనీ పరిస్థితులును వానినిగూర్చి పార్లమెంటువారొనర్చిన చర్యయు, తెలిసికొనుట అవసరము. దివానీ సంపాదనవలన కంపెనీ షేర్లకు ధర విపరీతముగా పెరిగెను. ఇదివరకిచ్చుచున్న నూటికి ఆరురూపాయల లాభమును పదిరూపాయలకు హెచ్చింపవలసినదని కంపెనీ భాగస్వాములు తీర్మానించిరి. కంపెనీవారీవిధముగా గొప్ప లాభమును సంపాదించుటచూచి సీమ ప్రభుత్వమునకు కండ్లు

కుట్టెను. కంపెనీకివచ్చు లాభము నిజముగా వర్తకలాభమని చెప్పుటకు వీలులేదు. కావున ఇండియాయందు రాజులతోను ప్రజలతోను జరుగు వ్యవహారమంతయు కంపెనీచేగాక, సీమ ప్రభుత్వమువారిచేతనే జాతీయధర్మముగ సాగింప బడవలెనని అప్పుడే కంపెనీ యుద్యోగమును విరమించిన "గ్రెన్విలు" ప్రభువు నిర్మొగమాటముగా కంపెనీ అధికారులతో చెప్పెను. ఈ అభిప్రాయమును ఆచరణలోనికి తెచ్చుటకు "గ్రెన్విలు" ప్రభువునకు కాలములేకుండెను. "ఛాదము" రెండవసారి ప్రధానమంత్రియైనపుడు తానుచేయదలచిన గొప్ప ఘనకార్యములలో ఇండియావ్యవహారములను చక్కబెట్టుట ప్రధానమైన దిగా నుండెను. ఈస్టుఇండియా కంపెనీవారు ఇండియా దేశమున చేయుచున్న వ్యవహారముల మంచిచెడ్డలగూర్చి విచారించుటకుగాను విచారణ సంఘము నొకదానిని ఏర్పరుప వలసినదని ఛాదము ప్రభువు "ఆల్డరుమెను బెక్ఫర్డు" అను పార్లమెంటు సభ్యునిచే నొకతీర్మానమును పార్లమెంటులో నుపపాదింపచేసెను. కాని, కంపెనీవారు ఇండియాలో నెవరి అదుపు ఆజ్ఞలు లేక విచ్చలవిడిగా సంచరించిననే తమకెక్కువ లాభము కలుగునని యిదివరలో రుచిమరిగిన స్వార్థపరులు కొందరీ తీర్మానమును ప్రతిఘటించిరి. కాని 129 మంది యీ తీర్మానమునకు అనుకూలముగను 76 గురు ప్రతికూలముగను సమ్మతుల నిచ్చినందున తీర్మానము నెగ్గెను. పిమ్మట 15 దినములకు 1756-66 సంవత్సరముల మధ్య కంపెనీ వారు దేశీయరాజులతో చేసికొన్న యొడంబడికలనకళ్లను వానికిసంబంధించిన యావత్తురికార్డును, కంపెనీవారి యాధీన మందున్న

దేశములపై వచ్చు రెవిన్యూ లెక్కలను, తమ యెదుట దాఖలు చేయవలసినదని పార్లమెంటువారు ఆజ్ఞాపించిరి. భారతదేశమందు కంపెనీవారి నడతకు తగిన కట్టుదిట్టముల నేర్పరచి యిదివరకు కంపెనీకిని అందలివ్యక్తులకును చెందుచున్న లాభమంతయు, ప్రభుత్వమునకే చెందునట్లు చేసికొనుటకై సీమ ప్రభుత్వమువారి యెత్తు నెత్తిరని కొందరు తలంచిరి. ఇట్లేర్పడిన కమిటీవారు 1767 వ సంవత్సరము మార్చి ఆఖరు వరకు తమ పని ప్రారంభింపలేదు. మే నెల ఆరవ తేదీ నాటికైనను విశేషము పనిజరిగి యుండలేదు. ఇట్లుండగా, మే ఆరవ తేదీన కంపెనీ భాగస్వాములు సమావేశమై అమిత మగు దురాశావేశముతో తమషేర్లపై నూటికి 12½ లాభము పంచుకొనవలెనని తీర్మానించుకొనిరి. అంతర్మాత శూన్యమగు సీమ పార్లమెంటుకు సైతము వీరిచర్య అసహ్యమయ్యెను. ఇట్టి దురాశాపూరితమగు తీర్మానమునకు సంబంధించిన కాగితముల నన్నింటిని తక్షణము తమకు దాఖలు చేయవలసినదని మరు నాడే పార్లమెంటువారు బెదరింపు వాక్యములతో కంపెనీకి హుకుంబంపిరి. అంతట కుంపిణీ భాగస్వాములు తక్షణమే సమావేశమై తమకు సాలుకు నాలుగులక్షుల సవరనులైనను లాభము పంచుకొననిది తమకు గిట్టదని చెప్పుచు, దాదాపు వెనుకటి తీర్మానమునే మరల గావించిరి. తమ యధికార మును కంపెనీవారీరీతిగ యెదిరింపదలంచినందుకు పార్లమెంటున కాగ్రహముగలిగెను. కంపెనీవారు నూటికి 10 రూపాయిల కంటె యెక్కువలాభము పంచుకోరాదని కమిటీ అధ్యక్షుడగు "ఫుల్లరు" గారు పార్లమెంటునందు తక్షణమొక బిల్లును

ప్రవేశపెట్టెను. అనేక దినములు తీవ్రచర్చలు జరిగినపిమ్మట యీ బిల్లు 28 వ మే తేదీన పార్లమెంటులో ఆమోదింపబడెను. ప్రైవేటు ఆస్తులపై వ్యక్తులకుగల హక్కులను యీ బిల్లు భంగపరచుచున్నదని ప్రభువుల సభలో “మాన్సుఫీల్డు” వగైరా ప్రభువులు ఖండించిరి. కాని, యీ విషయమై ప్రజాభిప్రాయము తీవ్రముగానుండెను. బిల్లు నెగ్గించుట నిష్ప్రయోజనముగా నుండెను. ఈ బిల్లుతోపాటు యింకొక రెండవ బిల్లుకూడ ఆ సభయందే ఆమోదింపబడెను. కంపెనీవారికి బంగాళా దేశము నుండి వచ్చు రెవిన్యూలోను సాలుకు 4 లక్షలు పౌనులు తమ సీమ ప్రభుత్వమున కిచ్చిననే గాని కంపెనీ వారి వర్తకపు పట్టాను తిరిగి ఈయమని ఈ బిల్లునందు నిర్ణయించి చేయబడెను. బంగాళా దేశముపై పన్నులను వసూలు చేయు అధికార మెవరి లాభము కొరకై దేశీయుల చేతులలో నుండి విదేశీయుల చేతులలోనికి మార్చబడెనో యిప్పుడు స్పష్టమగుచున్నది. దోపిడి సొమ్మునెవరు పంచుకొనవలయునను పెనగులాటలలో ధర్మము, నీతి, కారుణ్యము మున్నగు ఉత్కృష్ట ధర్మములు మంటగలసెను. అప్పుడు ప్రధానిగా నుండిన ఛాదము ప్రభువు మనసు యేలనో తిమిరావృతమై యుండెను. ఆతడు నామకః అధికారము వహించి యుండెను. ఆతడు తన మందిరము నుండి వెలికివైనను రాక యేకాంతముగ అందే కాలము గడపుచుండెను. నెలల తరబడి పార్లమెంటుకు గాని, తదితర సభలకుగాని రాకుండెను. తుదకు మిత్రులకు దర్శనమిచ్చుట గాని, ఉత్తరములకు ప్రత్యుత్తరములు వ్రాయుటగాని మా

వేసెను. సంవత్సరాంతమున తన ప్రధాన మంత్రి పదవిని వదలుకొనెను. ఆతడు తిరిగి రాజ్యాధికారమునకు రాలేదు. తదితర రాజకీయ వేత్తలు యూరపు అమెరికా ఖండములం దును ఇతర వ్యవహారము లందును మునిగియుండి ఇండియా వంక చూడరైరి. అందుచే ఇక్కడ కంపెనీవారు యెవరి అనుపు ఆజ్ఞలు లేక యథేచ్ఛముగ విహరించు చుండిరి.

1769 వ సంవత్సరములో తిరిగి కంపెనీకిని సీమప్రభుత్వమునకునుగల ఒడంబడిక ధృవపరుప బడవలసివచ్చెను. ఇప్పుడు పార్లమెంటునకు నార్తు ప్రభువు నాయకుడుగానుండెను. ఈతని నాయకత్వము ఆలోచనారహితమై వినోదకరముగ నుండెను. పూర్వపు షరతులపై కంపెనీకి భారతదేశమును యిచ్చవచ్చినరీతిని కొల్లగొట్టుకొనుటకు పట్టానిచ్చెదననెను. సాంఘిక రాజకీయాది నియమముల వేనిని విధింపలేదు. కాని, ఇప్పటినుండియు భారతవ్యవహారముల గూర్చి పార్లమెంటులో యొక నూతన వాణి వినవచ్చెను. భారత దేశమునెడ గావించిన యపచారములనెల్ల మహోదార భావముతో నెదిరించి గర్జించిన యావాణి నేటికిని దేశగౌరవమును ఆత్మగౌరవమును పాటించు నెల్లరి హృదయాంతరాళములందును మార్మ్రోగుచునే యున్నది. ఇప్పటికి మూడేండ్ల క్రిందట "వాండో వారు" మండల ప్రతినిధిగా వాణీప్రసాదుడగు నొకానొక వ్యక్తి పార్లమెంటు భవనమున ప్రవేశించియుండెను. తన సహజ ధైర్య స్థైర్యముల చేతను, పుష్కల వాక్చతురత్వము చేతను, భావస్వాతంత్ర్యము చేతను, ఈ వ్యక్తి ఇది వరకు సామాన్యు లెవరును పొందజాలని యున్నత పదవిని

అచిరకాలములో నధిష్ఠించెను. ఆ వ్యక్తియే "బర్కు-ప్రభువు". భారత వర్షమునెడ నిర్వర్తింప వలసిన మహోత్కృష్ట ప్రభుధర్మములను క్రమముగ నిర్వర్తింపక ఇంత నిర్లక్ష్యముగ నార్తు ప్రభువు ప్రవర్తించుచున్నందులకు నిష్కల్మషచిత్తుడగు బర్కునకు నిజముగ ఆశ్చర్య విషాదములును, అసహ్యమును, ముప్పిరిగొనెను. ఈ ప్రధానమంత్రి ప్రవర్తన యందు నీతియు, వివేకమును, ఇంత శూన్యమైనందుకు "బర్కు" తలవాయునట్లు ఆతనిని చివాట్లు పెట్టెను. "కంపెనీతో నార్తు ప్రభువు చేయు ఈ బేరము నిజముగా బేరముగాదు.—లంచము—" అని "బర్కు" గర్జించెను. "కంపెనీ ఆదాయమును లెక్కవేసి జూడక, అందువచ్చు నష్టములను గమనింపక, అందలి పరిస్థితులను పూర్తిగా విచారింపక వర్తకపు కంపెనీ నుండి నాలుగు లక్షల పౌనులు తీసికొనుట కేవలము దొంగలదోపిడిగాని వేరుగాదు" అని వాదించెను. సంభాషణల యందును, చర్చలందును, ఆయన చూపు తీవ్రతను బట్టి "బర్కు" కంపెనీవారి నుండి యేదో, కొంచెము "నంజి" నాడని (లంచముమేసినాడని) కొందరు కుబుద్ధులు అనుమానపడిరి. లేని యెడల తనకు గాని, తనకు ఓట్లు నిచ్చినవారికిగాని సంబంధింపని యీ ఇండియా విషయమందు "బర్కు" కు యింత ఆవేశమేల కలగవలెనని వారు అనుకొనిరి.ఈవిషయమై యీతడు నిరంతరముచూపుఉత్సాహమును పట్టుదలను జూచి యితని స్నేహితులలోకూడ పలురువు నిరుత్సాహపడిరి. ఇట్టి పద్ధతులవలన దేశమునకు కీడుమూడునని యీతడు పలుకు వాక్యముల నెవరును లెక్కసేయలేదు.

ఆతడు కడుదూరదృష్టితో చెప్పిన జోస్యము నెవరును నమ్మ లేదు. "మనమిట్లు కంపెనీని గుడ్డిగా డబ్బుకొరకు నొక్కిన యెడల వారు ఇండియాలోని తమ నౌకరులను నొక్కుదురు. వారు తిరిగి దిక్కుమాలిన భారత ప్రజలను పీడింతురు" అని బర్కు చెప్పెను. కాని యీతనిమాటలు వారికి వెక్కిరింతగా కనుపించెను. "సప్త సముద్రముల కావల ఇండియాలో నేమిజరుగుచున్నదో ఈ యన జూచివచ్చినాడా?" అని అందరును వేళాకోళము చేయసాగిరి. నిజముగా అక్కడనేమి జరిగిన వారికేమి? బర్కు దేవదూతవలె మాట్లాడెను. కాని పార్లమెంటు సభ్యులందరు పకపకా నవ్వసాగిరే కాని ఆతని పక్షమున యెవరును చేతులెత్తరైరి. అంతటితో బర్కునకు మరింత ఉడుకుబోతు తనమువచ్చెను. అందుచే యాతని మాటలు సభికులకు మరింత పేలవముగా కనుపించెను. బ్రహ్మదేవుడు బర్కును పుట్టించునపుడు పాపము అతనికి అన్నిగుణములు నిచ్చెను గాని సమయోచితమైన "యుక్తి"ని మాత్రము నిచ్చుట మరచెను. ఇట్టిసమయోచిత యుక్తి యాతని వద్ద బొత్తుగా లేదు. ఇది కొనుక్కొనుటకు బజారున దొరకునదియు గాదు. పాండిత్యముచేగాని, శిక్షణచేగాని, అనుభవముచే గాని, సంపాదించుకో దగిన వస్తువునుగాదు. తన్ను గురించి లోకు లెట్టి నీచాలాపము లాడుచున్నారో ఆతని మొగము యెదుట నిర్మొగమాటముగా చెప్పుటకు ప్రతివారును జడిసెడివారు. ఇంత నిర్మొగమాటముగా చెప్పిన యెడల ఆతడు తమపై బడునను జంకుచే యెవరును ఇట్టి పనికి సాహసించెడివారు కారు. కాని, "రిచ్మాన్డు" ప్రభువు

మాత్ర మొకసారి లోకులు బర్కును గూర్చి అనుకొనుచున్న నిందాలాపముల గూర్చి బర్కుతో నిర్మోగమాటముగా చెప్పెను. మరియు, లోకు లిట్లనుకొనుచున్నను తాను మాత్రము వానిని నమ్మజాలనని కూడా జాగ్రత్తగా చెప్పెను. కాని, అహంకారపూరితుడగు బర్కు మాత్రము సున్నితమగు నిట్టి మాటలచేగాని, సలహాచేగాని, మారువాడుగాడు. తాను పూనుకొన్న పనిచేసితీరవలెను. దానిని, తనకు చేతనైన విధముననే చేయగలడు గాని పాపము— ఇంకొక విధముగా నెట్లుచేయగలడు? భారతదేశమునకు న్యాయ మొనగూర్పుటయే ఆతని కిష్టదైవముగా నుండెను. ఇట్టి ధర్మనిర్వహణాకాంక్షచే ప్రేరితుడై నిశ్శబ్దమగు నిశీథసమయమున ధర్మదేవత యగు తన ఇష్టదైవమును ఉపాసించుచుండెను. ధర్మదేవతా సాక్షాత్కారముచే ఆతడు మరింత యావేశపూరితు డగుచుండెను.

మొగలాయి ప్రభువులకు వట్టి తక్తు మాత్రము నిలిచెను. రాజదండము చేతినుండి జారిపోయెను. దేశీయ రాజ్యాంగము యొక్క బహిరంగ వేషము మాత్రమెట్లో నిలిచెను. అధికారాలంకారములును, చిహ్నములును, నామమాత్రముగ నుండెను. కాని, నిగ్రహానుగ్రహశక్తి నశించెను. ప్రజలను రక్షించుటకుగాని, వారిని అదపుఆజ్ఞలలో నుంచి నడిపించుటకుగాని, మొగలు చక్రవర్తికి అధికారము అంతరించెను. పది సంవత్సరముల విదేశపరిపాలన జరిగిన పిమ్మట ప్రజలగతి యెట్లుండెను? క్రూరుడగు ఈజిప్టు చక్రవర్తిక్రింద ఘోరబాధల నొందిన ఇస్రాయేలు ప్రజలవలె పదేండ్ల విదేశపరిపాలన క్రిందనున్న

భారతీయులును రోదనము చేయలేదా! "అయ్యో! పూర్వా ర్జితమగు మా యాస్తులన్నియు విదేశీయులపాలయ్యెను. ఇండ్లు వాకిళ్లన్నియు పరులపాలయ్యెను. మా నూతిలోని నీళ్లే మేము డబ్బిచ్చి కొనుక్కొని తాగవలసివచ్చెను. మా యడవుల లోని వంటచెరకే మేము పరులకు సొమ్మిచ్చి కొనుక్కొన వలసివచ్చెను. గడ్డిపోచ చేయని తోత్తులుకూడ మాపై 'జులుము' చేయసాగిరి. అయ్యో! మమ్ములను బాధించు యీ విదేశీయులనుండి కాపాడు దిక్కెవ్వరు లేరు."

1768 సం॥ లో బంగాళాదేశము నందంతటను వరిపంట నష్టమయ్యెను. "కాని పన్నులు అంతఖచితముగ అడివర కెన్న డును వసూలు చేయబడలేదు." ధరలు విపరీతముగ హెచ్చెను. అందుచే రైతులకు విత్తనములుకూడ మిగులలేదు. అట్లయ్యును 1769 జనవరి ఫిబ్రివరి నెలలలో బంగాళములోని ధాన్యమం తయు ఇతరచోట్ల కెగుమతి చేయబడెను. మదాసులోను, ఇతరచోట్లను, బేరగాండ్లు యెక్కువ ధరలనిచ్చి బంగాళము లోని ధాన్యమంతటిని కొనివేయసాగిరి. అధికారులెవ్వరు యీ విషయమై తగు జాగ్రత్త వహింపలేదు. ప్రజలగతి యేమగునను సంగతి వారిమనసులకే పట్టలేదు. కోతలసమ యమున, యీ సంవత్సరముకూడా, అతివృష్టిచే పండిన కొలది పంటయు పూర్తిగ నష్టమయ్యెను. ఈరీతిగా అతివృష్టి, అనావృష్టులచే, పంటలు కరవయ్యెను. ప్రతిచోటను పం టలు పాడయ్యెను. వరిచేలన్నియు పట్టి గడ్డిచేలయ్యెను. అప్పుడు గవర్నరుగానున్న "వరల్సు" సీమకు అనేక యుత్త రముల వ్రాయుచుండెనుగాని అందులో యీ పంటల నష్ట

మును గూర్చి ఒక మాటయైనను వ్రాసిన పాపమునపోలేదు. సైన్యములకు కావలసిన తినుబండారములు తప్ప ప్రజలకొరకై దేశమునందు ధాన్యాదులను నిలువచేయవలెనను సంగతియే కంపెనీవారికి పట్టలేదు. ఒక్క సైన్యములగొడవే తప్ప వారి కింక యేగొడవయు పట్టలేదు. ఏలననగా, ఒక ఆంగ్లరాజకీయవేత్త చెప్పినట్లు, కంపెనీవారు బంగాళాదేశమును "ఆక్రమించుకొనిరేగాని, పాలించుటలేదు." అంతయు అయినపిమ్మట 1770 సంవత్సరము జనవరిలో కంపెనీవారు సీమకు వ్రాసినయుత్తరములో ఒకమూల ఒక చిన్నవాక్యమును మాత్రము యిరికించిరి. ఒక్కజిల్లాలో మాత్రము తిండిలేక ప్రజలు తీవ్రముగా బాధపడుచున్నారు. కాని ఫరవాలేదు. మనరెవిన్యూకు మాత్రము యింతవర కెట్టిలోపము గలుగలేదు. ప్రజలు తిండిలేక మాడుచుండగా సర్కారురెవిన్యూకు మాత్రము లోపముకలుగలేదను మాటలోనున్న యర్థము విప్పిచెప్పనక్కరలేదు. కొంతకాలమైనపిమ్మట పన్నుల వసూళ్లలో కొంచము సదుపాయముగా పోయిన బాగుండుననియు, తామింతకంటె యెక్కువ చేయదగినదేదియు లేదనియు గవర్నరుకు తట్టెను. కాని, ప్రజలప్రాణములను రక్షించుటకు తగిన తదితర సాధనముల నవలంబించుట తమ పనికాదని కంపెనీవారు తలంచిరి. వర్షములులేక పంటలు ఈరీతిగా నశించినపుడు దేశీయరాజులి దివరకు పన్నులవసూళ్లు మానుకొనుటయే గాక రైతులకు కొంతద్రవ్యమును గూడ అడ్వాన్సుగా నిచ్చుచుండిరి. ఇట్టి పద్ధతినే యవలంబించుటకై కంపెనీకోటలో కొందరు సూచించిరి. కాని, ఎక్కడనో

బహుళరుసుగాతప్ప యీ పద్ధతిని కంపెనీవారు అమలు జరుప లేదు. ఏప్రిలులో అపరధాన్యములుగూడ కొద్దిగా ఫలించెను. అయినను ఆసాలున నూటికి 10 రూపాయిలు యెక్కువశిస్తు వసూలు చేయబడెను. ప్రజల లేమిడిబాధ తీవ్రమయ్యెను. మే నెల సగము జరుగునప్పటికి దేశమన్ని ప్రాంతముల నుండియు ప్రజలరోదనధ్వనులు వినవచ్చెను. "తిండిలేక కోట్లకొలది ప్రజలు 'అన్నమో రామచంద్రా' యని మొరలిడుచు బిచ్చమునకు బయలుదేరిరి. అదియూ దొరకక మరణించువారిసంఖ్య లెక్కింప తరముగాకుండెను. ఒకప్పుడు ధనధాన్యసమృద్ధితో తులదూగుచున్న "పూర్ణియా" రాష్ట్రములో మూడవవంతు ప్రజలు నశించిరి. తక్కిన ప్రాంతములలో కూడ యీ గతియేపట్టెను." కంపెనీవారిచే యుద్యోగమునుండి యింకను తొలగింపబడక నిలిచియున్న దేశీయోద్యోగుల ద్వారా ప్రజలు తమ మొరలను నిరంతరము కంఫెనీవారికి తెలుపుకొనుచుండిరి. ప్రజ లనుభవించు ఘోరబాధలు కంపెనీ చెవులకు శరపరంపరలుగ వచ్చి పడుచుండెను. మధ్యనున్న యీ దేశీయోద్యోగులు ప్రజలయెడ నిజముగా తమకున్న సానుభూతితోడనే గాక, కొంతస్వార్థపరత్వముతోగూడ, ప్రజలబాధలను గూర్చిన వృత్తాంతములను కంపెనీవారికి తెలుపుచుండిరి. హిందూ పోలీసులకును తురక తహస్సీల్దారులకును గూడ కొంతదయాదాక్షిణ్యము లున్నవని చెప్పవచ్చును. కాని ప్రజలుచాల బాధలుపడుచున్నను "మేమెంత కష్టపడి యీపన్నులను వసూలుచేసినామో చూడండ"ని మహాఠీవిగా కంపెనీ యుద్యోగస్థులతో చెప్పుకొని వారి మెప్పును

పొందుటకు గూడ వీరు ప్రజలబాధలను గూర్చి కంపెనీవారి కెరుకపరచుచుండిరి. రైతులలో, దొమ్మీలు, అల్లరులుగాని, దౌర్జన్యములుగాని లేకుండెను. బంగాళీలు సహజముగా శాంత స్వభావులు, నిరాడంబరులు. వారు సంసారములను గుట్టుగా జరుపుకొనెడివారు. దీనులకు సహాయముచేయుటకై పూను కొని వీధులవెంట బయలుదేరిన దాతలు గూడ ఇండ్లలో జనా నాలలో క్షుద్బాధచే కృశించు స్త్రీలవద్దకును, శిశువులవద్దకును, కూడ పోవుటకు వీలుండెడిదికాదు. పశువుల నమ్ముకొని కొంత మందియు, వ్యవసాయపు పరికరముల తాకట్టుపెట్టి కొందరును, విత్తనములకై మిగిల్చికొన్న గింజలు తిని కొందరును, బ్రతుకు చుండిరి. చాలమంది తమ పసిపిల్లల నమ్ముకొనజొచ్చిరి. కాని చివరకు కొనువారు లేకపోయిరి. తుదకు బ్రతికియున్నవారు చచ్చిన శవములను పీకుకొని తినుచున్నట్లు దేశీయోద్యోగులు తమ యధికారులకు తెలియపరచిరి.

తుదకు ప్రజలు తమ సాంప్రదాయ సిద్ధమగు బిడియ మును విడిచి, లక్షలకొలది పేదజనులు కృశించిపోయిన శరీరములతో, గుంపులు గుంపులుగా, పల్లెలనుండి పట్టణము లకు పారిరి. వారివెంట విషజ్వరములు మశూచి మున్నగు జాడ్యములుకూడ పట్టణములందు వ్యాపించి అందలి భాగ్యవం తులగు పౌరులకును, పాలకులకును, భీతావహము గలిగిం చెను. మృత్యుదేవత పొమ్మనినను పోక, దేశమందు పీఠము వేసికొని కూర్చుండెను. మృత్యుదేవత కవి తిరునాళ్లరోజులు. ఎక్కడ జూచినను మృత్యుదేవత మహా సంతోషముతో భయం కరముగ తాండవ మాడుచుండెను. వారములు, నెలలు,

గడచినను యీ దేవతకు తృప్తి లేకుండెను. తుదకు కాటి కాపరులకు విసుగు పుట్టెను. శవములను పీకుకొనితిను పక్షులకు, రాబందులకుకూడ వెక్కసమయ్యెను.

"షోరు" అను ఒక ఆంగ్లేయుడు యీ ఘోరదృశ్యములనన్నిటిని కండ్లార చూచెను. ఆతడు చాల సత్యవాది. అట్టివా డసత్యములు చెప్పునని యనుకొనుటకు అవకాశ మెక్కడను లేదు. ఆతడు కేవలము ఉద్రేకవంతుడుగాడు. అతనికి కంపెనీయందు అత్యంత భక్తి విశ్వాసములుగలవు. బంగాళా దేశములో నీతడు కొంతకాలము గొప్ప యుద్యోగిగా కూడ నుండెను. ధర్మనిరతి, జాగరూకత, పరిశ్రమ, సత్యానుసరణము మున్నగు సద్గుణములు ఆతనియందు మూర్తీభవించెను. అట్టివాడు కంపెనీ ప్రతిష్టకు భంగము గలుగుపట్ల అతిశయోక్తిగా వర్ణించునని చెప్పుట కెక్కడను అవకాశము లేదు. ఆ భయంకర దినములలో తాను జూచిన అత్యంత భీతావహమగు దృశ్యములను తన జన్మలో మరచిపోజాలనని అతడు యిటీవల చెప్పుచుండెను. "హృదయదారణమగు భయానకదృశ్యముల నెట్టిలేఖినియు లిఖింపజాలదు. సర్వగ్రసనమగు కాలముగూడ మనోక్షేత్రమునుండి యీ దృశ్యములను తుడిచివేయజాలదు." అంతయు నైన పిమ్మట సెప్టెంబరు నెలలో, కంపెనీవారు సీమకు పంపిన లేఖయందు కూడ యీ వాక్యములే వ్రాయబడియున్నవి. "ప్రజలనుభవించు ఘోరబాధలను గూర్చి యెంత యెక్కువగా వర్ణించినను అతిశయోక్తి గాజాలదు."

ప్రజలబాధ మిక్కిలి యుమ్మరముగా నున్నప్పుడు కలకత్తాలోని కంపెనీవారు ప్రజలపై కొంత దయచూపునట్లు నటించిరి. ధాన్యము కొన్నివారములవరకు యితరప్రాంతములా కెగుమతి గాకుండ నిషేధించిరి. కాని లోకమందిదివరకెన్నడు కనివినియెరుగనట్టి యిన్నిఘోరబాధలు ప్రజ లనుభవించు చున్నపుడు వాని నివారణకై కంపెనీవారు తమ బొక్కసము నుండి తెగించియిచ్చిన సొమ్ము నాలుగువేలనవరసులకు మించలేదు. "చేతనైతే, యిష్టమయితే దేశీయ జమీందారులే తమ ప్రజలరక్షించుకొననీ," అని కంపెనీవారు అది తమపని కానట్లు వదలివేసిరి. పాపము జమీందారులు ప్రజల బాధలమాన్పవలెనని యెంతయో జూచిరి. కాని, వారికిని సామర్థ్యము లేకుండెను. వారిపంటలుకూడ నశించుటచే వారి వద్దను ధనములేకపోయెను. వారు విపరీతపు వడ్డీలకు అప్పు తేవలసివచ్చెను. లేదా కంపెనీకి పన్నులు బకాయిపడవలసి వచ్చెను. ఇట్లయ్యును వారు తమప్రజల రక్షించుటకై చేసిన స్వార్థత్యాగము అనుపమానమని చెప్పుటకు స్పష్టమగు నిదర్శనములు గలవు. అప్పుడొనర్చిన త్యాగమువలన పిమ్మట వారు పొందిన బాధలును అపూర్వములు. తమప్రజలను తమ కండ్లయెదుట చావనిచ్చుటకంటె తాము అప్పులలో మునిగిపోయినను సరియని వారు తెగించిరి. భయోత్పాతమగు యీ సంవత్సరమునుండియే బంగాళాదేశములోని ప్రాచీన జమీందారుల నాశనము ప్రారంభమయ్యెను. వారిలో మూడింట రెండువంతులు నాశనమైరి. ఇది యిట్లుండ ప్రజలనుండి పన్నులను వసూలుచేయజాలని యీ యుద్యోగు

లను కంపెనీవారు నౌకరీనుండి తొలగించిరి. కొందరిని ఖైదులోనుంచిరి. వారి కుటుంబములకు జీవనాధారములుగా నున్న భూములను లాగికొని యితరులకు కౌలుకిచ్చిరి. కరువు ఉపశమించునప్పటికి "నడియా" రాజు అప్పులలో తల మున్కలుగా మునిగియుండెను. కంపెనీ కివ్వవలసినపన్ను బకాయి పడియున్నందున కంపెనీవా రాతనిని తొలగించి ఆతని కుమారునకు పట్టముగట్టిరి. ఇంతటితో బ్రతుకుజీవుడాయని "నడియా" రాజు బయటపడెను. "రాజషాహి" రాణి మంచి వ్యవహారతయనియు, పెద్ద జమీందారీని యెక్కువ న్యాయముగను ప్రజానురంజకముగను పాలించుచుండెను. అట్టి రాణికిగూడ యీయవస్థ తప్పలేదు. కంపెనీకి బకాయి తీర్ప నిచో జమీందారీనుండి తొలగించెదమనియు, భూములను లాగికొనెదమనియు కంపెనీవారు బెదరించిరి. పసివాడగు "బీర్భూమి" రాజు కంపెనీకి శిస్తుబకాయి పడినందుకు వా రాతనిని ఖైదులోవేసిరి. ముసలివాడగు "బిష్ణుపూరు" రాజును కూడ యిల్లు ఖైదులోవేసిరి. కాని ఆతడిక చావునకు సిద్ధముగా నున్నాడని తెలిసికొనినప్పుడే విడిచిపెట్టిరి. కంపెనీకి రావలసిన పన్ను 1,38,02,696 రూపాయలలో ఆకరువుసంవత్సరములో 65,03,550 రూపాయలు మాత్రమే వసూలయ్యెను. అనేక సంసారములు కూలిపోయినను కంపెనీ కించెత్తైనను జాలిగాని ఓర్పుగాని లేకుండెను. ఈ కాటకమువలన విస్తీర్ణములగు [illegible] ప్రాంతములు నిర్జనములై పోవుటచే మాత్రము కంపెనీ వారికి కొంచెము కలవరమునకు కారణమయ్యెను. తరువాత రెండు సంవత్సరములవరకు సాగుబడి భూమిలో మూడవవంతు

బంజారుగా నుండిపోయెనని తెలియవచ్చెను. ఇది కంపెనీకి గొప్ప దెబ్బగా కనుపించెను. అందుచే, ఇతరప్రాంతములనుండి జనులరప్పించి యీ బంజరు భూములను సాగుచేయింపవలెనని కంపెనీవారు క్రొత్త యెత్తుల వేసిరి. ఎక్కువ కాయకష్టము చేయు క్రొత్తజనులను 'ఉన్నతజాతివారిని' అనగా తమ సీమ ప్రజలను యిక్కడికి దింపవలెనని కంపెనీవారు ప్రయత్నించిరి. కాని, యీ పని వారనుకొన్నంత త్వరగా సాగలేదు. కత్తెరల చప్పుడువిని యితర మందలనుండి గొర్రెలంత త్వరగారాలేదు. తమ తెరువెరుగని బుద్ధిహీనములగు జంతువులుగదాయివి! గ్రామములు పాడుపడియుండెను. ప్రతిపొలము బంజరుగా పడియుండుటచే, అడవులయ్యెను. ఇంతకుపూర్వము 'బీర్భూము' "భీషణపురము" లందు ఆరువేల గ్రామసాముదాయిక సంఘములు వ్యవసాయము చేయుచుండెను. కరవువచ్చిన మూడు సంవత్సరములలో యీ సంఘములలో నాల్గవవంతు అంతరించెను. కాటకమైన 15 సంవత్సరములవరకుకూడ జన క్షయము జరుగుచునేయుండెను. 1789 లో గవర్నరు జనరలు వ్రాసిన లేఖలో యీ మాటలుగలవు. "బంగాళా దేశములో కంపెనీకిచెందిన ప్రదేశములలో మూడవవంతు అడవిమృగము లకు మాత్రమే వాసయోగ్యమగు అరణ్యముగనుండెను."

ఇంకను చెప్పవలసిన కథ ముందున్నది. ఆ కాటక దినములలో ఉద్యోగస్థులు ప్రజలను మోసగించి కడునీచముగ ప్రవర్తించి నటుల తెలియుచున్నది. అన్నములేక మాడు చున్న ప్రజలకొరకై దిగుమతిచేసిన ధాన్యముతో ఉద్యో గస్థులు వ్యాపారము సాగించిరి. ఆ ధాన్యమును బీదలకు

పంచిపెట్టినట్లు దొంగలెక్కలను వ్రాసి దానివలనవచ్చిన అపారమగులాభమును కాజేసినట్లు తెలియుచున్నది. తాబేదారులుగా నున్న దేశీయోద్యోగులపై యీ నిందనంతను మోపుటకు కంపెనీ కౌన్సిలువారు ప్రయత్నించిరి. కాని, సీమలోని డైరెక్టర్లు యీ టోపీలోపడలేదు. కంపెనీ కొలువులో పెద్ద యుద్యోగములందున్న తమ ఇంగ్లీషుదొరలే ఇట్టి నేరముల గావించిరని సీమలోని కంపెనీ డైరెక్టరులు నమ్మిరి. ఇట్టి నేరముల నెవరెవరు గావించిరో ఆ దొరలపేర్లు తెలుపవలసినదని సీమ డైరెక్టర్లు కలకత్తా కౌన్సిలువారిని ఆజ్ఞాపించిరి. కాని ఆ పేర్లలో ఒకటియు బైటకురాలేదు. ఆ కాలమందు కలకత్తాలో గొప్ప నౌకరీయందున్న ఇంగ్లీషువాడొకడు అపారమగు ధనరాసులతో ఇంటికి చేరెను. "సర్వేగుణాః కాంచన మాశ్రయంతి" యన్నట్లు దానితో అతని కుటుంబమునకు పెద్ద పేరు ప్రతిష్టలు వచ్చెను. అనేకమంది నౌకర్లు, దాసీలు, దాసు లేర్పడిరి. పెక్కుమంది స్నేహితు లాతనిచుట్టు మూగి మెంతయో ప్రేమను గౌరవమును చూపుచుండిరి. ఇట్లుండగ, కొన్నాళ్లకతని కుటుంబము "ప్రభుకుటుంబముల"లో చేరెను. ఇన్ని యాడంబరములతో నాతడు తన జీవితమందలి చరమయామమును హాయిగ గడుపనెంచెను. కాని, అతనికెన్ని భాగ్యభోగములున్నను, అన్నిటికన్న మిన్నయగు మనశ్శాంతి మాత్రము కరవయ్యెను. రాత్రులందాతనికి నిద్రలేదు. కన్నుమూయగనే తాను ఇండియాయందు యేడ్పించిన ప్రజల భీకర స్వరూపములు, రోదనధ్వనులు, అతని మనసు నావరించి చికాకుపరచి, నిద్రరానీయకుండ

చేయుచుండెను. ఆతడు వజ్రశరీరమును, ధైర్యసాహసము లును గలవాడయ్యు చచ్చిపోవువరకు తాను పరుండియున్న చోట దీపము లేకుండ నిద్రపోయెడి వాడుగాడు.

మరుసంవత్సరము పంటలు బాగుగనే పండెను. కాని సేద్యము చేయువారు లేక చాలభూమి బంజరుగానుండిపోయెను. చాల సంవత్సరములకుగాని జనసంఖ్య పూర్వపుస్థితికిరాలేదు. ఆకాలమందును తదుపరియు సర్కారు ఉద్యోగస్థులు వేసిన అంచనాలనుబట్టి సుమారు కోటిజనము నశింపమ్యెనని స్పష్ట ముగా తెలియుచున్నది. ప్రపంచములో మరియేదేశమందు గాని యే యుగమందుగాని యిట్టిజన నష్టమయ్యెననుమాట కని విని యెరుగము. అయినను, భూమిశిస్తు వెంటనే రెండేడ్లలో పూర్వపు మొత్తమునకు అనగా $1\frac{1}{2}$ కోట్లకు తీసికొని రాబ డెను. ఎంతయో నిర్దాక్షిణ్యమగు కాఠిన్యమును కూ్రరత్వము ను వహించిననేగాని ఇంతసొమ్ము వసూలు చేయలేకపోతిమని వారన్హేస్టింగ్సు ఒప్పుకొనెను. ప్రతి జిల్లామొత్తముమీద ఇంత సొమ్ము వసూలుకావలయునని కంపెనీవారు నజరాణా విధించిరి. ఆ జిల్లాయందు ప్రజ లున్నను లేకున్నను, భూమి సాగుబడియైనను లేక బంజరుగానున్నను, ఇంత మొత్తము ఆ జిల్లాపై వసూలుఅయి తీరవలసినదే. ఈ నజరాణా పద్ధతి పూర్వమునుండియు వచ్చుచున్నదే. కాని, స్థానికముగ వారి వృత్తులును, హక్కులును, చెక్కుచెదరకయుండుటచే సాధా రణ సంవత్సరములలో ఈ నజరాణాపద్ధతికి ప్రజ లంతగా గొణుగుకొనెడి వారుకారు. కాని, దేశములో కాటకము వచ్చినప్పుడు మాత్రము యీ పద్ధతి నిర్దాక్షిణ్యమగు అసుర

కృత్యముగ పరిణమించెను ఒక ప్రాంతమందు పంటలును జనమును శూన్యమైనపుడు ఆప్రాంతము చెల్లించవలసిన పన్ను భారముగూడ, ఒకమాదిరిగా పండి అక్కడివారికే చాలియు చాలకున్న మరియొక ప్రాంతముపై బడుచుండెను. అందుచే అక్కడి ప్రజల బాధలు మరింత దుర్భరమగుచుండెను. అంత గాకున్న లేక కొంచెము పండినచోట్ల నెవరైన పొదుపుగా వాడుకొని యేమాత్రమైన కూడబెట్టుకొన్నయెడల ఆ కొంచెమును పన్నులు వసూలుచేయు తహసీల్దారులు కర్కోటకుల వలె వచ్చి కొల్లగొన్నుకొని పోవుచుండిరి. ప్రజలిట్లు బాధపడుచున్నను విదేశీయ ప్రభువుల బొక్కసముమాత్రము ధనరాసులతో పొంగిపొరలుచుండెను. ఎక్కడనో 7 వేల మైళ్ల దూరములోనున్న కంపెని ఖామందులకుమాత్రము ముడుపులకు కొదువలేక చెల్లుచుండెను.

ఇంతవరకు నిద్రపోవుచున్న సీమప్రజల మనస్సాక్షి గూడ ఘోరవిపత్తునుగూర్చిన వార్తలవలన అకాత్తుగా మేల్కొనెను. తరువాత జరిగిన పార్లమెంటుసభలో ఇండియా వ్యవహారముల గూర్చి విచారించుటకు విచారణసంఘములను (కమిటీలను) యేర్పరుపవలెనని యిద్దరు ముగ్గురు సభ్యులు తీర్మానముల నుపపాదించిరి. ఈ కమిటీల యెదుటకువచ్చిన సాక్ష్యమునుబట్టి ఇండియాలో క్లైవును, వాన్సిట్టార్టును చేసిన కడు నీచమగు దురంతర కృత్యములన్నియు బైటపడెను. క్లైవును పార్లమెంటుసభలో నిలువబెట్టి ఖండించెదమని భయపెట్టిరి. కాని, క్లైవు తనపై నారోపింపబడిన నేరములన్ని

టిని నిర్లజ్జగ మొండిగా యెదిరించెను. పార్లమెంటు సభ వారు క్లైవు ఇండియాలో చేసిన పనులలో దాదాపు అన్నిటిని తప్పులని ఖండించిరి. కాని ఆతడు తమదేశమునకు మహోప కార మొనర్చినాడను కారణముచే, క్రొత్త రాజ్యము సంపా దించి పెట్టినాడను కారణముచే ఆ తప్పులనన్నిటిని మన్నిం చిరి. కాని, క్లైవుకు తృప్తి కలుగలేదు. తాను చేసిన పను లన్నియు తప్పులేయని పార్లమెంటు వారన్నందుకు అహంకార పూరితుడగు క్లైవు లోలోన కుములుచుండెను. అందుచే ఆతడు పార్లమెంటుసభలోనికి రాగానే సభ్యులు గౌరవపూర్వ కముగ చేసిన కరతాళధ్వనులవలనకూడ ఆతనికి తృప్తి కలుగ లేదు. ఆతడు ఒంటరిగా కూర్చున్నప్పుడు తాను ఇండియా లో చేసిన ఘోరకార్యములన్నియు ఒకసారి మనస్సునకునచ్చి ఆతనిని వెంబడించి పీడించుచుండెను. కాని వానినిమాత్రము పైకి ఉబకనీయక క్లైవు లోలోపలనే కుళ్లుచుండెడివాడు. తుట్టతుదకు ఆతని పాపముపండి బద్దలయ్యెను. అన్యాయార్జి తమైన పాపపుసొమ్మునయొక్కయు, మలినపూరితమగు నాతని కీర్తియొక్కయు భారము దుర్భరముకాగా క్లైవు ఆత్మహత్య గావించుకొనెను. ఈవార్త దేశమునంతను దద్దరిల్లచేసెను.

ఇదివరకు జరిగిన దుష్పరిపాలనకు పార్లమెంటువారు తమ్మును నిందించకుండ తప్పించుకొనుటకును ఇకముందు సక్రమముగ పాలింతుమని హామీఇచ్చుటకును, కంపెనీ డైరె క్టర్లు యెంతయో ఆత్రపడిరి. ఇండియా వ్యవహారములను

పరిశీలించి ఇదివరకు జరిగిన లోపాలోపములను విచారించుటకు ముగ్గురు పెద్దమనుష్యులను ఒక కమిషనుగా ఏర్పాటుచేసి ఇండియాకు పంపింతుమనియు, వారినివేదిక వచ్చువరకు పార్లమెంటు వారెట్టి తీర్మానమ్మును తీసికొనవద్దనియు కంపెనీ డైరెక్టర్లు పార్లమెంటుకు విన్నవించుకొనిరి. ఈ కమిషనుకు ఇండియా యందభిమానముగల బర్కునే అధ్యక్షుడుగా నుండుటకు కోరుచున్నామని కంపెనీ ఉపాధ్యక్షుడగు "సర్ జార్జికాలుబ్రూకు" తన తోటి డైరెక్టర్లకు సూచించెను. ఈ విషయమై డైరెక్టర్లు పార్లమెంటునందు ప్రతిపక్షనాయకుడగు "రాకింఘాము" ప్రభువుతో సంప్రతించిరి. కాని యేలనో రాకింఘాము ప్రభువు మాత్రము బర్కును అధ్యక్షుడుగా నియమించు విషయమై మొగమాటముచేతనో లేక ఏకారణముచేతనో ఎట్టిఅభిప్రాయమును చెప్పక యూరకుండెను. అందుచే బర్కు చాల నొచ్చుకొనెను. తన కొక్కనికేగాక దేశమంతటియొక్క శ్రేయస్సును సంబంధించిన యిట్టి ముఖ్యమగు విషయములో తన మిత్రుడును, నాయకుడును అగు "రాకింఘాము" ప్రభువు యింత నిరాదరణ జూపినందులకై బర్కుమనసు యెంతయో నొచ్చుకొనెను. ఆతడును చాలదినములు ఆలోచించి తుదకు తన బంధువులువద్దని చెప్పగా బర్కు ఇండియాకు వచ్చుటను మానుకొనెను. ధర్మచింతనమును, దూరదృష్టియు, మేధాసంపత్తియు, విశాలహృదయమును, ఉదారభావములను గలిగి—మెకాలే చెప్పినట్లు సమకాలికులలోనెల్ల వివేకమున సత్తమోత్తముడని పేర్కొనదగిన బర్కే ఆనాడు ఇండియాపై వచ్చి ఇచ్చటి పరిస్థితులను పరిశీలించి అందుపై

సక్రమమగు రాజ్యాంగసౌధమును నిర్మించుటకు కనీసము పునాదులనైనను వేసి వెళ్ళియుండినచో తదుపరి జరిగిన భారతవర్ష చరిత్ర యెట్లుగ మారియుండెడిదోగదా !

ఇంతలో మరియొక పురుషుడు క్లైవువలె సాహసికుడయ్యు భిన్నస్వభావముగలవాడై, అతనికంటె, యెక్కువ పట్టుదలయు, సమగ్రదృష్టియు గలవాడై ప్రాగ్దేశమున ఆశయను నిచ్చెనమెట్లను త్వరత్వరగ నెక్కి పైకి వచ్చుచుండెను. తాము నియమింపదలచిన కమిషనుకు అధ్యక్షుడుగానుండి ఇండియాకు వెడలుటకు బర్కు సమ్మతింపనందున డైరెక్టర్లు తమ కొలువులోనుండి ఇదివరకు పలువిధసామర్థ్యములను కుశాగ్రబుద్ధిని, గన్పరచిన యీ పురుషుని వరించిరి. కాని ప్రభువులతో చెప్పి, సిఫార్సు చేసి, యీతనిని పైకితీసికొనిరాగల స్నేహితు లెవ్వరును యితనికిలేరు. ప్రభువులప్రాపకమును సంపాదించుకొనుటకు వలయు ద్రవ్యమును యీతనివద్ద లేకుండెను. కాని యీతడు అల్పశరీరుడయ్యు దుర్బలఅవయవములు గలిగియుండియు, విసుకులేని యోపికయు, గాఢమగు జాగరూకతయు, ఉక్కువంటి మనోనిశ్చయమునుగలవాడని అతని పరిచయుల కందరకును నచ్చునట్లు ప్రవర్తించుచుండెను. ఇటువంటివాడే తమకు గావలెనని డైరెక్టర్లు యితనినే వరించిరి. భారత రాజ్యాక్రమణ చరిత్రయందు తదుపరి రాబోవు పదిసంవత్సరముల కాలములో యీతడే సూత్రధారుడుగ నుండెను. ఈతనిపేరే "వారన్ హేస్టింగ్సు."

## భరత ఖండమున

# ఆంగ్లరాజ్య స్థాపన

## ఏడవ అధ్యాయము.

---

### వారెన్ హేస్టింగ్సు 1771—73



ఇట్టి స్థితిలో బంగాళా జమిందారులకు భయముండును గాని భక్తి యెట్లుండును? తమయధికారమును ధనమును ఊడబెరికికొని తమ్మును సర్వనాశనము చేసిన ప్రభుత్వమునకు వారెట్లు యిష్టపడుదురు? వారి బంధుమిత్రులు లోన్గల ఆశ్రితులు ఆదిమొదలు సానుభూతిజూపకుండుటకు సాధ్యమా? [illegible] అధికకాఠిన్యముతో మనము ప్రజలపై పన్నులు వసూలుచేయ ప్రజలుకూడ జమీందారుల మొరలతో నేకీభవింపరా? బ్రిటిషు అధికారమువలన జమీందారులు నాశనమైరి. అట్లే ప్రజలుకూడ తమ దేశరాజ్యాంగ వ్యవహారములందెట్టి బాధ్యతయు అధికారమును లేకుండ చేయబడిరి. ఇవి యన్నియు అవశ్యముగ బ్రిటిషుపరిపాలనాస్థాపనకు హేతువులుగ పరిణమించెను. కాని మనమింతకంటె యెక్కువ ఉదారనీతి ప్రదర్శించియుండిన మొదట మనరాజ్యమును యెక్కువ గట్టిపునాదులపై స్థాపించి యుండెడివారము.

షోర.

1773 సంవత్సరము వరకు ఇండియాలో బ్రిటిషువారి స్వాధీనమందున్న ప్రాంతములన్నిటిని బొంబాయి, మదాసు, కలకత్తాలందుగల మూడు ప్రత్యేకకౌన్సిల్లు పరిపాలించు

చుండెను. ఒక్కొక్క కౌన్సిలుకు అచ్చటనున్న యుద్యోగులలో నొకనిని సీమడైరెక్టర్లు అధ్యక్షునిగా నియమించుచుండిరి. సమానాధికారములు గలిగి, ఒకరితో నొకరికి సంబంధములేక స్వతంత్రముగనుండిన యీమూడుకౌన్సిళ్లమధ్య వైషమ్యములకు తక్కువలేకుండెను. ఎక్కడివారికక్కడనే స్థానికాభిమానములు, స్వార్థలాభములు నుండెను. ఒకరికొకరు బహుదూరమందుండుటయేగాక, భిన్న పరిస్థితులందు గూడ నుండిరి. ఇదిగాక, వీరిలో వీరికి పరస్పర మాత్సర్యము ఈర్ష్య అపనమ్మకము మిక్కుటముగా నుండెను. దేశీయరాజులతో వీరికిగల సంబంధములు ఎక్కువక్లిష్టమైన కొలది అపాయమగు పరిస్థితులు సంభవించినపుడు ఒకరిసహాయ మొకరికి ఎక్కువగా ఆవశ్యకమగుచువచ్చెను. అందరు ఐకమత్యముతో కలిసి యేక ముఖముగ పనిచేయుట యీ మూడు కౌన్సిళ్లవారికి నానాటికి యెక్కువ అవసరముగా గన్పట్టెను. ఈ ఏకోన్ముఖత నొడగూర్చుటకై సీమలోని ప్రధాని ఒక చట్టమును చేయనెంచెను. "సర్వంసహాధికారముగల కార్యనిర్వాహక వర్గము నొకదానిని కలకత్తా నగరమందేర్పరచి, ప్రధానమగు విషయములలో ఈ సభ తక్కిన రెండు కౌన్సిళ్లను అదుపులో నుంచవలెను. బ్రిటిషు ఇండియాకంతకు ముందు రాజధాని కానున్న కలకత్తాయందు ఒక హైకోర్టు నేర్పరుపవలెను. ఇండియాయందున్న ఇంగ్లీషువారి యందరిపైనను, వారికి సంబంధించిన సమస్త వ్యవహారములపైనను, సమస్త సివిలు క్రిమినలు అధికారములు కలిగి పరిమితిలేని వ్యాప్తితో ఈ హైకోర్టును స్థాపింపవలెను."

1773 లో గావింపబడిన ఈ చట్టమువలన ఆశియా లోని ఆంగ్లేయులకు చెందిన సమస్త ప్రదేశములపై పార్లమెంటు వారు మొట్టమొదటిసారి సర్వాధికారము వహించిరి. అందుచే అప్పుడు రాజ్యమేలుచున్న మూడవ జార్జి రాజునకును ఆయన మంత్రులకును అధికారమును, పలుకుబడియు, వృద్ధియయ్యెను. ఇట్టి యధికారాభివృద్ధికొరకే వారు చిరకాలమునుండి యెదురు చూచుచుండిరి. కాని, కంపెనీ వ్యవహారములలో ఇట్టి గొప్ప మార్పును తక్షణమే గావించుటకు అవకాశము చిక్కలేదు. ఇంతలో కంపెనీవారికి ఆదాయము కంటె ఖర్చు మితిమీరి పోయెను. అందుచే కంపెనీవారు సీమ గవర్నమెంటు నుండి కోటిన్నర రూపాయలు అప్పు తీసికొన వలసివచ్చెను. ఈ అదను కనిపెట్టి గవర్నమెంటువారు కంపెనీవారిని నొక్కిరి. పై చట్టము నుదహరించిన మార్పునకు ఒప్పుకొనిననే గాని ఈ అప్పు నివ్వమని గవర్నమెంటువారు చెప్పిరి. ఇక్కడ ఇండియాలో మొగల్ చక్రవర్తికి కంపెనీవారీయవలసిన క్విటెంటు, అక్కడసీమలో భాగస్వాముల కీయవలసిన నూటికి పదివంతు లాభములును, కుంపినీవారు అయిదేండ్లనుండి యొల్లో తప్పక ఇచ్చుచుండిరి. కాని వలనో కంపెనీ షేర్లధరలు పడిపోయెను. 1772 సంవత్సరము అక్టోబరు, నవంబరు నెల లలో కంపెనీవారి పని దివాలాస్థితికివచ్చెను. ఈ అవస్థను తప్పించుకొనుటకై గవర్నమెంటు బొక్కసమునుండి అప్పు ఇప్పించెదమని వారి ప్రభుత్వ చెప్పెను. ఇందుకు ప్రతిఫలముగ కలకత్తా యందు నూతన చట్టప్రకార మేర్పరుపబడిన కార్యనిర్వాహక సభయొక్క సర్వాంసహాధికారమునకు, సమస్త విషయముల

లోను, ఇండియాలోని కంపెనీవారి ప్రదేశములన్నియు లోబడి యుండుటకు కంపెనీవా రంగీకరింపవలెనని నార్తు ప్రభువు నిక్కచ్చిచేసెను. మరియు బొంబాయి కలకత్తా మద్రాసు రాజధానులలో సైనిక రాజకీయ న్యాయపరిపాలనాధి కారము లతో రాష్ట్రప్రభుత్వములను సీమ గవర్నమెంటువారు నియమించుటకును, వానికగు ఖర్చును కంపెనీవారే భరించునట్లును, గూడా నార్తుప్రభువు షరతుల విధించెను. ఇదిగాక కంపెనీ నిర్మాణమందు కూడ కొన్ని మార్పులను నార్తుప్రభువు సూచించెను. డైరెక్టర్ల నెన్నుకొను అధికారము అందరి భాగస్వాములకుగాక, వేయిపౌనుల షేర్లను గత పన్నెండు మాసములనుండి గలిగియున్న భాగస్వాములకు మాత్రమే యుండవలెనని నార్తుప్రభువు సూచించెను. భాగస్వాముల అధికారమును ఒక్కుమ్మడిగా నిట్లు తుడిచివేసి అధికారము నంతను ఒక్క కార్యానిర్వాహక సభయందు కేంద్రీకరించు యీ పద్ధతి లండను నగరమందు భాగస్వాములలో గగ్గోలు పుట్టించెను. కంపెనీ భాగస్వాముల హక్కులకు భంగము కలిగెననియు, పార్లమెంటు సభవారీ విషయమై తమ ఇబ్బందులను వినవలసినదనియు భాగస్వాములు పార్లమెంటువారిని ప్రార్థించిరి. దానికి పార్లమెంటు సభవారు అనుమతించిరి. ప్రతిపక్షమందున్న 28 మంది కామన్సుసభా సభ్యులును అంతే మంది ప్రభుసభా సభ్యులును ఈ బిల్లుయొక్క ప్రధానసూత్రములలో భిన్నాభిప్రాయులైరి. కాని వారి ప్రతిఘటన తుదకు పనికిరాకపోయెను. కలకతాయుంగ ముతో ఒక గవర్నరుజనరలు

తోడుగా మరి నలుగురు సలహాచెప్పు సభ్యులును నియమింపబడిరి. వీరి అయిదుగురిపేళ్లు చట్టమం దుదాహరింపబడెను. వీరు అయిదేండ్లవరకు సదరు ఉద్యోగములందుండునట్లు విధింపబడెను. ఇట్లే కలకత్తా యందొక హైకోర్టు స్థాపింపబడెను. దేశమందున్న అన్ని కోర్టులపై (దేశీయ న్యాయస్థానములపై కూడ) ఈ హైకోర్టుకు అధికారము ఇవ్వబడెను. భారతవర్షమునకు ప్రథమ సర్వాధికారిగ వారన్హేస్టింగ్సు నియమింపబడెను. ఇతనికి సహాయులుగ నుండుటకు జనరలు క్లావరింగు, ఫిలిప్ఫ్రాన్సిసు, కల్నల్ మాన్సను, బార్వెలు, అను నలుగురు సభ్యుల పేళ్లు చట్టమునం దుదాహరింపబడెను.

ఇదియే ఇండియాకు మొట్టమొదటి సార్వభౌమ శాసనము. దీనితో కొన్నాళ్లు పని జరిగినతరువాత దీనిలోని నియమములు క్లాజులు చాలవరకు బుట్టదాఖలు గావింపబడెను. కాని. అందులో ఒక్క క్లాజు మాత్రము ఆధునిక సాంఘిక చారిత్రమందు మరువదగనిదిగా నిలచియున్నది. ఇంగ్లీషు రాజులందరి కాలములలో నిర్మింపబడిన చట్టములన్నియు కలిపినను దానివలన గలుగు ఫలితముకంటె ఈ యొక్క నియమము ( క్లాజు ) నందు యెక్కువ ఫలితాంశ మిమిడియున్నది. కంపెనీవారు దివాలా స్థితిలోనికివచ్చి సొమ్మునకు కటకట గలిగినప్పుడు వారు సీమ ప్రభుత్వమును ప్రార్థించి, తమ కోటలలో దిగుమతియగు తేయాకుమీద పన్ను లేకుండ చేసిరి. అమెరికా మున్నగు వలస రాజ్యములవారు తమ దేశములలోనికి తమ మాతృదేశమేయగు యింగ్లండునుండి కూడ దిగుమతియగు తేయాకుపై పౌను ౧ కి మూడు పెన్నీలు

చొప్పున రేవుకేవును విధించుచుండిరి. ఇప్పుడీ చట్టమువలన యీ పన్ను తొలగింపబడెను. కుంపిణీవారి పడవలలో తీసికొని రాబడిన తేయాకు అంతటిపైనను బ్రిటిష్ సామ్రాజ్యమునకు చెందిన యేదేశమందుగాని యెట్టి కేవునుగాని విధింపరాదని పార్లమెంటువారు ఒకే శాసనమును ఒక్కుమ్మడిగావింప సాహసించిరి. వలస దేశములపై పన్నుల విధించు అధికారము మాతృదేశమగు యింగ్లండుకు లేదని లోగడ "స్టాంపు ఆక్టు" విషయమై అమెరికావారు తీవ్రముగ నెదిరించి యుండిరి. ఈ సందర్భములో తేయాకుపై వలసలవారు విధించుచుండిన రేవుకేవును గనుక యింగ్లండు పార్లమెంటువారు తీసివేసినచో, దానికి వలసలవారేమియు అభ్యంతరము చెప్పజాలరనియు, తద్వారా తమపై పన్నుల విధించు అధికారము పార్లమెంటుకు గలదని వలసలవారు పరోక్షముగ ఒప్పుకొన్నట్లే యగుననియు మంత్రులు సీమరాజగు మూడవ జార్జికి తెలివితక్కువ సలహాచెప్పిరి. ఈ పిచ్చి సలహాను జార్జిరాజునమ్మి యీ చట్టమును పార్లమెంటులో ప్రవేశపెట్టించెను. అమెరికాలోనున్న పెన్సిల్వేనియా, న్యూయింగ్లండు మున్నగు వలసలవారు యిట్టి టోపీలో పడువారు కారుసుమా యని అనేకమంది సభ్యులు యీ చట్టమును చర్చించు సమయములో పార్లమెంటు సభలో మంత్రులను హెచ్చరించి చెప్పిరి. కాని, మంత్రులామాటలను పాటింపలేదు. తుదకు నిజముగ ఆ సభ్యులు చెప్పినంతపనియు జరిగెను. పన్నులను తీసివేయుటకు ఒప్పుకొన్నచో విధించుటకుకూడ ఒప్పుకొన్నట్లే యనుమాట వాస్తవమే కాని, వలస దేశములవారు [illegible]

రెంటికికూడ వప్పుకొనలేదు. తమపై పన్నులను తీసివేయుటకుగాని, విధించుటకుగాని పార్లమెంటుకు హక్కులేదని వలసలవారు యెదిరించిరి. తా మీ విషయమై తీవ్రముగ నున్నామని తెలుపుట కోయన, ఒకరోజున కేవ్రు నీయకుండ తమ "బోస్టను" రేవులోనికి వచ్చిన తేయాకు డబ్బాల నన్నిటిని అమెరికావారు తీసి దూరముగ సముద్రములో పారవేసిరి. తరువాత జరిగిన చరిత్ర యంతయు అందరికి విశదమే. (దీనిపై అమెరికాకును యింగ్లండునకును యుద్ధము జరిగెను; అందు యింగ్లండువారు ఓడిపోయిరి. అమెరికా యింగ్లండుతో సంబంధము వదలుకొని, స్వాతంత్ర్యమును ప్రకటించెను.)

ఈ లోపుగ అప్పటికి కుంపిణీ కొలువులోనున్నవా రందరిలో ప్రసిద్ధుడగు వారన్ హేస్టింగ్సు ఇండియాకు గవర్నర్ జనరలుగ నియమింపబడెను. దీని కెవరును పార్లమెంటులో అంతగ ఆక్షేపించలేదు. అంతకుపూర్వమితడు రెండేండ్ల నుండియు కలకత్తా కౌన్సిలుకు అధ్యక్షుడుగ నుండి, కుంపిణీ డైరెక్టర్ల మెప్పును పొందియుండెను. కాని యీ రెండేండ్లలో ఆత డొనర్చిన కార్యములలో పెక్కింటిని పార్లమెంటు సభ్యులు తీవ్రముగ నధిక్షేపించియుండిరి. అయినను, అందలి సంగతి సందర్భములను లోతుగదిగి ఆలోచించిన వా రెవ్వరును అప్పుడు లేకపోయిరి. అందుచే ఇండియా గవర్నర్ జనరల్ పదవికి యీతని పేరును సూచించినప్పుడు పార్లమెంటులో అంతగ దీని నాక్షేపించిన వారెవరును కనిపించలేదు. అప్పుడీతని పేరే యేలపైకి రావలెను? ఇంతటి గొప్ప పదవికి నియమింపబడుటకు నిజముగ యీతడేమి ఘనకార్యము లొనర్చినాడు?

ఈతడెట్టివాడు? ఈతని గుణగతములేమి? ఈతనిని సమిష్టి ఇంతటి మహాగొప్ప బాధ్యతను ఈతని చేతిలో పెట్టుటకు సీమ మంత్రులెట్లు సాహసించిరి? భారతదేశములో కుంపిణీ యధికారులు సైనికవ్యవహారముల జోలికిపోక, కేవలము వర్తక వ్యాపారములనే చూచుకొనుచుండ వలసినదని మొట్టమొదట సీమలోని కుంపిణీ డైరెక్టర్లు వారన్ హేస్టింగ్సుతో చెప్పిరి. కాని, యీమాటల నాతడు పేరునకైనను పాటింపలేదు. కేవలము మడిగట్టుకొని, వర్తకవ్యాపారములనే చూచుకొనుచుండినయెడల తనకు కీర్తిగాని, ధనముగాని యెట్లు లభించును? అప్పుడు యిండియాకు వచ్చిన ప్రతి యింగ్లీషువాడు తాను క్లైవంతవాడు గావలెనని చూచుచుండెను. అందుచే క్లైవు నేర్పిన నీచకార్యము లన్నియు పాపభీతిలేని ప్రతి యింగ్లీషు వానికి అబ్బెను. ఈరీతిగ నాటికి నేటికినికూడ క్లైవుయొక్క దృష్టాంతము యిండియాకు వచ్చిన ప్రతి యింగ్లీషువానిని చెరుపుచుండెను. సీమలో వ్యవహారములు చాల చిక్కులుగ నుండెను. ఈ సందుచూచుకొని ఒకమూల యిక్కడ వారన్ హేస్టింగ్సును, అక్కడ సీమ మంత్రులును అదుపుఆజ్ఞలులేక యథేచ్ఛముగ విహరింపజొచ్చిరి.

ఇండియా వ్యవహారములకొరకై సీమలో నొక రహస్య సంఘ మేర్పరుపబడెను. వారన్ హేస్టింగ్సు యిక్కడ యిండియాలోని స్థితిగతులనుగూర్చి యీ రహస్య సంఘమున కీవిధముగ వ్రాసెను. "కుంపిణీవారి వ్యవహారము లిక్కడ చాల సందిగ్ధముగా వున్నవి. యివి యీస్థితిలో చాలకాల ముండ

జాలవు; మరియు కేవల న్యాయమార్గమున వీనిని నడిపించు టకును వీలులేదు. ఇక్కడ మేము సర్వస్వతంత్రాధికారులమై యైన నుండవలెను; లేదా, పైయధికారులకు లోబడియైన నుండవలెను. వీనిలో రెండవమార్గము బొత్తుగ సాగునది కాదని నానిశ్చితాభిప్రాయము." వారన్‌హేస్టింగ్సు చెప్పిన యీ మాటలకు రహస్య సంఘమువారు "పూర్తిగ ఆమోదించిరి." ఇండియాలో చిల్లర ఉద్యోగస్థులు అదివరకు చేయుచుండిన అక్రమముల నన్నిటిని వారన్‌హేస్టింగ్సు అతి సమర్థతతో నణచివేసెను. అనేక విధములుగ కంపెనీకి ఖర్చులను తగ్గించెను. ఈ కారణములచే నీతనిని తీసివేయుటకు కుంపిణీ వారికి యిష్టము లేకపోయెను. "మనల నాశ్రయించుకొని తిరుగువారింక మరి నలుగు రెక్కువకానీయని యెల్లప్పుడు కోరుకొనుచుండు సీమ మంత్రులుకూడ "ఉండనీ యీతనిని తీసివేయనేల" యని యుపేక్షాభావముతో నూరకుండిరి. అంతియేగాక, 1773 సంవత్సరమందు నిర్మించిన "రెగ్యులేషన్ ఆక్టు" లో యీతనికి యిండియాపై సర్వాంసహాధికారమునుకూడ కట్టబెట్టిరి. యీరీతిగ అద్వితీయమగు సామర్థ్యమును, ధైర్యస్థైర్యములను గలిగి, పాపభీతి యనునది కించిత్తైనను లేని యీ మనుష్యుడు భారతవర్షమున రాజప్రతినిధి యుద్యోగమును వహించిన వారిలోనెల్ల మొట్టమొదటివాడయ్యెను.

హేస్టింగ్సు వంశము ప్రాచీనకాలమందు మంచి పేరు ప్రతిష్ఠలతో బ్రతికిన వంశమే. కాని యీ శతాబ్దారంభమందు వారి సంసారము చితికిపోయెను. పిత్రార్జితములో ఆత

నికి "వార్సెస్టరు" జిల్లాలో కొంచెము భూమి ఇల్లు మాత్రము మిగిలెను. ఈతని తాత చాలకాలము పాదిరీగుడిలో పూజారిగా జీవనము చేయుచుండెను. ఈ ముసలివాడే ఈతని బాల్యమునుండియు పెంచుచుండెను. ఈతని తండ్రి 15 వ యేట పెండ్లి చేసికొని హేస్టింగ్సు పుట్టగానే దేశాంతరగతుడయ్యెను. తల్లియు చనిపోయెను. అందుచే ఈతడు పసితనమునుండియు నిర్భాగ్యుడుగనే యుండెను. ఈతని తండ్రి తరువాత అనేక సంవత్సరములు బ్రతికియున్నను ఆతనినిగూర్చి హేస్టింగ్సు యెన్నడును ప్రసంగించినట్లు తెలియదు. పాపము, ముసలివాడు తాతగారే పసితనము నుండియు వీనిని ప్రేమతో పెంచెను. తాత ఈతనిని బడిలోవేసెను. ప్రతిదినము బడి వదలి పెట్టగానే తమ పూర్వులు సంపాదించిన యెస్టేటు తోటలలో తిరుగుచు, అచ్చటి బీళ్ల మధ్యనుండి జలజల ప్రవహించు సెలయేటి యొడ్డున పరుండి, ఆ చుట్టు పట్టుల నెల్ల అతిమనోహరముగా నున్న ఈ రమ్య ప్రదేశమునుండి తమ తాత తండ్రులెట్లు పారద్రోలబడినదియు తలంచుకొని మనస్సులో విచారపడుచు పిత్రార్జితమగు ఈ రమ్యవనములనన్నిటిని తానెప్పుడైన తిరిగి కొనివేయగలనా యని తలపోయుచుండెను. శీతకాలపు రాత్రులందు చలిమంటలచుట్టు కూర్చున్నప్పుడు తాతగారు ఈతని వంశీకుల పూర్వ చారిత్రమును ఉబుసు పోకకు కబుర్లు చెప్పుచుండెడివాడు. ఆమాటల నన్నిటిని ఈతడు వినుచు లోలోన విమర్శించుకొనుచు తన మనసునందు అత్యద్భుతమగు కల్పనలను గావించుకొనుచుండెను. ఈరీతిగ పసితనమునుండియు తన మనస్సునందు ప్రవర్ధమానమగుచు వచ్చిన ఈ యూహాతే

నిమ్నోన్నతములగు యాతని భావిజీవితము నంతను నధిష్ఠించి నడుపుచుండెను. ఈ యూహాలే యీతని కాంక్షను రేపుచుండెను; ధనాశను పెంపొందించుచుండెను. ఆతని భయంకరమగు ఆవేశమును సారధినలె నడుపుచుండెను. నిరుత్సాహ సమయములందు ఇవియే ఆతనికి ఓర్పును, తెగువను, కల్పించి యెట్టి దురంతకృత్యముల కైనను పురికొల్పుచుండెను. కోర్టు గుమాస్తాగాయున్న ఈతని పినతండ్రి ఇతనిని "న్యూయిం్టను" లో పాఠశాలకు పంపెను. కాని, వాని కక్కడ ఒక్క ఆక్షరమైనను అంటలేదు. అక్కడ తిండిలేక మాడ వలసికూడ వచ్చెను. ఇందువల్లనే తన శరీరమున కా దౌర్బల్యమును, గిడసబారుటయు గలిగెనని ఆతడు తరువాత చెప్పుచుండెడివాడు. అంతట ఈ స్కూలునుండి "వెస్టుమినిస్టరు" స్కూలుకు వెళ్లెను. అక్కడ కొంచెము తెలివి గల వాడని పేరుపొందెను. ఉపాధ్యాయులును తోడిఆటగాండ్రును ఈతనియందు చాల మంచి అభిప్రాయమును గలిగి యుండిరి. ఈ పాఠశాలయందే భావికాలమందు ప్రఖ్యాతి గాంచిన "ఫిలిప్ఫ్రరను" ప్రభువు మున్నగువారితో ఈతనికి పరిచయము గలిగెను. యిచ్చటనే "ఇంపే" యను వానితో ఈతనికి స్నేహము ప్రారంభమయ్యెను. తదుపరి వీరి యిరువురి జీవిత లతలును అత్యంత గాఢముగ నల్లుకొని తుదకు అదియే హేస్టింగ్సు మెడకు యురిత్రాడయ్యెను. ఆతని పినతండ్రి చనిపోయిన తరువాత ఈతనికి సైన్యమందు కుంఛీవారి కొలువులో ఇండియాలో నొక ఉద్యోగ మిప్పింతు నని ఈస్టిండియా కంపెనీ డైరెక్టరుగానున్న ఒక పెద్దమనిషి

వాగ్దానమిచ్చెను. కాని, ఆస్కూలు హెడ్మాస్టరు దీని కొప్పు కొనలేదు. "వల్లకాదు. ఇండియా చాలాదూరము. హేస్టింగ్సు గ్రీకుభాషలో చాల తెలివిగలవాడు. ఇక్కడ నున్న యెడల విశ్వవిద్యాలయంలో బాగా పైకిరాగలడు. ఇక్కడ చదివించుటకు డబ్బులేక పోవడమే కారణమైనయెడల రెండేండ్లపాటు ఆ కర్చులు నేనైనా పెట్టుకుంటానుగాని, ఇంత తెలివిగల కుఱ్ఱవానిని సముద్రాలమీద యావజ్జీవము దేశాంత రాలకు పంపడానికి నేనొప్పుకోను." అని హెడ్మాస్టరు అనెను. ఈ కుఱ్ఱవానిపై ముసలివాడగు హెడ్మాస్టరుకు ఇంత అభిమానము, డబ్బుఖర్చుపెట్టే తెగువ కలుగుటకు ఆ కుఱ్ఱ వానియందు ఒక్క గ్రీకు భాషయందభిరుచియే గాక ఇంకను గొప్ప విశేషమేదో యొకటి యుండి తీరవలయును.

కాని ఈతని పినతండ్రికి మాత్రము గ్రీకుభాషయం దంత అభిరుచిలేదు. అందుచే ఈ కుఱ్ఱవానికి కలకత్తాలో గుమాస్తాపనియే ఖాయమయ్యెను. ఈ గుమాస్తాపనిలో నున్న కాలములో తనస్థితిగతు లెట్లుండినదియు హేస్టింగ్సు ఒకచిన్న చరిత్రగ వ్రాసిపెట్టుకొని యున్నాడు. అప్పుడు తన పైన యెనమండుగురు పెద్ద గుమాస్తా లుండెడివారట— వారందరు తన వలెనే సీమనుండి యిక్కడికి వచ్చిన మధ్యరకపు కుటుంబీకులట. తరువాత జీవిత మందు తానింత గొప్పవాడు కానున్నాడను సూచన లా కాలమందేమియు గాన్పింపలేదట. కాని అ చిరకాలములోనే మహాశ్చర్యముగ యీతనికి మంచి రోజులు రానుండెను. నానాటికి యీతనికి ఉచ్చదశ యెత్తు కొనెను. భాగ్యవంతులగు పెద్ద కుటుంబీకుల కుండదగిన లక్షణ

ములన్నియు క్రమముగ నీతని కేర్పడెను. ఈస్టు యిండియా కంపెనీలో షేర్లు డబ్బుపెట్టి యెవరైనను కొనుక్కొనవచ్చును. వీరే కంపెనీకి డైరెక్టర్ల నెన్నుకొనువారు, యిక కావలసిన దేమి? అందుచే యెవరికి బట్టిన వారికి కంపెనీలో పలుకుబడి యేర్పడెను. తద్వారా కంపెనీయందు ఉద్యోగములు సంపాదించుటకూడ ప్రతివారికి తేలికయయ్యెను.

తన వెనుకటి బ్రతుకునుగూర్చి హేస్టింగ్సు యెన్నడు చెప్పుకొనెడివాడుగాడు. ఎవరడిగినను చెప్పెడివాడుగాడు. బహుశః ఆరోజులు నిష్కళంకమైనవి గావచ్చును. కాని, తరువాత యీతడు వెలిగించిన వెలుగురోజుల కాంతిలోనుండి వానిని చూడదలచినయెడల మనకండ్లు చిరుతలువారి అవి అస్పష్టముగను, మబ్బుమబ్బుగను గాన్పించును. స్వయంకృషివలన పైకివచ్చిన యీ మనిషి తన వెనుకటి బ్రతుకును దాచిపెట్టుకొననేల? నిజముగ, ఆతనికిది యెంతమాత్రము తగని పని. ఆతనివిషయములో యింతకంటె హీనమైన—నీచమైన—సంగతి యింకొకటి యుండబోదు. ఆతని జీవితమంతటిపైనను యింతకంటె విషాదకరమగు విషయమింకొకటి యుండబోదు. ఆ గుమాస్తాయుద్యోగమందున్నప్పుడు ఆతనియందు ధైర్యముగాని, పట్టుదలకుగాని కొదువ లేకుండెను.

*"ఫ్యాక్టరీ"లో ఆతడు రోజంతయు కష్టపడి పని చేసెడివాడు.

---

* బంగాళాయందున్న యింగ్లీషువారందరు కాపురమున్న ప్రదేశమునే ఆ రోజులలో "ఫ్యాక్టరీ" యని పిలిచెడివారు. కంపెనీవారి యెగుమతి దిగుమతి వ్యాపారమునకు కావలసిన కొట్లన్నియు అక్కడనే కట్టబడెను.

కలకత్తా చీకటికొట్టు విపత్తునకు ప్రతీకారమొనర్చుటకై 1756 సం॥ లో క్లైవు మదరాసునుండి కలకత్తాకు వచ్చినప్పుడు ఆతడు అక్కడనున్న యింగ్లీషు వారందరికి తమ్మి నీ విపదంబుధినుండి లేవనెత్తి రక్షించుటకై ఆకాశము నుండి దిగి వచ్చిన దేవతగ గన్పట్టెను. క్లైవుయొక్క కార్యోత్సాహమును మహోద్వేగ లక్షణములను అప్పు డచ్చట గుమాస్తాగ నుండిన హేస్టింగ్సు తేరిపార జూచుచుండెను. ఆతని శక్తిసామర్థ్యములు, ఆత్మవిశ్వాసముతో కూడుకొనిన ఆతని సాహసము, హేస్టింగ్సును పరవశునిజేసెను. ఎవరే పనికి పనికివత్తురో కనిపెట్టగల సూక్ష్మబుద్ధి క్లైవు కుండెను. దిగులుపడిన మనస్సుతో, పాలిపోయిన మొగముతో కుబ్జాకారముతో చిన్న గుమాస్తా పనియందున్న యీ హేస్టింగ్సు గుర్రమెక్కి రణరంగముల సైనికనివహముల నడిపింప పనికి రాడుగాని, క్లిష్టమై మంత్రిసాధ్యమగు ననేక గొప్ప రాచకార్యముల మేధాశక్తిచే చక్కపెట్టుట కీతడు పనికివచ్చునని క్లైవు కనిపెట్టెను. వెంటనే క్లైవు ఆతనిని మూర్షిదాబాదు నగరమందున్న నవాబు దర్బారులోనికి వేగువానిగబంపెను. నవాబు దర్బారులో జరుగు వ్యవహారములనన్నిటిని అప్రమత్తతతో కని పెట్టుచు, అచటి మంత్రుల యొక్కయు తదితరుల యొక్కయు స్నేహమును విశ్వాసమును సంపాదించి, క్లైవు చెప్పమన్న మాటల నన్నిటిని వారి మనస్సుల కెక్కించుచు, సమస్త రహస్యములను యెప్పటికప్పుడు క్లైవుకు తు, చ, తప్పకుండ

తెలుపుచుండుటయే యీతనిపని. ఈ కాలములో యీతనికి నెలకు 40 రూపాయలజీతము. ఈతను ప్రతిరోజు చేయవలసిన పనియేమి? ప్రార్థనలు చదువుట యట! యెవరికి? యెవరికో తెలియదు. మూర్షిదాబాదును దోచుకొన్నప్పుడు హేస్టింగ్సు నకును యేమి "లాటు" దొరకెనో యిప్పుడెవరు చెప్పజాలరు. 1764 సం లో హేస్టింగ్సు భార్య చనిపోయెను. యీ స్థితిలో ఆతడు సీమకు వెళ్లెను. అచ్చటికి పోయినకొద్ది దినములకు ఆతనికి గలిగిన చంటిపిల్లకూడ చనిపోయెను. హిందూస్థానమునుండి తాను తెచ్చిన డబ్బును హేస్టింగ్సు ఒక వ్యాపారములో పెట్టెను. ఆ వ్యాపారములో దివాలా తీయుటచే ఆ సొమ్మంతయు దానిలో మునిగిపోయెను. ఆతడు లండనులోనుండిన ఆ రోజులలో యెట్లు జీవించుచుండెడివాడో యెవరికి తెలియదు. ఏవో గ్రంథములు వ్రాసియాతడు జీవింప దలచినట్లు కనుపించును. ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమందు ప్రాచ్యదేశభాషల శాఖనొకదాని స్థాపింపవలెనని హేస్టింగ్సు సంకల్పించి దానికొరకు సుప్రసిద్ధ ఆంగ్లభాషాకోవిదుడగు "డాక్టరు జాన్సను" పండితుని యామోదమును పడయ చూచెను. జాన్సను పండితుడు అంతసులువుగ తృప్తినొందు వాడుగాడు. కాని, హేస్టింగ్సుయొక్క నమ్రతనుజూచి ఎట్లో మోహితుడయ్యెను. ప్రాచ్యదేశకవిత్వమునుగూర్చి హేస్టింగ్సు చెప్పుమాట లతనికి చక్కగా రుచించెను. కాని, హేస్టింగ్సుకు సమాజపాండిత్యగరిమ గలదని కాగడాలుపెట్టి వెదికి చూచినను ఆ కాలపు వాఙ్మయమున నెచ్చటను కాన్పించదు. మరియు బర్కునకు ఈతనిపై కోపము పట్టరానిదైనపుడు-

యితనిపై యేదో బాణము వేయవలెనని తడుముకొనుచున్న పుడు "హేస్టింగ్సునకు సరిగా నాలుగు ఇంగ్లీషుముక్కలైనను వ్రాయుట తెలియద"ని అన్నిటితోపాటు అదియొక గొప్పనేర ముగా బర్కు యీతనిని దెప్పిపొడుచుచుండెను. తనపై మొట్టి ఘోరమగు రాజకీయ నేరముల మోపినను హేస్టింగ్సు చలించు వాడుగాడు. కాని లండనునగరమందు వెస్టుమినిస్టరు రాజ భవనములో ఆంగ్లదేశమునందెల్ల పేరెన్నికగాంచిన పండిత ప్రకాండులయెదుట, ఉత్తమవంశసంజాతులగు ప్రభువుల యెదుట, కులీనులయెదుట, లావణ్యవతులగు సుందరీమణుల యెదుట, తనకు నాలుగు ఇంగ్లీషుముక్కలైనను రావని చేసిన అధిక్షేపణమాత్రము హేస్టింగ్సు మనస్సునకు గాఢముగ తగిలి ఆతనిని బాధింపజొచ్చెను.

1766 లో పార్లమెంటువారేర్పరచిన విచారణసంఘము నెదుట హేస్టింగ్సు సాక్ష్యమిచ్చెను. దానిలో తన అభిప్రాయ ములను స్పష్టముగను, గాఢముగను, వ్యక్తపరచెను. దానికి కమిటీవారు చాల మెచ్చుకొనిరి. అయినను, తనకు సరి యగు యుద్యోగము ఇవ్వలేదనియు అందుచే తన కూరును పేరును లేక యేమూలనో పుస్తకములు వ్రాసికొనుచు కబురు లతో కాలము గడపుకొనవలసి వచ్చినదనియు హేస్టింగ్సు చాల కాలము చికాకుపడుచుండెను. ఈలోగా కలకత్తాయందు క్లైవు తరువాతవచ్చినవారి దుర్బలపరిపాలనవలన కంపెనీవ్యవహార ములు చాల చెడెను. చెన్నరాజధానియందుకూ— నుండెను. వానిని చక్కబెట్టుటకు ఎక్కువ జవ

మనుష్యులు కావలసివచ్చెను. అందుచే సీమలోని కంపెనీ డైరెక్టర్లు హేస్టింగ్సునుపిలచి మద్రాసు కౌన్సిలు సంధ్యో సభ్యుడుగానుండవలసినదని కోరిరి. హేస్టింగ్సు దానికి తక్షణమే అనుమానింపకుండ అంగీకరించెను. ఏ యుద్యోగమైన తనకు దొరకునాయని దేవులాడుచున్న రోజులలో అయాచితముగ యీ యుద్యోగము లభించెను. తానిదివరకు ఇండియాలో సంపాదించిన డబ్బంతయు ఖర్చయ్యెను. అందుచే ఈ క్రొత్త యుద్యోగమునకు గావలసిన వేషభాషలకొరకు ఈతడు చాల అప్పుచేయవలసివచ్చెను. మొదట తనచేతిలో చాల డబ్బున్న ప్పుడు తన్నాశ్రయించుకొన్న బంధువులకు, వార్షికము లిచ్చు చుండెడివాడు. తాను కష్టదశలో నున్నపుడుగూడ యెట్లో కష్టపడి వానిని ముట్టచెప్పుచుండెను. ఇప్పుడు తిరిగి రెండవ సారి ఇండియాకు బయలుదేరుటకు ముందు ఆ వార్షికములు అవిచ్ఛిన్నముగా జరుగుట కేర్పాటులు చేసివచ్చెను. ఇది చాల మెచ్చుకొనవలసిన విషయము. ద్రవ్యము సంపాదించు ట యందు మితిమీరిన యాశగలిగి దానిని అవలీలగ ఖర్చు పెట్టుచుండు రకములలోచేరిన మనిషి ఈ హేస్టింగ్సు. మనుష్యు లను టోపీవేసియో, దారులుకొట్టియో ద్రవ్యమును సంపా దించుట కితని కెట్టి యాక్షేపణలేదు. అట్లే దానిని విచ్చల విడిగా ఖర్చుపెట్టుటకును వెనుదీయడు. హేస్టింగ్సు ఇండి యాకు ఎక్కివచ్చిన ఓడలో "ఇమ్హాఫ్" అను ఒక ఇంగ్లీషు వాడుకూడా తన భార్యను వెంటబెట్టుకొని వచ్చుచుండెను. చిత్తరువులు, బొమ్మలు, వ్రాసి ఇక్కడ పొట్టపోసికొను ఆశతో ఆతడు ఇండియాకు వచ్చుచుండెను. అతనిభార్య అందముగను

ఆకర్షవంతముగను నుండెను. తాను చిన్నప్పుడు సంగతి సందర్భములను పూర్తిగ విచారింపకుండ నిర్భాగ్యుడగు ఈ చిత్రకారుని యేల పెండ్లిచేసికొంటినాయని ఆమె లోలోన విచారపడుచుండెను. ఆమె రసికత్వమును తగురీతిని భర్త గ్రహింపలేకుండెను. కాని, హేస్టింగ్సు మాత్రము గ్రహించెను. ఆ సంగతిని హేస్టింగ్సు ఆమెకు మెల్లగా మృదువుగా నచ్చచెప్పెను. వెంటనే యామె తన యనురాగమును నిర్భాగ్యుడగు తన పిల్లలతండ్రి నుండి మహారాజకీయ వేత్త కాబోవుచున్న హేస్టింగ్సుమీదికి బదలాయించెను. (మార్చెను) ఓడప్రయాణములో హేస్టింగ్సు జబ్బుపడెను. అప్పుడు ఆమె ఈతనిని అతిజాగ్రత్తతో సంరక్షణచేసెను. ఆమె భర్త చూచుచు యూరకుండెను. మద్రాసుచేరిన పిమ్మట తమ వివాహమును రద్దుపరచుకొనినయెడల ఉభయులకు బాగుండునని హేస్టింగ్సు ఆ దంపతులకు చెప్పెను. అంతవరకు తమ సంసారమును చెడగొట్టననిగూడా చెప్పెను. కాని, వివాహము రద్దయినపిమ్మట ఆమెను తాను వివాహమాడుదుననియు, అదివరకు పుట్టిన పిల్లలపోషణకు తగు యేర్పాటుచేసి వెనుకటి భర్తకు తగు మనువర్తి యిచ్చెదననియు హేస్టింగ్సుచెప్పెను. ఈ షరతులకు వారుభయులు ఒప్పుకొనిరి. వివాహము సక్రమముగా కోర్టులో రద్దుపరుపబడెను. నిర్భాగ్యుడగు చిత్రకారునిభార్య హేస్టింగ్సు భార్యయయ్యెను. ఆ చిత్రకారుడును ఈ పెళ్ళాము పీడవదలించుకొని బైటపడి, ఆమెను అమ్ముకొన్న డబ్బుతో సీమచేరి అక్కడ యేమయ్యెనో యెవరికిని తెలియదు.

ఆ రోజులలో ఎవరికిదొరకినసొమ్ము వారు విచ్చలవిడిగా దోచుకొనుటయను తెగులు బహుతీవ్రముగా నుండెను. ఎవరి అడ్డుపుల్లలు లేక బంగాళాదేశములో కంపెనీవారు ప్రజలనుండి లాగికొనిన నజరాణాపద్ధతివచ్చి కంపెనీకొలువులో నున్న ప్రతియుద్యోగస్థునికి పైనుండి క్రిందవరకు దురాశను తీవ్రముగా రేకెత్తెను. వర్తకపు అంగళ్లను వదలిపెట్టి అందరు ఏదోనెపముమీద దోపిడీలకు బయలుదేరిరి. ఈ దోపిడి మూకలు సాధారణముగ దుండగీండ్రగు దేశీయుల నాయకత్వముక్రిందనే ఏర్పడినను ఇవి నిజముగ కంపెనీ ఫాక్టరీల ఆవరణములలోనే పన్నబడుచుండెను. వర్తకపు వృత్తిని వదలుకొని అందరు సైనికవృత్తికి పరుగెత్తుచుండిరి. సైనికవృత్తి యనగా కొల్లగొట్టుకొనుటయేగదా ! ఆ రోజులలో ప్రతికంపెనీ నౌకరుకు ఒకటేపని, ఏదనగా దిక్కుమాలిన దేశీయులనుండి లక్షలకొలదిడబ్బు త్వరత్వరగా పిండుకొని ఇక్కడ వేడిచే దేహము చెడిపోకమునుపే వెంటనే సీమకు పరుగెత్తి, అక్కడ ఏదో ప్రభువు కూతురునో పెండ్లాడి, డబ్బుపెట్టి ఓట్లు కొనుక్కొని, పార్లమెంటులో దూరి, విందులలో త్రాగి తందనాలు త్రొక్కుటయే. ఇక్కడకువచ్చిన ప్రతి కంపెనీ నౌకరుకు యిది ఒకటే పనియయ్యెను, " అట్కిన్సను, " " బెన్ఫీల్డు " అనువారు ఈ రకమువారే. వారి సంగతి ముందు చెప్పెదను. ఇట్టి మహదవకాశములను వినియోగించు కొనకుండ నుండుటకు హేస్టింగ్సు అంత గుడ్డివాడుకాడు. స్వలాభాభివృద్ధికై తన్ను ప్రేరేపించు అంతర్వాణిని వినకుండుటకు ఆతడంతటి చెవిటివాడునుగాడు. సీమలో తమ తాత తండ్రులు

పోగొట్టుకొనిన పూర్వార్జితమగు గేహారామాదిక వైభవము లను జ్ఞాపకము తెచ్చికొని, నెరజాణయు, అందకత్తెయు నగు తన క్రొత్త ముద్దులపెళ్లాము యొక్క ముఖవిలాసము వీక్షించి నపుడెల్ల తనకు భావికాలమందు రానున్న భాగ్యయశోలాభ ములగూర్చి యాతడు తన మనోవీధియందు పెక్కు సౌధముల నిర్మించుకొనుచుండెను. ఈ మనఃకృత సౌధముల నధిరో హించుటకై మార్గమధ్యమున ఈతడెట్టి కీకారణ్యములగాని, దొంగఊబులనుగాని, నవలీలగ త్రొక్కుకొని రాగలడో ఇప్పుడే రుజువు గాగలదు. అయినను ఆతడీలోపుగ ఒక తెలివిగల పనిమాత్రము చేసెను. తన యజమానులగు సీమ డైరెక్టర్లకు ముఖ్యముగా కావలసినది లాభములు. ఇవే కంపెనీ కిరీటములో పొదుగబడిన రత్నములుగదా ! ఈ సంగ తిని ఆతడు బాగుగ గ్రహించి, మదాసునందు కంపెనీవారు పెట్టిన పెట్టుబడికి మాత్రమెట్టి భంగము కలుగనీయకుండ హేస్టింగ్సు వేయికండ్లతో కనిపెట్టియుండెను. ఇదే కంపెనీ వారికి కావలసినది. మదాసులోని తక్కిన కంపెనీనౌకర్లు అందరు తమ పెట్టెలనిండ సొమ్ము పోసికొని, తప్పుతాగి కొంచెము భయము పుట్టిన దనగనే ఈ దోపిడిసొమ్మునంతను ఓడలలోవేసి సీమకు త్రోసివేయుటకు ఒకమూల సన్నాహ ములు చేయుచుండగా, ఇటు ఇంకొకమూల హేస్టింగ్సు కంపెనీవారి చిట్టాఆవర్జాలను తిరగవేసి పరీక్షించి ఎక్కువసొమ్మును కాజేసిన దలారులకందరకు తోకలు తెగకోసి, దేశీయ వర్తకులతో వెనుకటి లాభసాటి వర్తకమును పునరుద్ధరింప కంకణము కట్టుకొనెను. ఇందు

కొరకై దేశీయవర్తకులకు సకాలమున సరకులను ద్రవ్యమును సరఫరాచేయుచుండెను. ఈమధ్య కంపెనీనౌకరులు తమ సరకులకిచ్చుచుండిన ధరలకంటె ఎక్కువధరలను హేస్టింగ్సు దేశీయవర్తకులకిచ్చి వారినిరాబట్టుచుండెను. సీమలో కంపెనీ డైరెక్టర్లకు ఇందువలన అపరిమితానందమయ్యెను. "ఆహా! హేస్టింగ్సు ఎంతగట్టివాడు! ఇటువంటివాడు వేయికొకడైన దొరకడు! కంపెనీవారి అభివృద్ధే తనమనసులో నుంచుకొన్నాడు. ఇతనికి తప్పక ప్రమోషను ఇచ్చితీరవలసినదే" అనిరి. వెంటనే ప్రమోషను వచ్చివేసెను. మరుసంవత్సరమే కలకత్తాకౌన్సిలులో రెండవసభ్యుడుగా నియమింపబడెను. ప్రెసిడెంటుపదవి ఖాళీయైనవెంటనే అది ఈతనికిచ్చునట్లుకూడ యేర్పాటయ్యెను.

క్లైవుబంగాళాదేశములో దేశీయరాజ్యాధికారదుర్గమునకు గల హేమకవాటములను బ్రద్దలకొట్టి లోనిధనమునపహరించి తాళపుచెవిని తనవద్దనుంచుకొనెను. ఈయనయు తరువాతవచ్చినవారును, రాష్ట్రములో పన్నులువిధించుటకును, వసూలుచేయుటకును, ఖర్చుపెట్టుటకును, మితిలేనియధికారములుగల మంత్రులుగ తమంతటతామే నియమించుకొనిరి. కాని, దేశీయపరిపాలనము, నామమాత్రావశిష్టముగనిలచియుండెను. నవాబు తనకు కావలసినంతమంది యుద్యోగులను, సిబ్బందిని, ఉంచుకొనుటకు కంపెనీవారు సమ్మతించిరి. నవాబు ఈరీతిగ తన దర్బారును పూర్వమువలెనే పైకి యెట్టి దర్జాకులోపము లేకుండా నడుపుకొనుచుండెను. కోర్టులలో

న్యాయపరిపాలన ఇంకను నవాబుపేరిటనే జరుగుచుండెను. పన్నులుకూడ నబాబురాజధానియగు మూర్షదాబాదులోని ఒక యున్నత దేశీయోద్యోగిద్వారా నే కంపెనీకి ముట్టుచుండెను.

స్థానికపరిపాలనా పద్ధతులుగూడ క్లైవుచే నిరూపింపబడిన పద్ధతినే నిలిచియుండెను. ఢిల్లీ చక్రవర్తియొక్క యధికారము పైకిమాత్రము నిలిచియుండెను. అన్ని దస్తావేజులపైనను "పాదుషా" బిరుదావళులింకను ముద్రింపబడుచుండెను. సర్కారు నాణెములును ఆతనిపేరిటనే పోతపోయ బడుచుండెను. దిగుమతిపన్నుల వసూలుచేయుటకును దివాన్గిరి అధికారముల నిర్వహించుటకును ఫరంగీలు కంట్రాక్టు చేసిరి. పాతపద్ధతుల యాకారములను మాత్రము చెరుపక అట్లేయుంచవలసినదని సీమనుండి డైరెక్టర్లు ఖచితముగ నుత్తర్వుల నంపిరి. ఏలననగా, స్థానికముగ అదివరకుండుచువచ్చిన నవాబుదర్జాను వేషభాషలను అట్లే నిలిపియుంచుట అవసరమని డైరెక్టర్లు తలచిరి. కాని, బొమ్మలను సింహాసనముపై కూర్చుండబెట్టి వెనుకనుండి యాడించుటయను ఈ బూటకనాటకము ఎన్నినాళ్లు సాగును? దీని వలన అనేకచిక్కులు తటస్థించెను. దానికెన్ని మరమత్తులు చేసిపెట్టినను అవి చిరకాలము నిలువజాలకుండెను. పరమ కిరాతబుద్ధితో నుత్పన్నమైన యధర్మ యుద్ధమందు ఓడిపోయిన బలహీనునకు తగిలిన గాయ మింకను మానకపూర్వమే జయించిన బలాఢ్యుడు నిర్దాక్షిణ్యముగా నతనిపై ఆత్రముతో విధించిన విధానమేగదా ఇది! ఈ అతుకుల బొంత ఎంతకాలముండును! దక్కానాయకుడగు మహమ్మదు

రజాఖాను అటు నవాబునకు మంత్రిగను ఇటు కంపెనీ దివానీకి పన్నులు వసూలుచేసిపెట్టువాడుగను ఉండెను. ఈ రెండు పనులను నిర్వహించుటయందు అతని నిజాయితీని గూర్చి అనుమానించుటకు వీలులేదు. కాని, తన క్రిందనున్న దేశీయోద్యోగులందరు నిన్నగాక మొన్నవచ్చిన ఫరంగీల యెడ అఠాత్తుగా దేశము ఒలుకనట్లు ఎట్లు చేయగలడు? నిజముగా, ఆతడట్లు చేయగలిగినచో ఆతడు మానవాతీతుడనియే చెప్పవచ్చును ఆతనికి. బంగాళమందు ఉపకోశాధ్యక్ష పదవి కంపెనీవారి ప్రాపకమువలన పొందెను. దీనివలన, అతనికి సాలునకు లక్ష రూపాయల వేతనము ముట్టుచుండెను. నవాబు సిబ్బందికి జీతముల నిచ్చుట యాతని మొదటి విధియైయుండెను, "నజూముల్ దౌలా" నవాబుగానున్న రోజులలో ఈ సిబ్బంది ఖర్చుకు కంపెనీవారు సాలుకు 53 లక్షలు ఇచ్చుచుండేవారు. కాని ఆతని తమ్ముడు రాజ్యమునకు వచ్చిన పిమ్మట ఈ మొత్తమును 41 లక్షలకు తగ్గించిరి.

తరువాత "ముబారక్ ఉల్ దౌలా" నవాబుగా యేర్పాటు గాబడెను. ఈతడు మైనరుగా నుండెను. 1770 లో ఇతనితో చేసికొనిన సంధిప్రకారము ఇతనికి 32 లక్షలు మాత్రమే కంపెనీవారు ఇచ్చుచుండిరి. వెనుక 1768 లో నిర్ణయింపబడిన ప్రకారము నవాబుకు ఈయవలసిన సొమ్ము 41 లక్షలకంటె ఎంతమాత్రము తగ్గింపరాదని సీమడైరెక్టర్లు కచ్చితముగ వ్రాసినసంగతి జ్ఞాపకముంచుకొనవలెను. కాని ఇప్పుడు వారికి సొమ్ము ఎక్కువ అవసరమగుటచే వారు 1771 లో కలకత్తాయందు ఆక్టింగు గవర్నరు జనరలుగానున్న

"కార్టియరు" కు ఈ విధముగా వ్రాసిరి. "బంగాళా నవాబుగిరికి మీర్జాఫరు వంశమువారే వారసులుగ నుండకూడ దని మేమనము. అదిగాక బంగాళా ప్రజల కోర్కెలను పూర్వాచారములను అనుసరించియే మనముకూడ నడచుట రాజనీతియు, న్యాయముకూడనని మా తాత్పర్యము. కాని నవాబు ఇప్పుడు మైనరుగా నున్నాడు. అతనిచుట్టు తిండి పోతులు స్తోత్రపాఠకులు అనేకమంది చేరియున్నారు. వీ రందరికి ఇంతసొమ్ము వృథాగా తగులబెట్టనేల! కావున, నవాబునకు మెజారిటీ వచ్చువరకు అతనికిచ్చు సొమ్ములో సగము కోసివేయవలయును." అని డైరెక్టర్లు తీవ్రముగు యుత్తరవుల జారీచేసిరి. నవాబుకును కంపెనీకిని ఆదియందు జరిగిన యొడంబడిక అటు మొహాంవాదెదుటను, ఇటు అల్లా యెదుటను, ఉభయులు ప్రమాణములుచేసి అందలి షరతులను తప్పకుండ ఆ చంద్రార్కము మన్నింతుమనిచెప్పి చేసికొనిన యొడంబడిక కాదా! భగవంతుని యెదుట జరిగిన అట్టి యొడం బడికలోని షరతులను మార్చుటకు కంపెనీవారికి యేమి అధి కారము గలదు? ఎట్టి సాకుగలదు? ఏ మిషమీాదగాని షరతుల మార్చుటకు అవకాశము మొదటి యొడంబడికయం దెచ్చటను కాగడాలువేసి వెదకినను కాన్పింపదే! ఈప్రశ్నకు సమాధాన మింతవరకు నూరేండ్ల ఈమధ్య చెప్పినవారెవరును కనుపించరు. సొమ్ము వృథాగా ఖర్చుగాకుండ పొదుపుచేసి నామని కుంపిణీవారు చెప్పిన మాటలలో చాల మోసమున్న మాట వాస్తవమే. కాని, యీా మోసములోకూడ చాల పొదుపు వున్నదని చెప్పవచ్చును. ఏలననగ:— డైరెక్టర్లు

యీ రీతిగ వ్రాసిరి. "నవాబునకిచ్చు భృతిని మనమిప్పుడు తాత్కాలికముగ మాత్రమే తగ్గించుచున్నాము. కావున, దేశముమీద వచ్చు నికరము రెవెన్యూలో నూటికి రెండున్నర చొప్పున మనమిదివరకు మన నౌకర్లకు ఇచ్చుచున్న కమిషను హెచ్చించవలసినదని దీని యర్థముగాదు. కావున, మొత్తము వసూలగు రెవెన్యూలోనుండి పూర్వమువలెనే నవాబుకు ఇచ్చుచున్న హెచ్చుమొత్తమును మినహాయింపగా తేలిన నికరము రెవెన్యూమీదనే రెండున్నర కమిషను ఈయవలెను. అదేరీతిగ నవాబు మంత్రులను తగ్గించినందువల్ల మిగులుసొమ్ము మీదగూడ మన నౌకర్లకు కమిషను ఈయరాదు."

బలత్కారపు ఈ మినహాయింపులు రానురాను యెక్కువయ్యెను. రెవెన్యూవసూలునిమిత్తము పూర్వముం పబడిన దేశీయసైన్యములు ఇప్పుడు అవసరములేనికారణముచే క్రమముగా తగ్గింపబడుచువచ్చినందున అందులకై నవాబున కిచ్చుసొమ్మునుగూడ తగ్గించితిమను మిషను కంపెనీవారు యెప్పటికప్పుడు చెప్పుచుండిరి. మొట్టమొదట చక్రవర్తి ఫర్మానాయందు ఉదహరింపబడినరీతిగ దివానీయుద్యోగములో కేవలము పన్నులవసూలు పనియేతప్ప తక్కినపనులజోలికి పోవద్దని సీమనుండి డైరెక్టర్లు యెన్నిపర్యాయములు వ్రాయుచు వచ్చినను, యిక్కడి కుంఫిణీనౌకర్లు వానినన్నిటిని మూలపార వేసి, "దివానీ" యందుండిన సమస్తఅధికారములను ఒక్కొక్కటిగ తామే, కాజేయుచువచ్చిరి. అందుచే నబాబున కిచ్చు భృతిలో మినహాయింపులెక్కువ జేయుట కెక్కువ అవకాశములేర్పడెను. నబాబురాజధానియగు మూర్షిదాబాదు

కోటలోని సైన్యములు నానాటికి తీసికట్టయిరాగా, యిక్కడ కలకత్తాలో కుంపిణీవారి కోటలోని సైన్యములు నానాటికి పెరుగుచువచ్చెను. ఆహా! యెట్టికాలపరివర్తనము! యెట్టి రాజ్యతంత్రము! ఆరోజులవి! 1772 సం॥లో "వరల్స్టు" కంపెణీయధ్యక్షతనుండి విరమించెను: ఆతనిపిమ్మటవచ్చిన హేస్టింగ్సు గుండెలుదీసినబంటు—నబాబునకీ సైన్యములే అక్కరలేదని అసలే తీసిపారవేయ సంకల్పించెను.

ఈతడు సీమలో బయలుదేరినప్పుడే యీసంగతిని కంపెనీడైరెక్టర్లతో చెప్పెను. నబాబునకును కంపెనీవారికిని వెనుక క్లైవుయేర్పాటుచేసిన ఒడంబడిక లికముందుసాగ నేరవని హేస్టింగ్సుడైరెక్టర్లతో నిర్మొగమోటముగ చెప్పివేసెను. పైకి మనకేమి అధికారములేదనిచెప్పుచు నవాబుపరిపాలనలో మనము జోక్యము కలిగించుకొననేల? నిజముగ, మనకధికారములేనిచో మనమాజోలికి పోవుటయే మానుకొనవలెను; లేదా అధికారమున్నదన్నచో దానిని పూర్తిగ బహిరంగముగ మనచేతులలోనికి తీసికొనవలెను. అంతియేగాని యీముసుగులో గుద్దులాటయేల?—అని హేస్టింగ్సుచెప్పెను. ఇది యొక యెత్తు—రాజ్యతంత్రపుటెత్తు, ఇదిగాక, దీనిలో రెండవ యెత్తుకూడకలదు. ఏమనగ:- మొట్టమొదటి దోపిడీరోజులలో కావలసినంతధనము ప్రతివానికి కొల్లగ దొరికెడిది. ఆప్రకారమే, యెల్లకాలముఅందరికి దొరుకునని ప్రతియింగ్లీషువాడు ఆశపడెను. కాని, దేనికైనను అంతు వుం డునుగద! కుబేరమందిరములతో సరియగు భారతీయు

మందిరములలోని సొమ్మునకు కూడ అంతు వుండును గదా! అదియెన్నాళ్లు దాచుకొనుటకు వచ్చును? మొదటి దోపిడీలతోనే యవి పాడువడెను. అందుచే క్లైవు యిండియా నుండి వెడలిపోయిన తరువాత సీమకు యిరసాల గూడ సొమ్ము కూడ తగ్గిపోయెను. దీనినిబట్టి యిక్కడి సొమ్మంతయు తమకు పంపకుండ యిక్కడివారే కాజేయుచున్నారని సీమ డైరెక్టర్లు అనుమానపడిరి. వెంటనే "నబాబు వద్ద నున్న మంత్రిని తీసివేసి వానిస్థానే యింకొకని నియమించవలెను. లేదా దివాన్యా వసూలు చేయుపనిని నీ చేతిలోనికే తీసికొనవలెను" అని సీమ డైరెక్టర్లు హేస్టింగ్సుకు వ్రాసిరి. ఈ రెంటిలో చివర పద్ధతినే యవలంబింపవలెనని హేస్టింగ్సు మనస్సులో సంకల్పించెను. కాని పైకి మాత్రి మీా సంగతి పొక్కకుండునట్లు చేయవలెనని నటించెను. కలకత్తాలో ఆ కాలములో "నందకుమారు" డను నొక భాగ్యవంతుడు కలడు; యాతడు అమితముగ కుట్ర బుద్ధిగలవాడు. హేస్టింగ్సు యాతనితో సంప్రదించెను. నవాబు వద్ద ప్రస్తుతము మంత్రిగ నున్న "మహమ్మదు రజాఖాను" ను తొలగించి ఆతనిస్థానే తనను నియమించునను నమ్మకమును యీ నందకుమారునకు కలుగునట్లుగ హేస్టింగ్సు నటించెను. ఈ ప్రకారము మహమ్మదు రజాఖానను తోసివేయుటకు యిరువురు చేరి కుట్ర పన్నిరి. సర్వము సిద్ధమైన పిమ్మట, హేస్టింగ్సు కొంతమంది శిపాయిలనుపంపి ఆకస్మికముగ మంత్రి రజాఖానుని మందిరమును చుట్టుముట్టి ఆతనిని ఖైదీగ పట్టుకొని కలకత్తా కోటకు తీసికొని రావలసినదని ఆజ్ఞాపించెను. ఈ

మంత్రికి మిత్రుడగు సితాబ్ రాయియను నతడు బీహారు రాష్ట్రమునకు నాయకుడుగ నుండెను. ఆతనినికూడ ఆసమయమందే అరెష్టుచేసి ఖైదులోవేసిరి. కొన్ని నెలలు గడచిన పిమ్మటగాని, యీ యిరువురను విచారణ నిమిత్తము బయటికి తీసికొనిరాలేదు. (వీరే నేరములు చేసిరో యెవరికి తెలియదు.) వీరి నేరములను విచారించకుండ యేల యింతకాలము ఖైదులో నుంచిరనుమాటకు హేస్టింగ్సు చెప్పిన సమాధానమేమి? ఈ మంత్రికి దేశములో చాల పలుకుబడిగలదట; అందుచే ప్రజలీతనిపై వ్యతిరేకముగ సాక్ష్యము చెప్పుటకు భయపడుదురట. కావున దేశములో యీతని పలుకుబడి తగ్గి ప్రజలకు ధైర్యము వచ్చువరకు యీతనిని విచారణకు తేకుండ యింతకాలమిట్లు ఖైదులో పడవేసి యుంచుట అవసరమయ్యెనని హేస్టింగ్సు సమర్థించుకొన జూచెను. చివరకు యెట్లో విచారణ రోజువచ్చెను; రజాఖానునిపై నందకుమారుడు మోపిన నేరములలో ఒక్కటియు ఋజువు కాలేదు. అంతట యిరువురు ఖైదీలు సగౌరవముగ విడుదల చేయబడిరి. రజాఖానునకు జీవితాంతమువరకు చిన్నపించను నిచ్చిరి. ఈ మంత్రి యుద్యోగమునకు రాకపూర్వము యీ రజాఖాను డక్కాకు నాయకుడుగ నుండిన సంగతి పాఠకులకు జ్ఞాపకముండియే యుండవచ్చును. అది అతని ఖాయపు ఉద్యోగము. మధ్య యెన్ని అవాంతరములు వచ్చినను యీ ఖాయపు ఉద్యోగమునకు మాత్రము భంగమురాకుండ చేయుదునని వెనుక క్లైవు యీతనితో షరతుచేసెను. కాని, యిప్పుడీ షరతును మన్నించు వారేరి? అందుచే రజాఖానునకు ఉద్యోగ

ప్రాప్తి శూన్యమై తుదకు కంపెనీ వారి పింఛనే గతియ య్యెను. ఇక సితాబ్ రాయి చిరకాలమునుండి యింగ్లీషు వారికి పరమమిత్రుడుగ నుండెను. వారి కాతడనేక యుపకార ముల గావించియుండెను. వెనుక పాట్నాలో యింగ్లీషువారి ఫ్యాక్టరీని నవాబు సైన్యములు ముట్టడించి నప్పుడా సైన్యముల నీతడు పారదోలి వారి ప్యాక్టరీని రక్షించెను. అప్పుడు యింగ్లీ షువారు చాలమంది యీతని ననేకవిధముల స్తుతించిరి. కాని, తానీ రీతిగ తన దేశమునకు, జాతికి మానహీనతను తెచ్చి పెట్టితినను సంగతిని యీత డిప్పుడు గ్రహించినాడు— కాని, చేయి జారిపోయినతరువాత అతడిప్పు డేమిచేయగలడు? " నా జీవితములోని మంచిరోజులన్నియు యీ రీతిగ నా చేతు లారా నా మాతృదేశమునకు భరింపరాని అవమానముల దెచ్చి పెట్టుటకై —హా!— వినియోగపడెనుగదా! ఇంగ్లీ షువారి యెడ నిజముగ నేనెంతటి భక్తివిశ్వాసములతోనున్నను వీరు నన్ను కించిత్తైనను నమ్మలేదుగదా! నే నెంత నిజాయితీగ నున్నాను, వారు మాత్రము నా యెడ ద్రోహబుద్ధిని మాన లేదుగదా! " యని సితాబురాయి వల వల వల పోసెను. ఇంగ్లీషు వారీతనికి విలువయగు పారితోషికములనిచ్చి స్తోత్ర పాఠముల నొసగించి యింటికి పంపివేసిరి. కాని,— యీతని యుత్సాహము కుంగిపోయెను, హృదయము భగ్నమైపో యెను; కొలదిమాసములకే మరణించెను.

నందకుమారుని కుమారుడగు గుడియాసును మూర్షి దాబాదులో ఖజానాదారునిగ నియమించిరి. మైనరునవాబు నకు గార్డియనుగ ఆతనితల్లిని నియమింపక, వెనుకటినబాబు

రియొక్క యుంపుడుకత్తె నొకదానిని గార్డియనుగ నియమించిరి. అప్పటి పరిస్థితులనుబట్టి యీ యుద్యోగనియామకము లప్పటి వారికి అవమానకరములుగ గన్పట్టలేదు. బుద్ధిపూర్వకముగ ప్రజలను పీడించుతలంపుతో కుంపిణీవారిట్లు చేసిరని తరువాత వారు నిందించిరి; ఇదిన్యాయమే. ఏలననగా, అట్లుకానిచో, యింతకంటె యెక్కువ క్రూరమగు నుద్దేశముతోనే కుంపిణీ వారిట్లుచేసిరని చెప్పవలసివచ్చును. ఎట్లనగ, నవాబుయొక్క హాతశేషమగు ఆకొంచెము గౌరవమును గూడ తనస్వజాతి వారగు మహమ్మదీయప్రజల యెదుటనే పూర్తిగ తీసివారవేసి, ఆతనిని బుద్ధిపూర్వకముగ అవమానము పాల్జేయుటకే కుంపిణీ వారీ యుంపుడుకత్తెను తీసికొనివచ్చి మైనరునవాబుపై గార్డియనుగ పెట్టిరని చెప్పవలసివచ్చును.

1772 సం॥ లలో హేస్టింగ్సు సీమలోని రహస్య సంఘమున కీరీతిగ వ్రాసెను. "నందకుమారుడు" సమర్థుడు. రజాఖానుని యెడ ఆతనికి గాఢమగు ద్వేషము గలదు. అందుచే యీ నందకుమారుని ద్వారా రజాఖానుని రహస్యములను గనిపెట్టి దేశమందాతనికి గల పలుకుబడిని రూపుమాపి, రాజ్యపాలన యందాతడు వహించిన యధికారము నూడబెరికి తత్ స్థానమందు నా యధికారమును ప్రతిష్ఠించుటకు నేను పూనుకొన్నాను." ఏరుదాటగనే, తెప్ప తగులవేయబడెను. నందకుమారుడును హేస్టింగ్సును చిరకాలము మూర్షిదాబాదు నగరమున నవాబు దర్బారులో పరస్పర ప్రతికక్షులగు కుట్రదారులుగ నుండిరి. ఒకరి యెడ ఒకరికి అపనమ్మకము మిక్కుటముగ నుండెను. తుదకు హేస్టింగ్సు తనకు టోపీ పెట్టినా

డని యీ బ్రాహ్మణుడు లోలోన క్రోధముతో రగుల్కొను చుండెను. పైకేమియు చెప్పుటకు వీలులేకపోయినను, లోపల మాత్రము ఆ క్రోధమునకు అంతులేకుండెను. వెనుక క్లైవు కూడ తన్నిట్లే మోసపుచ్చి, తనకు మంత్రి పని యివ్వకుండ, తనకు విరోధియగు రజాఖానున కిచ్చినందులకే పాపమీ బ్రాహ్మణుడు లోలోన కుళ్లుచుండగ, యిప్పుడు హేస్టింగ్సు వచ్చి మరియొక టోపీపెట్టెను. రజాఖానుని యెట్లైన మంత్రి పదవినుండి క్రిందికి ద్రోయవలయునని నందకుమారుడు హేస్టింగ్సుతో షరీకయి కుట్రపన్నెను. రజాఖానుని తొలగించినయెడల, తనకాపని దొరుకునను నమ్మక మాతనికి కలుగునట్లుగ హేస్టింగ్సు నటించెను. కాని, అనుకొన్న ప్రకారము రజాఖానుని తోసివేయగనే, కుంపిణీవారు మంత్రి యుద్యోగమునే తీసిపారవేసిరి. నందకుమారుడు త్ెల్లబోయెను. ఇదివరకు మంత్రికిచ్చుచుండిన జీతబత్తెము లన్నియు కుంపిణీవారి ఖజానాలోనికే వచ్చి పడుచుండెను. తక్కువ జీతముతో యధికారశూన్యమగు వట్టి యుద్యోగ మొకటి "ఖజానాదారుడు" ను పేరుపెట్టి యీతని కండ్లనీళ్లు తుడుచుటకై యితనికుమారున కిచ్చిరి. కాని నందకుమారుని మనస్సునకది తృప్తి గలిగించునా? ఇట్టి నమ్మక ద్రోహమునకై కసిదీర్చుకొననిదే తాను నిద్రపోనని నందకుమారుడు శపథము పూని, తరుణమునకై వేచియుండెను.

**1773** సం॥ లో పార్లమెంటువారు నిర్మించిన "రెగ్యులేటింగు ఆక్టు" ననుసరించి కలకత్తాలో "రివిన్యూబోర్డు" ఒకటి

యేర్పడెను. ఈబోర్డుకులోబడి ప్రతిరాష్ట్రములోను యిన్స్పెక్టర్లు నియమింపబడిరి. ఈ రివిన్యూబోర్డు యేర్పాటువలన దివానీ పరిపాలన యావత్తు దేశీయపాలకుల చేతులలోనుండి తొలగి పూర్తిగ కుంపిణీవారి వశమయ్యెను. ఈ రివిన్యూబోర్డుతో పాటు అప్పుడే "సద్దర్ అదాలత్" "నిజామత్ అదాలత్" అను రెండుకోర్టులు—ఒకటి క్రిమినల్ కేసులకు, యింకొకటి సివిల్ కేసులకు—ఏర్పాటుగాబడెను. బంగాళాదేశములో నిదివరకు స్థానికముగ నుండుచువచ్చిన న్యాయస్థానములప్పటికి జీర్ణదశకు వచ్చియుండెననియు, న్యాయము క్రయవిక్రయములకు లోనయ్యెననియు కొందరు చెప్పుచున్నారు. క్రొత్తగ అధికారమును కవ్వించుచువచ్చిన విదేశస్థులతాలూకు మనుష్యులకును దేశీయులకును వివాదములు వచ్చినప్పుడు, దిక్కులేని దేశీయులు ఆత్మరక్షణార్థమై యిట్టి యవినీతిమార్గముల నవలంబించి యుందురనుటలో ఆశ్చర్యములేదు. దేశీయుల యందిట్టి లోపములు అచ్చటచ్చట కొన్ని కనిపించగనే ధర్మబాహ్యులును నహంకార పూరితులును నగు విదేశీయోద్యోగులు తమ ప్రాపకమును అధికారమును విస్తరింప జేసికొనవలెనను కాంక్షతో కూర్చున్న తమ సీమ యజమానులకు యీ సంగతుల నన్నిటిని గోరంతలు కొండంతలు చేసి దేశీయ పరిపాలన మంతయు వట్టి పనికిమాలినదని—మెహర్బానీకి చెప్పియుందురు. అయితే, యిక్కడ యిండియా ప్రజలలో ఒకరి యెడ ఒకరు అనుశ్రుతముగ పాటించుకొనుచు వచ్చుచుండిన ధర్మరహస్యములన్నియు యిప్పుడు సీమ నుండి దిగుమతి యగు యీ గుంట యుద్యోగస్తుల కెట్లు తెలియగలవు ?

భారత ఖండమున

# ఆంగ్లరాజ్య స్థాపన

## ఎనిమిదవ అధ్యాయము.

### పంచాయితీ; అదాలత్: 1772



"న్యాయస్థానమునందు విచారణ జరుపుటకు యేనాటికైనను మన కన్న (యూరోపియనుల కన్న) దేశీయులే యెక్కువ తగినవారు. కొంచెము అనుభవము గలిగిన పిమ్మట యే మాత్రము తెలివిగల దేశీయుడైనను సాక్షులను మనకంటె యెక్కువ తెలివితేటలుగ పరీక్షింపగలడు. యెంతటి చిక్కు వ్యవహారములైనను శాంతముతో పట్టుదలతో పరిశీలించి, మిక్కిలి సమర్థతతో దాని సారాంశమును లాగగలడు. ఈ విషయములందు దేశీయుల ముందర యే యూరోపియనుడు కూడ పనికిరాడని చెప్పవచ్చును. గ్రామపంచాయతీలోని మెంబరులు గ్రామస్థులతో కలిసిమెలసి తిరుగుచుండును. వారి గుట్టుమట్టు లన్నియు అతనికి తెలియును. కావున పార్టీలు ఆతనిని మోసగింపజాలరు. కాని కేసు గ్రామమును విడిచి జిల్లాజడ్జి వద్దకు రాగనే బోలెడు సొమ్ము ఖర్చు అగును. ఇక ఆలస్యము మాట వేరుగ చెప్పనే అక్కరలేదు. ఇది యట్లుండగ, గ్రామము విడచునప్పటికి కేసు స్వరూపమే మారిపోవును. కుట్రలు, యెదురెత్తులు బయలుదేరును. జంకుగొంకులేక పార్టీలు యెంతటి

అసత్యములకైనను, అప్రమాణములకైనను దిగుదురు. చిట్టచివరకు సాధారణముగ తప్పుడు తీర్పే బయలుదేరును. జడ్జి యీతప్పుడు తీర్పును నిజముగ ప్రమాదవశమున నొసంగెనో లేక బుద్ధిపూర్వకముగ ద్రోహబుద్ధితో నొసంగెనో యెవరు చెప్పగలరు? తన కగమ్యగోచరముగ నున్న నానారకపు దేశీయుల వ్యవహారపు చిక్కులలోనుండి సత్యమును వెలికిలాగుటకు యేయింగ్లీషు జడ్జికి సాధ్యము కాగలదు? పైకి పరస్పర విరుద్ధములుగ గన్పట్టు దేశీయుల యాచారములలోని నిజతత్వమును మనము (యూరోపియనులము) గ్రహించుట కష్టము. ఇట్టి పరస్పర వైరుధ్యమునకు కారణము మన మొకటి యనుకొన్న అది యొకటి కావచ్చును. లేదా సాక్షి అమాయికుడగుటచే, భయపడి, తబ్బిబ్బులుగ చెప్పిన మాటలనుబట్టి కూడ సాధారణముగ యిట్టి వైపరీత్యములు మనకు గన్పింపవచ్చును. లేదా కేవలము మన యజ్ఞానమువల్లను, చిరాకు వల్లను కూడ యిట్టి వైపరీత్యములు జరుగుచుండును. ఇవి సర్వసాధారణముగ యింగ్లీషు జడ్జీల కోర్టులలో జరుగుచుండుటలేదా?"

—స్ట్రాచీ యను యింగ్లీషు జడ్జి 1802 సం॥లో వ్రాసిన మాటలివి.

విమతుల జైత్రధాటి రాజమందిర ద్వారములకడ నాగక లోనికి జొచ్చుకొనిపోయెను. ప్రాసాద ద్వారముల కడ మ్రోగిన తత్ప్రస్థానభేరీ నినదమును కర్ణజ్వరార్తిగ వింటిమి. అసహ్యమగు దాని యవజ్ఞాపూర్వక ధిఃకారధ్వానములను, భయానకమగుదాని మహోద్ధతిని, అహంకారపూరితమగుదాని గర్వోన్నతిని కనిపెట్టితిమి. కచేరీలలోను, అదాలత్ (కోర్టు) లలోను, దివాణములలోను దాని పోకడల నిక కనిపెట్టుదము. రాజులు, జమీందారులు, రైతులు, మున్నగువారిపని దాని ముందెట్లయ్యెనో చూతము.

మరాఁడు పెద్దరాష్ట్రముల పరిపాలనకై ఢిల్లీ చక్రవర్తిచే తాబేదారులుగ నియమింపబడిన యీ కుంపిణీవారు క్రమ క్రమముగ నెట్లు స్వతంత్రాధికారులైరో మన మిదివరకే చూచి యున్నాము. ఇట్లే చాలచోట్ల చాలమంది సామంత రాజులు క్రమక్రమముగ స్వతంత్రులైరి. చక్రవర్తి యిక్కట్టులలో చిక్కుకొనియున్న సమయములను కనిపెట్టి వీరాతని కివ్వ వలసిన కప్పముల నెగవేయసాగిరి. పైకిమాత్రము చాల మంది చక్రవర్తికి లోబడియున్నట్లే నటించుచుండిరి. ఇది గాక, దేశమందు యుద్ధములు తఱచగుటచే, స్వరక్ష ణార్థమై సామంతరాజులిట్లు చేయవలసి వచ్చెననికూడ చెప్పవచ్చును. దూరమున నెచ్చటనో ఢిల్లీలోకూర్చుండి యిక్కడి నిజపరిస్థితుల నెరుంగుటకు సరియగు అవకాశము లేని చక్రవర్తియొక్క పెత్తనము లేకయే తన రాష్ట్రములో తాను స్వతంత్రుడుగనుండి తనప్రజలకు తానే న్యాయాన్యాయము పరిశీలన గావింపవలయునని ప్రతిసామంత రాజును కోరుకొనుట సహజమే. కాని, తానొక్కఁడు, తన చిన్నరాష్ట్రముతో నొంటరిగనున్నచో పరుల దండ యాత్రలకు తట్టుకొనుట కష్టమనియెంచి, ప్రతిసామం తరాజును బలిష్టమగు నొకానొక కేంద్ర రాజ్యాంగములో చేరియుండుట క్షేమకరమని యెంచెను. ఈ రీతిగ తనకు కేంద్రరాజ్య మొసంగు సహాయమునకు ప్రతిఫలముగ ప్రతి సామంతరాజును తత్కేంద్ర రాజ్యాధిపతియగు చక్రవర్తికి సాలియానా కొంతసొమ్మును కప్పముగ గట్టుచుండెను. ఈ రీతిగ చక్రవర్తికిని సామంతరాజులకును జరిగిన యొడంబడి

కలలోని షరతులు ఆయాపరిస్థితులను బట్టి పలురకములుగ నుండెను. ఆయా రాజుల బలాబలములనుబట్టియు, వారి రాష్ట్రముల విస్తీర్ణతను దూరమును బట్టియు యీ షరతులు మార్పునొందుచుండెను. తరుచు యీ సామంతరాజులు తమలోతాము రక్తసంబంధీకులగు బంధువులుగనో, మిత్రులుగనో, నుండుట గలదు. ఇట్టి వారందరు సాధారణముగ నొక కట్టుగ నుందురు. ఇంతియేగాక, ఒకరి రాజ్యము లొకరికి సమీపమందుండుట చేతగాని, అందరికి ఒకే కార్యమందు ప్రయోజన మేర్పడుట వలన గాని సామంతరాజులు తమలో తాము జట్టులుగ నేర్పడుటయు గలదు. తన సామంతరాజు లందేర్పడిన యీ జట్టులను జూచి చక్రవర్తి యెంతయీర్ష్య నొందెడివాడో వేరుగ చెప్పనక్కరలేదు. మరియు, యీజట్టు లిందు జేరిన రాజుల కెంతటిబలమును, లాభమును జేకూర్చుచుండెనో కూడ వేరుగ చెప్పనక్కరలేదు. సామ్రాజ్యాధికారమంతయు ఒక్కచోటనే, ఒక్క చక్రవర్తి చేతిలోనే కేంద్రీకృతమై యాతని దురాశను పెంపొందించకుండ నివారించుటకే ఆయా ప్రాంతముల గల సామంత రాజు లీరీతిగ తమలోతాము కట్టుబాటుల నేర్పరచుకొనిరి. స్థానికాధికారులకు సామంతరాజులు పేరునకు మాత్రము తమ ప్రజల యభిప్రాయమునకు బాధ్యులుగారని చెప్పినను, నిజమునకు ప్రజల మొరలను, వారి కష్టసుఖములను ఆలించి పాలించునది వారే. అట్లుగాక తమప్రజల కోర్కెలను, యాదేశములను యీ సామంతరాజులు నిజముగ మన్నింపక పోయినచో, వారక్కడ చిరకాలము రాజ్యమేలజాలరను సంగతినికూడ మనము గ్రహింపవలెను.

దృష్టితో చూచినయెడల, సామంతరాజు లేర్పరచుకొనిన యీ కట్టుబాటులు నిజముగ ప్రజలకు రాజ్యాంగమందు గల యధికారమును దిట్టపరచుటకే యేర్పడినవని చెప్పవచ్చును. "వృథాగా యీ డబ్బంతయు మధ్యనున్న యీ జమీందారుకు, యీ సామంతరాజుకు పోనేల" యని పొలముదున్ను కాపు తనలోతాను గొణుగుకొనవచ్చును. కాని, అధికారులు తనవద్ద అన్యాయముగ విశేష ధనమును లాగుకొనకుండ కాపుదలచేయుటకును, తన కష్టసుఖములనుగూర్చి చెప్పుకొన్నప్పుడు వినుటకును దగ్గరలో నొక ప్రభువనువాడొకడున్నాడనిన్నియైనను రైతుకు తృప్తియుండెను. మరియు తన వద్ద తీసికొన్నడబ్బు యేదోకతీగ తిరిగి తనచుట్టునున్న రైతు ప్రజకొరకే వినియోగపడుచున్నదిగదాయను తృప్తికూడ రైతులకుండెను. ఆదియందు మత ప్రచారమునకై అరబ్బులు విజయయాత్రల గావించిననాటినుండి దేశీయ ప్రభుత్వములు మహమ్మదీయ ప్రవేశించిన సాంఘిక రాచకీయ ధర్మములను మార్పుచునే వచ్చెను. అరబ్బుల సభ్యత హిందువుల సభ్యత కంటె వెయ్యిరెట్లు యెక్కువ మెరుగుగనుండెను. వారి చట్టములు, శిల్పములు, కళలు, ఆచారములు, వీని యన్నిటి కంటె సుగమమగువారి దైవోపాసనా పద్ధతులు నిజముగ వారి జాతికి యౌన్నత్యము నొసంగి వారి రాజ్యాంగమునకు విరోపా రాజ్యాంగ లక్షణముల నొడగూర్చెను. ఈ రెండు రాజ్యాంగపద్ధతులకు తేడా చాల తక్కువయని చెప్పవచ్చును.

ప్రాచీన భారతరాజ్యాంగపద్ధతులు ప్రజాభిప్రాయమునెంతమాత్రము పాటింపక కేవలము శిథిలీభూతమగు, నీచమగు

నిరంకుశపద్ధతులుగ నుండెనని కొందరు తలంచుచున్నారు. కాని, యింతకంటె నిరాధారమగు అపనింద యింకొకటి యుండబోదు. తమచే నోటువడి యపకృతినొందిన ప్రజలు మూఢులగు బానిసలనియు, తామే కత్తిచేబూని యవ్యాజ కృపచే యీ విదేశీయ సభ్యతను వారిపై బలాత్కారముగ జొప్పించియుండక పోయినచో, వారీపాటి కింకను ఆ బానిస స్థితిలోనే యుండియుండెడివారనియు, బూటకపుమాటలు పల్కుట విజేతలగువిమతుల జాతీయ దురహంకారమున కను రూపముగ నున్నది. పరుల నన్యాయముగ నణగద్రొక్కి నామే యని కించిత్తువిచారపడు తమ నంతరాత్మకొకింత యుప శమనము గలిగించుకొనుట కీ బూటకపుమాటలు చక్కగ పనికివచ్చుచున్నవి. నిజముగ యివియన్నియు బూటకపు మాటలని చెప్పుటకు మాల్కామ్, ఎల్ఫిన్‌స్టన్, మన్రో, మిల్లు మొదలకు ఆంగ్లరాజకీయ వేత్తలు పల్కినపల్కులే ప్రబలప్రమాణములు. భారతవర్షపు సంగతులు వీరికి తెలియవని యెవరును అనజాలరు. వీరివాక్యములు ప్రమా ణ్యములుగావని చెప్పుటకెవరికిని సాధ్యపడదు. ఇట్టి వారి వలన మనమింకను తెలిసికొనవలసిన సంగతు లపారముగ గలవు. కాని, వారు బయటికి చెప్పని మాటల నటుంచి, చెప్పినమాటలను బట్టి చూచిననే యీ బూటకపు మాటలచే-యీ యబద్ధపుకూతలచే— కట్టినమొండిగోడలో తుదకొక్క రాయియు నిలువజాలదని స్పష్టముకాగలదు. పరదేశీయుల కాలిక్రింద పడిపోవుటవలన యీ దేశస్థులకు నిజముగయేమి నష్టముగలిగెనో, యేమిలాభముగలిగెనో స్పష్టముగ తెలిసి

గానగోరినయెడల, తత్పూర్వరాజుల కాలములో వారెట్లుం డిరో గ్రహించుట అత్యవసరము.

మతవిషయములో భారతీయులలో రెండు తెగలుం డను. అనాదినుండియు భారతవర్షమందున్న ప్రజలు బహు సంఖ్యాకులు బ్రహ్మ విష్ణు మహేశ్వరాది త్రిమూర్తుల నుపా సించు హిందువులై యుండిరి. మరియొక తెగవారు సంఖ్యయందు గొలదివారైనను, శక్త్యుత్సాహములందు మిన్నలై మహమ్మదీయ మతము నవలంబించియుండిరి. వీరు భిన్నమతస్థులగుటచేతను, దేశమును జయించిన వారగుటచేతను, అధిక సంఖ్యాకులగు ప్రజాసామాన్యముతో కలియక మొదట దూరముగ నున్నను క్రమముగ తోడి దేశప్రజలతో కలిసిమెలసి, ఒకరి కష్టసుఖ ములందొకరు బాధ్యులగుచు వచ్చిరి. అవివేకుల మతావేశము గాని, దౌర్భాగ్యుల కుట్రలుగాని, వచ్చి పూర్వ వైరముల నప్పుడప్పుడు రేకెత్తించినప్పుడుతప్ప, తదితర సమయములయందు హిందూ మహమ్మదీయులిరువురు సఖ్యముగనే- హాయిగనే- యుండుచువచ్చిరి. శత్రువులెవరైన తమపైకివచ్చినప్పుడు వీరిరు వురు సంతోషముతో యేకమై వారిని పారద్రోలుచుండిరి.

మానవుడు చనిపోయినపిమ్మట పరలోకమందేమిజరు గునను విషయమునుగూర్చి హిందూ మహమ్మదీయ మతములకు భిన్నాభిప్రాయములు గలవు. కాని, బ్రతికి యుం డగ యిక్కడ యీ లోకమందు మానవుడు తన దేశము నెడను, తన కుటుంబమునెడను యెట్లు ప్రవర్తింపవలయునను విషయములనుగూర్చి హిందూ మహమ్మదీయులకు విశేష భేదములేదు. ఇరువురకు చాల సమానధర్మములు గలవని

యుభయ మతములవారును గ్రహించిరి. ప్రజల గృహక్షేత్రా రామముల గాపాడుటయు, ప్రజలలో నొకరివలన నొకరికి అన్యాయము జరుగకుండ చూచుటయు, దేశమందు శాంతిభద్రతల నెలకొల్పి పాలించు రాజునెడ భక్తివిశ్వాసముల గల్గి ఆతని కండమై యుండుటయు, ప్రజల సామాన్య ధర్మములని అటు మహమ్మదు ప్రవక్తయు, యిటు హిందూధర్మవేత్తలును తమతమ మతస్తులకు ఉపదేశించి యుండలేదా ?

ఈ ధర్మము లనుల్లంఘనీయములనియు వీనికి మిన్నయగు ధర్మములు లేవనియు యుభయమత ప్రవర్తకులును నిష్కర్షగ వక్కాణించి యుండిరి. తన జన్మభూమియొక్క పేరు ప్రతిష్టలకు వికలత్వము గలిగించుటకు గాని, విదేశీయు లాశపెట్టు వరములకును, మొహార్భానీలకును, లోబడి తన దేశీయుల భౌతిక స్వత్వములను, స్వైరవృత్తులను పరులకు అమ్మకొనుటకుగాని, యెవరికి యెట్టి సందర్భమందు యెంతమాత్రము అధికారము లేదని యుభయమత ప్రవర్తకులును తమతమ యనుయాయులపై విధిగ విధించిరి. యుభయ మతస్తుల పవిత్ర గ్రంథములం దెచ్చటను దీనికి మినహా యింపు గాన్పింపదు. పట్టణములలో అక్కడక్కడ ధనవంతు లగు కొందరు షాహుకార్లును, యెందుకు పనికిరారని వదలి వేయబడిన శుద్ధదార్భాగ్యులును, కుట్రిలలో జేరి, ద్రోహులై యింటిగుట్టును పరులకుజెప్పు వేగరులై అదేకూడుగ బ్రతుకు చుండవచ్చును. కాని జనసామాన్యము అగ్రజులుగాని అంత్యజులుగాని- లౌకికుడుగాని పారలౌకికుడుగాని___ సమస్తమైన వారు తమ వేషభాష లెరుంగని యీ పరదేశస్తులు వచ్చి

యీ రీతిగ తమ దేశమునంతను ఆక్రమించుకొనుటను సమాజమగు నయిష్టముతో జూచుచుండిరి. ఈ పరదేశస్థుల భాషయా ప్రజలకు తెలియకుండెను. వారి సాక్ష్యమా యీదేశ ప్రజలు సాధారణముగ మంచి చెడ్డలను కొను వానిలో వేనితోను పోల్చుట కెక్కడను అవకాశము లేకుండెను. సత్ప్రవర్తనను, శాంతిశమదమాదులను, పరలోకమందలి దండనభయమును, బోధించు తమ మతగ్రంథమగు బైబిలునందు యితర దేశస్థులకు గలవని చెప్పుకొనుచున్న భక్తి విశ్వాసము లన్నియు వట్టి బూటకములని వారి ప్రవర్తనను బట్టి దేశీయులు గ్రహించిరి. భారత ప్రజలకు తమ సాంఘిక రాజకీయ పరిస్థితులలో లోపములు లేవని కాదు; లోపములు లేనివారెవరు? ప్రజాపీడన మనునది సువర్ణభూమియగు భారతవర్షమందుకూడ అప్పుడప్పుడు చాలచోట్ల పలురీతులుగ తన దొంగదోపిడీ బ్రతుకును బ్రతుకుచుండెను. సాహసవంతులును, దుష్టులునునగు శివాజీ హైదరాలీలవంటి రాజుల యథేచ్ఛమగు నత్యుగ్రశాసనములచే తాత్కాలికముగ నప్పుడప్పుడు ప్రజలకు భరింపరాని బాధ కలుగుచున్నమాట వాస్తవమే. కాని యివి యితర దేశములలో వలెనే సకృతుగ జరుగుచుండు వ్యవహారములు. ఇట్టి దుర్భర ప్రజాపీడనములు, దురంత ఘాతుకములు. రాజ్యభ్రంశములు, జర్మనీలో బోర్జియారాజువల్లను, ఫ్రాంసుదేశములో పదకొండవ లూయీరాజువల్లను, స్పెయిన్ దేశములో రెండవ ఫిలిప్పురాజువల్లను, ఇంగ్లండులో మూడవ రిచ్చర్డువల్లను, 'రుధిరప్రియ'యని దుర్యశముగాంచిన మేరీరాణివల్లను, "స్టూఆర్టు" వంశీకులలో

కడపటివాడగు రెండవ జేమ్సువల్లను గలిగియుండలేదా? సాధారణముగ ప్రతిదేశములోను సకృతుగ జరుగుచుండు నిట్టి దుష్కార్యములను గూర్చియే ప్రజలు మరచిపోక యెల్లప్పుడు మహా గందరగోళముగ చెప్పుకొనుచుందురు. నలుగురి నోళ్లలో పడి మ్రోగుచుండు నిట్టి దుష్కార్యములే "చరిత్ర" యగుచుండును. మంచి కార్యములనుగూర్చి చెప్పుకొనువా డెవడుండడు; కావున అవి చరిత్రలలోని కెక్కవు. అందు వల్లనే "చరిత్రలేని దేశము ధన్యతమమని" యొక మహాను భావుడు చెప్పియున్నాడు. పైన వివరించినరీతిగ, జర్మనీ, ప్రాంసు, స్పెయిన్, యింగ్లండు మున్నగు దేశములలోని రాజు లప్పుడప్పుడు సకృతుగ నొనర్చిన యిట్టి దుష్కార్యము లనుబట్టి, ఆయాదేశ ప్రభువులు సదా రుధిరప్రియులై, క్రూర చిత్తులై, ధనలాభలోభరతులై, ఆతతాయులై, సర్వగ్రసనశీలురై ప్రతి నిత్యము ప్రజల నేడిపించుచుండిరని చెప్పవచ్చునా? అట్లే భారతవర్షమందుకూడ రాజులు సదా ప్రజల నేడిపించు చుండిరని చెప్పుటకును వీలులేదు. ఏరాజో మహారాజో నబాబో ఫాదుషాయో, పీష్వాయో బలవంతుడై, దుష్టుడై, తన రాజ్య భాగమునకు రావలసిన దానికంటె ప్రజలనుండి బలవంతముగ యెక్కువ లాగుకొనుటయు, అప్పుడు ప్రజలు తిరుగుబాటు చేయుటయు, దానిపై నాతడు తన యన్యాయార్జిత విత్తమును నిలుపుకొనుటకై ప్రజలను క్రూరముగ హింసించుటయో, లేక లంచపంచములిచ్చి చెఱపి లోబరచుకొనుటయో సాధార ణముగ జరుగుచుండును. తానే సర్వాధికారిననియు, ప్రజల మాటను తాను పాటింపనక్కరలేదనియు అప్పుడప్పుడిట్టి సమ

యములలో యీ రాజులకు మదమెక్కుచుండును. అందుచే వారిట్టి క్రూరకార్యముల జేయుచుందురు. ప్రజల యవస్థలలో నప్పుడప్పుడు తటస్థించుచుండు యీ యెగుడు దిగుడులకు గల నిజకారణము రాజులకప్పుడప్పు డెక్కుచుండునని చెప్పిన మదమను ఆ ఒక్క చిన్నమాటలో నిమిడియున్నది. ఇట్టి యవస్థాభేదములకు పాల్గానిదేశము ప్రపంచములో మన మెరింగినంతవర కెక్కడను లేదు.

భగవంతుడు రమ్యముగ సృష్టించుకొనిన యీ విశాల భూభాగమును తమ దుష్టకార్యములచే నప్పుడప్పుడు పాడొనర్చుచు వచ్చిన క్రూరులగు రాజులందరు ఒక్కరాశిలో చేరిన వారే. వీరిలో వీరికి తారతమ్యము లెంచవలసిన పనిలేదు. ఇంగ్లండు ఫ్రాంసు మున్నగు తదితర దేశములలోని క్రూరరాజులకంటె యిండియాలోని క్రూరరాజులు చెడ్డవారని చెప్ప వీలులేదు. అందరు యేకరాశిలోనివారే. తన సంతానము సుఖముగ, భద్రముగ, నివసించుటకై యీశ్వరుడు నిర్మించుకొనిన రమ్య ప్రదేశముల నన్నిటిని తమ మృగయాంగణములుగ జేసివైచికొనుటకు క్రూరులగు రాజులకు అలుసు చిక్కిన చోట్లనెల్ల ఆయాదేశ కాలాది పరిస్థితుల ననుసరించి వారనేక రీతులగు దుష్కారములనొనర్చుచువచ్చినట్లు లోకచారిత్రము చాటుచున్నది. ప్రజలను వేటాడు క్రూరరాజులకు అప్పుడప్పు డలసట గలుగుటచే, వారు కొంతకాలము విశ్రాంతి నొందుటయు, తద్వారా వేటాడబడు జంతువులగు ప్రజలకు కూడ కొంత యూపిరి బుచ్చుకొనుట కవకాశము దొరకుటయుగలదు. కాని ఈయలసట దీరగనే, తిరిగి వేట వెనుకటికంటె యెక్కువ

తీవ్రమగుటయు గలదు. కాని క్షమాకారుణ్య యుక్తము లగు నిట్టి విరామసమయము లీ భూగోళముపై నలువంకల ప్రతిదేశమందును సమానముగనే గలుగుచుండును. ప్రఖ్యాతముగ చెప్పుకొనదగినయిట్టి విరామసమయములు— ప్రజాపీడనలేని బహుదీర్ఘ కాలములు— ప్రతిదేశమందును గలవని లోకచరిత్రము చెప్పుచున్నది. యూరపు ఖండమందలి సామంత రాజులక్రింద ప్రజలు పొందుచుండినంత తరచుగ యిక్కడి యిండియాలోని ప్రజలు తమ రాజులవలన శాంతి సంరక్షణల పొందుచుండుట లేదని చెప్పుట కెక్కడను వీలు లేదు. యూరపు ఖండము నేలిన వారిలో యిటలీలో "క్యాథరీన్ కిమెడిసి" యను రాణీ కాలమునుండి, "లూయీ యాలీగాండు" రాజువరకును, స్పెయినులో క్రూరుడగు "ఫిలిప్పు" రాజునుండి బుద్ధిహీనుడగు "ఫర్దినాండు" వరకును, యింగ్లండులో విశ్వాస ఘాతుకుడగు "జాన్" రాజునుండి ద్రోహియగు "చార్లెస్"వరకును, గల రాజులేగాక, రష్యాలో పితృహంతకుడగు "పీటరును" నేపుల్సులో "బోర్బన్" వంశీకులగు రాజులును చేసిన ఘోరదురంత కృత్యముల నొకసారి తలంచుకొన్నయెడల, యింతకంటె క్రూరులగు రాజులు హిందూస్థానముపై యెన్నడైన రాజ్యము చేసియుండిరాయని సందేహించవలసివచ్చును. వేయేల, ఇంతకంటె దుర్ణయపరులగు రాజులు, నికృష్టులగు భూపతులు, హిందూస్థానముపై యెన్నడుగాని రాజ్యము చేసియుండిరని కలలోనైన తలంచుటకు వీలులేదు. అట్లు తలంచుటకూడ కేవలము అన్యాయమని చెప్పవలసివచ్చును. 18. వ శతాబ్దమందు

భారతవర్షము నేలిన వివిధరాజవంశముల చరిత్రిలలోని సారాసారముల నిట విచారింపబనిలేదు. వారికిగల యపారమగు నధికారములను వారు దుష్కార్యములకై వినియోగించిరని మనము తలంచుట సహజమే. ఇట్టి యూహకు తగిన దృష్టాంతములును లేకపోలేదు. కాని, భారతవర్షమందు దుష్పరిపాలన యుండెనని ఋజువుచేయుటకెట్టి నిస్సంశయములగు ప్రిమాణములుగలవో సత్పరిపాలనయుండెననియు ఋజువుచేయుటకు సైతము అంతటి నిస్సంశయములగు ప్రిమాణములే గలవు. పూర్వము మహానుభావులగు మంచి రాజులెందరో యీ భారతభూమి నేలిరి. వారి పేరుల నీనాటికిని వారి సంతతివారగు భారతప్రిజలు యెంతో ప్రీతితో స్మరించుకొనుచుందురు. ప్రాతఃస్మరణీయులగు నిట్టి భూపాలురకన్న మిన్నలగు రాజులీ భూలోకమందెచ్చటను లేరని ఘంటాపథముగ పల్కుటకు కావలసినంత ఋజువు, సాక్ష్యములు ఉన్నవి. ప్రిజలగతి యేమైననేమి యను బేజబాబుదారితో, ప్రిజలకు నానాదుర్బుద్ధుల నేర్పి, వారిని సర్వవిధముల భ్రిష్టులనొనర్చిన నికృష్టులగు భూపతులు వేయిమందియైనను పరమపావనమూర్తి, మహోదారభావ సమన్వితమాయనుంగుమాత అహల్యాబాయితో సాటివత్తురా? సకలసంపత్సమృద్ధిగలిగి బహుజనసంకీర్ణమై యొప్పు మాళవరాజ్యము నామె ముప్పది సంవత్సరము లవిచ్ఛిన్నముగ, శాంతిప్రిదముగ బహు సమర్థతతో నేలి సాటిరాజులచే నెన్నరాని మన్ననల వడసి, తన పావన రాజ్యముచే ధన్యాత్ములైన యశేష ప్రిజలచే లోకమాతగ పూజింపబడెను. 1765 సం॥

లో హోల్కారు వంశమునకు పురుషసంతతి లేకపోయెను. తన భర్తయు, తదుపరి రాజ్యమునకువచ్చిన కుమారుడును గతించుటచే రాజ్యభార మీమెపై పడెను. అప్పటినుండి తద్భారము నీమె కడుసమర్థతతో వహింపదొడంగెను. ఈమె పరరాజులతో నెరపిన రాజనీతి యతిసమర్థనీయమై, శ్లాఘాపాత్రమై. రష్యా దేశము నేలిన "క్యాధరన్" రాణీ రాజనీతితో తులదూగుచుండెను. కాని, "క్యాధరన్" వలె యీమె తనప్రక్కలో పరున్న మగనినిచంపి, భర్తృతల్పమును రక్తసిక్త మొనర్ప లేదు. ధైర్యసాహసములందును, పరాక్రమమందును, యీమె సీమదేశమునేలిన "ఎలిజబెత్తు" రాణీకి యెంత మాత్రము తీసిపోదు. కాని, "ఎలిజబెత్తు" చేసినట్లుగ యీమె తన ప్రతికక్షియైన మరియొకస్త్రీని (మేరీని) పట్టి బంధించి, చెరసాలలో పడవేసి, చంపించలేదు. డెన్మార్కు దేశమునేలిన "మార్గరెట్టు" రాణి యెట్టి పరిస్థితులలో సింహాసనమునకు వచ్చెనో అట్టి పరిస్థితులలోనే అహల్యాబాయియు మాళవరాజ్య సింహాసనమునకు వచ్చెను. కాని యీమె మార్గరెట్టు చేసినట్లుగ ధనవంతులను తన కాలికింద పడవేసి మట్టగింపలేదు. పేదల నేడిపింపలేదు. తన పాతివ్రత్యమునుగూర్చి లోకులచే వ్రేలుపెట్టి చూపించుకొనైనలేదు. అహల్యాబాయి తనరాజ్యములో నిర్వర్తింప నుద్యమించిన పరమోద్దేశమొక్కటే గలదు. న్యాయపథమున, ప్రశాంతవృత్తితో, దేశమును చక్కగ దిద్దుకొని, తన ప్రజల సౌఖ్యమును పెంపొందించుటయే యీమె పరమసంకల్పముగ నుండెను. ఈమె కొలది సైన్యమును మాత్ర

ముంచుకొనెను. రాణి అహల్యాబాయి తన సమస్త ప్రజలను సమతతో పాలింపు చుండుటవలన, దేశమందు ఉపద్రవములు గలుగకుండ శాంతిని గాపాడుటకు ఆమెకీ చిన్న సైన్యమే చాలుచుండెను. అహల్యారాణి ఎలిజబెత్తు మున్నగు రాణీలవలె క్రైస్తవస్త్రీ కాకపోవచ్చును. కాని "నా రాజ్యములో నేనొనర్చు ప్రతిపనికి పరలోకమందు ఆ పరమేశ్వరునికి నేను ఉత్తరవాదిని కావలసియుండు" నని ఆమె తరుచు చెప్పుచుండెడిది. నేరస్తులను కఠినముగ దండించవలసినదని ఉద్యోగస్తులామెతో చెప్పినప్పుడు "నిగ్రహానుగ్రహ సమర్థుడగు ఆ పరమేశ్వరుని లీలలను మానవమాత్రులగు మనమేల చెరుపవలె" నని యామె సమాధానము చెప్పును. పరమత ద్వేషమను లోపముమాత్రము హిందూధర్మమునందు కలికమునకైన కానరాదు. తాను పసితనము నుండియు పుట్టిపెరిగిన హిందూధర్మము లందామెకత్యంత ప్రీతియున్నను, తన రాజ్యములోగల పరమతస్తులయెడ ఆమె ప్రత్యేకముగ యెక్కువ ప్రేమను, కరుణను జూపుచుండెను. (సుగుణములన్నియు క్రైస్తవులయందే గలవనియు, తక్కిన మతస్తులలో లేవనియు యింగ్లీషువారి యూహా) కాని అహల్యారాణి క్రైస్తవమతావలంబురాలుకాదు. అయినను, ఆమె దయాదాక్షిణ్యములు గలది; పరుల మేలునకై తన స్వార్థము త్యజించునది; తన ధర్మముల నిర్వహించుటయందు అప్రమత్తత గలది; యెల్లర సమదృష్టితో న్యాయముగ పాలించునది. ఈ రీతిగ అహల్యాబాయి కల్మషరహితమై, అనిందిత చరితమై బహుకాలము రాజ్యమేలి కాలధర్మము నొందెను. తనకు

ప్రేమాస్పదుడగు భర్తయు, యేకపుత్రుడును, తన కండ్లయెదుట నే గతించుటచే విషాదచ్ఛాయలు ఆమె హృదయముపై క్రమ్ముకొని యుండెను. సమస్తరాజ్యసంపదలతో తులతూగు చుండియు ఆమె గర్వమన్న దెరుగదు; మహాసామ్రాజ్య సింహాసనాసీనయయ్యు రాజ్యకాంక్ష నెరుగదు. ఈరీతిగ అహల్యాబాయితాను వహించిన రాజధర్మముల నేమరక, న్యాయపథమును వీడక, భర్తృహీనయు, పుత్రహీనయునై, యెంత పవిత్రముగ బ్రతికినో అంతపవిత్రముగనే కాలగర్భమందు లీనమయ్యెను. ఇట్టి పరమపావన రాజ్యముచే పునీతమైన మాళవదేశమును అహల్యాబాయి గతించిన యిరువది సంవత్సరముల యనంతరము ఆంగ్లసేనలు ప్రవేశించి, సర్వమును నాశన మొనర్చి, బూడిదపాల్జేసి, ప్రజలను వధించి, దేశమంతటను రక్తము కాల్వలు గట్టునట్టుచేసి యెచ్చటను కనివిని యెరుంగని రీతిని ప్రజలనవమానపరంపరలపాల్జేసి, యీ రమ్యభూభాగమును బ్రిటిష్‌వారి కాలి కింద నణగి పడియుండునట్లు చేసెను. నందనవనమననొప్పు మాళవ దేశముపై యింతటి ఘాతుకకృత్య మొనర్చివచ్చిన యీ యాంగ్లసేనానియే తుదకు "మాళవదేశరాజులు తమ ప్రజలనుచూచినంత హీనముగ యేదేశపురాజులు తమ ప్రజలను చూచుచుండుటలేదని" పైగా వారిపై తనకు దుఃఖముపొంగి వచ్చినట్లుగ శ్రీరంగ నీతులు పల్కెనట! అతనికెట్లు నోరువచ్చెనో! నిజముగ యిట్టి పలుకులు పల్కుటకు మనకు (ఆంగ్లేయులకు) యోగ్యత కలదేమో ఒకసారి ప్రతి యాంగ్లేయుడు తన హృదయముపై చేయివేసి చూచికొని మరీ జబాబు చెప్పుకొనవలెను. నిజ

ముగ యేమొగముపెట్టుకొని మన మిట్టి శ్రీరంగనీతులు పల్కగలమో ప్రతి ఆంగ్లేయుడు తన యంతరాత్మకు తానే జవాబు చెప్పుకొనవలెను. మొట్టమొదట రాజ్యమేలిన ఢిల్లీచక్రవర్తుల కాలములో అనగ 17 వ శతాబ్దమధ్యమువరకు భారతవర్షమందు సమస్తమతములయెడ సంపూర్ణమగు సహనము జూపబడుచుండెను. అప్పుడా కాలమందు యింగ్లండురాజులేమిచేయుచుండిరి? తమ క్రైస్తవ మతములోనే భిన్నశాఖకు చెందినవారిని ఘోరముగ హింసించి, దేశమునంతను పీనుగులపెంటగ, స్మశానవాటికగా జేసివేయుచుండిరి. రాజులుపెట్టు ఈ ఘోరహింసలు పడలేక, తమ మతమును విడవలేక, కొందరప్పుడు సముద్రములదాటి అమెరికాఖండమునకు పారిపోయిరి. ఇట్టి ఘోరదురంతకృత్యములొనర్చిన రాజులకు ఆంగ్లప్రజలు గౌరవచిహ్నములుగ పెద్ద పెద్ద సమాధులను గట్టిరి. అట్టి ఆంగ్లప్రజలా నేడు వచ్చి హిందూస్థానపురాజులు క్రూరులని అధిక్షేపించునది? ఇట్టి ఆంగ్లేయులిప్పుడువచ్చి ఆనాడు మాతాతలు భారతవర్షప్రజలకంటె యెక్కువ నాగరికత ననుభవించుచుండిరను సహంకారపూరితలచే చరిత్రనంతయు నింపుదురా? సరే, వారిమాటలే నిజమైనచో, ఆనాడు పరమతస్థులను వధించుటకై మతాచార్యులని పేరు పెట్టుకొన్న పెద్దలందరు ఉరిస్తంభముల నిర్మించుచు, బొండగొయ్యల గొట్టుచు, క్రూరశాసనముల లిఖించుచు, నేల యుండిరి? ఈమతాచార్యులు తమచేతులార స్రవింపజేసిన "కవెనంటరుల" రక్తము, "క్యాతలిక్కుల" రక్తము, "ప్యూరిటనుల" రక్తము, ఖండిత శరీరములనుండి జొట జొట

కారుచువచ్చి మనయెదుట సాక్ష్యమిచ్చిన యెడల యీాదం భోక్తులను బల్కు ఆంగ్లేయులేమి సమాధానము చెప్పుదురు?

తాను చిన్నప్పటినుండియు పుట్టి పెరిగిన పూర్వాచారములుగాని, అభిప్రాయములుగాని భారత వర్షమందు యే హిందువునకు మహమ్మదీయునకుగాని, రాజకీయోద్యోగములందు ప్రవేశించుటకు ఆటంకములుగ నుండలేదు. మహమ్మదీయ రాజులు కుశాగ్రబుద్ధులగు బ్రాహ్మణ విద్యాధికులకు ప్రాముఖ్యమగు సివిల్ ఉద్యోగములను మిక్కిలి సంతోషముతో నొసంగిరి. అట్లే అనేకమంది మహమ్మదీయులును హిందూ మహారాజుల కొలువులలో చేరి అశేషధనమును, గౌరవమును, సంపాదించిరి. హైదరాలీ చనిపోయినప్పుడు దూరముననున్న కుమారుడగు టిప్పుసుల్తాన్ వచ్చువరకు రాజ్యమందెట్టి గల్లంతు జరుగకుండ, ఆతని మరణవార్త యెవరికి తెలుపకుండ బహు భక్తి విశ్వాసములతో దాచియుంచిన దెవరు? అగ్రవర్ణులగు బ్రాహ్మణులు కారా? మూర్షిదాబాదులో నబాబునకు కోశాధ్యక్షుడు కావలసివచ్చినప్పుడు ఆతడు రజాఖానునికంటె నందకుమారునే పెట్టుకొనవలెనని చూచెను. శివాజీ మతోద్రేకి కావచ్చును; టిప్పు సుల్తానకు మతపిచ్చ యుండవచ్చును. కాని పరమతస్థులపై క్రూరశాసనముల ప్రయోగింపవలయునను సంగతి మనము (ఆంగ్లేయులము) యిక్కడికి వచ్చి వారితో జోక్యముగలిగించుకొనువరకు వారికి తెలియదు. ఇక మనకు (ఆంగ్లేయుల) కన్ననో అవి సీమ దేశములో పరిపాటియైపోయినవి. ఒక్క యింగ్లండేయన నేల దాదాపు ప్రతియైరోపీయ దేశమందును

పరమతస్థులను దండించు శాసనములు కుప్పతిప్పలుగ నుండెను. ఐర్లాండు దేశములో క్యాతలిక్కు మతస్థులెవరికిని మాన్యము లపై పారంపర్యపు హక్కులేదు. క్యాతలిక్కు మతస్థుడెవడును సేనాపతిగ గాని, న్యాయాధిపతిగగాని యుండుటకు వీలు లేదు. ఫ్రాన్సు దేశములో "హ్యూజినాటు" వంశస్థు డెవడును నేత నేసికొనరాదని చెప్పి, వారిని సముద్రముల కావల దేశాంతరములకు తరిమివేసిరి! స్వీడనుదేశములో 'లూథరన్' మతస్థులుతప్ప, తక్కినవారెవరును కోర్టులలో జ్యూరరులుగ కూర్చుండరాదట! స్పెయిన్ దేశములో క్రైస్తవులు కాని వారి నెవరిని క్రైస్తవ పద్ధతిని పాతివేయనివ్వరు! ఆనాడు పాశ్చాత్య దేశములందిట్టి మతకక్షలుండగ ఇక్కడ హిందూస్థాన మందేమి జరుగుచుండెను? మహమ్మదీయ మతస్థులగు సున్నీలు, షియ్యాలును, హిందువులును, మహారాష్ట్రులును, సిక్కులును, యెట్టి స్పర్థలులేక, నిరాటంకముగ ప్రతినగరమందు ప్రతి సంస్థానమందు యుద్యోగములను గౌరవములతో సంపాదించు కొనుచుండిరి; లాభకరములగు వృత్తుల కెవరి యభ్యంతర ములులేక సాగించుకొనుచుండిరి. క్రైస్తవ రాజ్యములలో వలెనే భారతవర్షమందుకూడ యుద్ధతరంగములు సముద్రతరం గములవలె ఆటు పోటుగ వచ్చిపోవుచుండెను. ఈ యుప్పెనల వలన గలిగిన నష్టములు యితరదేశములలో వలెనే యిక్కడ కూడ ప్రతి యింటిపైనను, కూలిపోయిన ప్రతికోట బురుజు మీదను గాన్పించుచునేయుండెను. కాని, భారతీయుల వాస్తు శాస్త్ర ప్రవీణతకు చిహ్నములగు మశీదులును దేవాలయము లును చెక్కుచెదర అట్లే నిలిచియుండెను. భారతీయుల శిల్ప

రచనాకౌశలమును, కళాభిరుచిని, ధర్మనిష్టను వేనోళ్ల జాటుచు సర్వాలంకార శోభితములై రమణీయములై యొప్పు సుందర మందిరము లెన్నియో నేటికిని నిలిచియున్నవి. అలంకార శోభయందుగాని, రామణీయకమందుగాని వీనిని మించిన మందిరములు ప్రపంచములో మరి యేదేశములోను లేవు. వినయకారుణ్య వివేకలక్షణాది సద్గుణముల కాటపట్టగు పురాతన ప్రతిష్ఠాపనలనెల్ల మహోదారభావ సమన్వితుడగు అక్బరు చక్రవర్తి మిక్కిలి దూరదృష్టితో కాపాడుచు, వానిని దిట్ట పరచెను. ఔరంగజేబు కాలమువరకు వీని జోలికిపోయిన వారెవరును లేరు. కాని ఔరంగజేబు రాజ్యమునకు వచ్చిన పిమ్మట పర మతస్థులను తన మతములో కలుపుకొనవలయు నను ఉద్రేక మాతనికి నిజముగనో, కృత్రిమముగనో, గలుగుటచేత హిందూప్రజలలో పెక్కండ్ర విశ్వాసము నాతడు గోల్పోవవలసినవా డయ్యెను. అందుచే మహారాష్ట్రులతని రాజ్యముపైకి దండెత్తి వచ్చినప్పుడు వారివలన ప్రజల కెన్ని యిబ్బందులు గలిగినను, వారు స్వధర్మరక్షకులుగ పూజింపబడిరి. అప్పటినుండి మొగలాయిరాజ్యము క్షీణింపదొడగెను. మహారాష్ట్రనాయకులు సకల సంపత్సమృద్ధితో నొప్పారు మధ్యరాష్ట్రముల నన్నిటిని తమ వశమొనర్చుకొని, వానికి ప్రభువులైరి. దుర్బలులగు ఢిల్లీచక్రవర్తులు తూర్పునను దక్షిణముననుగల కొలదిప్రాంతములపై మాత్రము అధికారము వహించుటతోడనే సంతృప్తి నొందవలసినవారైరి. ఈ మార్పు లన్నియు ఎట్లెట్లు జరిగినదియు ఆయారాజవంశము లెట్లు క్షీణించినదియు లేక వర్ధిల్లినదియు వివరించుట కనేకగ్రంథములు

పట్టును. ఆయారాజవంశముల లక్షణములును వారు తమ ప్రజలపై యెట్టి పలుకుబడిని, వశీకరణశక్తిని, గలిగియుండి నదియు తెలిసికొనుట మనకు చాల అవసరము. అట్లు తెలిసి కొనిన పిమ్మటనే దేశప్రజల వెనుకటి స్థితికిని వారిప్పుడు ఆంగ్లే యులక్రింద అనుభవించు స్థితికిని తారతమ్యము గనుపెట్ట వచ్చును. ఢిల్లీచక్రవర్తులు పేరునకుమాత్రము సర్వం సహా ధికారులైనను వారు తమ యధికారములను ప్రజలపై నిరంకుశముగ చలాయింపకుండుటకుగాను దేశమందనేక సంస్థ లేర్పాటుగాబడెను. దేశమందలి ఆయాప్రాంతముల పాలించు సామంతరాజులు, మతపీఠములు, న్యాయస్థానములు స్థానికపరిపాలన కేర్పడిన పంచాయితీలు, గణములు, మున్నగు సంస్థలు, వీని యన్నిటికంటె రైతుకు భూమిపైగల హక్కులు, ఇవన్నియు చేరి పైనున్న చక్రవర్తి తన సర్వంసహాధి కారమును తన యిచ్చవచ్చినరీతిని దుర్వినియోగ పరుపకుండ నాటంక పరచుచుండెను. చట్టములమూలమున ప్రజల స్థిర చరాస్థులు ఐయిరోపా దేశములందెంత భద్రముగ కాపాడబడు చున్నవో, ఇచ్చట ఇండియాయందుకూడ అదేప్రకారము చట్ట ములద్వారా ప్రజల ఆస్థులు సంరక్షింప బడుచుండెను. ఈ చట్టముల నతిక్రమించి నడుచుకొనిన రాజునకు ఆతని సింహా సనమో, తలయో, యూడుచుండెను.

మహమ్మదీయులు భారతవర్షము నాక్రమించుకొన్న ప్పుడు వారు ప్రవేశపెట్టిన శాసనములు నిస్సందేహముగ లోకభూయిష్ఠములైనను అవి రోమను, నార్మను, శాసనముల కంటె తీసిపోవునవిగావు. ఈ రోమను నార్మను శాసనములే:

తప్ప ప్రపంచములో నింక ఏ ఇతర శాసనములగూర్చి ఎరుంగని వారు- తమ ప్రజలమెప్పును బడయుటకై దంభములపలుకు వారు- మహమ్మదీయుల శాసనములు పనికిమాలినవని ప్రగల్భముల గొట్టవచ్చును. రాజపుత్రులయొక్కగాని, రణశూరులగు ఇతరరాజవంశజుల యొక్కగాని శౌర్యప్రతాపముల మంటగలపుటయే, తమపనిగా యీ మహమ్మదీయచక్రవర్తులు పెట్టుకొనలేదు. సార్వభౌముడు సామంతరాజులపై విశేషభారమును మోపలేదు. వారిని చక్రవర్తి, తన సామ్రాజ్యమందు అగ్రగణ్యులగు ప్రభువులుగా నాదరించెను. వారి యాశ్రితులకు చక్రవర్తి అశేషసంపదలను, అపారగౌరవములను, నొడగూర్చుచుండెను. వేయేల! రాజవంశము మారినది గాని ప్రభుత్వలక్షణములు మారలేదు. మహమ్మదీయులగు ఉమ్రావులును, హిందువులగు సామంతరాజులును, మహోత్సవములలో ఏకరీతిని కలసిమెలసి యుండిరి. అందరికి సమానగౌరవప్రతిష్టలుండెను. ఒకతరము గడచినపిమ్మట ఉభయులు ఈ భారతవర్షమును సమానముగ తమ స్వదేశముగ భావించి గర్వపడదొడగిరి. సామంతప్రభువులకును, ఉమ్రావులకును, క్రిందిమెట్టున భూస్వాములుండిరి. వారిలో అయోధ్యరాష్ట్రములోని తాలూకాదారులును బంగాళా దక్కను రాష్ట్రములలోని జమీందారులును ఈతరగతిలోని వారు. వీరు తమ భూములను వివిధములగు షరతులకును పన్నులకును లోబడి పారంపర్యముగ ననుభవించుచుండిరి. మరియు ఈ జమీందారులక్రింద "పుట్నీదారులు" లేక ఈనాందారులు ఉండిరి. వీరు తమజమీందారులకు సాలి

యీనా కొంత తహస్సీలును కట్టుచుండిరి. మరికొందరు ఒకేసారి నజరాణాను కట్టివేసి శాశ్వతజిరాయతీ హక్కుగ ననుభవించుచుండిరి. ఈ యీనాందారులక్రింద రైతులు అవ గా భూమిని స్వయముగ సేద్యము చేయువారు ఉండిరి. వీరి స్థితి అనేకప్రాంతములలో అయిర్లండులోని 'కాటియర్లు' అను పేరుగల సేద్యగాండ్రస్థితిని బోలియుండెను. మరికొన్ని చోట్ల నార్వేదేశములోని పిల్లజిరాయితీదార్లను బోలియుం డెను. ఏదేశమందుగాని వ్యవసాయకునికి ముఖ్యముగ గావలసినది ఒక్కటేగలదు. తాను దున్నుకొను పొలముపై తనకు సంపూర్ణమగు హక్కుకలదను నిశ్చయముకంటె యాత నికి ఎక్కువ ప్రాణప్రదమగు విషయమింకొకటి యుండబోదు. మతవిషయములో మానవునకు తనయంతరాత్మకు స్వాతంత్ర్య ముండవలెనని కోరుటయు ఆతనికి ప్రియతమమే. కాని దానికొకనిర్ణయములేక ఎక్కువతక్కువప్రమాణములకు లోనగుచుండును. పౌరస్వాతంత్ర్యము గూడ మానవునకు ప్రియమైనదే. కాని అది కేవలము రాజకీయప్రయోజనములకు సంబంధించినది. వీని యన్నిటికంటె మించినది రైతుకు భూమియందుగల హక్కు. ఈహక్కులేనిదే ప్రపంచములో గల పదార్థములన్నియు రైతుకు నిష్ప్రయోజనమే యగును. పైయధికారి యభీష్టముననుసరించి నిర్ణయింపబడు భూమి హక్కు రైతుకు కేవలము బానిసత్వమే యగునుగాని వేరొండుగాదు.

ప్రతి వ్యవసాయదారునకు తాను సేద్యముచేయు భూమియందు జిరాయితీహక్కు గలిగియుండుటయే భారతీ

యాచారములలోని కెల్ల ప్రాచీన మైనదియు, మహాశ్రేష్ఠమైనదియు నైయుండెను. సేద్యముచేయు రైతును భూమినుండి తొలగించి సిపాయిలకిచ్చు పద్ధతి పూర్వములేదు. యుద్ధములో ప్రతివాడు పనిచేసి తీరవలయునను నిర్బంధము యెన్నడులేదు. నాయకుని పలుకుబడిచేతను, వశీకరణశక్తి చేతను మాత్రమే సైన్యములు కూర్చబడుచుండెను. సిపాయిలకు జీతములిచ్చుట వలనకూడ సైన్యముల కూర్చుట గలదు. భూమి రైతుకే చెందియుండెను. అది ప్రభువుదికాదు. రైతుకుగల యీ హక్కును శంకించినవారెవరును ఆ కాలమందు కానరారు. "దేశమందల్లకల్లోలములు, విప్లవములు తటస్థించి, యెవరైనరైతును భూమినుండి తొలగొట్టినను, గత రెండుమూడు తరములనుండి తానా భూమియందుండుండెనని ఋజువైనయెడల, తిరిగి ఆ భూమి [illegible]కే హక్కుగలుగుచుండెను. రైతు రాజభాగమును (లేక భూమిపన్నును) ప్రభువున కిచ్చుచున్నంతవరకు, తన తాతగారలా భూమిని దున్నుకొనుచుండిరనియు, తన సంతతివారికిగూడ దానిని పారంపర్యముగ అనుభవించు హక్కు గలదనియు చెప్పుకొన్నయెడల, యెట్టి నికృష్టుడగు రా[illegible]గ ప్రజల నేడిపించు దుష్టప్రభువైనను ఆతని హక్కును మన్నింపుచుండెను."

ఈ పద్ధతి వలన యేమి యేర్పడినదనగ రైతుకు తన కుటుంబమునందు, వంశవృక్షమునందు, తన గ్రామమునందు, తన జిల్లాయందు, పరగణాయందు అత్యంతగాఢమగు ప్రేమ, అభిమానము యేర్పడెను. రైతుకు తెలిసినవారు, కావ

లసినవారు, తాను ప్రేమించువారు— యెల్లరు యీ యావరణాల మధ్యనే యుండుటచే రైతుకు తన జన్మభూమిపై యింతటి గాఢమగు ప్రీతి గలుగుటకు కారణమయ్యెను. ఎన్ని కష్టములు వచ్చినను, యెంతటి విషాదపరిస్థితులు తనను చుట్టుముట్టినను, భారతదేశపు రైతు తన జన్మభూమిపై గల గాఢమగు ప్రేమను మాత్రము విడువడు. ఇట్టి పరిస్థితులలో తన జన్మభూమిపై యింతటి గాఢమగు ప్రేమను నిలుపుకొనగలిగిన వారీ ప్రపంచములో బహు అరుదు. తమ కెంతటి దురవస్థ ప్రాప్తించినను, తా మెంతటి నైచ్యము పాలైనను, యెంతటి పరాధీనదశకు పాల్పడినను, తమకు తిరిగి యెన్నటికైన మంచి రోజులు రాగలవను దృఢవిశ్వాసము మాత్రము భారతీయుల నెన్నడును విడువరను సంగతి లోకమునకు విశదమే. గ్రామములు దూరముగనున్నను ఆయా గ్రామముల వారు తరుచు ఉత్తర ప్రత్యుత్తరముల నంపుకొనుచు, యోగక్షేమముల నెరుంగుచునేయుండిరి. వారి దేశమునకు గలుగుచు వచ్చిన దుర్దశల వలన, వారిలో వారికిగల ప్రేమ బంధములు మరింత ధృఢతరము లగుచుండెను. కష్టములు వారిని మరింత దాపునకు చేర్చుచుండెను. దేశమందల్లకల్లోలములు శాంతించిన పిమ్మట తిరిగి యెవరి యిండ్లకువారు గుంపులు గుంపులుగ జేరుకొనుచుండిరి. దేశసంక్షోభమందు నాశన మొనర్పబడిన తమ యిండ్ల వాకిండ్లను పొలములను "యెట్టి తగాదాలు గాని, వ్యాజ్యములుగాని లేకయే యెవరివివారు తీసికొని యథాపూర్వకముగ సుఖముగ అనుభవింప దొడంగుచుండిరి" గాఢమగు జాత్యాభిమానముచేతను, సాంఘికాను

రాగముచేతను వారు నడిపింపబడు చున్నట్లు తెలియుచున్నది. "భారతీయులు నిరాడంబులు, నిష్కపటులు, నిరపాయులు, నిజాయతీ గలవారు. సత్యసంధతలో ప్రపంచములో నేజాతికినీ తీసిపోనివారు— అని భారతీయుల సంగతి బాగుగ నెరిగిన మన్రోయను నొక యాంగ్ల విజేత పల్కెను. తమ తమ వృత్తులకు ఉచితమగు జీవనోపాధి తమ తమ జన్మస్థానములందు లభించుచున్న యెడల, వారు సాధారణముగ యితరచోట్లకు-యెక్కువ ద్రవ్యముదొరకునను దురాశచే పోరు. "ఎంతయో భరింపరాని ఘోరబాధ కలిగినప్పుడు తప్ప, సాధారణముగ రైతు తన తాత తండ్రుల భూమిలోనుంచి తొలగడు— తన సంసారమునకు తగినంతమాత్రము సంపాదించుకొని యింటి వద్దనే యుండుటకు కోరునుగాని, దూరమున బంగారు ముద్ద లెక్కడ దొరకునాయని పరువులెత్తడు. *

భారతవర్షమందు పెక్కు ప్రాంతములలో నాటికి నేటికిని గ్రామ సాముదాయిక సంఘమే, సాంఘిక, పారిశ్రామిక, రాచకీయ జీవితమునకు మూలాధారముగ నున్నది. ప్రతి కుటుంబమునకు తండ్రియో, మరి యితర పెద్దయో, సర్వాధికారియై యుండును. ఎవరి గృహము వారికి పవిత్రము. యజమాని సమ్మతిలేనిది పొరుగింటి వాడెవడును తన యింటిలో ప్రవేశించుటకు హక్కులేదు. గ్రామమును, గ్రామ సాముదాయిక ప్రయోజనములకు సంబంధించిన వ్యవహారములను అనాదినుండియు గ్రామ పెద్దలచే నిండిన గ్రామ పం

* [ నిధియను శంక భూతలము దప్పడు. నావచే మహోదధి దరియింపడు ; శిఖరిధాతువు లూదడు. ]

చాయితీయే పాలించుచుండెను. ఈ పంచాయితీయందు సాధారణముగ పూర్వము అయిదుగురు పెద్దలుండెడివారు. యిప్పుడు తరుచుగ యెక్కువమంది యుండుచున్నారు. ఇందు లోని పెద్దలు గ్రామమందుగల అన్ని కులములవారికి సంబంధించినవారై యున్నారు. గ్రామమందేదైన తగాదా వచ్చినప్పుడు అనుశ్రుతాచార ప్రకారము వారు తీర్పు చెప్పుదురు. పూర్వాచారమునకు సంబంధించని కొత్తసంగతి— అపూర్వవిషయము— యేదైన తటస్థించినప్పుడు వారు దానికొక నియమమును కొత్తగ యేర్పరచుటయు కలదు. ఈ ప్రకారము కొత్త సందర్భముల కనుగుణముగ కొత్త యాచారముల నిర్మించుటయే శాసన నిర్మాణమగును. కొత్త సందర్భము లేర్పడినప్పుడు వానికి తగిన పరిహారోక్తి వెనుకటి యాచారములం దెచ్చటను ఖండితముగ నిరూపించబడక పోయినను, యిట్టి సందర్భములందు మన పూర్వులిట్లే చేసియుందురను నొక కల్పనను గావించుకొని, తత్ప్రకారమే యీ పంచాయితీ దార్లును తదనుగుణమగు నొక నూతన నియమమును సృష్టించుచు వచ్చిరి. ఇట్టి కల్పన మేల చేసికొనవలసి వచ్చెననగా:— తామీ విషయములో స్వతంత్రించి, అహంకార పూర్వకముగ యేమియు చేయుట లేదనియు, అంతయు తమ పూర్వుల పేరుమీదుగానే జరుపుచున్నామనియు చెప్పి పూర్వులయెడ యొక విధమగు గౌరవమును తమ నమ్రభావమును తెలియజేయుటకే యిట్టి కల్పన గావింపబడుచున్నది. "గ్రామమందలి అన్ని తరగతులవారి సమ్మతిపై తమ కేకగ్రీవముగ నొసంగబడిన యధికారముల

బట్టి యీ పంచాయతీదార్లును, పౌరగణములును తమతమ ప్రాంతములందెట్టి సంక్షోభములు గలుగకుండ శాంతిభద్రతల గాపాడుటకు సమర్థులై యుండిరి.'' వీరి హక్కులను గాని అధికారములనుగాని హిందూదేశములో నెట్టి క్రూరుడగు రాజుగూడ త్రోసివేసి యుండలేదు. ఇంక ధర్మాత్ములగు రాజుల సంగతి వేరుగ చెప్పనేల ? వారు ఈ పంచాయితుల యెడను, గణములయెడలను, అత్యంత భక్తి శ్రద్ధల గనుపరచుట మూలముననే తమ పేరు ప్రఖ్యాతులను, ప్రజానురంజకతను సాధించుకొన గలుగుచుండిరి. వీనినిగూర్చి సర్ థామస్ మన్రో ఇట్లు వ్రాయుచున్నాడు. "హిందూదేశములో ప్రతిగ్రామములోను సక్రమముగా నిర్మింపబడిన పౌరసంఘములు (మునిసిపాలిటీలు) ఉండెను. ఈ సంఘములు ఇప్పటికి రెవెన్యూ, పోలీసు, ఇలాకా వ్యవహారములనేగాక చాలవరకు సివిలు క్రిమినలు అధికారములనుగూడ నిర్వహించుచుండెను.'' సంఘీభూతమగు ఈ పౌర సంఘములందు ఏయే యుద్యోగమునకు యెట్టెట్టిహక్కు బాధ్యతలు గలవో మన్రో మిక్కిలి విశదముగా వివరించియున్నాడు. కోశాధ్యక్ష పదవియు, న్యాయాధ్యక్ష పదవియు, వేర్వేరు విధులుగా నుండెను. ప్రజాసంరక్షణార్థమై వీరి వశమున 'తహరులు' అనగా పోలీసు దళములు ఉండెను.

దేశీయ ప్రతిష్ఠాపనలోనికెల్ల ఎన్నదగినది వారి "జ్యూరీ" పద్ధతి. అనగా న్యాయవిచారణ కాలమందు, ఒక్క జడ్జీయే గాక అతనికి తోడుగ మరికొందరు అనుద్యోగీయులగు పెద్ద మనుష్యులను నియమించు పద్ధతికే "జ్యూరీ" పద్ధతియని

పేరు. ఈ పద్ధతి భారతవర్షమం దెల్లడల అనాదినుండియు ఆచారముగ నుండెను. నిర్ణయింపవలసిన వ్యాజ్యస్వభావమును బట్టి పంచాయితీదార్లు నిర్ణయింప బడుచుండిరి. కాని, ప్రతి వ్యాయము వారు ప్రజాభీష్టము ననుసరించియే యెన్ను కొనబడు చుండిరి. దుష్పరిపాలననుండి ప్రజలను రక్షింప సమర్థులై యున్నవారే ఈ పంచాయితీలకు అధ్యక్షులుగ నుండుచూ వచ్చిరి. అట్టివారినే ప్రజలేకగ్రీవముగ అధ్యక్షపదవికి ఎన్నుకొను చుండిరి. అట్టివారు తమకు ప్రతిఫలముగ ప్రజల యాదరణను, పేరు ప్రతిష్టలను మాత్రమే కోరుచుండిరి గాని వేరు ప్రతిఫలము నెన్నడును కోరియుండలేదు. ఇట్టి ప్రజానురాగమును వారు తరచు బడయుచుండిరి. మంచి రాజుల కాలములో వీరు పరిపాలనా సౌష్టవమును పెంపొందించుటకు సహకారులుగా నుండిరి. చెడ్డరాజుల కాలములో దుష్పరిపాలనను ధైర్యముతో నెదిర్చి ప్రజల కాపాడుటకును సహాయకారులుగ నుండిరి. ఇట్టి కార్యములచే వారికి ప్రజలయెడ గల ప్రేమ అత్యధికమగు చుండెను. ప్రజలును వారిని అనేక విధముల గౌరవించు చుండిరి. పంచాయితీ సభ్యులుగ నుండుటకు ప్రతి కులమువారికి ప్రతి మతమువారికి ఎట్టి నిరోధముతులేక సరిసమానమగు హక్కులుండెను. పంచాయితీ దార్లలో నెవరైన యేపక్షమువారికైన అన్యాయము చేయుదురని తోచినచో అట్టివారిని తొలగించమని ఆక్షేపించుటకు కక్షిదార్లకు హక్కుండెను. ఇట్టి హక్కు పంచాయితీ అధ్యక్షునిపై కూడ కొన్ని సందర్భములలో నుండెను. పంచాయితీకి తమను ఎన్నుకొనబడుట గొప్ప గౌరవముగా

నెన్నబడుచుండెను. అంతకంటె అత్యధికమగు సన్మానము వేరొకటి లేదని చెప్పవచ్చును. అట్లే పంచాయితీ సభ్యుడుగా నెన్నుకొనబడుటయు ఆ యా కులములవారికి గౌరవముగనే యెంచబడుచుండెను.

పంచాయితీ యొక్క ప్రాముఖ్యత సివిలుక్రిమినలు వ్యవహారములందు సమముగనే యుండెను. ప్రజలసాంఘిక నైతికవర్తనముల నడపుటయందును దానిప్రాముఖ్యత స్పష్టముగా వ్యక్తమగుచుండెను. రాజ్యమను శరీరమునకు ప్రధానాంగము న్యాయపాలనమే. ఈ యంగమందలినరములు కండరములు పుష్టికరములుగానున్ననే రాజ్యము నడచును. రాజ్యాధికారమునకు ప్రజలు వశవర్తులై నడచుకొనుటయు, ప్రజలస్థిరచరాస్థులకు దుష్టులవలన అపాయము కలుగకుండుటయు, ఆయాప్రాంతముల ప్రజాసంక్షోభములు కలుగకుండ శాంతిని కాపాడుటయు, ప్రజల మానప్రాణముల సంరక్షించుటయు, ప్రధానముగ యీ న్యాయముయొక్క పుష్టిమీదనే ఆధారపడియున్నది. భారతవర్షమందీ న్యాయపరిపాలనపద్ధతి అనాదినుండియు రాజ్యమునకు ప్రధానాంగమై సంఘనిర్మాణమందెల్లెడల దట్టముగా నల్లుకొని యున్నది. ఈపద్ధతి సంఘమందు మూలమూలలకు వ్యాపించి నిశ్శబ్దముగ అప్రతిహతముగ పారంపర్యముగ ప్రజలవర్తనమును ఋజుమార్గమున నడుపుచుండెను. రాజ్యమునకు పుష్టినొసగు ఇట్టి ప్రధానాంగమును వికలమొనర్చుట, నిర్వీర్యమొనర్చుట, విమతులగు విజేతల దురహంకారపూరితమగు దుష్టరాజతంత్రమునకు తార్కాణమేగాని వేరొండుగాదు. ఇట్టి దుష్ట

సంతోషమునే వివువక కొనసాగించుట పరిమత్తులగు నిరంకుశ ప్రభువుల రాజ్యమదాంధత తప్ప వేరుండు కాజాలదు. అనాది సిద్ధమగు ఈ పంచాయితీపద్ధతులను పూర్వపు రాజులెవరును పాడుచేయలేదు. మహమ్మదీయులు గాని మహారాష్ట్రులు గాని, రాజ్యమేలినప్పుడు రాజ్యవంశములందెన్ని మార్పులు గలిగినను ఎవరుగాని వీనిజోలికి పోలేదు. వారందరు ఈపంచాయితీ పద్ధతులను బహుభక్తిశ్రద్ధలతో మన్నింపుచునే వచ్చిరి. కాని, ఈ విదేశీయపరిపాలన వచ్చినపిమ్మట ఈ పురాతన న్యాయపరిపాలన పద్ధతులనన్నిటిని విదేశీయులు కుర్పించుపవేర్లతో గూడ పెకలించి బహుకఠోరముగ విధ్వంసము గావించిరి. దేశీయులచే పాలింపబడు పంచాయితీలను తీసివేసి వానిస్థానమున నిరంకుశుడగు ఒకజడ్జీని కూర్చుండబెట్టిరి. తన స్వప్రజలచే నెన్నుకొనబడిన పంచాయితీ యెదుట విచారింపబడుటకు బదులుగా ఇప్పుడు ప్రతి యొక్కడు దూరమున నెచ్చటనో ముక్కు మొగ మెరుగని క్రొత్త వాని వద్దకు పోవలసి వచ్చెను. ఆ క్రొత్తవానికి కేసులోని నిజమును కనుగొన వలయునని అభిలాష యున్నను వానికి తెలిసికొనుటకు సాధ్యముగాని స్థితియందు ఆతడుండును. న్యాయతీర్పరి యెరుగదగిన విషయములలో కించిత్తైనను ఎరుంగుట కాతని కవకాశముండదు. ప్రజలలో పరస్పరవిశ్వాసము నకు బదులు యేవంక జూచినను పరస్పరము అపనమ్మకము గాఢముగా నాటుకొనియున్నది. పూర్వము ప్రజలకు ఎట్టి వాదావుడిలేకయే ప్రశాంతముగ ఎల్లరకు నిస్సందేహముగ న్యాయముగలిగి ప్రజలకందరకు తృప్తిగానుండెడిది. ద్వేష

ములకు తావులేకుండెను. కాని ఇప్పుడదియంతయు మారిపో యినది. ఇప్పటి పద్ధతిని బట్టి న్యాయవిచారణ అసంపూర్తిగ నుండకతప్పదు. కుర్చీలో కూర్చున్న జడ్జీకి అయోమయావస్థ కలుగక తప్పదు. ఆతనికి సోమరితనమును, నిద్రయు, ఆవ హించుటకు కావలసినన్ని అవకాశములుగలవు. సంగతి సంద ర్భముల తెలిసికొనలేక ప్రమాదములకులోనై తప్పుడు తీర్పులు చెప్పుటకు పెక్కు అవకాశములుగలవు. ఈ తప్పుడు తీర్పులచే బాధనొందువారికి దిక్కులేక నిరాశాహతులగుదురు. తప్పించు కొనజాలని వంచనకు, నష్టమునకు, పాల్పడిన నిర్భాగ్యులగు పార్టీలు రోషావేశముచే ఏమియు చేయజాలక పండ్లు పట పట కొరుక్కొందురు. ఇట్టి అన్యాయమును జడ్జి తెలిసి చేసిననేమి? తెలియక చేసిననేమి ? అన్యాయము అన్యాయమే గదా ? ఇట్టి అన్యాయము పొందిన వానికి దిక్కెవ్వరు ? న్యాయపద్ధతిని నడచు పూర్వపు పంచాయితీపద్ధతిని బుద్ధి పూర్వకముగా నాశనముచేసి దానిస్థానమున ముక్కు మొగ మెరుగని విదేశీయోద్యోగులను న్యాయ నిర్ణేతలుగ నిలుపుటకు కంపెనీవారు పూనుకొనిరి. ఈ యుద్యోగులకు కేసులోని సంగతులు స్వయముగా తెలియవు. పార్టీల భాషయు వారికి తెలియదు. పార్టీలు చెప్పుమాటలను ఇంగ్లీషులోనికి తర్జుమా చేసిచెప్పు మధ్యస్థుల మాటలనుబట్టి కేసు సందర్భములు ఫలానివి కావచ్చునని జడ్జీ యూహించును. ఈ జడ్జీకి ప్రజల యాచార వ్యవహారములు తెలియవు. వానిలోని నిజతత్వ మును తెలిసికొనుటకు విదేశీయులకు వారి జీవితకాల మంతయు పట్టును. అట్టి క్లిష్టమగు ఆచారములగూర్చి ఈ జడ్జీ తెలిసి

కావలెక తబ్బిబ్బులగుచుండును. కాని గ్రామములోని పంచా యితీదార్లే ఈ కేసును విచారించునెడల ఈ కేసు సందర్భము లను సునాయాసముగ గ్రహించి తక్షణమే న్యాయమగు తీర్పును చెప్పుదురు. సుకరమగు ఇట్టి న్యాయపద్ధతిని తీసివే యుట హేస్టింగ్సు న్యాయదృష్టిగల చరిత్రకారునకైనను ఆశ్చర్యము గొలుపక మానదు. ఈ మార్పు శుద్ధపనికిమాలినదని ఆతడు ఖండింపకమానడు.

కంపెనీవారు ప్రవేశపెట్టిన చట్టములు కేవలము అన్యా యములైనవని హేస్టింగ్సుకు పూర్తిగా తెలియును. దేశములో క్రిమినలు విచారణాధికారమును కంపెనీవారు వహించుట కేవలము దేశీయుల హక్కులను అన్యాయముగ హరించుట యేయని హేస్టింగ్సు ఒప్పుకొనియున్నాడు. కాని అట్లు చేయక వీలులేక పోయినదని ఆతడు సమాధానము చెప్పెను. ఈ న్యాయ విచారణాధికారమును దేశీయ ప్రభువుల చేతు లలో నుంచిన యెడల కంపెనీ యధికారమునకును దేశీయ ప్రభువుల అధికారమునకును ఘర్షణరాగలదు. అందుచే, ఏదో విధముగ మంచిగనో చెడుగనో బంగాళాదేశములో న్యాయపరిపాలన యనునదొకటి స్థాపించితిమని చెప్పునిమిత్తమై దానిని మా క్రిందికే తీసికొంటిమి." అని హేస్టింగ్సు చెప్పెను.

కంపెనీవారికి దివానీ వచ్చిననాటినుండియు కొద్ది కొద్ది గా ఈ మార్పు జరుగుచునే యుండెను. ప్రజల భావములలో సాంప్రదాయములలో, ఆచారములలో అనాదినుండి నాటు కొనియున్న పంచాయితీ న్యాయవిచారణ విధానమును తొల గించి తత్ స్థానమున విదేశీయ విచారణ విధానమును నెల

కొల్వు పని నాటినుండియు మెల్లగసాగుచునే యుండెను. 1773 వ సంవత్సరమున పార్లమెంటువారు నిర్మించిన రెగ్యులేషను చట్టముద్వారా హేస్టింగ్సు సలహామీద ఈ పని పూర్తి అయ్యెను. ఆ చట్టములో మూడవ నిబంధన ప్రకారము కలకత్తాలో ఒక హైకోర్టు స్థాపించుటకు ఏర్పాటు గావింపబడెను. దీనిలో ముగ్గురు సామాన్య జడ్జీలును ఒక పెద్దజడ్జీయు యుందురు. వీరికి సమస్త సివిలు క్రిమినలు అధికారములు యీయబడెను. మరు సంవత్సరము ఈ నాలుగుస్థానములలో నలుగురు యింగ్లీషు లాయర్లు వచ్చి కూర్చుండిరి. వారిలో ముఖ్యుడు మన హేస్టింగ్సుకు బాల్యస్నేహితుడు "సర్ ఎలిజా ఇంపే."


SREE VEMANA ANDHRA BHASHA NILAYAM
శ్రీ వేమన
ఆంధ్రభాషా నిలయము,
గొంపల్లి, హైదరాబాదు
HYDERABAD-DN.



# భరతఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన

## త్రొమ్మిదవ అధ్యాయము.



### రోహిలాలు : 1773—1776

ఆరోజులలో కేవలము డబ్బులాగుటయే హేస్టింగ్సు తనపనిగ పెట్టుకొనెను. అతనికప్పుడు డబ్బుకు చాల కటకటగ నుండెను. కాబట్టి, న్యాయముగనో, అన్యాయముగనో, యేదోవిధముగ డబ్బుగుంజుటకే అతడు పూనుకొనెను. ఈ ప్రభుత్వమున కెన్నిలక్షలద్రవ్యము తక్కువపడునో అంత మొత్తమును మొగలిచక్రవర్తి వానిదగ్గరనుండి మెదలకుండ లాగికొనుటయే తనపనిగ పెట్టుకొనెను. "సీమ పలాని నేరము చేయవలసినద"ని సీమడైరెక్టర్లు యితనికి చెప్పియుండలేదు; చేసినవానిని ఆమోదించియు నుండలేదు. వారు హేస్టింగ్సుకు వ్రాసిన ఉత్తరములనుబట్టి చూడగ అందు అత్యుత్తమమగు శ్రీలనీతులెన్నియో కలవు. కాని, అందు నిర్వచించిన ప్రతిధర్మసూత్రమునకు తోకగ 'డబ్బుపంపు' డబ్బుపంపు" అను మాటలను మాటిమాటికి వ్రాయుచుండిరి. అందుచే, ఆ ధర్మసూత్రముల విలువ మన్నయ్యెను. "మెత్త మెత్తగ పాలింపుము, యెక్కువసొమ్ము పంపుము, పాలితులయెడ యథాన్యాయముగను శృతిమించకుండగను పాలింపుము.

యెక్కువసొమ్ము పంపుము; (ఈరీతిగ, యెక్కువసొమ్ము పంపుము, యెక్కువసొమ్ము పంపుము—అనునది ప్రతిధర్మసూత్రమునకు చివర పల్లవిగ నుండెను.) ఈ ధర్మసూత్రములకును, దాని చివరలోకగ నంటించిన పల్లవికిని అర్థమేమి? “ప్రజలకు పితృసముడుగ నుండుము, కాని ప్రజలను పీడింపుము; న్యాయముగ నుండుము, కాని, అన్యాయము చేయుము. అతిగా పోకుము; కాని, అంతయు దిగమ్రింగుము.” ఈరీతిగ పరస్పర విరుద్ధభావములతో—నీతులు బూతులు కలగలుపుగ—చెప్పిన యీ మాటలలోగల నీతులను వదలివేసి, బూతులనే పాటించుట తనకు క్షేమకరమని వారన్ హేస్టింగ్సు నిర్ణయించుకొనెను.

—మెకాలే

రెగ్యులేటింగ్ చట్టమువలన 1773 సం॥ లో పార్లమెంటు వారు యిండియా వ్యవహారములను పునర్నిర్మాణము గావించి నప్పుడు, అందు హేస్టింగ్సుకు సర్వాధికార పదవి నొసంగి యుండిరి. ఈతడు స్థానికుడనియు, అంతకుపూర్వము యిండియాలో చాలకాలమునుండి యుండుటచే అతనికి యిండియా వ్యవహారములం దెక్కువ అనుభవము గలదనియు, ఆతడు యీ విషయములో చాల సమర్థుడనియు, ఇట్టి వాడు తమకు దొరకుట చాల అదృష్టమనియు, అప్పటి సీమ మంత్రివర్గము వారు సంబరపడిరి. కాని, ఒక్కసారిగ, యీతని చేతియందుంచిన యీ సర్వాధికారము నీతడు దుర్వినియోగ పరుప కుండ యీతనికి దురాశ రెచ్చకుండ, కొంత హద్దులో నుంచుటకుగాను యీతనికి తోడుగ యీతనితోపాటు మరి ముగ్గురు ఉద్యోగులను—భిన్న స్వభావము గలవారిని—సీమ మంత్రి వర్గమువారు యిండియాకు పంపిరి. క్లావరింగ్, మాన్‌సన్,

ఫ్రాన్సిస్,— అను యీ ముగ్గురు గవర్నర్ జనరల్ కౌన్సిలులో సభ్యులుగ నుండునట్లు సదరు రెగ్యులేషను చట్టమందే పేర్కొనబడి యుండిరి. వీరు ముగ్గురు ఉన్నత రాచకీయ పరిజ్ఞానము గలవారు. వీరిలో ఫ్రాన్సిస్ అనునాతడు మిక్కిలి మేథాసంపత్తి గలవాడు. ఈతడు రాజనీతిజ్ఞుడేగాక, గొప్ప గ్రంథకర్త కూడ నైయుండెను. సూక్ష్మగ్రహణశక్తి, భావనాపటిమ, ఉపమాసామర్థ్యము, అద్భుతమగు రచనావైచిత్ర్యము, యితని సొమ్ములని చెప్పవచ్చును. ఇట్టి శక్తి సామర్థ్యములు రాజనీతిజ్ఞులలోగాని, కవులలోగాని, బహు అరుదుగ నుండును. ఇదివరలో తాను పొందిన విజయము వలనను, యిప్పుడు నూతనముగ లభించిన సర్వాంసహాధికార పదవివలనను, హేస్టింగ్సు ప్రమత్తుడై తన కాలుసేతులకు సంకెలలుగ యీ ముగ్గురు మనుష్యులను కూడ పార్లమెంటు వారేల తన నెత్తిపై తెచ్చిపెట్టిరని ఆతడు లోలోన గొణుగుకొనుచుండెను. అందుచే, మొట్టమొదటినుండి హేస్టింగ్సు యీ ముగ్గురిని నీరసముగనే చూడ నారంభించెను. "ఈ ముగ్గురకు యేమియు తెలియదనియు, అంతయు తనకే తెలియుననియు,— తనకు తెలియనివి, తాను వారివద్ద నేర్చుకోతగినవి యేమియు లేవనియు,— వారికే తాను చదువు చెప్పవలెనుగాని, తాను వారివద్ద నేర్చుకొన నక్కర లేదనియు"— మున్నగు అహంకార భావములతో హేస్టింగ్సు సంచరింప దొడంగెను. ఏ యుద్దేశముతో పార్లమెంటువారీ ముగ్గురను తననెత్తిపై తెచ్చిపెట్టిరో హేస్టింగ్సు ఒక్క క్షణములో గ్రహించెను. కావున మొట్టమొదటినుండి ఆయుద్దేశమును త్రోసి

రాజనవలెనని హేస్టింగ్సు దృఢముగ సంకల్పించుకొనెను. అందుకు ప్రతిగ, పార్లమెంటువారు పంపిన యీ ముగ్గురు సభ్యులుకూడ హేస్టింగ్సునెడ గాఢమగు నవిశ్వాసముతో నుండిరి. ఇందులో దాపరికమున కేమియు తావులేకుండెను. తామిట్టి యపనమ్మకముతో నుండవలసివచ్చుటకు తగిన హేతువులుకూడ అచిరకాలములోనే సంభవించెను. కుంపిణీ బొక్కసములో ధనము తక్కువయ్యెను. కుంపిణీవారికి అప్పు లెక్కువగుచుండెను. సీమనుండి ఊరక "డబ్బు పంపు" మను గోల యెక్కువయ్యెను. ఇప్పుడేమి చేయవలెను? సమయమునకేదో యెత్తులు వేయుటలో— ఉపాయములు పన్నుటలో— హేస్టింగ్సు పెట్టినదిపేరు. ఆ యెత్తులు మంచివా, చెడ్డవా యను ఆలోచనతో అతనికి పని లేదు. అయోధ్య వజీరువద్ద కావలసినంత ధనమున్నది; అతడు లోభి; ఆతనినుండి డబ్బు గుంజుటయెట్లు? అయోధ్య ప్రక్క నొక దుర్బల రాజ్యముకలదు; ఈ రాజ్యమును అయోధ్య వజీరు దిగమ్రింగుటకై సహాయార్థముగ యింగ్లీషు సేనల నిచ్చినచో, తత్ప్రతిఫలముగ అయోధ్య వజీరు యింగ్లీషు వారికి కావలసినంత ధనమీయడా? ఇది హేస్టింగ్సు వేసిన ఎత్తు! ఈ ఎత్తును హేస్టింగ్సు యెవరికి చెప్పకుండ మిక్కిలి రహస్యముగ నుంచెను. క్రొత్తగవచ్చిన తనతోడి ముగ్గురు సభ్యులతోకూడ చెప్పకుండ దాచెను. ఈ యెత్తును సాగించుటకై యెవరికి చెప్పకుండ హేస్టింగ్సు సర్వసన్నాహములను పూర్తిగావించెను.

అయోధ్యరాజ్యమును ఆనుకొని, "కరమ్నసా" (లేక కరమానసా) నదీజలములు పెక్కులోయలగుండ, నగాధముగ ప్రవహించుచుండును. ఈ నదికి అద్దరిని లోకములోని కెల్ల మిక్కిలి స్వాతంత్ర్య ప్రియులగు "రోహిలా" జాతివారు నివసించుచుండిరి. ఈ రోహిలా రాజ్యమునకు నలుప్రక్కలను పర్వతపంక్తులు పెట్టని కోటగోడలవలె నొప్పారుచుండెను. ఇరుగు పొరుగు రాజ్యములకు హింసలగావించి, వారి సంపదల హరించి, అంతయు తమ యింటిలోనే వేసికొన వలయునను దురాశ వారికెన్నడు లేదు. తమదేశములో— తమ రాజ్యములో— పండిన పంటలవలననే వారు సుఖముగ జీవింపు చుండిరి. వారిభూములు సమృద్ధిగ పండుచుండెను. భగవంతుడు వారికి అన్నోదకములకు కొదువలేకుండ రక్షించి కాపాడు చుండెను. ఇరుగు పొరుగు రాజ్యములలో వలెనే యీ రాజ్యమందును ప్రజలు తమ స్థానిక ప్రభువులచే హాయిగ పాలింపబడుచుండిరి; కాని, తక్కిన రాజ్యములలోని ప్రజలకంటె వీరికి యెక్కువ స్వాతంత్ర్యముండుట చేత, వీరు తక్కిన ప్రజలకంటె యెక్కువ సిరిసంపదల ననుభవించుచుండిరి. "వారిరాజ్యపద్ధతి చాలమంచిది. వారివలన యితరులకెవరికి హాని లేదు; కాని, పరాయులెవరైన తమ మీదికి వచ్చినప్పుడు మాత్రము సహజమగు వారి దేశాభిమానము వారినందరి నొకకట్టుగ జేర్చును. అప్పుడు వారందరేకమై శత్రువుపైకివత్తురు. స్వరక్షణార్థమై తప్ప, వారు యింక యేకారణముచేగాని, పరులపైకి కాలు ద్రవ్వరు" అని 1768 సం॥ లో కలకత్తా గవర్నరుగ నుండిన వరల్స్ట్ అను నాతడు వ్రాసెను. అనాదినుండియు వారి నిరు

పద్రివకర పద్ధతినే విడువక అవలంబించుచు వచ్చుటచేత "వారి రాజ్యము ఆశియాఖండస్థములగు రాజ్యములలోని కెల్ల ఉత్తమ రాజ్యముగ నుండెను. ప్రజలకు రక్షణయుండెను; వారి వృత్తులకు పోషణయుండెను; దేశమునానాటికి సుభిక్షముగ సకల సంపత్సమృద్ధితో తులతూగుచుండెను." తమదేశము నీ రీతిగ జాగ్రత్తగ పాలించుకొనుచు, అనవసరముగ పరులజోలికి పోక బహుమెళకువతో సంచరించుచు నుండుటచేత రోహిలాలు తమ దేశ స్వాతంత్ర్యమును చెక్కుచెదరక కాపాడుకొన గలుగుచుండిరి—అంతియేగాని, పరరాజ్యముల హరించుటచే గాదు. రోహిలాల రణోత్సాహమును స్వాతంత్ర్యనిరతిని కుంగ దీయవలెనని అయోధ్యవజీరు యెన్నియోసారులు ప్రయత్నించెను. కాని అదిసాగలేదు. కుతంత్రములపన్ని వారిని అనవసరముగ రెచ్చగొట్టి, పరులపై కాలుద్రవ్వనట్లుచేసి, హతమార్పవలయునని కూడ అయోధ్యవజీరు జూచెను. కాని, యిట్టి మాయలలో వారెన్నడును పడలేదు. పూర్వము యూరపుఖండములోని రాజులు చేసినట్లుగానే, యిక్కడ యిండియాలోని రాజులుకూడ, ఒకరిరాజ్యముల నొకరు ఆక్రమించుకొనవలెనని నిరంతరము గిల్లికజ్జాల పెంచుకొనుచుండిరి. కాని, యీ రోహిలాలుమాత్రము యిట్టి కజ్జాలకు పోక, యూరపుఖండములోని "స్విస్సు" దేశస్థులవలె, తమ దేశమందే సంతృప్తులై ప్రశాంతముగ యెవరివృత్తులను వారు చేసికొనుచు, పరులు తమపైకి వచ్చినప్పుడు మాత్రము కత్తిబట్టుచు, హాయిగ కాలక్షేపము జేయుచుండిరి.

1772 సం॥లో జరిగినయుద్ధములో రోహిలాలు పూర్వ మువలెనే అయోధ్యవజీరుతో మైత్రినే బహువిశ్వాసముతో పాటించియుండిరి. మహారాష్ట్రులు క్రొత్తగ జయించుకొన్న దేశమునకును, అయోధ్యదేశమునకును మధ్యగ యీరో హిలా దేశముగలదు. రణోద్వేగశీలురగు మహారాష్ట్రులు 1773 సం॥ లో అయోధ్యను ముట్టడించుటకై తమదేశముగుండ దారి యివ్వవలసినదని రోహిలాలను కోరిరి; తమ కట్లు దారి యిచ్చినచో, వారి కనేకమేళ్లను గలిగించెదమని కూడ మహా రాష్ట్రులు శూరవంశజులగు నప్పర్వతనివాసుల కనేక ఆశల గొల్పిరి. కాని, రోహిలా లీయాశలకు లోబడక మహా రాష్ట్రుల తంత్రములను ధీరతతో నెదుర్చుచువచ్చిరి. అందుచే, నత్యుగ్రమును, భయానకమును నగు మహా రాష్ట్రుల దండయాత్రల దుమారములకు యీరోహిలాలు గురి గావలసివచ్చెను. మహారాష్ట్రుల దండయాత్రలనిన సామాన్యమైనవికావు. వాని భీభత్సమునకు జడిసి, హిందూ స్థానములోని రాజులందరు—కొమ్ములు తిరిగినరాజులుకూడ- వారికి జోహారులొనర్చుచు, లజ్జవిడిచి, వారు కోరినకోర్కె లన్నిటికిని ఒప్పుకొని “బ్రతుకు జీవుడా” యని బయట పడు చుండిరి. ఈరీతిగ, భారతవర్షములోని రాజాధిరాజులను కూడ దద్దరిల్లజేసిన మహారాష్ట్ర జైత్రయాత్రల ధాటి నెదుర్కొ నుటకైన నొప్పుకొనిరికాని, తమ మిత్రుడగు అయోధ్యవజీరు పైకి పోవుటకు మహారాష్ట్రులకు తమ దేశముగుండ త్రోవ నొసంగుటకు రోహిలాలు ఒప్పుకొనరైరి. రోహిలాలును, అయోధ్యవజీరును పరస్పరమైత్రి పాటించునట్లు లోగడ

నేస్తముగట్టియుండిరి. వీరిట్టినేస్తముగట్టుటకు మొట్టమొదట యింగ్లీషువారు ముఖ్యకారకులు. ఈమైత్రికి—యీయొడంబడికకు– మెట్టిభంగమురాకుండ "మేము హామీయిచ్చెదమని యింగ్లీషువారు ప్రమాణపూర్వకముగ వాగ్దానమొనర్చియుండిరి. ప్రమాణపూర్వకముగ గావింపబడిన యిట్టి యొడంబడికను మన్నించుట తమ విస్యుక్తధర్మమను మహోదారబుద్ధితో రోహిలాలు ప్రవర్తించి, మరాటీదండుల దుమారములను తామే యెదుర్కొని వానిని తమ మిత్రుడగు అయోధ్యవజీరుపైకిరాకుండ వారించిరి. మరాటీదండు లీరీతిగ రోహిలాల దేశముపైకివచ్చిపడి నానాభీభత్సము చేయుచుండగా, వీరి మిత్రులమని చెప్పుకొను అయోధ్యవజీరుగాని, యింగ్లీషువారుగాని, వారికి రవంతైన సహాయముచేసిన పాపమునపోరైరి. వీరినమ్మక ద్రోహముచే రోహిలాదేశము మరాటీ దండులకు గురియై సర్వనాశనమయ్యెను. ఈరీతిగ రోహిలాఖండము నాశనమైన పిమ్మట—అప్పుడు— అయోధ్యవజీరును, యింగ్లీషువారును, తమ సేనల కదలించుకొని వచ్చి, తమ యుభయులకు సమాన శత్రువగు మహారాష్ట్రులపైకి దాడి వెడలజొచ్చిరి! వీరుభయులు కలిసి మహారాష్ట్రుల నటు తరిమివేసి, యిటు యింటికి వచ్చి, తమ "మిత్రుల"గు రోహిలాల రాజ్యమును దిగమ్రింగుటకై అయోధ్యవజీరును, వారన్ హేస్టింగ్సును కలిసి రహస్యముగ కుట్రపన్న నారంభించిరి! రోహిలా రాజ్యమును తానెట్లయిన కాజేయవలయుననను దుర్బుద్ధి అయోధ్యవజీరుకు పుట్టెను. "ఇట్టి కుట్రను నేను మొదటి నుండియు ప్రోత్సహించుచునే యున్నాను. ఇప్పు

దును ప్రోత్సహించినాను" అని హేస్టింగ్సు 1774 సం॥ డిశం బరు 3 వ తేదీన సీమడైరెక్టర్లకు రహస్యముగ వ్రాసిన యుత్త రములో కలదు.

పూజ్యులగు భారత సామ్రాట్టుల రాజదండము హరింప బడెను. "రాజప్రతినిధి" నని పేరుపెట్టుకొన్న పాశ్చాత్యు డొకడు నేడు వచ్చి, రారాజులకైన తలకు మీరిన యధికార ములతో తద్రాజదండమును చేతబట్టి, తన యిచ్చవచ్చిన రీతిని త్రిప్పుచున్నాడు! ఆహా యేమి కాలమహిమ! మన కిట్టి రోజులు వచ్చినవి! క్లైవు పెట్టిన బడిలోనే హేస్టింగ్సును చదువు కొన్నాడు. సాహస క్రియల యందును, రణకౌశలమునం దును తన గురువగు క్లైవుకు యీతడు చాలడు. కాని కుతం త్రములందును, సర్వగ్రసనబుద్ధియందును యీతడు గురువు కంటె యేడాకులెక్కువ చదివినవాడే. అయోధ్యవజీరుతో కలిసి యీతడొనర్చిన రహస్యకుట్రలోని సంగతులను యీతని నోటనే వినవలయును. ఇంకొకరు చెప్పన పనికిరాదు.

"ఇదియే (అనగ రోహిలాఖండమును కాజేయుటయే) తనకిప్పుడు ప్రియతమమును, ప్రధానమునునగు లక్ష్యముగ అయోధ్యవజీరు పెట్టుకొని కూర్చున్నాడు. కావున మన కిదియే మంచి సమయము. లోగడ మన మప్పుడప్పు డాతనికి చేయుచువచ్చిన సైనిక సహాయమునకు తగిన ప్రతిఫల మాతడు మన కిప్పుడిచ్చునట్లు ఒడంబరచి, ఆతడు మన స్నేహము నికముందు మరింత యెక్కువ జేసికొనునట్లు ఆతనిచే ఒప్పించుట కిదియే మంచి తరుణమని బోర్డువారు నాతో కూడ

యేకమతముగ తీర్మానించిరి." అనిహేస్టింగ్సు సీమ డైరెక్టర్లకు వ్రాసెను. ఈ మెత్తని తియ్యనిమాటలతో వెలిబుచ్చిన యీ దుర్మార్గమున కర్థమేమి? డబ్బిచ్చి యింగ్లీషువారి సేనలను తన రాజ్యములో పెట్టుకొనునట్లు హేస్టింగ్సు వజీరును ప్రోత్సాహపరచెను. ఈ దిక్కుమాలిన పద్ధతినే తదుపరి యితరరాజులకుకూడ ప్రాకించెను. ఇతరరాజులువచ్చి వజీరుపై పడకుండ రక్షించుటకే యీ సేనలను పెట్టుచున్నామని పైకి చెప్పిరి. కాని, నిజమునకట్లుకాదు. ఈ సేనలలోని ఉద్యోగస్తులందరు కంపెనీ చేతిలోనివారే; యీ సేనలు కేవలము కంపెనీవారి యధికారమునకేలోబడి కంపెనీవారు చెప్పినట్లే నడుచుకొనును. ఒకసారి గనుక యీసేనలను తీసికొనివెళ్లి యే రాజ్యములోనైన పెట్టినయెడల, యికవాని నక్కడనుండి కదిలించరు; కదలించకుండ నుండుటకేదోయొక కారణము దొరుకుచునేయుండును. ఇంటిలోని యీ కుతంత్రమును జిత్తులమారివాడగు వజీరుసైతము గ్రహింపలేకపోయెను. ఈతడు హేస్టింగ్సు టోపీలో పడెను. ఇక యీ సైన్యపోషణకై వజీరుయిచ్చునట్లు నిర్ణయింపబడిన మొత్తమెంత? సైన్యపు ఖర్చులుపోను, కుంఫిణీవారికి కావలసినంతలాభము యేటా మిగులునట్లుగ యీ మొత్తము నిర్ణయింపబడెను. ఈ లాభముకొరకేగద హేస్టింగ్సు యిన్ని యెత్తులువేసి, రమ్యమగు రోహిలారాజ్యమును వజీరు పొట్టబెట్టుటకు పాల్పడినది! సీమలో కంపెనీపని చాలా దివాలాగా నుండెననియు, వారికెక్కడిడబ్బు చాలుటలేదనియు, యింకాయెక్కువడబ్బు పంపించవలసినదనియు ప్రతిరోజు సీమనుండి యిక్కడికి ఉత్తర

ములమీద ఉత్తరములు వచ్చుచుండెను. సొలుకువచ్చు రాబడి ఖర్చులకుచాలకుండెను. అందుచే కంపెనీవారు సీమలో ఋణములుజేయ నారంభించిరి. ఈ ఋణములు నానాట పెరుగుచుండెను. ఈ ఋణబాధనుండి తప్పించు కొనుటకై యిక్కడ యిండియాలో హేస్టింగ్సు అయోధ్య వజీరుతో షరీకై రోహిలాదేశముపై కుట్ర బన్నెను. ఏదోసమయము కనిపెట్టియో, లేక గిల్లికజ్జాను కల్పించియో, అయోధ్యసేనలతోకలిసి, కుంపిణీసేనలు రోహిలారాజ్యముపై పడి, వారి నణగద్రొక్కి, ఆరోహిలారాజ్యమును అయోధ్య రాజ్యమునకు కలుపునట్లును, అందుకు ప్రతిఫలముగ అయోధ్య వజీరు యుద్ధపుఖర్చుల నన్నిటిని తానే భరించుకొని, పై పెచ్చు కుంపిణీవారికి 40 లక్షల రూపాయలు ముడుపు చెల్లించునట్లును హేస్టింగ్సు కుట్రపన్నెను. ఇందలి యవినీతినిగురించి వేరుగ చెప్పవలెనా? రోహిలాలు భారతవర్షములోనికెల్ల అత్యు త్తమ యోధులని యిదివరకే ధ్రువపడినది. మరాటీదండు లనబడు సముద్రతరంగములు అయోధ్యపై వచ్చిపడకుండ నడ్డగించుటకు మధ్య రోహిలాలు చెలియలికట్టయై నిలిచిరి. తన కిల్లెంతో యుపకారులుగనున్న వీరి రాజ్యమును దిగమ్రింగ వలయునను దుర్బుద్ధి అయోధ్య వజీరుకండ్లకు దట్టుటచే ఆతడు అంధప్రాయుడై తన స్వప్రయోజనమునుగాని, తన గౌరవ మునుగాని చూచుకొన జాలకుండెను. ఇక హేస్టింగ్సన్ననో యీవజీరు నెట్లయిన టోపీవేసి, ఆర్థిక, సైనిక పాశములచే ఆతనిని కుంపిణీవారి కాలికి సదా కట్టిపడవేసికొనవలయునను మనుబ్బక్తితోనుండెను. ఇందలి యవినీతి గాని, లజ్జనుగాని

ఆతడు పాటింపడయ్యెను. ఆతని యంతరాత్మ కాలి చిక్కెముగ గట్టుటచే అది పాషాణసదృశమై, లజ్జనుగాని, విచారమునుగాని, అనుతాపమునుగాని పొందజాలదయ్యెను. హిందూస్థానపు రాజులవద్ద సొమ్ము పుచ్చుకొని వారికి యింగ్లీషుసేనలను శాశ్వతముగ అద్దెకిచ్చు యీ దిక్కుమాలిన పద్ధతిని మొట్టమొదట ప్రారంభించిన వాడీతడే. ఈపద్ధతివలన హిందూస్థానపు రాజులస్వాతంత్ర్యమును జవసత్వములను పీల్చి పిప్పిచేయుటకు అవకాశమేర్పడెను. “ఇట్టి అద్దెసేనలను అయోధ్యలో స్థాపించుటవలన, అయోధ్యవజీరుయొక్క అధికారమును కుంగదీసి, ఆతనిని మనకు గులాముగ జేసికొనుటయే నాపరమసంకల్పమని” హేస్టింగ్సు ఘంటాపథముగ చెప్పి ఒప్పుకొనెను. రోహిలారాజ్యమును తననోట వేసికొనుటకై హేస్టింగ్సుతో చేరి కుట్రపన్నిన అయోధ్యవజీరుకు తుట్టతుదకు తనను, తననోట వేసికొనదలచిన మాంసఖండమగు రోహిలాఖండమునుకూడ తన తోడిదొంగయగు హేస్టింగ్సే “సహేంద్ర తక్షకాయస్వాహా” యని దిగమ్రింగెనని అచిరకాలములోనే ఆతనికి తెలిసివచ్చెను.

1773 సం॥ సెప్టెంబరులో అయోధ్యవజీరుకును, హేస్టింగ్సుకును కాశీలో ఒక ఒడంబడిక జరిగెను. కాని, రోహిలా రాజ్య నాశనమును గూర్చిన షరతు నందులో నుదహరించక, దానిని 1774 సం॥ జనేవరి వరకు కప్పిపెట్టి యుంచిరి. ఈలోపుగ రోహిలాలపై యనేక అబద్ధపు నేరముల కల్పింపసాగిరి. ఉన్నవి, లేనివి, యేవేవో వారిమీద నేరములను పన్నసాగిరి. ఇట్టి నేరములు శుద్ధ అబద్ధమైన

వనియు, కేవలము అభూత కల్పనలనియు, వీనిలో రవంతైన సత్యము లేదనియు, యెవరికైన తేటతెల్లము గాగలదు. వేయేల, యీ సంగతినే, తదుపరి, సీమ పార్లమెంటువారును, కంపెనీ డైరెక్టర్లును కూడ ధృవపరచిరి. కావున, వాని సత్యాసత్యములను గూర్చి యిట విచారింప బూనుట కేవలము అనవసర వాగ్వ్యయమేగాని వేరొండు కాదు. ఈ రీతిగ పాపకార్యమునకై నేస్తము కలుపుకొన్న తోడిదొంగలగు అయోధ్యవజీరును, హేస్టింగ్సును తమ సేనలతో 1774సం॥ ఏప్రిల్ 17 వ తేదీన రోహిలా ఖండమును ప్రవేశించిరి. రోహిలాలు ధైర్యసాహసములు గలవారయ్యు, తమ సంఖ్యకు మించిన శత్రుసేనలు తరంగములవలె వచ్చి తమ్మును ముంచివేయుటచే, పాపము వారు శరణాగతులైరి! కాని ప్రయోజనము లేకపోయెను. వారెంత అత్యాపన్నముగ దుఃఖార్తిరేకముగ, యెట్టి షరతులకైన నంగీకరింతుమని చెప్పుకొన్నను ప్రయోజనము లేకపోయెను. ఈ సమయమందు గనుక వారిని వదలివేసినచో, వారెన్నటికైన తనపై కసితీర్చుకొనక మానరను భీతి అయోధ్యవజీరు నావరించెను. అందుచే రోహిలాలను వారి దేశమునుండి, వారి యిండ్ల వాకిండ్ల నుండి పూర్తిగ తరిమివేసినగాని, తాను బ్రతుకలేనని అయోధ్య వజీరుపట్టుబట్టెను. తమ కత్యంత ప్రియతమమగు యిండ్ల వాకిండ్లను వదలిపోవుటకంటె రణరంగమందే తమ చావుబ్రతుకుల నిర్ణయించుకొందమని రోహిలాలు నిశ్చయించుకొనిరి. దురారోహమగు "బాబుల్‌నల్లా" పర్వత పార్శ్వములందు రోహిలాసైన్యములు బారులుతీరి నిలుచుండి

మృత్యుసదృశమగు శత్రుసేనల మహోద్ధతి నెదుర్కొనుటకై సంసిద్ధముగ నుండెను. "యుద్ధరంగమందు వారు చూపిన అభేద్యస్థైర్యము,—చెక్కు-చెదరని వజ్రసంకల్పము— వర్ణింప తరముగాదు. బాహువీర్య సమగ్రులగు యోధనాయకులు పెక్కండ్రు ముందునకునడచి, తమతమ యుత్తాలధ్వజములపై పతాకపటాంచలము లెగురుచుండ, యుభయసేనా మధ్యమందునిలిచి, సింహనాదములు గావించుచు, నిజసైన్యనివహములకు రణోత్సాహమును రెట్టించి పూరించుచుండిరి. తత్సైన్యవాహినులును తమతమ యూథపతులవెంట సముద్రతరంగములవలె (భగీరథుని వెంటనంటివచ్చు గంగాతరంగములవలె) శత్రుసైన్యముల నెదుర్కొన సాగిపోవుచుండెను. ఇట్టి సంకుల సమరమందు రోహిలాసైన్యములు రెండువేల సంఖ్యకు రణక్షోణిపై నొరగెను. రోహిలాసర్దారు లనేకులు హతులైరి. రోహిలా సేనలకన్నిటికి సర్వసేనాపతియగు "హాఫిజ్ రహమత్" అను యోధాగ్రేసరుడు మహోత్సాహముతో నిజసేనల వ్యూహాకారముగ పన్నుకొనుచున్న సమయమున హతుడై వీరశయనమున నొరిగెను" అని ఆంగ్లసేనల నడిపించిన కర్నల్ చాంపియన్ అనునతడు వ్రాసెను. ప్రఖ్యాతమగు రోహిలా యుద్ధము "రాంపుర" క్షేత్రమందు 23 వ యేప్రిల్ తేదీన జరిగెను. రోహిలాల జయాపజయము లిందే నిర్ధారణయయ్యెనని చెప్పవచ్చును. రోహిలా నాయకుడగు ఫైజుల్లాఖాన్ చెదరిపోగామిగిలిన తనకొలదిపాటి శూరసైన్యముతో గిరికందరముల జొచ్చెను. రోహిలాఖండమంతయు శత్రుమూకల క్రూరఖడ్గధారలకు యెరయయ్యెను.

సర్వము కొల్లగొట్టబడెను. తొల్లింటివీరులు పరదేశములపై దండువిడియలేదా? పరదేశముల జయించలేదా? తమకు వీర భోజ్యములని చెప్పుకొను రాజ్యముల నెన్నడైన వారింత అసురవృత్తితో కొల్లగొట్టి యుండిరా? ఇంత పాపమేనాటనైన నెరుంగుదుమా? * "రోహిలాయని పేరుపెట్టుకొన్న ప్రతి వానిని చంపివేసిరి. లేదా ప్రవాసమునకు తరిమివేసి అక్కడ బ్రతుకుమనిరి." ఇదంతయు అయోధ్య వజీరునకును, హేస్టింగ్సుకును జరిగిన యొడంబడికలోనే యున్నది. అందలి షరతులకు మించి వీరిప్పుడు చేసినదేమియు లేదు. ఏలననగ "అవసరమైనచో రోహిలాలను సమూలముగ నాశనమొనర్పవలయు" నను షరతు ఆ యొడంబడికలలోనే స్పష్టముగ గలదని హేస్టింగ్సువ్రాసిన యుత్తరములనుబట్టి తెలియుచున్నది. "రోహిలాలను- సమూలముగ- దుంపనాశనము చేయవలయు" నను మాటలు హేస్టింగ్సు స్వయముగ వ్రాసినమాటలే. ఈ రీతిగ రోహిలా ఖండము సర్వస్వము అపహృతమయ్యెను. సకలసస్యసమృద్ధితో—సుశోభితసంపదలతో నిన్నటివరకు కళకళలాడుచుండిన రోహిలాఖండపు గిరిదరీతటములు, అద్రిద్రోణులు, నేడు శత్రుమూకలచే పరశురామప్రీతి గావింపబడిన పౌరగృహోపరి భాగములనుండి పైకెగయు అగ్నిజ్వాలలవలన రాత్రులందు రక్తారుణ రాగముల బరగించు చుండెను. అట్టి అగ్ని జ్వాల

---

* తొల్లి అశ్వత్థామ లోకము నంతను "అపాండవము" గావించెదనని బయలుదేరినట్లే, వీరును యిప్పుడు లోకమునంతను "అరోహిలము" గావించెదమని క్రూరవృత్తితో బయలుదేరిరి!

లును క్రమముగ చల్లారెను; శత్రుమూకలకు వచ్చిన పని తీరెను; రోహిలాఖండము సంపూర్ణముగ బూడిద పాలయ్యెను. రోహిలా నాయకుడు—ఫైజుల్లాఖాన్—యెచ్చటనో దుర్గమమగు పర్వత కందరములందు భద్రముగ దాగియుండెను. ఆతని నిప్పుడు వంచు మార్గమేమియు కనబడదు. కావున, ఆతనికిని, ఆతని యనుచరులకును క్షమాపణ చెప్పి, యుద్ధమును ముగించిరి.

రోహిలాలతో కలహించుటకు మనకు (ఆంగ్లేయులకు) యీషణ్మాత్రమైనను కారణము లేదు. వారిపై మన కిట్టి యాక్షేపణ కలదని వ్రేలుపెట్టి చూపుటకైనను అవకాశము లేదు. పైగా, మనము క్రొత్తగ సంపాదించుకొన్న దేశమునకు రోహిలాఖండ మొకప్రక్కను మనకు పెట్టనిగోడగ నుండెననికూడ చెప్పవచ్చును. వారి వర్తకము, వ్యవసాయము మున్నగువానివలన మన వర్తకము వ్యవసాయమును కూడ పెంపుగాంచుచుండెను. అయిననేమి? గవర్నర్ జనరల్ అగు హేస్టింగ్సుకు డబ్బు కావలసివచ్చెను. కుంపిణీ యుద్యోగస్తుల కివ్వవలసిన విపరీతజీతములకు, బత్తెములకు, యెంత డబ్బైనను చాలకుండెను. అందుచే, పొదుగుగోసి నెత్తురు త్రాగవలెనను రక్తపిపాస హేస్టింగ్సుకు పుట్టెను. అయోధ్యవజీరువద్ద డబ్బుపుచ్చుకొని కంపెనీ సేనల నాతనికి అద్దెకిచ్చెను. వానిద్వారా రోహిలాఖండమును ముట్టడించి, దానిని అయోధ్యవజీరునకు కట్టబెట్టెను. హేస్టింగ్సు లంచముపుచ్చుకొని తమ మిత్రులగు రోహిలాల స్వాతంత్ర్యములను, నిండుప్రాణములను పరాయివానికి కోసియిచ్చెను! తాను

వేటాడి చంపబూనిన రోహిలా ప్రజల ధైర్యసాహసములు, సుగుణసంపత్తి హేస్టింగ్సు యెరుగును. తాను పూనిన యీకుకార్యమువలన తాను వారి నెట్టి దుర్దశల పాల్గావింప నున్నాడో కూడ హేస్టింగ్సుకు పూర్తిగ తెలియును. ఇట్టి దురంత కృత్యమువలన నిరపరాధులును, తన మిత్రులును నగు రోహిలాల కెట్టి దుఃఖము, దౌర్జన్యము, వినాశనము గలుగునో హేస్టింగ్సుకు పూర్తిగ తెలియును. ఇట్టి దురంతకృత్యము వలదని, పాపము, ఆంగ్ల సేనానియగు కర్నల్ చాంపియన్ కూడ హేస్టింగ్సుతో మందలించిచెప్పెను. తమ్మును అనవసరముగ హింసించవలదని దైవోపహతులగు రోహిలా ప్రముఖులు కూడ పాపము, అతికరుణముగ, అతిదీనముగ, హేస్టింగ్సును వేడికొనిరి. కాని, హేస్టింగ్సు హృదయము పాషాణసదృశ మయ్యెను. "ఈ సేనలను ఫలానిపనికి వినియోగించవచ్చును, ఫలానిపనికి వినియోగించరాదు" అను విధి నిషేధము లేమియు లేకుండ కేవలము వజీరు యిచ్ఛానుసారముగ, విచ్చలవిడిగ, వినియోగించుకొనుమని చెప్పి హేస్టింగ్సు వానిని అయోధ్యవజీరు చేతిలోపెట్టెను. వా రెట్టి ఘోరములు చేసినను సరే అడుగు దిక్కులేదు. వజీరు హుకుము నోటివెంట వచ్చినదే తడవుగ యీ మూకలువెళ్లి రమ్యమగు రోహిలా రాజ్యముపై పడెను. శూరవంశజులగు రోహిలాల గతి దుర్గతి యయ్యెను. వజీరుతో యీ సంధినిగుదిర్చి సంధిపత్రముపై తాను సంతకము పెట్టినందుకుగాను హేస్టింగ్సు మొదలకుండ రెండు లక్షల రూపాయలను తన జేబులో వేసికొనెను—— ఇది

ప్రియివేటు బహుమతియట ! — ఇక కంపెనీ బొక్కసములో నలభైలక్షల రూపాయలు వచ్చిపడెను.

ఇంతటితో కలకత్తా కౌన్సిలులో కలతలు పుట్టెను. ఈకలతలు మొట్టమొదట అక్కడనున్న యింగ్లీషు ఉద్యోగస్తులలోనే గుసగుసలుగ బయలుదేరెను. కాని, రానురాను యీ గుసగుసలు పెద్దవై పట్టణమంతయు ప్రాకెను. దేశీయుల మనములం దింతవరకు దాగియున్న క్రోధానలము పైకి ప్రజ్వలింపసాగెను. ప్రజలు తమకు గలిగిన యన్యాయములను గూర్చి కౌన్సిలుసభ్యులతో చెప్పుకొనసాగిరి. చాలమంది సభ్యులు మొట్టమొదట యీమొరలను జాలితోను, దయతోను, నిష్పక్షపాతముతోను చెవియొగ్గివినిరి. హేస్టింగ్సుపై కౌన్సిలుసభ్యులకు చిరకాలమునుండి లోలోన పొంగిపొరలు చున్న క్రోధావేశము దురంతమగు యీ రోహిలా యుద్ధముతో ఒక్కపెట్టున సముద్రపు పెల్లువలె పొంగిపొరలి హేస్టింగ్సును ముంచివేయునదిగ గన్పట్టెను. హేస్టింగ్సుకు చాల అపాయస్థితి తటస్థించెను. కాని, అతడు తన మొండిధైర్యమును మాత్రము విడువలేదు. తన కౌన్సిలుసభ్యు లెవరెన్ని తిట్టినను, ప్రతిఘటించినను, నిందించినను, సిగ్గుశరములవిడచి, తన అధ్యక్షస్థానమును సింహవలె పెనగులాడుచునే యుండెను. క్లేవరింగు, మాన్‌సన్, ఫ్రాన్సిస్, — యీముగ్గురుసభ్యులును హేస్టింగ్సు వశములో చేసికొన్న బేరమును తీవ్రముగ నిరాకరించిరి. కాశీ ఒడంబడికను ధృవపరుపజాలమనిరి. రోహిలాఖండముపై పంపిన సేనలను వెనుకకు మరలించవలసినదనిరి. ఇదంతయు [illegible]

ముగ వారు రికార్డుచేసిరి. కాని, హేస్టింగ్సు బుద్ధిమాత్రము మరలునదికాదు. సీమలోనున్న తనయజమానులగు కంపెనీ భాగస్వాముల కేమికావలయునో తన్నెదిరించు వీరందరికన్న హేస్టింగ్సుకు బాగుగ తెలియును. హేస్టింగ్సుచేసినపని చాల అన్యాయమని యీ మఃగ్గురుసభ్యులు చెప్పినమాటలు కుంపినీ వారి అంతరాత్మకు నచ్చెనట! దానియర్థమేమో! ఇంత అన్యాయము జరిగినందుకు కుంపిణీభాగస్వాములు చాల దూరము యోచించి, కావలసినన్ని "విచారములను" యికముందిట్లు చేయవద్దను "మందలింపులను" యిండియాకు పంపించిరి! కాని, యిట్టిపని యేలచేసెతివని. సీమమంత్రిలలో ఒక్కరైనను హేస్టింగ్సును నిగ్గదీసిఅడిగి, ఆతనిని తగురీతిని శిక్షించిన పాపమున బోరైరి! పైపెచ్చు యుద్ధమందిన్ని జయములగొని తమకింత రాజ్యమును సంపాదించిపెట్టిన హేస్టింగ్సుపై నేరారోపణచేయుట కేవలము విపరీతమని సీమమంత్రిలు తలంచిరట! అందుచే, యిటు సీమమంత్రిలును, అటు కుంపిణీభాగస్వాములును కూడ, హేస్టింగ్సు సంపాదించిపెట్టిన అన్యాయార్జితవిత్తమును మెదలకుండ మ్రింగి యూరకుండిరి.

బహుమతులని పేరు పెట్టియు, ఉద్యోగముల ప్రమోషనులకనియు, ఇంక ననేకరీతులుగ హేస్టింగ్సు దేశీయులనుండి అక్రమముగ విపరీత ధనములను లాగినట్లు నిదర్శనపూర్వకముగు నేరము లనేకము లాతనిపై మోపబడెను. కాని యీ నేరముల నాతడు చెవిని బెట్టలేదు. వీనికి సమాధానమే చెప్పలేదు. ఈ నేరములను కౌన్సిలుయెదుటికి తీసికొని వచ్చుట తన యధికారమును ధిక్కరించుటకేయని యతడు

చెప్పెను. ఇట్టి పనివలన ఇంగ్లీషువారి రాజ్యమును దేశీయుల దృష్టిలో నీరసపరచుటకేగాని వేరుప్రయోజనము లేదని యీతడు ఆక్షేపించెను. కావున యీ నేరములలో దేనికి కూడ తాను "సమాధానము చెప్పను పొమ్మ" ని ధిక్కరించెను. తక్కినసభ్యు లెప్పుడైన యీ నేరములగూర్చి విచారింప బూనినప్పుడు, ఆతడు సభనుండి చివాలునలేచి పోవుచుండెను. ఆతడిట్లు లేచిపోయినను తక్కిన సభ్యులు ముగ్గురు కూర్చుని విచారణ చేయుచుండిరి. అయోధ్యరాణియగు మున్నీబీగం, బార్ద్వానురాణీ, ఆమె దత్తకుమారుడు రామకహీంన్, బంగాళానవాబు వకీలగు రాధా చరణరాయి, పెద్ద జాగీరుదారుడగు కాస్మల్ ఖాన్, మరిముగ్గురుయింగ్లీషుదొరలు (వీరిలో ఒకడు మూర్షిదాబాదు కౌన్సిలుకు ఆక్కౌంటెంటును, గ్రాంటు, పోకు అను మరియిద్దరు యింగ్లీషు ఉద్యోగస్థులు-) వీరందరు కలిసి యేకగ్రీవముగ హేస్టింగ్సు లంచములు మేసెననియు, దౌర్జన్యముగ సొమ్ము లాగెననియు నేరముల మోపిరి. ఆ నేరములనన్నిటిని మిగత ముగ్గురు కౌన్సిలర్లు కూర్చుని విచారించి లిఖితపూర్వకముగ రికార్డుచేసి యుంచిరి. 1775 సం॥ మార్చిలో క్లావరింగు, ఫ్రాన్సిస్, మాన్‌సన్ అను మిగత ముగ్గురు కౌన్సిలర్లు యేకగ్రీవముగ వ్రాసిన రికార్డులో హేస్టింగ్సుచేసిన నేరములనన్నిటిని యీరీతిగ క్లుప్తముగ వివరించిరి. "గవర్నరుజనరల్ అగు హేస్టింగ్సు యీ దుర్నయము చేసినాడు, ఆ దుర్నయము చేయలేదు అని చెప్పుటకు వీలు లేదు. ఇది చేయవచ్చును, అది చేయరాదు అను విచారణ ఆతడు పెట్టుకొనలేదు. హుగ్లీ ఫౌజుదారుని జీతములో నాలుగు

వంతులు యీతడే కాజేసెనని చెప్పుటకు నిష్కర్షయగు ఋజువులు గలవు. వీనినిబట్టి యీతడు నేరము చేసెనని ఘంటాపథముగ చెప్పుటకు యేకొంచెమునను అనుమానము లేదు. దీని విషయమై నిష్పక్షపాతబుద్ధిగల యెట్టివానికిగాని యెట్టి యనుమానముగాని తట్టజాలదు." ఈ నేరము లన్నియు తదుపరిపార్లమెంటులో విచారణకు వచ్చెను. ఈనేరముల నెల్లెన యెదిరించవలయునను తలంపుతో అనేక అసంబద్ధములగు సాక్ష్యముల నెన్నిటినో హేస్టింగ్సు తెచ్చెను. తన ప్రతికక్షులపై వైరము సాధించుకొనవలెనను తలంపుతో హేస్టింగ్సు యెన్ని తప్పుడు సాక్ష్యముల తెచ్చినను, యెన్ని తప్పుడు "అఫిడవిట్టుల" నిప్పించినను, యెన్ని తప్పుడు లెక్కల చూపించినను వీనినన్నిటిని తుడిచివేయజాలిన ప్రధానమగు సాక్ష్యమొకటి ఆ కాలమందుండెను. దాని సంగతి ఆనాటి పార్లమెంటు సభ్యులకు, యింగ్లీషు ప్రభువులకు, తెలియక పోవచ్చును. అదేదనగ 1775 సం॥ మార్చి 27 వ తేదీన—అనగ తనపై యీ దోషారోపణులు గావింపబడిన కొత్తలో—యీ హేస్టింగ్సు సీమ మంత్రియగు నార్తుప్రభువుకొక జాబు వ్రాసెను. క్లావరింగు, మాన్‌సన్, ఫ్రాన్సిస్ అను యీ ముగ్గురు చేరి యిక్కడ కౌన్సిలులో చాల అల్లరి చేయుచున్నారనియు, దానివలన చాల అరిష్టము గలుగుననియు, యేమేమో నిందించుచు హేస్టింగ్సు ఆ జాబులో పెద్దగ వ్రాసెను. మొత్తముమీద రాజ్యక్షేమమునుగూర్చి యోచించునెడల, యీ నేరములన్నియు కేవలము అప్రస్తుతమనియు, అసం

బద్ధమైనవనియు, వీనికిని, రాజ్యక్షేమమునకును సంబంధము లేదనియు, హేస్టింగ్సు బహు చమత్కారముగ యీ జాబునందు చర్చించెను. వీరు తనపై మోపిన నేరములు చాలవరకు నిరాధారములని యూహించుకొనుటకు—నమ్ముటకు—అనేక చమత్కారమగు తర్కవాక్యములను హేస్టింగ్సు యీ జాబునందు ప్రదర్శించెను. ఈ రీతిగ నాతడు తనపై మోపబడిన దోషారోపణల నన్నిటిని చిత్రవిచిత్రముగ తర్కవాక్యములచే మరుగుపరుప జూచెనే గాని, "నేనీ నేరముచేయలేదు" అని ఖండితముగ, పెద్ద మనిషిమాటగా ఒక్కమాటైనను అన్నపాపమున యీతడు—హేస్టింగ్సు—పోలేదు. ఈ జాబులో మొదటినుండి చివర వరకు, కంచుకాగడాలు వేసి వెదకినను, అట్టి నిక్కచ్చియగు మాట ఒక్కటియైనను దొరకదు. పోనీ, నిక్కచ్చియగు సూటి మాట లేకపోయినను, కనీసము యీ అభిప్రాయము యిచ్చు వాక్యమైనను అందుకానరాదు. ఈ హేస్టింగ్సునకు హిందూస్థానమునకు రాజుతరువాత రాజంతవానిని చేసినది యీ నాస్తి ప్రభువేగద! బ్రతికియున్నవారిలో యింక యీతనికి సహాయము కావలసిన ఆప్తులింకెవరు గలరు? తనకేదైన ముప్పు వచ్చినచో తన పట్టున నిలువబడి తనను కాపాడువాడు యింకెవరు గలరు? నిజముగ తాను నేరము చేసినచో, ఆ నేరమును కప్పిపుచ్చి, దానికి పైపూతపెట్టి, తనను కాపాడుటకు జాలిన వారిలో యీ నాస్తి ప్రభువేగద అగ్రగణ్యుడు. అట్టి నాస్తి మిత్రునకు, అట్టి ఆపద్బాంధవునకు రహస్యముగ, ఉద్యోగము మీద, వ్రాసికొను ఉత్తరములోకూడ హేస్టింగ్సు "నిజముగ

నేనీ నేరముచేయలేదు" అని మొగసిరిగ, ధైర్యముగ, గుండె మీద చేయివేసికొని, ఒక్కమాట మాత్రమైనను వ్రాయ లేక పోయినాడు. నిజముగ యేపాపమెరుగని మనిషి తనపై అన్యాయముగ పరులు నిందలు మోపినప్పుడు "నేనీ పాప మెరుగన"ని ధైర్యముగ, జంకులేక చెప్పునుగద- అట్టిచో, యీ పెద్దమనిషి యేల చెప్పలేక పోయెను? అంతేకాదు, అంతకంటె గర్హ్యమగు విషయ మింకొకటికలదు. ఇంక తనను సీమలో పార్లమెంటు సభలో నలుగురియెదుట నిలువబెట్టి, నిగ్గదీసి ఖండింతురను మాట యిక్కడ తెలియగనే, తనవద్ద రహస్యముగ దాచుకొన్న గవర్నమెంటుసొమ్మును 20 లక్షల రూపాయలను తక్షణమే కలకత్తా ట్రిజరీలో కట్టివేసినగాని తన మాట దక్కదనుకొని బహుత్తరపాటుతో దానిని సదరు ట్రిజరీలో కట్టి వేయించెను. ఉద్యోగరీత్యా గవర్నరు జనరలు హోదాలో తన చేతికి సొమ్ము అప్పుడప్పుడు వచ్చెననియు, దానిని పొరబాటున అంతవరకు ట్రిజరీలో కట్టించుట మరచితి ననియు ఆతడు పిమ్మట సమాధానములో చెప్పుకొనెను! హేస్టింగ్సుపై దోషారోపణల జేసినవారిలో నగ్రగణ్యుడు నందకుమారుడు. తన జాతిలోనికెల్ల తా నత్యంత సమర్థుడనను గర్వ మీతనికుండెను; ఆ గర్వము హేస్టింగ్సుచే భంగపరుప బడెను. తానర్థశాస్త్రి కుశలుడననియు, మహారాజకీయ మంత్రివేత్తననియు నితనికి అహంభావముండెను. కాని, యీ విషయములలో తన ప్రజ్ఞను జూపుటకు హేస్టింగ్సు అవకాశ మివ్వక అణచిపెట్టెను. కుటిల బన్నుటలో తనంత కుత్సి తుడు లేడని యీతడు లోలోన మురియుచుండెను; కాని,

యీవిషయములో హేస్టింగ్సు తన కంటె యేడాకులెక్కువయే చదివెనని తెలిసికొన్నప్పుడు యీతనిమనస్సు చివుక్కుమనెను. ఏలనన, హేస్టింగ్సు మూర్షిదాబాదులో నుండగ, తనకక్కడ మంత్రిత్వ మిప్పించు విషయములో తనంతవాణ్ణి టోపీవేసి, ఆ యుద్యోగమును రజాఖానుని కిప్పించెను. అప్పటి నుండియు నందకుమారుడు హేస్టింగ్సుపై కసితీర్చుకొనవలయుననియే వేచియుండెను. దానికిప్పుడు మంచిసమయము చిక్కినది. వీరిరువురు ఒకరికొకరు తీసిపోని సరిసమానమగు కుత్సిత లక్షణములు గల వారగుటచేతనే, వీరిరువురిమధ్య యింతగాఢమగు మాత్సర్యము, తీవ్రమగు శతృత్వము, ఆర్పరాని వైరము ప్రకోపించియుండెను. వీరు ఒకరి హృదయము నొకరు పరీక్షించుకొనగ, యిరువురకు అచ్చముగ తన ప్రతిబింబమే యెదుటివాని హృదయఫలకమందు గాన్పించెను. హేస్టింగ్సు రహస్య కృతముగ చేసిన యావత్తుపనులు ఒక్క నందకుమారునకు తప్ప భారతీయులలో యింకెవరికి తెలియవని చెప్పవచ్చును. ఏలననగ, హేస్టింగ్సు త్రొక్కిన పాపపు సందు గొందులన్నియు, చీకటి ముసుగులో పోయిన వక్రగతులన్నియు, ఆతని వెంటనంటిపోయి చూచుట కెవరికేమి పట్టినది, ఏకార్థసమవేతుడగు ఒక్క నందకుమారునకుతప్ప! అందుచే హేస్టింగ్సు రహస్యముగ చేసిన కృత్యములను గూర్చి యావత్తు సంగతులు విపులముగ తెలిసికొనుటకు నందకుమారున కున్నన్ని యవకాశము లింకెవరికిని లేకుండెను. అట్లే, నందకుమారుని రహస్యములన్నియు హేస్టింగ్సుకుతప్ప యింకెవరికీ తెలియవు. చతురమతియు, మాయికుడుననగు యీ

భారతీయుని చేష్టల నతిసూక్ష్మముగ పరిశీలింప వలసినంత అవసరము యిండియాలో వైస్రాయియగు యీ హేస్టింగ్సును తప్ప యింక యే యింగ్లీషువానికి పట్టును ? మానసికముగను, నైతికముగను కూడ బ్రిహ్మాదేవుడీ యిరువురను అచ్చముగ ఒక్క మూసలోనే కరగిపోసినాడు. ఇరువురకు తేడాయీషణ్మాత్రమైనను లేదు. వారిమాటలు బహుమెత్తగ, తియ్యగ నుండును. కాని, వారి మనస్సులో యేమియున్నది బ్రిహ్మకైనను తెలియదు— అది అగమ్యము, అగాధము. వారు నిశ్శంకముగ యెట్టి పాపకార్యమునైనను జంకు గొంకు లేక చేయుదురు. పరుల దుఃఖములు వారి మనస్సు నంటజాలవు. స్వోత్కర్షయే వారి నిత్యపూజ. వారి ధనతృష్ణ తీరునదికాదు ; కాని చేతికిచిక్కిన సొమ్మును ఖర్చుపెట్టుటలో వారంతవారులేరు. మరీ దగ్గరకురాక, తగు దూరములో నున్నవారు వీరిని మెచ్చుకొందురు. కాని దగ్గరకువచ్చిన వారు మాత్రము వీరినెన్నడు నమ్మరు. చేతినిండ సొమ్ము దొరుకుచున్నంతసేపు వీరంత మంచివారులేరు. వీరంత శాంతమూర్తులులేరు. తమపైకి యేదైన అపాయము వచ్చినప్పుడు యెంతమాత్రము చలించరు. ఐహికలంపటమందు రోయరు. తెలివితేటలకు, ఉపాయములకు తరుగులేదు. ఘోరవిపత్తులు కారుచీకట్లవలె గ్రిమ్ముచున్నను, విజయతేజము కన్నులు మిరుమిట్లు గొల్పుచున్నను, వారు చలింపరు. మృత్యుసమ్ముఖమందుగాని, యమధర్మరాజు సభయందు జరుగు విచారణలో గాని వారు జంకుగొంకులేక నిలబడగలరు.

నందకుమారుడు ఫ్రాన్సిస్ చేతికొక అర్జీనిచ్చెను. దానిని స్వయముగ కౌన్సిలు సభయెదుట వినవలసినదని కోరెను. హేస్టింగ్సు పెద్దపెద్ద లంచములు పుచ్చుకొని ఉద్యోగములను అమ్మెననియు, రజాఖానుడు అపహరించిన పెద్ద మొత్తముల నన్నిటిని కప్పిపుచ్చి ఆతనివలన విపరీతముగు లంచము లాగెననియు తాను కౌన్సిల్ యెదుట స్వయముగ ఋజువుపరచెదనని నందకుమారుడు సవాలుచేసెను. "ఛీ! నీచమగు యీ దోషారోపణకు నేను జవాబుచెప్పను పొమ్మని" హేస్టింగ్సు అతితృణీకారభావముతో తిరస్కరించెను. "నన్ను విచారించుటకు మీరెవరు పొమ్మని"— తక్కిన ముగ్గురు కౌన్సిలు సభ్యులను హేస్టింగ్సు విసరికొట్టెను. "కావలసినయెడల యీ సంగతిని సీమకు తెలియపరుచుకొనవచ్చును; అంతేగాని, దుశ్శీలుడును, అసత్యవాదియునగు యీ బ్రాహ్మణుని మాటలను నామాటలను తులయందిడి తూచి యిందేవి సత్యమని మీచే తీర్పుచెప్పించుకొనుటకు నేనిక్కడ కూర్చుండలేదు. ఈరీతిగ నాయధికారగౌరవమును హీనపరపించుకొనుటకు నేను ఒప్పుకొనను" అని హేస్టింగ్సు గర్జించెను. అయినను, తక్కిన ముగ్గురు కలిసి యీ కేసును విచారించుటకు పూనుకొనిరి. తక్షణమే హేస్టింగ్సును అతనియనుచరుడగు బార్వెల్‌ను సభనుండి చివాలున లేచిపోయిరి. సభవారు నందకుమారుని తమ యెదుటికి పిలిపించిరి. నందకుమారుడు చిరకాలము నుండి తనకడుపులో యెంతో తాల్మితో పెట్టుకొన్న కసినంతను కక్క నారంభించెను. ఆతనికిప్పుడు మంచి యవకాశము

చిక్కినది. తన హృదయకూపములలో యింతకాలమునుండి దాచిపెట్టుకొనియున్న కసియను విషమునంతను దేవి బయట వేయవారంభించెను. నందకుమారు డీరీతిగ సభవారియెదుట శపథపూర్వకముగ చేసిన నేరములనన్నిటిని గూర్చి సభవారు హేస్టింగ్సుకు తెలియపరచిరి. ఈనేరములను ధ్రువపరచుటకు అనేకమంది కుంపిణీసొకర్లు—యింగ్లీషువారే—వచ్చి సాక్ష్య మిచ్చిరి. ముద్దాయియగు హేస్టింగ్సు "వీనికి జబాబుచెప్పను పొమ్మ"ని మొండితనము పూనెను. అంతట కౌన్సిలు సభవారు అతని పరోక్షమందే ఆతడు నేరస్తుడని తీర్పు చెప్ప వలసినవారైరి. హేస్టింగ్సు దోషియేయని వారు లిఖితపూర్వక ముగ తీర్పువ్రాసిరి. 1775సం॥ యేప్రియల్ 11వ తేదీన వారు వ్రాసిన తీర్పునందిట్లున్నది. "నందకుమారుడు బయటపెట్టిన సంగతులను బట్టి గవర్నర్ జనరలగు హేస్టింగ్సు యొక్క నడతలో అనేక క్రొత్తసంగతులు లోకమునకు వెల్లడియయ్యెను. మూడేండ్ల ఉద్యోగములో హేస్టింగ్సు 40 లక్షలకుపైగా ఆస్తిని సంపాదించినట్లు తెలియుచున్నది. ఈఆస్తిని సంపాదించు టలో ఆతడెట్టి సాధనల నవలంబించినది కూడ నందకుమా రుడు బయలువెట్టిన సంగతులను బట్టి తేటతెల్లము కాగలదు.

ఇక యెటు తప్పించుకొనుటకును సందులేక, హేస్టింగ్సు నిరాశజెంది, నందకుమారునిపై ప్రయోగించుటకు గాను యెవరికీ తెలియని నూతనాస్త్రము నొకదానిని తన కాలి క్రిందనుండి పైకిదూసెను. సీమలో సీమప్రజకొరకు ఉద్దేశింపబడిన యింగ్లీషు చట్టములను యిక్కడ యిండియాలో యిండియా ప్రజలపై ప్రయోగించుటకు సర్వసంపూర్ణాధికారములతో

ఒక సుప్రీముకోర్టును పార్లమెంటువారు 1773 సం॥ లో "రెగ్యులేషన్ ఆక్టు" ప్రకారము కలకత్తాలో స్థాపించిన సంగతి పాఠకులకు తెలిసియేయున్నది. భారతప్రజల చావు బ్రతుకులు కూడ యీకోర్టువారి చేతులలో నుంచబడెను. కలకత్తాలోని యింగ్లీషువారిలో ఆనాడు అల్లకల్లోలములకును అంతఃకలహములకును కక్షలకును కారణభూతమైన కలకత్తా కౌన్సిలు తగాదాలలో మొదటినుండి చివరవరకు సదరు సుప్రీముకోర్టు జడ్జీలు హేస్టింగ్సునెడనే పక్షపాతము వహించి యుండిరి; అందులో ఛీఫుజడ్జీ మన హేస్టింగ్సుకు చాల ఆంతరంగిక మిత్రుడు. నందకుమారుడు ఆరేండ్లక్రిందట ఒక పత్రమును "ఫోర్జరీ" చేసెననిచెప్పి ఒక నేరమును అనామకుడగు ఒకానొక దేశీయునిద్వారా ఆకస్మికముగ నందకుమారునిపై మోపించిరి. ఈపనిని హేస్టింగ్సే చేయించెనని ఆకాలమునాటివారందరు తలంచిరి. తక్షణమే కోర్టువారంటు తెప్పించి, హేస్టింగ్సు నందకుమారుని చెరసాలలో త్రోయించెను. తక్కిన ముగ్గురు కౌన్సిలర్లును, క్రోధోద్రిక్తులై నందకుమారుని విడిపింపవలసినదని ఆజ్ఞాపించిరి. కాని, సైన్యదళములు వీరి మాటను పాటింపక హేస్టింగ్సు మాటచొప్పునే పోయెను. ఇక హేస్టింగ్సుకు ఉచితజ్ఞతగాని విశాలబుద్ధిగాని యెక్కడిది? ఇంతకంటె ఘోరవంచన, దురంతమగు కపటవ్యాజము మరియొకటి గలదా? కేవలము చట్టప్రకార మాలోచించినను, లేక ధర్మము నాలోచించినను, యీకేసు సీమ అప్పీలుకుగనుక పోయియుండినయెడల, వారక్కడ తప్పక కొట్టివేసెడివారు. 1773 వ సం॥ లో పార్ల

మెంటువారు నిర్మించిన రెగ్యులేషన్ ఆక్టువలన యిట్టి ఫోర్జరీ కేసులను యింగ్లీషు లా ప్రకారము విచారించుటకు కలకత్తా సుప్రీము కోర్టుకు అధికార మేర్పడెనని హేస్టింగ్సు పక్షమున వాదింపబడెను. అట్లని యొప్పుకొన్నను యీ ఆక్టు పుట్టిన పిమ్మట— అనగ 1773 వ సం॥ కు యిటీవల— జరిగిన కేసులకే యిది వర్తించునుగాని, అంతకుపూర్వమే జరిగియుండిన నేరములకీ ఆక్టు వర్తింపజాలదుగద. 1773 సం॥ లో రెగ్యులేషన్ ఆక్టు పుట్టినది; నందకుమారుడు చేసినాడన్న యీ ఫోర్జరీ నేరము అంతకుపూర్వము నాలుగేండ్లక్రిందటనే— అనగ 1769 సం॥ లోనే— జరిగియుండెననిరి. నందకుమారుడీ నేరము చేసినాడన్నరోజుకు యీఆక్టు అమలులోలేదు. అప్పటికీఆక్టు అసలు పుట్టనేలేదు. కావున, యీ నేరమునకీఆక్టు యెట్లు వర్తించును? వేయేల, ఫోర్జరీకి ఉరిశిక్ష విధించుపద్ధతి సీమలోసైతము యిటీవలనే వచ్చెనుగాని అప్పటికి లేనేలేదు. ఆశియాఖండమందు యేదేశములోగాని యిట్టి ఘోరపద్ధతి నెవరును కనివిని యెరుగరు. ప్రయివేటు పార్టీలమధ్య వ్రాసికొన్న దస్తావేజులను దొంగతనముగ దిద్దుటయనునది గొప్పతప్పయినను అది ప్రతిదేశమందును— ఇంగ్లండులో సైతము వాల్‌పోల్ మంత్రికాలమువరకుకూడ— రెండవతరగతి నేరముగనే భావించబడుచు వచ్చెనేగాని, ఉరిశిక్షకు అర్హమగు మొదటి రకపు నేరముగ యెన్నడును భావింపబడలేదు. నందకుమారుడీ నేరమును నిజముగ చేసియుండవచ్చును, లేక చేసియుండకపోవచ్చును- అది వేరే విషయము. అది భగవంతునికే యెరుక. అది యెవరును నిశ్చయముగ చెప్పజాలరు. కాని, ఒక విషయ

బడి శెరువుగానక అన్యాయముగ శిక్షలపాలగుట తటస్థించు చున్నది. ఈచట్టములేమియో మాకెవరు చెప్పకపోవుటచే మేము వానిని యెప్పుడెట్లు అతిక్రమించుచున్నామో మాకే తెలియకుండ అయోమయముగ నున్నది. అనాదినుండియు మాకు అనుశ్రుతముగ వచ్చుచున్న చట్టములప్రకారము కేవలము జరిమానాతోపోవు నేరము లనేకములు మీ యింగ్లీషుచట్టముల ప్రకారమిప్పుడు ఉరిశిక్షకు పాత్రములగునట! మాతాత తండ్రుల కాలమునుండి మేము మా పురాతన చట్టములలోనే పుట్టిపెరిగి యున్నాము. ఆప్రకారమే మొన్నటి వరకు మీ యింగ్లీషుపరిపాలనలో కూడ మా పూర్వచట్టముల ప్రకారమే మేము పాలింపబడుచుంటిమి. ఇప్పుడీ వింత చట్టములేల? కావున, యీకేసును పునర్విచారణ గావింపవలెను. లేదా సీమరాజుకు అప్పీలుచేసికొనువరకు ఉరిశిక్ష నమలుజరుపకుండ ఆపవలసినది. మరియు, మీ యింగ్లీషుచట్టములను మా బంగాళీభాషలోనికి తర్జుమా చేయించవలసినది" అని కోరుచు కలకత్తాప్రజలు ఆమహాజరులో వ్రాసిరి. అప్పుడు కలకత్తా గవర్నరుగ నున్న "వరల్స్టు" అను నాతడీ యర్జీని ఆమోదించుచు జడ్జీలుచెప్పిన తీర్పు చాల "అక్రమమైనదనియు, ప్రజలను బహుక్రూరముగ పీడించు స్వభావము గలదనియు" ఖండితముగ వ్రాసెను. ఈరీతిగ వెనుక యీకేసులో యిట్లు జరిగియున్న సంగతి మనస్సింగ్నకును, యీతని నేస్తగాడగు సుప్రీముకోర్టు జడ్జి "ఇంపే"

కును తెలియదా? * తెలియదని చెప్పుటకు నెక్కడను అవకాశము లేదు.

నందకుమారుని విచారించిన కేసులోని "జూరర్లలో" ఒక్క దేశీయుడైనను లేడు. ఇట్టి జూరర్లందరు కలిసి సదరు పత్రముపైని దస్కతు నందకుమారుడే ఫోర్జరీచేసెనని ఋజువైనట్లు నిర్ణయించిరి. ఈ నిర్ణయము ననుసరించి ఛీఫుజడ్జి నంద కుమారునికి ఉరిశిక్ష విధించెను. క్లావరింగ్, మాన్సన్, ఫ్రాన్సిస్ అను నీముగ్గురు కౌన్సిలుసభ్యులు యీ శిక్షను తక్షణమే అమలు జరుపవద్దనియు, యీ కేసును సీమకుపంపి చక్రవర్తి ఆజ్ఞనుకూడ పుచ్చుకొనువరకు నిలుపవలసినదనియు నెంతో ప్రాధేయ పూర్వకముగ నొక్కిచెప్పిరి. కాని, వీరి మాటలను వారు పాటింపరైరి. కలకత్తాలోని విలియముకోట వెలుపల ఫిరంగివేటు మేర యిదివర కెన్నడు కనివిని యెరుగని జనసమూహములుమూగి హాహాకారము లొనర్చుచుండ— పాపము— వయోవృద్ధుడగు నా బ్రాహ్మణ ప్రవరుని ఉరి దీసిరి. శవము క్రిందపడగనే, ప్రజల భయంకరారావములు మిన్నుముట్టెను. రోదసీకుహరమంతయు నిండిన యా భయం

* అయితే యిక్కడ మహాశ్చర్యకరమైన విషయము మేమనగా :— ఇటీవల కలకత్తాకౌన్సిలులో "లా" మెంబరుగనుండి, యిండియాకొరకు శిక్షా స్మృతిని (క్రిమినల్ కోడ్డును) నిర్మించుకార్యము ప్రత్యేకముగ నప్పగింపబడిన మెకాలేప్రభువు రాధాచరణ మిత్రుని కేసులో జరిగిన యీ యన్యాయము నేలనో గమనింపడయ్యెను. పైపెచ్చు, "ఫోర్జరీ నేరము యిక్కడైన యింగ్లీషు చట్టమును భారతప్రజలపై ప్రయోగించుట కన్నదండు ప్రయత్నములు జరిపి యుండలేదని" మెకాలేప్రభువు తాను హేస్టింగ్సునుగూర్చి వ్రాసిన వ్యాస ములో వాక్రుచ్చెను! ఎంతపొరపాటు!

కరారావములు అనేక సంవత్సరములవరకు— "ఇంపే" చేతులమీదుగ హేస్టింగ్సు నందకుమారుని ఖూనీ చేయించె నని యిటీవల బర్కుప్రభువు సీమ పార్లమెంటులో గర్జించిన రోజులకు కూడ మాటుమణగక మార్మ్రోగుచునే యుండెను.

"బర్కు యీ మాటలు మాట్లాడవలసినవికావు" అని కామన్సుసభలో పెక్కుమంది యిటీవల "పిట్టుమంత్రి" హయాములో "గ్రాహాంప్రభువు" ఉపపాదనపై తీర్మానించి యుండిరి. కాని, ఫాక్సు, విండ్‌హామ్, షెరిడన్, మున్నగు ప్రతిపక్షనాయకులు యీ తీర్మానమును ప్రతిఘటించి, యీ మాటలనే రికార్డులో నిలిపిరి. అవసరమైనచో హేస్టింగ్సుపై కేసు చేసిన ఫిర్యాదీలు యీ మాటలోని సత్యమును బుజువుపరచెదరని కూడ వారు సవాలుచేసిరి. పై నుదహరించిన గ్రాహాంప్రభువు తీర్మానము పార్లమెంటు రికార్డులలో తుడిచివేయబడక అట్లే నేటికిని నిలిచియున్నది. కాని, లోకచారిత్ర మీ తీర్మానమును తలక్రిందుగా త్రిప్పివేసెను. జాతులకును జాతులకును మధ్య న్యాయమును నిర్ణయించు ఆ పరమేశ్వరుడే—ఆ పరమన్యాయమూర్తియే—యెన్నటికైనను న్యాయమును, సత్యమును, పైకితీసికొని రాకపోడు. సత్యమును, న్యాయమును, ప్రత్యేకముగ యెవరుగాని పోటీపెట్టి సమర్థింపనవసరము లేదు.



## భరత ఖండమున

# ఆంగ్లరాజ్య స్థాపన

## పదియవ అధ్యాయము.

### కాశీ, అయోధ్య



"ఓడదొంగల పాపాభినివిష్టతయు, నెత్తి మూటలు వేసికొని యమ్మకొను చిల్లర బేరగాండ్ల క్షుద్రతయు కుంపిణీవారి వ్యాపారములలో కొంతవరకు మిళితమై యున్నట్లు తెలియుచున్నది. సరకులను వేలము వేయు రాజకీయరాయబారులును, బేరసారములలో తిరుగు సైన్యాధ్యక్షులును యీ కుంపిణీ పాలనయందు సైనిక రాజకీయ శాఖలలో నేక రీతిగ గాన్పించుచున్నారు. ఈ రీతిగ తప్పుడు పత్రముల సృష్టించి దేశీయ రాజ్యములలో నల్ల కల్లోలములు పుట్టించిరి. సైన్యముల బంపి మనుష్యుల నరెష్టు చేయించిరి. ఒక్క చిన్ని చీటి ముక్కతో పట్టణముల ముట్టడించిరి. కాతాబాకీ యున్నారని పేరుపెట్టి రాజులను సింహాసనములనుండి కూలద్రోసిరి. ఈ రీతిగ రక్తసిక్తమగు రాజదండపు కుహనావిభూతితో గల్లాపెట్టెను ముందువేసికొని కూర్చుండు చిల్లర బేరగాని క్షుద్ర వ్యాపారమును మిళిత మొనర్చిరి. ఒక చేతితో రాజదండమును త్రిప్పుచు రెండవ చేతితో జేబు దొంగతనము చేయుచుండిరి.

—ఆర్. బి. షెరిడన్

పరాభూత ప్రయత్నులగు మిగత మువ్వురు కౌన్సిలర్లున్ను సీమకు పంపించిన రిపోర్టులను బట్టి చూడగ, హేస్టిం

గ్సును యింటికి పిలిపించుటయే కర్తవ్యమనునంతగ నచటి సీమ మంత్రులకు తెలియ వచ్చెను. కాని కుంపిణీవా రీత నిని తీసివేయ వలసినదని ప్రత్యేకముగ తీర్మానించిన మీదట నేగాని యీతనిని చక్రవర్తి కూడ తీసివేయుటకు వీలులే కుండు నట్లుగ రెగ్యులేషను ఆక్టులో నున్నది. కుంపిణీవారి యందు హేస్టింగ్సు విషయమై అభిప్రాయము యిరు పక్షము లందు దాదాపు సరిసమానముగ నుండెను. హేస్టింగ్సును తీసివేయ వలసినది (డిస్మిస్ చేయవలసినది) అని కుంపిణీ భాగస్వాములలో ప్రతిపాదింప బడిన తీర్మానము కొద్ది ఓట్లతో ఓడిపోయెను. యీ రీతిగ హేస్టింగ్సు బహు కష్టముమీద తప్పించుకొని బయటపడెను.

ఇందుపై అత్యంత సౌమ్యస్వభావముగల నార్తుప్రభువు నకు ఒడలు మండెను. ఇండియాలో చాల అసహ్యస్థితికి వచ్చిన కంపెనీవారి భ్రష్టపరిపాలనను వెంటనే అంతమొందిం చుటకును, వారి కిదివరకిచ్చిన రాచకీయాధికారముల నన్నిటిని తగ్గించివేసి ఒక్క వర్తకము చేసికొను అధికారమునుమాత్రమే వుంచుటకును తగిన కట్టుబాట్లు చేయుటకయి పార్లమెంటు సభను వెంటనే— మామూలుకంటె ముందుగ— సమావేశ పరతునని నార్తుప్రభువు (మంత్రి) బెదరించెను. ఇందువలు యేమి కొంప మునుగునో అను భయముతో కుంపిణీ యధ్యక్షు డగు కర్నలు మాక్లీన్ తనకిదివర కొసంగబడిన యధికారము ననుసరించి అవసరమునుబట్టి వినియోగించుట కొరకు తనకిది వరకు హేస్టింగ్సు వ్రాసియిచ్చి పోయిన రాజీనామా కాగిత మును వెంటనే మంత్రియెదుట దాఖలుచేసెను. తక్షణమే

హేస్టింగ్సు స్థానమున "వీలరు" ను నియమించిరి. వీలరు సీమలో బయలుదేరి యిండియాకు చేరులోపల, యీమధ్య కాలములో క్లావరింగు గవర్నరు జనరలుగ పనిజూచునట్లు నియమింపబడెను. కాని, యీవార్త కలకత్తాకు చేరులోపలనే మాన్‌సన్ చనిపోయెను. ఈ సందుచూచుకొని కౌన్సిలు అధ్యక్షుడుగ తన కొసంగబడిన రెండు ఓట్లను అధారము చేసికొని హేస్టింగ్సు చటాలున తిరిగి తనయధికార స్థానము నారోహించెను. తిరిగి యథారీతిగ సమస్త వ్యవహారముల పయినను సమస్త మానవుల పయినను తనకెదురులేని సర్వాంసహాధికారమును తక్షణమే చలాయింప సాగెను. తాత్కాలికముగ తన కొసంగబడిన యధికారము నెటులయిన నమలు జరుపవలెనని క్లావరింగు, పాపము, చాల తంటాలుపడెను. కాని అది సాగలేదు. ఆఫీసు తాళపుచెవుల కొరకు క్లావరింగు కబురు పంపెను. కాని హేస్టింగ్సు తాళపుచెవులు నే నివ్వను పొమ్మనెను. క్లావరింగు సైన్యముల కుత్తరువులు బంపెను. కాని సైన్యము లాయుత్తరువుల పాటింపలేదు. ఇక్కడి రాజ్య పరిపాలన యంతయు యెవరు సాగించవలెనను ప్రశ్న సుప్రీము కోర్టుయెదుట బెట్టిరి. "నేను రాజీనామా యివ్వలేదు పొమ్మని" హేస్టింగ్సు తిరుగబడెను. "లోగడ నేను వ్రాసి యిచ్చినటుల చెప్పబడుచున్న రాజీనామా కాగితములో ఏమి ఉన్నదో నాకు తెలియదు. దానినకలు నావద్ద లేదు. ఒక వేళ దానినకలు నావద్ద నుంచుకొంటినని వాదించినను అది యిప్పుడు కనుబడుటలేదు. ఎక్కడో పోయినది పొమ్మ" ని హేస్టింగ్సు దబాయించెను. "నేను రాజీనామా యివ్వలేదు

గనుక ‘లా’ ప్రకారము అధ్యక్షస్థానము కాళీకాలేదు. కాబట్టి అధ్యక్షస్థానము కాళీయయినదను నూహతో కావింపబడిన చర్యలన్నియు రద్దయినట్లే, ఎన్నడు కావింపబడనట్లే, భావించ వలసియుండును” అని హేస్టింగ్సువాదించెను. సుప్రీముకోర్టు జడ్జిలును హేస్టింగ్సు వాదనప్రకారమే తీర్పు చెప్పిరి. హేస్టింగ్సు స్థానము నాక్రమింపవలసినదని సీమనుండి పంపబడిన వీలరు ఇండియాకు చేరునప్పటికి యిక్కడి వ్యవహారములిట్లు మారుటచే— కథ అడ్డముతిరుగుటచే— పాప మాతడు కౌన్సిలు సభలో తక్కువ పదవిలోనే కూర్చుండి అంతటితోనే గుటకలు మ్రింగుచు సంతుష్టి నొందవలసిన వాడాయెను.

మితిమీరిన తెలివితేటలుండి, దానికితోడుగ సిగ్గుశరములవిడచి, యెంతపని యయినను చేయుటకు తగిన అఘాయిత్యముండి యున్నచో మానవు డందరికంటె తానధికుడుగ యెట్లు గాన్పించునో తెలిసికొనుటకొక తార్కాణము యీ కాలమందు హేస్టింగ్సు చరిత్రయందు జరిగిన యొకానొక యుదంతమునుబట్టి తెలిసికొనవచ్చును. తనభార్యను హేస్టింగ్సునకు తార్చిన “ఇక హాఫు” అను చిత్రకారుని చరిత్రను వెనుకటి అధ్యాయములో కొంత చెప్పియుంటిమి. కాని యీతనికిని యీతని భార్యకును వివాహము రద్దయినట్లు కోర్టుడిక్రీమాత్రము చాల కాలమునకు గాని జర్మనీ దేశమునుండి రాలేదు. ఈలోగా నితడు హేస్టింగ్సు ఆదరణ వలన కలకత్తాలో చిత్రకారవృత్తిచే జీవనము చేసికొనుచుండెను. యిట్లుండగ కొంతకాలమునకు యిప్పుడు ఆడిక్రీవచ్చినది. ఆడిక్రీవచ్చిన వెంటనే హేస్టింగ్సుచే కొక్కుపెట్టబడిన

యీమగడు తానికూడ పత్నీభగభోగభాగ్యముచే సంపా దించుకొన్న డబ్బుమూటలతో మెల్లగ సీమకుతోవపట్టెను. క్రైస్తవమతపీఠాధి పతులు వెంటనే హేస్టింగ్సుసతికి దోషక్షాళన కర్మను పాదిరిగుడియందు విధ్యుక్తముగ జరిపించి ఆమెపై మంగళ ఆశీస్సులను గురిపించిరి. ఈకర్మకాండ అంతయు మహావైభవముగ జరిగెను. ఈమహావైభవమును జూచుట కిష్టములేక "నాకేదో సుస్తిగ నున్నద" ని చెప్పి క్లావరింగు గుడికిరాక తప్పించుకొనజూచెను. కాని, యీ మహావైభవమునకు క్లావరింగునుగూడ రప్పింపనిది తన విజయోత్సవమునకు పరిపూర్ణకళ రాదని తలంచి హేస్టింగ్సు అతనిని యెట్లయినను రప్పింప వలయునని పట్టుబట్టెను. అందుచే తన పెండ్లి ముచ్చటకు ఆతనిని పేరంటమునకు పిలుచుటకు హేస్టింగ్సు తానే స్వయముగ పోయి క్లావరింగును తన వెంట బెట్టుకొని మరీగుడికి వచ్చెను.

కాని ఫ్రాన్సిస్ మాత్రము యీ యెత్తులకు లొంగువాడు కాడు. ఆతడెవరినైన ద్వేషించిన ఎడల పూర్ణముగ ద్వేషించెడివాడు. హేస్టింగ్సుపై ఆతనికున్న ద్వేషము మరి ఎవరి మీదను లేదు. క్లావరింగు మాన్సనుల సహాయముతో ఆతడు హేస్టింగ్సును కొంతకాలమువరకు పదభ్రష్టుని చేయగలిగెను. హేస్టింగ్సుపై సాక్ష్యము చెప్పిన ఫోకు, బ్రిష్టో మున్నగువారి సహాయమున, హేస్టింగ్సు పరిపాలనయంతయు దుష్ట భూయిష్టమని ఆతడు ఖండితముగ ఋజువుచేసి చూపెను. కాని, యిప్పుడు తిరిగి హేస్టింగ్సుకు మంచిరోజులు వచ్చినవి. ఆతడిప్పుడు ఉచ్చస్థానము నాక్రమించి భారత రాజ్యమున కంతకు

ఎదురు లేని సర్వం సహాధికారమును వహించియున్నాడు. ఈ రీతిగ అడ్డముగ తిరిగిన కథ నంతను తిరిగి చక్కబెట్టుటకు ఫ్రాన్సిసు యెన్నియోవిధముల తంటాలుపడెను. దీని కొరకై అతడు చేయని ప్రయత్నములేదు. కాని, ప్రయోజనము లేకపోయెను. అందుచే నాతడు పట్టరాని కోపముతోడను, మాత్సర్యము తోడను లోలోన కుములుచుండెను. ఇట్లుండగ తన శతృవగు హేస్టింగ్సు నుండియే రాజీబేరములు వచ్చెను. ఫ్రాన్సిస్‌యొక్క పట్టుదలను, ఆతనికి తనపైగల గాఢ యసూయతను చూచి హేస్టింగ్సు భయపడకపోయినను, ఆతని నెట్లయిన సంతృప్తిపరచుట యెందుకైన యెప్పటికైన మంచిదని యోచనచేసెను. ఫ్రాన్సిసును గనుక యిప్పుడిక్కడ యిండియాలో నుండగనే యేదో విధముగ శాంతింప జేసి ఆతనితో మంచిమాట జేసికొనక పోయిన యెడల, రేపాతడు సీమకు నిండు కోపముతో పోయి, తనకచ్చట తీరరాని యడ్డంకుల కల్పించునేమో యని హేస్టింగ్సు మిక్కిలి దూరదృష్టితో నాలోచించెను. అట్టి దినము యెన్నటికైనను రాక తప్పదని హేస్టింగ్సు ఎరుగును. కాబట్టి వెలుతురుండగనే యిల్లు చక్కబెట్టుకొను మన్నట్లు యిక్కడుండగనే ఆతనిని తన వైపునకు త్రిప్పుకొని సాధ్యమైనచో భారతరాజ్యపాలనయందు తా నవలంబించు పద్ధతుల కన్నిటికిని అతనిచేత కూడా యేదో విధముగ ఒప్పించునట్లు చేసికొనుట మంచిదని హేస్టింగ్సు తలచెను. లేనిచో, నాడు, నేడు యిక్కడ తాను యిండియాలో చేసిన పనులన్నియు, రేపు చేయనున్న పనులన్నియు సీమలో కుంపిణి భాగస్వాముల ఎదుట, పత్రికలలో, పార్లమెంటు మహా

సభలో తాను ఏకాకియై నిలువబడి సమర్థించుకొనవలసిన యవస్థ పట్టునని హేస్టింగ్సు కొంచెము బెదరెను.

రేపు 15,000 మైళ్ల దూరములో నున్న సీమకు పోయిన తరువాత ఫ్రాన్సిస్ తనపై మహావిజయధ్వజ మెత్తు కుండ, యిక్కడ యిండియాలోనే యేవో ఒకటిరెండు విషయములలో ఆతనికి విజయము కలుగునట్లుచేసి అంతటితో నతనిని సంతృప్తి పరచుట మంచిదికాదా? హేస్టింగ్సు చేసిన యీ యోచన సరియయినదని- ఫలప్రదమైనదని- తదనంతర వృత్తాంతము వలన తెలియగలదు. తనమాటను సాగనీయక, తనంత వానిని ధిక్కరించి, తనంత వానిని టోపీవేసి, హేస్టింగ్సు నిరంకుశముగ ప్రవర్తించుచున్నందుకు ఫ్రాన్సిస్ పట్టరాని ఆశాభంగముతో లోలోన కుములుచుండెను.

తానెంత ప్రజ్ఞావంతుడైనను తన ప్రజ్ఞయంతయు హేస్టింగ్సు ముందర చిల్లిగవ్వకు కూడ పనికిరాక పోయెనని కలకత్తాలోని తన స్వదేశప్రజలు అనుకొనుచున్న సంగతి ఫ్రాన్సిస్ యెరుగును. అందుచే అతనికి మరింత తీవ్రరోషానలము ప్రజ్వరిల్లి దేహము నంతను దహింప జేయుచుండెను. తననిక్కడ యిండియాలో లక్ష్యపెట్టు వారెవ్వరు కాన్పింపరైరి. సీమలో కూడ తనపేరప్పుడే సగము మాసిపోయెను. అందుచే నాతడు విరక్తిచే నిరాశాహతుడై "ఛీ! నా తెలివితేటలు, నా పేరుప్రతిష్టలు, యీ నాటికిట్లయ్యె గదా! విషముతిన్న యెలుక తన కన్నములో తన్నుకు చచ్చినట్లు, చివరకు నేనిట్లు నా దేహమును దహించుచున్న యీ రోషానల జ్వాలలలో మ్రగ్గి తన్నుకు చావవలసి వచ్చెగదా! హా!

హాతవిధీ ! ఏమి నాకర్మము" అని ఫ్రాన్సిస్ తలపోయుచు ఒకనాడు ఒంటరిగా తనగదిలో కూర్చుండెను.

తలవని తలంపుగ గదితలుపు నెవరో తెరచినట్లయ్యెను. ఎవరో ఒకమనిషి లోనికివచ్చి హేస్టింగ్సు పంపిన రాయబారపు మాటలను ఫ్రాన్సిసుకు మనవిజేసెను. అప్పుడు తనకు గలిగిన విస్మయ సంతోషముల వర్ణింప తనకే తరము కాలేదని ఫ్రాన్సిస్సే చెప్పినప్పుడిక యితరులెట్లు వర్ణింపగలరు? రోషక్లేశములచే బహుకాలము తపించుచున్న తృష్ణాపరులకు తాపోపశమనమొనర్చు పరమామృత ముహూర్తము లివియేగదా! ఇట్టి యమృత ముహూర్తమునందు పరవశుడై హేస్టింగ్సు పంపిన రాయబారపతకపు సామాన్యఫక్కికి ఫ్రాన్సిస్ సమ్మతించుచు, హేస్టింగ్సు అప్పుడు మహారాష్ట్రులపై కావింపదలచుకొన్న చర్యలకు తానడ్డుతగులననికూడా హేస్టింగ్సుకు కబురు పంపెను. ఫాకు, బ్రిస్టో యనువారలు లోగడ తనపై సాక్ష్యము చెప్పినందులకుగాను హేస్టింగ్సు వారిని యుద్యోగములనుండి తొలగించెను. అట్టివారికి తిరిగి యా యుద్యోగ పదవుల నిచ్చినగాని వీలులేదని ఫ్రాన్సిస్ పట్టుబట్టెను. వారు చేసిన త్యాగమునకు, వారు పడిన శ్రమకు తిరిగి వారిని వారి వారి పదవులయందు గౌరవస్థానములందు సగౌరవముగ, బహిరంగముగ నిలువబెట్టునట్లు చూచుట తన విధ్యుక్త ధర్మమని ఫ్రాన్సిస్ పట్టుబట్టెను. ఇది, హేస్టింగ్సుకు విషతుల్యముగ నుండెను. కాని, ఫ్రాన్సిస్ పట్టువిడువలేదు. ఇకవిధిలేక చెవులు దులుపుకొనుచు హేస్టింగ్సు యీవిషపుమాత్రనెట్లో కండ్లు మూసుకొని గుటుక్కునమ్రింగెను. ఈ యిరువురు ఆం

గ్లేయులు హేస్టింగ్సుపై లోగడ చెప్పిన సాక్ష్యము తప్పుడు సాక్ష్యము కాదని యిప్పుడు స్పష్టముగ రుజువైనది. తుదకు వారబద్ధీకులని చెప్పినమాటయే యబద్ధమని యాతడొప్పుకొన్నట్లయ్యెను. కావున, వారబద్ధీకులు కానిచో వారుచెప్పిన సాక్ష్యమే స్థిరాక్షరముగ నిలచియున్నది. హేస్టింగ్సు యీ రీతిగ వారిరువురును తిరిగి లక్నో కాశీనగరములందు రెసిడెంట్లుగ నిలుపుటచే తనదుర్ణయమును, దుర్వృత్తిని, క్రౌర్యమును ఒప్పుకొనినట్లయ్యెను.

దరిమిలా రెండేడ్లవరకు కలకత్తా కౌన్సిలులో కలహములు కొంత మాటు మణగియుండెను. కాని, తుట్టతుదకు పూర్వవైరము లొక్కపెట్టున బ్రద్దలయ్యెను. మహారాష్ట్ర వ్యవహారములలో కొన్ని సందర్భములవల్ల కలకత్తా కౌన్సిలులో భిన్నాభిప్రాయము లేర్పడెను. "అనవసర వ్యవహారముల జోలికిపోవద్ద" ని ఫ్రాన్సిస్‌ను, "కవ్వించి పరులమీద పడుదమని" హేస్టింగ్సును పట్టు బట్టిరి. హేస్టింగ్సు తన ప్రతికక్షుని తనవైపు త్రిప్పుకొనుటకు మార్గము గానక యేదోవిధముగ నతని నోరు మూయించ వలెనని చూచెను. దానికతడొక ఎత్తువేసెను. "వెనుక మనమిద్దరము రాజీచేసి కొన్నప్పుడు, పరరాజ్యములతో నేను చేయు వ్యవహారములందు నీవు నాతో యేకీభవించ వలయునను షరతు గలదు. నీవుదానికి లోగడ ఒప్పుకొని యున్నావు. కాన, నీవు నాకిప్పుడీవిషయమై యెదురుచెప్పుటకు వీలులేదు" అని హేస్టింగ్సు ఫ్రాన్సిసును దబాయించెను. "యీ షరతుకు నేను అంగీకరించలేదని" ఫ్రాన్సిసు గట్టిగ యెదిరించెను.

"నీపినరతును గూర్చి ప్రశంసించిన మాట వాస్తవమే; కాని, నేను దానికి ఒప్పుకొనుటలేదని అప్పుడే చెప్పియుంటిని. అదిగాక, అట్లుఒప్పుకొనుటయు కౌన్సిలు సభ్యుడుగ నేను ప్రమాణపూర్తిగ వహించిన ధర్మములకు కేవలము విరుద్ధ మనికూడ, విశాలార్థము చెప్పవచ్చును" అని ఫ్రాన్సిస్ సమాధానము చెప్పెను. అంతట హేస్టింగ్సు కసిపట్టజాలక "ఋజువర్తన యననేమో ఫ్రాన్సిస్ యెరుగజాలడు, ఈతడు నమ్మదగినవాడు కాడు" అని కౌన్సిలు రికార్డులో తీర్మాన రూపముగ వ్రాసెను. అంతట ఫ్రాన్సిసు తోక త్రొక్కిన త్రాచువలె లేచి తనతో ద్వంద్వ యుద్ధమునకు "రారమ్మ" ని హేస్టింగ్సునకు కబురంపెను. హేస్టింగ్సును వెనుదీయక "యిదిగో వచ్చుచున్నా" నని తిరిగి కబురంపెను. మరునాడు, యీ యిరువురకు ద్వంద్వ యుద్ధము ముష్టాముష్టిగ జరిగెను. ఈ యుద్ధములో ఫ్రాన్సిసుకు గాయము తగిలెను. కాని, అంత అపాయకరముగ తగుల లేదు. ఆతడును త్వరలోనే కోలుకొనెను. ఇంతకు పూర్వము నూరేండ్ల క్రిందట యిట్టి ద్వంద్వయుద్ధమే సీమలో ఒకటి జరిగి యుండెను- అప్పుడు ఐర్లాండుకు వైస్రాయిగ నున్న టౌను షెండు ప్రభువు తనవైపు వీపు త్రిప్పెనను నేరము మోపి బెల్మాంటు ప్రభువాతనిని తనతో ద్వంద్వ యుద్ధమునకు రమ్మని సవాలుచేసెను. అంతట వారిరువురు కత్తులతో నొకరిపై నొకరు కలియబడిరి. సవాలు చేసిన బెల్మాంటు ప్రభువు నకు గాయము తగిలెను. ఒక నూరేండ్ల లోపునకు పూర్వము మన ఆంగ్లేయుల మర్యాద లిట్లుండెడివి!

మహారాష్ట్రులపైకి కవ్వించి పోవువైరమును సాధ్య మైనంత వరకు యెట్లయిన తగ్గించవలయునని ఫ్రాన్సిసు గట్టిగ యత్నించెను. ఇదియే ఆతడు ఇండియాలో చేసిన కడపటి ప్రయత్నము. మహారాష్ట్రులతో కలహించక కలసియుండ వలయుననియే ఫ్రాన్సిసు మొట్టమొదటి నుండియు హేస్టింగ్సుకు సలహా చెప్పుచుండెను. ఈ విషయమై క్లావరింగుకూడ తన అభిప్రాయమును లిఖిత పూర్వకముగా రికార్డు చేసి యుండెను. "బొంబయి ప్రభుత్వమువారు సాలిసెట్టిలంకను పట్టుకొని, బోరిచిపైదాడి వెడలి, పూనా సింహాసనపు తగాదాలలో జోక్యము కలిగించుకొని యీ రీతిగ అనవసర కలహాములలో దిగుచున్నప్పుడు సర్వాంసహాధికారులగు కలకత్తా ప్రభుత్వమువారు "యిట్టి చర్యలు కూడదని" బొంబాయి ప్రభుత్వమువారిని మందలించ వలసినది. ఈ రీతిగ బొంబయి ప్రభుత్వమువారి చర్యలను ఖండించుచు "బ్రిటిషువారు పొరుగు రాజ్యముల యెడల నమ్మక ద్రోహము చేయువారు కారను పేరును నిలుపుకొనవలసి యుండెను. మనమిట్లు చేసినచో మనము న్యాయబుద్ధి గలవారమనియు, దురాశా పరులము గామనియు, మహారాష్ట్రులు నమ్ముటకు వీలుండును. బ్రిటిషువారు అన్యాయ పరులనియు, పరరాజ్యముల దిగమ్రింగువారనియు దుష్కీర్తి యిదివరకే భారత దేశమందు విస్తారముగ వ్యాపించియున్నది. అట్టి దురాగతపు పనుల నికముందు మానుకొనుటయే మా నిజమైన సంకల్పమని మన ప్రవర్తన వలన మహారాష్ట్రులకు తెలియజెప్పవలెను; అప్పుడే వారు మనతో శాశ్వతమైన సంధిచేసికొనుట కొడంబడుదురు.

అప్పుడే వారు మనము చెప్పిన సంధివాక్యముల చెవియొగ్గి వినుడు" అని క్లావరింగు వ్రాసెను. కాని హేస్టింగ్సు సంకల్పము మాత్రమిదికాదు. ఇట్లుండగ క్లావరింగుకూడ చనిపోయెను.

క్లావరింగు మాన్సను లిరువురు చనిపోవుటతో యిక మన హేస్టింగ్సున కెదురు చెప్పువారెవరు? అతనిపని తేలికయ్యెను. అతడు యథేచ్ఛగ విజృంభించెను. మహారాష్ట్రులపై కెప్పించి కాలుద్రువ్వుటకు బొంబయి ప్రభుత్వమువారు మిక్కిలి సంకుచిత దృష్టితో ప్రారంభించిన దుష్పరిపాకపు యెత్తుల కన్నిటికి హేస్టింగ్సు బహిరంగముగను, రహస్యముగను మద్దతుచేసెను. సింధియా, హోల్కారు, బీరారు రాజ్యములపైకి బ్రిటిష్ దండయాత్రలను పంపెను. ఈ దండయాత్రలలో బ్రిటిషువారు సల్పిన నూతన పరాక్రమ కార్యములవల్ల వారి ధైర్యసాహసముల కెక్కువ పేరువచ్చెను. దానివల్ల బ్రిటిషువారజేయులను నమ్మకము ప్రబలుటచే, తరువాతి జయములు వారికి సులభ సాధ్యములయ్యెను. రక్తపాతయుతమగు ఘోరసంకుల సమరములు నాలుగు జరిగిన పిమ్మట 1780 సంవత్సరములో సంధిజరిగెను. ఇరుపక్షములును పట్టుబడిన స్థలముల నెవరివివారికి యిచ్చివేయునట్లు యిరువురు ఒడంబడిరి. ఆసంవత్సరాంతమందే ఫ్రాన్సిసు సీమకువెళ్లెను. అంతటితో భారతరాజప్రతినిధుల నిరంకుశాధికార ప్రాముఖ్యమునుతగ్గించి దానిని సరియైన శాస్త్రీయపు పద్ధతులలోనుంచు ప్రయత్న మంతరించెను. అట్టి ప్రయత్నమింతవరకు తిరిగి చేసినవారు గాన్పింపరు. ఉన్నారు యిప్పు

టికిని పేరునకుమాత్రము సుప్రీము కౌన్సిలని పేరుపెట్టుకున్న సలహాదార్లు! వారిపని సలహాచెప్పువరకు మాత్రమే— వారి యధికార మంతవరకే; అది సరియైన మంత్రివర్గము కాదు. దానిని సంక్షిప్త లేఖకుల గుంపనవచ్చును.

ఇప్పుడు కౌన్సిలులోనికి వచ్చిన సభ్యులంత గట్టివారు కారు. హేస్టింగ్సును సరిగ అదుపులో నుంచతగిన సామర్థ్యము వారికి లేదు. తన్నెదుర్చువారు లేనందున ఆతడు తిరిగి యథాప్రకారముగ పరరాజ్యాపహరణములకు గడంగెను. బ్రిటిషువారికి మిత్రులు కరవైన రోజులలో, స్నేహితుడన్న వాడెవడైన దొరికినదే మహా అబ్బురముగ నున్నరోజులలో, పాపము బ్రిటిషువారికి స్నేహితుడుగ దొరకిన పిల్లరాజొకడు-కాశీరాజు- కలడు. ఈతడు అయోధ్యవజీరుకు సామంతరాజై ధనాఢ్యుడై యుండెను. యుద్ధ సమయములందును శాంతి సమయములందును యీతనివలన కొంత కప్పమును పుచ్చుకొనుచు ఆతని విశ్వాసమును మాత్రము కోరుచు అయోధ్య వజీరు అంతటితో సంతృప్తుడై యుండెను. ఈ కాశీరాజు పేరు బల్వంతసింగు. ఈతడు మిక్కిలి మంచిరాజు. స్థానిక పరిపాలనయం దతడు అనవసరముగ జోక్యము కలుగజేసి కొనుచుండెడివాడుకాడు. ఆతని పాలనలో ప్రజలు హాయిగ బ్రతుకుచుండిరి. దేశము సుభిక్షముగ నుండెను. సర్వలోక సనాథుడగు శ్రీవిశ్వేశ్వరుని పవిత్రక్షేత్రమగు యీవారాణసీ నగరమును, తత్పరిసర ప్రాంతములును, బల్వంత నృపాలుని పాలనలో సర్వసస్యసముపేతమై, సర్వసంపద్భరితమై, భూలోక స్వర్గమై యొప్పుచుండెను. శ్రీ విశ్వనాథుని దర్శనార్థమై యరు

దెంచు నానాదేశాగత యాత్రికబృందము లమూల్యములును నానావిధములునునగు కానుకలను గొనివచ్చి యావిశ్వేశ్వరున కిచ్చుచుండిరి. రాజు అన్యాయముగ తమపంటల నపహరించు ననిగాని, మరి యితర విధముల తమను హింసించుననిగాని, భీతి కించిత్తయినను యా నృపాలుని రాజ్యమునంగల కర్షకు లకు లేకుండెను. అందుచే వారు తమ పొలములను నందన వనములుగ జేసుకొనుచుండిరి. కష్టించి చేసిన కృషివలన లభించు ఫలములను వారు హాయిగ నిరుపద్రవముగ ననుభవిం చుచు సర్వవిధముల వర్ధిల్లుచుండిరి.

ఈకాశీ రాజ్యమందు రమారమి 5 లక్షల జనసంఖ్య కలదు. ఈజనపాలుని యందొక్క దోషమున్నట్లు పొరుగు రాజులకు అనుమానము. అదేమనగ, తమ వద్దకంటె యీ జనపాలునియొద్ద యెక్కువ ధనమున్నదని వారి యనుమా నము. ఇదే అతని యందున్న దోషము. 1775 సం॥లో జరిగిన కుంపిణీఒడంబడిక ప్రకారము అయోధ్యవజీరు తనకు కాశీ రాజ్యములో గల యధికారమును కుంపిణీవారికిచ్చి వేసెను. (టాన్సుఫరుచేసెను). అప్పటికి బల్వంత నృపాలుని కొడుకగు "చయతుసింగు" కాశీరాజుగ నుండెను. తన తండ్రి నుండి తనకు సంక్రమించిన యావదధికారములను స్థిరపరచుచు కుం పిణీ వారుకూడ యీ "చయతుసింగు" నకు పట్టానిచ్చిరి. అంతట కొలదికాలమునకే కుంపిణీ వారికి ఫ్రెంచివారితో యుద్ధము తటస్థించెను. ఈ యుద్ధమునకుగాను మూడు సిపాయి దళములను తయారుచేసి తమ కివ్వవలసినదని కుం పిణీ వారప్పుడు "చయతుసింగును" కోరిరి. వీరికగు సాలు

సరి ఖర్చులు 5 లక్షలు కూడ తానే భరించవలయునని కుంపిణీ వారనిరి. కొంత వాద ప్రతివాదములు జరిగినమీదట చివరకు విధిలేక గొణుగుకొనుచు, పాపము చయతుసింగు సమ్మతించెను. కాని యిట్లు రెండు సంవత్సరములు జరిగిన పిమ్మట, మూడవయేట గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్లు గుర్రపుదళములను కూడ కుంపిణీవారు తిరిగి తమకు సప్లయి చేయవలయునని చెప్పిరి. ఇక చివరకు ఉద్రేకము ఆపుకొనలేక చయతుసింగు సాహసించి తిరస్కరించెను. అంతట నాతని నెట్లయిన నొంచవలెనని హేస్టింగ్సు పూనుకొనెను. తాను గొప్ప పరివారముతో కాశీకి వచ్చుచున్నానని ముందుగ చయతుసింగునకు తెలియపరచెను. కాశీరాజగు చయతుసింగు బక్సారువద్దకు ఎదురేగి హేస్టింగ్సును సగౌరవముగ సన్మానించి అతనికోపమును శాంతింప జూచెను. మరియు తన ప్రభుభక్తిని తెలుపుటకు గాను తన తలపాగనుదీసి హేస్టింగ్సు మోకాళ్ళపయి నుంచెను.

హేస్టింగ్సు హృదయమం దిన్నాళ్ళనుండి దాగియున్న కోధాగ్ని యొక్కపెట్టున రగుల్కొనెను. కాని దానిని పయికి ఉబకనీయక పయికిమాత్రము బహుమెత్తగ, మర్యాదగ మాట్లాడుచు, తన కఠోర సంకల్పమును నిర్దాక్షిణ్యముగ, బహుకౄరముగ కొనసాగింప బూనుకొనెను. మూడేండ్ల క్రిందట కలకత్తా కౌన్సిలులో హేస్టింగ్సునకును క్లావరింగునకును తగాదాలు తీవ్రముగ చెలరేగుచున్నప్పుడు యీ యిరువురిలో యెవరు గెలిచినదియు సరిగ తెలియక, క్లావరింగు గెలిచినాడను అపోహతో ఆయన అధికారమునకు వచ్చిన

యడల ఆయన ఆశ్రయము తన కవసరమగునను ఊహతో క్లావరింగును శాంతింపజేసి మంచి మాట జేసికొనుటకై యీ చయతుసింగు ఒక రాయబారిని పంపించెను. కాని యీ రాయబారి కలకత్తా చేరకమునుపే క్లావరింగును అతని మిత్రులును ఓడిపోయినారను మాట దెలియ వచ్చెను. అందుచే యీ రాయబారపు మాటలు క్లావరింగు నకు చెప్పకుండగనే రాయబారి వెనుకకు వచ్చివేసెను. కాని చయతుసింగు యీరీతిగ క్లావరింగునకు రాయబార మంప జూచెనను మాట యెట్లో హేస్టింగ్సునకు తెలిసెను. అది అప్పటి నుండియు ఆతని హృదయమందు నిద్రపట్టనీయక కలకవేయు చునే యుండెను. దానినాతడు మరచిపోలేదు. చయతు సింగును క్షమింపదలపనూ లేదు. ఇట్టి తీవ్రోద్రేకముతో కాశీ నగరములో ప్రవేశించినదే తడవుగ వెనుక సైన్యములను సప్లయి చేయు విషయములో చయతుసింగు చూపినాడన్న నిర్లక్ష్యము నకు, ఉపేక్షకు తక్షణము సమాధానము చెప్పవలసినదని హేస్టిం గ్సు బహుదారుణ వాక్యములతో కబురంపించెను. దీనికి చయ తుసింగు పంపిన ప్రత్యుత్తరము అవిధేయతను సూచించుచున్న దని భావించి, తక్షణమే రెండు సైన్యదళములగొంపోయి యీ కాశీరాజు మందిరమును ముట్టడించి, యాతనిని పట్టుకొని బంధింప వలసినదిగ అక్కడనున్న యింగ్లీషు రెసిడెం టుకు హేస్టింగ్సు ఉత్తరువుల బంపించెను. ఇట్టి దారుణ దుష్కృత్యమునకు కాశీ ప్రజలెల్లరు క్రోధావేశ పరవశులై ఒక్కుమ్మడి యింగ్లీషు సైన్యములపయిబడిరి. ఈ సైన్యములు మిక్కిలి అల్పముతో మందుగుండు సామాగ్రిలేకుండగ వచ్చిన

వగుటచే అచిరకాలములో కాశీ ప్రజాసమూహముల కత్తులకు యెరయైరి. ఈకసి తీర్చుకొనుటకై యింకొక ఆంగ్లసైన్య దళము వచ్చిపడెను. అంతట బహురక్తపాతయుతమగు ఘోరసంకుల సమరమయ్యెను. రాత్రివేళ రాజపరివారము తమ తలపాగ లన్నిటిని కలిపికట్టి పెద్ద త్రాడుగ జేసి దాని వెంట తమ రాజగు చయతుసింగును పైమేడ యంతస్తులోని కిటికీనుండి క్రిందకు దింపిరి. అంతటరాజు ఆరాత్రి వేళనే గంగానదినిదాటి, అద్దరి కొలదిమైళ్ల దూరమున నున్న రామ నగరు కోటకు పారిపోయెను. ఈ కోటలోనే రాజధనాగార మంతయు నున్నది. తమపరి రాణియు రాజమాతయుకూడ యీ కోట కేవచ్చిచేరిరి. ఆంగ్లసైన్యము లీకోటనుకూడ ముట్టడించెను. కాని కోట శత్రువశము గాకపూర్వమే, శత్రువు లిన్నాళ్ళనుండి పట్టుకొనుటకై యువ్విళ్ళూరుచున్న యీరాజధనాగారమంత టిని యెట్లో యింకొక చోటికి తరలించిరి. రాజును యెటులో తప్పించుకొని "బీజఘురు" నగరమునకు పారిపోయెను. తుట్ట తుదకు అక్కడనుండికూడ వెడలగొట్టబడి గ్వాలియరు నగర మునకు పలాయనుడై అవసానకాలమువరకు అచ్చటనే తల దాచుకొని యుండవలసిన వాడాయెను.

ఇక యిచ్చట కాశీనగరమందు హేస్టింగ్సు తన నిరం కుశ ధ్వజమును నాటెను. 19 సం॥ గల కుఱ్ఱవాని నొకని పిండిబొమ్మయగు రాజుగ నెలకొల్పెను. రాజార్హములగు అధికారములేవియు అతడు చలాయించుటకు వీలులేదట. ఈతడు కంపెనీకి చెల్లించవలసిన కప్పమును మాత్రము 20 లక్ష లకు హెచ్చించెను. దీని వసూలుకూడ యీ రాజు చేతిలో

నుంచక కర్కోటకుడును, నక్షత్రకుడును అనదగిన ఒకా నొక యుద్యోగి చేతిలో నుంచెను. కాని ప్రజాకల్లోలము మాత్ర మంతసులభముగ అణచదగినదికాదు. తమకు పితృ సముడగు రాజుపై అన్యాయముగ పరులువచ్చిపడి తమ కన్నై దుట యిట్టిదారుణ ఘాతుక మొనర్చుచుండగ జూచి ప్రజ లెట్లు సహించగలరు? యిట్టి దృశ్యముచే క్రోధావేశులయిన ప్రజలు నూతన పరిస్థితులకు సమాధానపడక, చాలకాలము వరకు రాజ్యమం దల్లకల్లోలముల జేయుచు, తిరుగుబాటు చేయుచు, సాత్వికముగ నిరోధించుచు అనేకవిధములుగ క్రింద మీదపడుచునే యుండిరి. ఈ రాజ్యమందు భద్రముగ, హాయిగ, నిరుపద్రవముగ బ్రతుక వచ్చునను ఆశ యంతయు నడుగంటినది. ప్రజల ధనధాన్యసంపదలు తమ యనుంగు చయతుసింగుతోనే పలాయన మయ్యెను. తమకిక మిగిలి నది పరులక్రింద దాస్యము. తామింతకాలమునుండి కష్టపడి దున్నుకొని బ్రతుకు ఆ భూమిపై కూడ తమకిక కృషిచేసికొని నిర్భయముగ బ్రతుకు రోజులు పోయినవి. ఇంతవరకు యెట్టి కొరంతలేక, సకల సౌఖ్యములతో నోలలాడుచున్న తమజీవిత మంతయు నేటినుండి సకల సంక్షోభములకు సకల దుఃఖములకు సకల దుర్దశలకు భాజనము కావలసి వచ్చెను. ఇప్పుడు రాజ్యాధిపత్యమునకు వచ్చిన కంపెనీవారు తాము బలాత్కార ముగ విధించిన క్రొత్త పన్నుల నెంతకఠోరముగ వసూలు చేసి నను తామనుకొనినంత మొత్తము తేలలేదు. పొదుగులో లేనిది పిండిన పాలెట్లువచ్చును? తదుపరి రెండేండ్లకు హేస్టింగ్సు తన కసియను విపానలజ్వాలల నుమియగ్రక్కిన కాశీరాజ్య

శంగమును దర్శింపబోయినపు డాతని కదెట్లు కాన్పించెను? కాలి, దగ్ధపటలమై, పాడరియున్న మరుభూమిగ గన్పట్టెను. జనసంఖ్య నానాట క్షీణించెను. కొలది సంవత్సరముల క్రితము 5 లక్షల జనసంఖ్యతో కలకలలాడుచున్న కాశీరాజ్యములో నేడు 1822 సం॥ నాటికి 2 లక్షల జనులుండుటయే యరుదయ్యెను. కాని కుంపిణీవారి ధనతృష్ణ తీరలేదు.

కాశీరాజ్యసంపాదన ఆతృష్ణను తీర్పజాలనిచో యికఅయోధ్యరాజ్యసంపదలతో నాతృష్ణానలము దీర్చుకొన యత్నింపవలదా? అయోధ్య వజీరు అసఫ్-ఉద్‌దౌలా, "మొర్రో! నావద్ద ధనము లేద"నెను. దానికికారణము కంపెనీవారు తననెత్తిపై తెచ్చిపెట్టిన అద్దెసేనల ఖర్చేయని యాతడు విన్నవించుకొనెను. ఇది కొంతనిజమే. హేస్టింగ్సుభూతము తనరాజ్యములో ఏనిమిషమందు కాలుపెట్టునోయను భీతితో ముందుగ తానే బయలుదేరివెళ్లి ఆభూతమును శాంతింపచేయుదమను తలంపుతో, పాపము, అసఫ్-ఉల్లాఖాన్ హేస్టింగ్సు దర్శనార్థమై బయలు వెడలెను. ఇరువురు చునార్ కోటలో సమావేశమైరి. అక్కడ ఇరువురకును రాయబారపు మాటలు జరిగెను. ఇక్కడ చరిత్రలో ఎన్నడు మరువతగని దురాగతపు టెత్తు ఒకటి యిరువురు కలసివేసిరి. అయోధ్య వజీరుకు దమ్మిడీ ఖర్చులేకుండుటకును, కుంపిణీవారి బొక్కసము పూర్తిగ నిండుటకును—ఒక్కవేటులో రెండుపిట్టలుపడునట్లు—దురాగతపు ఉపాయము నొకదానినిపన్నిరి.

"అదేమియులేదు- యింతే- అయోధ్యవజీరున్ను, హేస్టింగ్సున్ను కలిసి మధ్య మూడవవానిమీాదపడి దోచు

కోవడము ! ఆమూడవవారెవరు ? యీ దోపిడిగాండ్రిరువు రిలో నొకడగు అయోధ్యవజీరుయొక్క తల్లియే!" వెనుకటి వజీరు అనగ యీ అసఫ్- ఉల్- దౌలాయొక్కతండ్రి చని పోవుచు తన భార్యకును, తల్లికిని చాల ధనమునిచ్చి పోయె నని గొప్ప వాడుకకలదు. ఈరీతిగ యీ వజీరు అసఫ్- ఉల్- దౌలాకు కేవలము తల్లియు నాయనమ్మయునగు నీ ముదుసలులిరువురు ఫైజాబాదు నగరమందు వెనుకటి వజీరు తమకిచ్చి పోయిన యొకానొక ప్రియమందిరములో పెక్కు పరివారముతో కాపురముండి యుండిరి. ఈ మూలనున్న ముసలమ్మల వద్దనున్న ధనమునంతను దోచుకొందమనియు, అట్లయినయెడల తనకు దమ్మిడీ ఖర్చులేకుండ, కుంపిణీ బొక్క సమును నిండించవచ్చుననియు హేస్టింగ్సు సిగ్గులేక, నీచమని తలంపక, మిక్కిలి ఖలవృత్తితో అసఫ్- ఉల్- దౌలాతో సూచించెను. ఘనత వహించిన మహారాజాధి రాజశ్రీ శ్రీ తోడిదొంగసార్వభౌమప్రతినిధిగారిట్లు ఖలవృత్తితో నాడిన కిరాతవాక్యములు చెవి సోకినంతనే పాపము అసఫ్ఉల్లా ఖాన్ రిచ్చపడి సిగ్గుతో తలవంచుకొనెను. ఇంతటి మాతృ ద్రోహము నెట్లొనర్తునాయని యాతడు తనలో తానె సిగ్గుతో కుంగిపోయెను. ఇట్టికార్యము నెట్లు చేయుదునా యని యాతడు చాల వెనుకాడెను. "అయిన నేమి! ఆతడు క్రైస్తవుడు గాడు. అతడు కేవల ముసల్మాను డేగద; ఆతనికిట్టి ధర్మసంశయము లుండవలసిన పనియేమి? కాబట్టి ఆతనిచే యేపని చేయించినను చేయించవచ్చును" అనునహంకార భావముతో హేస్టింగ్సు ఆతనిసంశయము లెట్లో

అణచివేచి, ఆతని నీ పాపమార్గములోని కీడ్చెను. ఈవిధముగ తోడిదొంగ లిరువురు కూడబలుకుకొని యీ మోసపుటెత్తు నకు తగిన సన్నాహముల నొనర్చుటకై యెవరితోడ్రోహమను వారు వెడలిరి. దుర్భరమగు కుంపిణీవారి యొత్తిడిని యెదిరించుటలో చైతుసింగునకు యీ మూలనున్న ముసలమ్మలు రహస్యముగ తోడ్పడిరను నేరము వీరిమీద బనాయింపబడెను. ఇట్టి మిత్ర ద్రోహమును ఋజువు పరుపగలిగిన ఎడల యీ ముసలమ్మల నేమిచేసినను పాపముండదుగద! కాబట్టి యీ నేరము నెట్లో ఋజువుపరచుటయే తడవు; ఇక ఋజువుపరచుటలో చక్కగ అతుకునట్లు, పకడుబందిగ, సమస్తలాంఛనములతో ఋజువు చేయవలెను. ఈరీతిగ చేయదలచుకొన్న పని నిశ్చితమై నప్పుడు యిక దొంగసాక్షుల కేమికొరత! లోకములో వీరు సాధారణముగ "ఓ" అని పిలువగనే పలుకుచుందురు. ఇక వీరికికావలసినంత ధనము కుమ్మరించుటకు రాజధనాగారమే యుండగ యిక చెప్పవలసిన దేమున్నది! ఈ ముసలమ్మల తర ఫునవాదించువారెవరు! వీరిపై చెప్పినసాక్ష్యము నిజమో అబద్ధమో పరిశీలించువారెవరు? అయినను, పైకి యేదో న్యాయవిచారణ చేయుచున్నామను మామూలు నటనయైన నుండవలెనుగదా! కాబట్టి, యింగ్లీషుసేనలువెళ్లి యీ ముస లమ్మలు కాపురమున్న కోటద్వారమును పగులగొట్టి లోనికి ప్రవేశించుటకు ముందు యేదోకొంతతంతు జరుగవలెనుగద.

దీనికొక ఉపాయము వారికిచిక్కినది. వెనుకటి వజీరు చచ్చి పోవుచు, యీ ముసలమ్మల నిరువురిని యింగ్లీషువారి రక్షణ క్రిందనుంచి వెళ్లెను. అప్పుడు పైకి యేదోమంచియుద్దేశము

తోనే యింగ్లీవారును, యీముసలమ్మల రక్షించుచుందుమని వజీరుతో వాగ్దానము చేసి యుండిరి.

కాని ఆ సదుద్దేశము లన్నియు యిప్పుడు మారిపోయి నవి. ఈరీతిగ వెనుకటి వజీరు తమ్మునునమ్మి యవసాన కాలము నందు తన తల్లిని భార్యను తమపోషణ కిందనుంచి వెళ్లి నప్పుడు, అట్టివారి నిప్పుడు యెట్లు ద్రోహము చేయుదు మాయను కించ, మనస్సాక్షిపీడనము—దానికేమైన పేరు పెట్టండి - అట్టిదేయొకటి అతిసూక్ష్మముగ ప్రతిమానవుని హృదయమందును ఉండును—వుండితీరును. ప్రతివాని యంత రాత్మను సూదులుపెట్టి పొడిచినట్లు పొడుచును. కావున, యిట్టిదుర్మార్గమును చేయుటకు పూర్తిగ సంకల్పించుకొన్న వారు యిట్టి కించను, యిట్టి మనస్సాక్షి పీడను, అంతరాత్మ స్పందమును, యెట్లో అణచివేయవలసి యుండును. కావున, .దానినేరీతిని అణచివేయుటయా యనునదే ప్రశ్న- అంతే- పాపములకెల్ల భైరవుడు ఉన్నాడుగదా మన సుప్రీముకోర్టు న్యాయమూర్తి- సర్ యెలిజా యింపే! ఇట్టి సందిగ్ధ సమయములయందెల్ల- ఇప్పుడేగాదు- లోగడ అనేక పర్యాయములు హేస్టింగ్సుకు చేదోడు వాదోడుగావచ్చి యీతడు తోడ్పడెను. మన హేస్టింగ్సుపాలిటి ఆపదుద్ధార కుడు! అక్కరకువచ్చు చుట్టము- మిత్రము! మామూలు తప్ప కుండ అతడీ సమయమందును వచ్చి దేవునివలె మన హేస్టిం గ్సుకు తోడ్పడెను. లోగడ యెవరెవరికి యెంతెంత అధి కారము గలదను విషయములో యింపే, హేస్టింగ్సుల కిరువు రకును పెద్ద తగాదా వచ్చెను. ఆ తగాదా తీవ్రరూపమును

దాల్చి ఒకరిపై నొకరు క్రోధావేశముల గ్రక్కుచు శపథ ముల గావించుకొనిరి. కాని సాలుకు 60 వేల రూపాయలు రాబడిగల ఒక ఉద్యోగమును తాను చెప్పినప్పుడు మానుకొను షరతుతో హేస్టింగ్సు యింపేకు యిప్పించి, ఆతనిని ఉప శమింపజేసెను. ఆరోజునుండియు అగ్నికి వాయువు తోడై నట్లయ్యెను. హేస్టింగ్సు చేసిన ఒక్క కనుసైగతో సర్ యింపే తక్షణమే పల్లకీనెక్కి అద్దానిని బోయీలు మోసికొనిరాగా అంచెలంచెలపై కలకత్తా నగరమునుండి లక్నో నగరమునకు చేరెను. ఈ బోయీలెవరు? "క్రైస్తవేతరు" లను కార ణమున మన ఆంగ్లేయులచే నీచముగ చూడబడు భారత దేశీయులు—— అవును! మహాఘనతవహించిన యాంగ్లరాజ ప్రతినిధి బహద్దూరుగారి కనుసైగమాత్రమున దారిదోపిడులు గావించుటకై బయలువెడలిన క్రైస్తవ న్యాయమూర్తులను తమ భుజములపై మోసికొని పరుగెత్తుటకుకాదా దేవుడీ నల్లవాండ్లను—— క్రైస్తవేతరులగు యీ సమస్త హిందూ ముసల్మాను ప్రజాకోటిని సృష్టించినది?

మన యూరోపియనుల యాచార శీలముల మహా ఘనతను మూఢాత్ములనబడు యీ భారత దేశీయుల కెరుక పరచుటకు యింతకంటె స్పష్టమగు మార్గమేది? అయోధ్యా రాజధానికి చేరగనే మన న్యాయమూర్తిగారు అనేకమంది ప్రజలవద్ద వాఙ్మూలములు పుచ్చుకొనెను. ఆ వాఙ్మూల ములలో నేమిగలదు? కాశీరాజగు చయతుసింగు తనకు శాస్త్రవిహిత ప్రభువులగు కుంపిణీవారిపై కుట్రచేసెనట. అతడట్లు చేసినాడన్న కుట్రలో అయోధ్యవజీరు తల్లియు

నాయనమ్మయు నగు యీ ముసలమ్మలుకూడ షరీకైనారట! ఇది యీ ముసలమ్మల నేరము! ఈ వాఙ్మూలములను న్యాయమూర్తి యింపే స్వయముగా చదువలేదు. ఇతరులచేత చదివించుకొని వినలేదు. ఆభాష యింపేకు తెలియదు; ఆభాష వచ్చినవారిచేత చదివించుకొని యింగ్లీషులోనికి తర్జుమా చేయించుకొని వినువరకు యీాయనకు వ్యవధిలేదు! కావున, భరతవర్షమునకంతకు న్యాయాన్యాయముల తీర్చిదిద్దుటకై శ్వేతద్వీపమునుండి దిగివచ్చిన మహా న్యాయమూర్తియే తాననునట్లుగ అతడీ వాఙ్మూలముల నన్నింటిని పుచ్చుకొని జేబులో వేసికొనిపోయెను. "కుత్సితమగు తన యున్నతాధికార వ్యభిచారము నిట్లు సమాప్తినొందించుకొని" యింపే సరాసరి మరల పల్లకీనెక్కి కలకత్తా చేరెను. ఈ సందర్భమం దీతని ప్రవర్తనను గూర్చి మెకిడక్ అను ఆంగ్లమహాకవి యీ రీతిగ వర్ణించెను. ఆవర్ణన చిరస్మరణీయముగ నుండతగినది. "ఆతడు ధర్మమును, గౌరవమును, తృణప్రాయముగ గంగలో కలిపివేసెను. భారతవర్షమునిక యథేచ్ఛగ, గొంకుజంకులేక కొల్లగొట్టుకొనవచ్చు నోహో యనిచెప్పి భావిసంతతులవారికి మహోద్ధతితో జాటిచెప్పెను. లోగడ నొనర్చిన దురాగతములన్నియు మంచివేయని యామోదించెను. ఇట్టి మహోద్యోగముతో హేస్టింగ్సుకు పక్షపాతియగు యీ న్యాయమూర్తి ఆరోగ్యానందముల ననుభవింప విహారము వెడలెను." ప్రహసనము ముగిసినది. విషాదరంగములు ప్రారంభమైనవి.

ఫైజాబాదు పట్టణమున యీ ముసలిరాచబూబులు

కాపురమున్న దివ్యప్రాసాదమును ఆంగ్లసేనలు ముట్టడించెను. "మీరుమాకు ఖైదీలుసుమా" యని యీబూబులకు కబురు వెళ్ళెను. "మీవద్దనున్న బంగారము, నగలు, అక్కడ పెట్టండి" అని ఆంగ్లసేనలు హుంకరించెను. "మానగలను, బంగారమును మేము యివ్వము" అని యీ ముసలమ్మలు తిరస్కరించిరి. అంతట మేడలోనికి తినుబండారములు పోకుండనాపివేసిరి. లోని జనమంతయు తిండిలేక మాడిరి. లోని నౌకర్లనందరిని బహు భంగుల చిత్రవధ గావించిరి. నగరు లోని వారల రోదనములను, హాహాకారములను, కన్నీటి ధారలను కనివినుటకు భరింపనోపక, పాపమా ముదుసలి రాణులు తమ నగలపెట్టెలను చందుగాలను ఒక్కటొక్కటే యిచ్చివేసిరి. ధన ధాన్యాగారములను ఒక్కటొక్కటే శత్రుమూకలకు ఒప్పగించివేసిరి. ఈరీతిగ ఆముసలమ్మలనుండి దోచుకొనిన మొత్తమంతయు ఒకకోటి యిరువై లక్షలుండును. డబ్బునంతను అక్కడ పెట్టువరకు దౌర్భాగ్యులగు వారి నౌకర్లను వదలిపెట్టలేదు. ఈ భయానకపు దోపిడీలో జరిగిన వింక నెన్నియో దురంతరములు గలవు. కాని వానినన్నిటిని వివరింపక టూకీగామాత్రమే చెప్పితిని. ఈకథకంతకు నిజమగు రంగు నివ్వజాలిన వివరములన్నియు యింక నెన్నియో తెర మరుగున నున్నవి. ఇప్పుడా తెర నెత్తువారెవరు? ఈ దోపిడీ జరుగుచున్న సమయమునందు అయోధ్య ప్రజల మనోభావము లెట్లుండెనో ఎవరుచెప్పగలరు! ఇట్టిసిగ్గుమాలిన కూటికియ్యకొనిన అసఫ్-ఉల్-దౌలాకు కూడ కడపటికి ఉభయభ్రష్టత్వమయ్యెనని మాత్రము మన మెరుంగుదుము. అంతటినుండియు

ఆతని రాజ్యమునకు కళకాంతులు తగ్గెను. తన ప్రజలయందా తనికి గౌరవము, పలుకుబడి పోయెను. తరువాత కొన్ని సంవత్సరములకు వైస్రాయిగవచ్చిన కారన్‌వాలిసు ప్రభువు అయోధ్యపట్టణమును జూడబోయినపుడు, వజీరాతనికి తగు సన్మానగౌరవములు జేసినను, దేశముమాత్ర మెటుజూచినను, పాడై, దగ్ధమైపోయినట్లు ఆతని కండ్లకు గన్పట్టెను. ఇట్టి దృశ్యమాతని మనస్సునకే యెంతయో గాఢవిషాద వేదనను గలిగించెను. "ప్రజలయొక్క యీ దుస్థితిమాన్పి, వారిని బాగుపరచుటకు మీరు కొంచెమేదైన చేయరాదా! ఏల చేయజాలకున్నారు" అని కారన్‌వాలీసు ప్రభువు నెమ్మదిగ అయోధ్య వజీరు నడిగెను. దానికి నవాబు యిట్లని సమాధానము చెప్పెను. "నా రాజ్యములో నాకువచ్చు రాబడిలో నుండి, యింగ్లీషు గవర్నమెంటువారు యెప్పటికప్పుడు తమ యిచ్చవచ్చినంతడబ్బు లాగికొనిపోవుచున్నంతకాలము, నేనిక యెంత పొదుపుగనున్న నేమిలాభము? నాకు మితవ్యయము నందు వాంఛ యేలయుండును! నారాజ్యపు ఆంతరంగిక పాలనమునందు మీ యింగ్లీషువారు చీటికిమాటికి జోక్యము కలిగించుకొనుచున్నంతవరకు, నేను నా ప్రజల శ్రేయస్సునకనువగు నూతన సంస్కరణముల ప్రవేశపెట్టజూచుట కేవలము నిష్ఫలము. ఏలననగ, నారాజ్యములో నాకేమి అధికారము లేదనియు, నేను మీ చేతులలో వట్టి పిండి బొమ్మననియు నా ప్రజలెరుగుదురు. అందుచే వారు నన్నుగాని నా మంత్రులనుగాని లక్ష్యముచేయరు. వారు మమ్ములను గడ్డిపోచగ చూతురు.

# భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన

## పదకొండవ అధ్యాయము.

### హైదరాలీ — మైసూరు

" ఎట్టి వాగ్దానములుగాని, యెట్టి యొడంబడికలుగాని, యెట్టి చేవ్రాళ్ళుగాని, నిర్బంధింప నట్టియు, మానవ సంబంధమునకే శత్రువులుగ నున్నట్టియు, యీ మనుష్యులతో (ఇంగ్లీషు వారితో) తాను వ్యవహరింప వలసి వచ్చెనని తుదకు హైదరాలీకి తెలిసి వచ్చెను. సన్మార్గములకు లొంగని యీ పాపాత్ములచే యావరింపబడిన యీ దేశమునకు తగురీతిని బుద్ధి చెప్పి మానవకోటి కంతయు చిరస్మరణీయమగు దృష్టాంతముగ జేయ సంకల్పించెను. ఈ విశ్వస్థితికి మూలాధారములగు దయాసత్యశౌచాది దైవీ సంపదల యందలి భక్తి విశ్వాసము లే పాపాత్ములయందు చిల్లిగవ్వకయినను పనికిరావో, యట్టి (ఇంగ్లీషు) వారికిని తనకును యెట్టి సంబంధము లేకుండ విడగొట్టుకొని మధ్య నొక యగాధమును గల్పించుకొనవలెనని హైదరాలీ సంకల్పించెను."

— బర్కు

బంగాళా రాజధానియందు కుంపిణీవారు బహు జయోత్కర్షతో గావించిన పరరాజ్యాక్రమణలనుమించి తాము కూడ తమతమ రాజధానులలో వానికంటె యెక్కువగ విజృంభించవలయునని యితర రాష్ట్రములలోగల కుంపిణీ యుద్యోగులును యువ్విళ్లూరుచుండిరి. కాని, తమచుట్టునున్న దేశీయ రాజ్యములు మిక్కిలి బలిష్టములై కుంపిణీ వారికి స్వాధీనములగునట్టివిగ గన్పడకుండెను. కుంపిణీ వారి రాజ్యములపై యెన్నినాళ్లు దండెత్తినను, వారికి తరుచు జయముకంటె అపజయము, నష్టము యెక్కువగ గలుగుచుండెను. ఒలందాలు (డచ్చివారు) బుడతకీచులు (పోర్చుగీసులు) పరాసులు (ఫ్రెంచివారు) ఆంగ్లేయులు— వీరందరు హిందూ మహమ్మదీయ ప్రభువుల ప్రాపకమును ఒకరికంటె నొకరు యెక్కువగ సంపాదించుకొనుటకై ప్రాకులాడు చుండిరి. దీనికొరకయి నిరంతరము వారనేక కుట్రలను, మాయోపాయములను పన్నుచుండిరి. ఎడతెగక జరుగు యీ పోరాటములను, మన కుంపిణీవారు తాంత్రికులగు దేశీయరాజులతోడను, నవాబులతోడను మాత్రమేగాక, ఫ్రెంచి పోర్చుగీసు మొదలగు యితర యూరోపియను కంపెనీల వారితో కూడ గావింపుచుండిరి.

ఫ్రెంచివారికిని, యింగ్లీషువారికిని అప్పుడు జరుగుచుండిన యుద్ధము ప్యారిసు సంధితో నంతమయ్యెను. కాని యీ సంధి ఫలితముగ తూర్పుతీరమందు లోగడ ఫ్రెంచివారికుండిన గొప్ప ప్రదేశములలో నించుక-హతశేషమైనను- వారికి మిగులలేదు. ఆకాలమందు ఫ్రెంచి దేశములలో 15 వ

లూయీరాజు రాజ్యమేలుచుండెను. అతని రాజ్యపాలన మిక్కిలి దుర్భరమై సర్వభ్రష్టముగ నుండెను. అందుచే ఇండియాయందు గోల్పోయిన స్థానములను తిరిగి సంపాదించుకొనుటకు అతడెట్టి ప్రయత్నమును జేసియుండలేదు. అందుచే ఫ్రెంచివారికి చిరశత్రువులగు ఆంగ్లేయుల పతాకము లిప్పుడు ఒకప్పుడు ఫ్రెంచివారికి నిలయములైయున్న దుర్గములపైనను, క్షేత్రములపయినను ప్రశాంతముగ నెగురుచుండెను. ఏకోటల యాధిపత్యమునకై చిరకాలము ఆంగ్ల ఫ్రెంచి సేనలు పరస్పర జయార్థులై హాహాకారములతో పోరాడుచు రక్తప్రవాహముల పారించుచుండిరో అట్టి పరాసుకోటలపై నేడు ఆంగ్లపతాకము హాయిగ స్వైరవిహారము చేయుచుండెను. అంతయేల, తూర్పుతీర మందెచ్చటగాని, విజేతలగు మన ఆంగ్లేయులు భయపడవలసిన వారెవరును గానరైరి. మచిలీపట్టణము మున్నగు నైజాముయొక్క సముద్రతీరపు పరగణాలన్నియు యిదివరకే యింగ్లీషువారివైపోయెను. మదరాసు చుట్టు నున్న చెంగల్పట్టు పరగణాలు యావత్తు కర్నాటక నబాబు నుండి గైకొనబడెను. పశ్చిమతీరముననున్న సూరతు, సాలిసెట్టి, పట్టణములు యిటీవలనే మహారాష్ట్రులనుండి లాగికొనబడెను. ఇదంతయుజూచి సింహళద్వీపము నందున్న తమ స్థానములకేమిముప్పు వచ్చునోయని ఒలందాలు (డచ్చివారు) భయపడసాగిరి. దక్షిణాపథరాజ్య సింహాసనమునకై ముగ్గురన్నదమ్ములు 1766 వ సంవత్సరములో పోరాడుకొనసాగిరి. తాను జయించిన యెడల సర్కారులనబడు అయిదు సముద్రతీరపరగణాలపైవచ్చు శిస్తులో సగము యింగ్లీషువారి కిచ్చి,

వారి సహాయమును కొనుక్కొందమని యీ ముగ్గురు వెగ బడిరి. తుదకు ఆభాగ్యము ముగ్గురన్నదమ్ములలో నైజాం ఆలీ అను వానికి లభించెను. కాని, మహారాష్ట్రుల యొత్తిడికి ఆగలేక యెల్లరి కాంక్షకు పాత్రమైన యీ జిల్లాల నైదింటిని హుస్సేను హాలీ అనువాని చేతిలో నుంచునట్లును, దానిపై వచ్చు రివెన్యూను వసూలు చేయుటలో కుంపిణీవారు సహాయపడు నట్లును నైజాం ఆలీ అంగీకరించెను. ఈ లోగా ఈ ఐదు జిల్లాలను సర్వ సంపూర్ణాధికారములతో కుంపిణీవారి కిచ్చి వేయునట్లు ఒక సన్నదును క్లయివు రహస్యముగ ఢిల్లీ నుండి తెప్పించెను. కాని యీ సన్నదును క్లయివు నెమ్మదిగ బయట పెట్టినపుడు నైజాం ఆలీ దానిని అంగీకరింపనని తిర స్కరించెను. మంతాంగములతో కొంతసేపు, బెదరింపు లతో కొంతసేపు, ప్రయోగములు జరిగిన పిమ్మట యెట్టకేల కొక సంధి జరిగెను. ఉత్తర సర్కారు లనబడు యీ 5 జిల్లా లపై పన్నులను విధించి వసూలుచేయు నధికారము మదరాసు రాజధానిలోని కుంపిణీవారి కొసంగబడెను. దీనికి ప్రతిఫల ముగ కుంపిణీవారు నైజామాలీకి కొంత కప్పము గట్టునట్లును, శత్రువు లెవరయిన అతనిపైకి వచ్చి నప్పుడు ప్రతి సమయమునందు కుంపిణీ వారాతనికి సహాయ పడునట్లును ఒడంబడిక జరిగెను. ఇందలిషరతులకు భంగము కలుగు నెడల యీ జిల్లాలపై కుంపిణీవారి కొసంగబడిన యధి కారము పోవునట్లేగదా నిర్ణయము! యిది సంధియందే ఒప్పు కొన బడిన విషయము! కాని నాటినుండి నేటివరకు కూడ కుంపిణీవారి కొసంగబడిన యీ హక్కు సర్వ సంపూర్ణాధి

కారములతో గూడుకొన్న హక్కేయని భావింపబడు చున్నది !

కోస్తాపరగణాను నిలుపుకొంటినను అహంభావము పాప మొక్క-దేశీయ రాజ్యమునకే యెట్లోమిగిలియుండెను. అదే మైసూరురాజ్యము. నిజమునకు అంతగ చెప్పుకొన దగినంత నౌకాదళమేమియు మైసూరు రాజ్యమునకులేదు. అట్టిదానిని నిర్మించుకొనగల సాధనసంపత్తియు మైసూరుకు లేదు. అయిన నేమి ? లోకములోగల సమస్త రాజకీయ వాణిజ్యాధిపత్య ములును, పరులకెవరికి లేకుండ తామొక్క-రికే దక్కించుకొన వలెనని జూచు యీర్ష్యాచక్షువులకు యెట్టియనుమానము లయి నను గాన్పించును. మైసూరుకు యీ మాత్రము కోస్తాయున్న యెడల- యేమో- రేపేయుపద్రవమైనను తమకుంపిణీకిరావ చ్చును ! కాబట్టిమైసూరుతో యేదోగిల్లి కజ్జాపెట్టుకొని, అకో స్తానుకాస్తా కాజేయ వలెను. లోగడ మైసూరుతో అనేక తగా దాలు వచ్చెను. కాని 1767 సంవత్సరము వరకు ఆరాజ్య ములో ప్రవేశించుట కెవరును సాహసింపలేదు. అప్పుడా సంవత్సరము నందొక యింగ్లీషు సైన్యదళము కర్నలు స్మిత్తు అనువాని యాధిపత్యమున ఆకస్మికముగ కర్నాటక రాజ్యపు దక్షిణ పొలిమేరనుదాటి మైసూరు రాజ్యములో ప్రవేశించి అందు ప్రధానమును, భాగ్యవంతమునునగు బారామహల్ పరగణాను పట్టుకొనెను. ఆంగ్లసేనలు ఆ సంవత్సరమందే యేల మైసూరు రాజ్యములో ప్రవేశించెను, అంతకు క్రిత మేల ప్రవేశించలేదు, అను ప్రశ్నకు సమాధానమేమి ? ఆంగ్లేయుల పరరాజ్యాక్రమణను యెట్లయిన సమర్థింప కంకణ

ము గట్టుకొన్నవారిలో నాధునికుడగు తారన్‌టన్ (చరిత్రకారుడు) కూడ యీప్రశ్నకు సమాధానము చెప్పలేనని తన యసమర్థతను వెల్లడించెను. యీ విషయమై ప్రత్యేక మొక గ్రంథము వ్రాసినను, యీ నాటక మందు జరిగిన వివిధ సంభవముల కూర్చిగాని, అందుచరించిన పాత్రలయొక్క మనో భావముల గూర్చిగాని, సంతృప్తి కరమగునట్టి, స్ఫుటమగునట్టి వివరణ వెలువడజాలదు. ఆకాలమందు మదరాసు ప్రభుత్వ ముగ నేర్పడిన ఆంగ్లేయోద్యోగులు తామేమి జేయుచున్నారో తమకే తెలుసునో తెలియదోయని యనుమానింప వలసి యున్నది. ఆసంగతి వారికే తెలియనప్పుడు యిక పరుల కెట్లు తెలియగలదు ? ఇతరులకది యభేద్యమగు రహస్యము గనే యుండి తీరవలెను.

బారామహాల్ పరగణా మైసూరు రాజ్యములోని కెల్ల మిక్కిలి ఫలవంతమైనది. దీనిద్వారా దేశమధ్యమందున్న మైసూరురాజ్యమునకు సముద్రమందు ఘాటులో నుండెను. చిరకాల గృహకల్లోలము వలన హిందూసంస్థానమగు మైసూరు రాజ్యము దుర్బలమై పోయెను. అదృష్టవంతుడగు నొకా నొక మహమ్మదీయ యోధుడు తద్రాజ్యాధిపత్యమునకు వచ్చుటకు అవకాశమేర్పడెను. అతనిపేరే హైదరాలీ. రాచరిక బంధనపు డాబు దర్పము లింకను హిందూరాజే వహింపు చుండెను. కాని, రాజ్యాంగ మంతయు ప్రధానమంత్రియు సర్వ సేనాధ్యక్షుడును నగు హైదరాలీ వలననే నడుప బడుచుండెను. నిజమున కాతడే రాజ్యాధిపతిగ నుండెను. అతని కెదురు పల్కు వారెవరును లేరు. ఈతని అన

మాన ప్రజ్ఞను, బుద్ధివిస్ఫారతను, గుణశీలములను పూర్తిగ దెలిసి కొనుటకు తగినన్ని యాధారములు మనకిప్పుడు లేవు. అయినను యోధనాయకుడుగను, ప్రజాపరిపాలకుడుగను ఆతడు సామాన్య సమర్థత నధిగమించి బహు అరుదుగ పయికి వచ్చు రకము పురుషులలో చేరినవాడని నిస్సంశయముగ వక్కాణించుటకు తగినన్ని యాధారములుగలవు. పూర్వపు కట్టుబాటులు, ఆచారములు కాలగతిని శిథిలీభూతములై, దేశ మందరాచకము పొడసూప నారంభించినపుడు, దానికను వగు క్రొత్త కట్టుబాటులను నూతనముగ నిర్మించి, రాజ్యము యొక్క బలము సడలకుండ చేయగలనేర్పు, శక్తి, హైదరాలీకి గలదు. యుద్ధసమయము లందేమి, శాంతిసమయము లందేమి, తగు కట్టుబాటుల నొనర్చి, కాలగతిచే నరిగిపోయిన పరిపాలనా యంత్రమునకు క్రొత్తచేవ నొసంగగల సామర్థ్య మాతనివద్ద కలదు. పరరాజుల దండయాత్రాదులచే తన రాజ్యమునకు ముప్పము రాకుండ కాపాడుటకును, రాజ్యము యొక్క ఆంతరంగిక సాధన సంపత్తులను పెంపొందించుటకును, ఆతడు పాశ్చాత్యాది విధానములను, యుక్తులను బహుచాక చక్యముతో, నిపుణతతో, జంకుగొంకు లేక నవలంబించు చుండెను. ఆతని యుత్సాహము, కార్యదీక్ష, మనస్థైర్యము, సాహసము, వీనియన్నిటికంటె యెక్కువైనది సహజమగు ప్రజాకర్షణశక్తి, యివి యన్నియు హైదరాలీయందు మూర్తీభవించినవని ఆతని శత్రువులే యొప్పుకొనిరి. తరివేచి, తుదకు వంచించి, దుర్బలక్షణిక మందాతని నొడిసిపట్టినను సదా యేశత్రువు లీతనిపేరు విన్నంత మాత్రమున గడగడ

వణంకు చుండిరో అట్టి శత్రువులే పైన వర్ణించిన యాతని సుగుణసంపత్తిని పూర్తిగ నంగీకరించి యుండిరి. చిరవ్యాప్త మైనట్టియు, బహుఅవాంతరదశలకు లోనైనట్టియు, నాతని జీవితముగూర్చి "ఆతతాయిత్వము" క్రౌర్యము, మున్నగు నట్టి నీచవిశేషముల ప్రయోగించినను, అన్యాయము కాదన వచ్చును! కాని యశిక్షితమగు నాతని సహజబుద్ధి విస్ఫారతచే నాతడు స్వీయముగ కల్పించుకొనిన రాజనీతివిధానము యొక్క యవాశితగతిచే నాతని యౌద్ధత్యము పెచ్చుపెరిగి 1767 సంవత్సరములో చుట్టు పట్టులనున్న రాజ్యముల వారికి కూడ కొంత కంపమును గలిగించెను. ఈతని నుపేక్షించిన నిక లాభము లేదని వారికి తోచెను. మహారాష్ట్రులకును, నైజామునకును, అసాధ్యుడగు నీతనితో కొన్ని తగాదాలు కలిగెను. కాని, మన కుంపిణీవారికి మాత్రమాతనితో యింతవరకు ఘర్షణ కలుగలేదు. అదికాక, యింతవరకు కుంపిణీవారీతనితో మంచిమాటలమీదనే యుండిరి. ఇరువురకు మిక్కిలి మైత్రికూడ నుండెను. కాని, రానురాను యిటీవల కుంపిణీవారి కీతనిపై నిజముగ గౌరవము తగ్గెను. కాని, దానిని పైకిమాత్రము కనబడనీయక యిదివరకుకంటె ఎక్కువ గౌరవము, మర్యాద యున్నట్లు పైకి యెక్కువ ఆడంబర ముగ నటింపసాగిరి. ఈ నటన రాజ్యతంత్రప్రవీణులకు సహజముగద! ఒకరినొకరు హత మార్చుటకు లోలోన పన్నుచుం డిన పన్నుగడలు పరిపక్వదశకు వచ్చుచున్నకొలది పైపై గౌరవములు, మర్యాదలు, పరస్పరము యెక్కువగుచుండు

నట! ఈ లక్షణముల తేటపరచు నుత్కృష్టనిదర్శనము లీ చరిత్రయందు మున్ముందు తగులకపోవు.

హైదరాలీ మీాద కుంపిణీవారి కెట్టి వ్యథాకారణమును లేదు. కాని, ఉత్తర సర్కారులు తమ కిచ్చునట్లుగను, అందుకు ప్రతిఫలముగ కుంపిణీవారు నైజమాలీకి తోడ్పడు నట్లును లోగడ ఒడంబడిక చేసికొని యుండిరిగదా! కాబట్టి దానియర్థమేమి ? నైజాముకు విరోధులగు మైసూరు వారితో కుంపిణీవారుకూడ విరోధము వహించవలెనని యర్థము కాదా? ఆయర్థము ననుసరించియే కుంపిణీవారు మైసూరుతో విరోధము వహించిరి. మైసూరును హైదరాబాదును పోరాడుకొనుచున్న యీా సమయమందే మైసూరు రాజ్యములో చేరిన "బారా మహాల్" పరగణాను పట్టుకొన్న యెడల తమకు మిక్కిలి వాటముగ నుండునని కుంపిణీవారు తలంచిరి. మహారాష్ట్రులును, నైజామును ఏకమై తమమీాదికి వచ్చుటచే మామూలుగ హైదరును వరించుచున్న విజయలక్ష్మి యీా సమయమందాతనిని త్యజించునట్లుగ గాన్పించెను. శత్రువులు మైసూరు రాజ్యమును ఉత్తరమునుండియు, తూర్పునుండియు ఏకకాలమందే ముట్టడించిరి. హైదరాలీ యొక్క సాధన సంపత్తి యింకను అపారముగనే యుండెను. అయినను పరులసహాయములేక తానొక్కడే సంరక్షించుకొనవలసివచ్చిన తన రాజ్యమును శత్రువులు యిరుప్రక్కలనుండి యేక కాలమందే పొదివి ముట్టడించుటచే యీా యపాయమును నివారించుకొనుట కాతనికి తన సాధనసంపత్తిని యావత్తు ఒక్కసారియే రణరంగములోకి తీసుకొని రావలసి వచ్చెను. ఆతనికి కలిగిన

యీ సంకటసమయమును కనిపెట్టి ఆతని రాజ్యముపై ఆకస్మికముగపోయి పడుటకిదియే మంచితరుణమని మదరాసులోని కుంపిణీవారు తలంచిరి. ఈరీతిగ మైసూరురాజ్యముపై పడుటకు తమ సేనలను కదిలించు క్షణమువరకు కుంపిణీవారు అసాధ్యుడగు తద్రాజ్యాధిపతితో (హైదరాలీతో) మెట్టి కలహములేక శాంతితోనుండుటయే గాక, తత్పూర్వమొనర్చుకొనిన యొడంబడికల ననుసరించి స్నేహపాశములచే సైతము బద్ధులై యుండవలసి యుండెను. అయిననేమి? ఈ యొడంబడికలు యీ సంధులు ఒక లెఖ్ఖయా? హైదరాలీయిప్పుడు మైసూరుకు రాజేయైనను ఆతడిదివరకున్నంత యసాధ్యుడుగ యిప్పుడులేడు. అతని యుద్ధతి తగ్గిపోయినది. ఈ స్నేహితుని రాజ్య మిప్పుడొక ప్రక్కను బలవంతులగు శత్రుమూకలకు గురి గానున్నది. ఈ స్నేహితుని రాజ్యమును "లటుక్కున" దిగమింగుట కిదే మంచి సమయము! "హైదరాలీ మనకు మిత్రుడనియు, ఆతనినిద్రోహము చేయరాదనియు, మిత్రద్రోహము పాపమనియు యిట్టివెట్టిమొట్టి వేదాంతములనమ్మి యీ మంచిఅమృతతుల్యమగు ముహూర్తమును పోగొట్టుకుందుమా? హైదరాలీని శత్రువులిప్పుడు తల దిమ్మెత్తునట్లు దెబ్బలు కొట్టుచున్నారు. ఈ దెబ్బలనుండి ఆతనిని మనము తేరుకొననివ్వవచ్చునా? అదిగాక, యీ యల్లకల్లోలములో సర్వమును మహారాష్ట్రులే కొల్లగొట్టుకొని పోదురేమో? అంతయు మహారాష్ట్రులే యెత్తుకొనిపోవువరకు మనము దేబలవలె చేతులు ముడుచుకొని కూర్చుండవలసినదేనా?" అని తల పోయుచు, యీ యవకాశ మెక్కడజారిపోవునో యని మద

రాసు గవర్నరును, ఆతని యనుచరులును బహుమెళుకువతో గోతికాడి నక్కలవలె పొంచియుండిరి.

ఈ యాలోచనప్రకారము, తమకు మిక్కిలి యందు బాటులో నున్నట్టియు, తగురక్షణలేకుండ నున్నట్టియు, మిక్కిలి సారవంతమై తాము వాటముగ కాజేయదగినట్టియు, బారామహాల్ పరాగణాను కాజేయుటకు కుంపిణీవారు నిశ్చయించుకొనిరి. "ఈ బారామహాల్ పరగణాను యిక మనరాజ్యములోనిదిగ లెఖ్ఖ జూచుకొనవలసినదే" యని కుంపిణీవారు ఉవ్విళ్ళూరిరి. కాని, భారతీయ రణరంగము లందు తరచుగ జరుగుచుండు ఆకస్మిక పరివర్తనములలో నేదో యొకదానివలన హైదరాలీకి తనదేశీయ శత్రువులగు నైజాము, మహారాష్ట్రులబారినుండి కొలదికాలములో విముక్తిగలిగెను. కాన, ఆతడిప్పుడు తనదృష్టిని యావత్తు తన విదేశీయ "స్నేహితు" లగు కుంపిణీవారిపై బరపుటకు పూర్తియగు అవకాశముచిక్కెను. అంతట నాతడు యితరవ్యవహారములన్నిటిని కట్టిపెట్టి తక్షణమె దారుణోద్వేగముతో కుంపిణీవారిపై నుంకించి "యింకమీరు- మీబోటి మిత్రులు- నాదేశమును చూడవలసినంతవరకు చూచినారు. చాలు, యింక నడవండి" అని వారికి నసాళమంటునట్లు చెప్పుటయేగాక, వారిని అసాధారణ సన్మానములతో వెనుకకు తిరిగిచూడకుండపారి యింటిలోదూరువరకు వారినివిడువకుండ తరుమునట్లు నిశ్చయించుకొనెను. ఆతడీరీతిగ మనస్సులో నిశ్చయించుకొన్న ప్రకారము, ఒకక్క అక్షరమైనను తప్పకుండ చేసితీరెను. పాపము, బారామహాల్ పరగణాను కులుకుచు ఆక్రమించుకొ

నిన కుంపిణీవారిపై యింకను బలవంతుడుగ నుండిన హైదరాలీ యొక్క క్రోధోద్రేకమంతయు ఒక్కుమ్మడి సుడిగాలివలెవచ్చి విరుచుకుపడెను. హైదరాలీ కుంపిణీవారిని అడుగడుగునకు నిలువనీయక, ఒకచోటినుండి యొకచోటికి ఊపిరి సలుపకుండ కొట్టి కొట్టి, తరిమి తరిమి, వెన్నంటుచుండగ, కుంపిణీసైన్యములు భీతావహములై చీకాకుపడి యెక్కడివక్కడ చెల్లాచెదరై పోవుచుండగ, వారిని వెన్నుత్రిప్పకొననీయక మైసూరు రాజ్యపు పొలిమేర దాటకొట్టి, యింకను వదలక తరుముచు రాగా, కుంపిణీసైన్యములు, కొండలనక, వాగులనక, తల్లక్రిందుగ బడివచ్చుచు, భారమగునష్టములతో, సంపూర్ణ పరాజయముతో, ఏకపరుగున చెన్నపట్టణము వద్దనున్న సెంటు తామస్ గుట్టవద్దకు వచ్చిపడిరి. హైదరాలీ వీరినందరిని మదరాసు కోటగోడక్రింద నిలువబెట్టి తన యిచ్చ వచ్చిన షరతులతో, క్రొత్త సంధిపత్రము వ్రాయించెను. ఆ పత్రమందీ షరతుగలదు— "పరదేశపు శత్రువు లెవరైన మైసూరు రాజ్యముపై దాడి వెడలినపుడు, కుంపిణీవారు మైసూరుకు ఏడు సిపాయిదళముల నీయవలెను." ఇది ప్రమాణ పూర్వకముగ నంగీకరింపబడిన షరతు. పొడవడగి, శృంగభంగమునొంది, తనచే ముట్టడింపబడియున్న కుంపిణీవారి వలన హైదరాలీ యీ షరతును బలాత్కారముగ నొప్పింప జేయుటవలన కుంపిణీవారి కెంతయో తలదీసినట్లయ్యెను. కాని యీ షరతు తుదకు కుంపిణీకిని హైదరుకును మాత్రమే గాక యావద్భారత ప్రజలకును మరువదగని విధముగ పరిణమించెను. ఈ పోరాటమువలన తన రాజ్యమునందు కొంత

వరకు వట్టిపోయిన సాధనసంపత్తిని తిరిగి పూరించుకొనుటకు హైదరాలీకి కొంత విశ్రాంతి దొరకునప్పటికి 1768 సంవత్సరము పూర్తియయ్యెను. రాజ్యమును ప్రశాంతముగ పాలింప సమకట్టునప్పటికి, అప్పుడే మహారాష్ట్రసేనలు మరలవచ్చి తనపొలిమేరలో విడిసెను. కావున యిప్పుడాతడు సహజముగ చేయవలసిన పనియేమి! మరాటీదండులు వచ్చి తనరాజ్యములో ప్రవేశించి వినాశమగు యుద్ధవిధానమును ప్రారంభించకమునుపే, సాధ్యమైనచో తన బలప్రదర్శన మాత్రముననే వారిని బెదరించి, వెనుకకు పంపివేయవలెనని హైదరుచూపెను.

ఇందుకుగాను, ఇంగ్లీషువారు పేరునకు మాత్రమేగాక నిజముగకూడ తనకు మిత్రులనియు, వారిసైన్యములు వచ్చిన ఎడల తనను జయించుట కష్టమనియు, మహారాష్ట్రులకు నచ్చజెప్పి వారిని బెదరించి యుద్ధమెట్లయిన గాకుండ జూడవలెనని హైదరాలీ యోచనజేసెను. ఇట్టి యోచనతో మొన్నమొన్ననే తనతో చేసికొనిన సంధిప్రకారము కొలది సైన్యమును తనకు సహాయార్థము పంపవలసినదని హైదరాలీ కుంపిణీవారికి కబురుపంపెను. దానికి బదులుగ కుంపిణీవారిట్లు చెప్పిపంపిరి. "మావద్ద విశేషసైన్యములేదు. మా సాధనసామగ్రియంతయు ఖర్చయినది. మీాకు పనికివచ్చే సిపాయిదళములేమియు మేమివ్వజాల" మని వారనిరి. పరరాజ్యాక్రమణ తలంపేమియు ప్రస్తుతము లేనప్పుడు ఇట్టివేయేవో సాకులెల్లప్పుడు తయారుగ నుండును. కాని, యేదైన దేశము నాక్రమించుకొనుటకుగాని యిరుపురిమధ్య చేరి తంత్రములు పన్నుటకుగాని యేమాత్ర మవకాశమున్నను అవి యెంత

అపాయకరమైనను, తత్క్షణమే తగు యుద్ధసామగ్రిని శిపాయిలకు సమకూర్చుటకుగాను కుంపిణీవారు భూమ్యాకాశములకు తాళము వేయుదురు. కాని యిట్టి మాయమాటలచే మోసపోవువాడు కాడు హైదరు. కుంపిణీవారి నిజాయితీ యెంతవరకున్నదో గట్టిగ పరీక్షించి చూడవలెనని హైదరు నిశ్చయించుకొనెను. "పోనీ, మీరు పెద్ద సైన్యము పంపలేకపోతే కొద్ది సైన్యమునైనా పంపించండి, మీవద్ద డబ్బులేకపోతే సైన్యపుఖర్చు నేనే భరించుకొందును" అని హైదరనెను. కాని, హైదరు కోరిన కోర్కెలనన్నిటిని కుంపిణీవారు యేకరీతిని నిరాకరింపుచు వచ్చిరి. హైదరాలీకి ఒక్క సిపాయినైనను పంపక కుంపిణీవారు తమసేనల నన్నిటిని కోటలో దాచిపెట్టుకొని తాళము వేసికొనిరి.

ఈలోగా మహారాష్ట్ర సైన్యవాహినీ తరంగములు సకల సస్యసంపద్భరితములగు మైసూరు రాజ్యపు లోయలలో నుండి అవిచ్ఛిన్నముగ వచ్చి పడుచుండెను. కొండలయందనుద్దండులై యుండు నీ మరాటీ దండులు మైసూరు రాజ్యములోని ఒక్కొక్క పరగణాపైననే వచ్చి పడుచుండిరి. అప్పటికి హైదరాలీకి వృద్ధాప్యదశ ప్రాప్తించెను. అయినను ఆతడీ మరాటీ మూకలనెల్ల నతిక్రమించి వారి ననేక పోరాటములలో నోడించి వెనుకకు మరలగొట్టెను. కాని ప్రయోజనము లేకపోయెను. వారు దేశములో వచ్చినప్పుడెట్టి నష్టము గావించిరో వెనుకకు పోవునప్పుడును అట్టి నష్టమునే గావించి పోవుచుండిరి. ఈ మరాటీ మూకలు మిడతల దండువలె నసంఖ్యాకము లగుటచే, దేశము నలుగడలగ్రమ్మి నానా

పాడుచేసిరి. హైదరాలీ వారింపదలచుకొన్న కీడునంతను వారు గావించియే వెడలిరి. ప్రతినెల- నెలలతరబడి—బాధా కరములగు యీ పోరాటములు జరుగుచునే యుండెను. ప్రతినెల తనకు సహాయము పంపమని హైదరాలీ మద రాసులోనున్న తన యాంగ్ల "మిత్రులకు" కబురంపుచునే యుండెను. ప్రతినెల వారు పట్టు విడువకుండ తిరస్కరింపు చునే యుండిరి. తమ "మిత్రుని" సహాయార్థమై "ఒకడ్ల మనిషినైనా పంపలేదు." పైపెచ్చు బహిరంగముగ మహా రాష్ట్రుల పక్షము చేరి వారితోకలసి మైసూరు రాజ్యము నంతను పంచుకొని తిందమని ఒక పక్షమువారు పలికిరి. "ఈ వ్యవ హారములలో మనము స్వయముగ జొరబడనేల, కావలసిన పనిని పరులే తీర్చనీ, యీ "మిత్రుని" రాజ్యము పరుల చేతిమీదుగ పలిగిపోవుచుండగ తమాషా చూచుచు నూర కుండ" మని కుంపిణీ ప్రెసిడెంటును కౌన్సిలువారును అభి ప్రాయపడిరి. హైదరాలీ తమ్ముని తరుచుకొనివచ్చి మద రాసులో తమ కోటగోడ క్రిందనే నిలువబెట్టి బలాత్కారపు సంధిషరతులకు ఒప్పించినది మొన్ననే కద! ఆ యవ మానమును కుంపిణీవా రింకను మరువలేదు. తుట్ట తుదకు 1771 సంవత్సరం జూలై నెలలో హైదరాలీ విధిలేక తన రాజ్యములో విశాలమగు కొంత భూభాగ మును భూరిదక్షిణలతోసహా మహారాష్ట్రుల కిచ్చి వేసి, బ్రతుకు జీవుడాయని బయట పడవలసిన వాడాయెను. ప్రాణాంతమైన యీ పాపిష్టి యుద్ధపు బాధనుండి మైసూరు రాజ్యము మెల్లమెల్లగ కోలుకొనుచుండెను. "తనంత వాని

కెట్టి యవమానము గలిగినది గదాయను రోషమాతనికి కుత్తుగ బంటిగ నున్నను—తన్నవమాన పరచిన వారిపై కసిదీర్చు కొందమను తీవ్రదాహ మాతని నెంత లోలోన తపింపజేసి నను—పెక్కు సంవత్సరములవర కాతడు యుద్ధపుమాట తల పెట్టజాలని వాడయ్యెను. స్వల్ప విరామ మాత్రమున తన రాజ్యము కోలుకొనదని యాతడు గ్రహించి, పెక్కు సంవత్స రములవర కాతడు యుద్ధము మాటయే తలపెట్టక, కేవల తటస్థభావము వహించి యూరకుండెను. ఇట్లున్నను, 1777 సంవత్సరములో తన పూర్వవైరులగు మరాటీలు మరల తన రాజ్యముపైకివచ్చి తనను హింసింప సాహసించిరి. తనతో చేసికొన్న సంధిషరతులను చెల్లించక కుంపిణీవారు మాటి మాటికి తప్పించుకొనుచున్నందుకు హైదరాలీకి లోలోన నెంతయో రోషావేశము కుత్తుక బంటిగ రగుల్కొనుచుం డెను. అయినను యీ పర్యాయము కూడ అడిగిచూత మని యాతడు కొద్ది కోర్కెను మాత్రమే కోరెను. "కొంత మందుగుండు సామగ్రిని మాత్రమే పంపవలసినది. దాని ఖరీదు నేనిచ్చుకొందును. ఒక దళము శిపాయీలను మాత్రము పంపవలసినది. వారికగు ఖర్చుకూడా నేనే భరించుకొందును" అని హైదరాలీ కుంపిణీవారికి కబురు పం పెను. ఈ కోర్కెనుకూడ యథాప్రకారము కుంపిణీవారు తిరస్కరించిరి. యోథాగ్రేసరుడును, వయోవృద్ధుడునునగు హైదరాలీ తనకోపము నప్పటికి దిగమ్రింగి, తన్నెదిరింప వచ్చిన మరాటీ మూకలపై గవియ నుంకించెను. మరాటీ సైన్యములు ఆదోని పట్టణమువద్ద మహాయాడంబరముతో

విడిసి యుండెను. హైదరాలీ యీమూకలను ముట్టడించి, సంకుల సమరమందు వారి నోడించెను. మరాటీ సైన్యములు పరాభూతములయ్యెను. చెదరిపోయిన మూకలన్నియు త్వరిత గతిని తమ స్వస్థానములకు పలాయన మయ్యెను. ఆరోజు నుండి తిరిగి మరాటీ సైన్యము లాతని జోలి కెన్నడును రాలేదు.

ఇక్కడ యిండియాలో యీ వ్యవహారములు జరుగుచున్నకాలమునందు, అక్కడ యూరపులో నేమి జరుగుచున్నది ? అమెరికా వలస స్వాతంత్ర్యమునకు ఫ్రెంచివా రంగీకరించిరి. కాని ఇంగ్లీషువా రంగీకరింపలేదు. అందుచే యీ ఫ్రెంచివారికిని, ఇంగ్లీషువారికిని వైరము తిరిగి ప్రజ్వలించెను. ఈ వైరము పురస్కరించుకొని యిక్కడ యిండియాలోని కుంపిణీవారు ఫ్రెంచివారికింకను మిగిలియున్న పుదుచ్చేరి మున్నగు పట్టణములను ముట్టడించిరి. అవియు కొంత నిరోధించెను. కాని తుదకు లొంగిపోయెను. ఇవిగాక, మాహీ యను చిన్నపట్టణ మొకటి ఫ్రెంచివారికి చెందినది మైసూరు రాజ్యమధ్యమందుండెను. దీనినికూడ పట్టుకొనవలెనని ఇంగ్లీషు కుంపిణీవారొక దండును బయలుదేరదీసిరి. ఈ "మహీ" పట్టణమంతప్రాముఖ్యమైనదికాదు. కాని, ఫ్రెంచియోధుడగు "డూప్లే" చే సంపాదింపబడిన యీ పట్టణమును తాము కాజేయుటలో గొప్పగలదని యింగ్లీషువారు తలంచిరి. అదిగాక, యీ సాకుమీద తమ "మిత్రుడ" గు హైదరాలీ రాజ్యముగుండ తమ దండులను నడిపించుకొని పోవుటకు కూడ అవకాశ మేర్పడునుగదా

యని కుంపిణీవారు తలంచిరి. ఇదియు చూడదగిన విషయమే యని వారు తలంచిరి. మాహీపట్టణము మైసూరు రాజ్యమందుండుటచే నది హైదరాలీ సంరక్షణక్రింద నుండెను. అందుచే తమ్ములనీ పట్టణము పైకి పోనిచ్చుట కాతడు బహుశః సమ్మతింపడని కుంపిణీవా రెరుంగుదురు. కావున, దీని కెదురెత్తుగ కుంపిణీవా రొక పన్నుగడ పన్నిరి. హైదరాలీ ఫ్రెంచివారితో పూర్వముకంటె యిప్పు డెక్కువ మైత్రితో నున్నాడని చెప్పి యాతనిపై నొక నేరముపెట్టిరి. దీనియందు కొంత సత్యము లేకపోలేదు. అయిననేమి ? "ఆనాడు 1769 సంవత్సరములో మదరాసు కోటగోడవద్ద గావించుకొనిన సంధిషరతులను కుంపిణీవారు తోసిపుచ్చకుండ నుండియున్న యెడల, హైదరాలీ తమ్మును వదలివేసి, ఇంకొకరితో స్నేహము చేసెడివాడే కాడని" కుంపిణీవారే యొప్పుకొని యున్నారు. అదిగాక యీ 1779 సంవత్సరము వరకు (కుంపిణీవారు మాహీపై వెళ్లదలచు రోజువరకు) ఆతడు ఫ్రెంచివారితో సంధిచేసికొనియే యుండలేదు. కాని యెప్పుడైతే యింగ్లీషుసేనలు మాహీని ముట్టడింపసాగెనో, అప్పుడు హైదరాలీ తీవ్రముగ ప్రతిఘటించెను. కాని తన మాటలను కుంపిణీవారు లక్ష్యపెట్టకపోవుటచే నాత డిట్లు ప్రకటించెను. "మాహీపట్టణమే గనుక పడిపోయినయెడల మీ కర్ణాటక రాజ్యముపై తప్పక దండెత్తుదున"ని ఆతడు చాటి చెప్పెను. ఇప్పటికిని వినక మొండిపట్టున కుంపిణీవారు మాహీపై బడిరి. వీరి ధాటి

కాగలేక మాహీంపట్టణము 1779 సంవత్సరం మార్చి 19 తేదీన పడిపోయెను.

ఇందుపై హైదరు హృదయాంతరాళమందు చిరకాలమునుండియు నణగియున్న క్రోధానలజ్వాల లొక్కుమ్మడి కర్ణాటకరాజ్యముపై గవిసి, ప్రళయాగ్నిభంగి సర్వము దగ్ధపటలమొనర్చి, యింగ్లీషువారికి చెందిన స్థానముల నన్నింటిని భస్మీభూత మొనర్చెను. ఆ భీభత్సము మహాఘోరమని కండ్లార జూచిన ఒక వ్యక్తి వర్ణించెను. తన యావచ్ఛక్తిని వినియోగించి ఆ మహాభయంకరదృశ్యమును వర్ణింపసమకట్టిన యాతని మహాద్భుతకవితావాగ్ఝరి యవిచ్ఛిన్నము, అనశ్వరము. కర్ణాటక రాజ్యపు పొలిమేరను హైదరాలీ అడుగడుగునకు సందులేకుండ ముట్టడించెను. పట్టణములు, పల్లెలు సమస్తము సైన్యములతో నిండి నిబిడీకృతమయ్యెను. ఈ సైన్యపుఖర్చులు యావత్తు యీ గ్రామములనుండి వసూలు పర్చబడెను.

పెద్ద పెద్ద నగరములు సైతము హైదరు సైన్యములకు వశమయ్యెను. ప్రతిచోట పంటచేలు సైన్యముల కాహారమయ్యెను. లేదా తగులపెట్టబడెను. దేశ సంరక్షణ భారము తామే వహింతుమనిచెప్పి దానిని దేశీయరాజుల చేతులలో నుండి తీసికొనిన యీ పెద్దమనుష్యులు కుంపిణీవారు—అనవసరముగ తమ దేశముపై వచ్చిపడునట్లు హైదరాలీని రేపెట్టిన వీరు—అతని నెదురించుటకుగాని, దేశప్రజల సంరక్షించుటకుగాని, యెట్టి యేర్పాటును చేసియుండలేదు. తమ యుపేక్షను — బేజవాబుదారీని — కప్పిపుచ్చుటకై వీరు

తుదకేమి సమాధానము చెప్పిరి? "మాకు చేత కాలేదని" వీరు సాకుచెప్పిరి. ఎంత కుంటిసమాధానము! అంత చేతకానివారేల తీసికొనవలెను? దేశసంరక్షణ గావించు కొనుటకు దేశీయరాజుల కంతటి మహోత్కృష్ట సమర్థత లేదని యనుకొన్నను, తమ దేశమును తాము తమ చేతనైనట్లు పాలించుకొనుటను కుంపిణీవారికంటె వారికే వేయిమడుంగు లెక్కువ హక్కు గలదనియైనను ఒప్పుకొని తీరవలయునుగద! అట్టి దేశీయరాజుల చేతులనుండి ఈ కుంపిణీవారు బలాత్కార ముగ దేశ సంరక్షణాధికారము లాగుకొనిరి; దానికనువగు సాధనసంపత్తికూడ వారినుండి హరించిరి. ఇట్లొనర్చి తుదకు "మాచేతకాదని" కాళ్లుబారజాపి, దేశప్రజల నందరిని క్రూరశత్రువులబారి పడవైచిరి. తమ లోభత్వమువల్లను, అసమర్థతవల్లను దేశమున కనేక యిక్కట్టులను తెచ్చిపెట్టి యవశగతిచే తమ పాలబడిన ప్రజలందరందు మ్రగ్గుచుండగ సంరక్షింపచేతగాక చూచుచు నూరకుండిరి. కుంపిణీవారు కర్నాటక రాజ్యాధిపత్యమును తగుదుమమ్మాయని అన్యాయ ముగ లాగికొనిరి. ఇప్పుడా రాజ్యప్రజలను సంరక్షింప జాలమని సిగ్గులేక యెట్లు చెప్పుకొనుచున్నారు? దీనికి వేరుగ వ్యాఖ్యానము కావలెనా! ప్రజల దుర్దశను గూర్చి తాము విలపించుచున్నట్లు వారు నటించుచు, సీమకు ఉత్తరములు వ్రాసిరి. అందు ప్రజల దుర్దశకు సానుభూతి కోరుచు సీమప్రజల యొక్కయు, ప్రభుత్వము యొక్కయు, కోపము హైదరాలిపై ప్రజ్వరిల్లునట్లుగ పుల్లింగములు పెట్టిరి. కాని స్వదేశ, విదేశ ప్రభుత్వలాభము లందలి తారతమ్యమును

గూర్చి యనుభవ పూర్వకముగ దెలిసికొనిన కర్ణాటక ప్రజల మనోభావములు మాత్రము వేరువిధముగ నుండెను. అవి లిఖిత పూర్వకముగ నున్నవి. వానిని మనమిప్పుడు చూచి తెలిసికొనవచ్చును. హైదరాలీ సేనలు దేశము నెంత భీభత్సమొనరించినను ప్రజలాతనిని దేశవినాశకుడుగ నసహ్యించుకొనిన దానికంటె దేశవిమోచకుడుగనే యెక్కువ స్వాగత మొసంగిరని ఆంగ్లచరిత్రకారుడే వ్రాసియుండెను. ఈ యుద్ధమందు హైదరును గూర్చిన వార్తల తెలిసికొనుటకై ఆంగ్ల సేనానియగు కర్నల్ కాస్బీ యెంత ప్రయత్నించినను, అతనికొక్క కబురైనను దెలియక మిక్కిలి యవస్థ పడుచుండెను. కాని కాస్బీని గూర్చిన వార్తలు యెప్పటి వప్పుడు అడుగు కదలినప్పుడెల్ల హైదరాలీకి తెలిసిపోవు చుండెను. ఆతని ప్రజలాతని కీవార్తలను బహుభక్తి విశ్వాసములతో తెలియ జెప్పుచుండిరి. "హైదరు దేశ ప్రజలను తనకు మిక్కిలి యనురక్తులుగ జేసికొనెననుటలో సందేహ మెంతమాత్రము లేదని" యీ యాంగ్ల సేనానియే యొక ప్రయివేటు ఉత్తరములో వ్రాసియుండెను.

ప్రజలకు హైదరుపైగల యభిమానము స్ఫుటముగ దెలియపరచు యుదంతము నొకదానిని మన్రో వర్ణించియున్నాడు. ఆంగ్లేయుల ప్రధానసేన తమనుండి చెదరిపోయిన "బెయిలి" దళముతో చేరుటకై వెతకులాడుచుండగ ఒకచోట రోడ్డుప్రక్కను మువ్వురు మనుష్యులు కనుపించిరి. "మమ్ములను "బెయలీ" దళమున్నచోటికి తీసికొనిపోయిన యెడల మీకు గొప్పబహుమానము చేయుదును. తప్పుత్రోవకు

తీసికొనిపోయిన మాత్రము మిమ్ములను చంపివేతును " అని ఆంగ్ల సేనాని వారినడిగెను. ఆముగ్గురు దానికియ్యకొనిరి. అంతట ఆముగ్గురి కంఠములకురితాళ్లువోసి పట్టుకొని సేనా ముఖమందు బెట్టి త్రోవజూపుటకై వారినిముందు నడువమనిరి. వారిట్లు నడచినడచి సేననంతను దీసికొనిపోయి ఒక చెరువు వద్ద నిలిపిరి! అక్కడితో రోడ్డు ఆఖరయ్యెను. (ముందుత్రోవ లేదు.) ఆంగ్లసేనాని యాముగ్గురను చంపకయే వదలివేసెను. తమ దేశీయులనుండి యొక్కపీడ్కోలుపు కరతాళమునైనను, ఒక్క జయజయశబ్దమునయినను ఆశించక యీరీతిగ తమదేశ మునకై బుద్ధిపూర్వకముగ- మనస్ఫూర్తిగ ప్రాణత్యాగమునకు సంసిద్ధమైన యీమహాపురుషులముగ్గురి యెడల ఆయాంగ్ల సేనానిజూపిన యుదారతకు మన్రోయంతవానికి కోపము వచ్చెను. దాని నతడుపైకి వెలిబుచ్చకుండనుండలేదు. పర రాజ్య గ్రసన బుద్ధియొక్క విపరీతలక్షణ మిట్టిది. సహజప్రే తమగు స్వదేశానురాగ మట్టిది. ఈ ముగ్గుర యాత్మవితరణ బుద్ధియే " బెయిలీ " దళముయొక్కగతిని నిర్ణయించెనని చెప్ప వచ్చును. ఈ " బెయిలీ " దళము కేవలము బుద్ధిహీనతచే ప్రధాన సేననుండి యెక్కడికో విడిపోయెను. ఇట్లువిడివచ్చిన దళముపై సెప్టెంబరు 8, 9 తేదీలలో హైదరాలీ సేనలు గవిసి తరుమనారంభించెను. అంతట యాదళాధిపతి మిక్కిలి యాతుర ముతో తనయవస్థను గూర్చి ఆంగ్లసేనాధ్యక్షునకు తెలు పుచు, తనకు సహాయము వచ్చువరకు రాత్రులందు ఒక్కభం గిని ప్రయాణములొనర్చుచు, శత్రుబారినుండి తప్పించు కొను టకు ప్రయత్నింతునని వ్రాసికొనెను. అంతట సర్ హెక్టరు

మున్రోకిందనున్న యాంగ్ల సేననంతను "బెయిలీ" దళరక్ష ణార్థమై బయలుదేరదీసిరి. ఆంగ్లసేన యావత్తు "బెయిలీ" దళమెక్కడ నున్నదాయని యిట్లు వెదకికొనుచు పోవుచుండగ రెండవనాటి ప్రయాణములో వారికి దూరమున నెచ్చటనో యెడతెగని ఫిరంగులమోత స్పష్టముగ వినవచ్చెను. ఆప్రదేశ ముతో వారికిదివరకు పరిచయముండి యున్నయెడల, పాపము వారక్కడికి తత్క్షణమే పోగలిగెడి వారే! యుద్ధమును వారిం చుటకు కాకపోయినను, కనీసము పలాయనముగుటలో కొంత కాపుదారీగా నుండుటకైనను వారు "బెయిలీ" దళమునకు కొంత సాయము సేయగలిగెడివారే! కాని, యీ పుణ్యకా లము కాస్తా, త్రోవవెదకుకొనుటలోనే వారికి సరిపోయినది. తుదకది వారికి యెంతశ్రమపడినను దొరకనేలేదు; నిరాశా హతులై అంతట వారారాత్రియే బ్రతుకు జీవుడాయని కంజీవర శిబిరమునకు జేరికొనిరి. అచ్చట ఆరాత్రియే "బెయిలీ" దళపుగతి దుర్గతియయ్యెను. సెప్టెంబరు 10 తేదీ ఉదయము 10 గంటలగునప్పటికి, హైదరాలీ కొమరుడగు టిప్పుసాహెబుచే నడుపబడిన మైసూరుసేనలువచ్చి "బెయిలీ" దళమును నలు ముఖముల క్రమ్ముకొనెను. కాని, యీదళము పాపము చాలసేపటివరకు చెక్కుచెదరక శత్రుసైన్యముల ఘోరతా డనములకు ఓర్చుకొని నిలచెను. ఈ లోపుగ ఎవరైన వచ్చి తమ్ము రక్షింపరాయను నాశయే వారినింతసేపటి వరకైనా నిలువబెట్టెను. కాని యీ యాశ ఎప్పుడైతే నిరాశ యయ్యెనో అప్పుడేవారు కుంగిపోయిరి. తుట్టతుదకు అలసి పోయి, యుద్ధభూమిపై ఒక్కడొక్కడే ఒరగిపోయెను. ఏరణ

క్షోణిపై చెక్కుచెదరక నిలువబడి- మృత్యుముఖ సదృశ్యముగా నాదినమంతయు నసంఖ్యాకములై వచ్చి మీదబడుచున్న శత్రుమూకలనెల్ల ధిక్కరించి యుద్ధమొనర్చుచు శత్రుసేనాసముద్రమందు మునిగిపోయి రేగాని జయింపబడలేదో- అట్టి రణభూమిపై ఒక్కొక్క సైనికుడే యొరగిపోయెను.

హైదరాలీ దండయాత్ర నెదుర్చుట కిక యెట్టి ప్రయత్నమును చేయకయే ప్రధానసేన అతివేగముగ మదరాసునకు పారివచ్చెను. ఉక్కబెట్టు వేసవి యెండలో రోజునకు 39 మైళ్లచొప్పున, యీ సైన్యమును మదరాసునకు పరువెత్తించుకు వచ్చిరి. ఈ గమన వేగపు అలసట కోర్వజాలక " హైలాండు " దళమునకు చెందిన శిపాయిలు రెండువందలమంది మార్గమధ్యమందు పడిచచ్చిరి! ఈ పలాయనములో వారు తమవెంట గొనివచ్చిన సామగ్రిలో ఉపసేనానియగు " మాక్లాడ్ " ప్రభువుయొక్క యుద్ధ వ్యవహారములకు సంబంధించిన కాగితపు దస్త్రములు గలవు. హైదరాలీని వంచి యాతని రాజ్యమునెట్లు గబళింప దలపెట్టినది తెలుపు పతకము లిందుగలవు. ఇట్టి కాగితములే గనుక విజయవంతుడగు హైదరాలీ కంటబడిన యెడల అవి యాతని క్రోధానల మెంతవరకు యుపశమిల్లజేయగలిగెనో విచారించుట అనావశ్యము. నవంబరు 2 వ తేదీని ఆర్కాటు హైదరు మూకలచే ముట్టడింపబడి, యాతని వశమయ్యెను. కాని, పురవాసుల నెవరిని సైనికులు బాధింపలేదు. వారిని దయతోడనే జూచిరి. దోపిడులుగాని తదితర యత్యాచారములుగాని హైదరు సాగనీయలేదు. " ఎవరియాస్తిని వారు

అనుభవింపవచ్చును; పూర్వపు నవాబుక్రింద యుద్యోగము నందున్న వారందరు యెవరి యుద్యోగములలో వారు నిరాక్షేపణగ నుండవచ్చును." ఖయిదీలుగ పట్టుకొనబడిన యాంగ్ల యుద్యోగులకు తమ కవసరమైన వస్తువులు కొనుక్కొనుటకై హైదరు వారికి డబ్బునిచ్చెను. ఆర్కాటు నగరము హైదరు వశమయిన పిమ్మట, తక్కిన చిన్న పట్టణములన్నియు హైదరు పేరు చెప్పినమాత్రమున తమయూరి వాకిళ్ళను తెరచి ఆతనికి స్వాగత మొసంగెను. ప్రజలకు కుంపిణీపైగల యసంతుష్టి నిక యెవరును మరుగు పరచలేదు. 1780 సంవత్సరము నాటికి కుంపిణీవారి యధికారము మదరాసు నగరపు పొలిమేర దాటి కొంచెమైనను ఆవలికి వ్యాపింపలేదు. కాని, జనవరి వసంతర్తువునందు మెట్టదారిని బంగాళమునుండి క్రొత్త సేనలు వచ్చెను; సర్ అయిర్ కూటు అను నాతడు ఆ క్రొత్త సైన్యాధిపతియై హైదరు మీదికి పోవ సాహసించెను. కాని, వయోవృద్ధుడగు నా యోధాగ్రేసరుడు యాంగ్ల మూకలను రెండు పర్యాయములు చావమోదెను. అంతట తిరిగి యథాప్రకారముగ ఆంగ్లసేనలో జాడ్యములు ప్రబలెను. ఈ రోగములతో బాటు కాటకముకూడ సంభవించుటచే, వారిపని మరింత యధ్వాన్నమయ్యెను. వందలకొలది జనులు ప్రతిదినము వీధులలో రోగగ్రస్తులై పడి మరణించుచుండిరి. ఈబాధ నివారింపను దిక్కెవ్వరు లేరు. బ్రతికి యున్నవారైనను నిస్సహాయులై, చచ్చిన శవములపై యాచ్ఛాదనమైనను లేకుండ గుట్టలుగుట్టలుగ పేర్చి, మోసి కొనిపోవు బండ్లవరుసలు కోటలోనుండి బారులుతీరి ప్రతి

నిమిషము బయటికి పోవుచుండగా చూచుచు నూరకుండ వలసిన దౌర్భాగ్యావస్థలో పడియుండిరి. కోటవెలుపల పెద్ద కందకములను త్రవ్వి, యీ బండ్లతో తోలుకొనివచ్చిన శవములనందు కుమ్మరించి పూడ్చివేయుచుండిరి. మృత్యుదేవత యొకప్రక్క నట్లు హైదరుకు శత్రువులైన వారిని తీరికలేకుండ ఫలాహారము చేయుచు, అటు యింకొకప్రక్క హైదరుమీదకూడ చెయ్యివైచుట కెట్లో తీరిక చేసికొనెను. హైదరాలీ యింగ్లీషువారిపై పూర్తిగ — కడుపునిండ — కసితీర్చుకొనెను. అతని యప్రతిమాన ప్రతిభయొక్క ఖ్యాతి మహోన్నతదశ గాంచెను. ఇక యాతడువచ్చిన పని తీరెను. అతని శరీరపాటవము అనన్య సామాన్యమైనను కాలగతిని సడలనారంభించెను. ఏఫీరుని మహోత్కృష్ట ప్రతిభ నీనాటి వారుకూడ అంగీకరింపవలసి వచ్చెనో, అట్టి మహాపురుషుడు హైదరు — యిహలోక సంచారము నికచాలించి తనవద్దకు రావలసినదని యీశ్వరాదేశమయ్యెను.

1782 సం॥ హేమంత ఋతువునందు హైదరాలీ స్వర్గస్థుడయ్యెను. కాని యుద్ధమంతటితో నాగలేదు. మరణ సమయమందాతని కుమారుడు టిప్పుసుల్తాను దగ్గరలేడు. అతడెచ్చటనో 400 మైళ్ళ దూరమున సైన్యశిబిరమునందుండెను. అతడిటవచ్చువరకు హైదరుమరణవార్త నెవ్వరికి తెలుపకుండ నాతనికి పరమ విశ్వాసపాత్రులగు, పూర్ణయ్య, కృష్ణారావు అను యిరువురు బ్రాహ్మణమంత్రు లీరహస్యమును అతిగూఢముగ దాచియుంచిరి.

## మైసూరు ప్రభువులు



హైదరాలీ



టిప్పూ సుల్తాన్—



మైసూరు మంత్రి పూర్ణయ్యపంతులు

పితృపరోక్షమందు టిప్పుసుల్తాన్ లక్ష సైన్యమునకును, మూడుకోట్లు ఖజానాకును, లెక్కింప తరముగాని జవాహిరీకిని యధిపతియయ్యెను. మరుసటి సంవత్సరము వసంతఋతువులో జనరల్ మాత్యూస్ అనువాడు మలబారువైపునుండి మైసూరు రాజ్యమును ముట్టడించెను. ఒకటి రెండు నెలలగునప్పటికి ఓనూరు, మంగళూరు, ఆనపురమను పట్టణములాతని వశమయ్యెను. ఈ ప్రదేశముల నొంచుటలో ఆంగ్ల సేనలు చెప్పతరముగాని క్రూరకృత్యముల నొనర్చెను. ఊరిగోడలోపల కత్తి చేతబుచ్చుకొని కంటబడిన ప్రతివానిని నరికివేయవలసినదని ఒక్కటే ఆర్డరు యివ్వబడెను. ఇట్లే నిరపరాధులగు పురజనులపై గూడ చెప్పతరముగాని ఘోర పీడల గావించి దోచుకొనిరి. ఏల ? సొమ్ము దోచుకొందమను నీచపుబుద్ధిచే కాదని చెప్పవచ్చును. కాని, ఇంగ్లీషు పరిపాలనచే తమ దేశమున కిక కలుగబోవుచున్న మహోత్కృష్టలాభము లిట్లుండును సుమా యని భారతప్రజలకు కొంచెము ముందుగ గట్టిగ చవిచూపించుటకు! ఈ దండయాత్రయందు కుంపిణీవారిచే పట్టుకొనబడిన బెదనూరు పట్టణమును టిప్పుసుల్తాను తిరిగి పట్టుకొనెను. అట్లే మంగళూరు కోటనుకూడ టిప్పుసుల్తాను కుంపిణీవారినుండి యూడలాగికొనెను. అదిగాక, ఆంగ్లసేనను నడిపించుకొనివచ్చిన జనరల్ మాత్యూస్‌ను గూడ ఖయిదీగ పట్టుకొనెను. అతనిని ఖయిదులో చంపించెనని కూడ వదంతికలదు. అతని తరువాత యాంగ్లసేనాధిపత్యమును వహించిన జనరల్ స్టూవార్టు కూడ కుంపిణీవారు కోల్పోయిన ప్రతిష్టను తిరిగి

సంపాదింప లేకపోయెను. ఏపక్కచూచినను ఆంగ్లసేనలు నానాబాధలు పడుచు శతృఖడ్గధారలకు బలియగుచుండెను. ఈ ఘోరబాధను చూడలేక ఒకప్రక్కను యుద్ధము సాగించ వలసినదని కలకత్తానుండి హేస్టింగ్సు యెంత పోడుచుచున్నను వానినన్నిటిని పెడచెవినిబెట్టి పాపము యెట్లయినను టిప్పుసుల్తానుతో సంధి చేసికొని బయట పడుదమని మదరాసు గవర్నరు మకార్ట్నె ప్రభువు ఆతురపడుచుండెను.

1784 సంవత్సరములో సంధిపత్రముపై సంతకము లయ్యెను. ఈ దండయాత్రయందు గైకొనబడిన స్థానము లన్నియు యెవరివి వారికి యిచ్చివేయుటకు యిరువురు ఒడం బడిరి. అంతటితో కుంపిణీవారు, మహారాష్ట్రులు, నైజాము, టిప్పుసుల్తాను, యీనలుగురిచే పాలింపబడుచున్న దక్షిణాపథ ద్వీపకల్పమున కిప్పుడు కొంతకాలము వరకు విశ్రాంతి లభించెను. యిదిగాక చిల్లర రాజ్యములుకొన్ని, పెద్దరాజ్యము లగు యీనలుగురిలో యెవరి చేతిక్రిందనో యొకరి చేతిక్రింద బలాత్కారపు మైత్రితో కలసియుండి నామకార్థపు స్వాతంత్ర్యముతో మెలగుచుండుట కంగీకరింపబడెను. ఈ సందర్భము ననుసరించియే తదుపరి రెండవమైసూరు యుద్ధమున కవకాశ మేర్పడెను.

భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన

## పండ్రెండవ అధ్యాయము.

### పార్లమెంటులో యిండియానుగూర్చిన రెండు పోటీబిల్లులు

### 1782—1786



"వ్యక్తులొనర్చు పుణ్యపాపముల విచారించుట కొక న్యాయాధిపతి గలడు; జాతులొనర్చు పుణ్యపాపముల విచారించుట కొకడులేడా? సాంఘిక రాచకీయ సంఘములు పరస్పర విశ్వాసముతోడను న్యాయముతోడను వర్తింపవలయునని విధించు ధర్మసూత్రమేమియులేదా? ధర్మవిధులు స్థిరములైనవి, అనాదిసిద్ధములైనవి; ఇటీవల మన మేర్పరచుకొనిన యే కృత్రిమ విధానములచేగాని నతిక్రమింపదగనివి.

జె. ఆస్ట్రాధర్.

1782 సంవత్సరారంభమందు సీమవారు అమెరికాదేశము ను గోల్పోయిరి. అందుచే, యిండియా విషయమై సీమ పార్లమెంటువారికి మరింత ఆదుర్దాహెచ్చయ్యెను. అమెరికాను గోల్పోవుటకు అప్పుడు ప్రధానమంత్రిగ నుండిన నార్తుప్రభువే కారకుడు. ఈతడు సకలగుణాభిరాముడు! వాచా

లుడు! ఈతడు బహుకాలము మూడవజార్జిరాజు యొక్క ఆస్థానపు అనుగ్రహమును, ఉభయపార్లమెంటు సభలయొక్క అనుగ్రహమును— సంపాదించుకొనుటకెట్లో నేర్చెను. ఈ మంత్రియొక్క సలహా ననుసరించి సీమ పార్లమెంటువారు తప్పుతోవల బడిరి. అమెరికా దేశము నెట్లైన నిలుపుకొనవలెనను పట్టుదలతో యీతని సలహాపై సీమ ప్రభుత్వము వారు విపరీతపు ధనము వెచ్చించి, పశ్చిమ సముద్రములందును, అమెరికా భూభాగమునందును వల్లమాలిన సిబ్బందీల నిలువబెట్టిరి. కాని, తుదకది యెట్లో నిలువలేదు. అమెరికా వలసల నోంచుటకై కారన్‌వాలీస్ ప్రభువు యాజమాన్యమున పంపబడిన ఆఖరుసేన "యార్కుటౌన్" పట్టణమువద్ద శత్రుసేనలకు లొంగిపోయెను. అదే ఆఖరుదెబ్బ. ఆ దెబ్బతో సీమవారు అమెరికా విపత్తునుండి తెప్పరిల్లుతలంపే పూర్తిగ వదలుకొనిరి. పశ్చిమదిక్కున నిటు శృంగభంగమైన పరరాజ్య గ్రసనబుద్ధి ఒక్కమారిటు తూర్పుదిక్కునకు తిరిగెను. తూర్పున నొక నూతన సామ్రాజ్య ముదయించుచున్నది. దానిని తగు జాగ్రత్తతో పోషించుకొన్నయెడల అది బాగుగ పెరిగి పెద్దదికావచ్చును. కాని, యీ తూర్పు సామ్రాజ్యమందు సైతము అనేక తప్పులు, దుష్కృత్యములు, సాగుచున్నవని నిరంతరము వినవచ్చుచుండెను. అందుచే నాడు 1772 సంవత్సరము నుండి నిద్రబోవుచున్న "విచారణసంఘము" లన్నియు మరియొకసారి మేల్కొనెను. భారతరాజ్య వ్యవహారములను కుంఫిణీవారి చేతులలో వదలివేయక, పార్లమెంటు వారే, నేరుగ వహింపవలయునని నాడే (1772 సంవత్సరము

నసే) మొత్తుకొనిన ఆ మెంబర్ల ప్రోత్సాహమువలననే తిరిగి యిప్పుడు పార్లమెంటువారీ విచారణసంఘములను మేల్కొలిపిరి. భారత రాజ్యవ్యవహారములనుగూర్చి విచారించుటకొరక ప్రత్యేకపు కమిటీ నేర్పరుపవలయునని "డండాస్" అను పార్లమెంటుసభ్యుడు ప్రతిపాదించెను. ఈ కమిటీవారు విచారణచేసి, ప్రచురించిన రిపోర్టులో రంబోల్డు, వారన్‌హేస్టింగ్సు మున్నగువారల చర్యలు బహు తీవ్రముగ ఖండింపబడెను. డబ్బుకు సంబంధించిన వ్యవహారములలోను, న్యాయవిచారణకు సంబంధించిన వ్యవహారములలోను యిక్కడ యిండియాలో కుంపిణీ యుద్యోగులుగావించిన యనేక దుర్మార్గములనుగూర్చి ప్రత్యేకముగ విచారించుట కొరక కమిటీ నేర్పరుపవలయునని "బర్కు" ప్రతిపాదించెను. ఈకమిటీవారు ప్రచురించిన రిపోర్టులో యిక్కడ యిండియాలో సుప్రీముకోర్టు న్యాయాధిపతియైన సర్ ఎలీజా యింపే యొక్కయు, అక్కడ సీమలో కుంపిణీడైరెక్టర్ల సభకు అధ్యక్షుడగు సల్లివాన్ యొక్కయు చర్యలు మిక్కిలి నిర్మొగమోటముగ ఖండింపబడెను. మద్రాసు గవర్నరుగనుండి తనయధికారమును దుర్వినియోగ పరచిన "రంబోల్డు" అనువానిని శిక్షించుటకుగా నొక బిల్లు పార్లమెంటులో నుపపాదింపబడెను. కలకత్తాలో నున్నత న్యాయస్థానమందు ప్రధాన న్యాయమూర్తిగ కూర్చుండి, లంచములుమేసి, యనేకరీతుల ప్రజాపీడన గావించినందుకు సర్ ఎలీజా యింపే నుద్యోగమునుండి యూడదీసి యింటికిపిలిపించవలసినదని కూడ యొక తీర్మానము గావింపబడెను. ఇట్టివే తీవ్రమగు తీర్మానములు కుంపిణీవారిపై నలుబదినాల్గు గావిం

పబడెను. వానిలో చిట్టచివరది హేస్టింగ్సును యింటికి (సీమకు) పిలిపించుట కుంపిణీ డైరెక్టర్ల ప్రధానకర్తవ్యమని నిరూపించెను. కాని, కుంపిణీవారీ తీర్మానము నమలుజరుప మని తిరస్కరించిరి. ఉభయపార్లమెంటుసభల యనుమతి లేకుండ, ఒక్క కామన్సుసభవారిచే మాత్రమొసంగబడిన సలహాలను అమలుజరుపవలసిన బాధ్యత తమకు లేదని కుంపిణీ వారనిరి. నార్తుప్రభువుయొక్క మంత్రిత్వ మూడిన తరువాత తదుపరి రాజ్యాధికారము వహించిన మంత్రివర్గమువారు యిండి యానుగూర్చి శాశ్వతమైనట్టియు సమగ్రమైనట్టియు దిట్టమగు కట్టుబాటుల నొనర్చుటకై పూనుకొనిరి. కాని దురదృష్ట వశాత్తు యింతలో నిందు ప్రధానమంత్రియగు రాకింగుహాము ప్రభువు మరణించుటయు, ఆతనిస్థానమున ప్రతికక్షివాడగు "షెల్‌బోర్ను" ప్రభువు ప్రధానమంత్రిగ వచ్చుటయు తటస్థించెను. అందుచే నీషెల్‌బోర్ను ప్రభువుకు ప్రతికక్షులగు ఫాక్సు, బర్కు మున్నగు యిండియాపక్షపాతులు కొంత కాలము వరకు మంత్రివర్గమున కెదిరికక్షులో నుండవలసినవారైరి. ఈ షెల్‌బోరన్ ప్రభువు తన మంత్రిత్వమును నిలువబెట్టుకొనుటకై కొంతమందిని తనతో కూడగట్టుకొనుటకుగాను యెవరైనా దొరుకుదురాయని యిటునటు పాఱజూచుచుండెను. అప్పు డాతని బుద్ధికి హేస్టింగ్సు గోచరించెను. ఈతనిని కట్టుకొన్న యెడల తనకీతడు మంత్రివర్గ సభయందును, పార్లమెంటుసభ యందును కూడ చాల చేదోడు వాదోడుగ నుండుననియు, ఆతని బుద్ధిపాటవము, గుండెలుదీసిన బంటుతనము, తనకెల్ల ప్పుడు మిక్కిలి యండగనుండుననియు, షెల్ బోరన్ మంత్రి

తలంచెను. ఇట్లుండగ, కాశీరాజగు చైతుసింగు నృపాలునిపై హేస్టింగ్సుచే గావింపబడిన దురంత కృత్యముల యుదంతము సీమకు చేరెను. అంతట పార్లమెంటు సభ్యుడగు "డండాస్" అనునాతడు కుంపిణీవారి రహస్యసంఘమును గూర్చిన యుదంతమును మరియొకమారు పైకిదెచ్చి, హేస్టింగ్సును యింటికి పిలిపించు విషయమై తిరిగి ప్రస్తావించెను. అంతట కుంపిణీ భాగస్వాములందరు సమావేశమై యీ "డండాస్" చర్యను తీవ్రముగ ఖండించుచు "మా భాగస్వాముల యనుమతి లేనిదే మీరుగనుక వారన్ హేస్టింగ్సును తొలగించినారంటే జాగ్రత, అట్లా చేయవద్దు" అని తమ డైరెక్టరులకు తీవ్రముగ శాసించిరి. కుంపిణీభాగస్వాములిట్లు కామన్సు సభవారిని మొరాయించుట కెట్లు ధైర్యమువచ్చినది? ప్రధాన మంత్రియగు షెల్‌బోరన్ ప్రభువు వారన్ హేస్టింగ్సు మున్నగు కుంపిణీ యుద్యోగస్థులను వెనుకవేసికొనివచ్చి వారు చేసినపనులు మంచివేయని సభలో నెంతో ఆవేశముతో సమర్థించుటనుబట్టియే కుంపిణీవారికింత అలుసుచిక్కినది. మహారాష్ట్రులతోడి యుద్ధమునకు తానుకారకుడను కానని హేస్టింగ్సు షెల్‌బోరన్ ప్రభువుకు లోగడవ్రాసియుండెను. "సీమలోని కుంపిణీ డైరెక్టరును, బొంబాయిలోని కుంపిణీవారును మాత్రమే దీనికి కారకులు. ఈ యుద్ధము నాకు తెలియకుండగనే ప్రారంభమైనది. దీనికి చెప్పబడినకారణములనుకూడ నేనామోదించలేను. వానిని నేను ఖండించితినికూడాను. కాని, బొంబాయివారెట్లో యుద్ధము నొకసారి ప్రారంభించినప్పుడు నేనిక దానిని "మీ కర్మముమీదే" యని వదలివేయుట ధర్మముకాదను తలం

పుతో వారికినేను యుద్ధకార్యనిర్వహణమందు పూర్తిగ తోడ్పడితిని. నేనప్పుడట్లు తోడ్పడియుండనిచో మన కర్ణాటక రాజ్యమూడెడిదే! కావున, కర్ణాటకరాజ్యమును కాపాడిన వాడను నేనేయని ఘంటాపథముగ వక్కాణింపగలను. ఒక రాజధానిని అపకీర్తినుండియు, ఉభయరాజధానులను సంపూర్ణ వినాశనమునుండియు, కాపాడి రక్షించినవాడను నేనేయని స్వోత్కర్షగ చెప్పుకొనవలసి వచ్చినందుకు నన్ను మన్నింతురు గాక!" యని వారన్ హేస్టింగ్సు మెల్‌బోరన్ ప్రభువుకు వ్రాసికొనెను.

1783 సం॥ లో సంయుక్తమంత్రి వర్గమేర్పడెను. ఇండియా వ్యవహారములను గూర్చిన బిల్లును తయారుచేయు భారమును వారు "బర్కు" పై పెట్టిరి. యీతడు తయారు చేసిన బిల్లును "ఫాక్సు" మంత్రి 18 వ నవంబరు తేదీన కామన్సు సభలో ప్రవేశపెట్టెను. క్రిస్టమసు సెలవలకుముందు దాని నన్ని యవాంతరదశలలోనుండి నడుపుకొనివచ్చెను. ఆ బిల్లు లోని యంశములేమనగ:— ఇండియాకు సంబంధించిన సమస్త వ్యవహారములను పరిష్కరించుట కొక బోర్డు నేర్ప రుపవలెను; దానిలో యేడుగురు సభ్యులుందురు. ఆ యేడు గుర పేర్లుకూడ యీ బిల్లునందే స్పష్టముగ వక్కాణింపబడెను. వీరు నాలుగేండ్లవరకు యీ బోర్డులో సభ్యులుగ నుందురు. ఈలోపుగ వీనిలో ఖాళీలేర్పడు నెడల చక్రవర్తి వీనిని పూర్తి చేయవలెను. ఈ బోర్డునకు లోబడి కుంపిణీవారి వర్తకవ్యా పారమునకు సంబంధించిన వ్యవహారముల నన్నిటిని తనిఖీ చేయుట కింకొకబోర్డు యెనమండుగురు సభ్యులతో నేర్పరుప

బడెను. దీనికి రాజకీయ సంబంధముగు వ్యవహారములు బాధ్యత యేమియు లేదు. భారతవర్షములోని దేశీయరాజులకు, కుంపిణీ భాగస్వాములకు, చక్రవర్తికి,— పరస్పర ముండవలసిన హక్కు-బాధ్యతలనెల్ల స్పష్టముగ, ఒకేసారి, నిర్ణయించి వేయుటకు తగిన నిబంధనలీ బిల్లునం దేర్పరుపబడెను. శివిల్, మిలిటరీ, యధికారములందుగాని, ఆర్థిక న్యాయాధికారములందుగాని, యున్న యుద్యోగులెవరుగాని, యేయుపాయముగగాని, లంచములుగాని, బహుమతులుగాని, పుచ్చుకొనకూడదు. అట్లు పుచ్చుకొన్నయెడల, వారు శిక్షాపాత్రులగుదురు. కుంపిణీ యుద్యోగస్థులు వహించిన వర్తక సంబంధముగు మిరాశీలన్నియు రద్దుపరుపబడెను. వేయేల, యీ బిల్లుయొక్క-ముఖ్యోద్దేశ మేమనగ:— ఇటు ఒకవైపు భారతప్రజల నన్యాయముగ దోచుకొనుటవలనను, అటు ఒకవైపు ఆంగ్లదేశప్రజల పేరుప్రతిష్టల మంటగలుపుటవలనను, కుంపిణీకి సంబంధించిన వ్యక్తులు యేన్యాయాధికారాగ విపర్యయములచే,— యే రాచకీయ దురంత కృత్యములచే— యన్యాయార్జితములగు ధనరాసులనెల్ల మూటగట్టుకొనిరో ఆ యత్యాచారములనెల్ల నిర్మూలించుటయే యీ బిల్లుయొక్క-ముఖ్యోద్దేశమని తన్నిర్మాతలే ఘంటాపథముగ ప్రకటించి యుండిరి. మంత్రివర్గము వారికీ బిల్లువలన వల్లమాలిన యధికారము లొసంగబడుచున్నవని చెప్పి, "పిట్టు," "గ్రెన్ వెల్" "విల్ బర్ ఫోర్సు" మున్నగు వారిబిల్లు నదిరించిరి. "రాజుకంటె బలవంతులుకావలయు ననుతలంపుతో మంత్రివర్గమువారీబిల్లును ప్రవేశపెట్టి" రని జెంకిన్సన్ అనుసభ్యుడు ఆక్షేపించెను. చక్రి

వర్తియొక్క నిజోద్దేశమునే యీతడిట్లు ప్రకటించెనని అప్పుడు కొందరనుకొనిరి. "పక్షురు సభ్యులతోగూడిన యీ బోర్డు సముద్రములోనుండి లేచివచ్చుచున్న యేడుతలల శిఖండివలెను న్నదనియు, అది మానవకోటికి వచింపరాని దుర్దశలతెచ్చిపెట్టు చిహ్నమనియు, స్కాట్ అనుసభ్యుడు శపించెను. కాని, వీరందరిట్లెదిరించినను యీ బిల్లుమెట్లో మిక్కిలి యధిక సంఖ్యాకులచే కామన్సు సభనుండి అన్ని యవాంతర దశల గడచి బయటికివచ్చెను. ఇక ప్రభుసభలలోనికి వచ్చినప్పుడు సైతము దీనికంత యసాధారణ ప్రాతికూల్యమేమియు గన్పట్ట లేదు. ఈ బిల్లునందు ప్రతిపాదింపబడిన నూతన సిద్ధాంతముల నమలు జరుపుటకు ప్రాతిపదికముగ ముందువారన్ హేస్టింగ్సును తీసివేయవలసి యుండుననను నుద్దేశమునుకూడ యెవరు దాచ లేదు. హేస్టింగ్సును తీసివేయవలసియుండుననను మాటకంటె కుంఫిణీభాగస్వాముల కెక్కడలేని కోపమును తీవ్రప్రతీకారమును గలిగించుమాట యింకొకటి యుండబోదు. "హేస్టింగ్సును గనుక మీరు తీసివేసినారంటే మీమాటదక్కదు. మీరూ, మీ యిండియాబిల్లుకూడా సర్వనాశనమౌతారు, జాగ్రత్త" అని మాన్సుఫీల్డు ప్రభువు మంత్రివర్గమును బెదరించెను. "హేస్టింగ్సును గనుక తీసివేసినారంటే, యిండియా పని చాలా చిక్కులలో పడిపోతుందని" మూడవ జార్జిచక్రవర్తి కూడ తన యభిప్రాయమును దెలిపెను. ఈ మంత్రులనిన జార్జి రాజుకు యెంతమాత్రము గిట్టకుండెను. అందుచే వీరినెట్లయిన తీయించి పారవేయవలెనని రాజుపూర్తిగ తలచుకొనెను. "ఈ బిల్లుకు అనుకూలంగా యెవరైతే వోటుచేస్తారో వారం

దరిని నా స్వంతశత్రువులుగ యెంచుకుంటానని నీవు స్వయముగ ప్రతి ప్రభు సభ్యునివద్దకు పోయి చెప్పవలసినది " అనిరాజు స్వయముగ తనస్వదస్తూరీతో ఒక చీటినివ్రాసి, టెంపుల్ ప్రభువుకు పంపించెను. ఈ ప్రభుసభలో 190 మంది ప్రభు సభ్యులున్నారు. వీరందరు గొప్ప గొప్ప " విగ్గు " వంశము లకు చెందినవారే. వీరికి విశేష ధనము పలుకుబడియు, కూడ నుండెను. అయిననేమి ? అప్పుడు కుంపిణీ భాగస్వాముల ప్రభ బహు యెక్కువగ నుండెను. ఇండియాతో సంబంధ మున్న ప్రతి ఇంగ్లీషువాని యొక్క స్వలాభము మిక్కుటముగ నుండెను. వివిధ కక్షులవారితో పూసి పెట్టబడిన యీ సం యుక్త మంత్రివర్గమువారును బయట ప్రజలకు అయిష్టులుగ నుండిరి. ఈ కారణములచే 17 వ డిశెంబరు తేదీన యీ బిల్లు ప్రభుసభలో అధికసంఖ్యాకులచే త్రోసివేయబడెను. మరు నాడే ఫాక్సు, నార్తు, ప్రభువుల మంత్రిత్వ మూడెను. 'పిట్టు' ప్రధానమంత్రిగ రాజుచే నాహూతుడయ్యెను. ఈతడు పడుచు వాడు. పార్లమెంటు సభలో నధికసంఖ్యాకు లీతని పట్టున నుండిరి. అందుచే యీ యూడిపోయిన బిల్లుకు పోటీగ యీతడింకొక యిండియాబిల్లును ప్రవేశపెట్టి, దానిని 1784 సం॥ లో పార్లమెంటులో ప్యాసుచేయించెను. దానినే నేటికిని " పిట్టు యిండియాబిల్లు " అని పిలుచుచున్నారు. మొట్టమొదట వ్రాసిన చిత్తులో చాలలోపములుండెను. వీని నన్నిటిని మిక్కిలి మిణుమిట్లు గొలుపు హేళనతోడను, ఖండితమగు హేతువాదనతోడను, ఫ్రాన్సిస్ బట్టబయ లొనర్చెను. అనుభవములేని కుఱ్ఱమంత్రి ప్రవేశపెట్టిన యీ మొట్టమొదటి శాసననిర్మాణ

వ్యాస మీరీతిగ భగ్నమయ్యెను. మరోపాయములచే నెట్లో పూసిపెట్ట జూచిన యంత్రము పనిచేయజాలకపోయెను. కావున, దీని నింక కొత్తగ నుండగనే యూడదీసి, పనికిరావని చెప్పి లోగడ పారవేసిన యా పాతముక్కలనే తిరిగి తీసికొని, యెట్లో అతుకులుపెట్టి యిండియా చట్టమును బిగించవలసి వచ్చెను. పిట్టు మొదట నిర్మించిన యంత్రమందు ఒక భాగమున కింకొక భాగము పుష్టికరముగ నుండుటకు బదులు, ఒకదాని చలనము నింకొకటి నిరోధించుచు, యంత్రము యావత్తు పనిచేయకుండ నిలిచిపోవు నట్లుండెనని తదుపరి వారికే తెలిసి వచ్చెను. స్పష్టముగ బాధ్యత నొకరియందుంచక, శాస్త్ర విహిత మార్గమును గమనించక, తమకు తోచినట్లెల్ల బాధ్యతలను చీలదీసి వేయుటవలనను, అనవసరమగు వివరములలో జొరబడి, వానిని మరింత యగమ్య మొనర్చుట వలనను, కించిత్తయినను పనిసాగదని వారికే తెలిసివచ్చెను. ఈ యేర్పాటువలన యేపని యెట్లుచెడినను యెవరినేమి యడుగుటకు వీలుండదు. అందుచే సర్వము అధ్వాన్నమగును. ఈ విషయములో మిక్కిలి యనుభవము, వివేకము, విశ్వాసము, గలవారి నందరిని వదలివేసి, పార్లమెంటు కేవలము గుమాస్తాల యొక్కయు, సమయమునకొక మాటమాట్లాడు మడత నాలుకలవారి యొక్కయు మాటలనే నమ్మెను. ఇండియాలో కుంపిణీ యుద్యోగులు గావించిన యక్రమములను, దుశ్చేష్టితములను త్రవ్వి పైకి తీయుటకై సంవత్సరములకొలది బరుకపడిన ప్రతిఫలశూన్యమగు శ్రమకు ఫ్రాన్సిస్ పార్లమెంటు సభయం దాతని నెంతయో ఘనముగ ప్రశంసించెను. ఇట్టి సంస్తవ

మున కాతడు నిజముగ, న్యాయముగ తగునని చెప్పుటకు ఫ్రాన్సిస్ మాటలనిన నంత శ్రద్ధతో యెన్నడు వినని పార్ల మెంటు సభవారందరా నాడాతడు గావించు యీ సంస్తవ ప్రసంగము నెంతయో శ్రద్ధాభక్తులతో వినుటయే ప్రబల నిదర్శనము. కోమలమగు సహానుభావముతోడను, హృదయ పూర్వకమగు భక్తితోడను, భావిసూచకముగ నాతడు తన మిత్రుని వచింతభగ్న పౌరుషమును సమాశ్వాసించెను. ఈతని కిట్టిభక్తి, కోమలహృదయము గలదని యెవరెన్న డనుకొన లేదు.ఇట్టి సమాశ్వాసనమే ఆత డనుకొనినదానికంటె త్వరగనే ప్రజాభిప్రాయముచే సైతము ధ్రువపరుప బడెను. ఆ సమయ మందాతడు పల్కిన పలుకులివి:— ఆతని (బర్కును) గూర్చి స్తుతించుటకు నేనిక్కడకు రాలేను. ఆతనిగూర్చి నుతియింప నాతరమా? నా తరమైనను నేనట్టి సాహసకార్యమునకు పూనుకొనను. ఏలననగ:— ఆతని సుగుణసంపత్తినిగూర్చి తలంచుకొన్న యెడల నామనస్సు దుఃఖమగ్నమగును. ఏల ననగ, ఆత డొనర్చిన దేశసేవను, ఆతని సుగుణసంపత్తిని ప్రజలు గ్రహింపజాలకపోయిరి. కేవలము కృతఘ్నతచే గాకపోయినను, ఉపేక్షాభావముచే ప్రజలాతని సుగుణ పుంజముల సారమును గ్రహింపజాలకపోయిరి. అందుచే నవి యడవినిగాసిన పుష్పాల చందమయ్యెను. ఆతని శ్రమ, సుగుణసంపత్తి యావత్తు ప్రజలముందర నిష్ఫల మయ్యెనేయని నామనస్సెప్పుడు వేదన పడుచుండును. కీర్తియే తగు ప్రతిఫల మగునెడల, దాని నాత డిదివరకే పొందియున్నాడు. కాని, ఆతనికి కేవలమీకీర్తి

వలన తృప్తి లేదు. అతనికింతకంటె నుత్కృష్టమగు ప్రతిఫలమో కావలయును. ఈ లోకమందుగాకున్న పరలోకమందైనను నరుల సుగుణములకు, సత్కర్మలకు, తగు ప్రతిఫలము లభించుననియు, మానవకోటికి నిష్కామముగ, భక్తి విశ్వాసములతో సేవనొనర్చిన మహాపురుషుల కచ్చుటతగు సత్కారము జరుగుననియు, "వారిచ్చుటపడిన శ్రమవ్యర్థము గాకుండ నట్లాలోకమందు జూతు" రనియు నాకువలెనే ఆయనకును గట్టినమ్మకము గలదు. భారతీయ నేరస్థులు జ్యూరీయెదుట అప్పీలు చేసికొనుహక్కను యీ యిండియాబిల్లునందు తీసివేయుటకొరక క్లాజు నేర్పరచిరి. ఈ దురన్యాయపుక్లాజును చూచునప్పటికి ఫ్రాన్సిస్‌కు ఆవేశము మొగవేసికొనివచ్చెను. అంతట ఆతడిట్లు గర్జించిపల్కెను:— "ఆ మహానుభావుడు కీర్తిశేషుడగు "చాతం" మంత్రికాలములోనే గనుక మీరిట్టి దురన్యాయపు క్లాజును ప్రవేశబెట్ట జూచియుండిన యెడల, ఖాయిలాచే తాను పరుండియున్న మంచముమీదనుండి యాతడు చివుక్కన లేచి కూర్చుండి, "నన్ను తీసుకువెళ్లి ఆ పార్లమెంటుసభ నేలమీద కూలవెయ్యండో" యని యరచి గందరగోళముచేసి, యెట్లో యిక్కడికి వచ్చిపడి, "దేశమంతా కత్తులుపుచ్చుకు తిరగబడండోహో" యని మేఘగంభీరధ్వానముతో రాజాధిరాజువలె యీ నేలమీది నుండియే శాసించి యుండెడివాడుగాడా" అని ఫ్రాన్సిస్ మిక్కిలి యావేశముతో గర్జించి పల్కెను. ఈపల్కులలో చివరివాక్యములో నిగూఢమైయున్న భావమునుగూర్చి చాల మందికి కోపమువచ్చెను. దానిని వారు చిరకాలము మరచిపోక

మననము చేసికొనుచునే యుండిరి. ఫ్రిన్సిస్ యీరీతిగ గర్జించిపలికి, ఒక్క క్షణమూరకుండి, అప్పుడక్కడకూర్చున్న ప్రధానమంత్రి " పిట్టు " పై (చాతం కుమారుడేయగు పిట్టుపై) దృష్టి నిలిపి, వర్ణింప తరముగాని దుఃఖోద్వేగముతో నిట్లు పల్కెను:- " కాని, ఆ " చాతం " యిప్పుడు లేడు, అతడు తనతో కించిత్తయినను పోల్పదగిన * వస్తువు నొకదానినైనను యిక్కడ విడిచిపెట్టి వెళ్లలేదు " అనెను. ఈ నూతన చట్టప్రకారము గవర్నర్ జనరలుకు విశేషాధికారము లొసంగబడెను. కౌన్సిలులో ఖాళీయైన స్థానములను గవర్నర్ జనరలే తన యిష్టము వచ్చిన వారితో నింపుకొన వచ్చునట! అవసరమని తనకు తోచినప్పుడల్లా యితర కౌన్సిలర్ల మాటలనన్నిటిని త్రోసి వేసి, తన యిచ్చవచ్చినరీతిని గవర్నర్ జనరల్ ప్రవర్తింప వచ్చునట! అయిదుగురు సభ్యులతో గూడిన సభకు అధ్యక్షుడుగ మాత్రముండుచు వచ్చిన యీ గవర్నర్ జనరల్ యిప్పుడీ నూతన చట్టమువలన సర్వంసహా చక్రవర్తియయ్యెను. ఇట్టి యుపద్రవపు నిరంకుశాధికారము నెలకొల్ప వలదని ఫ్రిన్సిస్ మున్నగు ప్రతికక్షనాయకు లెంతయో నెత్తిన నోరు పెట్టుకొని మొత్తుకొనిరి. కాని, ప్రయోజనము లేక పోయెను. నిరంకుశాధికారుల కత్యంత ప్రియతమమగు యీ యధికార మొక్కసారి నిర్మింపబడిన పిమ్మట, యిక వారు దానిని వదలుదురా? ఎన్నడును వదలరు. ఒక్కసారి యధికారమును చవిగొన్నవారు యింక అంతకం

* అనగ, తన తండ్రియగు " చాతం " సుగుణములలో కించిత్తయినను కొడుకగు యీ " పిట్టు " కు అబ్బలేదని భావము.

తకెక్కువ యధికారమును సంపాదించి, పెచ్చు పెరిగి, పరులపై ఆక్రమించి, సర్వముతామే మ్రింగవలయునను కాంక్షచే సదా ప్రేరేపింప బడుచుందురు. ఇట్టి దురాశా ప్రేరితులగు వారికి తమ పక్ష సిద్ధాంతములతో పనిలేదు; తమ సాంప్రదాయములతో పనిలేదు. ఎట్లో తమ కాంక్ష తీర్చుకొనుటయే వారికి కావలయును. అంతయేల, మనము చూచు చుండగనే, మనకాలములోనే, యీ నిరంకుశాధికారమేరీతిగ నిత్యము పౌరుల హక్కుల నాక్రమించు కొనుచున్నదో మనమెరుగుదుము. పోనీ యీ రీతిగ హరింప బడిన హక్కులకు తగు ప్రతిఫలమేమైన ప్రజలకు గలుగుచున్న దాయనిన యదియులేదు. ఒక్కొక్క హక్కు హరించినప్పుడల్లా తిరిగి రేపు యింకొకహక్కును హరించుటకది సామ్యముగ యేర్పడుచుండెను. ఈస్టిండియా కుంపిణీ వారింకను బలవంతులుగ నుండిరి. సీమ ప్రభుత్వపుసైన్యము లింకను భారత వర్షమందు విరివిగలేవు. అందుచే నవి కుంపిణీ సైన్యములకంటె బలహీన స్థితిలో నుండెను. కావున భారతవర్ష పరిపాలనంతను కుంపిణీవారి చేతులలోనుండి లాగికొని దానిని సీమ ప్రభుత్వము వారే వహించుటకు తగినసాధనములు వారికి లేకుండెను. అప్పుడట్లుచేయుటయు వివేకముగ గన్పట్టకుండెను. కాబట్టి, యింకొక70 సంవత్సరములపాటు కుంపిణీవారే భారత రాజ్యాధికార గౌరవములను, వర్తకలాభములను, ఉద్యోగపదవులను హాయిగ అనుభవించుచుండవలసినదని చెప్పి, సీమ పార్లమెంటువారు వారికి పట్టానిచ్చిరి. కాని, యింకనుండి మాత్రము యేసూత్రములపై భారత రాజ్యపాలన జరుగవలెనను విషయమై సీమ

ప్రభుత్వమువారే అధికారులై యుండునట్లు యేర్పాటుగావింప బడెను. ఇండియానుండి పంపబడు ఉత్తరములకు, లెక్కలకు రెండు నకళ్లు వ్రాసి, ఒకటి సీమ ప్రభుత్వముచే నేర్పరుప బడిన బోర్డువారికిని, యింకొకటి కుంపిణీ డైరెక్టర్లకును పంప వలెను. వీనిని పరిశీలించుటకును, వీనిపై తగు సలహాల నొసంగుటకును, వీరిరువురును తగు సిబ్బందిల నేర్పరుచుకొనిరి. కాని, కాలము గడచినకొలది భారతరాజ్య పాలనను వశీకరణ మొనర్చుకొనుటయందు సీమ ప్రభుత్వపు బోర్డువారి ప్రతిభ యెక్కువగుటయు, కుంపిణీ డైరెక్టర్ల ప్రతిభ తరిగిపోవుటయు తటస్థించెను. ఎచ్చటనో తమ కంటికి కనబడకుండ దూర దేశమందున్న భారత ప్రజలయెడల సహానము వహించ వలసినదనియు, వారి వెర్రిమొర్రి యాచారముల జోలికి పోకుండ చూచి చూడనట్లూరకుండ వలసినదనియు, దేశ మందు శాంతిని నెలకొల్పి తమకు కావలసిన ముడివస్తువులు పండించి సీమకు పంపించు సామర్థ్యముమాత్రము భారతప్రజల యందు పెంపొందించ వలసినదనియు, మొదలుగాగల యంశ ములతో కుంపిణీ డైరక్టర్లు యిండియాలోనున్న తమ యుద్యో గస్థులకందరికి, పిన్నలకు, పెద్దలకు, బహుచమత్కారపు మండ లింపులతో రోజురోజు విసుగులేకుండ పుత్తరములు మాత్రము వ్రాయుచుండెడివారు. వీరీప్రకారము వ్రాయుచుండగ, యిక యింకొక ప్రక్కనుండి సీమప్రభుత్వపు బోర్డువారు యింకొక మాదిరిగ వ్రాయుచుండెడివారు. ఇంక క్రొత్త దేశములను ఆక్రమించి, వానిని దిగమ్రింగుట కెక్కడెక్కడ అవకాశము లున్నవో అవన్నియు బహు మెళకువతో చూచు చుండవలసిన

దని హెచ్చరింపుచు వీరు వుత్తరములు వ్రాయుచుండెడివారు. ప్రతిదానికి, ప్రతిరాజ్యాక్రమణకు, "స్వరక్షణార్థమై మేమీ పని చేస్తున్నామ" ను మాట ఒక్కటేసాకు. దానికెన్నడు చెరుపులేదు. ప్రతిదానికి యిదేవంక! "ఎవడో మన నీదే శాన్నుండి వెళ్లగొట్టాలని కుట్రచేస్తున్నాట్ట! మన పొలిమేరలో యెవరో గుమికూడి కూర్చుండి, మనలను నాశనం చెయ్యడానికి గూడుపుఠానీ చేస్తున్నారట!"—ఎప్పుడూ యివే కబుర్లు! యివేవంకలు! ఇట్టి వంకలకు కొదువలేదు. మొదటినుండియు యీ యబద్ధపువంకలు పెట్టియే పరరాజ్యముల మీదికి అన్యాయముగ దండెత్తుచుండిరి. ఈ సీమ ప్రభుత్వపు బోర్డుకు ప్రెసిడెంటుగ వచ్చిన ప్రతివాడు— ఒకడి తరువాత ఒకడు— ఎక్కడో నూటికికోటికి ఒకడుతప్ప— తక్కిన ప్రతివాడు యీవంకనే, యింకొక క్రొత్త మాటలతో చెప్పుచు, పైకిమాత్రము,— "ఎబ్బెబ్బే, పరరాజ్యాలను దిగమ్రింగుదామన్న దురాశ మా కెంతమాత్రము లేదు, లేద" ని బిగ్గరగ మాటిమాటికి ప్రకటించుచు, లోలోనతప్పక యీ దుర్వృత్తినే సాగించుచు వచ్చెను. ఈ యధికారుల రహస్యముల నన్నిటిని బాగుగ యెరిగి, తానుకూడ ఒకప్పుడు యీ యధికారవర్గములో చేరియుండిన యొకానొక వ్యక్తి వీరి దురాగతపు చర్యలను గూర్చి యిట్లు నిర్మొగమోటముగ చెప్పియుండెను:— "సర్కారు ఖజానాలో సొమ్ము తరిగిపోతూవున్నప్పుడు గాని, జనులదృష్టి నాకర్షించు విషయ మింకొకటి యేదియు లేనప్పుడుగాని, సాధారణంగా సర్కారుచేసే పనియేమిటి? సైన్యాలను వెంట బెట్టుకొని, ఎవరిమీద పడ

దామా అని రోడ్డుపుచ్చుకొని బయలుదేరడమే !" ఇంతకంటె శ్రేష్ఠమైనపని వారికి యింకేమి కనబడేదికాదట ! ఆంగ్లరాజ్యపు పొలిమేరల నీ రీతిగ యిటు ఉత్తరమునకు, అటు పశ్చిమమునకు, నెట్టుకొనిపోయిరి. సైన్యపుఖర్చు నానాట హెచ్చింపబడెను. ఈ హెచ్చు కర్చునంతను తాముపెట్టుకొనకుండ, చేలోకువైన యింకెవడి నెత్తిమీదనో వేసి రుద్దుచుండిరి. భారతరాజ్య వ్యవహారమంతయు కేవల మొక్క కుంపిణీ డైరెక్టర్ల చేతులలోనే యుండియున్న యెడల, వారీ పరరాజ్యాక్రమణలు రెచ్చకుండ చాలవరకు అదుపులోనుంచెడివారే— సందేహములేదు. ఎప్పుడైనా, యే గవర్నర్ జనరలైనా, "నేనీ యుద్ధముల జోలికిపోను" అని నిష్కళంకమైన తలంపుతో పలికియున్న యెడల, "పోనీలే, వాని నెందుకీ బలవంతం పెట్టడము" అని యీ కుంపిణీ డైరెక్టర్లు సహజముగ నూరకుండెడివారే. కాని, యెప్పుడైతే, 1784 సం॥ లో యిండియా బిల్లు ప్యాసై, యిండియా వ్యవహారములను చూచుటకు కుంపిణీవారుగాక సీమప్రభుత్వము వారింకొక "బోర్డు" ను, వేరే, ప్రత్యేకముగ తమ ప్రభుత్వము తరఫున యేర్పాటు చేసినారో ఆ నాటి నుండియు వ్యవహారములు మారిపోయినవి. నానాటికి అనివార్యముగ పెరుగుచున్న రణోద్వేగము నణచుటకుగాని, సీమ ప్రభుత్వపు బోర్డువారు చేయు ప్రేరేపణలను, పెట్టు పుల్లింగములను మాన్పుటకు కాని, కుంపిణీవారికి అసాధ్యమయ్యెను. సీమ బోర్డువారు పెట్టిన ప్రేరేపణల నాధారము చేసికొని యిక్కడ గవర్నర్ జనరల్ యావద్భారత సైన్యములకు పూర్తిగ పనికల్పించి, యేదో

యొక అఘాయిత్య కార్యము చేయుచుండెను. ఆ రోజులలోని యుపాయేర్పాటుల ననుసరించి కుంపిణీ వా "రీపని చేయవద్దు" అని హుకుము పంపు లోపలనే యిక్కడ పనియావత్తు పూర్తి యయ్యేడిది! పని మైపోయిన తరువాత యిక యెవరుచేసేది యేమున్నది!— విచారించుట నిష్ప్రయోజనముగద! అదిగాక, "ఫలానియుద్ధము జయించినాము, ఫలానిదేశము సంపాదించినాము" అని మహా ఆనందపారవశ్యముతో ప్రజలెల్లరు విజయ ధ్వానము లొనర్చుచుండగ, యిక్కడ యీ కుంపిణీ వారు చెప్పు చప్పిడు మాటలను, హేతు వాదములను మన స్సాక్షి ప్రేరేపించు కుశ్శంకలను, వినచవిగాని ధర్మసందేహములను యెవరు విందురు? ఎవరికి వినిపించును? కాని, క్రొత్త గవర్నర్ జనరలును నియమించు నప్పుడెల్ల కుంపిణీ డైరెక్టర్ల యనుమతి యింకను కావలసియే వచ్చుచుండెను. ఒకసారి నియమింపబడిన గవర్నర్ జనరలును చక్రవర్తి ప్రేక్ష్యము లేకుండ తీసివేయు అధికారమింకను కుంపిణీవారికే యుండ నిచ్చిరి. రెండుమూడుసార్లు మంత్రులు చేసిన నియామకము చాల చెడ్డగ నున్నప్పుడు కుంపిణీవారా నియామకమును త్రోసివేసిరి. ఉద్యోగమందున్న గవర్నర్ జనరలును తీసివేయు నధికారమును ఒక్కసారి మాత్రము కుంపిణీవారు చలాయించిరి. ఈ రెండు మూడు దఫాలుతప్ప, సర్వసాధారణముగ, సీమ గవర్నమెంటువారే తమ మాట నెట్లో నెగ్గించుకొనుచుండిరి. అందుచే, కుంపిణీవారికిని, ప్రభుత్వమువారికిని తీవ్ర సంఘర్షణలేమియు సాధారణముగ గలుగుచుండెడివికావు. ఈ యుభయులు కలిసి దండ్వపరిపాలనను సాగించుచుండిరి.

కుంపిణీవారి యధికారము నదుపులో నుంచుటకు 1784 సం॥ చట్టమువలన యీ "బోర్డుఆఫ్ కంట్రోల్" చక్రివర్తిచే నేర్పరుపబడెను. మంత్రివర్గము మారిపోయినప్పుడల్లా యీ బోర్డు సభ్యులుకూడ మారిపోవుచుందురు. ఈ బోర్డుకు విశేషాధికారము లొసంగబడెను. పార్లమెంటుకిది జవాబు చెప్పనక్కరలేనంతగ దీనిచుట్టు ననేక రక్షాబంధములు కట్ట బడెను. వేయేల? మొదట త్రోసివేయబడిన ఫాక్సు బిల్లునకిది కేవలము వ్యతిరేకపుబిల్లు. ఇండియా విషయమై సర్వాధికారములు పార్లమెంటునకే యిచ్చుటకు మొట్టమొదట ఫాక్సు తన బిల్లులో నేర్పాటుచేసెను. కాని, "పిట్టు" తయారుచేసిన యీ బిల్లులో పార్లమెంటు ప్రేక్ష్యము లేకుండ సర్వాధికారములు యిటు కుంపిణీకిని, అటు చక్రివర్తికిని, పంచిపెట్టుటకు చూచెను. కాని ఈ పద్ధతివలన మంత్రుల కెక్కడలేని యధికారములు చేకూరునని "పిట్టు" గ్రహించియే యీపని చేసెను.

"పిట్టు" ప్రవేశపెట్టిన యీ బిల్లును బర్కు ఎదిరించెను. ప్రజలను పీడించి, పరరాజ్యముల దిగమ్రింగు దురాగతపు పద్ధతిని— విచారణ సంఘములవారు నిందించిన యీ పద్ధతిని— యీ బిల్లు సురక్షితముగ కాపాడుచున్నదని బర్కు గ్రహించెను. అందుచే దీని నాత డెదిరించెను. కాని, ప్రయోజనము లేకపోయెను. శాసన రూపముగ యిక వ్యవహారములు చక్కబడవని బర్కు యెప్పుడైతే గ్రహించెనో, అప్పుడాతడు కుంపిణీ యుద్యోగస్థు లొనర్చియుండిన దురాగతపు పనుల నన్నిటిని బయటపెట్టి, సాధ్యమైనచో,

వారి నందరిని శిక్షింపించ వలెనని తలపెట్టెను. అయోధ్య రాష్ట్ర విభజనను గూర్చిన కాగితముల నన్నిటిని బయట పెట్ట వలసినదని బర్కు మంత్రులను కోరెను. హేస్టింగ్సుకు యేజెంటైన "స్కాటు" అను నాతడుకూడ, "సరే, ఆ కాగితములను బయట పెట్టవలసినదే, దానివలన హేస్టింగ్సు నిర్దోషియని ఋజువు కాగలదు" అని బర్కు ప్రతిపాదనను బలపరచెను. కాని, మంత్రులు మాత్రము యెక్కువ మెళ కువతో నుండిరి. "ఈ కాగితములలో బయట పెట్టకూడని అనేక రహస్య విషయము లుండవచ్చును" అని చెప్పుచూ వానిని బయటపెట్టరైరి. అంతటితో బర్కుకు రౌద్రము యెగ వేసికొని వచ్చెను; దీర్ఘచర్చ జరిగెను. దోషారోపణ పరంపరలను గురిపించు ఘీంకారము లొనర్చుచున్న బర్కు యొక్క బెదరింపులను చూచి మంత్రిపక్షపాతులగువారు హేళనజేయుచు చప్పట్లుకొట్టిరి! ఈ వివాదమంతయు క్రమ రీతిని జరుగలేదను కేవల సాంకేతికయుక్తితో "పిట్టు" మంత్రి యానాటి చర్చ నెట్లో ముగింపునకు దెచ్చెను. అప్పుడా బల్లపై తనయెదుటనున్న విచారణ సంఘపు నివేదికపై తన హస్తమునునిచి బర్కు యిట్లు చెప్పదొడంగెను;- "భరతఖండ మందెవ్వరైతే మానవకోటిపై అమానుషములగు క్రూరకృత్య ముల గావించిరో అట్టి మానవకోటియొక్క యుసురు ఆ హంత కులకు తప్పక తగులునని నేనీ సరస్వతిని చేతబట్టి ప్రమాణము చేసి చెప్పుచున్నాను. వారి పాపములు పండి బ్రద్దలైనప్పుడు పైన "సర్వేశ్వరుడు కండ్లుమూసికొని నిద్రపోవుచుండుట లేదురా" యని వారికప్పుడు తెలిసివచ్చును. నిరపరాధులను

దీనులను యీరీతిగ నేడ్పించునట్లు చేసిన యీ (ఆంగ్ల) జాతిపై ఆ పరమేశ్వరుని క్రోధానల జ్వాలలు నేడుగాకున్న రేపైనను ఒక్కుమ్మడివచ్చిపడి వారి సర్వస్వమును భస్మీపటలమొనర్చి తీరును "— ఈరీతిగ బర్కుశాపవాక్యములబల్కి గవర్నర్ జనరల్ అగు హేస్టింగ్సు యిండియాలో గావించిన సమస్త నేరములను గూర్చి పూర్తిగ రాబోవు పార్లమెంటు సభ యందు విచారించుటకు తాను పూనుకొన్నానని చెప్పి మంత్రు లకు నోటీసునిచ్చెను. ఇండియాకు గలిగిన యన్యాయములకు తగు ప్రతీకారమును పార్లమెంటునుండి కోరదలచుకొన్నానని కూడ ఆతడు తెలియజెప్పెను. ఆర్కాటురాజ్యమునకు సంబం ధించిన కొన్ని రహస్యపు కాగితములు బయటపెట్టవలసినదని ఫిబ్రివరి 28 వ తేదీన ఫాక్సుకోరెను. వీనివలన మద్రాసు లోని కుంపిణీయుద్యోగస్తులు ఆర్కాటు నబాబునుండి తమకు రావలెనని చెప్పిన విపరీతపు ఋణముల తీర్మానము నిమిత్తము తద్రాజ్యమునంతను వారేరీతిగ ముక్కముక్కలుగ చీల్చి పంచు కొన్నదియు తేటతెల్లమగునని యాతడు నుడివెను. ఇది వరకు జరిగిన వ్యవహారములన్నియు శుద్ధ అన్యాయములైన వని చెప్పి పార్లమెంటు విచారణ సంఘమువారే తీవ్రముగ ఖండించియుండిరి. ఇట్టి కార్యములిక జరుగరాదని చెప్పి మొన్నటి పిట్టు యిండియా బిల్లులోకూడ నిషేధింపబడి యుం డెను. అట్లయ్యును, క్రొత్తగ యేర్పడిన యీ "బోర్డుఆఫ్ కంట్రోలు" వలన యీ దురాగతపు పనులన్నియు కప్పి పుచ్చబడెను. ఈ బోర్డుకు లోగడ పేర్కొన్న "డండాస్" అనునాత డధ్యక్షుడుగ నుండెను. ఈ దురాగతముల ఖండిం

చుచు బర్కు యెంతసేపు మొత్తుకొన్నను, యెంత తిరుగులేని యుపన్యాసము లిచ్చినను, ఆఖరుకు యితని పక్షమున పార్ల మెంటు సభలో చేతులెత్తువారు 69 మంది దొరుకునప్పటికి గగనమయ్యెను. (అందుచే బర్కు ప్రతిపాదన యోడిపో యెను) ఇట్లగుటకు ప్రధానకారణ మొకటిగలదు. మెజారిటీగ నున్న మంత్రిపక్షపు మెంబర్లలో యిరువురు కర్ణాటక నవాబుకు అన్యాయపు ఋణములపెట్టి వానికి హామీగ అతని రాజ్య ములో కొంతభాగమును తాకట్టు పెట్టించుకొనిరి ! కావున, తమ స్వలాభార్థమై వీరిరువురు పట్టిన పట్టుదలవలననే బర్కు తీర్మాన మీరీతిగ యోడిపోవుటకు కారణమయ్యెను. అట్కిన్ సన్ అను గవర్నమెంటు కంట్రాక్టరు యెట్లో పార్లమెంటులో స్థానము సంపాదించెను. ఇతడు గవర్నమెంటుకు మంచి మద్దతుగ నుండెను. ఈతనికిని బెన్‌ఫీల్డు అను యింకొకనికిని స్నేహము కలిసెను. ఈ బెన్‌ఫీల్డు చరిత్ర యేమనగ:— ఈతడు పడుచుతనములో మద్రాసుకు యింజనీరుగ వచ్చెను. అక్కడ చాల ధనము సంపాదించి వల్లమాలిన వడ్డీ వ్యాపా రము సాగించెను. ఈ రీతిగ, ఆర్కాటు నబాబు మున్నగు పెద్దపెద్దవారికి అప్పులుపెట్టి వారిని పూర్తిగ దోచుకొని సీమకు చేరుకొనెను. ఈ డబ్బుతో అక్కడ సీమలో "హార్టుఫర్డు షైర్" అను నొక పెద్ద యెస్టేటును కొనెను. విరివిగ లంచ ముల విరజిమ్మి 7 తాలూకాలలో వోట్లను సంపాదించెను. ఈ యేడు తాలూకాల మెంబర్లనుకూడ తన చెప్పుచేతలలో నుంచుకొనెను. ఈ యేడుగురు సభ్యులు మంత్రికి బాసటలై యుండిరి. దుర్మార్గమునకై స్నేహము గలుపుకొన్న యీ

రకపు మెంబర్లందరు అప్పటికిజయ మొందిరి. దైవోపహత మగు కర్ణాట మండలము లన్నియు అవివేకుడగు కర్ణాట నబాబు చేసిన ఋణములకై యీ ఋణదాతల చేతులలో వప్పగింత పెట్టబడెను. ఈరీతిగ సంపాదించుకొన్న లాభములో తనవంతు అనుభవించుటకై పాపము అట్కిన్‌సన్ విశేషకాలము బ్రతుకలేదు. త్వరత్వరగ లాభములను జుర్రుకొని క్షణములో ప్రియాశలేకుండ కుబేరులై పోవలెనని కాంక్షించు అమిత దురాశాపరుల గతియే యీతని మిత్రుడగు బెన్‌ఫీల్డుకుకూడ పట్టెను. ఈ దురాశచే నీతడు జూదరి బేరములలో దిగెను. ఈ బేరములలో నీతనికి నష్టమువచ్చి దివాలాతీసెను. తుదకీతడు తినుటకు తిండి, కట్టుటకుబట్ట కూడ కరువై ఫ్రాన్సులో యూరుపేరు లేకుండ చచ్చెను.

ఇప్పటికి హేస్టింగ్సుకు వైస్రాయిగ తగినంత పరదేశ వాసమయి యుండెను. హైదరాలీ చనిపోయెను; మహారాష్ట్రులతోడి యుద్ధము ముగిసెను. ఇక తానింటికి వెడలుటకిదియే సుముహూర్తమని యాతడెంచెను. చిరకాలమనేక శ్రమలకు, అపాయములకు ఓర్చి, తాను తనపట్టుదలనే పట్టువీడక నడచెను. ధనము, కీర్తి, అధికారము, గౌరవము మున్నగు మహోన్నత పదములకు తనను మొగబ్రాకనీయకుండ యింతకాలమునుండి తన్నడ్డగించిన యాటంకములన్నియు తుట్టతుదకు పటాపంచలై పోయెను. "నీకు తప్పక చక్రవర్తి యనుగ్రహముకలుగ గలదనియు, ప్రభుబిరుదము నీకై వేచియున్నదనియు" మంత్రులగు మెల్‌బోరన్, తర్లో, మున్నగువారు తమ తమ యధికారకాలములందు హేస్టింగ్సుకు

అభయహస్త మిచ్చియుండిరి. "వేయేల హేస్టింగ్సుకు వ్యతిరేకముగనుండిన ఫాక్సు, నార్తు, మున్నగువారల సంయుక్త మంత్రివర్గము లోగడ పడిపోవుటకు యీ హేస్టింగ్సు యొక్క ప్రతిభయే కారణమను నంతవరకుకూడ నేనుచెప్పుచున్నాను" అని కోశాధ్యక్షుడగు తర్లో నుడివెను. "పార్లమెంటుకు హేస్టింగ్సుపైగల అభిమానము అతని పేరుకుగల పలుకుబడి— వీనిని బట్టియే అతనికి వ్యతిరేకముగనున్న సంయుక్త మంత్రివర్గము కూలిపోవుటయు, తత్స్థానమున ఆతనిమిత్రులు మంత్రులగుటయు తటస్థించెనని చెప్పవచ్చును. ప్రపంచ రంగమం దీతనికంటె మహోన్నతకీర్తి ప్రతిష్టల గాంచిన పురుషు నింకొకని నేనెరుగను. ఈమధ్య జరిగిన మంత్రి వర్గపు మార్పిడిలో యీతని పలుకుబడియే గాఢముగ తగిలెనని చెప్పవచ్చును" అని తర్లో పలికెను. ఇట్టివాని నిప్పుడీ కొత్త మంత్రివర్గమువారు ఉపేక్షించుట చాల కృతఘ్నత కాదా? కాబట్టి, హేస్టింగ్సుకు "డేల్సుఫర్డు ప్రభువు" అను బిరుదమునిచ్చిన బాగుండునని యీతనికి విశ్వాసపాత్రుడగు మిత్రుడును, యేజెంటునునగు "స్కాట్టు" అనునతడు సూచించెను. దీనికి తర్లోవల్లెయని, "యీ విషయము నంతయు నాకే వదలివేసినయెడల, అంతయు నేనే చక్కచేసెదనని" కూడ చెప్పెను. "వేమత్, గౌర్, సిడ్నీ, కార్మర్తెన్" మున్నగు తక్కిన మంత్రులుకూడ యీ ఫక్కికి సమ్మతించిరి. ఇంక ప్రధానమంత్రి పిట్టుయొక్క యనుమతియొక్కటియే తడవుగనుండెను. హేస్టింగ్సు చేసిన దేశసేవను పైకి రమ్యముగ పొగడుటలో పిట్టువెనుదీసినవాడు కాడు. కాని,

యీతనికి బిరుదు నివ్వవలసి వచ్చినప్పుడు మాత్రి మాతని కొక చిన్న యిబ్బందికల్పబైను. ఏలననగ, లోగడ 1773 సం॥లో డండాస్ ప్రేరేపణపై పార్లమెంటువారు హేస్టింగ్సు మీాద (రోహిలా యుద్ధసందర్భంలో) నొక యభిశంసన తీర్మా నమును గావించియుండిరి. ఆ తీర్మానమిప్పటికిని అతనిమీాద నిలిచియేయున్నది. అయితే, అప్పుడీ యభిశంసన తీర్మాన మును జేసినప్పుడు పిట్టు పార్లమెంటులో సభ్యుడుగలేడు. కావున, ఆతీర్మాన మిప్పు డీతనిని బాధింపవలసిన పనియే లేదని యొకవిధముగ చెప్పవచ్చును. అదిగాక, అప్పుడా తీర్మాన మేకారణముల పురస్కరించుకొని చేసిరో ఆ కారణములన్నియు శుద్ధ పనికిమాలినవనియు, అందావంతయైన నిజము లేదని తరు వాత ఋజువయ్యెననియు, యీా పిట్టుమంత్రియే చెప్పుచువచ్చెను. కాని, యేది యెట్లున్నను అప్పటి యభిశంసన తీర్మానదోష మును తిరిగి వేరొక అభినందన తీర్మానముచే తీసివేసినగాని తానిప్పుడీ బిరుదమువిషయమై చక్రివర్తితో శిఫార్సుచేయు టకు వీలుండదని పిట్టుమంత్రిచెప్పెను. "హేస్టింగ్సుపై యీా యభిశంసన తీర్మాన మున్నంతవరకు ఆతనికి గౌరవబిరుదు నొసంగవలెనని నేనెట్లు చక్రివర్తితో శిఫా రసు చేయగలనని పిట్టు పల్కెను. కాని, తర్లో యీ విష యమై పిట్టును మాటిమాటికి వత్తిడి చేయుచుండెను. పిట్టు చివర కొకసారి, "యీ విషయమై మీాకు నిజముగ గల అభ్యంతరము లేమో" చెప్పవలసినదని నిగ్గదీసియడిగెను. తనకు నిజముగ నాలుగభ్యంతరములు గలవని పిట్టు చెప్పెను. (1) ఇండియాలో మన రాష్ట్రములను పెంపుచేయుటకై

హేస్టింగ్సు ప్రయత్నించెను. ఈ పద్ధతి నాకెంతమాత్రము పనికిరాదు. (2) హేస్టింగ్సు దేశీయరాజుల విశ్వాసమును గోల్పోయెను. (3) ఆతడు కుంపిణీ డైరెక్టర్ల యుత్తరువులను పలుమార్లు ఉల్లంఘించెను. (4) తన మొగమోటస్థుల కందరి కొరకై బంగాళాదేశములో పెద్దపెద్ద విపరీతపు జీతముల నిచ్చు నుద్యోగముల సృష్టించెను. వీనికి తగు దృష్టాంతములజూపి ఋజువు పర్చవలసినదని తగ్లో నిక్కచ్చి చేసెను. "ఈ ఋజువుల సంగతి నాకు తెలియదని" పిట్టు పల్కెను. "ఇంతేనా? నీతో పనిచేయు నీతోడి మంత్రులందరికి యిండియా విషయమై యెంత తెలుసునో నీకూ అంతే తెలుసునన్నమాట" అని తగ్లో నవ్వెను. ఈ సమయమందే హేస్టింగ్సుకూడ సీమలోనున్న తన భార్యకొక జాబువ్రాసెను. దానియందిట్లున్నది:— "ప్రధాన మంత్రియగు పిట్టు పైకిచెప్పు మెత్తని మాటలనుచూచి నేను మోసపోవువాడను కాను. తన యిండియా బిల్లును ప్రవేశపెట్టునప్పు డీతడు నావిషయమై పల్కిన పలుకులు నాకు ములుకులై తగిలెను. ఇక్కడ యిండియాలో బ్రిటిష్ పరిపాలన నాతో యవసరములేకుండ గట్టిగ బలపడి నిలువగలుగువరకు నన్నెట్లో మాయమాటల చేత యింటికి రానీయకుండ యిక్కడేయుంచి నాచేత పని చేయించుకొనవలెనని— పాపము— యీ పిట్టు చూచుచున్నాడు. కాని, నేనీటక్కరి యెత్తులలో పడువాడను కాను. వారనుకొన్న దానికంటె ముందుగనే నావుద్యోగమును చాలించుకొని యింటికి వచ్చివేయుచున్నాను. దానితో వారి టక్కరి యెత్తులు కూలిపోయి వారాశాభంగులగునట్లు యిదో

చేయుచున్నాను చూడు" అని మిక్కిలి రోషావేశముతో తన భార్యకు వ్రాసికొనెను. ఈ బెదరింపు ప్రకారమాతడు 1785 సం॥ జనేవరి నెలలోనే యింటికి (సీమకు) వచ్చివేసెను. తన గవర్నర్ జనరల్ యుద్యోగమును మానుకొనుచు హేస్టింగ్సు కుంపిణీడైరెక్టర్లకీ ప్రకారముగ వ్రాసెను. ఎట్లాగైతేనేమి మీరాఖరుకు నన్ను వదలించుకొనగలిగినందుకు నేను మిమ్ములనెంతయు నభినందించుచున్నాను. నేనిప్పుడిట్లు యీ యుద్యోగమును మానుకొనుటవల్ల "చేతగాని అసమర్థపు ప్రభుత్వము" నున దికమీద నుండకుండ అంతమొందించుటకు కారకుడనైనాను గదాయని నేను సంతోషించుచున్నాను. (అనగ, నేనుండుట చేతనేగద మీ కుంపిణీ ప్రభుత్వమున కింతటి చెడ్డపేరువచ్చినది. నేనిప్పుడు మానుకొనుటవలన మీకా చెడ్డపేరు లేకుండ చేసినవాడనగుచున్నానుగదా యని నేను సంతోషించుచున్నాను.) నేనోసరించిన యీ "చేతగాని యసమర్థపు ప్రభుత్వపద్ధతి"— పాపము— మీకెంతయో నష్టముగలిగించెను! ఆంగ్లజాతికంతకు అప్రతిష్ట తెచ్చెను! ఇట్టివాడను నేనికయెందుకు యిక్కడవుండడం" అన్నట్లుగ తనను గూర్చి పిట్టుమంత్రి లోగడ పార్లమెంటులో పల్కిన పలుకులనే పురస్కరించుకొని హేస్టింగ్సు వ్యంగ్యముగ యెత్తిపొడిచెను. (మంత్రిమెత్తు సాగకుండ తక్షణమే యుద్యోగమును మానుకొన్నాను గదా యని) నిజమునకు హేస్టింగ్సుకు లోపలయెంతయో సంబరముగ నుండెను. తాను పన్నెండు సంవత్సరములనుండి యేకాధ్వరముగ నొనర్చిన మహాద్భుతకార్యముల నొక్కసారి వెనుకకు

తిరిగిచూచుకొన్నప్పుడు ఆతని యెడలు సంతోష పారవశ్య మున నుప్పొంగెను. తానెంతలేసి ప్రతిఘటనల నవలీల నెదిర్చినది— తానెంతలేసి గండములగడచి బయట పడినది— తలచుకొన్నప్పు డాతని కెక్కడలేని యహం భావము నెగవేసికొనివచ్చి అతడు ప్రితాపవాక్యముల ప్రేలనారంభించెను. ఈతడు రాజ్యాధిపత్యమునకు వచ్చి నప్పుడు కుంపిణీ ఖజానాయంతయు ఖాళీగనుండెను. ప్రభు త్వము దుర్బలమైయుండెను. ఈరెంటిని ఆతడు తనకాల ములో బాగుపరచెను. కుంపిణీ ఖజానాను నింపించెను. ప్రభుత్వములో ప్రితిశాఖను దిట్టపరచెను. నేను మొట్ట మొదట యూరుపేరులేని వానిగనుంటిని, నాకిక్కడ దిక్కెవరు లేకుండిరి. ఇంటివద్ద—సీమలోనైనను—నాకు పెద్దయుద్యో గపు హాయలోనున్న బంధువులెవరును లేకుండిరి. పరదేశము లందైనను నా తెలివితేటలవల్లను, స్వప్రయోజకత్వమువల్లను సంపాదించుకొన్న పలుకుబడియేగాని వేరొండు అండనాకెద్దియు లేకుండెను. నేనుపట్టినది బంగారమగుచు, నే పూనిన ప్రితి కార్యము జయప్రిదమగుటనుబట్టి భారతవర్ష ప్రజలకు నాయెడ గలిగిన భయభక్తి విశేషములును, నాతోకలిసి పనిచేసిన కుంపిణీ యుద్యోగస్థులయొక్కయు, పౌరులయొక్కయు ప్రేమా తిశయములును మాత్రమే నాకాధారముగ నుండెను. ఆరు సంవత్సరము లేకరీతిగ కౌన్సిలులోని యితరసభ్యులు నన్నెం తయో యిబ్బందిపరచిరి. నాకాలిసేతుల కెంతయో యడ్డం కులు కల్పించి బహిరంగముగ, నన్నెన్నిరీతులనో నవమాన పరంపరలపాల్జేసిరి. కాని, వారు నన్నిట్లిన్నిబాధలు పెట్టు

చున్న ఆకాలమందు సైతము వ్యావహారికగతిని మాత్రము నా చేతులనుండి తప్పించవలయునని వారెన్నడు ప్రయత్నింప లేను. ఇక, నేనన్ననో, వారందరికంటె యెక్కువ సామర్థ్యము, యోగ్యత, గలవాడనను గట్టినమ్మకముచేతనే చెక్కు చెదరక నిలువగలిగితిని. ఆ నమ్మకమే,— వారందరికంటె నేనే గట్టివాడనను ఆ స్పృహయే — నన్ను యెన్నికష్టములు వచ్చినను పడిపోకుండ నిలువబెట్టినది. అందుచే, యెన్నికష్టములు వచ్చినను నేను బహు ఓపికతో సహించి, అనుభవించి, యూరకొనుచుంటిని. ఓర్పుతో నేను బాధనొందితిని. చేయగలప్పుడు నేను నా విధిని తప్పక చేయుచుంటిని. ఎన్నటికైన మంచిరోజులు వచ్చి నాకు మంచి సాధనసంపత్తి దొరుకకపోవునాయని నేనెదురు చూచుచుంటిని. ఏ పలుకుగాని, యే క్రియగాని, నాదృష్టిని పడకుండ పోలేదు. నేనెన్నడు నీచముగ లొంగిపోయి నావిరోధులకు నేనొక్క క్షణమైనను నాపై విజయ మొసంగలేదు. నా శత్రువులు విసిగి, చచ్చి, చివరకు కాలికి బుద్ధిచెప్పుకొనిరి. నేను చెక్కుచెదరక నా స్థానమందే గట్టిగ నిలువబడితిని. నా శరీరబలముగాని, బుద్ధిపాటవముగాని, నన్నొక్క క్షణమైనను విడనాడలేదు. "ఇట్టి పీడు సాధారణ నేరస్తుడుకాదురాబాబూ!" అని బర్కు ఘోషించిన దానిలో తప్పులేదు. నిజముగ వీడు— హేస్టింగ్సు— సామాన్య నేరస్తుడుగాడు. అక్షరాలా వీడు "దుర్ణయాగ్రేసర చక్రవర్తి" యని బర్కుచేసిన వర్ణన సర్వవిధముల వీనికి తగియున్నది. హేస్టింగ్సు కలకత్తా కౌన్సిలుకు అధ్యక్షుడుగను,

గవర్నర్ జనరలుగను యిండియాలో పండ్రెండు సంవత్సరములు శుద్ధ బేజవాబు దారీయగు పరిపాలనను సాగించెను. పురాతన రాజ్యపు పొలిమేరలను నానా చీకాకుపరచి, సర్వము గందరగోళముచేసెను. ఈతడనేక హత్యలగావించెను. పరరాజ్య ధనాదుల నపహరించెను. యుద్ధపుదోపిడీలు, దుర్మంత్రాంగములలో తనకుగలిగిన విజయములు, కుంపిణీ బొక్కసపు పెంపు— యివన్నియు తన పరిపాలనా సామర్థ్యమునకు తన ప్రజ్ఞకు నిదర్శనములని యీతడు చాటుకొనుచున్నాడు. ఈతడు చిప్పకర్ర చేతికిచ్చిన రాజులు, యీతడు ధ్వంసమొనర్చిన పట్టణములు, అన్నమో రామచంద్రాయని యేడ్చు అసంఖ్యాకప్రజలు, కర్షకులు, యీహేస్టింగ్సు పేరుచెప్పిన తిట్టి దుమ్మెత్తి పోయుచుండవచ్చును. కాని, కుంపిణీ డైరెక్టర్లును, సీమప్రభుత్వపు బోర్డువారునుకూడ హేస్టింగ్సులో యేమియు తప్పులేదని తీర్పు చెప్పుచున్నారు. నిజమే ! ఏలననగ "హేస్టింగ్సు యిండియానుండి డబ్బుదోచుకుంటే అంతకు పదిరెట్లుగ కుంపిణీ భాగస్వాములకు దోచిపెట్టలేదా? కాబట్టి, యిందు హేస్టింగ్సు తప్పేమున్నది ? కాబట్టి, లండను నగరమందున్న గొప్పవర్తకులు, గొప్ప గొప్ప మంత్రులు, యావన్మంది హేస్టింగ్సు నెంతయో పొగడిరి. ఉల్ శాక్, యార్కు, మున్నగు మంత్రులేగాక, తుదకు సార్వభౌమపదవి నలంకరించిన యా మూడవజార్జి చక్రవర్తిగారు కూడ హేస్టింగ్సు చేసిన మహత్కార్యములకు హర్షామోదములను దెలుపు దరహాస చంద్రికల నాతనిపై బరపిరి. వేయేల, కావిూమధ్య పోగొట్టుకొనిన అమెరికారాజ్యమునకు బదులుగ

యిప్పుడీతడు తమకు మరియొక రాజ్యమును సంపాదించి తెచ్చిన మహాయోధాగ్రేసరుడుగ యెంచి సీమప్రజలందరీతనికి ఘనమగు స్వాగతమొసంగిరి. ఈమాట నిజముకాదని యెవరనగలరు ?

కాని, సీమలో కుంపిణీవారి లెక్కలనువ్రాయు గుమాస్తాలు మాత్రము, "అయితేయేమి, యీ రాజ్యపుగెలుపువల్ల కంపెనీకేమైనా డబ్బు లాభమువచ్చినదా ?" యని లెక్కలు వేసిచూడ నారంభించిరి. (ఉహూఁ డబ్బు లాభమేమీ రాలేదు !) ఈ లెక్కల వివరములన్ని బాగుగ తెలిసిన ఒక పెద్ద మనిషి హేస్టింగ్సు పరిపాలన వలన గలిగిన ఫలితములను గూర్చి యీ రీతిగ మూడు ముక్కలలో చెప్పియున్నాడు. 1772 సం॥ లో అనగ హేస్టింగ్సు రాకపూర్వము కుంపిణీ ఆదాయము 23 లక్షలు. ఖర్చు 17 లక్షలు పోను నికర లాభము 6 లక్షలు. ఈ ఆరులక్షల లాభమును కుంపిణీ భాగస్వాములు, ఉద్యోగస్థులు మున్నగువారు పంచుకొనెడివారు. 1785 సం॥ లో—అనగ హేస్టింగ్సు పరిపాలనానంతరము— కుంపిణీ రాబడి 53 లక్షలు. ఖర్చు 43 లక్షలు పోను నిలవ 10 లక్షలు. అయితే, యీ నిలవకు ప్రతిగ ఇండియా కుంపిణీ వారుచేసిన అప్పు 18 లక్షలనుండి కోటి నాలుగు లక్షలకు హెచ్చెను. దీనికి తోడు సీమలో గవర్నమెంటు నుండియు తదితరులనుండియు తీసికొన్న అప్పు విపరీతముగ పెరిగియుండెను. కాబట్టి, తుదకు తేలిన ఫలితమేమనగ :—హేస్టింగ్సు పరిపాలనవచ్చి కుంపిణీకి అదివరకేయున్న అప్పుకు మరి ఒక కోటి 25 లక్షలు చేర్చెను. అదనముగ యీతడు కలిపిన యీ

అప్పుడు నెల 1 కి నూటికి 0-6-8 ల॥ చొప్పున వడ్డికట్టు కొన్నను దీనిపై నివ్వ తేలు వడ్డి కుంపిణీ కీతడు హెచ్చుగ తెప్పించిన దివిన్యూ కన్న యెక్కువే యగుచున్నది. "

ఈ లెక్కలలోని రహస్యము ఆరోజులలో ప్రజల కందరికి బాగుగ తెలియునట్లు యెవరు దీనిని విప్పి చెప్ప లేదు. చావుకబురు చల్లగ చెప్పమన్నట్లు యిట్టి విషయములలోని రహస్యములు నెమ్మదిగ గాని బయట పడవు. అందరు రహస్యములు ఒక్కొక్కటే బయట పెట్టుదురు. దానిని కూడ సరాసరి చెప్పక, అనేక మాయమాటల చేతను, అనేక సమాధాన వాక్యముల తోడను ప్రజల మనస్సున కవి యిదమిత్థమని నిశ్చితముగ తెలియకుండు లాగున కప్పిపుచ్చి చెప్పుదురు. నిజమును, సరాసరి, యేకటాకీని చూడ నివ్వరు. అట్లు చూడనిచ్చిన యెడల, వారి పనియే చెడిపోవునుగద. ఇండియాలో ప్రజలను అన్యాయముగ దోచుకొనుటవల్లను, అన్యాయముగ పరరాజ్యముల నపహరించుటవల్లను, బాగుపడిన యింగ్లీషువా రెందరో—నూరులకొలది, వేలకొలది—యున్నారు. ఈ నిజము నంతలో వెలిబుచ్చినచో వీరందరి పని యేమి కావలెను? అందుచే, వీరంద రేమి చెప్పిరి? హేస్టింగ్సు పరిపాలనవల్ల కుంపిణీ కెంతో లాభము వచ్చినదని వీరందరు సాక్ష్య మిచ్చిరి! బాగుపడినది పొలమూ కాదు; పొలము యజమానీ కాదు. మధ్య నాగలికర్రతో భూగర్భమును ఛేదించిన వారును, పండిన పంటలో చేతికి చిక్కినది యెత్తుకొని పోయిన వారును! తానింగ్లాండుకు వచ్చినప్పుడు తననక్కడ ఆహ్వానించి గౌరవించు

టకు కొంతమంది పై తరగతులవారిని తయారుచేసిపెట్టుటకు హేస్టింగ్సు తన భార్యను ముందుగ సీమకు పంపుకొనెను. "ఇది మొగుణ్ణి విడిచిపెట్టి యింకొక మొగుణ్ణి కట్టుకొన్న రండ" యని చెప్పి విగ్ శాఖకు చెందిన కులీనులగు ప్రభు భార్యలెవరును యీమెను గౌరవించలేదు. కాని, జార్జి రాజు భార్య 'చార్లటీ' రాణిమాత్రి మీమెను సకలగౌరవము లతో దర్బారునందాదరించెను. ఇంక చాలమంది గొప్ప స్త్రీలు కూడ ఆమె యింటివద్ద గుంపులుగ జేరి యామె తమ కొసంగిన యమూల్య పారితోషికముల గూర్చి యెంతయో మురియుచు ఆశ్చర్యపడుచుండిరి. ఈమె రాజుగారికి కూడ గొప్ప దంతపుమంచమును— చక్కని నగిషీపనితో కూడు కొన్నది—బహుమతి చేసెను. (యిది ఇండియానుండి ఎత్తుకు వచ్చినదే) తన జన్మయందెన్నడెరుగని యిట్టి యమూల్య విచిత్ర పారితోషికమును జూచి రాజుగారు కూడ లోబడిరి. మరియు, యీ కులట సిగనుండియు, సందముగ నలవరించుకొన్న దుస్తుల నుండియు, రాలుచున్న రత్నములను, ముత్యములను (యిండియా నుండి తేరగా దోచుకొని వచ్చిన వానిని) చూచి ఆనాటి ఆస్థాన కవులెల్ల మోహాపరవశులై యనేక రీతుల వర్ణింప దొడంగిరి. ఇండియా నుండి తేరగ దోచి తెచ్చు కొన్న యీ హారములను పతకములను (గుంభనగనైన నుంచు కొనక) యింత బడాయిగ యింత అవివేకముగ, నలుగురిలో యింత ప్రగల్భముగ ప్రదర్శించుటవలన, బర్కు, ఫాక్సు, మున్నగు వారికోపము మరింత రేగెను. దీనికితోడు హేస్టిం గ్సుకు ప్రభు బిరుద మివ్వవలసినదని ఆతని యేజెంటు

స్పాట్టు అంతకంటె అవివేకముగ నప్పుడే సూచించుట వలన కూడ వీరి యాగ్రహాగ్నికి వాయువు తోడైనట్లయ్యెను.

1785 సం॥ జూన్ 30 వ తేదీన హేస్టింగ్సు సీమకు వచ్చివేసెను. ఆతనికి రాజు, మంత్రులు, ప్రభువులు, సమస్త గౌరవసన్మానములతో స్వాగతమొసంగిరి. బర్కు ఒక్క క్షణమైనను యూరుకొనక వెంటనే నోటీసు యిచ్చెను. అప్పటికి పార్లమెంటు సమావేశము పూర్తికావచ్చెను. అందుచే రాబోవు పార్లమెంటు సభలో యీ మధ్య హేస్టింగ్సు యిండియాలో వైస్రాయిగ చేసిన దురంత చర్యలనన్నిటిని గూర్చి నిక్కచ్చిగ విచారణ చేయవలసియుండునని బర్కు పార్లమెంటుకు నోటీసు యిచ్చెను. ఆ శీతకాలము 3, 4 నెలలు బర్కు బీకన్సుఫీల్డు పట్టణమున కూర్చుండి యిండియాకు సంబంధించిన కాగితములనన్నిటిని ఆమూలాగ్రముగ పరిశోధింపసాగెను. ముందు యీ విషయమై తాను గావింపవలసిన పనిని గూర్చి యోచించుచుండెను. ఫాక్సు, ఫ్రాన్సిస్, మున్నగు వారితో, యీవిషయమై యుత్తర ప్రత్యుత్తరముల నడపుచుండెను. "మనము చేసే ప్రయత్నమువల్ల యేమీ లాభముండదని" చెప్పి ఫాక్సు, బర్కును, యీ పనినుండి మాన్పెడివాడే. కాని, "గెలిచినా, గెలవకపోయినా మన మీ పనిని—యీ విధిని—నెరవేర్చి తీరవలసినదే" యని చెప్పి ఫ్రాన్సిస్ గట్టిగ పట్టుబట్టెను. భారత ప్రజలను కొల్లగొట్టుటకై హేస్టింగ్సు మున్నగు వారొనర్చిన జంకు కొంకు లేని దురాగతపు పనులను, నిరపరాధులగు ప్రజలయెడ వారు గావించిన కటిక అన్యాయములను, అక్రమములను ఫ్రాన్సిస్

సమస్త వివరములతో—ఒక్కటికూడ వదలిపెట్టకుండా, పూస గుచ్చినట్లు వర్ణించియుండెను. ఇవన్నియు బర్కు బుర్రకు పూర్తిగ యెక్కెను. ఇక్కడ యిండియాలో భారతప్రజ లేరీతిగ నుందురో, వారి నేయేరీతిగ హేస్టింగ్సు మున్నగువారు హింసించిరో—యీ వివరములు యావత్తు బర్కు కండ్లకు గట్టినట్లు ప్రత్యక్షమగుచుండెను. ఇవన్నియు ఆతని నిగూఢ మనోంతరాళమందు పూర్తిగ నిండియుండి అనుక్షణ మాతని కండ్ల యెదుట తాండవమాడుచుండెను. ఆత డేకాంతముగ కూర్చుండి చదువుకొనుచున్నప్పుడేమి, అటు తోటలలోనికి షికారు వెళ్ళినప్పుడేమి, ఆతడు తన మనోఫలకముపై మహాద్భుత భయానక భారత చారిత్రిక రంగముల చిత్రించుకొను చుండెను. అట్టి యద్భుత రంగముల నీనాడు మన మెన్నడెరుగము. ఇట్టి మహాద్భుత, భయానక, భీభత్స రంగముల తన యనర్గళ వాగ్ఝరీ ప్రభావముతో ఆ పార్లమెంటు మహాసభ యందనన్య సామాన్య రీతిని చిత్ర విచిత్రగతుల చిత్రింప సాగిన యెడల, అద్దానిఫలితమెట్లు పరిణమించునో—అమ్మహాసదస్యుల యొక్కయు, అటు బయట ఆంగ్ల ప్రజాకోటి యొక్కయు,మనోగతులెట్లు తారుమారగునో,అను సంశయమును గూర్చి ఆత డప్పు డొక్కక్షణమైనను విచారింప సాహసింప లేదు. తన కండయగు "విగ్" పక్షము వారు గత యెన్ని కలలో పూర్తిగ విచ్ఛిన్నమై పోయిరని బర్కుకు తెలియును. తమ స్థానము లెట్లో పోకుండ నిలుపుకొన్నవారు సైతము చాలమంది యిండియా యంటే యీషణ్మాత్రమైనను శ్రద్ధ లేనివారై యుండిరి. ఇదిగాక, యింకొక విశేషమేమనగ:—

"తా మీా యెన్నికలలో ఓడిపోవుటకు యీా పాపిష్ఠి యిం డియా బిల్లే కారణము" ని చాలమంది గొణుగు కొనుచుండిరి కూడాను. కాబట్టి, దిక్కుమాలిన యీా యిండియా గొడవ మన కెందుకు పొమ్మని చాలమంది అసహ్యించు కొనుచుండిరి. పార్లమెంటు సమావేశమునకు ముందు యీా విషయమై జరిగిన "విగ్" పార్టీవారి సభలో కూడ స్పష్టముగ యీా యభిప్రాయమే ప్రబలియుండెను. కాని, బర్కు లొంగువాడు కాడు. తన జీవితమునకంతయు యిదే మహదవకాశము. "ఈ చుట్టును పరివేష్టించియున్న యావన్మంది ధనికులును కులీనులును యీా పూనికను పరిత్యజించినను నేను మాత్రము దీనిని వదలిపెట్టక నా విధిని నేను నెరవేర్చితీరుదునుసుమా" యని బర్కు గంభీర ముగ నందరి కెరుకపరచెను. ఈతని మనోనిశ్చయమును జూచి తుదకు ఫాక్సుకూడ యితనితో పాటే నిలువబడెను. మరియు, పుష్కలమగు వాక్చతురతకును, బుద్ధిసూక్ష్మతకును, యిది వరకే పేరుపొందిన యువకు డొకడు బర్కుకు సహాయకారిగ నుందునని చెప్పి తనంత తానుగ వచ్చి నిలచెను. రానున్న యీా పోరాటములో గలిగిన విజయగౌరవము లన్నియు తుదకీ యువ కుడే కొట్టుకొని పోవునని యితడుగాని, యితని నాయకుడగు బర్కుగాని తలంచి యుండలేదు. ఈ యువకుని పేరే షెరిడన్.

# భరతఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన

## పదమూడవ అధ్యాయము.

లోకకంటకుఁడు లాంగను.

1787—1788



"ఈ రోజుపని యీ మనిషి పని కాదు. ఈ ఖైదీ దోషియా నిర్దోషియా యనునదే ప్రధానవిషయము కాదు. కోట్లకొలది మానవులు దుర్గతిపాలు గావలెనా లేక సౌఖ్యముగ నుండవలెనా యనునదే ప్రధానమగు ప్రశ్న. దేశమునుండి వెడలగొట్టబడి దిక్కులేక దౌర్భాగ్యులై తిరుగు రాజులు, బహుజనాకీర్ణములగు తెగలు, నానాయిడుములంబడు జాతులు, వేషభాషాదులందసంఖ్యాకులగు మానవకోట్లు యీశ్వర విధానముచే నేడొకే యంత్రమందు దగుల్కొని మీ న్యాయపీఠము సముఖమున మొర్రిడుచున్నారు"

— బర్కు

1787 వ సం॥ యేప్రిల్ 4 వ తేదీన బర్కు పదకొండు నేరములను హేస్టింగ్సుపై పార్లమెంటు మహాసభయెదుట మోపెను. అవేవన:—

1. రోహిలా ప్రజలను సమూలముగ నాశనము చేయుటకై యింగ్లీషు శిపాయిల నద్దెకిచ్చుటలో హేస్టింగ్సు గావించిన మహాన్యాయము, కౄరత్వము, మిత్రద్రోహము మున్నగు నవి యొకటినేరము.

2. షాలంచక్రవర్తి కివ్వవలసిన కప్పము నివ్వక ఆతనియెడ కౄరత్వము వహించుట రెండవ నేరము.

3. కాశీరాజును బలవంతముగ దోచుకొని పీడించుట మూడవ నేరము.

4. అయోధ్యనవాబు కుటుంబమువారిని నవమాన పరంపరల పాల్సేయుట నాల్గవ నేరము.

5. ఫరూకాబాదు విషయములో గావించిన అన్యాయము, అజాగ్రత అయిదవ నేరము.

6. నందనవన మననొప్పు అయోధ్య రాజ్యము నంతను పాడు వడిన బీడుగ జేసివైచుట ఆరవ నేరము.

7. తన యిష్టులకు వల్లమాలిన జీతములను, కంట్రాక్టులను యిచ్చుట యేడవనేరము—

8. కుంపిణీవారి యుత్తరువులకును, పార్లమెంటు చట్టమున కును విరుద్ధముగ రహస్యముగ, అనేక లంచములమేసి, ఆ డబ్బును సొప్పిని యోగ పరుచుట యెనిమిదవ నేరము.

9. తన యుద్యోగమునకు రాజీనామా యిచ్చుచున్నానని చెప్పి కుంపిణీ ప్రెసిడెంటు ద్వారా మొదట రాజీనామా కాగితములను దాఖలుచేయించి, తరువాత నేనట్లు దాఖలు చేయలేదని అబద్ధమాడుట తొమ్మిదవతప్పు.

10. తన సంరక్షణలోనున్న ముజఫర్ జంగ్ నెడ విశ్వాస ఘాతుక మొనరించుట పదియవనేరము.

11. ఆప్తులకు, ఆశ్రితులకు, సొమ్ముకట్టిపెట్టి, వారిని భాగ్యవంతులుగ జేయుటకై యెక్కుడను కనివిని యెరుంగని లంచముల నిప్పించుట పదకొండవ నేరము.

ఇవిగాక, యింక యితర నేరములు అయిదు హేస్టింగ్సుపై మోపబడెను. తనను కామన్సు సభయెదుట విచారించవలయు నని యీ మహాపరాధి విజ్ఞాపన జేసికొనెను. "ఇంతనిర్లజ్జ యగుపని నేలజేసితివని ప్రతివాడు వచ్చి నన్నడిగెవాడే. నా మిత్రుడు ఒక్క తర్లో తప్ప ప్రతివాడు యీ పని కూడ దని ఖండించినవాడే. అయితేనేమి, చారిత్రప్రసిద్ధమగు పద కొండు గొప్పనేరములు నామీద మోపబడి, వానికినేను అయిదురోజులలోనే సంజాయిషీ చెప్పుకొనవలెనని విధించి నప్పుడు నేనేమిచేయుదును? ఇవి చాలక, విచారణ ప్రారంభ మైన రెండవ రోజుననే, మరి అయిదు చార్జీలు నామీద బెట్టిరి!" అని హేస్టింగ్సు వ్రాసికొనెను. ఈతని సంజాయిషీ వినుటకు జనులలో నధికోత్సాహముగనుండెను. పార్లమెంటు భవనమంతయు జనులతో కిటకిట లాడుచుండెను. క్రోధావేశ మును వెలిగ్రక్కు గంభీరవాక్కులు హేస్టింగ్సు నోటినుండివచ్చి

పడునని ప్రతివాడు చెవులు దోరబెట్టుకొని, దృష్టులు హేస్టింగ్సు పైననేపెట్టి, యెంతో ఆతురతతో కనిపెట్టుకొని యుండిరి. కాని అట్టి గంభీర వాక్కులేమియు రాలేదు. హేస్టింగ్సుకు వాగ్మిచ నాకౌశలమేమియు లేదని— అతనికి తప్ప—ప్రతివానికి తెలుసును. "వీళ్లతో మామూలు వాగ్వాదములకు దిగుట తన గొప్పతనమునకు లోప" మనునంత అహంభావ మతని కుండెను. "కాబట్టి జరిగిన సంగతులన్నీ తనకు తోచినరీతిగ ఒక్కసారి చెప్పివేసేస్తే పోతుంది, దీనిలో మహా పెద్దయేమున్నది" అను గర్వోన్మత్తతతో నుండెను హేస్టింగ్సు. కాని, సభవారు వేరు విధముగ తలంచిరి. వేటపరుగును జూచు నాసతో వారువచ్చిరి; కాని, అచట మందగతితప్ప వేరేమియు గన్పించలేదు. ఒకటి రెండు గంటలు బిగ్గరగ చదివిన పిమ్మట అభ్యాసములేమిచే ఆయాసమువచ్చి చదవలేక పోయెను. అంతట ప్రక్కనున్న గుమాస్తానుపిలిచి తక్కిన భాగములను తనకుగాను చదువుమని చెప్పెను. గుమాస్తా చదువ నారంభింపగానే అందరికి విసుగుబుట్టి చాలమంది జనము వెళ్లిపోయిరి. కాని, ఆతడు తదుపరి మూడుదినముల వరకు నిర్వికార భావముతో తన సంజాయిషీని తానే చదువసాగెను. "ఆ సభలో యిదివరకెన్నడులేని శ్రద్ధతో నే చదువుదానిని విన్నారు. దానివలన మంచిగుణము గలిగినది. ఏలననగ:— నేను చదివినదానిని విన్నమీదట అందరి మనస్సులు నామార్గమునకే మరలినవి. అప్పుడు సభవారిపై నాకు చిక్కినపట్టు నేటివరకు వీడలేదు" అని హేస్టింగ్సు వ్రాసికొనెను. కాని, యీ విషయమై మాత్రమతను తమా

హాగా పొరబాటుబడెను. ఏలననగ:— ఏ యాధారమును జూచుకొని తాను తన నిర్దోషిత్వమును ఋజువు పరుపజూచుకొన్నాడో ఆ యాధారములోని రహస్యము నంతను ముందుగ తానే తన ప్రతికక్షులకు చెప్పివేసెను. ఇది అతను చేసిన గొప్ప పొరబాటు. "నేను కుంపిణీవారి నౌకరును కాబట్టి నా పరిపాలనయందలి మంచి చెడ్డల కన్నిటికి నేను కుంపిణీవారికే జవాబు చెప్పవలెనుగాని, తదితరుల కెవరికి చెప్పవలసిన బనిలేద" ని అతడు పార్లమెంటువారి యెదుట చెప్పెను. ఈమాటలకు మంత్రులేమియు కోపగించుకొనలేదు. ఈ మాటలయొక్క ధోరణికికూడ వారంత ఆక్షేపించలేదు. అదిగాక, మొదటినుండి చివరవరకు వారితనియందు స్నేహభావమునే జూపుచువచ్చిరి. "ఈతని సమాధానమును అందరు పూర్తిగ వినలేదు. కాబట్టి, యిదంతా అచ్చువేసి, పార్లమెంటు మెంబర్లందరికి పంచిపెట్టవలసినద" ని సభవారాజ్ఞాపించిరి.

అందరు యిదంతా చదువుకొని నెలరోజులు బాగా ఆలోచించుకొన్న పిమ్మట, "రోహిలాలయెడ గావించిన క్రూరకృత్యములకు గాను హేస్టింగ్సును ఖండించవలసినద" ని చెప్పి 1785 సం॥ జూన్ 1 వ తేదీన బర్కు పార్లమెంటు మహాసభవారియెదుట ప్రతిపాదించెను. ఈ విషయమై హేస్టింగ్సు ప్రవర్తన నింద్యార్హమని లోగడ 1773 సం॥ లోనే "డండాస్" అను మెంబరు చేసిన ప్రతిపాదనపై పార్లమెంటు సభవారు అభిశంసన తీర్మానమును గావించియుండిరి. కాని, "డండాస్" అను ఆసభ్యుడే యిప్పుడు గవర్నమెంటు

వారేర్పరచిన బోర్డులో మెంబరుగ చేరెను. అందుచే, 13 ఏండ్ల క్రితము తాను పలికినపలుకులనే తానిప్పుడు తిరిగిచెప్పుటకు నిరాకరించెను! దీనివిషయమైన చర్చ రెండురాత్రుళ్లు పట్టెను. ఇక తెల్లవారబోవుచుండగ, అప్పుడు పిట్టుమంత్రి మెల్లగలేచి, బహుతెలివితేటలతో, అసలు చార్జిలోని గుణాగుణములనటుంచి యిట్లు చెప్పదొడంగెను. "ఈనేరము 13 యేండ్లక్రిందటనే విచారింపబడినది. అప్పుడట్లు విచారించియు యీతనిని గవర్నర్ జనరల్‌పదవినుండి తీసివేయక యీ 13 యేండ్లనుండియు ఆ యుద్యోగమందే నిలిపియుంచిరి. కాబట్టి, దీనిబట్టి యర్థమేమి చెప్పుకొనవలెను? ఆ తప్పు క్షమింపబడి తుడిచివేయబడినట్లే యెంచుకొనవలసి యున్నది. ఒక్కసారి యిట్లు క్షమింపబడి తుడిచివేయబడిన నేరములను— యీ 12 యేండ్లనుండి అందరికి తెలిసియేయున్న సంగతులను తిరిగియిప్పుడు 12, 13, యేండ్లయిన తరువాత తీసికొనివచ్చి దానిమీద తిరిగి విచారణజేసి శిక్షించవలయుననుట చాల అసందర్భమేగాక, మిక్కిలి అన్యాయమనికూడ గట్టిగ చెప్పవలసియున్నది. ఒకసారి యీపద్ధతి మొదలుపెట్టినామంటే దీనికి అంతు వుండదు" అని బహుమెళకువగ, అసలుసంగతిని దూరముగపెట్టి, చర్చను ప్రక్కదోవలోనికీడ్చెను. ఈరీతిగ బర్కుయొక్క ప్రతిపాదన యెదిరింపబడి వోటుకుపెట్టగ ఒకటి రెండు వోట్లతో ఓడిపోయెను.

"విట్‌సన్ టైడ్" పండుగ అయినతరువాత సమావేశమైన పార్లమెంటుసభలో "చయతుసింగునుండి బలవంతముగ సొమ్ము దోచుకొన్న" నేరమునుగూర్చి ఫాక్సు ప్రతి

పాదించెను. ఇట్టి నేరస్థాపనను గూర్చి ప్రతిపర్యాయము మొగము చిట్లించుకొనుచు హేస్టింగ్సుకు తప్ప అందరికి ఆశ్చర్యమగునట్లుగ ముద్దాయిని వెనుకవేసికొని వచ్చుచుండు పిట్టుమంత్రి యీపర్యాయమేలనో ఆకస్మికముగ, ఆతనిని జారవిడిచెను. చేలోకువయగు తోడియుద్యోగులకొరకును, అవివేకులగు స్నేహితులకొరకును, తాను తన గౌరవము నేల పోగొట్టుకొనవలెనని అప్పటి కాలచిహ్నములను గుర్తించి పిట్టుమంత్రి బహు మెళకువతో గ్రక్కున త్రిప్పుకొనెను. ఎవరో, యెప్పుడో, యెక్కడో, చేసిన తప్పుల కన్నిటికిని తానేల యిప్పుడు మద్దతుచేసి, యేల నలుగురిలో అపకీర్తిపాలు గావలెనని పిట్టుమంత్రి తలంచెను. కావున, అప్పటి ప్రజాభిప్రాయమును, కాలచిహ్నమును గమనించి పిట్టుమంత్రి తన గౌరవమును నిలుపుకొన దలచినయెడల హేస్టింగ్సును వెనుకవేసికొనివచ్చు పద్ధతి మానివేయుట అవసరమని తలంచెను. ఈ విచారణయొక్క ఫలిత మిట్లుండు నను భావిసూచన పిట్టుమంత్రి కేమైన తెలిసియుండెనా? లేక "ఎంత కాలమునకు తెగక, అంతులేకుండ యీ రీతిగనే విచారణ జరుగుచు పోవుచున్న యెడలనే యెన్నటికైన తన మిత్రుడు తప్పించుకొనుట కేమైన సందు దొరకవచ్చు" నను ఊహతో పిట్టు ఉదాసీనభావము వహించియుండెనా? ఈ ప్రశ్నల కెవరు సమాధానము చెప్పుదురు? ఎవరికి తెలియును? హేస్టింగ్సుకు పిట్టుయందు యెప్పుడూ నమ్మకములేదు. అందుచే, యిప్పుడీ యుదాసీనభావమునుజూచి హేస్టింగ్సు అనేక రీతులుగ తలంచెను. "ఇట్టి యుదాసీనతకు పిట్టుకు

తన యెడగల యీర్ష్యయే కారణము" ని హేస్టింగ్సు చెప్పెను. "రాజుయొక్క దృష్టిలో తనకు నేను పోటీ వత్తుననియో, లేక పార్లమెంటు అధికారములో తనకు నేను పోటీ వత్తుననియో, పిట్టుమంత్రి నన్నుచూచి భయపడి, నామీద యీర్ష్య చేత యిట్లా ఆకస్మికముగ మారిపోయినాడని" హేస్టింగ్సు చెప్పెను. కాని, దర్పోద్ధతుడగు యీమహారాజ్యాంగధురీణునకు పిట్టుకు—యిట్టి పిచ్చిభయము మనస్సులో ఒక్క క్షణమైనను తట్టినట్లు తలంచుటకువీలు లేదు. అదిగాక, చస్తానో, బ్రతుకుతానో అనే భయముచేత తనపై మోపబడిన నేరముల నెట్లయిన సమర్థించుకొనుటకై అహోరాత్రములు పాత కాగితాలన్ని బిక్క మొగముతో తిరగవేసి, బోర్లవేసి, చూచుకుంటూవుండే హేస్టింగ్సుయొక్క దైన్యావస్థను చూచినవా డెవడుకూడ ఈ పిచ్చిమాటలనువిని నవ్వియుండకపోడు. పిట్టుయొక్క యుదాసీనతకు కొంద రింకొక కారణమునుకూడ చెప్పిరి. దానినే చాలమంది తరువాత నమ్మిరికూడాను. అదేమనగ:— బహుజనకంటకుడగు యీ మహాదోషిని తగురీతిని శిక్షించవలసినదని "డండాస్" అనేక సంవత్సరములనుండి గోలచేయుచుండెను. అందరిలో యీతనిగోలయే మరీ హెచ్చుగనుండెను. కాని యీతని కెప్పుడైతే గవర్నమెంటువా రేర్పరచిన బోర్డులో ఉద్యోగము దొరికినదో అప్పటినుండి యీతని నోరు కట్టుపడినది; ఈతనిగోల అణగినది. కాని, హేస్టింగ్సుకు యింత వ్యతిరేకముగ లోగడ గోలచేసియున్న వాడిప్పు డీయుద్యోగము దొరికిన తరువాత బహిరంగముగ హేస్టింగ్సును వెనుకవేసికొనివచ్చి

యీతడీ నేరములు చేయలేదని గట్టిగ వాదించి ఆతనినిప్పుడు తాను గవర్నమెంటుపక్షమున బహిరంగముగ సంరక్షింపబూనిన యెడల, తన మర్యాదకు భంగము గలుగునని "డండాస్" తలంచెను. అందుచే, ఆరోజు ప్రొద్దుననే డండాస్ పిట్టుమంత్రి యింటికి పరుగెత్తుకొనివెళ్ళి ఆతనిని నిద్రమంచముమీదినుండి లేపి, ఆతనితో రెండు మూడు గంటలసేపు యేదో గుడగుడాలోచనచేసెను. ఈ గుడగుడాలోచన యేమిటో ఆ రోజు సాయంకాలము పార్లమెంటుసభలో కనిపించిన పిట్టుమంత్రిలోని ఆకస్మికపుమార్పే చెప్పక చెప్పుచున్నది. అయోధ్య వజీరువంశీకులును, వృద్ధరాణులును నగు రాచబీబులపై హేస్టింగ్సు గావించిన క్రూరవిచేష్టితములగూర్చిన నేరమును పార్లమెంటు మహాసభయెదుట ప్రతిపాదించుభారము "షెరిడన్" పై పడెను. ఈ షెరిడన్ యెవరు? చేతిలో దమ్మిడీ లేనివాడు; ఏవో పుస్తకాలు వ్రాసికొని బ్రతికేవాడు; ఇట్టి వానిమాటలు మహాపార్లమెంటు సభవారికి రుచించునా? ఉన్నతోద్యోగులతోడను, ప్రభుకుమార వర్గములతోడను, పురాతన జమీందారీ కుటుంబములవారితోడను, యీస్టిండియా కంపెనీ యజమానులతోడను, పైకెగబ్రాకజూచు లాయర్లతోడను, బలిసి పరివేష్టించియున్న అమ్మహాపార్లమెంటు సభవారికీ చిల్లిగవ్వచెయ్యని పుస్తకాలమ్ముకొనేవాడే జాతీయ నీతిని, రాజనీతిని, న్యాయాన్యాయపరిశీలనను వంకలుదిద్ది బోధించువాడు! కాని, భగవంతుడీతని కొకగొప్పసామర్థ్యమును మాత్రమిచ్చియుండెను. వాగ్వాదములో యెంతవానినైనను సరే—మిత్రవర్గములోగాని, శత్రువర్గములో గాని,—అవలీలగ

ఓడించి దాటిపోగల శక్తి యీతనికున్నది. ఈసమయమం దాతడొసర్చిన యుపన్యాసము అతని యితరగ్రంథముల వలెనే చీలికలుగనుండెను. అప్పటికప్పుడు ఆశువుగ జేసిన చమత్కార రచనలవలన ఆతని యుపన్యాసము మరింత ఆకర్షవంతముగ నుండెను. ఇది ఆతడు యింటివద్ద వ్రాసికొనివచ్చి చదివిన యుపన్యాసముగాదు గాన అదియిప్పుడు మనకుకావలెనన్నచో అప్పుడక్కడ కూర్చుని వ్రాసికొన్న రిపోర్టరుయొక్క వ్రాతయే మనకాధారము. కాని, యేకారణముచేతనో గాని ఆనాడా విలేఖకుడీతని యనర్గళ వాగ్ఝరీ ప్రవాహమును పూర్తిగ అనుసరించి వ్రాసికొన లేకపోయినాడు. ఇదియెంతయు శోచనీయము. ఈతడు తన యుపన్యాసమందు ప్రదర్శించిన సర్వతోముఖ సామర్థ్యమును, పుష్కల వాక్చతురత్వమును, బుద్ధివిలాసమును, భావోన్మాదమును కని సభికులెల్లరు పరవశులై పార్లమెంటు సభలో కరతాళధ్వనులు చేయకూడదను మాటనుకూడ మరచిపోయి—మైమరచి—తమ హర్షోన్మాద సూచకముగ మ్రోయించిన కరతాళధ్వనులచే కొలువెల్ల నొక్క మ్రోతగ జెలంగి నింగిముట్టెను. మహామాత్య శేఖరుడు పిట్టుమంత్రి సైతము హర్షాశ్చర్యములచే నిశ్చేష్టితుడై కొయ్యబొమ్మవలె కూర్చుండెను. ఫాక్సు సభ్యుని పొగడ్తలు, జయజయ శబ్దములు సభాంతరాళమున మార్మ్రోగెను. సంతోషాతిరేకమును పట్టజాలక బర్కు ఉక్కిరిబిక్కిరియై తన యానందబాష్పధారావర్ష పాతమున సభాభవనమునంతను ముంచివేసెను.

"ఇంత రమ్యతమమగు మహోపన్యాసము మానవులిదివర కెన్న

డును కనివిని యెరుంగలేద " ని తన జన్మలో సాధారణముగ నెవరిని మెచ్చుకొనని " విండ్‌హామ్ " వంటివాడు కూడ యీ యుపన్యాసమైన చాలరోజులకు చెప్పియుండెను. " నీవు చెప్పిన యుపన్యాసమును తిరిగి పూర్తిగ వ్రాసియిచ్చినయెడల నీకు కావలసినంత డబ్బు యిస్తాము " ని (వెయ్యి గిన్నీలు యిస్తామని) ఒక పుస్తకాల కంపెనీవా రీతనిని—షెరిడనును మరునాడు ఉదయముననే అడిగిరి. కాని, తనకప్పుడు గలిగిన పేరుప్రతిష్ఠల యొక్కయు, పొగడ్తల యొక్కయు క్రొత్తలో షెరిడన్ మైమరచినవాడై " ఆఁ యిదంతా యిప్పుడెవడు కూర్చుని మళ్లా వ్రాస్తాడు పొమ్మని " నిర్లక్ష్య భావముతో నుండెను. పైకిమాత్రము " సరేలే, అట్లాగే వ్రాస్తాలే " యని యనుచువచ్చెను. అప్పుడప్పుడు నిజముగ వ్రాయువలె నని కూడ అనుకొనేవాడు. కాని, క్రియకు మాత్రమాత డెన్నడు దానిని వ్రాసి యివ్వలేదు. అప్పటి తాత్కాలికపు సంతోషమునే చూచుకున్నాడు గాని, స్థిరమగు చిరయశస్సును భావికీర్తిని, చూచుకొనలేకపోయినాడు. ఈ రీతిగ ఆ రమ్యమగు ఘడియలు నాలుగు గడచిపోయినవి. అద్వితీయమగు ఆ ఖండనోపన్యాసము మనకిప్పుడు లేకుండపోయినది. ఇక అట్టిది మనకు దొరకదు. ఆనా డా యుపన్యాసమును విన్న వారి మనస్సుల నది యెట్లు మార్చివేసినదో దానిని బట్టి అది యిట్లుండెనని—దాని వర్ణము, చిక్కదనము, పటిమ యిట్లుండె నని—మనమిప్పు డూహించుకొనవలయునే గాని మన కంత కంటె వేరు ఆధారము లేమియు లేవు. ఆ యుపన్యాసమును విన్నవారిలో ముప్పాతికమంది షెరిడన్ చెప్పినట్లే వోటుచేసిరి.

"హేస్టింగ్సు మహాపరాధి యనియు, యితడు తన దురాశచే, ప్రజాపీడనముచే, యిండియా ప్రజలకు వినాశనమును, యింగ్లండు ప్రజలకు నలుగురిలో తలవంపులును తెచ్చిపెట్టినవారిలో అధమాధము డనియు" పెరిడర్ తన యుపన్యాసమందు హేస్టింగ్సును తీవ్రముగ ఖండించెను.

ఈ ఖండనముల కంతకు కారకుడైన బర్కు ప్రభుసభ యెదుటికి కూడపోయి, కామన్సు సభవారి పక్షమున అక్కడ కూడ వాదించ వలసినదని "మాంశేగ్యు" అను సభ్యుడు కోరెను. ఆ ప్రకారమే బర్కు తన మిత్రవర్గముతో కూడ కలిసి మరునాడు ప్రభుసభ యెదుటికిపోయి, వారి యనుజ్ఞ పొంది హేస్టింగ్సు గావించిన ఘోర నేరములగూర్చి తత్సభ వారికి యథావిధిగ విన్నవించెను. వెంటనే, హేస్టింగ్సును పట్టుకొని ఖైదులో పెట్టిరి. వెస్టుమినిస్టర్ భవనమందు ఉన్నత న్యాయమూర్తియగు ప్రభువర్యుని యెదుట పిలిచి నప్పుడు హాజరు పెట్టుటకుగాను యిరువురివలన పూచీకత్తు పుచ్చుకొని హేస్టింగ్సును అప్పటికి విడుదలజేసిరి.

ఈ కేసుయొక్క పర్యవసానమునుగూర్చి ఆ రోజులలో యెవరికీ సందేహము లేకుండెను. ఈ మహాపరాధియొక్క మిత్రులు కొందరు యెదిరికక్షివారిపై యనేక దురుద్దేశముల నారోపించి, తిట్టి, దుమ్మెత్తిపోయ నారంభించిరి. "ఈ పని అంతా పార్టీకక్షులచేతనే చేసినారనియు, తన మాతృదేశ సేవకై తన జీవితమునంతను ధారవోసిన యీ మహాపురుషుని నాశనము చేయజూచుట మహా అన్యాయమనియు, ఎచ్చ

టనో యేడువేలమైళ్ళ దూరమునుండి సాక్షులను తెచ్చుకొని అక్కడనుంచి యెవరికీ తెలియని భాషలలో వ్రాసియున్న కాగితములను తెచ్చుకొని, నీ కేసును ఋజువుపరుచుకొమ్మని కోరుట మిక్కిలి అసందర్భమని" యు పలువురు పలురీతులుగ బర్కు మున్నగు వారిని దూషింపసాగిరి. హేస్టింగ్సుపై సీమలో యీ విధముగ నేరస్థాపన జరుగుచున్నదను సంగతి యిండియాలో అతని తరువాత గవర్నర్ జనరల్‌గ వచ్చిన కారన్‌వాలీస్ ప్రభువుకు తెలియగనే అతడు చాల అసహ్యించుకొని విసుగుకొనెను. " పాపము, హేస్టింగ్సుమీద యింత వరకు వ్యవహారము జరుగుట చాల అన్యాయము! అయ్యో పాపము! అతనిలో చాల మంచిగుణము లున్నవండీ; ఇంకా యెవరినైనా ఉరిదీయాలని మీకుంటే నిజముగ, సర్ యెలిజా యింపేను పట్టుకొని ఉరిదీయండి— ఏవరికీ కష్టమనిపించదు— " అన్నాడు కారన్‌వాలీస్ ప్రభువు. ఇది లోకంలో మామూలుగ జరిగేకథే! ఇంపే యేమిపాపము చేసినాడు వానిని ఉరిదీయుటకు? ఏరు దాటినతరువాత తెప్పతగుల వేయు మన్నట్లు వీరైనన్నినాళ్ళు పనిచేయించుకొని పని తీరిపోయిన తరువాత తోసివేయుట లోకములో మామూలుగ జరిగేకథేగద! ఇట్లు పరులచేతులలో బొమ్మలుగ ఆడిన వాళ్ళగతి చివరి కింతే!

హేస్టింగ్సును యీ రీతిగ జామీనుమీద విడుదల జేసినపిమ్మట 4, 5, మాసములవరకు ఉభయపార్టీలు కేసును తయారుచేసికొనుటలో సరిపోయినది. ఫ్రాన్సిస్‌కును, హేస్టింగ్సుకును స్వయముగ విరోధ మున్నదను కారణముచేత-

యిరువురు ఇండియాలో కలియబడికొట్టుకున్నారనే కారణము చేతకూడ— ఫ్రాన్సిస్ పేరును ఫిర్యాదీల లిస్టునుండి పార్లమెంటువారు కొట్టివేసిరి. ఇతని పేరు యెట్లాగైనా చేర్పించాలని ఫాక్సు, విండ్‌హామ్, మున్నగువారు చాలపట్టుపట్టిరి. "జడ్జి నిష్పక్షపాతముగ నుండవలెననుమాట న్యాయమే. కాని, ఫిర్యాది చాలపట్టుదలగలవాడు కావున, ఆతడు ఫిర్యాదీగ పనికిరాడని చెప్పుట చాలవింతగ నున్నది. లోకములో యిట్టిమాట యిదివర కెన్నడు వినలేదు" అని విండ్‌హామ్ వాదించెను. బర్కు స్త్రీలక్షణములుగలవాడు. కోపము వచ్చినా, సంతోషమువచ్చినా, స్త్రీలక్షణములనే చూపును. "ఈ ఫ్రాన్సిస్‌ను యెట్లయినను ఫిర్యాదీలలో చేర్చవలసినది. ఇది నా కెంతో ఉపకారం చేసినట్లుగ వుంటుంది. నా కుడి భుజం కొట్టివేయవద్దు" అని బర్కు ప్రార్థేయపూర్వకముగ "డండాస్"కు ఉత్తరము వ్రాసికొనెను. కాని, సిగ్గులేక పరపక్షములో దూరిన యీ డండాస్ యీతని యాడంగి మాటలను లక్ష్యపెట్టునా? అదిగాక, పిట్టు మంత్రియు ఫ్రాన్సిస్‌ను ఫిర్యాదీగ చేర్చరాదని మిక్కిలి మూర్ఖపు పట్టుపట్టెను. కావున, యిక గత్యంతరమేమి? మహాక్రోధ విజృంభణముచే మండిపోవుచున్న ఫ్రాన్సిస్‌ను శాంతింపజేయుటకు మార్గమేమి? ఆతని తీయనైన మనోహరమగు ముఖస్తుతి మాటలచే యుపశమింపజేయుట తప్ప వేరొండు మార్గము గాన్పించలేదు. దానికొరకే— ఫ్రాన్సిసు నెట్లయిన యుపశమింపజేయుటకే— బర్కు ఆతని కొక ఉత్తరమునువ్రాసెను. ఎటువంటి ఉత్తరము! అది కామన్సు సభాభవనములో

కమిటీగదిలో వ్రాయబడెను. అం దిట్లున్నది :— "జాతీయ న్యాయనిర్వహణమునకు మీ రవశ్యము మాకు కావలసి యున్నారు. మీ రింతకాలమునుండియు కన్నబిడ్డలవలె పితృ ప్రేమతో జూచుకొనుచుండు భారతప్రజల నీసమయమందు జారవిడువవలదని మిమ్ముల నెంతయో ప్రార్థనాపూర్వకముగ వేడికొనుచున్నాము." ఈ స్తుతివాక్యములజూచి ఫ్రాన్సిస్ పరవశుడై పోయెను. కోపమంతయు చల్లబడెను. జ్యూరీలో నుండుటకు సమ్మతించెను. బహుకాలము భారమగు యీడికి క్రిందబడిన యీ కేసు విచారణయం దంతటను మొదటినుండి చివరవరకు ఫ్రాన్సిస్‌జ్యూరీలో నొకడుగనుండి తన మిత్రుడగు బర్కునకు కుడిభుజముగ నిలిచెను. ఈ కేసును నడిపించిన ఫిర్యాదీలలో ఫాక్సు, షెరిడన్, గ్రే, ఎర్స్కిన్, విండ్‌హామ్, ఆర్‌స్ట్రాథర్, ఇలియట్, బర్గోయిన్,— మున్నగువారు ముఖ్యముగ పేర్కొనదగినవారు.

అనేక వాయిదాలు పడిపడి యీ కేసు తుదకు విచారణకు వచ్చెను. ఈ రీతిగ ఒకానొక నేరస్తునిగూర్చి విచారించుటకుగాను పార్లమెంటుప్రభు సభవారు న్యాయ తీర్పరులుగ కూర్చున్నది 63 యేండ్లక్రిందట మాకిల్సు ఫీల్డు ప్రభువును విచారించుటకు! తిరిగి నాటికి నేడిప్పుడు హేస్టింగ్సును విచారించుటకుగాను కూర్చున్నారు ప్రభుసభ వారు. అప్పుడు 63 యేండ్ల క్రిందట యింతమంది ప్రభు వులు లేరు. నేడో, 200 మంది పైచిలుకు ప్రభువులు వచ్చి కూర్చున్నారు. ప్రధాన న్యాయమూర్తి వీరందరిని పేర్ల వరుసను పిలుచుచు రాగా, ఒక్కొక్కరే పార్లమెంటు భవన

మునుంచి బయలుదేరి కేసు విచారణకై కోర్టుగ యేర్పరుపబడిన "వెస్టుమినిస్టర్ హాలు" లోనికి బారులు దీర్చి నడువసాగిరి. యువరాజును రాజబంధువులును, రాజ్యములోని ముఖ్యోద్యోగులును, అత్యంత తేజోవంతులగు కాళాసారస్వత సార్వభౌములును, ఆ సభాభవనమంతు పరివేష్టించియుండిరి. డెవన్షైర్ ప్రభ్వీణి విగ్ శాఖకు జెందిన కులీన యువతులచే పరివేష్టింపబడి కూర్చుండి, ఫాక్సు, గ్రే, విండ్‌హామ్, మున్నగు వారలను తన కనుసన్నలచే నుత్సాహపరచుచుండెను. మంత్రి పక్షపాతులగు నారీమణులెల్లరు రట్లండు ప్రభ్వీణి సన్నిధానమున నాసీనులై యుండిరి. ఎన్నడును కని విని యెరుగని యిట్టి యపూర్వ యభియోగమును గూర్చి వినుటకై యెంతో యాతురపడుచు రాజ్యములో ప్రఖ్యాతి కెక్కిన పెద్దలందరు చాల పెందలకడనే వచ్చి హాలులో నేదో మూల నందు చేసికొని నక్కి కూర్చుండి యుండిరి. ఈ రీతిగ హాలంతయు సందు లేక జనముచే కిటకిట లాడుచుండెను. అక్కాలపు మహా ప్రముఖులలో ఒక్క పిట్టు మాత్రమే సభకు రాలేదు. తరువాత చాల రోజులు జరిగిన విచారణలో కూడ ఒక్క రోజైనను అతడు తన మొగమును చూపించ లేదు. ఇట్టి స్థితియున్న కొలువు యెదుటకు ముద్దాయియగు మహారాజ ప్రతినిధి— హేస్టింగ్సును— తీసికొనివచ్చి బోనువద్ద నిలిపిరి. పూర్వాచార ప్రకారము ముద్దాయి తన మోకాళ్లను క్రింద నేలమీద ఆనించి లొంగి యుండవలసినదని సభవా రాజ్ఞాపించిరి. తనకిట్టి నీచపుపాటు వచ్చెగదాయను బాధ మహా [illegible]డగు హేస్టింగ్సు మనస్సునకు గాఢముగ గుచ్చు

కొనెను. ఇది తనగుండెలో కత్తిపెట్టి పొడిచినట్లయ్యెను. తనపై మోపబడిన యీనేరము లన్నిటికంటె యిదేయతని కెంతయో ఘోరబాధగ నుండెను. కాని, అది క్షణము మాత్రమే యుండెను. ఏలననగ:— " లేచికూర్చో " అని ప్రధాన న్యాయమూర్తి ఆజ్ఞాపించెను. అప్పు డాతడు లేచి రోజంతయు— అంతులేని అనేక దినములవరకు— అట్లే బోనులో కూర్చుండే యుండెను. అల్ప—దుర్బల— శరీరముతోడను, వెలవెలలాడు ముఖముతోడను, వినీత వేషముతోడను, జంకు గొంకులేని యా కృతాపరాధుడు పైకి గంభీరముగ గన్పట్టుచు, జడ్జీల ముఖ లక్షణము లెట్లెట్లు మారునో యని వానినెల్ల యనుక్షణము కనురెప్ప వేయక చూచుచు, తనను వెన్నాడు ప్రతికక్షుల ప్రతిగమనికను అతి సూక్ష్మముగ నవలోకించుచు, అప్పుడప్పుడు తన తరఫు ప్లీడర్లతో నేదో గుసగుసలాడుచు— యీరీతిగ అనేక దినము లట్లే హేస్టింగ్సు బోనులో కదలక మెదలక కూర్చుండెను. ఆ దృశ్యము మహా విచిత్రమైనది. ఇన్నేండ్లు గతించిన తరువాత కూడ మనమిప్పుడు వెనుకకు తిరిగి దానివంక జూచినచో అది యిప్పటికిని ఆనాటివలెనే మహా విచిత్రముగ దోపక మానదు. తాము చేసిన పనులకు తాము (లోకముయెదుట భగవంతునియెదుట) తగు సమాధానము చెప్పవలసి యుండునుసుమాయని లోకములో ప్రతివానికి జ్ఞాపకముండునట్లు— గట్టిగ బుద్ధివచ్చునట్లు—చెప్పుటకై చేసిన మహా అనన్యసామాన్యమగు ప్రయోగమిదియని చెప్పవలసియున్నది. ఎల్లరకు స్మరణార్హమగు యీ పనిని—ఎల్లరకు బాగా జ్ఞాపక

ముందునట్లు చేసిన యీ పనిని—ఆనాడు బర్కు మున్నగు వారు పరిపూర్ణ వైదగ్ధ్యముతోడను, సమాహితచిత్తము తోడను, వీడని పట్టుదలతోడను గావించియుండిరి. ఇదివర కెన్నడు రాని గొప్ప యవసరమిప్పుడు వచ్చుటచే వారట్లు చేయక తప్పినదికాదు. పాపము! — వీరు చేయగ లంత వరకు చేసిరి. కాని, అసలు వున్న లోపము ప్రభు సభ యందే గలదు, దానికి వీరేమి చేయగలరు? అపూర్వ మగు నిట్టి యభియోగమును విచారించి అందలి న్యాయా న్యాయముల విమర్శించి తెలిసికొన గలిగినంత యోగ్యత, సమర్థత, అసలు న్యాయ తీర్పరులుగ కూర్చున్న ఆ ప్రభు సభ వారికే లేనప్పుడిక యెవరెంత పోట్లాడిన నేమి ప్రయోజనము? ఈ కొరతను దీర్చు వారెవరు? ఈ ప్రభువర్యు లిదివరకు అనేకసార్లు జడ్జీలుగ కూర్చుని అనేక కేసులను విచారించి యుండిన మాట వాస్తవమే కాని, ఆ కేసుల స్వభావము వేరు. అవి యెట్టివనగ :— సీమదేశ ప్రజలు జేసిన రాజద్రోహములు, అన్నదమ్ముల కొట్లాటలు, మ్యునిసిపల్ కేసులు, మున్నగు చిల్లర నేరములు. వీనిని విచారించుట యొక లెక్కకాదు. అదిగాక, యివన్నియు నిన్న నేడు జరిగిన వ్యవహారములై యుండవచ్చును. అందుచే వీనికి సంబంధించిన సాక్ష్యములను, ఋజువులను, తక్షణమే తెలిసికొని వానిలోని నిజానిజములను స్పష్టముగ, కరతలా మలకముగ, తెలిసికొనవచ్చును. కావున, యిట్టి కేసులను విచారించుట యొకలెక్కకాదు. ఒకగొప్పకాదు. కాని, యీ హేస్టింగ్సు కేసుమాత్ర మిట్టిదికాదు. అసలు దీనిస్వభావమే

వేరు. ఇక్కడ, యీ కేసులో అనాగరికులనబడు భారతవర్ష ప్రజలువచ్చి నాగరికులని విర్రవీగు యూరోపియన్ ప్రజల యెదుట మొర్రోయని మొత్తుకొనుచున్నారు!—హిందూ మహమ్మదీయాది అయోమయములగు మతములకు జెందిన ప్రజలెల్లరువచ్చి మహాగొప్పదనుచెప్పుకొను క్రైస్తవమతమునకు జెందిన ప్రజల యెదుటబడి న్యాయమో! న్యాయమో! యనియేడ్చి మొత్తుకొనుచున్నారు—పరాజితులై దిక్కుగానక పరితపించు ప్రజలు పరమ స్వాతంత్ర్య సౌఖ్యముల నవ్వారిగ ననుభవించు విజేతల యెదుటబడి రోదించుచున్నారు—దైవగతిచే పడరాని యిడుములకు బాల్పడిన ప్రజాకోట్లు వచ్చి చీకుచింతలేక హాయిగ స్వైరవిహార మొనర్చు రెండువందలమంది షోకిల్లాపురుషుల కాళ్లకడబడి అయ్యో! అయ్యో! అని ఆక్రోశించుచున్నారు. కాని, యీ యేడ్పులు, యీ రోదనములు వీరిలో—యీ రెండువందలమందిలో—యెవరి చెవి కెక్కును? వీరందరెట్టివారు? కొందరు ముసలాళ్ళు, ముతక వాళ్ళు; వాతపునొప్పులచే కాళ్లుచేతులు కదల్పలేనివాళ్లు; ముదిమిచే మతితప్పినవాళ్లు, ద్యూతపానాదులచే మత్తెక్కిన వాళ్లు— యీ రకపు మనుష్యులు! కొంచెము శ్రద్ధగ విని నిజము కనుక్కొందమను అంతరాత్మ ప్రేరణగలవారు బహు కొద్దిమంది యుండిరి. ఇంకాకొందరు మంచివారే—న్యాయము కలుగ జేయుదమనువారే—యుండిరి. కాని, వీరు మందబుద్ధులు; చెప్పినది సావధానముగ విని బుర్రకెక్కించుకోలేరు. పిత్తోన్మాదముచే అంతలో కోపము రేగి బహు చికాకు పడుదురు. ఇట్టి మహోత్కృష్ట ధర్మ నిర్వహణమందు వీరి కెవ

రికి అనుభవము లేదు. అందుచే, యీ పనికి తగిన యోగ్యత, సమర్థత, వీరి కెట్లు వచ్చును? కావున, దీనిని బట్టి చూడగ, యింతకంటె నిస్సహాయులగు జడ్జీలు— యింతకంటె తెరువు తెలియని తీర్పరులు — లోకములో యింకెచ్చటను, యే యుగమందును ఉండబోరని చెప్పవచ్చును. వారికి తెరువు జూపుటకు పూర్వ దృష్టాంతమేమియు లేకుండెను. కావున, ఏ ధర్మనియమమునుబట్టి జూచినను యింతకంటె అవకతవక కోర్టు— యింతకంటె అయోగ్యమైనకోర్టు— యింకొకటి లేదని చెప్పవచ్చును. హేస్టింగ్సుపై కేసు జరుగుచుండగ అప్పుడు విన్న ప్రభువు లంతమందిలో 29 మంది మాత్రము యీ విన్న యేడేండ్ల యనంతరము హేస్టింగ్సు దోషియా నిర్దోషియా యను ప్రశ్నపై వోట్లనిచ్చిరి! (అనగ, విచారణ జరిగిన యేడేండ్లకు వోటింగు జరిగిన దన్నమాట!) నేరస్తులను శిక్షించు అధికారము పార్లమెంటుకున్నమాట వాస్తవమే. అదిచాల అమూల్యమగు నధికారమే. ఆయధికారము దానికాలములో అది చేయవలసినచోట, చేయవలసి వచ్చినప్పుడు, లోగడ చక్కగ మంచిపనినే చేసియుండెను. కాని, యిప్పుడు హేస్టింగ్సుపై మోపబడినట్టి మోస్తరు నేరములను శిక్షించుటకుగాదు సీమ ప్రజలీ తమ పార్లమెంటునకిట్టి యభియోగాధికారమిచ్చినది. సీమప్రజలు తమ పార్లమెంటుకీ యధికారమును ప్రప్రథమమున నొసంగినప్పుడు వారీ యధికారము నిట్టి యసాధారణ స్వభావముగల కేసులకు వర్తింపజేయవలసినదని యెన్నడును ఉద్దేశించలేదు— యెన్నడును చెప్పలేదు. ఒకవేళ అట్లు ఉద్దేశింపబడినను— అట్లు చెప్పి

నను— యిట్టి దుర్ఘటకార్యమును సవ్యముగ నెరవేర్పగల శక్తిసామర్థ్యములు పార్లమెంటున కెంతమాత్రము లేనూ లేవని కూడ గట్టిగ చెప్పవలసియున్నది. ఈ సంగతి యెల్ల రకు స్పష్టముగ—కరతలామలకముగ— తెలిసిన సంగతే. అయితే మనకిప్పుడింత స్పష్టముగ కనబడుచున్న సంగతి అనగ, యిట్టి కేసులను విచారించుట పార్లమెంటుపని కాదు, ఆపని పార్లమెంటుకు చేతకాదు అను సంగతులు—అప్పుడు ఆ రోజులలో యెవరికీ తెలియలేదు. ఇంత స్పష్టముగ కండ్లకు గట్టినట్లు, మనకిప్పుడు కన్పట్టుచున్న యీ సంగతులన్నియు ఆ నాడు—1788 సంవత్సరము ఫిబ్రివరి నెలనాటి శీతకాలపు మంచుపొగలో మూసుకుపోయి యెవరికీ కనుపించలేదు. అయినప్పటికి యీ కేసు గెలుచుట కనువగుపరిస్థితులు చక్కగ దేశమం దేర్ప డిన సందర్భములలో ఫాక్సు, బర్కు, మున్నగువారు బహు చాకచక్యముగ, బహువిరళముగ, యీ కేసును నడిపించియుం డకపోయినచో, ఆనాటి ప్రభుసభ్యులు హేస్టింగ్సుపై మోప బడిన యీ నేరములను యింతమాత్రమైనను—దాదాపు యేకగ్రీవముగ—నంగీకరించియుందురా యని యూహించ వలసివచ్చుచున్నది. (వీరిని యింతమాత్రమైనను ఒప్పింప జేయుట సామాన్యమైన పనియా? అది అక్కడికి చాలగొప్ప సంగతియే యని చెప్పుకొనవలసియున్నది.) హేస్టింగ్సు చేసిన పని న్యాయమే, ధర్మమే, యను భావము ప్రిప్రిధమమున ప్రజలలో సర్వసాధారణముగ వ్యాపించియుండుట స్వభావ సిద్ధమై యున్నది. స్వభావసిద్ధముగ నుండు నిట్టి భావమును

పోదోలి యీ భావము వట్టి భ్రమయనియు, ఆతడు చేసిన పనులన్నియు తప్పేయనియు ఋజువుపరచవలసియున్నది. ఈ ఋజువుభారము బర్కు మున్నగు ఫిర్యాదీలపై గలదు. ఈభావమును, లేక భ్రమను, పోదోలుట యెట్లు? ఈ భావము వట్టి యభూత కల్పనయనియు, అది యెవరికి చిక్కునదికాదు, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణముల కందునదికాదు, సరిగ, సహేతుకముగ, సంబద్ధముగ మాట్లాడునదికాదు, యిదంతయు వట్టి మాయ సుమా యనియు, ప్రతివారు స్వయముగ జూచి తెలిసికొనుటకు వారికి మాటి మాటికి యెడతెగకుండ, తగినన్ని యవకాశములివ్వవలసియున్నది. అట్లయినప్పుడే వారి భ్రమపీడును. ఈ రీతిగ భ్రమలన్నియు పీడినగాని సత్యము గోచరించదు. రాజ్యములోపల జరుగు నత్యాచారముల శోధించి, దీనులకు ధర్మరక్ష నొసంగుటకు గాను పండితులు, వివేకవంతులు, మహోదారశీలురు, మహాత్ములును నగు న్యాయాధిపతులచే నధిష్టింపబడిన న్యాయస్థానములుండుట రాజ్యముయొక్క ధర్మగౌరవాదులకు నిలుపు గావించుకొనుటకే గాక, అసలు రాజ్యముయొక్క బ్రతుకునకే అత్యంతావశ్యమై యున్నది. కాని, తమకుగాని పరాయి దేశమందు తమతరఫున గవర్నర్ జనరల్ హోదాను చలాయించివచ్చిన యీ హేస్టింగ్సువంటి వానిని విచారించి శిక్షించుటకై సీమప్రజ లేర్పరచుకొనిన యీకోర్టు తత్కార్యమును నెరవేర్చుట కెంతమాత్రమును సమర్థమైనదికాదు. అది అట్టి కోర్టు ఉండవలసిన రీతిగలేదు. కావున, నిజముగ దాని నిట వర్ణింప వలసిన పనియే లేదు. అయినను అది ఆ పాతబొమ్మ

లాట — యీనాటి కాలమున కెట్లు పనికిరాదో స్పష్టముగ నిరూపించుటకైనను దానినిట కొంచెము వివరముగ చెప్పవల సిన యావశ్యకత గలుగుచున్నది. అది యేయే విషయము లందు పూర్తిగ నిరర్థకమైపోయెనో స్పష్టముగ వివరించి తెలుపుట చారిత్రిక దృష్టిలో అప్రస్తుతము కాజాలదు.

సరిసమాన ప్రతిపత్తి గలిగి, స్వాతంత్ర్య సముపేత ములై వెలంగు రెండు దేశముల మధ్యవచ్చు రాచకీయ వివా దములను పరిష్కరించుట — పరిస్థితు లెంతో అనుకూలముగ నున్నప్పుడు సైతము — మిక్కిలి దుర్ఘటమగును. కారణమేమ నగ, యిరుపక్షవాదములను బహు నిష్పక్షపాతముగ విని, ఆవేశ పూరితులగు యే ఒక పక్షమువారి వాదములకు యెంత మాత్రము లొంగిపోని నిగ్రహశక్తిగల న్యాయమూర్తులతో గూడిన కోర్టును నిర్మించుట బహు దుర్లభమని యెల్లరకు తెల్లమైన విషయమే. ఇట్టి కార్యమే దుర్ఘటమైనప్పుడు యిక, రాజాధిరాజునకు అతనికి లోకువగు సామంతరాజునకు మధ్య వచ్చు తగాదాలను — కవ్వించిమీదికి వచ్చు వానికిని అతనికి లొంగుపోవువానికిని మధ్యవచ్చు తగాదాలను — జయోద్ధ తిచే సర్వంసహాధికారులై కూర్చున్న వారికిని, పరాజితులై అన్నమోరామచంద్రా యని యడలుచు యడవులపాలై పోవువారికిని మధ్య వచ్చు తగాదాలను — న్యాయముగ తీర్చి దిద్దుట యెంతటి దుర్ఘటకార్యమో వేరుగ చెప్పవలెనా? వివాదము యెవరిమధ్య వచ్చినను — యెక్కడో దూరమున నున్న యల్పరాజ్యమునకును, యిక్కడ యెదురుగ కేంద్రీ కృతమై లోకములనెల్ల ధిక్కరింపజాలిన మహాబలిష్ఠ సామ్రాజ్య

మునకును మధ్యగాని — లేక — రాజ్య భ్రష్టతనొంది మను వృత్తివల్ల జీవించు దిక్కులేని రాజునకును, మహా దైశ్వర్యము లతో తులదూగు ఖజానాలు గల మహా సామ్రాట్టునకును మధ్యగాని— యెవరిమధ్య వచ్చినను యీ వివాదములను పరిష్కరించుటకు తగిన జడ్జీలను యేర్పరచుటలో మాత్రము బహు జాగ్రత్తగ నుండవలసిన యవసరమెంతేని గలదు.

ఇట్టి వివాదములను పరిష్కరించుటలో అనవసర కాలవిలంబ నకుగాని, అధికారుల యవినయమునకుగాని, వ్యక్తుల మొగ మోటములకుగాని, పార్టీల కక్షలకుగాని, జాతీయదురభిమాన ములకుగాని, తెలిసిగాని, తెలియకగాని, యెంత మాత్రము అవకాశ మివ్వకుండునట్లు బహుజాగ్రతయైన కట్టుదిట్టముల గావింపవలసిన యావశ్యకత యెంతయేని గలదు. ఏలననగ- ఎవరైనా సామాన్యపు కేసులలో కోర్టులో జ్యూరర్లుగ కూర్చున్నప్పుడు వారి నే పార్టీవారైనా కొంచెము మొగ మోట పెట్ట యత్నించినచో "యిక్కడ యిట్టి మొగమోట ములు పనికిరావు" ని యెంతో అసహ్యాముతో చీదరించి కొట్టుదురు. కాని, అట్టి మహానుభావులే అట్టి నిష్పక్షపాత మునే అవలంబించవలసినటువంటి రాచకీయాది బహిరంగ వ్యవహారములలో వోటర్లుగ తమవోట్ల నివ్వవలసివచ్చినప్పుడు మాత్రము యితరులచే మొగమోటపెట్టించుకొనుటకు గాని, భయపెట్టించుకొనుటకు గాని, యెంతమాత్రము లజ్జింపరు! యెంతమాత్రము అసహ్యించుకొనరు! ఆశ్చర్యము! ఇది నిత్యము మన కండ్లయెదుట జరుగుచున్న విషయమే! తమ దేశములో, తమ స్వప్రజలమధ్య, తమ యిరుగు పొరుగు

వారి మధ్య జరుగు వ్యవహారములలోనే యిట్లు జరుగుచున్న ప్పుడు యిక యెక్కడనో ముక్కు మొగ మెరుంగని పరాయి దేశస్థుల విషయములోనా వీరు నిర్మోగమోటముగ వర్తించు నది! అది వట్టి కల్ల. స్వదేశస్థుల విషయములోనే ఇంత అధ్వా న్నముగ నున్నప్పుడు యిక పరాయిదేశస్థుల విషయములో— ముక్కుమొగ మెరుంగని క్రొత్త వారి విషయములో— బహుశః నిన్న మొన్నటివరకు శత్రువులుగనో, అనుమానా స్పదులగు మిత్రులుగనో నున్న వారి విషయములో— మరిం కెంత అధ్వాన్నముగ నుండునో వేరుగ చెప్పవలెనా? ఈ రాచకీయాభియోగములో తమకు న్యాయము గలుగజేయ వలసినదని మొత్తుకొను ఫిర్యాదీలిట్టి దిక్కుమాలిన వారై నప్పుడు— తమకుగల పేరు ప్రతిష్ఠలు భగ్నమై, తమపై ప్రభువులకు గలిగిన యపోహాలను పోద్రోలగల సాధన సం పత్తి యెంతమాత్రము లేనివారైనప్పుడు— యిక ముద్దాయి లన్నో ప్రభుజాతియొక్క జాతీయాభిమానమునకు పాత్రులై తదభిమానముతో సమ్మిళితమైయున్న సమస్త జాతీయ లాభక్షేమముల పాటించుకొన వలసినదని యొకమూల ప్రభు జాతికి హెచ్చరించి చెప్పుచున్నప్పుడు — యిక యీ దిక్కుమాలిన దీనులకెట్లు నిష్పక్షపాతమగు న్యాయము గలు గును? ఆజడ్జీలు మాత్రమెట్లు నిష్కళంకమగు నిష్పక్షపాత బుద్ధితో నుండగలరు? ఇట్టి సమయములో త్రాసు ఒక రవ్వం తయైనను, ఒక్క క్షణమైనను— అటునిటు కదలకుండ సరి సమానముగ నిలుప జూచుట బహుదుర్ఘట కార్యము. త్రాసు నటునిటు చెదరనీయకుండ సమానముగ నుంచగల

నిదానము, సమత్వబుద్ధి, విద్యా సంస్కారము, ధర్మజ్ఞత్వము, బాధ్యత గలిగి, బహుజాగ్రతగ నేరిపెట్టిన నియమితసంఖ్యగల న్యాయతీర్పరు లున్నగాని, యిట్టికార్యమును చేయబూనుట కేవలము నిరర్థకము, కేవలము గొంతెమ్మ కోరిక! గ్రీకు సామ్రాజ్యపు రోజులలో యేథెన్సుపట్టణములో నిర్మించిన "ఎక్లెసియా" మహాసభ నాటినుండి—రోమక సామ్రాజ్యములో నెలకొల్పబడిన "సెనెట్" మహాసభనాటినుండి,—యిటీవల ఫ్రాన్సులో వెలసిన "నేషనల్ ఎసెంబ్లీ", "కన్వెన్షన్ పార్లమెంటు" ల నాటినుండి—నేటివరకు నానారకముల మూకలతో గూడిన యీ పార్లమెంటువంటి మహాసభలు— ఎన్నిక సభ్యులతో గూడినవిగాని, వంశ పారంపర్యపు హక్కుల ద్వారా వచ్చి కూర్చున్నవారితో కూడినవిగాని,—యేవియు కూడ యిట్టి మహాకార్యమును చేయబూనినప్పుడు—న్యాయాన్యాయముల తీర్చి దిద్దబూనినప్పుడు—తప్పక తప్పటడుగు వేయనిది ఒక్కటికి కూడ లేదు. ఇట్టి లోపము దాని ప్రకృతి యందే స్వభావసిద్ధముగ నున్నట్లు కనిపించుచున్నది. కావున, దీని నెవరు తీసివేయగలరు? ఇట్టి మూకతో గూడిన కోర్టులో అనేక లోపములుండుట కవకాశములున్నవి. కేసంతయు ఒక రోజులో జరుగునదికాదు. కావున, కొందరు కొంతభాగమును, మరికొందరు మరికొంతభాగమును, మాత్రమే వినుదురు. కాని, తీర్పుచెప్పుటకు మాత్రము అందరికి అధికార మున్నది! అయితే అందరు కలిసి అంత కేసును పూర్తిగ విని చక్కగ సంప్రతించుకొని తీర్పు చెప్పుట కెక్కడ అవ

కాశ ముండదు. ఈ లోప మిట్లుండగ, యింతకంటె ఘోరమగు పెద్ద లోపమేమనగ :— జడ్జీలుగ కూర్చున్న యీ మూకలో చాలమందికి యీ కేసును పూర్తిగ అర్థము చేసికొనగల తెలివితేటలుండవు. అందరు సమానమైన తెలివిగలవారుండరు. వీరిలో చాలమందికి యిట్టిపని యందు అనుభవముండి యుండదు. ఇట్టి పనులలో వారెన్నడు మెలగిన పాపమున పోయి యుండరు. ఎవరికిని స్వతంత్రాభిప్రాయము లుండవు. ఎవరుగాని తెగించి, బాధ్యత వహించి, "యిది నా అభిప్రాయము" అని చెప్పరు. "నాదేమున్నది ? నలుగురు యెలాపోతే, నేనూ అల్లాగే పోతాను" అని ప్రతివాడు తన బాధ్యతను గుర్తించక తప్పించుకొనును. "ఇది న్యాయముగ లేదు, సబబుగ లేదు," అని సహేతుకముగ వాదింప బూనుట నిరర్థకము. ఏలననగ :— జడ్జీలుగ కూర్చున్న యిట్టి మూకలు హేతుబద్ధమై నడతురనుట వట్టికల్ల. ఇది యెల్లరకు తెల్లమైన విషయమే. ఈ ప్రభుసభవంటి అప్పీలు కోర్టులో కూర్చున్నవారు— మతగురువులైనను లేక సామాన్యులైనను, ప్రజా ప్రతినిధులైనను లేక సాధారణ పౌరులైనను, శిపాయిలైనను లేక శివిల్ ఉద్యోగులైనను— సాధారణముగ వీరిధోరణి చాల చపలముగను, అప్రయుక్తముగను, ఆవేగవంతముగను, నైతిక దృష్టియందు కేవలము నిర్వీర్యముగను ఉండును. సర్వ ధర్మముల నెరింగి కేవల ధర్మ ప్రవృత్తిగల బహు కొద్దిమంది న్యాయమూర్తులను బహు జాగ్రత్తగ యేర్పరచి పెట్టిన కోర్టులకు బదులుగ— ప్రజాప్రతినిధిత్వ లక్షణములును తద్వారా

జన బాహుళ్యతయు, యీ కోర్టులయందు హెచ్చయిన కొలది పైన వర్ణించిన యవలక్షణము లన్నియు వీని యందు అంతకంత కెక్కువగ పొడగట్టుచుండును. తమయం దిట్టి గొప్పలోపమున్నదను సంగతిని వారు గ్రహించియే— తమ మనస్సుల కది సహజముగ దాని యంతట యది తట్టుట చేతనే— పాపము— వారసత్త్వేనా ప్రభుపదవి లభించిన ప్రభుసభ్యులు యిట్టి న్యాయాన్యాయ విచారణలలో— యిట్టి అప్పీలు కేసులలో— సాధారణముగ జోక్యము కలిగించుకొనక, "మన కెందుక" ని దూరముగ వైదొలగి యుందురు. వందలకొలదిగనున్న యీ ప్రభువులు తమ యెదుటికి వచ్చిన అప్పీలు కేసులలో ఒక్కదానిలోకూడ యేమి వున్నదో ఒక్కనికి కూడ తెలియదు— తెలియదను సంగతి వారికే పూర్తిగ తెలుసును. అందుకొరకే వారీ కేసుల జోలికిపోరు— పోవుట మంచిదికాదని గ్రహించి వారే యూరకుందురు. ఒక్కసాక్షిని ఒక్క ప్రశ్న అడుగుటకు గాని,— ఫలానిమాటకు యేమి అర్థమని అడుగుటకుగాని— తమకు అర్హత లేదని వారు పూర్తిగ గ్రహించియే గంభీరముగ మౌనముద్రవహించి కూర్చుందురు. మామూలు చిల్లర కేసులలోనే జోక్యము గలిగించుకొనుటకు తమకు అర్హత లేదని జడియుచుండు యీ ప్రభుసభ్యులు, యిక హేస్టింగ్సుపై మోపబడిన యిట్టి గొప్ప రాచకీయ సంబంధమగు కేసులోనా వీరు వ్రేలు పెట్టతగినది? మామూలు చిల్లర అప్పీలు కేసులలోనే జోక్యము గలిగించుకొనుటకు తమకు చేతగాదని యనుకొనుచుండు యీ ప్రభు సభ్యులిక యీ కేసులో— అనగ-

జయోద్ధతిచే పొంగి పొరలుచుండు తమ స్వదేశ ప్రజలును స్వదేశ చక్రవర్తులును ముద్దాయిలుగ ఒక పక్షమునను— పరాజయముచే నవమానితులై దిక్కులేక యల్లాడుచు న్యాయమో న్యాయమోయని మొఱలిడుకొనుచుండు పరాయి దేశపు చిల్లరరాజులు, మూకలు, ఫిర్యాదీలుగ యింకొకపక్షమునను నిలిచియున్న యిట్టి మహోత్కృష్ట రాచకీయాభియోగమందు— వ్రేలుపెట్టుటకైనను తమకు చేతగాదని యింకెంత హెచ్చుగ యీ ప్రభుసభ్యులు అనుకొనవలసియున్నది. ఇట్లుగ్రహించి, యీ కేసుజోలికి పోకుండ, దూరముగ తొలగియుండవలసిన యవసర మింకెంత హెచ్చుగనుండవలసినది ? 1788 సంవత్సరమునాటికిని నేటికినికూడ పూర్తి కావలసిన గొప్పలోపమొకటి యున్నది. ఇట్టి మహాక్లిష్టములగు రాచకీయాభియోగములను, చక్కగ, నిష్పక్షపాతముగ విచారించి న్యాయమగు తీర్పుచెప్పి, ఆ తీర్పునకు తామెట్లు వచ్చినది తగుసమాధానములను హేతుబద్ధముగ వివరించి లిఖితపూర్వకముగనమోదు చేయగలట్టి న్యాయతీర్పరులను—శాసనసభలయందేమి, ఉద్యోగములందేమి, న్యాయవాద వృత్తియందేమి యున్నవారిలో గట్టివారిని యేరి, వారితో ఒక ఉన్నత న్యాయపీఠమును నిర్మింపవలసిన ఆవశ్యకతయెంతేని గలదు. ఇట్టి ఉన్నత న్యాయపీఠమున్నచో మహాక్లిష్టములగు నిట్టి యభియోగముల విచారించు బాధ్యత దానిపై పెట్టవచ్చును. కాని, యిట్టి ఉన్నతన్యాయస్థానము లేనికొరత నాటినుండి నేటివరకు తీరక అట్లేయున్నది. ఇట్టి యేర్పాటు వుండివున్నయెడల యీ హేస్టింగ్సు కేసును యిన్నాళ్ళు,—యేడేండ్లు—యింత

వ్యయప్రయాసలకోర్చి తుదకు లోకములో—నలుగురిలో—శాశ్వతముగ, నగుబాటగువిధమున— న్యాయవిపర్యయము గావించుకొనవలసిన యధ్వాన్నప్రగతి తప్పెడిదిగద. ఏడేండ్లు పడిన మనోవ్యధగాక హేస్టింగ్సుకు యీ కేసులో పదిలక్షల రూపాయలు ఖర్చులయ్యెనట.

1795 సం॥ ఏప్రిల్ 23 వ తేదీన తీర్పుచెప్పుటకుగాను ముద్దాయియగు హేస్టింగ్సును ప్రభుసభ యెదుటికి పిలిపించిరి. రెండువందల మందికి పైగాగల ప్రభుసభ్యులలో అప్పు డా సభకు 29 మంది ప్రభువులు మాత్రము న్యాయమూర్తి దుస్తులను ధరించివచ్చిరి. మిగతావారు "మన కెందు కీ గొడవ" యని తప్పించుకొనిరి. అందుచే వీరు న్యాయమూర్తి హోదాలో రాక మామూలువేషములతో (బేర్ డ్రెస్‌తో) వచ్చి సింహాసనపు మెట్లమీద కూర్చుండి యీ న్యాయనిర్వహణభారమందు తమ కేమియు జోక్యము లేదన్నట్లు తమాషా చూచుచు ఊరకకూర్చుండిరి! ఏడేండ్లక్రిందట కేసు ప్రారంభించిన నాటికిని, నేటికిని ప్రభుసభలోని సభ్యులసంఖ్య చాల హెచ్చెను. వెనుక 200 మంది సభ్యులుండగ, యిప్పుడు 260 మంది యున్నారు. వీరిలో వారసత్వేనా వచ్చినవారు 49 మంది; 44 గురు నూతనముగ నిర్మింపబడిన లేక యెన్నుకోబడిన స్కాట్లండుదేశపు ప్రభువులై యున్నారు. ఈ కేసు ప్రారంభించిన నాటినుండి తీర్పుచెప్పు యీ రోజువరకు—యీ మధ్యకాలములో— చచ్చినవారు, యెన్నికలలో ఓడిపోయినవారు కలిసి మొత్తము 87 గురు ప్రభువు లుండిరి. ఏడేండ్లనుండి తనను వెన్నాడుచున్న యీ దిక్కుమాలిన

కేసుచే గలిగిన మనోవ్యథచే చిక్కి శల్యమై, ముసలి కళ పడి, హేస్టింగ్సు బహు దీనవదనముతో మెల్లగ నడుగులిడుచు అమ్మహాసభవారి యెదుటికివచ్చి మరల నొకసారి మోకాళ్లపై దిగబడి తలవంచి యట్లేయుండెను. ఈ ముద్దాయి దోషియా, నిర్దోషియా యను నంశముపై ప్రమాణ పూర్వకముగ తీర్పు చెప్పవలసిన బాధ్యత అమ్మహాప్రభుసభవారి భుజస్కంధము పై నిలిచి యుండెను. హేస్టింగ్సు దోషియేయని ఆరుగురు సభ్యులనిరి. నిర్దోషియని యిరువది ముగ్గురనిరి. అంతట కేసు కొట్టివేసినామని తీర్పు చెప్పుచు, ముద్దాయిని విడుదల చేయవలసినదని ప్రధాన న్యాయమూర్తి "లోబరో" ప్రభువు ఆజ్ఞాపించెను. ఒహో! ఇక ఆ క్షణములో గలిగిన ఆ సంబరము, ఆ ఉత్సాహము, ఆ ఉద్రేకము, యింతింత యని చెప్పతరమా? ప్రభువులు, ఉద్యోగులు, ఆస్థానసభికులు, శిపాయిలు, కుంపిణీ డైరెక్టర్లు, యేజెంట్లు, ఆశ్రితులు, స్తోత్రపాతులు, అమాంబాపతు నేస్తగాండ్రు,— వారు వీరననేల సమస్తజనులు— జడుడగు నీయల్ప శరీరుని చుట్టుముట్టి, అభినందన వర్షధారాపరంపరలచే ముంచి లేవనెత్తి యాతనిని యుక్కిరి బిక్కిరి చేసిరి! ఈ యుక్కిరి బిక్కిరి నుండి కొంచెము తేరి తెప్పరిల్లిన పిమ్మట హేస్టింగ్సు మనస్సునకు కొంచెము స్థాయిచిక్కెను. మరల ఆశాంకురమతని హృదయ క్షేత్రమందు మొలకెత్తెను. తిరిగి తనకు ఐశ్వర్య మెత్తుకొన వచ్చుననను సూచన లనేకము లతని దృష్టికి గోచరించెను. ఈ కేసులో తనకైన పబ్లిక్ ఖర్చులు 7 లక్షల 65 వేల 28 వందల రూపాయలు. ఇంకా లోపాయికారీ ఖర్చులు యెంతో లెక్క

లేదు. వేయేల, యిండియాలో తనపాపపు పరిపాలన వలన అన్యాయముగ దోచుకొని తెచ్చుకొన్న పాపపుద్రవ్యమంతయు యీ కేసుతో ఖూడాగా తుడుచుకొనిపోయెను. కాని, యీతడు తమకొనర్చిన మహోపకారమునకుగాను యీస్టిండియా కుంపిణీ వారీతనికి సాలుకు 40 వేల రూపాయల చొప్పున 28 యేండ్లవరకు బహుమాన మిచ్చుచుండునట్లు తీర్మానించుకొనిరి. ఈ మొత్తములో అప్పటి యవసరమునకుగాను 4 లక్షల 20 వేల రూపాయలను అడ్వాన్సుగ యిచ్చివేసిరి. అదిగాక, తన పితృపితామహార్జితమగు యే యెస్టేటును తిరిగి సంపాదించుకొన వలయునని యీతడు చిన్నతనము నుండి ఉవ్విళ్లూరుచుండెనో, యెద్దాని సంపాదన కాంక్షచే యీతడు సప్తసముద్రములదాటి భూగోళమున కావలి ప్రక్కకు పరుగులిడి, లజ్జను పాపభీతిని పరిత్యజించి, యింతింతలేసి ఘోర దురంతకృత్యముల నొనర్చి, మహా సంకుల పాప పంకములలో— బురద గుంటలలో— తొడబంటిగ దిగబడి యీదులాడుకొనుచు పోయెనో, అట్టి "డేల్సుఫీల్డు" యెస్టేటును కొనుక్కొను నిమిత్తమై 5 లక్షల రూపాయలను అప్పుగనిచ్చిరి. ఎట్టకేలకు "డేల్సుఫీల్డు" యెస్టేటు హేస్టింగ్సుకు లభించెను. ఆతని జన్మతరించెను! రోజులు గడచినకొలది, క్రమముగ, ప్రజాభిప్రాయమితని వైపునకు తిరుగ నారంభించెను. "దావాఖర్చులనన్నిటిని యిప్పించవలసినదని చక్రవర్తికి అర్జియిచ్చుకో" అని చాలా మంది స్నేహితులితనికి సలహాచెప్పిరి. ఆప్రకారమాతడర్జి నిచ్చుకొనుటకు నిశ్చయించుకొనెను. కాని, మంత్రులు

తటస్థులుగ నూరకుండిరి. ప్రధానమంత్రి పిట్టుకూడ దీనికి కేవలము వ్యతిరేకముగ నుండెను. "ఈఅర్జీని చక్రవర్తికి పంపుటకు వీలులేదు; పంపనుపొమ్మని" యాతడు శఠించెను. ఎవరెంతచెప్పినను పిట్టు "ససేమిరా" యనెను.

"సర్ ఎలిజా యింపే" కూడ యిట్లే శిక్షపడకుండ తప్పించుకొనెను. ఈతనిని కూడ పార్లమెంటు మహాసభ యెదుట విచారించి శిక్షించవలసినదని చెప్పి 1787 సం॥ డిశంబరు 12 వ తేదీన "సర్ గిల్బర్టు ఇలియట్" అను వాతడు పార్లమెంటుసభలో మహోపన్యాస పూర్వకముగ ప్రతిపాదించెను. "విచ్చలవిడిగ లంచములనుమేయుట, కేవలము అన్యాయముగ దురంతపు తీర్పులుచెప్పుట, పైవారి యుత్తరువులను యెంతమాత్రము లక్ష్యముచేయక ఉల్లంఘించి వర్తించుట, యేచట్టముచే తనకీ యధికారపదవివచ్చెనో అట్టి చట్టములోని నిబంధనలనే బుద్ధిపూర్వకముగ త్రోసివేయుట, డబ్బిచ్చి సాక్షులను కొనివేయుట, కేవలము అబద్ధపుకూతలని స్పష్టముగ తెలిసియుండియు యివే సత్యప్రమాణవాక్యములని వాదించుట, మున్నగు అనేక దురంతకార్యముల నీతడొనర్చెన"ని ఆసభ్యుడు తన మహోపన్యాసమందు నిరూపించెను. "కలకత్తా సుప్రీము కోర్టుకు ప్రధాన న్యాయమూర్తిగనుండిన యీాతడు చెప్పరాని దుర్మార్గములచేసెను. ప్రజలను పీడించుటకై "లా" నంతను తలక్రిందులుచేసెను. ఇందుచే నీతడు భారతప్రజల విశ్వాసమును గోల్పోయెను. యింగ్లండుయొక్క పేరుకు కళంకముదెచ్చెను. తోడిమానవుల ధనమాన ప్రాణాదుల రక్షించు బాధ్యతను సక్రమముగ నెరవేర్చిన మహాపురుషుల

సన్మానించి గౌరవించుట పార్లమెంటు సభవారి మొదటివిధియై యున్నది. కాని, దుర్మార్గులై, గర్వోన్మత్తులై, తమ యధికార దుర్వినియోగముచే ప్రజలనుపీడించి, దురాశచే తమ యధీనమందుంచబడిన యావదాస్తులను కొల్లగొట్టి తామే యపహరించి, యింక ననేకరీతుల లోకకంటకులై చరించిన దురాత్ముల తలలపై యిమ్మహా పార్లమెంటుసభవారి యాగ్రహాశనిపాతముల బరగించుటయు తత్తుల్యమగు పరమ ధర్మమైయున్నది. ఈ ధర్మనిర్వాహణము మనస్సునకు కష్టతరమే యైనను చేయకవిధిలేదు. సామాన్యులగు యితరమానవులొనర్చిన తప్పులకంటె న్యాయమూర్తినని పేరుపెట్టుకొని పవిత్రమగు న్యాయపీఠమును నానాభ్రష్ట మొనర్చిన యీ దురాత్ముని యకృత్యములే ఆంగ్లజాతియొక్క క్రోధాగ్నిజ్వాలల కెక్కువగ గురికావలసియున్నవి " అని యా సభ్యుడు పార్లమెంటు మహాభవనమందు హుంకరించిపలికెను. నిజమే, యాతని దుష్కృత్యములిట్టి క్రోధాగ్నిజ్వాలలకు గురికావలసినదే. ఈ నేరములను గూర్చి పార్లమెంటువారు బహు శ్రద్ధతో వినుచున్నట్లుకూడ అప్పుడు కొంతకాలము కనిపించిరి. కాని, తుదకు అనుకొన్నట్లుగ ఆంగ్లజాతియొక్క క్రోధాగ్నిజ్వాలలుమాత్ర మెన్నడు రేగనేలేదు. ఆంగ్లప్రభుత్వము వారన్నతో నిష్పక్షపాతముగనున్నట్లు పైకినటించుచున్నను లోలోన "వీరినింత అల్లరిచేసినాము, యిది చాలదూ? చివరిదాకా నొక్కి వేశేశిక్షించవలెనా యేమిటి?" అను భావముతో నుండిరి. ఈ భావమునుకూడ పరోక్షముగ లోకమున కెరుకపరుచుచు వచ్చిరి. అందుచే, "సర్ ఎలిజా

యింపే " మీద కేసుపెట్టు ప్రియత్నముసాగలేదు. కాని, " యెవరెన్ని దుర్మార్గములు చేసిననుసరే చేయవచ్చునోహో! మరేమి భయములేదు, యెవరు దండించరహో!" అనుమాట మాత్రిమొక్కటి యీ "యింపే" పేరువలన లోకములో రూఢమైపోయినది. ఘనతకెక్కిన తనతోడి దొంగబహద్దర్ గారిని— హేస్టింగ్సును— ఒకమూల యిట్లు విచారించుచుండగ, యీ "యింపేగాడు" తనవలెనే పూర్తిగ కుళ్లి కంపు కొట్టుచు, తన్నే పార్లమెంటు ప్రితినిధిగ వరించుటకు సిద్ధముగనున్న యొకానొక పాడుతాలూకాను వెదకిపట్టుకొని దానికి తగిన యోలినిచ్చి కట్టుకొనెను. ఆపాడుతాలూకాపేరు మనమిప్పుడు చెప్పుకోనేల? (దానిపేరు చెప్పుకుంటేకూడ మనకు పాపము చుట్టుకుంటుంది.) దానికిప్పుడు ప్రితినిధి నెన్నుకొనుహక్కు తీసిపారవేసినారు. ఇకదానికి బుద్ధివచ్చి పశ్చాత్తాపపడునేమో! పడుతుందనే అనుకుందాము! అందుచే దానిపేరు నిక్కడచెప్పి, పాపము, దానిని చిన్నబుచ్చనేల? దానిపేరేయెత్తవద్దు, వదలివేద్దాము.



# భరతఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన

## పదునాలుగవ అధ్యాయము.

### టిప్పుసుల్తాన్

### 1786—93

"దేశీయరాజులలోకంటె మన ప్రభుత్వమందెక్కువ ఐక్యతయు సైన్యబలమును కలదు. అందుచే మనము వారికంటె నధికులమై యున్నాము. కాబట్టి తరుణమువేచి మనకెక్కువ అపాయముగాని ఖర్చుగాని లేకుండగనే అచిరకాలములోనే దక్షిణాపథద్వీపకల్పములో చాలభాగము మనమాక్రమించుకొనవచ్చును. దీనికిగాను ముందు మనము మొట్టమొదటగా టిప్పూసాహెబును కూలద్రోయవలెను. ఇది మనము మొట్టమొదటగా వేయవలసినయెత్తు. టిప్పును కూలద్రోసి శ్రీరంగపట్టణమునకు గనుక మనము ప్రభువులమైనామంటె ఉత్తరమున కృష్ణానదివైపునకు మెల్లగా ప్రాకుట కెట్టి కష్టమును వుండదు. చుట్టుప్రక్కలనున్న రాజ్యములలో విప్లవములుగాని యుద్ధములుగాని తటస్థించిన తరుణము కనిపెట్టి మనమీపనిని బహుసులువుగా చేయవచ్చును. కాని ఇట్టి సమయములందు మనము సర్వసామాన్యముగా నవలంబించవలసిన పతకములను గూర్చి ముందుగనే ఆలోచించుకొని ఒక చక్కని పంథాను ఏర్పరచుకొనవలసి యున్నది.

— సర్. టి. మన్రో

ఇండియాలో ఖాళీయైన వైస్రాయిపదవికి ఆశించువారు చాలమంది బయలుదేరిరి. కాని, గవర్నమెంటుకు మాత్రము తగినమనిషి అంతత్వరలో దొరకలేదు. బహుకాలానుభవము, గొప్పసమర్థత, ఎవరినిలెక్కచేయని ధైర్యసాహసములు, అత్యాద్భుతమగు విజయము, శక్తిసంపన్నులగు మిత్రబృందము, రాజాస్థానసన్మానము, మున్నగు నెన్నియో ప్రాపకములున్న హేస్టింగ్సువంటి వైస్రాయికే యింటికివచ్చిన తరువాత చివాట్లు, చెప్పుదెబ్బలు తప్పనిచో, యిక సామాన్య మానవులెట్లీ యుద్యోగమునుచేసి, భద్రముగ బ్రతికి బయటపడగలరు ? హేస్టింగ్సుపై గావింపబడిన యీ తీవ్రచర్యవలన, క్రొత్త వారికి కొంత జడుపుపుట్టెను. జాగ్రత్తయు, ధర్మబుద్ధియు గల పెద్దమనుష్యులు యీ యుద్యోగము జోలికి పోవుటకు జంకిరి. పాపభీతిలేక యెవరి లక్ష్యములేక ప్రమత్తులై, పేరాసాపరులై తిరుగువారికికూడ "యీ యుద్యోగము మన కెందుకురా బాబో—" యను విరక్తి గలిగెను. కాని డబ్బు కక్కుర్తిగలవారు, యేదోవిధముగ భాగ్యవంతులై తేనే చాలునని కనిపెట్టుకొన్నవారు, ఏదోవిధముగ రోజూ డబ్బు సంపాదిస్తేనేగాని నిద్రపట్టనివారు,— యీరకము మూక చాలమంది యుండిరి. హాయిగ సాలుకు 2 లక్షల 50 వేల రూపాయల జీతము, నౌకర్లు, చాకర్లు, యిండియాలో యెవరి లక్ష్యము లేకుండ, సర్వంసహాధికారముతో 5, 6 సంవత్సరములపాటు నిరాఘాటముగ స్వైరవిహారమొనర్చు పని తేరగ దొరికినప్పుడు యీ మూకలో యెవడినోరు ఊరదు ? కాని, యీ రకము మూకలో యెవడికో ఒకడికి యీ ఉద్యోగం

పారవేయడానికి మాత్రము పిట్టుమంత్రికి మనస్కరించలేదు. ఈ యుద్యోగమును కారన్‌వాలిస్ ప్రభువుకుయిస్తే బాగుం టుందని ఆతని మనస్సుకు తోచెను. పెల్‌బోర్న్ ప్రభువు కూడ యీ యభిప్రాయముతోనే యుండెను. మొట్టమొదట ఒక్క మిలిటరీ వ్యవహారములకే యితనిని అధికారిని చేద్దా మనుకున్నారు. కాని, శివిల్ వ్యవహారములుకూడ యీత నికే యిస్తే బాగుంటుందని తరువాత అనుకున్నారు. ఈ కారన్‌వాలిస్ తాత ఒకటవ జార్జిరాజు కాలములో ప్రధాన మంత్రిగ నుండెను. ఆతనికున్న రాజ్యతంత్రప్రవీణతలో కొంచమైనను యీ మనుమనికి రాలేదు. పోయిన అమె రికా రాజ్యమును తిరిగి సంపాదించి, సీమదేశమునకు గలిగిన దురవస్థను కూడదీయగల శక్తిసామర్థ్యము లీతనియందేమైన గలవాయన్న, ఆయాశయు వట్టిదేయయ్యెను. కాని, ఆతాత గారి సామర్థ్యము లీతనికిలేకపోయినను ఆతని పేరెక్కడికిపోవు ను? అందుచే, సీమలో పెద్దమనుష్యులలో యీతనికి మంచి పేరేయుండెను. ఇట్టివాడు మంత్రులదృష్టిలో నెట్లుపడకుండు ను? ఇతడు మంచి సుస్వభావముగలవాడు. మంచి గొప్ప కుటుంబముతో సంబంధబాంధవ్యములు గలవాడు; మంచి సిరిసంపదలు గలవాడు. ఇట్టివానితో యేపార్టీవారు స్నేహము చేసికొనగోరరు? ఈతనికి వ్యతిరేకు లెవరూలేరు. ఈతని మెడకీ వైస్రాయి యుద్యోగము నంటగట్టకుండ అతని యిష్టము వచ్చినట్లు వదలివేసియున్నచో, ఆత డేగొడవలు పెట్టుకొనక యే యాడంబరములలో జేరక, నున్ననగు తన జీవిత పర్వత సానువులపై హాయిగ విహరించుచు వానివెంట మెత్తగ జారి

వచ్చి రెండవ కంటివానికి తెలియకుండ సరాసరి సమాధిలోఁ జేరెడివాడు. కాకపోతే, యెప్పుడైనా, ప్రభుసభలో తన కిష్టములేనిపని యేదైనా జరిగితే, లోలోన గొణుగుకొనేవాడేమో. అంతేగాని, పార్టీ కుట్రలలో యెన్నడు దిగబడే వాడుకాదు. పార్టీ యుద్ధములలో నాయకత్వము వహించే వాడుకాదు. కాని, ఒక ఉద్యోగముమాత్రము చేయవలె నని యీతని కుండెడిది. అదేదనగ:— "లండన్ టవరుకు అధికారి" (Constable Of The Tower.) ఈ యుద్యోగములో చేయవలసిన పని యేమియు లేదు. హాయిగ పని లేకుండ కూర్చుండవచ్చును. కాని, మంత్రు లీయుద్యోగము నీతని కివ్వక యింకెవరికో యిచ్చిరి. అందుచే యితనికి చాల అసహ్యము, విసుగుదల గలిగెను. దానిని పైకికూడ కనబర చెను. ఇంతే జరిగినకథ. కాని, కొంద రనుకొన్నట్లుగ యీతని పోరుపడలేక, యీతడు పార్లమెంటులో వుంటే తమ్ములను నిత్యా యేడిపిస్తాడు, యెదిరిస్తాడు, యీతడు చాలా అపాయంగా వున్నాడు, కాబట్టి యితని నెట్లాగైనా వదిలించుకుంటే చాలుననే ఉద్దేశముతో గాదు, మంత్రు లీతని క్లైవెస్రాయి యుద్యోగమిచ్చి యిండియాకు తోలివేసి నది. ఈ యుద్దేశము చేతగాదు మంత్రు లీ యుద్యోగము పుచ్చుకొనవలసినదని 1786 సం॥ లో యితని నింతగ బలవంత పెట్టినది. ఈత డీ యుద్యోగమునకు తగినవాడని, సౌమ్యు డని, మంచి మర్యాదగలవాడని, యిండియాలో కుంపిణీ యుద్యోగస్తులు చేయుచున్న దుర్మార్గముల నణచుటకును, వెనుకటివాని పరిపాలనను భ్రష్ట మొనర్చిన, దురంత కృత్యా

ముల నన్నిటిని అరికట్టుటకును యీతడు గట్టిగ పనికివచ్చుననియు, యిందు కీతడు నమ్మదగినవాడని — యోచించియే మంత్రులీతని పిలిచి, యీ యుద్యోగము స్వీకరింపవలసినదని బలవంతపెట్టిరి. ఎట్టకేలకు కొంచెము సంకోచించుచునే యెట్లో యీ యుద్యోగమును స్వీకరించి, యిండియాకు వెడలుట కీతడంగీకరించెను. హిందూస్థానపు ఆర్థిక రాచకీయ సంబంధములగు రికార్డులలో తన పేరెంత శాశ్వతముగ లిఖింపబడబోవుచున్నదో యను భావి సూచన నాతడా నిమిషమందు కించిత్తయినను బహుశః గ్రహించి యుండడు.

1786 సం॥ యేప్రిల్ నెలలో ఓడ యెక్కి కారన్‌వాలీస్ యిండియాకు పయనమై వచ్చెను. ఆగష్టునెలలో మదరాసు రేవులో దిగెను. దిగిన వెంటనే మొట్టమొదటగ ఆతడింటికి వ్రాసిన యుత్తరములలోనే, లోగడ టిప్పుసుల్తాన్‌తో చేసికొన్న యొడంబడికను ఉల్లంఘించి, ఆతనిపై తిరుగబడుటకు మదరాసు కుంపిణీవారు మహారాష్ట్రులకు చేసిన మద్దతుకు తన యసంతృప్తిని తెలియ బరచెను. కుంపిణీ యుద్యోగుల యసమర్థతను, దుర్ణయ ప్రవృత్తిని నిర్మొగమోటముగ నిరసించెను. ఆతడొక యుత్తరములో నిట్లు వ్రాసెను. "నేనిక్కడకు రాకపూర్వమే బోర్డువారు, వ్రాసిన యుత్తరములలో అలహాబాదు పరగణాను వజీరునుండి కాజేయవలయునను పన్నాగములు గలవు. కాని, ఆతడెట్లో ధైర్యము తెచ్చుకొని యీ పన్నాగముల జయప్రదముగ నెదుర్పగలిగెను. నాకు తగిన క్రొత్తకారణము లేమైన గన్పట్టినగాని, తిరిగి నే నే పన్నాగముల జోలికిపోను. ఈ పరగణాపై మన

మెప్పు డధికారము వహించుటవలన మనకు గలుగు లాభ మేమో నాకు బోధపడకున్నది. నాకుజూడగ, యిటు మన ప్రభుత్వమును అటు వజీరును కూడ మోసపుచ్చి మధ్యనున్న యుద్యోగస్తులు వాటముగ దోచుకొన వచ్చునను ఉద్దేశముతో కుంపిణీనౌకర్లీ పన్నుగడ పన్నిరని నాకు నిశ్చయముగ దోచుచున్నది. కారన్‌వాలిస్ కలకత్తాలో కాలుపెట్టినదిమొదలు కుంపిణీయుద్యోగస్తులు చేయుచున్న చెప్పరాని దుర్నయములగూర్చి నలుప్రక్కల నుండి నిరంతరము ఘోషలు బయలుదేరెను. వీనిలో ప్రధానమైనఘోష బంగాళా నబాబగు ముబారక్-ఉల్-దౌలా యనునాతనినుండి వచ్చెను. ఈతడు 1770 సం॥లో మైనారిటీలో నుండగ నబాబుపదవికి వచ్చెను. ఆతనికిప్పుడు మెజారిటీ వచ్చినది. తన మైనారిటీలో గార్డియనులుగనుండి కుంపిణీ యుద్యోగులు చలాయించిన యధికారము సరియైనది గాదని యాతడు నిరాకరించెను. తాను సింహాసనమునకు వచ్చినప్పుడు జరిగిన యొడంబడిక ప్రకారము తనకురావలసిన యాదాయములో చాల భాగము కుంపిణీవారే కాజేయుచున్నందుల కతడు వారి చర్యను ఖండించెను. 1770 సం॥లో జరిగిన యీ యొడంబడిక ప్రకారమీాతనికి సాలుకు 32 లక్షల రూపాయలివ్వవలసి యుండెను. కాని, సీమలోని కుంపిణీ డైరెక్టర్ల యుత్తరవులననుసరించి వారన్ హేస్టింగ్సు యీ సొమ్మును 1772 సం॥ లో సగమునకు తగ్గించెను. ఇట్లు తగ్గించుటకాతడు చెప్పిన కారణమేమనగ:— "మైనారిటీలో నున్న యీ కుర్రవానికి సాలుకు 16 లక్షల రూపాయిలకంటె

ఎక్కువెందుకు ? ” అని ఆతడనెను. పోనీ, మైనారిటీ
వెళ్ళిన తరువాతనైనను యీసొమ్మును పూర్తిగా నిచ్చినారా?
ఉహూ లేదు. కాని, మొట్టమొదటి యొడంబడిక ప్రకారము
యీ మైనరునవాబు నెత్తిపై పెట్టిన కుంపిణీసిబ్బంది కాతడిచ్చు
కొనవలసిన జీతబత్తెములలో ఒక్క చిల్లిగవ్వయైనను తగ్గించు
లేదు. కారన్‌వాలిస్ యిండియాకు రాగానే సీమకు వ్రాసిన
ఉత్తరములో నిట్లున్నది:— “ నే విన్నదానినిబట్టి చూడగ
నవాబుయొక్క యింటివ్యవహారములలో మనకుంపిణీ యుద్యో
గస్థులిదివరకు చాల యెక్కువగ జోక్యము గలిగించుకొను
చుండిరని స్పష్టమగు చున్నది. దీనివలన నవాబునకెంతయో
అనవసరపు ఖర్చగుచున్నది. కాబట్టి యికనైనను మన
మాతని యింటివ్యవహారములలో జోక్యము గలిగించుకొన
కుండా వుంటే మనకు చాల మర్యాదగ వుంటుంది.” తనకిట్టి
యన్యాయము జరిగినదను సంగతిని పాపమా నవాబు సీమలో
నున్న తన యేజెంటుద్వారా కుంపిణీడైరెక్టర్లతో మొరబెట్టు
కొనెను. అందుపైవారు వైస్రాయికి రహస్యముగ నొకయుత్త
రము వ్రాసిరి:— ఏమని? “ ఒడంబడిక ప్రకార మాతని కివ్వ
వలసిన సొమ్మునకు తక్కువగాకుండా ముట్టునట్లు చేసి, ఆతని
భుక్తికిని, మర్యాదకును సరిపోవునట్లేర్పాటు చేయవలెను.
అవసరమైతే కొంచెము హెచ్చుగకూడ నివ్వవచ్చును.” అని
వ్రాసిరి. కాని, యీ మాటలకు యింకకొన్ని మాయ
మాటలనుకూడ కలిపిరి:— “ఒడంబడికద్వారా మనవల్ల
యాతనికి ముట్టవలసిన సొమ్మునుగూర్చి, నీవెప్పుడు దృష్టియం
దుంచుకొనవలెను. మరియు, మన ప్రస్తుత వ్యవహార స్థితి

గతుల యవసరమే నీకు తగిన యాలోచనను తెలుపును.” (ఈ మాటల కర్థమేమి?) “ఒడంబడికప్రకార మివ్వవలసిన సొమ్మంతాగనుక మనము నవాబు కిచ్చినట్లయితే అతని కేమి లాభము?— ఆ డబ్బంతా అతనిని ఆశ్రయించుకొనియున్న మూకయే తినివేతురు. కాబట్టి, అందులో సగమే ఆతనికిచ్చి, మిగతా సగము కుంపిణీవారే ఉంచుకుంటే బాగుంటుం”దని కారన్‌వాలిస్ సలహా చెప్పెను! ఆహా! యేమిన్యాయము! ఏమి తెలివి! ఈ లక్షలకొలది డబ్బంతా మూర్షిదాబాదు నగరములో నున్నవారు త్రాగి తందనాలుత్రొక్కుటకు వినియోగ పడవలెనా? లేక లండను నగరములోనున్నవారు త్రాగి తందనాలుత్రొక్కుటకు వినియోగ పడవలయునా యనునదే ప్రధాన సమస్యగ కారన్‌వాలిస్‌కు గన్పట్టెను. ఈ రెంటిలో సహజముగ ఆతనితీర్పు తన స్వజనమగు లండన్‌వారి పక్షము ననే యుండెననుటలో ఆశ్చర్యమేమున్నది?

మంగుళూరులో చేసికొన్న యొడంబడిక ఆరేండ్లుండెను. ఈ ఆరేండ్లలో టిప్పుసాహెబు చుట్టుపట్లనున్న చిల్లర రాజ్యముల నన్నిటిని యదిమి, తన రాజ్యములో జేర్చుకొనెను. ఆయుధ సామాగ్రులతో నమర్చబడిన యుద్ధనౌకల పెక్కింటిని కట్టించెను. కొన్నిటిని కొనెను. అందుచే యీతనిపేరు చెప్పినయెడల మలబారుకోస్తా యంతయు గజగజ వణకుచుండెను. రాజ్యకాంక్షకంటె యీతనియందు మతోన్మాద మెక్కువగ నుండెను. అందుచేతనే యీతడు “సుల్తాన్” అను బిరుదు వహించెను; మహాప్రవక్త యగుట కీబిరుదు మొదటి సోపానమట. విగ్రహారాధన యనునదీ దేశములో

లేకుండ జేయుటకే తానీ లోకములో నవతరించినానని యాతడు తలంచుచుండెను. తన మత మవలంబించ వలసిన దని యాత డనేకుల నిర్బంధించెను. పరమతస్థుల దేవాలయముల నేలమట్టము గావించుచుండ వారూరక చూచుచుండ వలసినదనియు యాతడు నిర్బంధించెను. ఎనిమిదివేల దేవాలయముల నాశనము చేసితిననియు, అయిష్టముతో, తన మతమందు గలిసిన వారిని లక్షమందిని తనసేనలో చేర్చు కొన గలిగితిననియు, ఆతడు గర్వముగ చెప్పుకొనుచుండెను.

ఈతనికిని, స్పెయినుదేశపు రాజగు రెండవ "ఫిలిప్పు" కును చాల పోలికగలదు. ఉభయులు సామ్రాజ్య స్థాపనకు తగు లక్షీయతను పొందియుండిరి. ఉభయులకు అసమాన ప్రజ్ఞలు కలవు— వీనిలో కొన్ని సహజముగ బుట్టినవి, కొన్ని సాధన వల్ల సంపాదించుకొన్నవి. ఉభయులు ధైర్యసాహసములు గలవారు. శ్రమయనున దెరుగక కష్టపడి పనిచేయ గల వారు, బుద్ధి సూక్ష్మత గలవారు. అదృష్టదేవతయొక్క నిగ్రహానుగ్రహములను ఉభయులు అనన్య సామాన్యముగ, నేకరీతిని లెక్కచేయక భరించినవారు. చిన్నతనమునుండియు ఉభయులు మహాసామ్రాజ్యము తమ చేతులలో వచ్చిపడు నను వాసనలలోపుట్టి పెరిగిన వారగుటచేతనే, వారు తమ తండ్రులకంటె చాల తక్కువ వారైపోయిరి. వీరుభయులు తమ తండ్రులకంటె తక్కువ యనుభవము, తక్కువ సహజ సామర్థ్యములు గలవారయ్యు, నిరంకుశత్వములోను, ప్రజల నిర్బంధించుటలోను మాత్రము వారికి తీసిపోక యుండిరి. తెలివితేటలలోను, శక్తియుక్తులలోను తమ తండ్రులకంటె వీ

రుభయులు తక్కువేమైనను, పెంకెతనములోను, మూర్ఖతలోను మాత్రము వారిని మించియుండిరి; విజయముగలిగినప్పుడు దాని వినియోగమును పూర్తిగ పొందజేసికొనుటలో గాని, పరాజయము గలిగినప్పుడు దాని నష్టమును తక్షణమే కూడదీసి కొనుటలోగాని, వీరు తమ తండ్రులకెంతమాత్రము చాలరు. అనుమానముచేతను, క్రోధముచేతను వీరుభయులు పరులపై బహు క్రూరత్వము వహింపుచుండిరి. తాము చిన్నప్పటినుండియు పుట్టి పెరిగిన మతములందిరువురకు మూఢవిశ్వాసము గలదు. తమ మూర్ఖతవలనను, పాషండపు పట్టుదలవలనను వీ రుభయులు తమప్రజల యనురాగమును రాజ్యప్రభద్రతను చేతులారా నాశనము చేసికొనిరి. కాబట్టి, చరిత్ర కారులెవరు వీరిరువురియెడల గౌరవమునుగాని, జాలినిగాని, జూపియుండ లేదు. అయితే మనము సత్యమును పాటింపదలచు నెడల ఒక్కసంగతిని మాత్రము మరువరాదు. వీరి ప్రతికక్షుల తప్పుల నేతాసునందు తూచుచున్నామో, వీరితప్పులనుకూడ సరిగనదే తాసునందు తూచి మరీ తారతమ్యముల నిరూపింపవలసి యున్నది. ఏదుష్కార్యమునైన తగ్గించిగాని హెచ్చించిగాని, చెప్ప తగినపరిస్థితులు గలవని యంగీకరించునెడ, వానిని తగురీతిగ నిర్వచించి ఆదుష్కార్యమున కెంతవరకైతే నిందఅవసరమో అంతవరకే (హెచ్చుగాని, తగ్గుగాని) బహు జాగ్రతగ మోప వలసిన విధి చరిత్రకారుని యందుగలదు. నిజముగ, సత్యమునే తెలిసికొనవలయునను కుతూహలము గలవారికి ఒక్క సంగ తినిమాత్రము గట్టిగ జ్ఞాపకము చేయవలసిన యవసరమున్నది. ఏమనగ :— మనకు విజయోత్సాహమును గలిగించు పోరా

టములనుగూర్చి సంస్తవపూర్వకముగ గాని, క్షమాపణ పూర్వకముగ గాని వ్రాసిన వ్రాతల నన్నిటిని మనము సాధారణముగ నమ్మెదము; మనము వానిని బహు అపనమ్మకముతో చదువుదుము. ఏలననగ, లోకములో సహజముగ నుండు తలంపు లేమనగ :— "ఓడిపోయినవారు వట్టి పనికిమాలిన వారని, జయించిన వారు చాలా గొప్పవారని, మంచివారని" జనులనుకొనుచుందురు. స్వార్థపరత్వము చేతనో, లేక సానుభూతిచేతనో, తెలిసియో, తెలియకనో, అనేకవేల భావము లొక్కుమ్మడి విజేతల మనస్సుల గ్రమ్ముకొని, వారి విజయ కధనమున కొకమాదిరి రంగునిచ్చును. కాని, ఓడిపోయినవారి గతియేమి ? వారిచరిత్ర నెవరు చెప్పుకొందురు ? వీరిలో అప్రతిమాన పౌరుషము నెరపి పోరాడి రణక్షోణి నొరిగిన వీరాధివీరుల పేరులనెవరు చెప్పుకొందురు ? వీరి వీరశయనముల నలంకరించుట కెవరు పుష్పమాలికల దెత్తురు ? ఫలరహితమై బీడువారిన సంగ్రామేతిహాసముల నెడి శాలిక్షేత్రముల నంటుకొనియున్న శేషధాన్యసంచయమున మనకు లభించిన బండాలమును బట్టిచూడగ అట్టి పరిస్థితుల లోనే యితర దేశములలో మెలగిన తదితర మానవులకంటె యీ టిప్పూసుల్తాన్ అంత చెడ్డవాడుకాదనిమాత్రము మనము చెప్పినచో అది సత్యమునకంత దూరము కాజాలదు. మనుష్య ప్రాణముల నవలీల బలియిచ్చుటలో నతనికున్న నిర్లక్ష్యము బహుశః అట్టిదియేయగు— "లూయీ–లీగ్రాండు," "నికొలన్ I" "ఆల్బా," "స్ట్రాఫర్డు," "రెడెస్కీ"— మున్నగు యూరోపియన్ రాజులయొక్క నిర్లక్ష్యముతో సరి

సమానముగ నున్నది. తనకు భిన్నమగు మతాభిప్రాయములుగలవారిని తన కొలువులో చేర్చుకొను విషయములో యీతనికిగల అయిష్టత మహాక్రైస్తవమతానుయాయుడగు యేడవ ఫర్డినాండును, మహామతాభిమానియు నుదారభావభరితుడునని ప్రసిద్ధికెక్కిన మూడవజార్జి చక్రవర్తియు యీ విషయములో బహు అసహానముతోడను, పీడాకరముగను, ప్రచరించిన అయిష్టతతో తులదూగుచున్నది. నమ్మి యివ్వదగిన యుద్యోగముల వేనినికూడ టిప్పుసుల్తాన్ మహమ్మదీయులకుతప్ప యింకెవరికి యిచ్చెడివాడు గాడని మన్రో దెప్పిపొడుచుచున్నాడు. ఆహా! యేమి! పూర్వాచార పరాయణశాఖకు జెందిన (రోమన్‌క్యాతలిక్కు) క్రైస్తవులుతప్ప తక్కిన యితర శాఖ క్రైస్తవు లెవరు సైన్యములో పనికిరారని మూడవజార్జి చక్రవర్తి నిషేధించి యుండలేదా? అట్టి సైన్యములో నుద్యోగిగ నుండిన యీ మన్రోగారా యిప్పుడీ టిప్పూసుల్తానును దెప్పిపొడుచునది! యేమొగముపెట్టుకొని ఆతడీమాటల ననుచున్నాడో! 1789 సంవత్సరాంతమునకు మూడవ మైసూరుయుద్ధ మనబడు దానికి కారణమొకటి యేర్పడెను. డచ్చివారికి చెందిన కోటలు రెండు తిరువాన్కూరురాజ్యపు పొలిమేరలోనున్న యొకానొక నదీముఖమున నుండెను. ఈకోటలను పట్టుకొందునని టిప్పు బెదరించెను. లోగడ చేసికొన్న యొకానొకయొడంబడిక ననుసరించి యీ కోటలను రక్షించుటకు సహాయము రావలసినదని డచ్చిసేనాధిపతి తిరువాన్కూరు రాజును కోరెను. అట్లువచ్చుటకు వీలులేనిచో తమకు తగినడబ్బిచ్చి

యీ కోటలను తమనుండి కొనుక్కొనవలసినదని కూడ చెప్పెను. ఇందుకు టిప్పువల్లకాదనెను. తిరువాన్కూరు రాజు తనక్రిందనున్న సామంతరాజుగనుక యేకోటలకొరకై డచ్చివారు తిరువాన్కూరు రాజుకు కప్పముకట్టుచున్నారో అట్టి కోటలనే అతనికమ్ముటకు డచ్చివారికి అధికారము లేదని టిప్పు అనెను. చివరికిది వివాదములలోనికి దిగెను. టిప్పుసుల్తాన్ సైన్యముల వెంటగొని పొలిమేరల నెత్తుటకై దాడివెడలెను. కాని, అక్కడనుండి మిక్కిలి నష్టములతో వెనుకకు కొట్టబడెను. అప్పుడు మదరాసులో కుంపిణీ ప్రెసిడెంటుగనున్న హోలండు అనునాతడు యీ వ్యవహారము నంతను విచారించి సౌమ్యముగ పరిష్కరించుటకుగాను రాయబారుల నంపుదునని సూచించెను. "మీరు రాయబారులను పంపితే పంపవచ్చును గాని యీ వ్యవహారము నంతను నేనిదివరకే విచారించినాను. నేను చేసిన పనిలో నాకు పూర్ణాధికారము గలదను గట్టి నమ్మకము నాకేర్పడి పోయినది. నే చేసినది తప్పుగాదు" అని టిప్పు చెప్పెను. ఇదియైన కొద్దిరోజులకే జనరల్ మెడోస్ అనునతడు మద్రాసుకు గవర్నరుగ వచ్చెను. ఆతడు సౌమ్యవాక్యములచే రాయబారము నడుపుటకుబదులు, భుజబలముచే వ్యవహారము చక్కదీర్చ దలచెను. "మీరు గవర్నర్ పదవికి వచ్చినందుకు చాల సంతోషమయినది- అందుకు మిమ్ములనెంతయు నభినందించుచున్నాను. ఉభయపక్షములు పోరాటము లేకుండ పొందిపొసగి యుండుట మంచిది. ఇరుపక్షములవారు స్నేహపాశములచే గట్టిగ బంధింపబడియున్నను, మధ్యకొందరు దూరదృష్టి లేని

వారి మాయమాటలవలన యిరు కటకములవారు పోరాట
మునకు సైన్యముల గూర్చుకొనుట తటస్థించినది.” పరస్పర
స్నేహభావములతో నుండవలసిన వారిట్లు కయ్యమునకు కాలు
దువ్వుకొనుట మంచిదికాదను తలంపుతో, సంగతిసందర్భ
ములనన్నిటిని చక్కగ వివరించి చెప్పుటకు నొక పెద్దమను
ష్యుని టిప్పుసుల్తాన్ గవర్నర్ వద్దకు పంపించెను. “అద్దమువలె
స్వచ్ఛముగనున్న గవర్నర్ మనస్సుపై పడినదుమ్మును తుడిచి
వేయుటకు గాను” ఒక పెద్దమనిషిని రాయబారమంపెను.
“మా యింగ్లీషువారి సంరక్షణక్రిందనున్న తిరువాన్కూరు
రాజుపై మీరుపోయిపడుట మమ్ముల నగౌరవపరచినట్లే;
కాబట్టి, యిప్పుడు యుద్ధమునకు కాచుకొనండి” అని గవర్నర్
తిరిగి కబురంపెను. టిప్పుసుల్తాన్ యుద్ధమున కప్పుడెంత
మాత్రము సంసిద్ధముగ లేకుండుటచే, ఆతడు తిరిగి వెనుకకు
శ్రీరంగము వైపునకుపారెను. శరదృతువంతయు చిల్లరపట్ట
ణముల పట్టుకొనుటలోను, విడుచుకొనుటలోను సరిపోయి
నది; ఫలరహితమగు ననేక సైనికవ్యూహముల పన్నుటలో
సరిపోయినది.

టిప్పువేసిన ముట్టడిని విడగొట్టుటకుగాని, పోనీ—
తిరువాన్కూరుకు గలిగిన నష్టమేమైన నున్నయెడల దానికి
తగిన పరిహారమిప్పించుటకు గాని యింత పెద్దసైనిక సన్నాహ
మవసరమా? మైసూరు రాజ్యమునంతను కూలద్రోయుటకై
మిగతారాజ్యముల వారందరేకమైవచ్చి పడుటన్యాయమా?
అవసరమా? ఎంతమాత్రమవసరము గాదనుమాట యెల్లరకు
స్పష్టముగ గన్పట్టుచునే యున్నది. అయిననేమి, వెనుక

మంగుళూరు సంధివలన తమ కేదో అవమానము జరిగినదని తక్కిన రాజ్యముల వారందరికి లోలోన కలకవేయుచునే యుండెను. అదిగాక, బంగాళా రాజ్యములో హేస్టింగ్సు తన సాహసిక రాజ్యతంత్రములచే నొనర్చిన మహాఘనకార్యములవంటి కార్యముల నిచట తాముకూడ మాయికుడును, రాజ్యకాంక్షాపరుడును నగు టిప్పుసుల్తాన్‌పై గావించి, పేరు ప్రతిష్టలు పొందుదమను సంకల్పమొకటి మదరాసు కుంపిణీ వారిని కూడ నావహించెను. ఇట్టి సంకల్పమును మనస్సులో పెట్టుకొని పైకిమాత్రము తిరువాన్కూరు రాజుకు గలిగిన అవమానమునకు ప్రతీకారమొనర్చుటకై తాము బయలుదేరుచున్నామనిచెప్పి, కుంపిణీవారు 1790 సం॥ లో టిప్పు రాజ్యములో చేరిన బారామహాల్ పరగణాను పట్టుకొనిరి. అది ఆరోజు మొదలుకొని యీ రోజువరకు మదరాసు రాజధానిలో నొకభాగమైపోయెను. ఏయుద్దేశముతో కుంపిణీవారు తిరిగి యీ యుద్ధములోనికి జొచ్చినది మన మిప్పుడు వేరుగ ఊహించుకొన నవసరములేకయే, స్పష్టముగ తేటపరచు రికార్డులే గలవు. ఈ యుద్ధమందు ప్రధాన సైనికోద్యోగిగ నుండిన మనోౖయనునాతడు 1790 సం॥ లో తాను సీమకు వ్రాసిన రహస్యపుటుత్తరములలో నీయుద్దేశ్యములు స్పష్టముగ వివరింపబడినవి. "రాజ్యాధికారమును దేశీయ రాజులమధ్య సరిసమానముగ పంచియుంచుటకు మనమిప్పు డవలంబించుచున్న పద్ధతి యెంతమాత్రము బాగుండలేదు. వీరి నందరిని జయించి ఆ రాజ్యాధికారము నంతను మనమే కాజేయుట యనున దొక్కటే సరియగు రాజనీతి

మార్గము. అది యొక్కటే సరియైనపద్ధతి. ఈ పద్ధతివలన మనకిప్పుడు వచ్చుచున్నదానికంటె మూడురెట్లు రెవిన్యూ అవలీలగ రాగలదు. ఆ రాజ్యాధికారము నంతను మనమిప్పుడొక్కసారియే దిగమ్రింగవలయునని నాయుద్దేశముకాదు. ఏలననగ, అదియిప్పుడు మనకు సాధ్యముకాదు. నే జెప్పున దేమనగ:— యీ పరమ సంకల్పమును మాత్రము మనము మరచిపోకుండ, సదామన దృష్టియెదుట నుంచుకొని మరీమనము మెళకువతో పనిచేయ వలసియుండును. ఈ సంకల్పసిద్ధి నెరవేరుటకు మాత్రము చాల సంవత్సరములు పట్టునను సంగతి నాకును తెలియును. అయినను, దానిని మన దృష్టినుండి మాత్రము జారిపోనీయకూడదు. మన మెప్పుడు రంగములోనికి రావలెనో, దేశీయరాజుల యంతః కలహములే మనకు తప్పక చెప్పును. కాని, టిప్పు యున్నంత వరకు మాత్రము మనకొసుముహూర్త మెన్నడు రాజాలదు." కాబట్టి, మనకింత యడ్డంకుగ నున్న యీ టిప్పు నేల తొలగించరాదు ?

ఇట్టి యోచనల కనుగుణముగ కారన్ వాలిస్ మహా రాష్ట్రులతోడను, నైజాముతోడను చేరి దొంగనేస్త్ముకట్టెను. 1795 సం॥ లో, యూరపు ఖండములో చేరిన రష్యా, ఆస్ట్రియా, ప్రష్యా రాజ్యములన్నియు యేకమై పోలెండు రాజ్యమును పగులగొట్టి పంచుకొనుటకుగాను చేసికొన్న మాయదారి యొడంబడికలోని షరతులకును, యిప్పుడిక్కడ యిండియాలో టిప్పుసుల్తానుకు జెందిన మైసూరు రాజ్యమును పగులగొట్టి పంచుకొనుటకుగాను కారన్ వాలిస్, నైజాము,

మహారాష్ట్రులు కలిసి చేసికొన్న మాయదారి యొడంబడిక లోని షరతులకును చాల పోలికలు గన్పట్టుట మహా విచిత్రముగ నున్నది. అందులోని కొన్ని మాటలు కూడ సరిగ నక్లేయున్నవి. ఈ రెండు ఒడంబడికలలోని సారాంశ మొక్కటేయని వేరుగ చెప్పనక్కరలేదు. హిందువులగు మహారాష్ట్రుల తరఫున నానాఫర్నవీసును, మహమ్మదీయులగు నైజామువారి తరఫున నైజామాలీయు, క్రైస్తవులగు యింగ్లీషు ప్రజల తరఫున కారన్ వాలీసును యేకమై తమ తమ వంతు సైన్యదళములను ఫిరంగులను రణభూమికి తీసికొని వచ్చునట్లును, మైసూరు రాజ్యములో కనీసము సగమైనను పగులగొట్టి తమలోతాము పంచుకొనువరకు యెవరుకూడ టిప్పుతో సంధి చేసికొనకుండుటకును, అగ్నిసాక్షిగ తమతమ మతగురువులపేర్లు జెప్పి యీ ముగ్గురు ప్రమాణముల జేసికొనిరి !

వెనుకటి యుద్ధములో పట్టుకొని విడిచిపెట్టిన బారా మహాల్ పరగణాపై తిరిగి దండెత్తి, యీ పర్యాయము దానిని వదలిపెట్టకుండ గట్టిగ పట్టుకొని యుంచుకొనిరి. వైస్రాయి యగు కారన్ వాలీసు వసంతర్తువు ప్రారంభమందు మదరాసుకువచ్చి, స్వయముగ సైన్యముల నడిపింపసాగెను. 1791 సంవత్సరమంతయు చిల్లర పోరాటములలోను బలిష్ట దుర్గముల లోంగదీయుటలోను సరిపోయినది. ఈ పోరాటములలో మైసూరు రాజధానికి 6 మైళ్ల దూరములోనున్న ఆరికెరా కోటవద్ద జరిగిన పోరాటము బహు ఘోరమై యుండెను. మరుసటి సంవత్సరముగాని యీ కోట స్వాధీనమునకు రాలేదు.

6 వ ఫిబ్రివరి రాత్రి యీ కోట వెలుపలి గోడలు ముట్టడింప బడెను. ఈ ముట్టడిలో చనిపోయినవారు, గాయములు తగిలినవారు, పారిపోయినవారు— అందరు కలిసి మొత్తము 20 వేలమంది మనుష్యులు టిప్పుసుల్తాన్ సైన్యములో నష్టమైరి. అప్పటికి టిప్పు లొంగి, కారన్వాలీస్ పెట్టినషరతు లకు ఒప్పుకొనెను. టిప్పుసుల్తాన్ తన రాజ్యములో సగ భాగము విడగొట్టి, మిత్రివర్గములోచేరిన నైజాముకు, మహారాష్ట్రిలకు, కుంఫిణీవారికి— తాము కోరుకొన్న చోట, తమ తమ రాజ్యములలో కలియుటకనువగు ప్రిదేశములను యీముగ్గురకు యిచ్చివేయవలెను. ఇది మొదటిషరతు. యుద్ధపుఖర్చులక్రింద టిప్పుసుల్తాన్ యీ ముగ్గురకు మూడు కోట్ల రూపాయల నివ్వవలయును. యిది రెండవషరతు. ఈడబ్బును సంవత్సరములో యిచ్చునట్లును, అంతవరకు హామీగా టిప్పుసుల్తాన్ కొడుకుల నిరువురను వీరివద్ద తాకట్టు వుంచుటకును మూడవ షరతు యేర్పరుప బడెను.

సంధిపత్రిముపై సంతకములైనపిమ్మట తాకట్టు వస్తువులగు టిప్పుసుల్తాన్ ముద్దుకొమరు లిరువురును మహావైభవ ముతో కారన్వాలీస్ శిబిరమునకు గొనిరా బడిరి. కారన్ వాలీస్ వారి నిరువురను కౌగలించుకొని " మీరు మావద్ద ఖైదీలుగ నున్నంతకాలము నేను మిమ్ములను పితృవాత్సల్య ముతో చూతు " నని గట్టిగ నమ్మబల్కెను. ఈ యార్ద్రి దృశ్యమును సింగిల్టన్ అను చిత్రకారుడు తన లేఖినిచే చిత్రిం చెను. కొన్ని రోజులవరకు కారన్వాలీస్ ప్రిభువు ఈ నాటక

రంగమందు తాను "సిపియో"* పాత్రనుధరించి జయప్రదముగ నటించుచుంటినని తలపోయుచుండెను. కాని, కారన్‌వాలీస్ పలికిన గొప్పపలుకులలోని తళుకు త్వరలోనే మాసిపోయెను. సంధిషరతులకు కేవలము వ్యతిరేకముగ దిండిగల్, బారామహాల్ పరగణాలు గాక మలబారు తీరమందున్న 2165 చదరపుమైళ్లుగల కొడగు రాజ్యమును కూడ తమ కిమ్మని కుంపిణీవారు పట్టుబట్టిరి. "ఈముగ్గురిలో యెవరి రాజ్యమునకది దగ్గరగవున్నది, చెప్పండి" అని టిప్పు సుల్తాన్—పాపము-దీనముగా నడిగెను. "నన్ను యీరీతిగ మీ రింకను అవమానపరుప దలచుకొన్నట్లు మీ రేల యింతవరకు చెప్పలేదు. నా కొడుకులకును, నాకును యెడబాపులు జేసి వారిని నావద్దనుండి తీసికొని వెళ్లుటకుముందే—యీ యుద్ధనష్టములో చాలభాగము నేను మీకు చెల్లించక మునుపే,—మీ రేల యీ సంగతిని సూచనగనైన కొంచెము బయటపెట్టరైతిరి?" అని మిక్కిలి కష్టముతోను, అసహ్యముతోను, టిప్పుసుల్తాన్ అడిగెను. ఆ కోపములో తిరిగి మీ మీదికి యుద్ధమునకు వత్తునని గూడ టిప్పు బెదరించెను. తన శత్రువుల సేనలు జాడ్యములచేతను, తినుబండారములు లేకను మాడిపోయి యెంతదుర్బలస్థితిలో నుండెనో, కొంచమన్న ఆతనికి నిజముగ తెలిసియే యుండినయెడల, ఆతడు తనప్రతిజ్ఞను తప్పక నెరవేర్చెడివాడే. ఆతని నిట్టి సంకల్పమునుండి మరల్చుటకు బహుకష్టమయ్యెడిదే. కొడగు

రాజ్యమును తన తండ్రియగు హైదరాలీ సంపాదించెను. ఆతడీ రాజ్యమును బహుకఠినముగ పాలించుటచే, తనకు స్వాతంత్ర్య మిప్పింపుడని కొడగురాజగు వీరరాజేంద్రుడు కుంపిణీవారి నాశ్రయించెను. సంధిషరతులలో యీ కొడగురాజ్య ప్రసక్తియే లేదనుమాట కారన్‌వాలిస్ కూడ ఒప్పుకొనక తప్పినది కాదు. అయితేనేమి, "కొడగురాజును టిప్పుసుల్తాన్ యొక్క క్రౌర్యాగ్నికి వదలివేయుట ధర్మమాయేమి?" యని కారన్‌వాలిస్ సమాధానముచెప్పెను. అందుకొరకుట వీరీసంధిషరతుల నుల్లఘించినది! తుదకు కొడగురాజ్యమును టిప్పుసుల్తాన్ వదలుకొనెను. అంతటితో తగాదాముగిసెను.

ఈ కొడగురాజ్య సంపాదనను గూర్చి కారన్‌వాలీస్ యీ రీతిగ యింటికి ఉత్తరమువ్రాసెను. "మలబారుకోస్తాలోని మనకుంపిణీవారి ప్రదేశములు చాలదుర్భేద్యములైనవి సముద్రము మీాదినుండివచ్చువారికి తప్ప, తదితరులెవరికి యివి సాధ్యముకావు. మెట్టదారిని సైతము, ఒక్క ఉత్తరమున తప్ప యింకేవైపునుండికూడ శత్రువులెవరు యీ కోస్తాలో ప్రవేశించజాలరు. ఇప్పుడీ భయముకూడ పోయినది. ఏలననగ, కొడగురాజ్యమును, పాల్ఘాటును మనమిప్పుడు సంపాదించుకొనుటవలన ఉత్తరదిశకూడ కట్టుబడినది. ఈ యుత్తరదిశను రెండు పర్వతకనుమలు గలవు, వీనిగుండామాత్రమే టిప్పుసుల్తాన్ యెప్పటికైనా మనకోస్తారాజ్యములోనికివచ్చి యేమైన గల్లంతు చేయునేమోయను భయమిదివరకుండెడిది. కాని మన మిప్పుడీ కొడగును, పాల్ఘాటును సంపాదించుకొనుటవలన ఆభయము కాస్తాపోయినది. ఈ

కోస్తాలోనున్న రాజులు స్వతంత్రులుకారు. వీరిప్పుడు మనకు లోబడియున్నారు. వీరినిగనుక బంగాళాజమీందారులను చేసినట్లుగ చేసి, ప్రజలను వత్తిడిచేయకుండ చేసిన యెడల, యీకోస్తాలోనుండు వర్తకమువల్ల మనకుంపిణీకెంతో లాభమువచ్చును. దీనివల్లమనకు సాలుకు 25లక్షల రూపాయిలు నికరాదాయమువచ్చుచు. ఇది ప్రస్తుతము బొంబాయి కుంపిణీవారికెంతో సహాయకారిగ నుండును".

ఈరీతిగ మూడువందల సంవత్సరము లవిచ్ఛిన్నముగ స్వాతంత్ర్యసుఖముల ననుభవించిన కొడగురాజ్యము 1834 సంవత్సరమువరకు కొలది స్థానికాధికారములతో మాత్రము యెట్లో పేరునకు మాత్రమొక రాజ్యముగ నుండనిచ్చిరి. ఆ సంవత్సరమందు రాజుకు వారిసులెవరు లేరను మిషపెట్టి, దానిని యింగ్లీషువారు మెదలకుండా తమరాజ్యములో కలుపుకొని యూరకొనిరి. వీరందరనుకొన్నదానికంటె టిప్పుసుల్తాన్ యొక్క సైనికబలమింకను యెక్కువగనేయుండెను. ఈతని మహోద్ధతి నణచి, యీతనిని సంధికి దింపుటకు రెండు సంవత్సరముల ఘోరయుద్ధ మవసరమయ్యెను. ఈ సంధివలన కుంపిణీవారికి 39½ లక్షల రూపాయ లాదాయము వచ్చినను, టిప్పుపై విధింపబడిన షరతులు చాల తేలికగనున్నవని మనోవగచుచున్నారు. కుంపిణీవారికి 24 వేల చదరపుమైళ్ల రాజ్యము లభించెను. ఈ యుద్ధములో నైజాము చేసిన సహాయము నకుగాను అతనికి బహుమతిగ యింత వైశాల్యము గలిగినట్టి ప్రదేశమునే యిచ్చిరి. ఈ నూతన రాజ్యవైభవము యొక్క మురిపెము నైజామున కెన్నాళ్లుండ నిచ్చిరో మనమిప్పుడే

చూడగలము. ఈ దోపిడిలో తమకేమియు భాగమవసరము లేదని మహారాష్ట్రులు పూర్ణముగ నిరాకరించిరి. కారణ మేమనగ మనమిట్లూహించ వచ్చును:— యెవని మహోద్ధతి నణచుటకైతే కుంఫిణీ, నైజాములతోపాటు తాముకూడ ఒకచేయివేసి సహాయము చేసిరో అట్టి టిప్పుసుల్తానుపై ప్రేమ చేతగాదు, గౌరవము చేతకాదు- దీనికి నిజకారణ మేమనగ: పరాయి దేశస్థులగు యూరోపియను లీ దేశమందు విజృంభించి భారత రాజ్యమునంతను గబళింపకుండ యే మైసూరు రాజ్య మైతే యింతవరకు దుర్భేద్యమగు చెలియలికట్టగ నుండెనో, అట్టిదాని నిప్పుడు తమచేతులతో తొలగించుటవలన తమ రాజ్యమునకే ముప్పువాటిల్లగలదని మహారాష్ట్రుల కిప్పటికి— అంతయు అయిన తరువాత, ఆలస్యముగ— తెలిసివచ్చినది. వారిప్పటికి కండ్లు తెరచిరి. అందుచే, "అరరే! యిక ముందీ తంత్రమందు చేరరాదురా" యని వారు దూరముగ నిలుచుండి పోయిరి.

మైసూరు రాజ్యమునకిట్టి తలవంపులను యిట్టివంచ నను దెచ్చిపెట్టిన యీ సంధిపత్రముపై సంతకములయ్యెను. విజేతలగు కుంఫిణీవారును, నైజామాలియు, తాము కొల్ల గొట్టుకొనిన ధనపుమూటల బరువులతో శ్రీరంగపట్టణ ద్వార ములనుండి వెడలి నడువసాగిరి. ఈ మూటలన్నియు మోసి కొనిపోవుచుండగ పురజనులెల్లరు వారిని కనుచూపు మేరవర కట్లే చూచుచుండ, వారంతలో నదృశ్యులైరి. ఆహా! తన రాజ్యలక్ష్మినిట్లు శత్రుమూకలువచ్చి మోసికొని పోవుచుండగ కనుచూపుమేరవరకు చూచుచు నుండిన టిప్పుసుల్తాన్ యొక్క

మనోభావము లెట్లుండునో యెవరు వర్ణింపగలరు? ఆతనిమనో జలధియందెట్టి కల్లోలవీచీమాలికలు తరంగితమై పొంగిపడు చుండెనో యెవరూహింపగలరు ? తనతండ్రి తన మహాద్భుత ప్రతిభచే సంపాదించి, దిట్టపరచి, తనచేతికి నప్పగించిపోయిన ఆ మహాసామ్రాజ్యము నిప్పుడే శత్రుమూకలువచ్చి, పగుల గొట్టి, తనకండ్లయెదుటనే, యెవరిచేతికిచిక్కిన ముక్కనువారు యెత్తుకొని పోవుచున్నారుగదా ! అట్టి మహాప్రతి భాశాలి హైదరాలీ కడుపునపుట్టిన యీ టిప్పుసుల్తాన్ యొక్క దర్పోద్ధతియంతయు— ఆహా! నేటితో నేలపాలయ్యె గదా! ఆతని ధనాగారమంతయు వట్టిపోయెగదా! తన పేరు విన్నమాత్రమున గడగడవడంకు శత్రుమూకల భయము నేటితో తీరిపోయెగదా! తనయందెంతో భక్తివిశ్వాసములతో నుండిన ప్రజలయనురాగమంతయు, వారిభక్తి విశ్వాసము లన్నియు నేటితో దగ్ధపటలమయ్యెగదా! తనశత్రుమూకలు తనరాజ్యపు పొలిమేరదాటి, ఆఖరు శిపాయిదళము కొంచెము కొండచాటుకాగానే, తిరిగి టిప్పు కొంచెమూపిరి దీసికొనెను.

ఆశాంకురము— పోయినదంతయు తిరిగి సంపాదించుకొనుట కును, తనకు గల్గిన యవమానమునకు తగిన ప్రతీకారమొన ర్చుటకును, యింకను అవకాశమున్నదను ఆశ— దింపుడు కళ్లముల యాస—ఒక్కసారి టిప్పు మనోక్షేత్రమందు పొటకరిం చెను. దీనికొరకే, యీ యాశచేతనే, ఆతడింకను యిన్నాళ్లు బ్రతికియున్నట్లు గాన్పించెను. తన రాజ్యములోని యాంతరంగిక పరిపాలనలో ప్రతిడిపార్టుమెంటును పూర్తిగ పరిశీలించి, మార్చి వేసి కొత్త పద్ధతుల నేర్పరచెను. యూరోపియన్ పటాలముల

శిక్షణాక్రమమును తరిఫీతులను, తన సైన్యములో ప్రవేశపెట్టిన యెడల, తన శత్రువుల జయించుట కెక్కువ అవకాశముండు నను ఆశతో ఆతడీ యూరోపియను పద్ధతులను, వ్యూహములను తన సేనయందు ప్రవేశపెట్టెను. కాని, యుద్ధముచే యలసిసొలసి, ఓటమిచే గలిగిన నిరుత్సాహము వలన దేశమంతయు చాల కుంగిపోయినస్థితిలో నున్నప్పుడు యిట్టి నూతన పద్ధతులు పనిచేయునా? నూతన పద్ధతుల ప్రవేశపెట్టుట కిదియా సమయము? అట్టివానిని ప్రవేశపెట్టుట కిది చాల అపాయకరమైన సమయము. ఏలననగ తన యుత్తమమేధాసంపత్తిచేతను, విజ్ఞానముచేతను తనకు గోచరించిన నూతన పద్ధతుల నొక్కసారిగ నవలంబించుటకు ప్రజలప్పటి స్థితిలో సంసిద్ధముగ లేరు. కాని, యీ సంగతిని టిప్పుసుల్తాన్ తన తొందరలో గ్రహించలేదు. తన కప్పటికి గలిగిన క్షణికోద్రేకముచేతను, పోయిన రాజ్యమంతా తిరిగి ఒక్కపట్టులోనే, తక్షణమే, సంపాదించుకొందామను ఆశచేతను, తొందరచేతను, ఆతడీ సంగతిని పూర్తిగ మరచిపోయెను. నూతన పద్ధతుల నొక్కసారిగ నవలంబించుటకు ప్రజలు సంసిద్ధముగ లేనిస్థితిలో, తాను కకర్తిచే, తన తొందరచే, వీని నొక్కసారిగ వారిపై జొప్పింప బూనినచో, అసలిదివరకే దిగులుపడియున్న ప్రజలు మరింత గాబరాపడి, తనయందు మరింత అపనమ్మకమును పొందుదురే గాని, వేరు లాభమేమియుండదను సంగతిని టిప్పుసుల్తాన్ తన యాత్రములో గ్రహించలేక పోయినాడు. ఇదివరకున్న దుబారా ఖర్చును కఠినముగ తగ్గించివేయవలసి వచ్చుటచే, యీతని

ఇదివర కాశ్రయించుకొనియున్న గొప్పవారందరు యీతని యెడ విముఖత వహించిరి. తన సిబ్బందిలో అసంతృప్తి సర్వ సాధారణముగ వ్యాపించెను. దీనిని చూచి అసలే సహజముగ కఠిన స్వభావముగల టిప్పుసుల్తాన్‌కు యిప్పుడు శత్రువుల చేతులలో ఓడిపోయి అవమానింపబడి, దౌర్భాగ్యస్థితిలో పడియున్న యిప్పుడు— మరింత చీదర, కోపము, విసుగుదల యెక్కువయ్యెను. ఆతడు తరువాత బ్రతికిన నాలుగు రోజులు ఆతని ప్రవృత్తి బహుకఠినముగను క్రూరముగను వుండి, యీతడు క్రూరగ్రహమోయన నొప్పుచుండెను. ఈ క్రూర గ్రహచ్ఛాయలు నానాటికి దట్టమై, తమోపూరితమై, మూఢ విశ్వాసతిమిరములచే మరింత నల్లనై, యీతని చరమ దశను గాఢాంధకారబంధురముగ నొనర్చి వేసెను. మైసూరు రాజ్యపు మణి కిరీటము పూర్తిగ క్రింద డొల్లిపోకమునుపే,— దాని కాంతి చాల దినముల కిందటనే ప్రజల దృష్టిలో మాసి పోయెను.

మన మిత్రుడని చెప్పుకొనిన త్రివాన్కూరురాజు యొక్క మర్యాదను మనము కాపాడిన లక్షణమిది! ఈ ఘోరయుద్ధమువల్లగాని, మైసూరురాజ్యమును పగలగొట్టి పంచుకొనుట కేర్పాటుచేసికొన్న యీ సంధివల్లగాని, యీ తిరువాన్కూరు మహారాజుకొక్క చిల్లిగవ్వయైనను ముట్టినట్లెక్కడను లేదు. రణభేరిపై మొట్టమొదటి దెబ్బపడిన క్షణము నుండియు, తిరువాన్కూరు రాజునెరే పూర్తిగమరచిపోయిరి. ఆతని యూరు పేరు తరువాత యెక్కడను వినబడనేలేదు. "క్రొత్త రాజ్యము నీకిచ్చినామ'ని చెప్పి నైజామును నాలుగు

రోజులు పిల్లలకు చేతిలో బెల్లము పెట్టి ఆడించినట్లు ఆడించిరి. నిజమున కారాజ్యభాగ మతనికి ఖాయముగ యివ్వలేదు. ఈదానమిచ్చిన యింగ్లీషువారి తరఫున మధ్యనాలుగు రోజులతడు వానికి ట్రస్టీగ నుండునట్లే వారిచ్చిరి. ఇవ్వడమప్పుడైతే కలిగినదో తీసికొనడముకూడ అప్పుడే వున్నదిగదా. ఈ సధింబేరములను కుదిర్చిన కుంపిణీవారు లాభములో పాళ్లువేసికొనునప్పుడు తమమిత్రుడగు తిరువాన్కూరు రాజును మరచిపోయినను, తమ్మును మాత్రము తాముమరచిపోలేదు. కుంపిణీవారు దర్బారు ఖర్చులక్రింద 30 లక్షల రూపాయలను కోరి పుచ్చుకొనిరి. "దర్బారు ఖర్చు" లనగనేమి? ఈ సంధినికుదిర్చిన ఉద్యోగస్తులకు పంచిపెట్టుటకు! ఈ వ్యవహారమంతయు నిట్లుముగిసినపిమ్మట కారన్ వాలీస్ కలకత్తాకు వచ్చివేసెను. ఇంగ్లీషువారు వెనుక అమెరికాను గోల్పోయిన సందర్భములో యీ కారన్ వాలీసే అమెరికావారి చేతులలో "యార్కు-టౌను" యుద్ధములో దారుణముగ ఓడిపోయి పరిభవింపబడెను. ఆ దెబ్బతోనే అమెరికా యింగ్లీషువారి చేతులలోనుండి జారిపోయెను. కారన్‌వాలీసుకు అప్పుడా యార్కు-టౌనులో గలిగిన యవమాన మిప్పుడీ మైసూరు యుద్ధములో గలిగిన విజయము వలన మాసిపోయినది. అందుచే పార్లమెంటువారీతనికి వెంటనే "మార్క్విస్" అను గౌరవ బిరుదునిచ్చిరి.

శోభాయమానమగు యీ విజయ వార్తలు సీమకు చేరెను. వీనితోపాటు యీ విజయము లే సాధనముల వల్ల సాధ్యమయ్యెనో ఆ సాధనములలోని రహస్యములు

కూడ సీమ ప్రజలకు కొంతవరకు తెలియవచ్చెను. పర రాజ్యముల గజళింపజూచు నీ యుద్ధముల నిజస్వభావమేమి? “వెనుక క్లైవు చేసినరీతిగ కొందరు సాహసిక పురుషులు బయలుదేరి డబ్బు దోచుకొనుటకై పన్నిన రాచకార్యములు కావాయివి” యని కొందరు ప్రజలు సవిషాదముగ ప్రశ్నింప సాగిరి. మరుసటి సంవత్సరము కుంపిణీవారికి తిరిగి వర్తకపు పట్టా యివ్వవలసి వచ్చినప్పుడు దేశములో రాజకీయ శ్రీరంగ నీతులనెడి గొప్ప తుపాను వీవనారంభించెను. ఇట్టి తుపాను అప్పుడప్పుడు మన సీమదేశముతో అంటురోగమువలె వ్యాపించి మహాభయంకరముగ వీచిపోవుచుండుట మామూలే లెండి! వెనుకచేసిన తప్పుల కన్నిటికి తాము చాల పశ్చాత్తాపపడుచున్నట్లు కుంపిణీవారిచేత యేవో నాలుగు మాయమాటలు చెప్పించినగాని యీ ప్రజాఘోష అణగేటట్లు కన్పించలేదు. అందుచేత, పార్లమెంటువారు తిరిగి పట్టాను యిచ్చేముందర కుంపిణీవారిట్లు “తూ, నాబొడ్డు తుంబాల” ని ఒట్టుపెట్టుకొని ప్రమాణము జేసిరి. “పర దేశముల మీద వెళ్లిపడడం, వానిని దిగమ్రింగడం,— ఎబ్బెబ్బే— మా ఉద్దేశమేకాదు. ఛీ, ఛీ, అది చాల అసహ్యమైనపని; మా సీమదేశ గౌరవానికి, మా రాజనీతికి, అది కేవలము విరుద్ధమైనపని ”— అని యీరీతిగ కుంపిణీవారు ప్రమాణ వాక్యముల బల్కిరి. ఇదియే పార్లమెంటు వారి యొక్క మీరరాని ఆజ్ఞగ ఆనాడెంచబడెను. ఈ యాజ్ఞను కుంపిణీవారు విధేయతతో పాలింతురను నూహామీద భారత వర్షపుగతిని తిరిగి— చాదంమంత్రి వర్ణించినట్లు— లండన్

పట్టణములో "లెడన్‌హాల్ వీధిలో మకాంచేసియున్న దర్బారోపులగు నాశియాఖండపు దొంగ, దోపిడీగాండ్రి" చేతులలో వప్పగింపబడెను. కొంతకాలము కనీసము పైచూపులకైనను కుంపిణీవారియాజ్ఞను పాలింపుచున్నట్లు నటించిరి. అద్దె సేనలను పుచ్చుకొనవలసినదని చెప్పి, లాలించి, తమకు లోబరచుకొనిన రాష్ట్రములన్నియు నానాటికి కుంపిణీవారి అదుపుఆజ్ఞల కెక్కువగ వశమైపోయి అతిదీనస్థితికి వచ్చెను. ఈ యద్దెసేనల కిచ్చుకొనవలసిన జీతములు బకాయపడిన కొలది, తమరాజ్యములో నింక యెక్కువ ప్రదేశములపై వచ్చు రెవిన్యూను తమకు తాకట్టుపెట్టవలసినదని కుంపిణీవారీ రాష్ట్రములవారిని బలవంతపెట్టుచుండిరి. రానురాను యే స్థితికి వచ్చినదనగ— "మొర్రో మాకీ యద్దెసేనలు అక్కర లేదయ్యా మీసేనలు మీరు తీసికొని వెళ్లండి" అని యనుటకు కూడ వీలులేని స్థితి వచ్చినది. ఇది చివరకు బలవంతపు బ్రాహ్మణార్థమైనది. "మారక్షణ క్రింద మీరుండవలసిదే; ఆగౌరవమును మీరు పొందవలసినదే"— అని కుంపిణీవారను చుండిరి. ఆహా, యిదియేమి గౌరవము, యిది బలాత్కార గౌరవప్రహసనమువలె నున్నదే! ఈరీతిగ అద్దెసేనలను వారిపై బలాత్కారముగ జొప్పించి, వారు వాని జీతములిచ్చుకొన లేకపోయినప్పుడు, వారి రాజ్యముమీద రెవిన్యూనంతను తాకట్టు పెట్టించుకొని, ఆతాకట్టును వారు వదలించుకొనే అవకాశం లేనప్పుడు చిట్టచివరకు ఆరాజ్యమంతా కుంపిణివారే కలుపుకొనుచుండిరి! 1780 సం॥ లో హైదరాలీ దండయాత్రకు పూర్వము కర్ణాటకపు నబాబు తన రాజ్యముపై వచ్చు

రెవిన్యూలో చాలభాగము యిట్లే కుంపిణీవారికి తాకట్టు పెట్టెను. "చాలభాగమేల? అంతయు కాజేయవలయు" నను బుద్ధి కుంపిణీవారికి పుట్టెను. దానికేదో మిష కావలయును గద! తలుచుకుంటే మిష కేమికొదువ; ఏదో మిషచాలదా? యుద్ధపుఖర్చులని పేరుపెట్టి యీ యావత్తు రెవిన్యూను తమకే యిచ్చివేయవలయునని కుంపిణీవారనిరి. నబాబు మహమ్మదల్లీకి మాత్రము— పాపము— ఫించనుక్రింద ఆరోవంతు యిద్దామనుకొన్నారు. ఈ యేర్పాటు నబాబుకు చాల గొప్ప వరప్రసాదమని లాభసాటి బేరపు వేదాంతియగు మిల్లు పండితుడు ధర్మపన్నాగముల చెప్పుచున్నాడు! ఎందు కట! నబాబుకు, హాయిగ, యేకష్టములేక, రాజ్యవ్యవహారపు బాదరబందీ యేమీ లేకుండ, సరిగ నెలఅయ్యే టప్పటికల్లా పింఛను దానంతట అది వచ్చి చేతులో పడుతుంది! ఆతడిదివరకు తాను తనకుగాను స్వయముగ ఖర్చు పెట్టుకునే డబ్బుకంటె యిప్పుడు కుంపిణీవారు యెక్కువ పింఛనే యిచ్చు చున్నారుగా! కాబట్టి, యిక నబాబుకు కావలసినదేమి? ఇది మిల్లు పండితుని వాదన!



గలిగిన దుష్ఫలితములను బంగాళాప్రజలు పెక్కు సంవత్సరములనుండి నేటికీ కూడ బహుకఠినముగ అనుభవించుచు నేయున్నారు. కావున, యీ బంగాళా దేశమును పూర్వపు మైశ్వర్యస్థితికి దెచ్చి, యిండియాలో మన బ్రిటిషు రాజ్యాధికారమునకును, బ్రిటిషు ప్రజల లాభమునకును గట్టి యండగనుండు నట్లు చేసికొన దలచినయెడల, మన యిప్పటి పరిపాలనా పద్ధతియందు సమూలమగు మార్పుగావించ వలసిన యావశ్యకత అనివార్యముగ వచ్చుచున్నది.

—కారన్‌వాలీస్.

భరతఖండమందలి ఆయాప్రాంతముల భూగోళపరిస్థితులలో నెన్నిరకములు గలవో ఆయాప్రాంతములలో నుండు భూమితరముల పరిస్థితులందును, శిస్తులవిధించు పద్ధతులందును అన్నన్ని రకములుగలవు. ఒక ప్రాంతమువారి యాచారములు యింకొక ప్రాంతమువారికి తెలియవు. 1765 సంవత్సరపు సంధి వలన కుంపిణీవారు బెంగాల్, బీహారు, ఒరిస్సారాష్ట్రములకు దివానులైనప్పుడు అదివర కములులోనున్న పద్ధతులననుసరించియే వారు కొంతకాలము వ్యవహారము సాగించిరి. పండిన పంటను బట్టియే పన్నువిధించు యేర్పాటు అప్పుడమలులో నుండెను. సేద్యగాడును రాజును కలిసి పండినపంటను సరిసమానముగ పంచుకొనుచుండిరి. రాజుకిచ్చిన భాగములో పదవవంతు జమీందారుకు పోవుచుండెను. సాగుబడిభూమి, పంట, పన్ను మున్నగు లెక్కలన్నియు గ్రామకరణము వ్రాయుచుండును. వీరికి రైతులే నిర్ణీత వేతనముల నిచ్చుచుండిరి. లేదా యీ పనికిగాను వీరికి యీనాములివ్వ

బడుచుండెను. కొన్ని గ్రామములు చేరి ఒక పరగణా యగుచుండెను. కొన్ని పరగణాలు కలసి ఒక "సర్కారు" అగుచుండెను. రెండుమూడు "సర్కారు" లు కలసి ఒక "సుభా" యనబడుచుండెను. మిక్కిలి విస్తీర్ణములగు భూములుగలిగి, అందలి పన్నులవసూళ్లకు తాము ప్రభుత్వమునకు స్వయముగ బాధ్యులగువారు జమీందారు లనబడిరి. ఈ జమీందారుల క్రింద తాలూకాదార్లుండిరి. జమీందారులకంటె వీరికి తక్కువ భూములుండెను. ఈ తాలూకాదార్ల క్రింద రైతులుండిరి. అనగ నాగలిబట్టి స్వయముగ పొలముల సాగుబడిచేయు సేద్యగాండ్రుండిరి. బంగాళాదేశపు జమీందారీలలో కొన్ని— బర్ద్వాన్, బారక్‌పూర్, బీర్‌భూమి, మున్నగు జమీందారీలు దాదాపు నాలుగువేల చదరపుమైళ్ల వైశాల్యముగలిగి యుండెను. ఈ జమీనాల కధిపతులగువారు రాజాలని పిలువబడుచుండిరి. వీరు ఉత్తమకులసంజాతులు. తక్కిన జమీనాలలో చాల భాగము అంతకంటె తక్కువ వైశాల్యము గలవి; ఈ జమీనాల కధిపతులగువారుకూడ పైన పేర్కొన్న రాజాలకంటె తక్కువ ప్రతిభ తక్కువ పలుకుబడిగలవారు. కుంపిణీవారు దివానిగిరీకి రాగానే చేసిన పని యేమనగ "మీరు కేవలము వచ్చిన డబ్బును జమకట్టుకొనుపనిని మాత్రమే చేసికొనండి. పన్ను లేయే రీతులుగ వసూలుపర్చవలెనో మున్నగు తక్కిన వ్యవహారములన్నియు దేశీయుల చేతులలోనే వదలివేయండి" అని సీమలోని కుంపిణీ డైరెక్టర్లు యిక్కడనున్న తమ యుద్యోగస్థులకు వ్రాసిరి. ఇది వారు మొట్టమొదట చేసినపని.

రెవిన్యూలో చాలభాగము యిట్లే కుంపిణీవారికి తాకట్టు పెట్టెను. "చాలభాగమేల? అంతయు కాజేయవలయు" నను బుద్ధి కుంపిణీవారికి పుట్టెను. దానికేదో మిషకావలయును గద! తలుచుకుంటే మిషకేమికొదువ; ఏదో మిషచాలదా? యుద్ధపుఖర్చులని పేరుపెట్టి యీ యావత్తు రెవిన్యూను తమకే యిచ్చివేయవలయునని కుంపిణీవారనిరి. నబాబు మహాత్మ నకు మాత్రము— పాపము— ఫించనుక్రింద ఆరోవంతు యిస్తామనుకొన్నారు. ఈ యేర్పాటు నబాబుకు చాల గొప్ప వరప్రసాదమని లాభసాటి బేరపు వేదాంతియగు మిల్లు పండితుడు ధర్మపన్నాగముల చెప్పుచున్నాడు! ఎందు కట! నబాబుకు, హాయిగ, యేకష్టములేక, రాజ్యవ్యవహారపు బాదరబందీ యేమీ లేకుండ, సరిగ నెలఅయ్యేటప్పటికల్లా పింఛను దానంతట అది వచ్చి చేతులో పడుతుంది! ఆతడిదివరకు తాను తనకుగాను స్వయముగ ఖర్చు పెట్టుకునే డబ్బుకంటె యిప్పుడు కుంపిణీవారు యెక్కువ పింఛనే యిచ్చు చున్నారుగా! కాబట్టి, యిక నబాబుకు కావలసినదేమి? ఇది మిల్లు పండితుని వాదన!



# భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన

## 15 వ అధ్యాయము.

భూమి తరము 1793



" బంగాళాదేశము ప్రపంచము [illegible] దేశములలో నొకటి. అందలి జనము సాధువులు ; కష్టజీవులు. [illegible] గ్లీషువారి రాజ్యములలోఁగల జనసంఖ్యకంటె [illegible] నముగ నైననుండెనని చెప్పవచ్చును. ఇది హిందూదేశమున [illegible] రము కోట్లకొలది ధనమును పంపించుచున్నది ; [illegible] ఖజానాకదియే గొప్పయండ ; ఇతర రాజధానుల [illegible] విరివిగను కావలసిన సరఫరాలనన్నిటిని [illegible] సామర్థ్య మీ బంగాళాదేశమునకేగలదు. ఈ పై [illegible] బంగాళాదేశము నిజముగ మనకెంత విలువైన రాజ్యమో [illegible] చున్నది. [illegible] వర్ణించిన బహువ్యయ భారముల వలనను, [illegible] వేటుగ దోచుకొని యింటికి పంపించిన ధనరాసుల మూలమునను, దేశములోని ద్రవ్యమంతయు చాలవరకు వట్టిపోయెను. అందుచే దేశములో వ్యవసాయమును, వాణిజ్యము పూర్తిగ నాశనమైపోయెను. ఈ [illegible]

గలిగిన దుష్ఫలితములను బంగాళాప్రజలు పెక్కు సంవత్సరములనుండి నేటికి కూడ బహుళకఠినముగ అనుభవించుచునేయున్నారు. కావున, యీ బంగాళా దేశమును పూర్వపు ఐశ్వర్యస్థితికిదెచ్చి, యిండియాలో మన బ్రిటిషు రాజ్యాధికారమునకును, బ్రిటిషు ప్రజల లాభమునకును గట్టి యండగనుండు నట్లు చేసికొన దలచినయెడల, మన యిప్పటి పరిపాలనా పద్ధతియందు సమూలమగు మార్పుగావించ వలసిన యావశ్యకత అనివార్యముగ వచ్చుచున్నది.

—కారన్‌వాలీస్.

భరతఖండమందలి ఆయాప్రాంతముల భూగోళపరిస్థితులలో నెన్నిరకములు గలవో ఆయాప్రాంతములలో నుండు భూమితరముల పరిస్థితులందును, శిస్తులవిధించు పద్ధతులందును అన్నన్ని రకములుగలవు. ఒక ప్రాంతమువారి యాచారములు యింకొక ప్రాంతమువారికి తెలియవు. 1765 సంవత్సరపు సంధి వలన కుంపిణీవారు బెంగాల్, బీహారు, ఒరిస్సారాష్ట్రములకు దివానులైనప్పుడు అదివర కములులోనున్న పద్ధతులననుసరించియే వారు కొంతకాలము వ్యవహారము సాగించిరి. పండిన పంటను బట్టియే పన్నువిధించు యేర్పాటు అప్పుడమలులో నుండెను. సేద్యగాడును రాజును కలిసి పండినపంటను సరిసమానముగ పంచుకొనుచుండిరి. రాజుకిచ్చిన భాగములో పదవవంతు జమీందారుకు పోవుచుండెను. సాగుబడిభూమి, పంట, పన్ను మున్నగు లెక్కలన్నియు గ్రామకరణము వ్రాయుచుండును. వీరికి రైతులే నిర్ణీత వేతనముల నిచ్చుచుండిరి. లేదా యీ పనికిగాను వీరికి యీనాములివ్వ

బడుచుండెను. కొన్ని గ్రామములు చేరి ఒక పరగణా యగుచుండెను. కొన్ని పరగణాలు కలసి ఒక "సర్కారు" అగుచుండెను. రెండుమూడు "సర్కారు" లు కలసి ఒక "సుభా" యనబడుచుండెను. మిక్కిలి విస్తీర్ణములగు భూములుగలిగి, అందలి పన్నులవసూళ్లకు తాము ప్రభుత్వమునకు స్వయముగ బాధ్యులగువారు జమీందారు లనబడిరి. ఈ జమీందారుల క్రింద తాలూకాదార్లుండిరి. జమీందారులకంటె వీరికి తక్కువ భూములుండెను. ఈ తాలూకాదార్ల క్రింద రైతులుండిరి. అనగ నాగలిబట్టి స్వయముగ పొలముల సాగుబడిచేయు సేద్యగాండ్రుండిరి. బంగాళా దేశపు జమీందారీలలో కొన్ని— బర్ద్వాన్, బారక్ పూర్, బీర్‌భూమి, మున్నగు జమీందారీలు దాదాపు నాలుగువేల చదరపుమైళ్ల వైశాల్యముగలిగి యుండెను. ఈ జమీాల కధిపతులగువారు రాజాలని పిలువబడుచుండిరి. వీరు ఉత్తమకులసంజాతులు. తక్కిన జమీాలలో చాల భాగము అంతకంటె తక్కువ వైశాల్యము గలవి; ఈ జమీాల కధిపతులగువారుకూడ పైన పేర్కొన్న రాజాలకంటె తక్కువ ప్రతిభ తక్కువ పలుకుబడిగలవారు. కుంపిణీవారు దివాన్గిరీకి రాగానే చేసిన పని యేమనగ "మీరు కేవలము వచ్చిన డబ్బును జమకట్టుకొనుపనిని మాత్రమే చేసికొనండి. పన్ను లేయే రీతులుగ వసూలుపర్చవలెనో మున్నగు తక్కిన వ్యవహారములన్నియు దేశీయుల చేతులలోనే వదలివేయండి" అని సీమలోని కుంపిణీ డైరెక్టర్లు యిక్కడనున్న తమ యుద్యోగస్థులకు వ్రాసిరి. ఇది వారు మొట్టమొదట చేసినపని.

కాని, స్థానికులగు దేశీయుల పరిపాలనను తీసివేసి, దానిస్థానే యెప్పుడైతే పరాయి దేశస్థుల నిరంకుశాధికారములను విచ్చలవిడిగ చెలరేగునట్లు నెలకొల్పిరో, అప్పుడే అనేక దుర్నయములు బయలుదేరి ఆర్థిక క్షేత్రము బీడువేసిపోయెను. 1769 సం॥లో కుంపిణీవారు తమ ఆయవ్యయ పట్టికను చూచుకొని గాభరాపడిరి. వెంటనే దేశీయులగు వసూలుదార్లపై ఇంగ్లీషు సూపరువైజర్లను పెట్టిరి. ముర్షిదాబాదు, పాట్నా ఠాణాల వద్ద విచారణ సంఘముల నెలకొల్పిరి. ఉన్న లోపములను వారు బయటపెట్టగలిగిరేగాని, వానిని నివారించుటకు మాత్రము వారికి సాధ్యముకాకుండెను. 1772 సం॥ లో వారన్ హేస్టింగ్సు రెవిన్యూడిపార్టుమెంటువంతను పూర్తిగ మార్చివేసి క్రొత్తయేర్పాట్లనుచేసెను. దేశీయ కలెక్టర్లను తీసివేసి, యూరోపియను కలెక్టర్లనుపెట్టెను. కలకత్తా కౌన్సిలును రెవిన్యూబోర్డుగ మార్చెను. కొత్తయుద్యోగస్థులను పెక్కుమందిని పెట్టెను. ఖజానాను ముర్షిదాబాదునుంచి మార్చి కలకత్తాకు చేర్చెను. క్రొత్తభూమితరమును విధించుట కేయే యేర్పాటుల చేసిన బాగుండునో విచారించి తెలిసికొనిరమ్మని పలుగురు కౌన్సిల్ సభ్యులను దేశమందు సంచారమునకు పంపించెను. కాని, వెనుకనున్న దేశీయోద్యోగులవల్లకంటె యిప్పుడీ కేవలము ఫరంగీయుద్యోగస్థులవల్ల కుంపిణీవారికెక్కువ ఒరగినదేమియులేదు. పాపము, పెక్కుమంది దేశీయోద్యోగులు, సన్నకారు గుమాస్తాలు, ఉద్యోగములనుండి వెళ్ళగొట్టబడిరేగాని వేరు లాభమేమియు కుంపిణీకి గలుగలేదు. వారిస్థానే యింకకొంతమంది ఫరంగీ దుండగీండ్రకు

ఉద్యోగములుదొరికెనేగాని, భూమియెక్కువ పంటనీయలేదు. తమభాగస్వాముల కెక్కువ లాభమునూ కుంపిణీవారు పంచిపెట్టలేదు. 1774 సంవత్సరములో కారన్‌వాలీస్‌వచ్చి తిరిగి నల్లవారినే వసూలుదార్లుగ నేర్పాటుచేసెను. పై తనిఖీకి ఆరు జిల్లాకౌన్సిళ్ళను నియమించెను. ఇది యెట్లు పనిచేయునో చూద్దామనిచెప్పి, ముందుగ అయిదేండ్లవర కొక భూమితరమును నిర్ణయించెను. కాని, ఫలితము లంత తృప్తికరముగ లేకుండెను. అందుచే, అయిదేండ్ల యనంతర మీపద్ధతిని తిరిగి నెలకొల్పుటకు కారన్‌వాలీసుకు యిష్టము లేకపోయెను. అందుచే 1777 సం॥ లో తిరిగి నాలుగేండ్లవరకు యేక్‌సాల్ తరముల నేర్పరచెను. ఈ పద్ధతివలన జమీందార్లు భూమిపన్నుకు బాధ్యులుగ చేయబడిరి. వీరు తమ విధికృత్యముల సక్రమముగ నిర్వహించుచుండుటకు పూచీగ వీరి స్వాధీనములో నున్న భూములపై స్వంతహక్కును మాత్రము కుంపిణీయే వహించెను. 1781 సం॥ లో యింకొక క్రొత్తపద్ధతిని ప్రయత్నించిచూచిరి. జిల్లాకౌన్సిళ్ళను తొలగించి, దేశమంతకు ఒకే రెవిన్యూకమిటీ నేర్పరచిరి. కలెక్టర్లకు, (వసూలుదార్లకు) తమతమ జీతములుకాక, తాము వసూలుచేయు శిస్తుపై నూటికి కొంత కమీషన్‌కూడ నిచ్చుచుండిరి. అందుచే ప్రతివాడు యెక్కువ సొమ్మును వసూలుచేసి, కుంపిణీ ఖజానాను యెక్కువగ నింపుటకు ప్రోత్సాహము కలిగింపబడెను. కాబట్టి యిదియొక లంచమనియే చెప్పవచ్చును. ఈ లంచపుపద్ధతి యెట్లు జయప్రదముగ పనిచేసెనో కారన్‌వాలీస్ చెప్పిన యొక యుదాహరణనుబట్టి తెలియగలదు. ఒక

కలెక్టరుకు జీతము నెలకు వెయ్యిరూపాయిలట. ఆతడు ఆ సంవత్సరము మొత్తముమీద సంపాదించిన కమీషన్ (లంచము) కనీసము 4 లక్షల రూపాయిలట !

1784 సం॥ లో పార్లమెంటువారుచేసిన పిట్సుయిండియా ఆక్టులో కుంపిణీవారి కీ విధముగ నధికారమిచ్చిరి. "ఇండియాలోని భూస్వాములేవో బాధలుపడుచున్నామని చెప్పినారు. వానిలో నిజమెంతో కనుక్కొని, వానికి తగిన పరిహారము లిప్పించవలెను. భూమితరముల నిర్ణయించుటకును, రివిన్యూ వసూలుపరుచుటకును, ఖచితమగు నిబంధనల నేర్పరుపవలెను. దేశీయుల పూర్వాచారములను, శాసనములను అనుసరించి న్యాయాన్యాయముల తీర్పుటకును యేర్పాటు చేయవలెను. కాబట్టి, కారన్‌వాలీస్ యిండియాలో కాలుపెట్టగనే మొట్టమొదట ఆతడుచేయవలసివచ్చిన పనియిదే. అనగ, నిర్ణీత పద్ధతులపై భూమిశిస్తును స్థిరపరచుటయే. ఈ పనియే నేటికిని ఆయనపేరుతో శాశ్వతముగ నుండిపోయినది. భూమిశిస్తుల వసూళ్ల విషయమైలోగడ కుంపిణీవారనేక గొప్పతప్పులను చేసినట్లును, అందుచే దుష్పరిపాలన చెలరేగినట్లును చాలమంది గొప్పకుంపిణీ యుద్యోగులే స్వయముగ ఒప్పుకొనియున్నారు. కాని, యిప్పుడీసంగతిని పార్లమెంటు మహాసభవారు కూడ శాసనికరూపముగ పూర్తిగ, నిర్మొగమోటముగ, ఒప్పుకొనియున్నారు. "ఈ మన ముప్పది సంవత్సరముల పరిపాలనాధికారములో మన మనేక చేయరాని పనులను చేసితిమి; చేయవలసిన పనులను మానివేసితిమి. ఈముప్పదియేండ్లు యీ రీతిగ గడుపుట

త్రోడనే సరిపోయినది'' అని పార్లమెంటువారు ప్రమాణపూర్తిగ వక్కాణించిరి. "దేశమును తలక్రిందులు చేసివేసి, రైతులపై ఘోరమగు పన్నుల విధించి పీల్చిపిప్పిచేసి, రాజులను బిచ్చగాండ్రజేసి, ప్రజలను పీడించి పిండునట్లు తహశ్శీల్దార్లను పైనుండి అంకుశములచే పొడిచి, నల్ల తెల్ల కలెక్టర్లకు బెసురులుపెట్టియు, లంచముల మేపియు, ప్రజలనుండి ఘోరముగ నిర్బంధపు వసూళ్లజేయించి దేశమును ముప్పది సంవత్సరము లేకరీతిని నానాభీభత్సము చేసిన తరువాత, యిప్పటికి పార్లమెంటువారు కండ్లుతెరచి "ఛీ, ఛీ, యీ పద్ధతంతా వట్టి పనికిమాలినది; దీనినంతా మార్చివేసి, క్రొత్త పద్ధతిపెట్టాలి" అని ఒప్పుకొనవలసినవారైరి. బంగాళా దేశమంతయు వట్టి అడివియై పోవుచుండెను. కుంపిణీభాగస్వాములకు లాభములు తక్కువై పోవుచుండెను; అందుచే సర్కారునుండి అప్పుతీసికొని, లాభములకాతాను సరిపుచ్చవలసని కుంపిణీప్రెసిడెంటు చూచుచుండెను.

క్రొత్తతరము నిర్ణయించుటకుగాను తగు సాజా యిపిడి ప్రోగుచేయవలసినదని 1787 సం॥లో కలకత్తాలోనున్న రెవిన్యూ బోర్డువారితో చెప్పిరి. కాని, యింత పెద్దవ్యవహారము ఒక్క రోజులో అగునా? ప్రతిరైతుపొలమునుకొలచుట, సరిహద్దుల నిర్ణయించుట, ఆ పొలములందు యెవరి కేయేహక్కులు, బాధ్యతలు గలవో నిర్ణయించుట, ప్రస్తుతము ఆక్రమించుకొని యున్నవాని కేమిహక్కులుగలవో, అచట హక్కుదారు డెవడో, వానికేమి హక్కులెంతవరకు గలవో యినన్నియు విచారించి, పైసల్ చేయుట సామాన్యమైనపనియా? ఒక

రోజులలో తెమలునా ? ఈ కర్మకాండ యంతయు యేదో విధముగ అయినదనిపించుకొనునప్పటికి 1789 సంవత్సరము వచ్చెను. అంతవరకు యేమిచర్యయు తీసికొనుటకు వీలు లేకపోయెను. రెవిన్యూబోర్డువా రీరీతిగ రెండేండ్లు విచారించి తేల్చిన సారాంశములు చాల అసంపూర్తియైనవనియు, యెంత మాత్రమును నమ్మదగినవి కావనియు,త్వరలోనే తెలిసివచ్చెను. "కుంపిణీవారు దివాన్‌గిరికి వచ్చునాటికి పన్నులవిధించుటలోను శిస్తుల వసూలుపర్చుటలోను అనేక దుర్మార్గములు ప్రబలి యున్నను, మొగలాయిరాజ్యము మహోచ్ఛదశయందున్న రోజులలో ప్రజలహక్కులను, స్వత్వవిశేషములను దేశమునకు పూర్వ మధిపతులుగనుండిన హిందువులచే నెలకొల్పబడిన ప్రతిష్ఠాపనలవలన భద్రముగ కాపాడబడుచుండె"నని యీకుంపిణీవారు చేసిన విచారణలో తెలియవచ్చెను. ఈ పూర్వపు హిందూపద్ధతినే పెంపొందించి కొనసాగించుట మంచిదని కొందరప్పుడు సలహాచెప్పిరి. కాని, కారన్‌వాలీస్, డంకన్, షోర్, బార్లో మున్నగు కుంపిణీమెంబర్లు భిన్నాభిప్రాయులైరి. పూర్వకాలమందు జమీందారుల కట్టిపదవి యున్నను లేకున్నను, యిప్పుడు వారిని భూమికి హక్కుదారులుగ చేయుట మంచిదని వీరు తలంచిరి. వీరిట్లు తలంచుటకు రెండు ప్రధానకారణములు గలవు. (1) కుంపిణీవారికి యీ భూమిశిస్తే ముఖ్యమగు ప్రాణాధారమైయుండెను. అట్టిదానిని స్థిరమగు పునాదులపై నెలకొల్పవలయునని కారన్‌వాలీస్ తలచెను. (2) అదిగాక భూమిపన్నును వేలమువేసి యిజారాకిచ్చు దురభ్యాసమొకటి ఆ రోజులలో నమలులోనుండెను.

దీనివలన, భూమిని స్వీయముగ దున్నుకొను సేద్యగానికి చాల నష్టములు గలుగుచుండెను. ఇట్టి కీడులనుండి సేద్యగానిని తప్పించుదమను ప్రశంసనీయమగు నభిలాషకూడ కారన్‌వాలీసు కుండెను. ఈ రెండుతలంపులే ముఖ్యముగ కారన్‌వాలీసు నిట్టిపనికి పురికొల్పెను. ఏటేటను, లేక కొన్నినియమిత సంవత్సరములకును యేర్పరచిన తరములు అనుకొన్నరీతిని పనిచేయ జాలకుండెను. " దమ్మిడీ యాస్థిగాని, కించిత్తు సుగుణసంపత్తిగాని లేని నిర్భాగ్యులు, తమదిపోవునను భయమెంత మాత్రము లేని ఆతతాయులు, అనేకమంది బయలుదేరి యెంత మొత్తమైనను పెట్టి జిల్లాలను జిల్లాలను యిజారాపాడుటకు యెంతమందియైనను తేరగావత్తురు. వారికేమిభయము ? దీనిని మన మిదివర కనేకపర్యాయములు అనుభవించియేయున్నాము. దీనివలన గొప్పలాభమేమో కలుగుననునది కేవలము క్షణికమగు భ్రమయేగాని వేరొండుకాదు. పైగా, యీ పద్ధతి యందలి యవినీతి, యసురత్వము, దేశమంతయు నాశనమై, తన్నాశనమును కూడదీసికొనుటకు వీలు లేనప్పుడుగాని బయట పడదు. అటు ప్రజలోకమూల యేడ్చుచు, యిటు సర్కారు ఖజానాకు సైతము సొమ్మురాక, జననష్టమై పాపమీ దౌర్భాగ్యపుదేశ మరణ్యమై పోయినప్పుడుగాని యిందలి అసురత్వము అవినీతి తేటపడదు. అప్పు డెవరెంత యేడ్చిన నేమిప్రయోజనము? భూమిశిస్తును వేలముపాడి యిజారాకిచ్చు పద్ధతి దేశమును బాగుపరచుట కెంతమాత్రము పనికిరాదని మన మిదివరకే అనుభవమువల్ల పూర్తిగ తెలిసియున్నది. భూ-

స్వాములచే పూర్తిగ చాకిరీ చేయించుకొనవలెనని మనము పెట్టుకొన్న పద్ధతికిది కేవలము వ్యతిరేకముకూడ నై యున్నది.

సేద్యగాండ్రతో గాక కేవలము జమీందారులతో మాత్రమే సెటిల్‌మెంట్లు చేసికొనవలెనని కౌన్సిలులో నెక్కువ మంది యేకీభవించినను శిస్తుమొత్తమును గూర్చియు, దానిని విధించు కాలపరిమితిని గూర్చియు కౌన్సిలులో చాల భిన్నాభిప్రాయములేర్పడెను. శాశ్వతసెటిల్‌మెంటు చేసికొనుట యెంతమాత్రము పనికిరాదని షోర్ అనుమెంబరు అభ్యంతర పెట్టెను. దానికతడు చెప్పినకారణమేమనగ :— "ఇదివరకు యే యేజిల్లాలనుండి యెంతెంత మొత్తము అసలు నిజముగ వసూలగుచున్నదో మనకు తెలియదు. అట్లు తెలిసినగాని యేజిల్లా కెంతమొత్తము న్యాయముగ విధించవలెనో మనమిప్పుడు నిర్ణయింపజాలము. లోగడ జమీందార్లు తమ తాలూకాదార్లనుండియు రైతులనుండియు యెంతెంత మొత్తములను తీసికొనుచుండెడివారో మనమెరుగము. వానికొక నియమముండినట్లును కనిపించదు. ఒకవేళ మనకీసంగతులన్నియు తెలిసినను, యింకననేక పరిస్థితులు క్లిష్టమైనవి— యీ దేశములో చాలతమాషాయైనవి—మనకు తెలియనివి— చాలగలవు. వీనినన్నిటినిబట్టి చూడగ, కేవలమొక్క భూమిపైననే సర్కారు పన్నులనన్నిటిని విధించుట చాలచెడుపద్ధతియని స్పష్టముకాగలదు" అని షోర్ అనుమెంబరు వ్రాసెను. జమీందారులయెడ ఇతనికి మంచి అభిప్రాయములేదు. "వారి లాభము వారికే తెలియదు. వారి వ్యవహారము లన్నియు చాల గందరగోళముగను అవకతవకగను చేసికొందురు. వారు

తమ శిస్తులను రైతునుండి వసూలు చేసికొనుటలో నిరంకుశ మైనట్టియు ఒక తోవ తెన్ను లేనట్టియు అసంఖ్యాకములగు నిబంధనలచే వసూలు చేసికొనుచుండిరి" అని జమీందారుల నాతడు నిరసించెను. కాబట్టి ప్రతి జమీందారువిషయములోను న్యాయముగను, సక్రమపద్ధతిని శెటిల్ మెంటు చేసికొనుటకు మనకు తగినంత ఆధారము లేదు. నిజ పరిస్థితులను పూర్తిగ తెలిసికొనకుండ మనము తప్పటడుగువేసిన యెడల మనకు రివెన్యూ తగ్గిపోవుటయో లేక ఇదివరకు జరుగుచున్న ప్రజాపీడాకరములగు పద్ధతులు ఖాయపడుటయో సంభవించును. ఈ కారణములచేతను ఇంకను ఆతడు వ్రాసియుంచిన అనేక కారణములచేతను శాశ్వతపు సెటిల్మెంటు ఎంతమాత్రము పనికిరాదని యాతడు ఖచితముగ చెప్పెను. పదేండ్ల కొకసారి సెటిల్మెంటు చేసికొనవలెననియు ఈ పదేండ్ల అనుభవములో గనుపించిన లోపములను గమనించి వానిని దిద్దుకొని క్రొత్త అభివృద్ధి మార్గములను తదుపరి పది సంవత్సరములలో నెలకొల్పుకొనవచ్చుననియు ఆతడు సిఫార్సు చేసెను. కాని, వైస్రాయియగు కారన్ వాలీసు వేరువిధముగ తలంచెను. "ఈ సంజాయిషీని పోగుచేయుటలో ఇదివరకే పెక్కు సంవత్సరములు గడచెను. ఇంతకాలమునుండియు మనము చేసిన తాత్కాలికపు ఏర్పాటులన్నియు విఫలమయ్యెను. వానివలన ఇంతకాలమునుండియు ప్రజలకుగాని ప్రభుత్వమునకుగాని లాభమేమియు గలుగలేదు. ఇక ఇంతకంటె మనము ఎక్కువ న్యాయముగ భూమి శిస్తుల నెన్నడును నిర్ణయించలేమనుమాట నాకు నిశ్చయముగ తోచుచున్నది.

ఇక ఎంత ఆలస్యముచేసిన అంత ప్రజలకును దేశమునకును నష్టము"— అని ఆత డభిప్రాయ పడెను. శాశ్వతపు హక్కులతో నొప్పుచున్న బలిష్టులగు భూస్వాముల తరగతి నొకదానిని నిర్మించుటయే కారన్‌వాలీసుయొక్క ప్రధానోద్దేశ్య ముగ నుండెను. ఇట్టి తరగతి నొకదానిని తిరిగి స్థాపించిన యెడల వారు తమపై సర్కారువారు ఇష్టమువచ్చినట్లు ఎప్పుడు పట్టిన అప్పుడు పన్నులను వృద్ధిచేయరనియు, పన్నులను ఒక సారియే శాశ్వతముగ నిర్ణయించివేయుటవల్ల తమకు మంచి లాభమును స్థిరత్వమును గలుగునను ధైర్యముతో వారు సర్కారుకు మంచి యండగనుందురనియు, తద్వారా తమ బ్రిటిషు ప్రభుత్వమునకు గట్టి పునాదియు స్థిరత్వమును ఏర్పడ గలదనియు తలచి కారన్‌వాలీసు ఈ పని చేసెను. పరదేశ స్థులు యీదేశముపై దండెత్తివచ్చినప్పుడు మనము ఈ దేశప్రజలనే నమ్ముకొనవలసి యున్నది. కాబట్టి జమీందారులకీ స్వలాభమును చూపెట్టినయెడల మనలనే అంటి యుందురు. తనకు లాభకరమగు ఆస్తిని ఎట్టి భయములేక భద్రముగ హాయిగ ననుభవించుచుండు భూస్వామి తన్నచటనుండి పెకలించు ఎట్టిమార్పును కోరడు. కోరుటకు బుద్ధిపుట్టదు. అట్లుగాక పంట వృద్ధియైనకొలది సర్కారు శిస్తునుగూడ హెచ్చించిన గాని, లేక అతనిని భూమినుండి తొలగించుటకు అవకాశము గల్పించినగాని, సర్కారుశిస్తు బకాయికింద భూమి లాగు కొనెదమనిగాని, లేక అతనిని ఖైదులో నుంచెదమని బెద రించినగాని, ఆతడు పరులమాటలనువిని మననుండి చీలిపోవు

టకు అవకాశ మేర్పడును. ఆ పరులమాటవల్ల తనకింత కంటె నష్టము గలుగదుగదా యని ఆతనికి తోచగలదు. కాని ఏమైన అవకాశమున్న యెడల మంచి కలుగవచ్చునేమో యను ఆశకూడ నుండవచ్చును. అందుచే యాతడు పరుల మాటలను బహు సుళువుగా వినును.

ఈ యభిప్రాయములతో సీమ మంత్రివర్గమువారును బోర్డువారును పూర్తిగా నేకీభవించిరి. 1793 సంవత్సరము మార్చినెలలో యీశాశ్వత సెటిల్మెంటును ఆమోదించుచు ఇండియాకు ఫైసలా ఉత్తరవులపంపిరి. జమీందారుల యొక్కయు, స్వతంత్రులగు తాలూకాదార్లు మున్నగువారి యొక్కయు స్వాధీనములోనున్న భూములన్నియు యికనుండి వారికి, వారి వారసులకు పారంపర్యముగ, శాశ్వతముగ యెన్నడు మార్పుజెందని స్థిరమగు శిస్తు రేట్లతో హక్కు గలిగి యుందురని ప్రకటింపబడెను. అప్పటికి సాగుక్రిందలేని భూమికి శిస్తుకట్టుటకు వీలులేక పోయినందున ఉత్తరోత్రిదానిని సాగుక్రిందికి తీసికొని వచ్చేయెడల అప్పటప్పటి పరిస్థితుల ననుసరించి దానికి ప్రత్యేకముగ శిస్తు విధింపబడునని తెలిపిరి. వారసులు గతించుటచే బేవారసయిపోయిన భూములు కట్ట కడపటి వాని కేహక్కు బాధ్యతలైతే గలవో ఆహక్కు బాధ్యతలతోడనే గవర్నమెంటులో కలసిపోవుననియు విధించిరి. భూమియొక్క విలువలో చాల తక్కువవంతు— చాల మితముగ— శిస్తువిధించవలసి యుండెను. కాని, భూమియొక్క విలువ గట్టుటలో మాత్రము చాల భిన్నాభిప్రాయము లేర్పడెను. కుంఫిణీవారి ఖజానాకు అధికారిగనున్న జేమ్సుగ్రాంటు

అనునాతడిట్లుచెప్పెను. ఈతనికి రెవిన్యూ డిపార్టుమెంటు లో చాల అనుభవము గలదట. "లోగడ నేర్పరచిన తాత్కాలికపు తరములవలన సర్కారుకు బోలెడు డబ్బు నష్టమైపోయినది. ఈ భూములింక చాల యెక్కువ శిస్తులను భరించగల సామర్థ్యముగలవై యున్నవి " అని యాతడనెను. ఈ యభిప్రాయమును షోర్ అను మరియొక మెంబరు ఖండించివేసెను. ఆఖరుకు వారు చేసినపని యేమనగ:— గత సంవత్సరములలో యే భూమిపై యెంతెంత శిస్తు వసూలైనది చూచి, దాని దామాషాను శాశ్వత తరము నేర్పరచిరి. ఈ లెక్కప్రకారము బంగాళా బీహారు ఒరిస్సారాష్ట్రములలో 1790-91 సం॥లో 3 కోట్ల 10 లక్షల 90 వేల రూపాయలశిస్తు వచ్చెను; కాశీజిల్లాలో 40 లక్షల రూపాయలువచ్చెను. ఇది భూమియొక్క పంటవిలువలో పదింట తొమ్మిదవ (9/10) వంతు అని లెక్క తేలినది. శిస్తును హెచ్చుగ విధించవలయునని వాదించిన వారి వాదన కొంతవరకీ విధముగ సమాధానపరుపబడెను— ఎట్లనగ:- భూమియొక్కవిలువలో పదునొకంట పదియవవంతు (10/11) శాశ్వతపు రేటుగ విధించిరి! అప్పటిచిక్కు పరిస్థితులనుబట్టి భూమియొక్క విలువయింతని ఖచ్చితముగ నిర్ణయించుటకు సాధ్యము కాకపోయెను.— అయినను, అన్నియు కలిసివచ్చునట్లుగ 10/11 వంతు రేటును విధించిరి !

కాని, శాశ్వతతరమువలన బంగాళాదేశములో గలిగిన దుష్ఫలితములను బట్టి చూడగా షోర్ అను మెంబరు ఆనాడు చెప్పిన ఆక్షేపణలు సరియైనవేయని ఋజువగుచున్నవి. ఆయన

చెప్పినట్లుగ యిందులో గొప్పలోప మెక్కడనున్నదనగ:- వెనుకముందు లాలోచించకుండ యీపద్ధతిని బహు ఆత్రముగ నెలకొల్పిరి. అందుచే, సన్నకారు జనమునకు చాల హాని కలిగెను. వీరియొక్క కష్టసుఖములు నెవరును ఆలోచించ లేదు. కేవలము హానిజరిగిన పిమ్మటగాని, కష్టపరంపరలు వారిని తీవ్రముగ నలుముకొన్నపిమ్మట గాని, వారిగతి నెవ రును చూచుటకు వీలులేని పరిస్థితులేర్పడెను.

ఈ సెటిల్మెంటు షరతులు చాల లోపభూయిష్ట మైనవి. వాని నమలుజరుపుటలో కూడ చాల లోపములుం డెను. దీనిస్వభావమును, దీనివలన గలిగిన ఫలితములను గూర్చి సంపూర్ణానుభవము గలిగిన ఒకానొక పెద్దమనుష్యుని మాటలనుబట్టి చూడగ మనకు తేలు సారాంశమేమనగ:- 1789 సంIIలో గావింపబడిన భూమిశిస్తు నిర్ణయము చాల అజాగ్రత్తగను, బేజబాబుదారీగను, కొన్నిచోట్ల మిక్కిలి దుర్వృత్తితోడను గావింపబడెనని స్పష్టమగుచున్నది. కొన్ని చోట్ల భూమికి యెంతమాత్రము పేరునకైనా హక్కులేని వారిని, కేవలము యిజారాదార్లనో, లేక దేశీయప్రభుత్వముల క్రింద పన్నువసూలుదార్లగనో నున్నవారిని సదరుభూముల యందు శాశ్వతముగ ఖాయపరచిరి. ఏభూమితాలూకుశిస్తు యెవడు సరాసరి కుంపిణీఖజానాకు తీసికొనివచ్చి కట్టునో, వాడే ఆభూమికి శాశ్వతహక్కుదారుడని కుంపిణీవారు నిర్ణయించిరి! (ఎంతఘోరము!) పెద్ద ప్రొప్రయిటర్లతో గావించుకొన్న యేర్పాటులో గ్రామముల నిర్వచ నమే మరచిపోయిరి. వీరి యెస్టేటులు చాల దూరదూ

ముగ నున్న జిల్లాలుగకూడ నుండినట్లు తదుపరి తెలియ వచ్చెను. బంగాళాదేశమందప్పు డనేక రకములగు నుప తరము లుండెను:— (అనగ, కౌలుదార్ల క్రింద కౌలుదార్లు అనేక ఉపశాఖలుగ నుండిరి.) కాని, గవర్నమెంటు వారీ సంగతిని అసలే చూడలేదు. దీని నెంతమాత్రము జమ లోనికి తీసికొననే లేదు. జమీందార్లు తమ కుంపిణీ కివ్వవల సిన డబ్బు దస్కములను గూర్చి యెక్కడాలేని షరతులను తీసికొనివచ్చి పెట్టి భద్రముగ బిగించుకొనిరేగాని, వారిక్రింద నున్న చిల్లర కౌలుదార్ల గతినిగాని, చిల్లర రైతుల గతినిగాని చూచిన పాపమున పోరైరి. వారి హక్కుల కాపాడుట కొక్క మాటయైనను వ్రాసిన పాపమున పోరైరి. "రైతుకు జమీందారుకు యేదైనా తగాదావస్తే, ఆవసరమైతే, అప్పుడు చూస్తాములే; అప్పుడే జోక్యము గలిగించుకుంటాములే" అని చెప్పిరి! దేశములో ఆయా ప్రాంతములగల పూర్వా చారములకును, హక్కులకును అనుగుణముగ యీ క్రొత్త పద్ధతి నమలుజరుపుటకుగాను కొన్ని ఉపనిబంధనలు అవసరము గావచ్చుననియు, కాలానుసారముగ అవసరమునుబట్టి సర్కారు వారు వానిని నిర్మించవలసియుండుననియు కారన్‌వాలీస్ అభిప్రాయపడెను. "బంగాళాదేశములో యీ పర్మినెంటు సెటిల్‌మెంటును యెంత అజాగ్రత్తగ, యెంత నిర్లక్ష్యముగ చేసి నారో— యింతింతని చెప్పటకు తరముగాదు. ఎంత బేజబా బుదారీగ చేసినారని చెప్పినను అతిశయోక్తి కాజాలదు" అని మాంగల్సు అనునాతడు పార్లమెంటు కమిటీముందర చెప్పెను. ఈ విషయమై యీ దిగువరీతిగ "మెకంజీ" అను

నాతడు చెప్పిన మాటలనుకూడ ఆతడు ధృవపరచెను. మెకంజీ యేమని చెప్పినాడనగా:— "మన మీ సెటిల్‌మెంటును చాల తొందరపడి చేసినాము. సంగతి సందర్భములను పూర్తిగ తెలిసికొనకుండ, పైపై మాటలనే నమ్మి మన మీ పనికిదిగితిమి. ఎవరుకూడ సరియైనవని నమ్మని లెక్కలను బట్టియు, సరియైన వగునా కాదాయని యెన్నడు విచారించకను, మనమీ పనిచేసితిమి. షోటీదార్ల చేతను జూదరి వ్యాపారగాండ్లచేతను భూమిశిస్తును వేలముపాడించి యెవడెక్కువశిస్తు యిస్తానంటే వాడికి యిచ్చివేసితిమి. దేశమునకు శత్రువులైన వారి సలహాలను, ఉద్యోగాలకొరకు మనల నాశ్రయించుకొన్న నీచుల మాటలను, ప్రజలపై కొండెముల జెప్పి మన యిచ్చకమును సంపాదించుకొందమని చూచు నిర్భాగ్యుల కొండెపుమాటలను నమ్మి మనమీపని చేసితిమి. అనేకమగు పనికిమాలిన చెప్పుడు మాటలను పట్టుకొని, సరియగు నొక త్రోవ తెన్ను గానక, మనమీపనికి దిగితిమి. ఈ వ్యవహారమంతయు ప్రజలు ప్రభువులు ఆడు దాగుడు మూతలాట లాగున్నది. ఒకరిసంగతి ఒకరికి తెలియదు. ప్రజల నిజపరిస్థితులు క్రొత్తగవచ్చినప్రభువులకు తెలియక పైకిమాత్రము సర్వము తెలిసినట్లు డాబుచేయుచున్నారు. అట్లే ప్రజలును ప్రభువులు తమపై యెట్టి యధికారముల చలాయించ బోవుచున్నారో తెలియక లోలోన తహతహ లాడుచు పైకి మాత్రము వారిని టోపీవెయ్యవలెనని డాబు చేయుచున్నారు.

"కుంపిణీవారియొక్క నిజమైన స్వలాభమును పెంపొందించుట కెంతో ప్రధానమైన యీ క్రొత్త రెవిన్యూ పద్ధతిని

మిరాశీ దేశమందు ప్రవేశ పెట్టించినందుకుగాను, నేను మిమ్ముల నెంతయు నభినందించుచున్నాను" అని కారన్‌వాలీసు సీమ లోని కుంపిణీ డైరెక్టర్లకు వ్రాసెను. ఒకమూల యిట్లు వ్రాయుచు, "బ్రిటిష్ పరిపాలనలో దేశములోని వాణిజ్య వ్యవసాయాది వృత్తులు క్షీణించిపోయినవని" కూడ ఆతడు —ఆతని పుణ్యమాయని—ఒప్పుకొనెను. "సాధారణముగ పెద్దపెద్ద పట్టణములలోనుండు షరాబులు, షాహుకార్లు తప్ప తదితర జనులెల్లరు నానాటికి త్వరితగతిని కటికపేదరికము లోనికి,— దౌర్భాగ్యస్థితిలోనికి— దిగజారిపోవుచున్నారు. కుంపిణీవారి రాష్ట్రములోనున్న జమీందారులుకూడ యీ దౌర్భాగ్యపు గతిలోనే చేరుచున్నారని నేను చెప్పవలసి యున్నది. ఈ జమీందారు లిట్లు పాడగుటకు వారి సోమరి తనము, అమితవ్యయము మున్నగునవి కొంతవరకు కారణ మనుమాట నిజమేయైనను, ముఖ్యముగ చాలభాగము లోగడ మన కుంపిణీవారు చేసిన దుష్పరిపాలనవలననే వారీ నిర్భా గ్యపుస్థితికి వచ్చిరని నిర్మొగమాటముగ చెప్పవలసియున్నది." నిన్నగాక మొన్ననే కటిక కాటకముచే బాధపడి జనశూన్యమై పోయిన దేశములో— ప్రజలను పీల్చి పిప్పిచేయు స్వల్ప వాయిదా కౌల్లచే బీడువారిన దేశములో— ఒక పక్షము వారికే లాభకారిగనుండు యీ దిక్కుమాలిన పర్మనెంటుసెటి ల్‌మెంటును అప్పుడే— 1789 సం॥ లో— ప్రవేశపెట్టుట వలన ప్రజల కెంతకష్టము గలిగినది? ఈ పద్ధతిని పాపము కారన్‌వాలీస్ సదుద్దేశముతోడనే పెట్టెను; కాని ఉద్దేశము మం చిదేయైనను, ఆతడు పొరపడెననిమాత్రము చెప్పక తప్పదు.

తాను ప్రవేశపెట్టుచున్న యీ పద్ధతివలన ప్రజలకు కొన్ని కష్టములు గలుగవచ్చునని ఆతని మనస్సునకే తోచెను. కాని, అట్టికష్టములు గలిగినప్పుడు, అనుభవముమీాద వానికి నివారణోపాయముగ మరికొన్ని ఉపనిబంధనల నేర్పాటుచేయవచ్చునని ఆతడు తలచెను. ఆతడు పారజూచిన అవసరము అచిరకాలములోనే గలిగెను. భూములనుండి రాదగునని ఊహింపబడిన ఆదాయమునందు పదునొకంట పదవవంతు (10/11) బంగాళముయొక్క శాశ్వతపు భూమిపన్నుగ నిర్ణయింపబడెను. ఈలెక్క తొందరగను, కేవలము ఉజ్జాయింపుగను వేయబడినది. నిజముగ భూమిపైవచ్చు ఆదాయముకంటెను, భూమియొక్క విలువకంటెనుకూడ యీరేటు చాల తక్కువగ విధించితిమని కుంపిణీవారానాడనుకొనిరి. కాని, యీ తక్కువ యనునది యెంతవరకో నిర్ణయించుటకెవరును ఆనాడు శ్రద్ధతీసికొనలేదు. భూమియొక్క నిజమగు విలువపైననేగనుక కుంపిణీవారీ భారపురేటును విధించి యుండినయెడల, అంతకంటె వినాశనకరమగు, అంతకంటె విపరీతమగు- అన్యాయమింకొకటి యుండెడిది గాదు. కాని, దైవవశాత్తు, పన్నులవిధించు పనికై వారు నామకః నిర్ణయించిన ఖరీదుకంటె భూమియొక్క నిజమగు ఖరీదు రెండుమూాడు రెట్లు యెక్కువగ నుండెను. (అందుచే కొంత మేలయ్యెను.) భూస్వామి మైనరుగనున్న కాలమందు కౌలుదారుడు పన్ను విలువకు 33 రెట్లభాగము సదరు భూమిస్వామికిచ్చుచు, యింకను వేరుగ లాభముకూడ తీసెడివాడని చెప్పుటకు తగినంత సాక్ష్యమున్నది. కాని, యెప్పుడైతే యీ పర్మినెంటు

శెటిల్‌మెంటు పద్ధతివల్ల రైతులు జమీందారులకిచ్చుకొన వలసిన శిస్తులకొక నియమ మేర్పరుపక జమీందారుల యిష్టమునకే వదలివేసిరో, అప్పుడీ జమీందారులు నిరాటంకముగ రైతులను పీడించుట కవకాశ మేర్పడెను. అందుచే, యీ కీడును తొలగించి, రైతులకును చిల్లర కౌలుదారులకును తగు రక్షణ నొసంగుటకుగాను క్రొత్త నిబంధనల నేర్పరుప వలసివచ్చెను. ఈ రీతిగ బర్ద్వాన్ మహారాజా క్రిందనున్న పట్టాదార్లను రక్షించుటకుగానొక ప్రత్యేకపు శాసన మేర్పరచిరి. తరువాత, సకాలమునకు సరిగ శిస్తు చెల్లించుచు, పన్నెండు సంవత్సరము లెడతెగకుండ సేద్యము చేయుచున్న రైతుకు ఆ భూమియందు శాశ్వతపు జిరాయితీ హక్కు గలదని మరియొక శాసన మేర్పరచిరి. ఆతడు సరిగ శిస్తు చెల్లించుచున్నంతవరకీ శాశ్వతపుహక్కు అతనికుండుననిరి. 1793 సం॥ లో తొందరపడి చేసిన యీ పర్మినెంటు శెటిల్‌మెంటు ఫలితముగ అప్పుడప్పుడట్టి నివారణోపాయములగు క్రొత్త నిబంధనల నేర్పరుచుచు రావలసివచ్చెను. అప్పుడప్పుడు చేయుచువచ్చిన యీ నిబంధనలు ఒక్కొక్కప్పుడు రైతుకు అనుకూలముగను మరియొకప్పుడు జమీందారుకు అనుకూలముగను చేయుచుండిరి. కుంపిణీ వారు క్రొత్తగ జమీందారులతో నేర్పరుచుకొన్న యీ పర్మనెంటు సెటిల్‌మెంటులోనుండు సుగుణములో ప్రధానమైనదేమనగా:— రాబట్టుకొన నిర్ణయించుకొన్న మొత్తము సరిగ వారికి సకాలమునకు జమీందారులవల్ల వచ్చుటయే. ఇదే వారు ముఖ్యముగ జూచుకొన్న మెరుగు. ఈ షరతును

కుంపిణీవారు మిక్కిలి నిష్కర్షగ నొక్కి చేయించుకొన నారంభించిరి. కాని, యిట్టి నిష్కర్షయగు కఠిన పద్ధతికి జమీందారు లిదివరకెన్నడును అలవాటుపడి యుండలేదు. పూర్వము వారు నవాబుల కివ్వవలసిన పేష్కస్‌ను యెప్పుడో తమ యిష్టమువచ్చినప్పుడు యిచ్చిన యిచ్చెడివారు; లేకున్న నిర్లక్ష్యముగ ఊరుకుండెడివారు. కాని, ఆ పప్పులిక్కడ, కుంపిణీవారిముందర ఉడకలేదు. అనుకున్న రోజుకు సరిగ యివ్వకపోయినందున కొందరి జమీలు నిర్మొగమోటముగ వేలమువేసిరి. ఈ రీతిగ యీ పద్ధతి వచ్చిన మొదటిరోజులలో కొన్ని జమీలు చేతులు మారినవి. వేలములో ఎవడు కొంటే వాడిదే జమీ. వెనుకటి వాని హక్కులన్నియును సర్కారుకు కట్టవలసిన పేష్కస్‌లో హెచ్చుతగ్గు లేమియు లేకుండ యీ కొత్తవానికి వచ్చుచుండెను. దీనివలన వచ్చిన గొప్ప చిక్కేమనగ:- పాత జమీందారు తన రైతుల కిచ్చిన కౌళ్ళన్నియు రద్దగుచుండెను. కొత్తవాడు తిరిగి తన యిష్టము వచ్చినవాండ్లకు, తన యిష్టమువచ్చిన రేటుతో, కౌళ్ళ నిచ్చు చుండెను. ఇందువలన రైతులకు, కౌలుదార్లకు బహు యిబ్బంది కలుగుచుండెను. ఈ యిబ్బందిని తొలగించుటకు గాను తదుపరి కొత్త నిబంధనల నేర్పరచిరి. జమీ సర్కారు పేష్కస్ క్రింద వేలము పడిపోయినను, వెనుకటి జమీందారిచ్చిన కౌళ్ళన్నియు రద్దుకాకుండ అమలులో నుండునట్లే యేర్పాటు చేయబడెను. ఇది యిట్లుండగ యింకొక చిక్కు తటస్థించెను. ఏమనగ, కుంపిణీవారు జమీందారులను బహు కఠినముగ నిర్బంధించి తమ పేష్కస్‌ను వసూలుచేసికొనుట కధికారము గలిగి

యుండగ, యిటు జమీందారులుమాత్రము తమరైతులనుండి నిక్కచ్చిగ సొమ్ము వసూలు చేసికొనుట కధికారములేనివారై యుండిరి. ఈ చిక్కును తీర్చుటకుకూడ తదుపరియొక శాసనమును నిర్మించిరి. కాని, యీ శాసనమువల్ల జమీందారుల కిచ్చిన యధికారమును వారు దుర్వినియోగపరచుటచే దానికి తగిన నివారణోపాయముల బన్నుటకు తిరిగి రైతులకు క్రొత్త హక్కులొసంగబడెను. ఈ హక్కులను పూర్తిగ వినియోగపరుచుకొనుటలో రైతులెంతమాత్రము వెనుకబడువారుకారుగద. ఈ హక్కుల ననుసరించి కొందరు రైతులొక జమీందారుపై మూడువేలదావాలు వేసినట్లు స్పష్టమగు రికార్డు కలదు.

ఇంగ్లీషువారికి యిండియాకుమధ్య జరిగిన చరిత్రలో ప్రధానమగు ఘట్టముగ పరిగణింపబడిన యీ పర్మనెంటు సెటిల్మెంటు యొక్క ప్రధాన లక్షణము లిట్టివి! ఇటు సర్కారుకు రివిన్యూ తెచ్చుటలోగాని, అటు ప్రజలకు మేలొనగూర్చుటలోగాని, యీ పద్ధతివల్ల అంత ప్రయోజన ముండదని దూరదృష్టిగల పెద్దలు కొందరు ఆనాడే చెప్పియుండిరి. అసలు ప్రయోజనమనునదే కించిత్తయిన నుండదని మరికొందరు నాటి నుండి నేటివరకు నెత్తిన నోరుపెట్టుకొని ఘంటాపథముగ వాదించుచునే యున్నారు. కారన్‌వాలీస్ చేసిన బంగాళా పర్మనెంటు సెటిల్‌మెంటును, దాని నమోనా ననుసరించి గావింపబడిన యితర భూసంబంధమైన చట్టములును కేవలము అవకతవక అధ్వాన్న పరిపాలనకు నిదర్శనముగ లోకములో పేరుపడెను. భూమియంతయూ రాజుదే యనియు, వారసులు

నశించినగాని, లేక శిస్తు బకాయపడినగాని, అది తిరిగి రాజుకే చెందిపోవునని యు సీమదేశములో నొక సిద్ధాంతము కలదు. ఇట్టి సిద్ధాంతము మన భారతదేశములో లేదు. కాని, మనకు కేవలము విదేశీయమైన యీ దిక్కుమాలిన సిద్ధాంతము నిక్కడికి సీమనుండి దిగుమతిచేసి మననెత్తిమీద పెట్టిరి. ఈ విదేశీ సిద్ధాంతము నాధారము చేసికొనియే యీ చట్టముల నన్నిటిని గావించిరి. ఈ సిద్ధాంతము నైతికముగను సాంఘిక ముగను, రాచకీయముగను— యెటుచూచినను — అతిప్రాచీనమును, అతిపటిష్టమును, ఉత్తమోత్తమమునునగు భారత సభ్యతాభావముల కీసిద్ధాంతము కేవలము విరుద్ధము. ఈ సిద్ధాంతము కేవలము విదేశీయమగుటచే నది ప్రజల మన స్సుల కెంతమాత్రము నచ్చలేదు. అది ప్రజల యంతరాత్మ లందు నాటుకొననేలేదు. ఈ మొక్కను బలాత్కారముగ నాట చూచినచోట, అది యెంత మాత్రము ఫలింపలేదు సరిగదా, త్వరలో యెండిపోడపోయెను. భూమిశిస్తును వేలముపాడి, యెవరెక్కువ శిస్తు యిస్తామంటే వారికి భూముల నిచ్చివేయు యీ పద్ధతి ప్రజల మేలుకొఱకే చేసినది కాదను మాట, యీ యధ్యాయారంభమందు ఉదహరించిన కారన్ వాలీస్ వాక్యములను బట్టియే స్పష్టముగాగలదు. దానికి వేరుగ ఋజువు అవసరములేదు. మొట్టమొదటగ కుంపిణీవారి పాలబడిన బెంగాల్, బీహారు, ఒరిస్సా రాష్ట్ర ములనబడు యీ మూడింటిలో మొదటిది యగు బంగాళాదేశము దేశీయరాజుల పరిపాలనక్రింద నున్నప్పుడు "భూలోక స్వర్గ" మను పేరుప్రఖ్యాతుల గాంచెను. ఇది

యిప్పుడు కుంపిణీవారి పరిపాలనక్రిందికి వచ్చినతరువాత, వారు కూడ వీనిని తమకు చాల విలువైన దేశములుగనే యెంచుకొనుచుండిరి. ఎందుచేత ? ఎందుకనగ:— తమ కుంపిణీ భాగస్వాముల కివి కావలసినంత లాభములను తేరగ పంచి పెట్టుచున్నవి. దేశమునంతను పెద్ద సేనలతో ఆక్రమించుకొని స్థాపించుకొన్న విపరీత వ్యయభారయుక్తమగు తమ రాజ్యాంగమునకగు ఖర్చునంతను యీ దేశములే భరించుచున్నవి. ప్రపంచములో తామెక్కడ యేయుద్ధములు చేసి ఎంత ద్రవ్యమును దుబారాఖర్చు చేసినను ఆ ఖర్చునంతను తీసుకొని వచ్చి యీ మూడు రాజ్యముల నెత్తిమీదను పడవేయుటకు తమకు బహు వాటముగ నున్నది. కాబట్టి, యిక వారికీ దేశములు విలువగలవి గాకుండ యెట్లుండగలవు? తమ కీపైన పేర్కొన్న మూడు లాభములు వాటముగ గలుగుచున్నంత వరకు వారికివి మంచి విలువైన దేశములే. కాని, సర్వము దిగమ్రింగుదమను దుర్బుద్ధితో కూడుకొనియున్న పర ప్రభుత్వములయొక్క దుష్పరిపాలనవలన దేశముయొక్క ధన ధాన్యాది సమస్త సంపదలు అచిరకాలములో వట్టిపోయెను; తద్వారా తత్ప్రభుత్వమునకువచ్చు రెవిన్యూకూడపాడైపోయెను. తమకు లాభములు తగ్గిపోవుచున్నవని సీమనుండి కుంపిణీ డైరెక్టర్లు నిత్యము గగ్గోలుపెట్టుచుండిరి. యిక యిండియా యందన్ననో ప్రజలు బహు అయిష్టముతో లోంగియు లోంగ నట్లుండిరి. ఇట్టి పరిస్థితులలో నేదోయొక దిట్టమగు రాజ్య తంత్రపుటెత్తువేసి కుంపిణీయొక్క రెవిన్యూను సక్రమ మార్గములో పెట్టితిమని పైకి చూపించినగాని తమ మాట దక్కదని

యిండియాలోని కుంపిణీ యధికారులు తలంచిరి. ఇందుకొరకై కుంపిణీవారొకతరగతి ప్రజలను (జమీందారులను) తమ చేతిలో చిక్కించుకొని, వారివల్ల క్రమము తప్పకుండ సొమ్ము వసూలుపరచుచు, కుంపిణీ యార్థికస్థితిని చక్కపరచితి మని పైకి మెట్లో మసిపూసి నేరేడుకాయచేసి తమ యజ మానులగు సీమ డైరెక్టర్ల చేతిలో పెట్టిరి. కాని, యీ నటన— యీ పై మెరుగు— యెన్నికోట్లమంది బీద ప్రజల నేడ్పించుటవల్ల గలిగినదో యెవరు విచారింతురు? కుంపిణీ వారు ప్రవేశపెట్టిన యీ నూతన పద్ధతిలోకూడ దేశీయుల పూర్వాచారములను కొంతవరకు నిలుపుటకు కొంత ప్రయ త్నము జరిగినదనుమాటనుకూడ మనము మరువరాదు. ఈ మాత్రము ప్రయత్నమైనను జరుగుటకు ప్రధానకారణము బహుశః షోర్ అను మెంబరుయొక్క గొప్ప యుదార బుద్ధియేయని చెప్పవలసియున్నది. ఆతడీ విషయమై తన యభిప్రాయము నిట్లు వ్రాసియుంచెను. “మనబోటి విదేశప్రభుత్వము విధించుపన్నులు దేశీయప్రభువులు విధించు పన్నులకంటె చాల మితముగనుండవలెను. మన రాజ్యము స్థిరముగ శాశ్వతముగ నుండవలయునన్న మనము విధించు పన్నులువగైరాలు— యెవరిష్టమువచ్చినట్లు వారు మార్చు టకు వీలులేకుండ— నిర్ణీతముగ నుండవలెను. మనల నిక్కడ అదుపుఆజ్ఞలలోనుంచు పెద్దవారెవరు దగ్గరలేరు. మన పై యధికారులగు సీమప్రభుత్వమువారెక్కడనో భూగోళ మున కావలిప్రక్క ఆరువేలమైళ్ల దూరములో నున్నారు. కాబట్టి, యిక్కడ, నొకప్రక్క మనపరిపాలన కత్యంతావశ్య

కములగు నధికారములకు అనవసరముగ దిగ్బంధన లేర్పరుచు కొనకుండ జూచుకొనుచు, యింకొకపక్క కుంపిణీ యుద్యోగస్తులు చెలరేగి ప్రజల ధనమానప్రాణాదుల భంగపరుప కుండ వారిపై తగుకట్టుదిట్టముల నేర్పరచి మనపరిపాలన యందు సాధ్యమగు ప్రతినియమమును పెట్టుకొనవలసి యున్నది. ”



# భరతఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన

## 16 వ అధ్యాయము.

### వెల్లస్లీ ప్రభువు 1797—1801



ఇటీవల మనక్రిందికి వచ్చిన దేశముల సంఖ్య యెక్కువైనకొలది మన శత్రువుల సంఖ్యకూడ యెక్కువైనది. ఈ శత్రుత్వములో అనేక రకములు కూడ హెచ్చైనవి. మనమెక్కడికి పోయిన అక్కడే— ముఖ్యముగ మహారాష్ట్రులను వెడలగొట్టి మనము ప్రవేశించినచోట్ల— యీ చేటు మరీ యెక్కువగుచున్నది. రెవిన్యూ యిలాకాను, సైన్యములలోను యింతవరకు పనిచేసి బ్రతుకుచున్నవారి నందరిని మనమిప్పుడు నిరుద్యోగులనుజేసి—నోటి కడ కూటిని పడగొట్టి— వెడలగొట్టినాము. కాబట్టి, మనమింక క్రొత్త దేశముల నాక్రమించుకొను విషయములో నేనీసంగతులనే ప్రధానముగ ఆలోచించుచున్నాను. నాబుద్ధికిచూడగ, “మనకింకచాలును; యింక క్రొత్త రాజ్యములక్కరలేదు” అని అనిపించుచున్నది—

—వెల్లింగ్టన్

ఫ్రెంచి విప్లవపోరాటములచే యూరపు ఖండమంతయు నైదారేండ్లు సంక్షోభించిపోయెను. మొట్టమొదట ధర్మ

సంస్థాపనకై ప్రారంభమైన యుద్ధము అప్పుడే మహాసామ్రాజ్య సంస్థాపనకై ప్రాకులాడ నారంభించెను. అప్పుడప్పుడే ఫ్రాన్సు దేశము సంపాదించుకొనుచుండిన స్వాతంత్ర్య ధర్మముల కూల ద్రోయవలయునని యూరపుఖండములోని నిరంకుశ రాజు లందరొక మూకగచేరి గుడగుడాలోచన చేయ సాగించిరి. కాని, బోనపార్టి మున్నగు పరాసు స్వాతంత్ర్య సంరంభ నేతలు యీ మూకకు తగురీతిగ బుద్ధిచెప్పిరి. ఈ యుద్ధము లలో తమకు "పోయినదేమోపోయినదిలే" యని వీరం దరు అంతటితో ఊరకుండియున్న యెడల అంతయు తీరిపోయె డిదే. కాని, ఫ్రాన్సుకు విజయోన్మాద మెక్కెను. "యూరపు ఖండములోని రాజులందరు కలిసి యేకమై వచ్చి నను, నే నొక్కడనే వీరి నందరిని అవలీలగ జయించ గలిగి తినిగదా; యిక నాకేమి లెక్క; యీ ప్రపంచమంతటి పైనను నా మహాసామ్రాజ్యమును స్థాపింతును గాక" అని ఫ్రాన్సు దేశము విజయోన్మత్తతచే విర్రవీగి ప్రపంచముపై విజృంభింప నారంభించెను. ఈ విజయధ్వజము మొట్టమొదట తన యవారిత శత్రుమూకల నెదుర్కొనవలసిన యావశ్యకత చేతను, తదుపరి, తన శత్రువుల నందరిని క్రిమ్మివేసి, వారిపై తన మహాసామ్రాజ్యము స్థాపింపవలయునను పేరాస చేతను నెత్తబడెను. సరాసరి సమయమునకు జాతీయ సంకల్పము కరగి పోతపోసిన మహామూర్తియో యన నొప్పు నెపోలియన్ మహావీరుడు బయలుదేరి వచ్చెను. ప్రజా సంకల్పమును ప్రజోద్రేకమును, యెట్లు సంతృప్తి పరుపవలెనో బాగుగ నెరింగినవాడగుటచే ఆత డనుక్షణములో——గారడీ

వాని చేతిలో బొమ్మవలె—దేశప్రజల కెల్లరకు పూజనీయ మగు విగ్రహముగ నేర్పడిపోయెను.

ఆ రోజు లెట్టివి? ప్రపంచమంతయు కాగిన మొసరుల వలె పొంగి పొరలబడుచుండెను. నాటివరకు ధర్మాధర్మము లుగను, సాధ్యాసాధ్యములుగను పరిగణింపబడుచున్న భావము లన్నియు ఒక్కుమ్మడి క్రిందు మీదులై వ్రేళ్లతో కూడ పెల్లగిలి తలక్రిందు గాజొచ్చెను. 1789, 1797 సం॥ ల మధ్య మహాద్భుతమును, మహా విస్తృతమును నగు సంఘటనము లనేకములు జరిగెను. వానినిబట్టి జూడగ ప్రపంచమం దేపని జరుగుటయు నసాధ్యముగ గన్పట్టలేదు. ఏ పనియు వింతగ గన్పట్టలేదు. ఆంగ్లదేశీయుల కానాడు మంచిబుద్ధులే పుట్టియుండినచో ప్రపంచములోని మానవుల యుద్రేకము చల్లారుటకును, ప్రపంచ మంతయు ధూమావృతము గాకుండుటకును అవకాశ ముండెడిదిగద. ఇటలీ దేశము తన బలమును కూడదీసికొని, పరదేశములనుండి సంపాదించుకొన్న స్వేచ్ఛను తనదిగ చేసికొనెడిదిగద. (అనగ సుఖముగ నుండెడిదిగద.) జర్మనీ దేశము తదుపరి తన దేశమందు జరిగిన 16 యేండ్ల రక్తపాతయుతకల్లో లము, నష్టము, దుఃఖము, లేకుండ హాయిగ బ్రతికెడిదిగద. యూరపుఖండపు రాజులందరేకమై పోలండుదేశమును బ్రద్దలుకొట్టి పంచుకొని, ధీరోదాత్తులును, యుత్తమయోధు లునునగు పోలండుదేశపు బిడ్డలనందరిని తమ మాతృదేశమున నిలువనీడ లేకుండ చెదరగొట్టుట జరిగియుండెడిది కాదుగద. ఇట్టిపనిని పశ్చిమయైరోపీయ జాతులెవ్వియు నిశ్చయముగ

నామోదించెడివి కావుగద. ఫ్రాన్సుదేశము ఉగ్రమగు రణోన్మాదముతో ప్రపంచముపై విజృంభించి నానాదేశముల స్వాతంత్ర్యము నణచివేయుటకు అడుగడుగునకు ప్రేరేపింపబడెడిదికాదుగద. పాపము దురదృష్టవంతమగు ఐర్లాండు దేశమును పొడిచిరేపుటయు, వారంతట తిరుగబడుటయు, యీ తిరుగుబాటు నొక నెపముగబెట్టి యింగ్లండు యీ దేశమును బలవంతముగ మ్రింగజూచుటయు, అది సరిగ అరుగకపోవుటయు, మున్నగుసంక్షోభములు లేకుండపోయెడివిగద. ఆంగ్ల దేశముసైతము తన యాంతరంగికసంస్కరణాలను చక్కగ జేసికొని, మతవిషయికమగు స్వేచ్ఛను యింతకంటె ముప్పది యేండ్లు ముందుగనే సంపాదించు కొనెడిదిగద ; తద్వారా యిప్పటి ఋణములో సగముపైచిలుకు ఋణబాధ యింగ్లాండుకు లేకుండ పోయెడిదిగద. కాని, పిట్టుమంత్రి యొక్క రాజనీతి పొరుగుగిట్టని స్వార్థపరత్వముగ నుండెను. మనకు ఉపకారము చేయుచున్నట్టియు, మనవల్ల ఉపకారము పొందదగినట్టియు ప్రతిమిత్రుడు, ప్రతి పొరుగువాడు, యేదోవిధముగ నాశనమగువరకు పిట్టుమంత్రి కదలడు. వారందరు నాశనమగువరకు ఊరకచూచుచు అటు పిమ్మట ఆత్రముతో, వెనుకముందాలోచనలేక, రొమ్ములుబాదుకొనుచు పరుగెత్తడము- యిది ఆతనిరాజనీతి. మొట్టమొదట, "ఎంతనష్టమైనాసరే, మనమెందుకు కలుగజేసికోవడము? ఏమైనాసరే, మనము శాంతంగానే వుండాలి" అని అనడము— చివరికది అంతలోనే యేమవుతుందనగా— "ఏమైనాసరే, యుద్ధముచేసి తీరాలి" అనేస్థితిలోకి వస్తుంది-

ఇది పిట్టుమంత్రి పద్ధతి. మనకంటె చిరకాలమునుండియు స్వాతంత్ర్యసౌఖ్యముల ననుభవించుచుండిన సద్రీతిరము రాష్ట్రములపై పడి నెపోలియన్ వారిని నానాబాధలు పెట్టుచుండగ, "మన కేమిలే" యన్నట్లుగ మనమూరకుంటిమి. "మన కేమిలే; యిరుగు పొరుగు వాళ్లనందరిని రక్షించాలని వున్నదాయేమి ? మన కేమిబాధ్యత ? మనను వాళ్లకు రక్షకుడుగ భగవంతుడు పెట్టినాడా యేమి ?" అను మన మామూలు నీచస్వార్థపు తలంపుల చేతను, "ఈ అడ్డమైనవాళ్లకోసము యీ యుద్ధాలలో దిగడానికి మనదగ్గిర మాత్రం డబ్బుందాయేమి ?" అను ముష్టిలెక్కలను చూచుకొనుచు కూర్చుండుట చేతను, మనము (ఆంగ్లేయులము) పాపమా చిన్నరాష్ట్రములను నెపోలియన్ బారినుండి రక్షించుటకు వెనుకాడితిమి. కాని, తుట్టతుద కది యేమైనది ? మన ప్రాణాలు చేతులో పెట్టుకొని, చస్తామా, బ్రతుకుతామా అన్నంత ఆదుర్దాతో, అధైర్యముతో, చిట్ట చివరకు యుద్ధము చేయక తప్పినదికాదు. అప్పుడు మనగతి యే స్థితికి వచ్చినది ? ప్రపంచములో నుండు దౌర్భాగ్యులగు నిరంకుశ రాజులకందరికి లంచములుపెట్టి, వారిని మనలో కలుపుకొని, వారుచేసే అపభ్రంశపు పనుల కన్నిటికి ఒప్పుకొని, యెట్లాగైనా సరే, యీ నెపోలియన్ బాధతప్పించుకొని బ్రతికి బయటపడితే చాలురా, దేవుడా !" యన్నంత ప్రాణాంతకమైన పనిజరిగినది.

1798 సం॥ లో ఫ్రెంచివిప్లవ సైనిక సమూహములు సర్వత్ర విజయభేరిని మ్రోయించుచుండెను. ఫ్రెంచి రాజగు పదునాల్గవ లూయీరాజు కోర్కెలన్నియు తలచినదానికంటె

యెక్కువగనే నెరవేరెను. బెల్జియం, శావాయి రాజ్యములు ఫ్రెంచిరాజ్యములో కలిసిపోయెను. హాలండు, యిటలీ దేశములు స్వతంత్రమును గోల్పోయి, ఫ్రెంచివారి క్రింద మనువృత్తి పుచ్చుకొనుచు బ్రతుకుచుండెను. ఆస్ట్రియా దేశము నాలుగు ఘోరయుద్ధములలో ఓడిపోయి, చాలవరకు క్షీణించిపోయెను. ప్రష్యాదేశము కాలు కదల్చుటకు జంకుచుండెను. నెపోలియన్ వీరుడు ధైర్యసాహసములు గలవాడు; నూతనమార్గముల నవలీల ద్రొక్కగలవాడు. ఈతడు ఫ్రెంచి యోధుల కెల్లరకు పూజనీయుడుగ నుండెను. కాని, తోడి పరాసు రాజనీతిజ్ఞు లందరు యితనిపేరు చెప్పిన భయపడుచుండిరి. కాని, యేదో పనిమీద యితనిని దూరదేశములకు పంపినయెడల తమకు క్షేమముగనుండునని ఫ్రెంచి రాజనీతిజ్ఞులు తలంచిరి. అందుచే, "యీజిప్టు దేశమును జయించుకొని రమ్మ" ని వారితనిని పంపిరి. అంతటితో యీతని శత్రువులకు గుండెలు దడదడ కొట్టుకొనెను; కండ్లు చిరుతలు గ్రమ్మెను; మనస్సు చిడిముడివడెను. నెపోలియన్ వీరుని ప్రాక్ప్రపంచ విజయమునకిది ప్రథమ సోపానమని ఆనాడెల్లరు అల్లడతల్లడగుడిచిరి. పరాసువారు ఆసియాఖండ మందలి రాజులతో నేవో కుట్రలు పన్నుచున్నారని 1797 సం॥ శరవృతువులో యింగ్లీషువారికి తెలియవచ్చెను. యింగ్లీషు కుంపిణీవారిని బంగాళాదేశమునుండి తరిమివేయుటకు తనకు సహాయము చేయవలసినదని టిప్పుసుల్తాన్ యింతకు పదేండ్ల క్రిందటనే పరాసువారితో బేరములాడుటకు ప్యారిస్ పట్టణమునకు రాయబారుల నంపెనట! ఇట్టి బేరములనే ఆత డనేక

పర్యాయములు పరాసువారితో చేయుచు వచ్చెను; ఆ బేరము లిప్పుడు ఫలించి యీరీతిగ పరిణమించెనని యింగ్లీషు వారు ఉలికిపడసాగిరి. ఇండియా కోస్తాలయం దింకను పరాసువారికి కొన్నికొన్ని పట్టణములు గలవు. నైజామును, మహారాష్ట్ర ప్రభువగు సింధియాయు అనేకమంది పరాసు నేతలకు జీతములిచ్చి శాశ్వతముగ తమవద్ద నుంచుకొని, వారిచేత పెద్దపెద్ద సైన్యములను తయారు చేయించు కొనుచుండిరి. దీనినంతటనుబట్టి, యి ం డి యా లో ని యింగ్లీషు రాజ్యమును కూలద్రోయుటకు మహాపాతాళ హోమము జరుగుచున్నదని సీమలోని పిట్టుమంత్రియు, ఆతని యనుచరులును గట్టిగ నమ్మిరి. ఇట్టి యుపద్రవము జరుగకుండ యీ కుట్రనంతను తక్షణమే— ముందుగనే —. విధ్వంసము చేయవలయునని వారు తలంచిరి. దానికెంతో మెళుకువ, జాగ్రత, ధైర్యము, దక్షత, సూక్ష్మదృష్టి, అభినివేశము మున్నగునవి అసాధారణ రీతిగ కావలసియున్నవని వారు యోచించిరి. ఇప్పుడు మహాసంకట సమయము వచ్చినది. ఇది మహా అసాధారణమైనదిగను, ఉపద్రవకరమైనదిగను నున్నది. ఈ మహాసంకట సమయమును దాటింపగల మహా పురుషు డెక్కడ దొరకునా యని సీమ మంత్రులు నలుముఖ ముల పారజూచిరి. కారన్‌వాలీసునే తిరిగి పంపింతమని మొదట యనుకొనిరి. ఆయనను నియమించినట్లు ప్రకటనకూడ గావింపబడెను. కాని, కొన్ని వారములైన పిమ్మట కొంత ప్రోత్సాహమువలన ఆతడీ యిండియా వైస్రాయి పదవిని వదలుకొని ఐర్లాండు వైస్రాయి పదవి నంగీకరించెను. అందు

వలన, యిండియా వై్స్రాయి పదవియొక్క భారమగు బాధ్యత వెల్లస్లీ ప్రభువుపై పడెను. ఈతడు లోగడ సీమ ప్రభుత్వము వారిచే నియమింపబడి డండాస్ యొక్క అధ్యక్షత క్రింద నున్న "బోర్డు ఆఫ్ కంట్రోలు" లో గత నాలుగేండ్లనుండి సభ్యుడుగ నుండెను. ఈతనితండ్రి సంగీత మందు మంచి సామర్థ్యము, అభిరుచిగలవాడు. పిల్లలందరు పసివాండ్రుగ నున్నప్పుడే యీతడు చనిపోయెను. బుద్ధి సూక్ష్మతయందు వెల్లస్లీకి తన తండ్రియందుకంటె తల్లియం దెక్కువ పోలికయుండెను. ఈతని తల్లి మిక్కిలి కుశాగ్ర బుద్ధిగలది ; ఎన్నికష్టములువచ్చినను వానినెల్ల నవలీలగదాట గలది ; ఇంక అనేకవిషయములలో మిక్కిలి గొప్పగుణములు గలది ; తన పిల్లలను చూచుకొని మిక్కిలి గర్వపడుచుండె డిది. వారుచాల గొప్పవారు కావలెనని మిక్కిలిగ ఆశించు చుండెడిది. ఆమె మనస్సులోనున్న కోర్కెలన్నియు సంపూ ర్ణముగ నెరవేరినపిమ్మటనే ఆమెచనిపోయెను. ఆమెబ్రతికి యుండగనే నలుగురుకొడుకులు ప్రభుబిరుదముల వడసిరి. తన పెద్దకొడుకు (వెల్లస్లీ) యిండియాలోని బ్రిటిష్ సామ్రా జ్యము పోకుండ కాపాడి రక్షించిన మహానుభావుడని లోకు లెల్లరు పొగడుచుండగ, చక్కగవిని ఆనందించినది. యూరపు ఖండములోని తమ సింహాసనములును, కిరీటములును, క్రింద దుల్లిపడకుండ నెపోలియన్ వీరుని బారినుండి తమ్మును కాపాడి రక్షించిన మహామహూ డీతడేయని క్రైస్తవ మహాసామ్రా ట్టులందరు తనచిన్నకొడుకగు వెల్లింగ్టన్‌ను పొగడుచుండగ విని ఆమె మహానందభరితురాలై పోయెను. ఈమె యీరీతిగ

బ్రతికియుండగనే తన కొడుకుల ముచ్చటలను, అచ్చటలను, తన మనసారచూచుకొని, అదృష్టవంతురాలై పోయినది. ముందు మహారాజ్యాంగవేత్త కానున్న యీ వెల్లస్లీ చిన్నతనమందు చదువుకొను రోజులలో పాఠశాలలో తన తోడిపిల్లలనందరిని పోగుచేసి, వారికి నాయకుడై, పాఠశాలాధికారులమీద తిరుగుబాటుచేసెను. గ్రీకు, లాటిన్ భాషలలో మంచిప్రవీణత సంపాదించెను. "ఆక్సుఫర్డు" విశ్వవిద్యాలయమునకు వచ్చినపిమ్మట యీ భాషల నెక్కువగ సాధించెను. ఇచ్చటనుండగనే యీతనికి గ్రెన్‌వెల్ ప్రభువుతో పరిచయముగలిగెను. ఈయన ద్వారా యీతడు పిట్టుమంత్రి దృష్టిలో బడెను; తద్ద్వారా ఉద్యోగపాయలో నెక్కెను. ఐరిషుపార్లమెంటులో లభించిన ప్రభు బిరుదముతో సంతృప్తి జెందక వెల్లస్లీ యెట్లో యింగ్లండుదేశపు కామన్సుసభలోకూడ సభ్యత్వము సంపాదించెను. తనపేరు యెట్లో పైకి రావలెనని యీతడు మహా ఆత్రపడుచుండెను. అందుచే ఒకమూల అటు ఐరిషుపార్లమెంటులో ప్రభుసభలోను, యిటు యింగ్లీషుపార్లమెంటులో కామన్సుసభలోను సవ్యసాచిగ ఉపన్యాసపరంపరల గురిపింప నారంభించెను. ............... 1786 సం॥లో యీతడు ఖజానాకు ప్రభువయ్యెను. ........... ఈతని వాగ్ధోరణి, తెలివితేటలు చూచి, పిట్టుమంత్రి యీతనికి యిండియా వైస్రాయి పదవి నిచ్చెను.

ఇండియాకు చేరక మునుపే, యిక్కడ చేయవలసిన పని యొక్క లోతుపాతుల నాతడు తెలిసికొనెను. వెనుకటి

వైస్రాయి సీమకు పంపించుచుండిన కొన్ని కాగితముల నాతడు తన ఓడ ప్రయాణములో దక్షిణాఫ్రికాగ్రపు మకాములో విప్పిజూచెను. తానిదివరకు యిండియాను గూర్చి విన్న సంగతులు, తన తమ్మునకు (ఆర్థర్) యిండియానుండి తనకు లోగడ వ్రాయుచు వచ్చిన ఉత్తరములలోని సంగతులు, సీమ నుండి బయలుదేరబోవుముందు తాను పిట్టుమంత్రితో ఊహించి చర్చించిన సంగతులు — అన్ని సరిగ నిజమని ఆతని మనస్సునకు ధ్రువపడెను. కట్టకడపటకు, యెట్లయిననేమి, యింగ్లండు దేశము లోగడ విదేశీయుల యెడల నవలంబించుచున్న హ్రస్వదృష్టి పద్దతిని—చెత్త పద్ధతిని—మానివేసెను. ఎన్నడు కనివిని యెరుంగనన్ని సేనలు తయారు చేయబడెను. ఎన్నడు లేనన్ని యోడలు సముద్రములో తేలియాడుచుండెను. క్రొత్త క్రొత్త యోడలు కట్టబడుచుండెను. ఈ సేనలకు యింటివద్ద (సీమలో) యేమిపనీ లేకపోతే, వానికి దూరదేశములో యేదో పని కల్పించుచుండిరి. ఈరీతిగ ట్రినిడాడు, సింహళము, లంకల నిటీవలనే పట్టుకొనిరి. ఈ పద్ధతినే ఆకస్మికముగ "బటేవియా" లంకమీదకూడ పడి, దానిని పట్టుకొనవలసినదని యీ క్రొత్త వైస్రాయికి చెప్పి పంపిరి. ఈయ పెట్టిన పనులలో యిదియొకటి.

"ఇకముందు యేదేశము పట్టుకొన కూడదు, తూ, నాబొడ్డు తుంబాలని" పార్లమెంటువారు 1793 సం॥ లో ఒట్టుపెట్టుకొనిరి. కాని, యీ ఒట్టు వట్టి ఒట్టేనని మన వెల్లస్లీకి బాగా తెలియును. ఇటు కుంపిణీవారికి, అటు సీమ గవర్నమెంటువారికి కూడ నిజముగ మనస్సులో యేమి

వున్నదో ఆయనకు పూర్తిగ తెలియును. కాబట్టి యీ ఒక్లేమి చేయును ? క్రొత్త దేశాలు ఆక్రమించుకోరాదని, యిండియా దేశపు రాజుల జవాహిరీ, భూములు, ఖజా నాలు, కాజేయరాదని, పార్లమెంటువా రేర్పరచిన నిషేధము (ఒట్టు) యొక్క విలువ యెంతవరకున్నదో వెల్లస్లీ ప్రభువు బాగా గ్రహించెను. వాటమువారి యనునదొక్కటే నిజమైన సంగతి. తక్కిన ఒట్లన్ని అబద్ధాల వొట్లని ఆతడెరుగును. జయమా, ఓటమియా యనునదొక్కటే నిజముగ విచారణీయాంశము. ఏ దండయాత్రలోనైనా యితడు ఓడిపోయినాడంటే, సీమలో యితని భరతము పట్టింతురు; అందరు తిట్టి దుమ్మెత్తిపోతురు; అందరికి యెక్కడ లేని శ్రీరంగనీతులు, కోపావేశాలు వస్తవి; చివరికి యితనికి నిజముగ ప్రాణముమీదికి కూడ వస్తుంది. కాని, జయించితే మాత్రము తనకు బ్రహ్మరథము పట్టుదురని కూడ యీతడెరుంగును. కావున, యీ ఆశ చేత, ఆ అపాయమును యెదుర్కొనుట కాతడు సాహసించెను.

కాని, యింతకంటె కండ్లకు మిఱుమిట్లుగొలుపు క్రొత్త పతకము లాతని మనస్సుకు తట్టెను. తన చేతినిండా, కావలసినంత అధికారమున్నది. దాని కింత మితమని లేదు; ఫలానిపని చేయవచ్చును, ఫలానిపని చేయరాదు అని విధి నిషేధము లేమియు లేవు. ఏ పని చేసినను తనను అడుగువారెవరు యిక్కడ లేరు. యూరోపియను ఆఫీసర్లతో కూడు కొన్న కావలసినన్ని సైన్యములు చేతులు తీటపట్టి తేరగనున్నవి. ఇవి పెద్ద పెద్ద పోరాటములలో యీమధ్యనే ముక్కలు

తీరియున్నవి. ఇక్కడికివచ్చిన రెండు మూడు నెలలలోనే, యిక్కడి దేశీయరాజులగు హైదరాబాదు, శ్రీరంగపట్టణము, పూనావారి సామర్థ్యము, అంతఃకలహములు పూర్తిగ తనకు తెలిసిపోయినవి. ఈ రీతిగ, చేయిచాచినంత మాత్రముననే లటుక్కున చేతిలోపడుదేశములు కావలసినన్ని తేరగవున్నవని యెవరికండ్లకు కనబడదు? అప్పటి హిందూదేశపు స్థితిగతులను బట్టి, కయ్యమునకు కాలుద్రువ్వుట కేదో వంకదొరకక పోవునా? కాని, యేపనిచేసినను పైకి చక్కగ, న్యాయముగ, కనపడ వలెనుగద. అకారణముగ ఒకరిమీద పడినట్లు కనపడ కూడదుగద. ఎవరో శత్రువు తమమీదపడబోవుచున్నట్లు, ఆ శత్రువు బారినుండి తప్పించుకొనుటకు మాత్రమే తాము యుద్ధమునకు దిగుచున్నట్లు పైకి కనపరచవలెనుగద. ఈ విధముగ పైమెరుగు అత్యవసరమని తలంపబడెను. ఇట్టి అనివార్యమగు అపాయమేదో ఒకటివున్నట్లు పన్నుగడ పన్నుట కెంతయో సేపుపట్టునా? ఫ్రెంచివారేదో కుట్ర పన్నుచున్నట్లు 1798 సం॥ లో ఒక పుకారు పుట్టించిరి. దానిని గోరంతలు కొండంతలుగ పెంచిరి. కర్నాటకయుద్ధములైన పిమ్మట దేశీయరాజులందరు తమ సేనలను యూరోపియను పద్ధతులమీద తరిఫీయతు చేయించుకొనజూచుచుండిరి. ఫ్రెంచివారు యిండియాలో లోగడ పోగొట్టుకొనిన రాజ్యము తిరిగి సంపాదించుకొను నుద్దేశముతో కుట్రలు పన్నుచున్నారని పుకారులు బయలుదేరదీయబడెను. అట్టి పుకారులకు యింగ్లీషు కుంఫిణీవారు మరింతదోహదము చేయుచుండిరి. అసలు ఫ్రెంచివారికిని యింగ్లీషువారికిని సహజముగ గల

వైరము, యీర్ష్య మున్నగునవి లోకప్రసిద్ధమేగద. అందుచే ఫ్రెంచివారికిట్టి కోర్కెగల్గినదన్నగాని, వీరివల్ల యింగ్లీషు వారికి ఉపద్రవము రాబోవుచున్నదన్నగాని చెప్పిన-చో అందు ఆశ్చర్యపడవలసినదేమున్నది ? ఈ పన్నాగము యెవరైనా నమ్ముటకు వీలుగానున్నది. కాని, 1798 సం॥ వరకు హైదరాలీగాని, టిప్పుసుల్తాన్‌గాని యీ విషయమై యేపాప మెరుగరు. వారింతవరకు ఫ్రెంచివారితో నేస్తముగట్టిన పాపమునపోనేలేదు. టిప్పుసుల్తాన్ యింగ్లీషువారితో స్నేహముగనే యుండెను. కాని, తన పితార్జితమైన యీ రాజ్యములో పోగా మిగిలియున్న యీ కొలదిపాటి రాజ్యములోనైనను యెంతకాలమువరకు కుంపిణీవారు తన్నుండనిత్తురో ఆతనికే తెలియకుండెను. అంతయు వారి దయాధర్మబిద్ధముగనుండెను. తన రాజ్యమును పగులగొట్టి పంచుకొనుటకై కుంపిణీవారు మహారాష్ట్రులతోడను నైజాముతోడను ఒడంబడిక చేసికొన్ననాటినుండి, అంతకుపూర్వమును, పరిమిలాను కూడ కుంపిణీవారు తనయెడ గనపరచుచున్న భావమునుబట్టి "కుంపిణీవారు నాకీరాజ్యమును దక్కనిచ్చేటట్లులేదురా బాబో" యని టిప్పుసుల్తాన్ భయపడుట కనేక అవకాశము లేర్పడెను. కుంపిణీవారిని నమ్మి నిర్భీతిగనుండుట కాతని కెక్కడను అవకాశము గాన్పింపకుండెను.

ఈ వైస్రాయికాలములో జరిగిన భారత పరిపాలనా చరిత్రయంతయు ఆతడు సీమకు అధికారరీత్యా వ్రాసి పంపిన రికార్డులలోనే నిస్సందేహముగ కనపడగలదు. ఈతని కాలమందు జరిగిన మహోత్పాత సంఘటనలన్నియు కేవలము

ఆకస్మికముగ, దైవికముగ, జరిగినవికావనియు, వాని కన్నిటికి ముందు లోతుగ కుట్రలు పన్నియే వైస్రాయి వీనిని గావించె ననియు ఋజువుపరుచుటకు తగినన్ని సాక్ష్యములు—భేదింప శక్యముగాని సాక్ష్యములు—కావలసినన్ని యీ రికార్డులందే గలవు. వైస్రాయికిని, టిప్పుసుల్తాన్‌కును, మొట్టమొదటగ జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు "వైనాడు" పరగణాకు సంబంధించినవి. 1792 సం॥లో జరిగిన ఒడంబడికలో టిప్పుసుల్తాన్ కుంపిణీవారికి కొన్ని ప్రదేశములనిచ్చెను. ఆ ఇచ్చిన వానిలో యీ వైనాడు పరగణా లేదని టిప్పుసుల్తాన్ వాదన. కాని, యీతని వాదనను లెక్కచేయక, దానికి సరియగు సమాధానమునైనను చెప్పక, నాటినుండి కుంపిణీవారు యీ పరగణాను ఆక్రమించుకొని కూర్చుండిరి. దీనివిషయమై టిప్పుసుల్తాన్ యెన్నిమోపన్యాయములు కుంపిణీవారికి కబుర్ల మీద కబుర్లంపించెను. కాని, కుంపిణీవారు మాత్రము బెల్లముకొట్టిన రాయివలె మెదలకుండ నూరకుండిరి. జవాబిచ్చినపాపమునైనను పోలేదు. అంతట అతనికి కోపము వచ్చి తన హక్కును స్థాపించుకొనుటకుగాను, ఒక చిన్న సైన్యదళమును వైనాడు పొలిమేర నాక్రమించుకొన బంపెను. ఈ వివాదమును పరిష్కరించుకొనుటకొక మధ్యవర్తిపేరు చెప్పెదననియు, టిప్పుసుల్తాన్ కూడ తనకిష్టమైన యింకొకనిని తన పక్షమున మధ్యవర్తిగ పెట్టుకొనవలసినదనియు, యీ యుభయులు చెప్పినచొప్పున నడుచుకొందమనియు వైస్రాయి కబురంపెను. దీనికి టిప్పుసుల్తాన్ తక్షణమే అంగీకరించెను. మధ్యవర్తు లుభయులు కలిసి చెప్పిన తీర్పేమనగ:— యింగ్లీషు

వారు దానిని అన్యాయముగ ఆక్రమించుకొనిరని యీ మధ్యవర్తులు తీర్పు చెప్పిరి. ఈ తీర్పు ప్రకారము తక్షణమే వైనాడు పరగణాను టిప్పుసుల్తానున కిచ్చివేయుచు, యిరువురి మధ్య గలిగిన వివాదకారణము తొలగిపోయినందుకు అభినందించుచు నైసాయి యగు వెల్లస్లీ ప్రభువు 7 వ ఆగస్టు తేదీన టిప్పుసుల్తాన్‌కు జాబువ్రాసెను. ఒకవైపు పైకి తియ్యని మాటలతో జాబులు వ్రాయుచు, ఆ క్షణమందే లోలోన మైసూరు రాజ్యముపై దండెత్తుటకుగాను కుంపిణీవారి యావత్తు సైనికబలము సన్నాహము గావింపబడుచుండెను.

తన సైన్యములో చేర్చుకొనుటకుగాను కొలదిమంది యూరోపియను శిపాయిలను పంపవలసినదిగ కోరుచు 1797 సం॥ లో టిప్పుసుల్తాన్ ఫ్రెంచిగవర్నరుకు కబురు పంపించెను. దీనిలో గొప్పవిశేష మేమియు లేదు. ఇది మామూలుగ జరుగుచున్న విషయమే. దీనివల్ల ఇంగ్లీషు వారితో చేసికొన్న ఒడంబడికకు భంగము గలిగించిన ట్లర్థము కాదు. ఇండియాలోనున్న దేశీయ రాజులెల్లరు ఆనాడు ఫ్రెంచిశిపాయిలను, ఫ్రెంచియుద్యోగులను తమతమ సేనలలో జీతములిచ్చి నియమించుకొనుచునే యుండిరి. నైజామువారును, మహారాష్ట్రపీష్వాలును, యింక ననేక మంది భారతవర్ష ప్రభువు లానాడిట్లు పరాసుశిపాయిలను తమ కొల్వులోనికి తీసుకొనుచునే యుండిరి. దాని కెవరును, యెట్టిఅభ్యంతరమును, యెన్నడును చెప్పియుండలేదు. ఇందు విపరీతమగు విపర్యయ మేమియు లేదు. ఈ ప్రకారము టిప్పు పంపిన కబురుకు బదులుగ ప్రస్తుతము తనవద్దనున్న సేనలోని

దళములను యిచ్చుట కప్పుడు వీలుపడక, ఫ్రెంచిగవర్నరేమి చేసినాడనగ :— అప్పుడు యిండియాలోనున్న ఫ్రెంచివారందరు టిప్పుసుల్తాను కొలువులో చేరవలసినదని ఒక ప్రకటన గావించెను. ఈ ప్రకటనయందు యింగ్లీషువారిపై యసూయతను పుట్టించు వాక్యము లున్నట్లు అబద్ధాలు, పుకార్లు పుట్టించిరి. పోనీ ఫ్రెంచివారు పెద్ద యుద్ధనావికాదళమును తీసికొనివచ్చి రేవులో పెట్టియున్నగాని, కోస్తాచేరువను పెద్ద కోటలను దిట్టపరచియున్నగాని, లేక కుంపిణీవారిపై పడుటకు పెద్దదండును తీసికొనివచ్చి విడియించియున్నగాని, లేక దెబ్బతిన్న మైసూరుసుల్తాను తమతో యుద్ధముచేయుచుండినగాని,— నిజముగ అప్పు డిట్టిపనులలో యేవైన, యేమాత్రమైన, జరుగుచుండి యున్నయెడల మన కుంపిణీవారు తీవ్రచర్యకు గడంగినారన్నచో న్యాయముగ నుండెడిది. కాని, పాప మట్టి పనులేమియు అప్పుడు జరుగుచుండుటలేదే! పైపెచ్చు, అంతయు దీనికి వ్యతిరేకముగనే జరుగుచుండెనే! ఈమధ్య నాలుగేండ్ల లోపుగ అరడజను ఫ్రెంచినావలుకూడ కోస్తాయందు గనిపించలేదే! నావికాదళమనునది పేరునకైన నిర్మించుకొనుటకు టిప్పుసుల్తానుకు అవకాశమే లేకుండెనే! నిజముగ యుద్ధకాంక్షయే టిప్పుసుల్తానుకు ఉన్నట్లయితే, వైనాడు పరగణానుగూర్చి ఆతడట్లు అన్ని పర్యాయములు ఓపికతో, శాంతముగ, కుంపిణీవారిని బ్రతిమాలుకొనెడివాడా? కవ్వించి అనవసరముగ యేల కుంపిణీవారిని రేపవలెనని ఆతడు శాంతము వహించెడివాడా? ఆ సంవత్సరము యేప్రిల్ నెలలో టిప్పుసుల్తాన్ కొలువులోనికి వచ్చిన పరాసు

శిపాయి లందరు కలిపితే మొత్తము రెండువందలైనా లేరే! అయితేయేమి? ఈ రెండువందల మంది కొరకట- యీ పరిస్థితుల కొరకట- మన వెల్లస్లీ ప్రభువు లెక్కింప తరముగాని ద్రవ్యమును వెచ్చించి, మహాబ్రిటిష్‌సామ్రాజ్యస్థ సైనిక వాహినుల నెల్ల సన్నాహము చేసికొని మైసూరు రాజ్యముపైకి దండు విడిసినది! ఈ రెండువందలమంది పరాసువారట మన యింగ్లీషువారిని "యిండియానుండి తరిమివేతురట!" ఈ యీపదవ్రమునుండి తప్పించుకొనుటకట వెల్లస్లీ ప్రభువిట్లు మైసూరు రాజ్యముపై జైత్రయాత్ర వెడలినది.

ఈ రీతిగ యుద్ధసన్నాహములు జరుగుచున్నను పైకి మాత్ర మొక్కమాటయైనను పొక్కనీయలేదు. వైనాడును గూర్చిన వివాదము పైకి బహున్యాయముగ సాధువుగ పరిష్కారమగునట్లు దొంగతంతు నడిపిరి. ఫ్రెంచిగవర్నరు చేసిన ప్రకటనవలన తమకు కోపము వచ్చినట్లుగాని తమకు విపత్తు రానున్నట్లుగాని కుంపిణీవారప్పుడు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములలో ఒక్కమాటయైనను జారనివ్వలేదు. వ్యవహారము లిక్కడ యిట్లుండగ ఫ్రెంచి వీరుడగు నెపోలియన్ వచ్చి యీజిప్టుదేశముపై దండె[illegible]సను వార్త అక్టోబరు ఆఖరువారమందు యిండియాకు చేరెను. అంతటితో యిండియాలోని కుంపిణీవారికి గాభరాపుట్టెను. కాని, అక్కడ నైలునదిమీద యింగ్లీషువారికి జయముగలిగె ననుమాట తెలియుటతోడనే, యీగాభరా కొంచెముతగ్గెను. ఈ రీతిగ "యింగ్లీషువారికి శత్రువులగువారిపై భగవంతుడు కలిగించిన అపజయము చూచినావా" అని మె[illegible]చుచు

వెల్లస్లీ టిప్పుసుల్తానుకు ఉత్తరమువ్రాసెను. "ఫ్రెంచివారికి మొదటినుండియు యిదేదుర్బుద్ధి. అన్యాయముగ పరుల రాజ్యముల గాజేయవలయునను దురాశ, తనివితీరని లోభత్వము, —యివి వారికి చిరకాలమునుండియునున్న దుర్గుణములు. ఇప్పుడు వీరు యీజిప్టుపై గావించిన యీ దండయాత్రకూడ వారి దురాశ కొక ప్రబలనిదర్శనము. న్యాయము, మంచి, మర్యాద యనునది వారెన్నడు పాటించువారుకారు. అనవసరముగ తమ కెట్టి కలహాకారణము లేకుండగనే వారిట్లు యీజిప్టుపై దాడివెడలుట వారి న్యాయాతిక్రమణబుద్ధిని చెప్పకయే చెప్పుచున్నది. వారి దురాశను తెలియజేయుటకు యింతకంటె యెక్కువ నిదర్శన మేమికావలయును ?" అని వెల్లస్లీ టిప్పుసుల్తానుకు వ్రాసెను. ఇవి కఠినమైన మాటలే. ఈమాటలే యింగ్లీషువారి నోటినుండిగాక మరెంకెవరి నోటినుండియైన వచ్చియున్నట్లయిన యెంతైన అందముగ నుండెడిదే. కాని, అన్యాయముగ తన రాజ్యమును దిగమ్రింగిన కుంపిణీవారే యిప్పు డిట్లు తగుదుమమ్మాయని శ్రీరంగనీతులు పల్కుచుండగ ఆ ఉత్తరమును చదువుకొని టిప్పుసుల్తాను తన మనస్సులో యేమనుకొనియుండును? కాని, యీ మాటలలో యింకను అగాధముగనున్న వంచనను టిప్పుసుల్తానైనను అప్పటికి పూర్తిగ గ్రహించియుండడు. వలననగ, కుంపిణీవా రిట్లు మహోత్పాతముగ తనమీాద వచ్చిపడుటకు మహాపాతాళహోమము చేయుచున్నారన్న సంగతి—పాపము—టిప్పుసుల్తానుకు అప్పుడేమి తెలుసును ? ఈజిప్టుదేశమును దాటి నెపోలియన్ యిండియామీాదికి వచ్చి

పడు నేమో యను భీతావహామింకను యింగ్లీషువారికి పూర్తిగ పోలేదు. అందుచే, యింగ్లీషువారు సాహసించి మైసూరుపై పడుటకింకను కొంచెము వెనుక ముందాడుచుండిరి. కాని, తుదకెట్లయిననేమి, గవర్నరుయొక్క ఆవేశవేగము చేతనైతే నేమి, యుద్ధప్రయత్నములిక దాచుటకు వీలుపడకపోవుటచేత నైతేనేమి—యేదో కారణముచేత తెగించి—నవంబరు 8 వ తేదీన కుంపిణీ గవర్నరు యీ దిగువ రీతిగ కయ్యమునకు కాలు త్రవ్వుచు టిప్పుసుల్తాన్‌కు జాబు వ్రాసెను. టిప్పుసుల్తాన్ ఫ్రెంచివారితో స్నేహము చేసికొనుచున్నాడనుటయే కలహకారణముగ అందు నిరూపింపబడెను. ఈ లేఖలోని శైలి, దానిధోరణి మహా విచిత్రముగనున్నది. కాబట్టి దాని నిక్కడ పూర్తిగ వివరింపకుండ విడిచిపెట్టుట మంచిదికాదు. "నీకు ఫ్రెంచివారికి మధ్య జరుగుచున్న వ్యవహారము, నీవు వారితో చేయుచున్న సాంగత్యము—అంతా నాకు తెలియ దనుకున్నావా యేమిటి? ఆ రహస్యమంతా నాకు తెలియ దని నీవెప్పుడు అనుకోవద్దు. నీవు, నా దేశమునకు శత్రువు లైన ఫ్రెంచివారితో జరుపుచున్న వ్యవహారముల నన్ని టిని నేను ఊరక దేబవలె చూచుచు ఊరకుండుదునను కొంటివా? అట్లెన్నడు అనుకోవద్దు. నీవు వాళ్లతో సాంగత్యము చేసినట్లయితే నీవుఅన్నివిధాలా నాశనమైపోతావు. నీకు కుంపిణీవారికి వుండేస్నేహము సమూలముగా చెడిపో తుంది; అంతేగాకుండా నీ రాజ్యములో అరాచకము అల్ల కల్లోలము పుట్టించే సిద్ధాంతాలు బయలుదేరి నీ రాజ్యమధ్య మందు పాదుకొంటవి; దానివల్ల నీ అధికారమంతా క్రుంకుడు

వేర్లతో కూడ కదలి కూలిపోతుంది ; నీ ప్రజలు నీ మాటలు వినక యెదురు తిరుగుతారు; నీ వెంతో భక్తితో ఆరాధించే నీ మతమంతా నాశనమైపోతుంది. నీ విన్నికష్టాలలోపడి పోతావని నేను కన్నారాచూస్తూ, నీ కీసంగతి తెలియచెప్ప కుండా యిక యెట్లా వూరకుండేది ? నీ యొక్కస్థితిచూస్తే నా కెంతో ఆశ్చర్యము, యెంతో ఆదుర్దా, "అయ్యో చెడి పోతున్నావే" అనే విచారము కలుగుతోంది. కాబట్టి నేనీ సంగతినిక దాచిపెట్టడము న్యాయముకాదను ఉద్దేశముతో విప్పి చెప్పడము అవసరమను తలంపుతో, నే నిప్పుడీ వ్యవహారము నంతాను నిర్మొగమోటముగ నీకు తెలియపరచుచున్నాను." అని మదాసు గవర్నర్ టిప్పుసుల్తాన్‌కు వ్రాసెను.

టిప్పుసుల్తాన్ యొక్క రాజ్యములో ప్రభుభక్తియు, మత ధర్మములును స్థిరముగ నిలుపుటకుగాను వైస్రాయి యెంతో ఆతురపడుచున్నట్లు, యెంతోభక్తి విశ్వాసములతో ప్రాధేయ పడి సుల్తాన్‌కు హితోపదేశము చేయుచున్నట్లు వ్రాసిన యీ వ్రాతలు— ఆహా !— యెంత చక్కగ వున్నవి ! ఎవరి మనస్సునైన కరగించునట్టివిగ నున్నవిగద ! ఓహో ! యిటీవల ఆంగ్లేయోద్యోగులు వ్రాయు వ్రాతలలోగల యిట్టి సోల్లుం ఠన వాక్యములు— పయోముఖవిషకుంభపు కూతలు— ఎత్తిపొడుపు మాటలు— తమకు కూడ చేతకాలేదని నికృష్టు లగు అసురనాయకు లెల్లరు తమ సమాధులలోనుండి లేచి వచ్చి వప్పుకొనవలసి వచ్చుచున్నదే ! వేటలోపడిన జంతువు సగమిదివరకే వేటకాని నోటపడెను. తక్కిన సగము కొరకై వేటకానికత్తి హాహాకారములు చేయుచు నాలుకలు చాచు

చున్నది. ఈ తక్కిన సగమును మ్రింగుటకు ముందు కాళికా దేవికి నివేదన చేయుటయో యన్నట్లు పూజా మంత్రములు, దేవీస్తోత్ర కదంబములు పఠింప మొదలిడిరి. మతధర్మములు తారుమారు కాకూడదని, రాజధర్మములు రాలిపోకూడదని, మాంసపు ముక్కకును, దానినిక క్షణములో పీకుకొని తిన బోవు కోరలకును మధ్యగల చుట్టరికమునకు భంగకరమగు నే పనియు చేయరాదని—మహాధర్మోపన్యాసములు — మహోన్యాస పూర్వకముగ ప్రారంభమయ్యెను. ఈ మహోపన్యాసములకు తేటతెలుగులో అర్థమేమి; "నీకు మాకు చాల స్నేహము. అందుచే నీప్రేమను మేమే జూరుకొనవలయునని మాకెంతో కోరిక. ఫ్రెంచివారు నమ్మదగినవారు కారు. వారు ప్రజాప్రభుత్వవాదులు. వారి సంగతి నీకంటె మాకెక్కువ బాగా తెలియును. వారిని దగ్గరకు చేరనిచ్చినావా అంటె, వారు నీ ప్రజలకు ప్రజాప్రభుత్వ సిద్ధాంతములను బోధించెదరు. మనకిద్దరికి స్నేహము కాబట్టి, మేము దీని కొప్పుకొనజాలము. వారు నీ సింహాసనము క్రింద గొయ్యి త్రవ్వుతారు. నీవు ఫ్రెంచివారిచేత యీ రీతిగ అవమానపరుపబడుచుండగ మేము కండ్లారా చూడలేము—దానికంటె మేమే మాచేతులతో నీసింహాసనమును ఊడబెరకడమే బాగుంటుంది. వారు నీ ప్రజలకు నీ మతమందు అవిశ్వాసమును బోధించెదరు. అంతదూరమెందుకు; పాపము ముందు నీ యంతరాత్మ గతి యేమౌతుందో నీవే చూసుకో; నీవు చూసుకోకపోతే, మేమైనా చూడవలసివస్తుంది. యీ పాపిష్టిలోకములో రూసు, వాల్టేరు మున్నగు ఫ్రెంచి సిద్ధాంతుల వాదములు

చెలరేగి యీ లోకమును నానాభ్రష్ట మొనర్పక పూర్వమే నీ యంతరాత్మ కా మైల సోకకుండ, దాని నింకొక లోకమునకు పంపివేయవలసిన బాధ్యత మామీద వుంటుంది. నిన్ని రీతిగ నీ కాలముతీరకముందే పరలోకమునకు బదలాయించిన పిమ్మట, నీ ప్రజల అంతరాత్మలను గూర్చియు, భౌతిక శరీర ములను గూర్చియు మేముతగుజాగ్రత పుచ్చుకొందుములే! మేము మీ ప్రజలకోసమొక క్రైస్తవ మతపీఠమును స్థాపిం తుము. లేదా కనీసము మైసూరుకొక బిషప్పునైనా నియమిం తుము. ఇది మా మామూలుపద్ధతి. కాని, అంతరాత్మ విష యములో మేము బలాత్కారము చేస్తామని నీ వనుకుంటా వేమో? అట్టి భయము ఎప్పుడూ పెట్టుకోవద్దు. కాకపోతే, మేము తోడి క్రైస్తవులనే హింసిస్తాము గాని, పరాయివారి జోలికిపోము. మీ దేవాలయాలు, మశీదులు, మీరు కల్పాంతమువరకూ వుంచుకోండి. మా కభ్యంతర మేమీ లేదు—— అయితే మీ దేశంలో వుండే ధనధాన్యాది సమస్త భౌతికసంపదలు, అధికారాలు మాచేతిలో పెడితే అంతేచాలు, మా కింకేమి అక్కరలేదు. వేయేల, ఆదిక్కు-మాలిన ఫ్రెంచిప్రజాప్రభుత్వ ధర్మాలు మీ ప్రజలలో ప్రాక డము మేము మా కండ్లతోచూచి సహించలేము. అంతకంటె మేమే మీతురకలదైవముగు మహమ్మదుకుగాని, హిందువుల దైవమగు బ్రహ్మదేవుడికిగాని, గులాములమై వారికి ప్రజలనుండి కానుకలు,ముడుపులు వసూలుచేసి పెట్టుటకు యేజంట్లమౌతా ము. అదంతా యెందుకు? మమ్ములను గనుక నీ శ్రీరంగ పట్టణములోనికి జొరబడనిస్తే, నీ కేమి కావలిస్తే ఆపని

చేస్తాము; నీ హిందువుల విగ్రహాలముందర నిలుచుని మేళాలు తాళాలు వాయిస్తాము- విష్ణుమూర్తికి, జగన్నాథ స్వామికి హారతులెత్తుతాము. మాకేమీ అభ్యంతరం లేదు." వెల్లస్లీ వ్రాసిన యీ ధర్మోపన్యాసములో యింకొక మాటకూడ కలదు. కుంపిణీవారు యుద్ధ సన్నాహములు విరివిగ చేసికొనుచుండిరి. ఈ సంగతి నిక దాచుటకు వీలు లేకపోయెను. అందుచే తాము "స్వరక్షణార్థమై" యీపని చేసికోవలసి వచ్చినదని వెల్లస్లీ ఆజాబులో వ్రాసెను. తుదకీ జాబును మహాగంభీరోపన్యాసముతో యీదిగువరీతిగ ముగించెను. "బ్రిటిష్ గవర్నమెంటువారు యిరుగుపొరుగు రాజ్యములవారితో శాంతముగ, మిత్రభావముతో మెలగ గోరుచున్నారు. మాకు పరరాజ్యకాంక్ష యెంతమాత్రము లేదు. మా రాజ్యములందు శాంతియు, స్థిరమగు భద్రతయు నుండవలయునను కోరికతప్ప మా కింకొక కోరిక లేదు- మా యీ పరమశాంతి సంకల్పమునకు యెట్టిబుజువు కావలెనన్నను మేము చూపుటకు సదాసిద్ధముగ నుందుము-ఇప్పుడును వున్నాము." నలుముఖముల యుద్ధసన్నాహము లేల జరుగుచున్నవని మొరపెట్టుచు టిప్పుసుల్తాన్ నవంబరు 20వ తేదీన యీ జాబునకు ప్రత్యుత్తరముగ వ్రాసెను. ఈ యుద్ధ సన్నాహములను మానివేసి శాంతిని నెలకొల్పవలయునని ప్రార్థించెను. ఫ్రెంచి గవర్నర్ చేసిన ప్రకటన బ్రిటిష్ చక్రవర్తికి కోప కారణమయ్యెనను మిషను మెల్లగ, మొట్టమొదటి పర్యాయము బయటపెట్టుచు 1799 సం॥ జనెవరి 9 వ తేదీన వెల్లస్లీ ప్రభువు టిప్పుసుల్తాన్‌కు జాబువ్రాసెను. "వైనాడు పరగణాను

యుద్ధముతో నిమిత్తము లేకుండ కుంపిణీవారు నీకిచ్చివేయుచు వారు నీయెడ చూపిన మంచితనమునకు, స్నేహాభావమునకు వ్యతిరేకముగ నీ వేల మాయెడ కృతఘ్నుడవై మరునాడే ఫ్రెంచి గవర్నరుచే అట్టి ప్రకటనను గావింపించితి"వని వెల్లస్లీ తనకేదో మహా అన్యాయము జరిగినట్లుగ, సంగనాచివలె, మొరపెట్టుకొనజొచ్చెను. "వైనాడు విషయములో నేను మీకుగల హక్కునుగూర్చి న్యాయముగ, నిష్పక్షపాతబుద్ధితో పరిష్కరించి మీస్నేహ సంబంధమును శాంతిని, పెంపొందించుకొనవలయునని సంకల్పించుకొనుచున్న క్షణమందే యీ ఫ్రెంచి గవర్నరు ద్వారా మీరు చేయించిన యీ ప్రకటన పిట్టపిడుగువలె నాచేతిలో వచ్చిపడెను" అని వెల్లస్లీ యేమియు తెలియని అమాయికునివలె నటింపుచు వ్రాసెను. కాని, యీతని దొంగతనము ఆ గ్రంథమందే వేరొకచో ముద్రింపబడిన మరికొన్ని సంగతులను పట్టి బయట పడుచున్నది. వైనాడు విషయములో తాను చూపితినని మహా యాడంబరముగ ప్రకటించుకొనిన యీ మహోదారధర్మబుద్ధి తనకు పుట్టుటకు పూర్తిగ రెండు నెలలకు పూర్వమే యీ ఫ్రెంచి గవర్నర్ చేసినాడన్న ఘోరప్రకటన వెల్లస్లీ చేతులలో నుండెనని గట్టిగ ఋజువుచేయుటకు కావలసినన్ని నిదర్శనములు యీ జాబు ప్రకటింపబడిన ఆ గ్రంథమందే కుప్పతిప్పలుగ నున్నవి. ఈ ప్రకటనకాగితము వైస్రాయి చేతిలోనికి రాగనే కుంపిణీయుద్యోగస్థు లందరు చాల సంతోషించుచు, చంకలు కొట్టుకొని, వెక్కిరింతలు, వేళాకోళములు, సాగించిరి; "టిప్పుసుల్తాన్ మీదికి కవ్వించి కాలుదువ్వుటకు

భగవంతుడు సరిగ సమయమునకు మన కీ మిషను కల్పించి పంపినాడురా, వహ్వా, వహ్వా''—యని యెగిరి గంతులువేసిరి. బ్రిటిష్ సేనానియగు జనరల్ హారిసునకీ ప్రకటన సంగతి వ్రాయుచు, దీనివల్ల పొందదలచిన లాభమునుగూర్చి ఆతనికి రహస్యముగ తెలియజేసిరి. ఈ కనుసన్న నాతడు వెంటనే గ్రహించి, మైసూరుపై దాడివెడలుటకు సైన్యముల నాయత్తము చేసెను. తమతమ రాజధానులలోగల సైన్య సమూహముల నెల్ల నాయత్త పరుపవలసినదని మద్రాసు బొంబాయిగవర్నరులకు వెంటనే హుకుములు జారీచేయబడెను. కాని, యీ యిరువురు గవర్నరులును యీ పనికి ఒప్పుకొనలేదు. టిప్పూ నిప్పుడు యుద్ధములోనికి దింపుటకు వారు సమ్మతింపలేదు- ఏలననగ:- "ఫ్రెంచి గవర్నరుయొక్క ప్రకటన ఏ యుద్దేశముతో చేయబడినను, ప్రస్తుత వార్తలనుబట్టి చూడగ, ఘనము కల్పించి పైబడినతప్పు, అటు ఆ వైపునుంచి వారంతటవారు యుద్ధమునకువచ్చు సన్నలేమియు గాన్పించవు" అనివారు వ్రాసిరి. ఈ రీతినే వెల్లస్లీకూడ సీమకువ్రాసెను:- ఏమని ? "ప్రస్తుతము చేతిలో డబ్బు లేకపోవుటను బట్టియు, సకాలమునకు యుద్ధసన్నాహములు పూర్తియగుటకు వీలులేకపోవుటనుబట్టియు, మైసూరు రాజ్యముపైపోయి పడు ప్రయత్నమును నే నిప్పుడెంతో అయిష్టముతో వదలుకొనవలసినవాడనైతిని. నా పతక మేమనగ:— "ఇంకను టిప్పు స్వాధీనములో మిగిలియున్న కోస్తా పరగణానంతను పట్టుకొని, అక్కడనుండి ఆతని రాజధానిపై పోయిపడి, యీ పట్టుకొన్న కోస్తా పరగణాలన్నిటిని మనకిచ్చి

వేయునట్లు నామకః అతనిచేత బలాత్కారముగ ఒప్పించి, యీ యుద్ధపు ఖర్చులనన్నిటిని అతని నెత్తిమీదనే వేసి వుద్ది విడిచిపెట్టుదమని నేను పన్నాగముపన్నినాను. ఇవి చాల మంచి యుద్దేశములు కావా ? న్యాయమునకు రాజనీతికి ఉండవలసిన లక్షణములివి కావా ? అదిగాక "మా మంచితనము చేతనే మామితత్వబుద్ధిచేతనే, మేము మిమ్ముల నింక కఠినముగ హాతమార్పకుండ యింతటితోనే వదలివేసినామని దేశీయరాజులకు నచ్చునట్లు చెప్పి, వారిని మెత్త మెత్తగ మందలించి వదలి పెట్టినచాలును—వారిగౌరవమును మన్నించుట కింతమాత్రము చాలును—అని నేను సంకల్పించినాను" అని వెల్లస్లీ ప్రభువు సీమలోని ప్రభుత్వాధికారులకు వ్రాసెను. ఇదంతా ఎప్పుడు ? మహాయాడంబరమగు ఉదారభావము ప్రకటించుచు వైనాడు పరగణాను టిప్పుసుల్తాన్‌కు యిచ్చివేయుటకు పూర్వమే ! ఇట్టి దురాగతపు టుద్దేశములను కడుపులోపెట్టుకొని పైకి మహోదారమును ప్రకటించుచు చేసిన యీ పనియట కుంపిణీవారి నిజాయితీ బుద్ధికి నిదర్శనమని టిప్పుసుల్తాన్ గట్టిగనమ్మవలెనట ! ఉన్న అసలు నిజమే మనగా:— తమకుట్రలన్నియు పూర్తిగ తయారై యిక మైసూరుమీాద వచ్చిపడుటయే తరువాయిగనుండునట్లు సర్వము తాము సిద్ధముచేసికొను వరకు యీ సంగతి టిప్పుసుల్తాన్‌కు యెంతమాత్రము తెలియకుండ, అతని కన్నులుగప్పి, పైకి తియ్యని మాటలుచెప్పుచు, చేతిలో బెల్లముపెట్టి పిల్లవానిని మాయచేసి లాలించినట్లు అతనిచేతిలో వైనాడు పరగణాను పెట్టి లాలించుచు, అతనిని అజాగ్రతస్థితిలోపెట్టి, అతని కాలి

క్రింద మెల్లగ గోతులు త్రవ్వుచు, సమయముకనిపెట్టి మీద పోయిపడుటకు చేసిన టక్కరియెత్తుగాని యిది యింకొకటి కాదు. ఇదంతయు వట్టి బూటకపుతంతు. రహస్యముగ సమకూర్చుకొనుచున్న యుద్ధసన్నాహములన్నియు పూర్తిగ సిద్ధమగువరకు తనయాత్మగౌరవమున కేమియు నెప్పికలుగ లేదు కాబోలు ! సర్వముసన్నాహమైనపిమ్మట అప్పుడు— ఆనెప్పి బయట పడినదికాబోలు ! ఎంత మాయనటన ! యుద్ధసన్నాహములు పరిపక్వమగువరకు తమ యంతరాత్మకా నెప్పి కలగక పోవడమే కాకుండ, టిప్పుసుల్తాన్ యందు యెంతో విశ్వాసమును, ఔదార్యమును కూడ కనుపరచ గలిగినది ! పైకి దొంగనటన జేయుచు, యెంతో శాంతమును, మిత్రత్వమును కూడ కనబరచినది ! టిప్పుసుల్తానును మహా మోహములో పడవేసిన యీ వైనాడురాష్ట్రప్రదాన పుణ్యాకార్యమైన తొమ్మిది నెలలకే స్వార్థత్యాగులును మహా న్యాయమూర్తులును నగు బ్రిటిష్ ప్రభుత్వమువారు యీ వైనాడు రాజ్యము నేగాక టిప్పుసుల్తాన్ కింకను మిగిలియున్న యితర ప్రాంతములతోసహా యావత్తు మైసూరు రాజ్యమును— (సహేంద్రతక్షకాయ స్వాహాయని) గుటుక్కున, ఒక్క లాటులో, మ్రింగివేసిరి.

1799 సం॥ జనేవరి ఆఖరుకు యుద్ధసన్నాహములు సంపూర్తి యయ్యెను. అప్పటికి సంవత్సరము క్రిందటనే చేయబడిన ఫ్రెంచి గవర్నర్ యొక్క ప్రకటన యిప్పటికి సహించ శక్యముగాని దయ్యెనట! దండెత్తుట కాయత్తపరుపబడిన సేనలు మైసూరు రాజ్యములోనికి నడువవలసినదని

యుత్తరువులు జారీయయ్యెను. ఇంతకుపూర్వము యీ మాయ తంతులో నొక అంగముగ కుంపిణీవారు టిప్పుసుల్తానుకొక రాయబారము పంపిరి. ఇదంతయు వట్టి టక్కరి రాయబారము. తా మింకను మంచి యుద్దేశములోనే యున్నామని టిప్పుసుల్తాన్‌ను నమ్మించి, మోసగించుటకు వేసినయెత్తుయిది. పాపమీ దొంగటక్కును గ్రహించలేక టిప్పుసుల్తాను రాయబారపు షరతులకు సమ్మతింతునని మిక్కిలి అమాయిక బుద్ధితో కబురు పంపించెను. ఇందలి షరతులకు ఒప్పుకొనుట కిచ్చిన గడువు 8 రోజుల క్రిందటనే గడచిపోవున ట్లేర్పాటు చేయబడెను. "ఆ గడువు చాలరోజుల క్రిందటనే గడిచి పోయినది. మే మేమి చేయగలము? సైన్యము లప్పుడే చాల దూరము సాగిపోయినవి; వాని నిక వెనుకకు త్రిప్పుట కిప్పుడెట్లు సాధ్యమగును? అయినను, ఏమైనా చెప్పుకోవలసివుంటే, సేనాముఖముండ., మా సైన్యాధ్యక్షుడగు జనరల్ హారిసుతో చెప్పుకొన వచ్చును" అని కుంపిణీవారు టిప్పుసుల్తానుకు కర్నల్ హారిస్‌ద్వారా తిరిగి కబురంపిరి. కాని, యిదియు దొంగయెత్తే; ఇదియు బూటకపుతంతే; ఏలననగా "ఒక్కక్షణము కూడ ఆలస్యము చేయకుండా నీవు సేనను నడిపించుకొని పోవలసినది. మైసూరు పొలిమేరదాటి ఒకరోజు ప్రయాణము సాగిన పిమ్మటగాని సదిజాబును టిప్పుకు అందజేయవద్దు" అని సదరు హారిసుకు రహస్యముగ చెప్పి పంపిరి. ఈరీతిగ శత్రుసేనలు తన రాజ్యములో కొంతభాగమును ఆక్రమించుకొనువరకు—పాపము—దైవోపహతుడగు టిప్పుసుల్తానెట్టి సంధి షరతుల నైనను ప్రసంగించుటకు వీలుకలుగకుండ చేసిరి. ఇదిగాక,

యింకను కొన్ని రహస్యపు పెత్తులను హారిసుకు నేర్పిపంపిరి. "శ్రీరంగపట్టణము మనచేతులలో పడేవరకు,-లేదా అట్టిదే లాభకరమగు మరియేదైన స్థానము మనచేతిలో చిక్కువరకు- నీవెట్టి సంధి షరతులకు వప్పుకోవద్దు. ఇవి మన చేతిలో చిక్కిన తరువాత టిప్పుసుల్తానుపై యీదిగువ షరతులను విధించవలసినది. ఏమనగః—"భాగ్యవంతమును, కోస్తా పరగణాయు, నగు కనరామండలమును మాకుంపిణీవారికిచ్చి వేయవలయును; అట్టివే మరిరెండు విలువగల మండలములను యీయుద్ధములో మాకు సహాయము చేసిన మామిత్రులకివ్వవలెను. యుద్ధపు ఖర్చుల కింద కోటిన్నర రూపాయలు మాకివ్వవలెను" అని టిప్పుసుల్తానుతో బేరమాడవలెను. కోట ముట్టడికి పూర్వమే గనుక ఆత డీషరతులను వప్పుకొనకపోయినాడంటే ఆతనిరాజ్యములో సగభాగము మనకుపూర్తిగయిచ్చివేయునట్లు నిర్బంధించవలెను" అనిహారిసుతో గట్టిగ చెప్పిపంపిరి. అదిగాక, "యీ సంధిమాటలతో పెట్టుకొని కూర్చుండి శ్రీరంగపట్టణము మీదకుపోవు నడకను మాత్రము ఆపేవ్వు సుమా—జాగ్రత్త. ఆనడకను ఆపవద్దు" అని ఉత్తరములమీద ఉత్తరములు హారిసుకు అనుక్షణము పంపుచుండెను. దీనికి ఫలితముగ జరిగిన విషాదకథ టిప్పుసుల్తాను తెలిసిన దేకద. తనను పూర్తిగ నాశనముచేసేవరకు తన శత్రువులకు దాహా మారదని టిప్పుసుల్తాను గ్రహించి, యెట్లయినను తన కంఠములో ప్రాణమున్నంతవరకు హోరాహోరిని పోరాడి వీరశయన మలంకరింతునుగాక యని ఆఖరుకు ఆతడు గట్టిగ నిశ్చయించుకొనెను. తన సైన్యములో నున్న యుత్తమ

యోధుల నెల్లరిని తనచుట్టు చేర్చుకొని, కోటద్వారములను మూసివేయించి, తాను బయటనుండి శత్రుమూకలను లోనికి జొరనీయకుండ ఆఖరువరకు పోరాడి చత్తమని ఆతడు నిశ్చయించుకొని, రణరంగములోనికి వచ్చెను. కాని, శత్రువాహిను లపారముగ వచ్చిపడుటచే, ఆతని నవి ముంచివేసినవి. తన సైన్యముల కిదివరకు తన యందును, తమయందును గల ఉత్సాహము, ధైర్యము చెదరి పోయినది. మానముతోడను, చీకాకుపడిన మనస్సుతోడను, దుఃఖముతోడను, తనపై వచ్చిపడిన విపద్భారముకింద నాతడపచ్ఛన్నముగ దిగబడిపోయెను. మే నెల 4వ తేదీన నడు వేసంగిని, మిట్టమధ్యాన్నపు టెండవేళ తన రాజప్రాసాదమందు సోఫాపై కూర్చుండి టిప్పుసుల్తాను తన మనోజలధి యందుపడి స్వప్నావస్థల దేలియాడుచున్న క్షణమందు, కోటవెలుపల ముట్టడికై వచ్చిమూగిన శత్రుమూకల ఘీంకారధ్వానము లాతనిని తత్స్వప్నావస్థనుండి ఉలికిపడి లేచునట్లు చేసి, కర్మ తనకొరకై త్రవ్విపెట్టియుండిన గోతిలోని కీడ్చుకొని పోయెను. కోటద్వారములు బద్దలు కొట్టబడెను; చెదరిపోయిన తన సేనల కూర్చుకొనుటకై టిప్పుయత్నించుచుండెను; కాని, నిరర్థకమయ్యెను; ఏలననగ, ఆ క్షణమందే టిప్పు హతుడై నేల కొరగెను. ముష్కరమూక లాతని రాజధానిని కొల్లగొట్టి ఆతనిని ఆతని రాజవీధులయందే కాళ్ళ క్రింద మట్టగించిరి !

హా ! మైసూరు రాజ్యలక్ష్మి యీరీతిగ అస్తమించెను ! మైసూరు రాజ్య మహావృక్షము నేలగూలెను ! దానివిఖండిత

శాఖలనుండి యశఃపత్రముల ద్రుల్చి, తమకు తగిలించుకొన్న వారిని గూర్చి చెప్పుట కేమి యున్నది? యేమియు లేదు. తద్రాజ్యమును బూడిద పాల్జేసి, తద్విభూతిని దోచుకొని పోయినవారి పేర్ల నిట నుచ్చరించుటకైనను మాకు మనస్కరింపకున్నది. భటుడు అన్యాయపక్షమున పోరాడబలవంత పెట్టబడినప్పుడు సైతము అతని వృత్తియొక్క యోగ్యతను గూర్చి ధర్మాధర్మ నిరూపణ చేయబూనుట రాచకీయ చారిత్రకుని పనికాదు. భటు డెట్లును నిందార్హుడుకాడు. నిజముగ నిందార్హమగునది రాజ్యాంగ విధానము. ఏతాంత్రికమగు కుట్రయైతే రహస్యముగ పన్నబడినదో, యేసంకల్పము నైతే మనస్సులో పెట్టుకొని, పైకి మాటిమాటికి "ఎబ్బెబ్బే, మాకా సంకల్పములే" దని దొంగబట్లు పెట్టుకొనుచుండిరో,- అది, ఆ సంకల్పము, ఆరాజ్యాంగతంత్రము నిజముగ నిందార్హమైనది. అంతేకాని, ఆతంత్రమును నిర్మొగమోటముగ, బహిరంగముగ, ధైర్యముగ, కొనసాగించిన కేవల సాధనమాత్రులగు భటులుకారు నిందార్హులు. మైసూరు రాజ్యము, జయింపబడినరాజ్యముల జాబితాలోనికెక్కెను. వెనుక హైదరాలీ చే రాజ్యభ్రష్టత నొందింపబడిన హిందూరాచకుటుంబములోని ఒకానొక పసివానిని వెతకి తీసికొనివచ్చి తాత్కాలికముగ మైసూరు గద్దెపై కూర్చుండబెట్టిరి. ఆ కుర్రవాని బంధువులును, మిత్రులును రెండు ఒడంబడికలకు ఒప్పుకొనునట్లు ఖరారు చేసికొనిరి. అవేవనగా:—(1) కనర, కోయంబత్తూరు, వైనాడు, శ్రీరంగపట్టణ మండలములు యింగ్లీషువారి కిచ్చివేయవలెను. గుర్రంకోట, గుత్తి వగైరా హైదరాబాదు

ప్రాంత మండలములు నైజాము కిచ్చివేయవలెను; యింకొక మండలమును మహారాష్ట్రమువారి కిచ్చుటకొరకు అనామతు లో నుంచవలెను. ఇది మొదటి ఒడంబడిక. బలిష్ఠమగు కుంపిణీవారి అద్దెసేనలను, మైసూరు వారికి మిగిల్చిన ఆ కొలది రాజ్యములో నుంచుకొనవలెను; సర్వాంసహాధికారు లగు బ్రిటిషువారికి యీ మైసూరు రాజును, ఆతని వారసు లును సదా సామంతులై లొంగియుండవలెను. ఈ రాజ్యము యొక్క ఆంతరంగిక ఆర్థిక వ్యవహారములలో యెట్టి చిన్నవివర మందైనను తనకవసరమని తోచినప్పుడు వైస్రాయి జోక్యము కలిగించుకొనుట కధికారము గలిగి యుండవలెను. ఇందుకు ప్రతిఫలముగ మాత శేషమగు పితార్జిత రాజ్యము నీ కుర్రవానికి భద్రముగ దక్కునట్లు కుంపిణీవారు గట్టిగ పూచీపడిరి. "ఈ రాజ్యమం దింతటి యల్లకల్లోలము, విప్లవము జరుగుతూవుంటే ప్రజలందరు తమకేమి పట్టినదన్నట్లుగ, ఊరక (దేబెలవలె) చూచుచు ఊరకుండిరి. మెట్టవేదాంతపు నిస్సంగబుద్ధితో చూచుచు నూరకుండిరి." అని కర్నల్ వెల్లస్లీ (వైస్రాయి తమ్ముడు) వ్రాసెను. టిప్పుయొక్క పతనముచే గలిగిన నిశ్చే తనావస్థనుండి కొంత కాలమునకు తెప్పరిల్లి లేచి, చిల్లర యుద్ధములను సాగించుటకుగాను తగు పరికరముల సమకూర్చ కొందరు పాలెగాండ్రు ప్రయత్నించిరి. ఇట్టి నిరర్థక యత్న ముల నణచివేయుటకు దిట్టమగు సైన్యము లంపబడెను. విశేష కాలయాపన గాకుండ, వీరి నందరిని త్వరలో మాతమార్చుటకు గాను, బహు సులభోపాయము లవలంబింప బడినట్లు కనబడు చున్నది. ఈ విజయలాభమును దిట్టపరుచుకొనుటలో తన

వంతుకు తాను చేసిన పనినిగూర్చి మనోర్రి యిట్లు వ్రాయు చున్నాడు:— "విఠల్ హెగడాను, వాని కొడుకులను, యేజెంట్లను అందరిని పట్టుకుని ఒక్క దెబ్బలో ఉరి తీయించి వేసినాను; దేశద్రిమ్మరిరాజా ఇకమీద యెవ్వడైనా తిరగపడ డానికి సాహసించాడంటే, వాడిని పట్టి వల్లార్చడం నాకొక్క క్షణం పట్టదు."

ఇండియాలోని ఆంగ్లేయరాజ్యములో యీ వెల్లస్లీ పరిపాలన ప్రధానమగు ఘట్టముగనున్నది. ఇదివరకు సమ గ్రమగు రాచకీయ ప్రయత్నమేమియు లేకుండెను; ఆకొరత నిప్పుడీతడు తీర్చెను. రాజ్యముల జయించుపనికి యిదివర కొక త్రోవ తెన్నులేక, చెదురువాటుగ జరుగుచుండెను; దీనియందు రాచకీయ దూరదృష్టి యేమియు లేకుండెను. చేతికెప్పుడేది దైవవశాత్తు దొరికితే, దానినే పట్టుకొనుట తప్ప, వీరు బుద్ధిపూర్వకముగ ముందు పన్నాగములు పన్ని పట్టుకొను పద్ధతి యిదివరకు లేదు. ఇట్టి చెదురువాటు పద్ధతిమూలముగ, యీ 40 యేండ్లలో కుంపిణీవారు 2 లక్షల 20 వేల చదరపుమైళ్ళ రాజ్యమును యేదోవిధముగ సంపాదింప గలిగిరి. "ఇంతేచాలు; దీనిని మనము పోగొట్టుకోకుండా భద్రముగ జాగ్రత్తగ కాపాడు కొంటేచాలు—అదే మనకు లాభము" అని సీమలో చాలా మంది బుద్ధిమంతులును దేశాభిమానులునునగు పెద్దలు తలంచిరి. కుంపిణీయొక్క వర్తకలాభమే ప్రధాన ముగ పెట్టుకొని, దానినే పదిలముగ కాపాడజూచుకొని పెద్దలు కొందరు యిక యుద్ధాల జోలికి పోకుండ కోస్తాలకు

దగ్గరగ మకాముల నేర్పరచుకొనియుండుట క్షేమకరమని తలంచిరి. ఇరుగు పొరుగు రాజ్యములవారితో గిల్లి కజ్జాలకు పోక, వారితో పొందు గలిగియుండి, వారిబాకీలను సరిగ సకాలమున కిచ్చివేయుచు, లోపలి రాజ్యములనుండి గుడ్డలను, తదితర సరుకులను తమ డిపోలకు తెప్పించుకొనుచు, హాయిగ వర్తకము చేసికొనుచునుండిన చాలునని యీరకపు పెద్దలు చాలమంది ఇక్కడయిండియాలోను సీమలోను కూడ తలంచిరి. "ఇట్లుగాక, యీలోపలి రాజ్యములకూడ నాక్రిమించుకొనవలెనని మనము దురాశకు పోయినచో, ఆరాజ్యముల వారితో మనకు ఘర్షణ రాకమానదు; దానితో భారతప్రిజలకు మనయందు అపనమ్మకము, అసహ్యాము కలుగక తప్పదు. కావున మన కెందు కీగొడవ, మనవర్తకము మనకు చల్లగవుంటే అంతే చాలు" నని కొందరు బుద్ధిమంతులు తలంచిరి. వెనుక మూర్షిదాబాదులో క్లైవును, రోహిలాఖండములో హేస్టింగ్సును, బారామహాల్ పరగణాలో మ్యాత్యూసును, కొడగురాజ్యములో కారన్వాలీసును చేసిన దురంత ఘాతుకకృత్యముల కని విని యున్న పెద్దలు కొందరు-అంతరాత్మ ప్రేరణగల సుశీలురు కొందరు—పాపభీతిగల పుణ్యాత్ములు కొందరు—యికమీద రాజ్యాక్రిమణాలు సాగనిచ్చినయెడల యితరచోట్ల కూడ యిట్టి పాపిష్టికార్యము లే జరుగునేమో యని జంకిరి. అదిగాక, దూరపు ఆలోచన, దూరదృష్టిగల వివేకవంతులగు రాజనీతిజ్ఞులు కొందరు యిట్లని తమలో తలపోసిరి. వారిలో వారు ఒకరితో నొకరిట్లు చెప్పకొని గుసగుసలాడుకొనిరి:—ఏమని, "మనక్రింద యిప్పటికే

కావలసినన్ని సామంతరాజ్యాలున్నవి ; వీనినన్నిటిని స్థిరముగ నిలుపుకొని యేడిస్తే చాలులే ; ఇంకా కావాలని ఊరికే దురాశకుపోతే, అసలు ఊడుతుందేమో చూచుకోండి " అని హితముపదేశించిరి. అన్ని లక్షణములకంటె నిజముగ యిట్టి దూరదృష్టియేగద రాచకీయవేత్తలకు ముఖ్యముగ నుండ వలసినది. ఇది వారికి సహజముగ వంటబుట్టవలెను. ఇది ఒకరు చెప్పితే వచ్చేదా ? నేర్చుకుంటే వచ్చేదా ? కాని, కుంపిణీ సేనయం దొకానొక పడుచుఉద్యోగస్థు డుండెను. ఆతడు కుటుంబాభిమానముచే తనతోటి యుద్యో గసు లందరికంటె చాల ముందుగ పైకి వచ్చెను. ఆతడీ రాజ్యాంగ విషయములనుగూర్చి తరుచు లోలోన ఆలోచించు చుండెడివాడు; తన ఆలోచనలలో తేలిన సారాంశములను గూర్చి అప్పుడప్పుడు సీమలో నున్న తన స్నేహితులకు రహా స్యముగ వ్రాయుచుండెడివాడు. 1799 సం॥ లో మైసూరు పై వెడలిన దండయాత్రయందీతడు మొదటినుండియు, చివరి వరకు నుండెను. మైసూరు రాజ్యమును పగులగొట్టి పంచు కొనుటకై యేర్పడిన కమిషనులో యితనికి శెక్రెటరీ పనికూడ నిచ్చిరి— కేవలము అభిమానంచేతలేండి; యీతడు రణరంగ ములో చేసిన మహా ఘనకార్యముల చూచికాదు. ఈతని పేరు తామస్‌మన్రో. "ఇంకా యితర రాజ్యములపై పడి, వానినికూడ జయించుదా" మను గుడగుడాలోచనలు రోజు రోజు వైస్రాయిగారి యింట్లో జరుగుచుండెను. ఇట్టి యాలో చనలు మంచివి కావని వాదించుచు వైస్రాయి తమ్ముడగు ఆర్థర్ వెల్లస్లీ యనునాతడు యీ మన్రోకు రహాస్యముగ నుత్త

రము వ్రాసెను; దానిలో యిట్లున్నది :—"మహారాష్ట్రుల తోటి వ్యవహారము యేదోరీతిగ ముగించుకోవలెననుమాట నిజమే. దానికి నేనూ వప్పుకుంటా. అట్లే మలబారు రాజుల విషయముకూడ పరిష్కరించుకోవాలిసిందే. కాని, మనమింకా యెగబ్రాకాలని చూస్తేమాత్రము పై వ్యవహార ములు చక్కబడవని నాభయము. దానివల్ల మన శత్రువులసంఖ్య హెచ్చవుతుందిగాని, తగ్గదు." కాని, తన నైజగుణమును చూపించు యింకొక చిన్న మాటమాత్ర మతడు చిట్టచివర (తేలుకొండివలె) అతికించెను. ఏమని:—"పాపము యిక ప్రజల కోరికలో అంటావు; వాని సంగతి మన మాలోచించ లేదుగా" అన్నాడు వెల్లస్లీ తమ్ముడు.

కాని, తమదేశమిట్లు పరాధీనమగుటను ప్రజలు ఉపే క్షా భావముతో చూచుచు నూరకున్నారనుమాట శుద్ధఅబద్ధ మని ధీరోదాత్తులగు ఆంగ్లేయ విలేఖకులు వ్రాసిన వ్రాతల వల్లనే స్పష్టముగ ఋజువగుచున్నది. వారు వ్రాసిన గ్రంథ ములలో ప్రతి పుటయందును యీ సత్యము వెల్లడియగు చున్నది. మిల్లు అనునాతడు వ్రాసిన గ్రంథములో నేమున్నది? "టిప్పు పరిపాలన క్రింద మైసూరు రాజ్యము సర్వసస్యాఢ్యమై యొప్పుచుండెను. సమస్తపంటలు ఉత్తమోత్తమమగు రీతిని సాగుబడి చేయబడుచుండెను. భారతవర్ష ప్రజలందరిలోను మైసూరుప్రజలు టిప్పురాజ్యములో సమస్త ధనధాన్య సంపద లతో వర్ధిల్లుచుండిరి. కాని, యింగ్లీషువారి రాజ్యముక్రింద నున్న అయోధ్య, కర్ణాటకరాజ్యములు జనశూన్యమై నిర్జనా రణ్యములై పోవుచుండెను. ప్రపంచములో యింతకంటె

దౌర్భాగ్యదేశములు లేనట్లుండెను. దేశపరిస్థితుల కెంత మాత్రము సరిపడని దిక్కుమాలిన చట్టముల తీసికొనివచ్చి ప్రవేశపెట్టుటచే బంగాళాదేశము నికృష్టమగు దుష్పరిపాలన వల్ల కలుగవలసిన యావత్తు కష్టములను, నష్టములను ఏడుస్తూ భరించుచుండెను."

దత్తమండలము లనబడు బళ్ళారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలను టిప్పు నుండి తీసుకొని, కొద్దిరోజులు నామకః నైజాము చేతిలో పెట్టి, ఆతనిని ఆడించిరి. పని తీరిన పిదప ఆతని చేతులోనుండి యూడలాగుకొని నిజముగ అధికారులగు కుంపిణీవారు వానిని తామే కాజేసిరి! ఈ జిల్లాలను మన్రో చేతిక్రింద నుంచి, అచ్చటి ప్రజలపై పన్నులను హెచ్చుచేయవలసినదని అతనిని కోరిరి. మొన్నటి యుద్ధములో గలిగిన నష్టములవల్లను, దానికి ఫలితముగ వచ్చిన కాటకమువల్లను, ప్రజలు వెనుక టిప్పుసుల్తానున కిచ్చు చుండిన దానికంటె హెచ్చుపన్నుల నిచ్చుకొనుటకు కేవలము అశక్తులై యున్నారని చెప్పి క్రింది యుద్యోగస్థులు మన్రోతో చెప్పిరి. క్రింది యుద్యోగస్థులు తనకు చెప్పినంత హెచ్చుగ ప్రజలు నిజముగ నష్టపడ్డారో లేదో పరిశీలించి చూచుటకు గాను మన్రో సర్క్యూటు బయలుదేరెను. అంతను పరిశీలించిన పిమ్మట ఆతడిట్లు చెప్పెను. "వీరు చెప్పిన మాటలలో కొంతవరకు అతిశయోక్తి యున్నమాట నిజమే. కాని, అంత హెచ్చుగ లేదు. చాలాయిండ్లు కూలిపోయి యున్నవి. దేశములో నాలుగోవంతు యిండ్లలో కూడ ప్రజలు లేరు. అయినప్పటికి, యిక యేడేండ్లలో మనము వేసిన పన్నును

పూర్తిగ ప్రజలు యిచ్చుకోగలరు. ఆవిషయమై నాకేమీ సందేహములేదు" అని అతడనెను. కాని, యింత దీర్ఘకాలము— యీ యేడేండ్ల వరకు— ఓపికతో వేచి యుండుట కతనికొక యిబ్బంది వచ్చింది పాపము. ఏమనగ :— తన యుద్యోగ కాలములో సర్కారుకు ఎక్కువ రాబడిని చూపించి, వారి మెప్పును పొందవలెనని ప్రతి యుద్యోగస్థుడు చూస్తూవుంటాడు. మన మనోకుకూడ యిట్టి యిబ్బందే వచ్చింది. అందుచేత ఆతడు, ప్రజలనుండి త్వరత్వరగ హెచ్చు పన్నులను పూర్తిగ వసూలు చేయక తప్పినదికాదు— పాపము! "ఇంత త్వరలోనే ప్రజలను వత్తిడి చేయవలెనని నాకు లేదు. కాని, యేమిచేస్తాను? సర్కారు కక్కురితి అటువంటిది; సర్కారుకు డబ్బు కావలసివచ్చింది; అందుచేత, రైతులను న్యాయముగ చేయ వలసిన దానికంటె హెచ్చుగ వత్తిడి చేయవలసివచ్చింది" అని మనోయే వ్రాసికొనెను. ఈ కొత్త యజమానులగు యింగ్లీషువారు వేసిన పన్నులకు ఒప్పుకొనమని పాలెగాండ్రు చాల యెదిరించిరి. అందుచే మనో వారి నేమన్నాడు:-"వీళ్లంతా దొంగలు, దోపిడిగాండ్రు; శాంతమగు పరిపాలనను స్థాపించుటకు వీరు అడ్డుగ నున్నారు. కాబట్టి, వీళ్లను తక్షణమే యేదో విధంగా నాశనంచేసిపారెయ్యాలి" అన్నాడు మనో. వారి నేదో విధముగా లాలించి, హెచ్చుపన్నుకు వప్పుకునేటట్లు చెయ్యడానికి మనో యెన్నితంటాలు పడినను, తుట్టతుదకు యిద్దరు పాలెగాండ్రుమాత్రము "మేము ఒప్పుకొనము— ససేమిరా" అన్నారు. కాబట్టి, వీరిని ఒప్పించుటకుగాను 1802 సం॥ లో

పెద్ద సైన్యమును కదలించి తీసికొని వెళ్లవలసి వచ్చింది. "పుంగనూరు జమీందారు మహా చెడ్డవాడు; వీడి పొగరణచ డానికి వీడిమీద యెక్కువ పేష్కస్సు వెయ్యాలి. ఈ హెచ్చు పేష్కస్సుకు వీడు సాధారణముగ ఒప్పుకొనేటట్లు కనబడడు: కాబట్టి, వీడిమీదికి సైన్యాలనుకూడ తీసికొని వెళ్లడము అవ సరమయ్యేటట్లు కనిపిస్తోంది" అన్నాడు మన్రో. తమ దేశము పరాయి దేశస్థుల చేతిలో పడిపోతూవుంటే ప్రజలు మిట్టవేదాంతాలు చెప్పుకుంటూ, ఉపేక్షాభావముతో, నిస్సంగ బుద్ధితో వున్నారని పైన యెవరో చెప్పినారే! ఏది ఆ నిస్సంగ బుద్ధి? ఆ యుపేక్షాభావము? ఇక్కడ యెక్కడా యీ పాలె గాండ్ర విషయములో అది కనబడదే!

ఆత్మశ్లాఘ పరాయణుడగు వెల్లస్లీ మెదడునందు క్రొత్త క్రొత్తయూహాలు పుట్టుకొనివచ్చెను. పైన వివరించిన ఘనకార్యములకు సంతోషించి పార్లమెంటువారీతనికి ప్రభు బిరుదమునొసగి యింకొకమెట్టు పైకెక్కించిరి. దీనికనుగుణ ముగ యింకను గొప్పకార్యముల చేసి చూపించవలయునను నాశ యీతనికిపుట్టెను. అందుచే ఆనాటినుండి యీతడు చేయు ప్రతిపనియందు, వ్రాయుప్రతివ్రాతయందు యేదో ఒకక్రొత్త పంథా కనుపరుపవలెనని అతడెంతయో ప్రయత్నిం చుచుండెను. వేయేల, అతడొక నాటకపాత్రగ తయారయ్యెను. పాత్రోచితమగు వేషభాషల ప్రదర్శించుటకై యెంతో తం టాలుపడుచుండెను. కులీనస్త్రీ తన శరీరాలంకారముల నెంతో జాగ్రత్తగ దిద్దుకొనునో, యీతడుకూడ నట్లే తనరాజప్రతి నిధివేషము నంత శ్రద్ధతో, నంతప్రయత్నముతో గంటలకొలది

దిద్దుకొనుచుండెను. పై వేషభాషలవల్లనే డాబుదర్పముల వల్లనే, యీ లోకము చాలవరకు పాలింపబడుచున్న దని అతనికి గట్టినమ్మకముండెను. "నిజమగు అధికార ముండవలసినదే; కాని బహిరంగవేషముకూడ దానిలో ఒక అంగమే. దానిని కూడ—యిట్టి నిరపాయసాధన మును కూడ—యేల నిరాకరించవలెను? దాని వలన వచ్చిన నష్టమేమి? దానిని నిరాకరించవలెననుట వట్టి పిచ్చి" అని అతడనుచుండెను. ఆ రోజులలో డాబుదర్పములు ప్రక టించుట, యిండియాలో గొప్ప రాజ్యాంగలక్షణముగ నుండె డిది. ఇటీవల కుంపిణీవారిచే కూలద్రోయబడిన రాజులు మహాయాడంబరమగు దుస్తులు లేకుండాగాని, తళతళ మెరయు భూషణాలంకారములు, అధికార బిరుదములు లేకుండాగాని, వందిమాగధులచే పరివేష్టింపబడకుండగాని, యెన్నడు బయ టికి కనపడేవారు కారు. ఇప్పుడు యీకుంపిణీవారు కూడ అట్టి డాబుదర్పములు లేకుండ, సామాన్యవేషములతో ప్రజల కంట పడినట్లయిన వారు చాల నీరసముగ చూతురుగద. కాబట్టి యిట్టి మార్పుచేయుట ప్రజల పూర్వాచారములకు భంగము కలిగించినట్లగుననియు, అట్లు చేయుట రాజనీతి దృష్టిలో వివేకము కాదనియు కుంపిణీవారు తలంచిరి. కాబట్టి నాటినుండి నేటివరకు వచ్చిన వైస్రాయిలందరు ప్రజల దృష్టియందు డాబుదర్పముల బ్రకటించుట యెట్లాయని నానా, మహాతంటాలు పడుచుండిరి. "డాబు గానే యుండవలెను, కాని మరి అట్టి విపరీతపు డాబుగానూ ప్రదర్శింపకూడదు; రాజదృష్టి మహోన్నతముగాను, గంభీరము

గాను వున్నట్టు కనపడవలెను; కాని ఆట్టే తలతిరిగిపోయి, మేఘాలలో మాయమయి పోనూకూడదు. ఎట్లా యీ అవస్థ— అని పాపము యిదోబాధ యేర్పడినది ప్రతి వైస్రాయికి! వెల్లస్లీకి యిట్టి వేషములు వేయుటయందు సహజమగు కౌశల్యముగలదు. పరివేష్టితబృందముయొక్క ప్రేమకు యితనికంటె యెక్కువగ పాత్రమైన వాడింకొకడు లేడు. అయినప్పటికి అతనికింత చనువున్నప్పటికి, అతనినెవరు కూడ అప్రస్తుత ప్రశ్న లడుగుటకుకాని, (వేళాకోళము లాడుటకుగాని) జంకెడివారు. అతడు సహజముగ విసుగుదల మనిషి; చిరాకు స్వభావముగలవాడు. కాని యితరులతో మాట్లాడునపుడు మంచి మర్యాద, ఔదార్యము చూపును. అందుచేత తరుచుగ యితడు బేసబబుగ మాట్లాడినప్పటికి, మూర్ఖపుపట్టు పట్టినప్పటికి, అందరు అతనిని ప్రేమించకుండ, గౌరవించకుండ ఉండలేకపోయేవారు. మైసూరు దండయాత్రలో దోచుకున్నడబ్బులో 10 లక్షల రూపాయలితనివంతు వచ్చుట మామూలు. కాని యితడుదానిని పుచ్చుకోలేదు. ఈతనికి పితార్జితమైన ఆస్తి విశేషములేదు. చూడబోతే యెక్కువ ఖర్చుదారుడు; అయినప్పటికి "నావంతు పది లక్షలు నాకక్కరలేదు; మీరేతీసికోండి" అని శిపాయీలకందరికి యిచ్చివేసెను. ఈడబ్బుతో ఆస్తిగొనుక్కొనుటకంటె, శిపాయిల మెప్పునే కొనుక్కొందమని ఆతడు ఊహించెను. ఆతనికి గొప్పశక్తిసామర్థ్యములే యుండెను. కాని అవి అతని ఆశలను అందుకొనలేకపోయెను. ఆతడీ పరిస్థితులలోగాక యింతకంటె భిన్నపరిస్థితులలో నుండియుండినయెడల

ఆతని యాశలన్నియు పూర్తిగా విఫలమై పోయెడివే. ఇంతపని ఆత డిండియానుండి వెళ్ళిన తరువాత యింకొక చోట జరిగితీరినది. ఆపనియే యిక్కడ యిండియాలోనే జరిగేది—ఆతడింతకంటె భిన్నపరిస్థితులలో నుండియుంటే. కాని, యిండియాలో ఆతని రోజులు బాగుండెను; కాలము కర్మము కలిసివచ్చినవి. ఆరోజులలోనున్న శివిల్ మిలిటరీ శిబ్బందీ లలో మంచి శక్తి సామర్థ్యములు గలవారుండుట దైవవశాత్తు తటస్థించినది. అందుచే వెల్లస్లీ ఆటలు సాగినవి. ఇట్టి అను కూలపరిస్థితులు అనన్యసామాన్యమైనవి. ఇట్టివి యింకే వైస్రాయికిని లభించలేదు. మాల్కాం, క్లోడ్, హారిస్ మాల్కో, ఎడ్మింటన్, స్టీవార్టు మున్నగు ఘటనాఘటికులుం డిరి. ఇతని తమ్ముడుకూడ అప్పుడిండియాలోనే యుండెను. భారతవర్ష రాజ్యాంగవిషయములలో నేమి ఆంగ్లదేశ రాజ్యాంగవిషయములలో నేమి యీ అన్నదమ్ము లిరువురికి చాల భిన్నాభిప్రాయము లుండెడివి. ఎటులయినను తనపేరు పైకిరావలయు ననునదే వెల్లస్లీయొక్క గొప్పకోర్కె. అతని జీవితములో దానినే యతడు ప్రధానవిషయముగ పెట్టు కొనెను. ఈకోర్కెను తీర్చుకొనుటకదేమి యాశ్చర్యమోగాని, ఆరోజులంత మహా అనుకూలముగ నుండెను! విచిత్రము!

నూతన శతాబ్దము (అనగ 1800 సంవత్సరము) నలు ముఖముల శాంతితో ప్రారంభ మయ్యెను. ఒక్క విషయ ములోతప్ప తక్కిన అన్ని విషయములలోను వైస్రాయి వేసిన పథకములు జయప్రదముగ నెరవేరెను. కష్టములు వచ్చి నప్పుడు వానిని ధైర్యముతో నెదుర్కొన్న పటిమ, వానిని

జయించినప్పుడు చూపిన మహోదారభావము సర్వజనులచే వేనోళ్ల పొగడబడెను. అతనికి కావలసిన దగ్గర మిత్రులు చాల సంబరపడిరి; స్తోత్రపాఠకులు భళిభళీయనిరి. పరాభూతులగు శత్రువులు పెదవి కదల్పకుండ తలలొగ్గి యుండిరి. "ఆః! యేరి కోరి నేను తెచ్చిపెట్టిన మనిషి యింతవాడైనాడు గదా"యని పిట్టుమంత్రి లోలోన యెంతయో సంతోషపడెను. ఏరి కోరి, వరింపబడిన యీ మనిషి తనను చూచుకొని తనలోతానే మురియుచుండెను. కాని యితనివల్ల కుంపిణీ వారికి మాత్రమేమియు గిట్టుబడి కాలేదు. తన యజమానులగు వర్తక స్వాములు తమ స్తుతివాక్యములతోపాటు యీ యుద్ధమువల్ల హెచ్చయిన అప్పునుగూర్చి సణుగుళ్లను గొణుగుళ్లను కూడ కలిపి పంపిరి. అసలీ యుద్ధపుఖర్చు యింత యెందు కెక్కువైనదో, అథవా అయితే యుద్ధానంతరము దీని నెందుకు కూడదీయలేదో, యీ సంగతులన్నీ కుంపిణీ భాగస్వాముల కెంత జెప్పినను బుర్ర కెక్కకుండెను.

కవ్వించి పరరాజ్యాక్రమణలు చేయుటయనగ తన పేర్లపై యెక్కువ లాభములు వచ్చుటయేయని కుంపిణీ భాగస్వాములు తలంచుచుండిరి. (కీర్తి, పేరు ప్రతిష్టలతో వారికి పనిలేదు.) కుంపిణీయను తెల్లయేనుగనెక్కి—— తేరగనెక్కి—— మహా వైభవముతో, మహా సాహసముతో స్వారిచేయు యీ వెల్లస్లీ ప్రభువునకు తన పేరుప్రతిష్టలు చాటుకొనవలయునని ఆశవుంటే వుండనీ. కాని దానివల్ల కుంపిణీ భాగస్వాముల కేమి ప్రయోజనము. ఈ తెల్లయేనుగను (యీ కుంపిణీ భాగస్వాములను) పోషించు భార మెవరిది? ఈ తెల్లయేనుగుకు

(భాగస్వాములకు) ఆకలి మెండు. దీనికి మదమెక్కినప్పుడు స్వాధీనపరుచుకొనుటకూడ చాల దుర్ఘటము. కాబట్టి యీ జంతువును యెట్లు పోషించి అదుపుఆజ్ఞలలో వుంచుకుందామా యనునదే కుంపిణీ డైరెక్టర్ల కెల్లప్పుడు ముఖ్యమగు ఆలోచనగ నుండెను. ఈ జంతువును కొత్త పచ్చికబయళ్లలోనికి తోలి యిరుగుపొరుగువాళ్ల చేలల్లో నిర్భీతిగ మేసేటట్లు చేస్తే మంచిదే— బలే సంతోషమైన సంగతే. కాని, దూరస్థమగు విజయ పర్వతాగ్రమున మహా వైభవముగ నధిరోహించి అక్కడనుండి మరల క్రిందికి జారిపోయినయెడల నేమి ప్రయోజనము? ఈమధ్య నెన్ని విజయపతాకము లెగురవేసిన నేమి? ఎన్ని జయఘంటాధ్వనుల జాటంబంపిన నేమి? దిశలు చెవుడు పడునట్లు యెన్ని ఫిరంగులు, యెన్ని ఢంకాలు మోగించిన నేమి? వీని యన్నిటివలన కుంపిణీ భాగస్వాముల కేమైన ఒక్క దమ్మిడీయైన యెక్కువ లాభము వచ్చునా? ఇదంతయు శ్రమకు దగిన ఫలితముగ కుంపిణీ భాగస్వాముల కెంతమాత్రము కనిపించలేదు. (ఈతకు తగిన మేతగ కనుపడలేదు.) ఫ్రెంచివారి ప్రభ యిండియాలో వెలుగకుండ, ఆరిపోయినదని సీమ గవర్నమెంటువారు సంతోషించవచ్చును. మైసూరు రాజ్యమును పగులగొట్టి పంచుకొనుటలో కుంపిణీవారు చూపిన మాయానటన పూర్వకమగు విచిత్ర యౌదార్యమును చూచి పార్లమెంటులోని బర్కు శిష్యులు సంతోషించవచ్చును. కాని యీ గొడవలేమియు కుంపిణీ భాగస్వాములకు పట్టలేదు. "ఈ యుద్ధాలకైన ఖర్చంతా యెవడు భరిస్తాడో యెల్లా భరిస్తాడో చెప్పు" అని విజయోద్ధతిచే మురియుచుండు వెల్రస్లీ-

యుని (వెల్లస్లీని) కుంపిణీ భాగస్వాములు నిగ్గదీసి యడుగ సాగిరి.

తన గొప్పతనములను శక్తిసామర్థ్యమును వీరు గ్రహించ లేకపోయినారుగదా యని వెల్లస్లీ చాలవిసుగుకొనెను. ప్రఖ్యాత భారతవర్ష మహాసామ్రాజ్యాధిపత్యమందు తాము భాగస్వాములయ్యు రూపాయి అణాల పైసలయందు వారు చూపు యీ నీచ లుబ్ధ బుద్ధినిచూచి అతనికెంతో అసహ్యము వేసెను. అందుచే "యెప్పటికేది అవసరమో, యిక్కడ యెప్పుడెట్లు ప్రవర్తించాలో, మీఅందరికంటె నాకేయెక్కువ బాగా తెలుసులెండి, పొండి" అని అహంకారముతో నాతడు సీమలో కుంపిణీవారికి వ్రాసెను. మరియు "నేనిప్పు డవలం బించిన యీ పద్ధతివల్ల ముందు మీ కనేకమేళ్లు కలుగగలవ"ని చెప్పి దానివల్లవచ్చు సూక్ష్మలాభములనుగూర్చి తన సహజ గంభీరశైలిలో వ్రాసిపంపెను. ఎప్పుడో యికముందు లాభ ములు రాగలవనిచెప్పిన యీ చప్పిడిమాటలవల్ల కుంపిణీవారి కేమియు నచ్చలేదు. ఈ వృత్తరమునుబట్టిచూడగ యీ వెల్లస్లీ తమమాటవిని, తమ అదుపుఆజ్ఞలలో ఉండేటట్లుకూడ కనిపిం చలేదు. అందరికి యెదురుతిరిగి తన దోవనే తానుపోయే టట్లుకూడ కనిపించినాడు. మైసూరు రాజ్యము జయించినం దుకుగాను చక్రవర్తి యీతనికి ప్రభుబిరుదముకూడ యిచ్చాడు. ఇంక కొంపతీసి, యీ ఉత్సాహములో యింకే సాహసపుపనులు చెయ్యడానికి యీతడు దుముకు తాడో యెవడు చెప్పగలడు ? అప్పుడే సూరతు రాజ్యసింహా సనమునకై (నవాబునకు మహారాష్ట్రులకు) కలిగిన కల్లోల

లబలబలాడజొచ్చిరి. (అయ్యో, అయ్యో, యివేమి అఘాయిత్యపు పనులు అని లబలబలాడిరి.) కాని సీమ ప్రభుత్వము వారు మాత్రము వైస్రాయికి వెనుకనుండి కనుగలిపి మద్దతు చేయుచుండిరి; సర్వాంసహాధికారము తనచేత చిక్కుటచే వెల్లస్లీయు మహానందములో తేలియాడుచుండెను. కావున, కుంపిణీ భాగస్వాముల లబలబలను—యీ మొత్తుకోళ్లను—ఆతడు లక్ష్యము చేయునా? "పరాయి రాజ్యాలజోలికి పోవద్దు, డబ్బు ఖర్చుపెట్టవద్దు" అని కుంపిణీవారు నిత్యా వ్రాయుచుండు ధర్మపన్నాగములన్నియు అతనికి రుచించునా? ఈ పిచ్చి ధర్మపన్నాగములను నమ్మి అతడు తన పనిని మానుకొనునా? కుంపిణీవారు నిత్యా వ్రాయుచుండు యీ జాబులవల్ల అతడెంతమాత్రము చలించలేదు; ఇవన్ని తనను కలవరపరచి విసిగించుటకే కుంపిణీవారు వ్రాస్తున్నారని యెంచి, వాని నాతడెంతమాత్రము లక్ష్యముచేయక బుట్టదాఖలు చేయుచుండెను. నిజయశోదర్పణమందాతడు తనను చూచుకొనగ, భారతవర్షమందలి యాంగ్లసామ్రాజ్యనిర్మాతగ అతని ముఖమా దర్పణమందు ప్రతిఫలించుచున్నట్లాతనికి స్పష్టముగ కనిపించెను. తత్సామ్రాజ్య సౌధనిర్మాణమునకై ఆదియందు క్లైవు నేలపై ప్లానుగీచి వెళ్ళెను. పై సౌధము యొక్క వివరములు, దానికి కావలసిన మదింపులు—అన్నియు హేస్టింగ్సు తయారుచేసి పెట్టిపోయెను. ఆప్లానుల వగైరాల ప్రకారము పనిలోకిదిగి పూర్తి చేయవలసినవాడు యీతడు—వెల్లస్లీ.

ఇంగ్లీషువారు జోక్యము కలిగించుకోవడానికి అయోధ్యా వ్యవహారములు చాల అనుకూలముగ వున్నవి. 1797 సం॥లో సర్ జాన్ షోర్‌తో చేసుకొన్న ఒడంబడిక ప్రకారము అయోధ్య వజీరు కుంపిణీవారికి సాలుకు 26 లక్షల రూపాయలు కప్పము కట్టునట్లును, బ్రిటీషువారి ఫౌజు పదమూడు వేలకు మించినప్పుడు అంతకెక్కువ సొమ్మిచ్చునట్లును యేర్పాటు జరిగెను. ఇతర రాజ్యములవారెవరితోకూడ అయోధ్య వజీరు సాంగత్యము చేయరాదు. కుంపిణీవారి అనుజ్ఞలేనిది యితర విదేశీయుల నెవరని తనపొలిమేరలో అడుగుపెట్టనీయరాదు. ఇట్టి నీచమగు షరతులవల్ల హతశేషమగు నా వజీరు రాజ్యమందు తదాప్ప్రి ప్రజల కెంతటి గౌరవముండునో, దాని వలన ఆతని రాజ్యము నానాట యెట్లు నీరసించిపోయెనో మనము చెప్పజాలము. (కాని, యింతవరకు మాత్రము మనము చెప్పగలము.) ఏమనగ 1801 సం॥లో ఆత డివ్వవలసిన కప్పము బకాయపడెను. దేశమంతయు భిన్నాభిన్నములై పరమదార్భాగ్యస్థితికివచ్చెను. తన యధికారము నిర్వీర్యమై పోవుటచేతను, అనేక కష్టములువచ్చి తనను చుట్టుకొనుటచేతను, పాపమా హతభాగ్యుడగు నవాబు నిరాశాహతుడయ్యెను. అప్పుడే వెల్లస్లీ తన దృష్టిని యీ నిర్భాగ్యుడగు నవాబుపై తీవ్రముగ బరపెను. "ఈ రాజ్యముయొక్క బాదరబందీ యంతా నీ కెందుకు ? ఈ అవస్థలన్నీ నీవు పడలేవు. ఈ అవస్థలన్నీ మాకు వదిలేసెయ్యి ; ఆ బాధలన్నీ మేమే పడతాము. నీవుమాత్రము హాయిగ కాలుమీద కాలువేసుకొని కూర్చొని సమస్త రాజోపచారములను, రాజ్యముయొక్క హోదాలను,

డాబుదర్పములను అనుభవించుచుతూవుండు" అని వెల్లస్లీ ప్రభువు యీ వజీరుకు ఉత్తరములమీద ఉత్తరములను బలే చమత్కారముగ వ్రాసిపంపించెను. ఈ ఉత్తరములలోని చమత్కారవచన రచన మహాద్భుతము. దానికదేసాటి. "ఇట్లా చెయ్యడానికి నీ కిష్టము లేకపోతే, యీ అద్దె సేనల కయ్యే ఖర్చుకిృంద మాకు అలహాబాదును మరియింకొక తొమ్మిది జిల్లాలను యిచ్చివేస్తే చాలు" అన్నాడు వెల్లస్లీ. వజీరు పాపమీ రెండోపరతుకే వప్పుకున్నాడు. దీనివల్ల కుంపిణీవారి కెప్పుడు కోటి రెండు లక్షల యాభై వేల రూపాయలకు మించిన విలువగల రాజ్యభాగము లభించినది.

ఫ్రెంచి ఆఫీసర్లతో కూడుకొన్న సైనికదళములను దేశీయరాజు లిదివరకు తమ కొలువులలో నుంచుకొనుచుండిరి. ఇప్పుడు వారి నందరిని తీసివేసి వారికి బదులుగ యింగ్లీషు ఆఫీసర్లతో కూడుకొన్న యింగ్లీషు అద్దెసేనలను దేశీయ రాజుల కొలువులలో నుంచుట యెక్కువ శ్రేయస్కరమని వెల్లస్లీ తలంచెను. ఈ పద్ధతిలోనుండు లాభములను వేరుగ విప్పి చెప్పవలెనా? దీనినిబట్టి యేమర్థమేర్పడుచున్నది. "మేము మీ యింగ్లీషువారి సహాయమునుతప్ప, యింకొక యేయూరపియను జాతులవారి సహాయమును కోరము" అని చుట్టుపట్టుల నున్న దేశీయరాజు లందరిచేత గట్టిగ వాగ్దానము చేయించుకొన్నాడన్న మాట. అదిగాక యీ దేశీయరాజులందరు అట్లు యింకొకరివైపు పోవుటకుగాని, పోవుదమని రహస్యముగ కుట్ర పన్నుటకుగాని, ఆశించుటకుగాని యెంతమాత్రము ఆస్కారము లేకుండ గట్టిగ బిగించినాడన్న మాట. ఇంగ్లీషువారి

లాభములకుగాని, యింగ్లీషువారి రాజ్యాభివృద్ధికిగాని, ఆటంకమువచ్చు యెట్టి పన్నాగములు సాగకుండ ఆతడు గట్టి కట్టుదిట్టములు చేసినాడన్నమాట. ఈ అద్దె సేనల పద్ధతి దీనికొరకే ఉద్దేశింపబడినది. ఈ సంగతినే వారు ఘంటాపథముగ పల్కియుండిరి కూడాను. ప్రతి దేశీయరాజు వద్దను ఒక తెలివితేటలుగల యింగ్లీషు రెసిడెంటువుండి, అక్కడ అతని అనుపు ఆజ్ఞలలో వర్తించుచు సుశిక్షితమై, సాయుధమై, తేర జీతములుతింటూ చేతిలో యిమడగల చక్కని బలిష్టమగు సేన యొకటి వుండివుంటే, దేశీయరాజు లెవరుకూడ ఆకస్మికముగ యెదురు తిరుగలేరు. అట్లెదురుతిరుగ సాహసించిన యెడల వారి ప్రయత్నము తక్షణమే భగ్నమైపోవును. దేశీయ రాజు లెవరుకూడ రహస్యపు కుట్రలు పన్నలేరు; పన్నినను వానిని సాగించుట కెంతయో జంకుచుందురు. అంతగ వ్యవహారము మీరివచ్చి, బహిరంగపు తిరుగుబాటు జరిగినను, యింగ్లీషువారి సేనలన్ని కమ్ముకునివచ్చి పడేవరకు యీఅద్దె సేనలు కొంతవరకు పనిచేయుచుండును గద. ఆ రాజ్యములో యింగ్లీషువారి పక్షమందెవరైనావుంటే వారందరిని కూడదీసి ఒకచోట చేర్చడానికికూడ యీఅద్దెసేనలు పనికివచ్చునుగద. ఈఅద్దెసేనలు యేరాజ్యమందైతే వుంచబడినవో ఆరాజ్యపు ప్రజలకు, రాజుకుకూడ లోలోన అవమానము, పరిభవము కుట్టి తీవ్రముగ బాధించుచున్నను, పైకి మాత్రము దానిని డాబుగ ఉపశమిల్ల చేయుట కొకతంత్రమును పన్నిరి. ఆరాజ్యముయొక్క ప్రత్యేక వ్యక్తిత్వమును నామమాత్రమైన స్వాతంత్ర్యమును భంగపరుచుటలేదని పైకి చెప్పుటకు ఒకదొంగ

నటనను, ఒకదాంగ గౌరవమును చూపుట కేర్పాటుచేసిరి. ఎట్లనగ:—దేశీయరాజు కొలువునకు, కుంపిణీ కొలువునకు గల భేదము నెంతో జాగ్రత్తగ పట్టియుంచిరి. ఈఅద్దె సేనలన్నీ రాజుగారి ఖర్చుమీదనే సమకూర్పబడినవి; రాజుగారి ఖర్చు మీదనే పోషింపబడుచున్నవి. కాబట్టి యుద్ధములేని రోజులలో యీసేనల నెన్నడును తద్రాజ్యములోనుండి బయటకు కదల్చరు. యుద్ధసమయములలో సైతము రాజుగారి అనుజ్ఞ లేనిదే వీనిని బయటకు తీయరు. ఒకయినపగుండు తీసుకొని వచ్చి, చక్కగ మర్యాదగ దానిని ముఖమల్ దుస్తులతో నలంకరించి ప్రతిదేశీయరాజు భుజముకు తగిలించిరి. ఎంతో ఆదరముతో, ఎంతోయుట్టిపడు ప్రేమతో, యీ యినుపగుండును వారిభుజముపై పెట్టిరి. దానిని వద్దనడానికికూడ వీలులేదు. ఇది బలత్కారపుప్రేమ. ఈయినుపగుండు పాపమీరాజులకు మొదట చాలకఠినముగను, బరువుగనువుండెను; కాని కొన్నాళ్లయ్యేటప్పటికి అలవాటు పడిపోయినారు. "ఇక మనరాజ్యానికేమి భయములే, మనమెంత బేజబాబుదారిగా తిరిగినా ఫరవాలేదు; కుంపిణీవారి సేనలున్నవిగా ; అంతా వారే చూచుకుంటారులే" అనే నిర్లక్ష్యభావము, భద్రతా భావము, ప్రతిదేశీయరాజు మనస్సునందు నెమ్మదినెమ్మదిగ, రోజులవరుసను పెరిగిపోయెను. వీరికి సలహాలుచెప్పు మంత్రులు వగైరాలకుకూడ యిట్టిభావములే యేర్పడిపోయెను. దీనివలన వారి రాజ్యాధికారమంతయు పూర్తిగ నశించిపోయెను. పైపెచ్చు దేశీయరాజులందు నానాట నెమ్మదిగ పెరుగుచువచ్చిన యీనికృష్టభావము వారి రాజ్యాంగ శరీరమందొక పూతిమాం

సపు కంతిగ యేర్పడిపోయెను. ఈకంతిని యీదుర్మాంసమును కోయువైద్యుడు కానరాడు. దీనికి మందు లేదు.

ఈ అద్దెసేనలకగు ఖర్చువగైరా ఆర్థికవ్యవహారములు కూడ యింతటి నిర్దాక్షిణ్యముగనే, యింతటి కఠోరముగనే ఏర్పాటుచేయబడెను. రాజ్యము యిచ్చుకోలేనంత హెచ్చుగ లెక్కజూచి సైన్యపుఖర్చు రాజుమీదవెయ్యడము; ఆతడిచ్చుకోలేనిస్థితిరాగానే, ఆరాజ్యములో వచ్చు రెవిన్యూ అంతా మాకు శాశ్వతముగా ధారపోయమనడము — యిదిపద్ధతి! (ఇది విశ్వామిత్రుడు హరిశ్చంద్రుడు కథలాగుంది-) ఈ అద్దె సేనల పెట్టుటయనునది మొదట ఒకచిన్న మొలకగ పుట్టినది. దానివిత్తుకూడ ఆ మొలకలోనేవుంది. చిన్నదైననేమి పెద్దదైననేమి, అది తన బీజమును తనయందే యిముడ్చుకొన్న మొక్కయగుటచే అది తనజాతిఫలమునే యీనుచుండెను. అద్దెసేనల ఖర్చుకై కుంపిణీవారికి దత్తము చేయబడిన జిల్లాలలోనుండి సదరు ఖర్చుకుపూర్తిగ సరిపోయేరాబడి వచ్చిన పాపమున ఒక్కజిల్లాయైననుపోలేదు. ఎట్లుపోవును ? యీ లెక్కంతా మొదటవేసి చూచినదేగా ! ఆయాజిల్లాలపైవచ్చు రాబడియెంతో ముందుగ లెక్కవేసిచూచుకొని, దానికిమించునట్లేగా యీ సైన్యపుఖర్చు విధించినది! కాబట్టి ఆరాబడి యీ సైన్యపు ఖర్చుకెట్లా సరిపోతుంది ? ఇది యెరిగియుండి చేసిన దొంగతనమాయెను ! ప్రతియేటా కరదలాలు, బకాయలుగాక బాకీలు అంతులేకుండా పెరిగిపోయేటట్లు చేయడం; యీ బకాయ బాకీలన్నీ ఒక్కసారి కలిపి వానికింద 4, 5 యేండ్ల కొకమాటు కొత్త జిల్లాలను కుంపిణీవారికి

ధారాదత్తముచేసి, పాతబాకీ కడిగివేసుకోవడం; యీలోపుగ "యీ రాజు **మాకు** సరీగా డబ్బు కట్టడంలేదు. చాల అశ్రద్ధగా వుంటున్నాడు; మేమంటే యీ రాజుకేమి లక్ష్యము లేకుండావుంది" అని కుంపిణీవారు మాటిమాటికి ముఖము చిట్లించుకోవడము— యీ తంతంతా ప్రతియేటా జరుగడము మామూలైపోయింది. ఈ యద్దైసేనల పద్ధతిలోని సహజ స్వభావమువల్ల యీ తంతంతా అనివార్యమైపోయింది. ఆఖరుకు యెప్పుడైతే కుంపిణీవారు సర్వాంసహాధికారులై పోయినారో, వారవలంబించిన యీ పద్ధతి బహు కుటిలముతో కూడిన దుర్మార్గవృత్తియని పాలితప్రజలును— "కాదుకాదు యిది చాల మంచిపద్ధతి, యింతకంటె పరిపూర్ణ వివేకవంతమగు పద్ధతి యింకొకటి లేదని విజేతలగు ఆంగ్లప్రజలును చెప్పుకొనసాగిరి. కాని (నిష్పక్షపాతియగు) చరిత్రకారు డేమి వ్రాయుననగ "యీపద్ధతి నరములలోనికి శాశ్వతముగ నెక్కించిన విషమువంటిది. ఈ విషమువల్ల శరీరములోవున్న జ్వరము, తెరలు తెరలుగ వచ్చు పోట్లు కొంచెమాగును; వంటికి కొంచెము శాంతి హాయిగలుగును. కాని, తుదకు పక్షవాతమో చావో రావచ్చును; ఈ విషపు యింజెక్షనులే గనుక విశేష కాలము సాగించినామంటే, పక్షవాతము, చావుకూడ తప్పక కలిగితీరును; సందేహాము లేదు" అని చరిత్రకారుడు వ్రాయును.

గత అరవైయేండ్లనుండి భరతవర్షమందు త్వరితగతిని సామ్రాజ్యస్థాపనకై ప్రోగుపెట్టబడిన సామాగ్రికంతకు యిప్పుడు వెల్లస్లీ వచ్చి టిప్పును పడగొట్టి మైసూరు రాజ్యమును పంచుకొనుటవల్ల గలిగిన బలముచేత దిట్టమగు పునాది

వేసెను. ఈబలమును దానికై—ఆపునాదిని వేయుటకై—వినియోగించెను. మూర్షిదాబాదు, ఢిల్లీనగరములలో అద్దె సేనల నెలకొల్పుటకై వెనుక క్లైవు దేశీయరాజులతో నొడంబడికలు చేసుకొనెను. అట్లే హేస్టింగ్సును కాశీ, దక్కను రాజ్యముల వారితో నొడంబడికలు చేసికొనెను. కాని, వీరెవరుకూడ యీసూత్రము నంతకంటె విరివిగ ప్రయోగించుట కవకాశము లేనివారైరి. తమ మిత్రులనబడు దేశీయరాజులను యెన్ని కష్టనష్టములైనాసరే పడి శత్రువులనుండి రక్షించుతామని చెప్పి ఒప్పుకొనుటయు, తద్వారా వారందరిపై తమ సార్వభౌమాధికారమును ప్రతిష్టించుకొనుటయు—యీ రెండుపనులు వెనుకటివారు చేయుటకవకాశము లేకపోయినది. ఈ అద్దెసేనల కగుఖర్చుక్రింద ప్రతిరాజ్యమునుండి యేదో కొంత భాగమును కాజేయవలయునను ఉద్దేశము నీ సాహసిక పురుషుడు, రాజ్యకాంక్షాపరుడు వెల్లస్లీ గట్టిగపెట్టుకొనెను. ఈ రీతిగ అయోధ్యవజీరును బలవంతపరచి హతశేషమగు నాతని రాజ్యరక్షణకని చెప్పి అతని కొక అద్దె సేనను బలవంతముగ అంటగట్టి, దాని కగు ఖర్చుక్రింద అతని రాజ్యములో కొంతభాగమును కుంపిణీవారి కిచ్చునట్లు ఒడంబరచెను. ఇది 1801 సంవత్సరములో జరిగినకథ. పిమ్మట యీ విధానమునే పెంపొందించి, చిరకాలమునుండియు—శివాజీ కాలము నాటినుండియు—యెక్కువ నాగరికులును, భోగపరాయణులును నగు యిరుగు పొరుగు రాజ్యములవారికి లొంగక ధిక్కరించుచుండిన మహారాష్ట్ర రాజ్యములను కూడ లోబరుచుకొనవలెనని యీ వెల్లస్లీ ప్రయత్నింపసాగెను.

# భరతఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన

## 17 వ అధ్యాయము.

### మహారాష్ట్రులు 1802—1805



"మొదట సరకులకొట్లు; సరకులకొట్లల్లా కోటలైనవి; కోటలల్లా దుర్గములైనవి. ఈ దుర్గాల్లో మొదట సరకులు కాపాడుకోడానికి చిన్న శిపాయిదళాలు బయలుదేరినవి. యీ శిపాయిదళాలల్లా పెద్దసేనలైనవి. సేనలల్లా మహాదండయాత్రలైనవి. దండయాత్రలల్లా దేశాక్రమణలైనవి. ఈ రీతిగ క్రమక్రమముగ ఒకమెట్టునుండి యింకొకమెట్టుమీదికి ప్రాకి పోవడం మహాసులభమైపోయినది— సహజమైపోయింది. దీనివల్ల తుదకు జరుగవలసిందేమో జరిగేపోయింది. "మాకీ అపాయంవచ్చింది; అందుచేత మేమీ యుద్ధము చెయ్యాలిసి వచ్చింది" అనియేదో మిష చెప్పడం; అల్లా మిష చెప్పడానికి యేదీ— 'అపాయమనేది' దొరకకపోతే యేదోమరింకొక్క గిల్లికజ్జా రేపెట్టి యెట్లాగైనా యుద్ధముచేసితీరడం మనకుంపిణీవారికి మామూలైపోయింది" అన్నాడు ఫిలిప్ ఫ్రాన్సిస్ అను ఆంగ్లేయుడు 1787 సం॥ పార్లమెంటు సభలో.

1802 సం॥ ప్రారంభమందు వెల్లస్లీ తనవైస్రాయి పదవికి రాజీనామా దాఖలుచేసెను. కలకత్తాలో తనసహోద్యోగులును, సీమలో గవర్నమెంటువారును మెచ్చుకొన్నట్లుగ, కుంపిణీవారు మాత్రము తనపనిని మెచ్చుకొనలేదు. మహాసామ్రాజ్యవిజేతగను, గొప్పరాజ్యాంగ సంస్కర్తగను లోకములో పొగడ్తకెక్కవలెనని యాతడాశించెను. కాని యీరెంటిలోకూడ కుంపిణీవారితనిని ప్రోత్సాహపరిచే ధోరణిలో లేకుండిరి. మైసూరు యుద్ధపుఖర్చుబిల్లులు మంజూరు నిమిత్తమై తమయెదుటికి వచ్చేటప్పటికల్లా కుంపిణీవారికి పైప్రాణములు పైనపోయినవి. "అమ్మో, యింతఖర్చే యింతఖర్చే" యని గుండెలు బాదుకొనిరి. ఈ యుద్ధానంతర మింకను కొత్త రాజ్యముల మింగుటకై తంజావూరు, సూరతు, అయోధ్యరాజులతో వెల్లస్లీ గావించుకొనిన కుటిల మొడంబడికలను జట్టి చూడగ, యీఖర్చు యెంతమాత్రము తగ్గుసూచనలు గాన్పించలేదు. ఈ ఖర్చువిషయములో యెటు చూచినను తోవతెన్ను గానని మహాదరణ్యములో జొచ్చుకొనిపోవుచున్నట్లుగ వారికిగాన్పించెను. అదిగాక, వెల్లస్లీ యొక్క ఆశ్రితపక్షపాతము, శివిల్ యుద్యోగుల తరిఫీయతుకని చెప్పి, యీతడు చేయబూనిన పెద్ద యేర్పాట్లు, యివన్ని కూడ కుంపిణీ భాగస్వాములకు యెంతమాత్రము నచ్చలేదు. ఖర్చుననది వారికెంతమాత్రము గిట్టకుండెను. సీమలోనున్న తన కుంపిణీ యజమానులతో సంప్రతించకుండగనే, వారితో యెంతమాత్రము చెప్పకుండగనే, యీతడిక్కడ యిండియాలో నొక పెద్ద కాలేజీని— సీమనుండి వచ్చే ప్రతి

యాంగ్లోద్యోగికి, యీ దేశస్థుల వేషభాషలను ఆచార వ్యవహారములను వారి పుట్టుపూర్వోత్తరములనుగూర్చి రెండేండ్లపాటు వారికి తెలియజెప్పి రాజ్యపాలనకు తరిఫీయతు చేయుటకుగాను ఒక పెద్దకాలేజీని స్థాపించుటకై ఒక పెద్ద స్కీమును తయారుచేసి ప్రచురపరచెను. ఈ యేర్పాటు చాల పెద్దెత్తుగనుండెను. సీమదేశమునుండి యేటేటా యెడ తెగకుండ వందలకొలది యింగ్లీషు కుర్రవాళ్ళ నిక్కడికి దిగుమతిచేసి యిచ్చట భారతదేశ మందాంగ్లసామ్రాజ్యసంస్థాపన, స్థిరీభూత, విస్తృత, కాంక్షలను వారికి పసితనమునుండియు ఉగ్గుపాలతో సహా నూరిపోసి యిట్టిరకపు మనుష్యులను తయారుచేసి, గవర్నమెంటుకు నిరంతరధారగ సప్లయి చేయుచుండుటయే యీ కాలేజీ యొక్క పరమోద్దేశ్యమని వెల్లస్లీ తన స్కీమునందు స్పష్టముగ ఘంటాపథముగ పలికియున్నాడు. కాని, యేలనోకాని కుంపిణీ డైరెక్టర్లకు మాత్ర మీ స్కీముపేరు చెప్పితేనే అసహ్యాం వేసింది. దాని కయ్యే ఖర్చు సంగతి తలచుకొన్నప్పుడు వారికి మరింత రోత పుట్టినది. అఘాయిత్యపు పనులకు దూకే కుర్రవాళ్ళను చూస్తే "ఉద్రేకం అణుచుకోండి, అట్టే దూకకండి" అని కుంపిణీ భాగస్వాము లెప్పుడూ మందలించుచుండేవారు. "మాకు ఊరికే యెక్కువడబ్బు కావాలిగాని, యెదురు తిరిగే యీ ప్రజలంతా యెందుకు? యేటేటా మేము యెక్కువ లాభాలు పంచుకోవాలిగా? వట్టిరాష్ట్రాలెందుకు" అని కుంపిణీభాగస్వాము లనుచుండిరి. "ఈ వెల్లస్లీ చాలా అఘాయిత్యుడు. ఊరికే కూచోలేడు. పీడి బడాయివల్ల,

హెచ్చులకోరుతనమువల్ల మన కొంప ముంచుతాడు" అని కుంపిణీవారు భయపడుచుండిరి. ఇక ఆతడో తాను కేవలము రాజాధిరాజునే యనుకొనుచుండెడివాడు. "ప్రపంచమంతా శుద్ధ పనికిమాలినది; నా అంతఘనుడను, నేను చేసిన మేలును గ్రహించలేకుండా కృతఘ్నుమై పోయింది యీ లోకమంతా; కాబట్టి, యీ ప్రపంచము నా ఘనతకు, నన్ను పొందుటకు తగదు" అని వెల్లస్లీ తలపోయుచుండెడివాడు. వెల్లస్లీ వేసిన కాలేజీ స్కీమును తక్షణ మాపివేయ వలసినదని కుంపిణీవారు హుకుంబంపిరి; దానికి బదులుగ వారింకొకమాదిరి సంస్థను నెలకొల్ప నిశ్చయించిరి. సైన్యములో పనిచేసే వాళ్లను తీసికొనివచ్చి రాజకీయోద్యోగాలలో పెట్టుతూవుండేవాడు వెల్లస్లీ; పరరాజ్యాక్రమణ తలంపుతో యీతడీపని చేయుచున్నాడని కుంపిణీవారు గొణుగుకొనుచుండిరి. సైన్యములో పనిచేసే కర్నల్ ప్యాట్రిక్కును తీసికొనివచ్చి, వెల్లస్లీ రాజకీయశాఖలో కార్యదర్శిగ నియమించెను; యీతని నీ యుద్యోగమునుండి తీసివేయవలసినదని తక్షణం కుంపిణీవా రాజ్ఞాపించిరి. అట్లే, లక్నోలో రెసిడెంటుగ నుంచిన కర్నల్ స్కాటును కూడ ఆ యుద్యోగములో నుండి తీసివేయుమనిరి. కర్నాట రాజ్యసేనల కధిపతిగ తనతమ్ముడు కర్నల్ వెల్లస్లీని నియమించి అతనికి అదనపు బత్తెములిచ్చుచుండెను. "ఇది కేవలము నీ తమ్ముడనే అభిమానంచేత ఆతనికీద్యోగమిచ్చి యీ అదనపు బత్తెములు దోచిపెట్టుతున్నావు. యీ బత్తెములు తక్షణము తగ్గించవలసిన" దని సీమనుండి కుంపిణీవా

దేశాల సంపాదించవచ్చు" అని వెల్లస్లీ తలంచెను. ఆ ప్రకారమే యింకొక సంవత్సర మిక్కడ యిండియాలోనే వుండుట కాతడు నిశ్చయించుకొనెను. "ఇప్పుడు యిండియాలో గొప్ప సంధిగ్ధస్థితి ఒకటి రాబోతూవున్నది. దీనివల్ల మన కెంతో గొప్పలాభములు గలుగవచ్చును" అని వెల్లస్లీ కుంపిణీ డైరెక్టర్లకు వ్రాసెను.

1801 సం॥లో మహారాష్ట్ర ప్రముఖులు తమలో తాము కలహించుకొనుచుండిరి. సింధియాకు తక్కిన ప్రముఖులందరికంటె యెక్కువ రాజ్యవిస్తీర్ణత గలదు. హోల్కారు అత్యంత రణోద్వేగశీలుడు. వీరిరువురు ఒకరియెడ నొకరు అపనమ్మకము గలిగియుండిరి. వీరిరువురు ఒకరు విడిచి యింకొకరు పునహాలోనున్న పీష్వా (బాజీరావు)ను బహుతొందరలు పెట్టుచుండిరి. ఈ యిరువురికంటె పీష్వా కెక్కువ రాజ్యము గలదు; కాని ఆతడు దుర్బలుడైనందున, ఆతని నెట్లయిన క్రూల ద్రోయుదమని హోల్కారు సింధియాలిరువురును ప్రయత్నించుచుండిరి. ఏదిఏమైనా వీరికి గల అంతఃకలహములవల్ల మధ్య తాను లాభము పొందుదమని వెల్లస్లీ చూచుచుండెను. వీరందరిని యింగ్లీషువారి చేతిక్రింది కెట్లయిన తీసికొని రావలెనని చెప్పి వెల్లస్లీ ఒకరిని కనుగప్పి యింకొకరితో టక్కరి రాయబారములు నడపుచుండెను. ఈ విధమగు సూక్ష్మపుయెత్తులవల్లను, సాహసమువల్లను, వెల్లస్లీ తుదకెట్లో వీరినందరిని బహునేర్పుతో యింగ్లీషువారి చేతిక్రిందికి తీసికొనిరాగలిగెను. ఈ సందర్భమందు కర్నల్ క్లోజుకు వెల్లస్లీవ్రాసిన జాబులోని సంగతులు గమనింపదగియున్నవి. "1798 సం॥ లో నేను

పీష్వాతో చేసిన బేరమున కాతడు ఒప్పుకొనలేదు. మన బ్రిటి
షువారితో దగ్గరసంబంధము పెట్టుకుంటే తన మహారాష్ట్ర
రాజ్యములో మన యాధిపత్యము తప్పక యెక్కువై పోవునని
ఆతడు భయపడెను. కాబట్టి, మన చేతికింద హాయిగ బ్రతుకు
పొందుటకంటె, అపాయములనైనా సరే యెదుర్కొని, తాను
స్వతంత్రుడుగ నుండుటయే తనకు శ్రేయస్కరమని ఆత
డెంచెను. వెనుక మనతో కలిసి, టిప్పుసుల్తాన్ మీద
యుద్ధము చేసినప్పుడుకూడ యీ పీష్వా యెంతో అయిష్టము
తోనే చేసెను; ఇక విధిలేక అతడీ యుద్ధములోనిక దిగెను;
ఈ యుద్ధానంతరము "మీకు నేను కొంత అ[illegible]సేన సిన్నాను,
దానిని మీరు పెట్టుకోండి అంటె, అది యింతమాత్రము
ఒప్పుకోలేదు. చూశావా, యిది యెంతగర్వమో! అతని
మనస్సులో మనయందెంత విరోధభావమున్నదో! కాబట్టి
దీనినిబట్టి యేమి తేలుచున్నదనగ: ఇకముందు వ్యవహారములు
మీరివచ్చి తప్పనిసరి అయితేనేతప్ప, అతడు మన సహాయమును
అంగీకరించడని స్పష్టమైపోయినది. మన సహాయమును పొంది
నట్టయితే తన రాజ్యములో తనప్రభ తగ్గిపోయి, మన ప్రభ,
మన పలుకుబడి, మన అధికారము యెక్కువైపోవునని అతని
భయము; ఈ పలుకుబడినే, ఈ అధికారమునే, అతని రాజ్య
ములో ప్రతిష్ఠించుకొన వలెనని మనయుద్దేశ్యము; ఈ విధముగ
యావత్తుసంగతులను, లోతుపాతులను, కర్నల్ క్లోజుకు వివరముగ
జెప్పుచు అతనికొక జాబువ్రాసి పంపించెను. నానాటికి మహా
రాష్ట్ర ప్రముఖుల అంతఃకలహము లెక్కువగుచు వచ్చె.
కుంపిణీ వారికి పూనావారితో బేరములు కుదురుటకును,

తద్వారా మహారాష్ట్ర రాజ్యమందు బ్రిటిషువారి పలుకుబడి అధికారము యెక్కువగుటకును మిక్కిలి అనుకూల పరిస్థితు లేర్పడెను. సింధియా, హోల్కారుల పరస్పర కలహముల నెడతెగకుండ యెక్కువ చేసినచో వారిరువురు నానాటికి నిర్బలించిపోవుటకును, అప్పుడు తాము వారిరువురిమధ్య చేరి తమ యధికారమును, పలుకుబడిని పెంపొందించుకొనుటకును బహు అనుకూలముగ నుండునని కుంపిణీవారు తలంచిరి. వీరిరువురి కలహము లింతటితో అంతరించుననిగాని, తద్వారా తమ సొత్తు చెడిపోవుననిగాని, కుంపిణీవారి కెంత మాత్రము భయము లేకుండెను. అదిగాక వీరిరువురిలో యెవరో ఒకరు పూర్తిగ ఓడిపోయి రెండవవాడొక్కడే బలవంతుడైపోవునను భయముకూడ లేకుండెను. కాని, పూనా వ్యవహార మట్లు లేకుండెను. పూనాలో పీష్వాబాజీరావు వద్ద నానాఫర్నవీసు అను బ్రాహ్మణమంత్రి యొకడుండెను. (ఆతడు కదలించిన గుండెలు లెక్కపెట్టువాడు.) ఈ వెల్లస్లీ వేయు టక్కరి యెత్తుల అంతరార్థము నంతను ఆతడు పూర్తిగ గ్రహించెను. దుర్బలుడగు పీష్వాబాజీరావు కుంపిణీవారి చేతులలోనికి జారిపోకుండ ఆతడు పైకి గుంజుచుండెను. కాబట్టి, యీ నానాఫర్నవీసు బ్రతికినంతవరకు, మహారాష్ట్ర రాజ్య స్వాతంత్ర్యమున కెన్నడు భంగము రాదని స్పష్టమయ్యెను. పెక్కు సంవత్సరములనుండి నానాఫర్నవీసే మహారాష్ట్ర రాజ్యమునకు నిజమగు పరిపాలకుడుగ నుండెను. ఆతడు కుంపిణీవారితో యెట్లో మంచిమాటలమీదనే యుండెవాడు; కాని వాళ్ళదగ్గరకుపోయి, వాళ్ళతో యెట్టిబాధ్యతలు-



మహారాణీ అహల్యాబాయి [ 188—191 పేజీలు చూడుడు.]



నానాఫర్నవీస
(మహారాష్ట్ర మంత్రిశేఖరుడు)



దౌలత్ రావు సింధియా

హోల్కారు, బీరారు రాజ్యములపై హిందూసంస్థానమగు సతారా దర్బారువారు విశేషము పలుకుబడిని వహించి యుండలేదు. అట్లే ముసల్మాన్ సంస్థానమగు ఢిల్లీ దర్బారు వారును తన సామంత రాజ్యములగు అయోధ్య, దక్కనులపై కూడ తగిన పలుకుబడినిగాని, అధికారమునుగాని చలాయింప జాలకుండిరి. హోల్కారుమీద పోయిపడుటకు తాను సహాయము చేసెదనని సింధియారాజు పీష్వాతో చెప్పు చుండెను. కాని, పీష్వామాత్రి మేలనో, — యీర్ష్య చేతనో లేక మరి యేకారణముల చేతనోగాని సింధియా సహాయముపొందుటకు చాలకాలమువరకు యిష్టపడకుండెను. ఇంతలోనే వ్యవహారము జారిపోయినది. ఈ పరిస్థితులు సందిగ్ధ మగుచున్నకాలది, పూనాలోనున్న యింగ్లీషు రెసిడెంటు "మా సహాయము తీసికోండి, మా సహాయము తీసికోండి" అని మాటిమాటికి యెంతో ఆత్రముతో ఆతనిమీద ప్రేమ ఉట్టిపడుచున్నట్లు పీష్వాను రోజురోజు తొందరజేయుచుండెను. "చూసుకో, యిరుగుపొరుగు మహమ్మదీయ రాజ్యముల వారికి మాసేనలను అద్దెకిచ్చినాము. ఇవి చక్కగ తరిఫీయత్తై యింగ్లీషుఉద్యోగులచే నడపబడుచున్నవి. అటువంటిదే నీకు కూడ ఆరువేల సేననిస్తాము. దానిని నీవు శాశ్వతముగ నీ రాజ్యములో వుంచుకో. ఈసేనను గనుక నీవు నీ రాజ్య ములో వుంచుకున్నావంటే, నీపై యీర్ష్యగలిగి నిన్నిప్పుడు బాధపెట్టుతూవుండే యిరుగుపొరుగు రాజ్యాలవారెవరును నీ జోలికిరారు" అని చెప్పి, పీష్వాను ప్రోత్సాహపరచి ఆతనితో ఒక ఒడంబడిక చేసుకొనుటకు యత్నింపవలెనని కుంపిణీవారు

తమ రెసిడెంటుకు ఉత్తరువులబంపిరి. పైన వివరించినట్లు ఈ అద్దెసైన్యము పైకిమాత్రము పీష్వా రాజ్యరక్షణకేయని చెప్పినను, నిజమునకు ఆతనిని సదా యింగ్లీషువారి కాలిక్రి శాశ్వతముగ గులాముగ కట్టిపడవేసికొనునట్లు చేసికొనుటకే ఉద్దేశింపబడినదనుట స్పష్టము. ఈ సేనలకగు బత్తెకర్చులక్రింద గుజరాతురాష్ట్రములో కొన్నిజిల్లాలపై వచ్చు రెవిన్యూనంతను—26 లక్షల రూపాయలను— కుంపిణీవారికి పీష్వా తాకట్టు పెట్టవలెనట! నిత్యము తనను బెదిరించుచుండే హూల్కార్ సింధియాలెవరును పీష్వాపై రాకుండ గట్టి చెలియలికట్టగ నుండుట కీయద్దెసేన పనికివచ్చునట! కాని యిప్పటికీగండము గడచినచాలునా? ఇంతకంటె గొప్పగండము, గొప్పఅపాయము ముందులేదా? ఈ తాత్కాలికపు గండమునుండి దాటించుటకు గాను యింగ్లీషువారు కోరిన ప్రతిఫలము చాల హెచ్చుగ నుండెను. ఈ బేరమునకు ఒప్పుకొనుట మహారాష్ట్ర రాజ్యదర్పమునకుగాని, రాజనీతికిగాని కేవలము హీనముగ గనిపించెను. ఇంగ్లీషువారిచ్చెదమన్న సహాయములో గల గొప్ప అపాయములను పీష్వామంత్రులు గ్రహించ లేకపోలేదు. కాబట్టి, రోజురోజు యీ యెరను కండ్లయెదుట ఆడించుచున్నను చేప పట్టుపడలేదు. "పోనీ, యీ సేనను మీరాజ్యములో వుంచుకోనక్కరలేదండి; మీకు కావలసివచ్చినప్పుడు మాత్రము పంపిస్తాము; మీకు అక్కర లేనప్పుడు తీసుకుపోతాము; ఆఖర్చులు మాత్రము మీరు పెట్టుకోండి" అని అనేక విధములచే యింగ్లీషు రెసిడెంటు పీష్వాను లాలించెను. పీష్వా [illegible]చెను మెత్త

పడెను. పోనీ మనకేమి విశేషము నష్టములేదు. గుజరాతు జిల్లాలు యెక్కడో చాలా దూరంగావున్నవి; దానిమీద శిస్తు వసూలు చేసుకోవడం కూడా చాలా కష్టముగ వున్నది. ఇంతా చూడబోతే, యివి చాలా చిన్న జిల్లాలు. కాబట్టి, యీ జిల్లాలమీద శిస్తంతా కుంపిణీ వారికిచ్చేస్తే మనకు కావలసినప్పుడు పిలిపిస్తే సేనలు వస్తవి; లేకపోతే యెక్కడో వుంటవి; మనకేమి యిబ్బంది లేదు; మన రాజ్యగౌరవానికి స్వాతంత్ర్యానికి యేమి భంగము లేదు" అని పీష్వా మనస్సుకు తోచేటట్లు యింగ్లీషు రెసిడెంటు అనేక విధముల లాలించి బుజ్జగించి చెప్పెను. ఈ పద్ధతివలన దేశీయ రాజ్యముయొక్క స్వాతంత్ర్యము కుంగిపోయినను, అది లోలోననే కుంగిపోవును గాని పైకెంత మాత్రము కనిపించదు. కాబట్టి, యీ బేరములో దీనినే యెట్లయినను ప్రధానాంశముగ నిమిడ్చునట్లు కుంపిణీవారు వేయదగిన ప్రతియెత్తును వేసిరి. ఈ మరతు మాత్రము పైకి వ్రాయకపోయినను, దీనిని యెంతమాత్రము వదలిపెట్టవద్దని వైస్రాయియగు వెల్లస్లీ గట్టి పట్టు పట్టెను. ఈ విధముగ యిక్కడ బేరములు జరుగుచుండగ యింకొక ప్రక్కనుండి పిట్టపిడుగువలె తుపాను వచ్చి పడెను. హోల్కారుయొక్క అరబ్బీ కాల్బలములువచ్చి పూనాను చుట్టుముట్టెను. పీష్వా పారిపోయెను. యింగ్లీషు వారికి దాసుడనైనానని వ్రాతమూలకముగ వ్రాసియిచ్చిన పిమ్మట కుంపిణీవారప్పు డితనిని తీసికొనివచ్చి పూనా సింహాసనముపైన స్థాపితముచేసిరి. ఈ పారిపోయి దాగియున్న

స్థితిలోకూడ పీష్వా యీవిధమగు షరతును ఒప్పుకొనచేయుట బహు కష్టమయ్యెను. తుదకెట్లయినను ఆఖరు రోజున బేసిన్ పట్నమువద్ద పీష్వా బాజీరావు లొంగిపోయి తన స్వాతంత్ర్యమునంతను తిలోదకసహితముగ యింగ్లీషువారి చేతులలో ధారాదత్తము చేసివేసెను. కాని పైకిమాత్రము సంధిపత్రములో యీ మాటలు వ్రాయలేదు సుండీ. అట్లు గాక యెక్కడలేని పరస్పరగౌరవవాక్యములతో పత్రము నంతను నింపిరి. ఒకరి గౌరవము నొకరు కాపాడునట్లు ప్రమాణవాక్యముల వ్రాసికొనిరి. ఒకరికి మిత్రులగువారు యింకొకరికి మిత్రులగునట్లును, ఒకరికి శత్రులగువారు యింకొకరికి శత్రులగునట్లును, ఉభయులు ఒడంబడిరి. ఈ క్రొత్త సంధికి విరుద్ధముగాని వెనుకటి ఒడంబడిక లన్నియు ఖాయ పరుపబడెను. వారి వారి యాశ్రితులకుగాని, మిత్రులకుగాని యెవరివల్ల కష్టములు వచ్చినను వానిని వారించి, వారిహక్కులు ఉభయులు కలిసి కాపాడునట్లు యేర్పాటు చేసుకొనిరి. "ఏ రాజ్యము వారుగాని అకారణముగ పీష్వా రాజ్యముపై వచ్చిపడి, ఆతని హక్కులను భంగ పరుపకుండ మేము తగు కట్టుదిట్టము చేసెదము. మా ప్రదేశములను మా హక్కులను యెట్లు కాపాడుకొనుచున్నామో, పీష్వారాజ్యమును, ఆతని హక్కులను అట్లే కాపాడుచుందుము" అని కుంపిణీవారు వాగ్దానమిచ్చిరి. "సుమారు ఆరు వేల కాల్బలమును, అందుకు తగిన ఫిరంగులను, యూరోపియను యుద్యోగులను పీష్వా శాశ్వతముగ తన రాజ్యములో నుంచుకొనవలెను. ఈ సేనలకర్చుక్రింద యేజిల్లాలవచ్చు రెవిన్యూ

అయితే కుంపిణీవారికి తాకట్టు పెట్టబడినదో ఆ జిల్లాల పేర్లన్ని టిని ఈ సంధిపత్రమున కంటించిన ఒక షెడ్యూలునందు ప్రత్యేకముగ వివరింపబడెను. పీష్వా తనకుగల కోటల నన్నిటిని అందులో పూరిపుల్లయైనను ముట్టుకొనకుండ సమస్త సంబారములతో, వానిలోనుండు మందుగుండు సామానులతోసహా కుంపిణీవారి వశముచేసి వేయవలెను. కుంపిణీవారు దయచేసిన యీ అద్దెసేన యెల్లవేళలను పీష్వాకు అంగరక్షగ నుండునట్లును, ఆతడు చెప్పు ముఖ్యమగు పనుల నన్నిటిని చేయుచుండునట్లును యేర్పాటు. తిరుగుబాటుదార్ల నందరిని పాడలగొట్టి, వారిని దండించుట, రాజ్యములో యెవరైనా అల్లరులు సాగించిన యెడల వారి నణచి వేయుట, తన కివ్వవలసిన శిస్తు దస్తుల నెవరైన యెగవేయ జూచినచో అట్టివారిని తగురీతిగ దిద్ది తోవకు తెచ్చుట — మున్నగు పనుల నన్నిటిని యీ యద్దెసేనచేత పీష్వా చేయించుకొన వచ్చునట! ఇటువంటి ముఖ్యమగు, పెద్ద పెద్ద పనులే చేయించుకొనవలెను గాని, చిల్లర పనులేమియు చేయించు కొనరాదు. ఫలాని ఫలాని, చిల్లర పనులు వారికి చెప్పరాదు" అని కొన్ని రకపు పనులను సంధిపత్రము నందుదహరించిరి. తన యిరుగుపొరుగు మహారాష్ట్ర రాజ్యములవారితో పోట్లాట లకుపోక పీష్వా నోరుమూసికొని కూర్చుండవలెను. అట్లే యిరుగుపొరుగు రాజ్యములవారుకూడ తనమీదికి రాకుండ కుంపిణీవారు కాపాడెదమనిరి. ఒకవేళ వీరిలో వీరికి తగా దాలు వచ్చినట్లయిన, గవర్నర్ జనరల్ మాటప్రకారము పీష్వా ఒప్పుకొనితీరవలెనట! కుంపిణీవారు కావలెనని కోరి

నప్పుడు పీష్వా తనవద్దనున్న యావత్తుసేనను యుద్ధభూమిలో తీసికొనివచ్చి అప్పగించవలెను. కుంపిణీవారు తమ శత్రువులపై — ఆశత్రువులెవరైనను సరే— పోదలచినప్పుడు పీష్వా తనసేనను యావత్తు అడగగానే తీసికొనివచ్చి కుంపిణీవారి చేతులలో యుద్ధభూమిలో అప్పగించివెళ్ళవలెను. అట్లే పీష్వాకు అవసరమైనప్పుడును కుంపిణీవారు తమ సేనను యావత్తు పీష్వాకివ్వవలెను. "మొరోప్రవద్ద" న్నను వదలిపోని తన యనివారిత సంరక్షకులగు కుంపిణీవారి యనుమతి లేకుండ, వారితో చెప్పకుండ, పీష్వా యేయితర రాజ్యము వారితోగాని యెట్టిమాటలు మాట్లాడకొనరాదని షరతు విధించబడెను. ఈ షరతులకు పీష్వా బాజీరావు ఒప్పుకొనెను! "పీష్వా కుటుంబ వ్యవహారములందు గాని, తన పిల్లలు చుట్టాల విషయములోగాని, ప్రజలతో సంబంధించిన వ్యవహారములందుగాని మే మెంతమాత్రము జొరబడము" అని కుంపిణీవారు ప్రమాణపూర్వకముగ వాగ్దానము చేసిరి. ఈ విషయములో పీష్వాకే సంపూర్ణ స్వాతంత్ర్యము గలదని వారొప్పుకొనిరి. కాని, అల్లరులుగాని, తిరుగుబాట్లుగాని పుట్టినప్పుడు మాత్రము వాని నణచుటకు కుంపిణీ సేనలను పిలిపించవచ్చునట— ఇందులోవున్న షరతులన్ని "సూర్యచంద్రాదు లున్నంతవరకు విధిగ అమలు జరుగవలెనని" చిట్టచివర నొక వాక్యముకూడ వ్రాసిరి. కాని "ఆచంద్రార్కముగ నుండవలెనని చెప్పిన యీ ప్రమాణవాక్యములన్ని వట్టి అబద్ధాల మాటలు లెండి, యివన్ని మామూలుగ యిండియాలో వార్లు వ్రాసికొనే నిబంధనలుకాద

మున్నది. యితనినిచూచి తక్కిన వారంతా యెదురుతిరిగే [illegible] ప్రన్నారు, కాబట్టి సమయము కనిపెట్టి సింధియాను గట్టిగ [illegible] లాభము లేదని కుంపిణీవారు నిశ్చయించుకొనిరి. "[illegible] మాత్రమైనా, మొట్టమొదట సింధియా [illegible] కర్తవ్యముగ నున్నది" అని వెల్లస్లీ వ్రా[illegible] 1803 సం వసంతఋతువులో సింధియా తన [illegible]తో, పీష్వా యీ మధ్య యింగ్లీషు [illegible] ఒడంబడిక సంగతి తన కేమి తెలియనట్లు నటిం చుచు, [illegible] ప్రస్థానితము చేతునని బయలుదేరెను. [illegible] సింధియా, హోల్కారు, పీష్వాల మువ్వుర [illegible] ఒకకక్షమగు ఒడంబడిక యెట్లయిన నేమి బహు[illegible] కుదిరెను. అప్పటికి కూడ, యేపక్షము వారు [illegible] సూచకముగ బహిరంగ చర్య యేదియు జరిపి యుండలేదు. పూనాలో నున్న యింగ్లీషు రెసిడెంటుకు [illegible] నుండిన కొలదిపాటి యింగ్లీషు దళము [illegible] యెవరును యెట్టి యిబ్బంది కూడ చేసియుండలేదు. [illegible] పారిపోయి తిరిగి వచ్చుచున్న పీష్వాను తగు రాజసన్మాన గౌరవములతో ఒకప్పుడు తనదేయైన రాజ ప్రాసాదములోనికి ఆహ్వాన మొనరించెను. ఈ రాజప్రా[illegible] తనదేయైనను, యికముందిది తనది కాదనియు [illegible] యజమానులగు కుంపిణీవారు తన్ని మేడలోనుండి యెప్పుడు లేచిపొమ్మంటే అప్పుడు లేచి పోవలసి యుండు ననియు, పాపము, పీష్వా అప్పుడు— యీ రాజప్రాసాదములో ప్రవేశించుచు— మనస్సులో తలపోసియుండి యుండ

వలెను. ఈరీతిగానే తోటి దేశీయ రాజుల యధికారము అంత రించెను. రాజ్యములోపల వీరికెట్టి పలుకుబడియు జవాబు దారీయు లేదు; రాజ్యములో వీరు చేయవలసిన పని యేమియు లేదు; యెట్టి యధికారము లేదు; ఏలననగ, ఆ జవాబుదారీ నంతను కుంపిణీవారే వహించిరిగా! ఇక వీరికేమి భయము! ఇట్టి తాంత్రికపు యెత్తుతో కుంపిణీవారి సంకల్పము పూర్తిగా నెరవేరెను. వారు పెట్టుకొన్న సంకల్పమునకీ యెత్తు బలే బాగా సరిపోయింది. ప్రాణదానము చేస్తామని ఆశపెట్టి నారు; యిక యింకేమికావలెను? ఇది దీనిలోని రహస్యము. "ప్రాణదానము చేస్తామని పైకి ఆశపెట్టినారు. ప్రాణము తీసే ఉపాయము లోపల పన్నినారు. జన్మజన్మలకు, తరతర ములకు దురంతకృత్యముల సాగించుటకు రాజబాట నేర్ప రచినారు."

పునహానగరమం దీరీతిగ తమ మహారాష్ట్ర సామ్రాజ్య నాయకుడగు పీష్వా వంచింపబడిన దృశ్యము ఒక్కసారి తలచు కొన్నప్పుడు తక్కిన మహారాష్ట్ర ప్రముఖుల మనస్సుల కెంతటి చికాకు, విషాదము కలిగెనో వేరుగ చెప్పవలెనా? ఈ వంచనలోని యంతరార్థమును గ్రహించుట కొరకు పెద్ద తెలివితేటలు కావలెనా? "ఇప్పుడు పీష్వానిట్లు వంచించిరి గదా! రేపు మనలో యింకెవరికీ గతి పట్టునో?" అని ఊహించుకొనుటకు పెద్ద తెలివితేటలు కావలెనా? తమకీ గతి పట్టకుండ తప్పించుకొను ఉపాయమేమి? కుంపిణీవారు నలుముఖముల సైన్య సమూహముల ప్రోగు చేసుకొను చుండిరి. కాబట్టి యిట్టివారితో నిప్పుడు యుద్ధము

నకు దిగుట మంచిదికాదు. కాని, ఒక్క సంగతిమాత్రము స్పష్టముగ గన్పట్టుచున్నది. "పీష్వా కుంపిణీవారితో బేసిన్ వద్ద చేసికొన్న సంధిమాత్రము మిక్కిలి చెడ్డది కాబట్టి దానిని మనలో యెవరముకూడ ఒప్పుకొనకూడదు" అని బీరారు, హోల్కారు, సింధియాలు ముగ్గురు గట్టిగ తమలో తాము బాస చేసికొనిరి. సంధి చేసికొనవలయునను కోర్కెయే నిజముగ వెల్లస్లీకి ఉండినయెడల, అతడు వారియుద్రేకము చల్లారువరకు ఊరకొని, పిమ్మట వారినెల్లో మంచిమాటలచే సమాధానపరుప జూచియుండవలసినది. కాని వారిని యుద్ధములోనికెల్లయిన దింపుదమని తానెంతకాలమునుండియో మహా ఆత్రముతో నిరీక్షించుచుండిన యీ మహావకాశము నాతడిప్పుడు పోగొట్టుకొనునా? బేసిన్ సంధిని తక్కిన మహారాష్ట్రప్రముఖులు అంగీకరింపకుండుటకై బాస చేసికొని యున్నారను సంగతి తెలిసియుండియు, ఆ సంధిని తక్షణమే అంగీకరించవలసినదని వెల్లస్లీ వారిని యెంతో ఆత్రముతో గట్టిగ నొక్కి చెప్పుట నారంభించెను. పీష్వాతో ఆలోచించి సమాధానము చెప్పెదమనియు, అంతవరకు ఆగవలసినదనియు వారు కోరిరి. ఇది న్యాయమైన కోర్కెయేగద. కాని దీనికి వెల్లస్లీ సమ్మతింపలేదు. ఒకానొక అనుకూల స్థానమును విడిచియున్న సింధియా సేనలను తక్షణమే వెనుకకు మరలించుకొని పోవలసినదని వెల్లస్లీ సింధియాకు ఆంగ్ల సైన్యాధ్యక్షుని ద్వారా కబురంపెను. ఇట్టివే అంగీకరించుటకెక్కడను వీలులేని అనేకషరతులను వెల్లస్లీ భోస్లే నాగపురప్రముఖులపై కూడ విధింప సాగించెను.

14 వ జులై తేదీన ఆంగ్ల సేనాధ్యక్షుడగు జనరల్ వెల్లస్లీ దౌలతురావు సింధియాకొక జాబును గౌరవసూచక వాక్యములతో వ్రాసెను. * "మీరు మీ సైన్యములను నర్మదానదిని దాటించి మరలించుకొని పోనిచో, ప్రస్తుత పరిస్థితులనుబట్టి మీరు మాకు శతృస్థానమందున్నట్లు భావించి, మీ యెడ తదనుగుణముగ ప్రవర్తించవలసి వచ్చును. కాని, మీరును మీ యితర మహారాష్ట్ర నాయకులును మీ మీ సేనలను యథాస్థానమునకు మరలించుకొనిపోయినయెడల, మేము మా యాంగ్లసేనలను కూడ వెనుకకు మరలించుకొని పోదుము."

దీనికి మహారాష్ట్ర నాయకులు చెప్పిన ప్రత్యుత్తరమేమనగా:— "భగవంతుని దయవలన మేమింకను మా మా రాజ్యములలోనే యున్నాముగాని, కవ్వించి పరులరాజ్యములో నడుగుపెట్టలేదు. కాని, ఉభయపక్షములవారు వెనుకకు సమానదూరమునకు మరలుటకొక రోజును తాము నిర్ణయించేయెడల, మేమాప్రకారమే చేయుదుము" అని వారు జబాబుపంపిరి. కాని, యీాప్రకారము చేసినయెడల, యుద్ధము జరగదేమో; యుద్ధము జరుగకుండుటకు వెల్లస్లీ యెట్లు ఒప్పుకొనును ? కాబట్టి మహారాష్ట్రనాయకులు చెప్పిన యీా మాటలకు వెల్లస్లీ యెంతమాత్రము ఒప్పుకొనక, నిరసించెను. "ఇక పీష్వాసంగతియా ! నాకు బాగా తెలుసును. అతను పూనానుండి పారిపోవుటకు యత్నింపనుకూడా లేదు. ఒకవేళ అతని కట్టిబుద్ధిపుట్టినను, అది తన మంత్రులకు తెలియ

* మిల్ బుక్కు VI Chap. ii

కుండ చేయలేదు. కాబట్టి ఆతని మంత్రులకు లంచమిచ్చి కర్నల్ క్లోజుతోగట్టి యేర్పాటుచేసినాను." అని వెల్లస్లీ వ్రాసెను. ఈరీతిగ పునహా సింహాసనముచుట్టు క్రొత్తగ నాటిన కంచెయొక్క నెత్తిమీద సున్నపునీళ్ళను చల్లిరి. శాంతిని, న్యాయమును కోరువారిలో నీ భూలోకములో అత్యుత్తము డగు నెట్టిమానవునకునైతము, యీ బేసిన్ సంధినిచూచిన ఒడలు మండకపోదు. సింధియా యెట్టి అత్యుత్తమ శాంత పురుషుడని యనుకొన్నను, అతడీ బేసిన్ సంధిని నిరాకరించుట కును, అది అమలుజరుగకుండ శాయశక్తుల నిరోధింపబూనుట కును కావలసినన్ని హేతువులుగలవు. ఈ బేసిన్ సంధి మహా గొప్పదని, తమ కమూల్యమైనదని వెల్లస్లీ ప్రగల్భములు గొట్టు చున్నాడుగదా! ఎందుచేత? దేనినిజూచి? దీనిలోనున్న యేమహాత్తునుజూచి ఆతడింత సంబరపడుచున్నాడు? ఈ సంధి వలన ఒక్క పీష్వాను స్వాధీనపరుచుకొన్నాననే సంబరమే కాదు; అదేమిలెక్క! మహారాష్ట్రప్రముఖులలో నగ్రగణ్యు డగు యీ పీష్వాను లోబరుచుకొని అతనికీ అద్దెసేనల నంట గట్టుటమూలముగ, తక్కిన యావన్మహారాష్ట్రనాయకులను కూడ అవలీలగ తన పిడికిలిలో పట్టుకొనియుంచుటకు మంచి యవకాశ మేర్పడుచున్నదిగదాయను సంబరమే వెల్లస్లీని ఉబ్బ చేయుచున్నది. ఈ బేసిన్ సంధిలోగల రహస్యమిది; దాని లోని మహాత్తుయిది! ఇట్లుచేసినయెడల మహారాష్ట్రజాతికి చెందిన యెవడుకాని వైస్రాయియగు తన కయిష్టమైన పనిని యిక ముందెన్నడు చేయ సాహసింపజాలడుగదా యనునదే ప్రధానమగు విషయము. స్వాతంత్ర్యపహారణ మెట్టి శాంత

పురుషునైనను రణోద్యుక్తునిచేయుటకు చాలునని యూగీక రించినయెడల యీ బేసిన్ సంధి నెపుర్చువిషయమై సింధియా, బీరారుప్రముఖులకట్టి కలహ కారణముగలిగెననుట సహజము.

బేసిన్ సంధిని ఖాయపరచు విషయమై మహారాష్ట్ర ప్రముఖులతో వెల్లస్లీ గావించుచున్న రాయబారములు విఫల మయ్యెననువార్త కలకత్తాకు చేరినప్పు డక్కడ కోటలోనున్న కుంపిణీవారు సంతోషాతిరేకముతో యెగిరి గంతులు వేసిరి ? ఇక ఆ సంతోషము చెప్పతరమా ? యుద్ధకారణములని పైకి చెప్పినవి యివి ! ఇక అసలు లోపలినిజమేమి ? నిజముగ ఏ యుద్దేశ్యముతో కుంపిణీవారీ యుద్ధమును రేపెట్టిరి ? యుద్ధ ప్రారంభమిక కొన్ని వారములకు జరుగుతుందనగనే, వెల్లస్లీ ప్రభువు తన సైన్యాధ్యక్షునకు రహస్యముగ వ్రాసిన జాబులో యీ యుద్ధకారణములనుగూర్చి విపులముగ తన కడుపులోని రహస్యములను తాను బయలుపెట్టుచు వ్రాసెను. నాలుగు గొప్ప పనుల కోసము కుంపిణీవారీ యుద్ధమును రేపెట్టిరట ! ఏమిటా పనులు ?

1. యమునానదియొడ్డున ఒక ఫ్రెంచిసంస్థాన మున్నదట. దానిని దాని సైనికబలముతో సహా నాశనముచేయుట మొదటిపని.

2. కుంపిణీవారి రాజ్యపు పొలిమేరలను ఆ యమునానదీ తీరమువరకు ఒత్తిగించి పెంపొందించుట. ఢిల్లీ ఆగ్రా కోటలనే గాక, యమునానదిపొంట బారులుతీర్చియున్న కోటల నన్నిటిని స్వాధీనపరచుకొనుట రెండవపని.

3. మొగలాయి చక్రవర్తి యొక్క సర్వం సహాధికారమునంతను తమ చేతులలోనికి బదలాయించుకొనుట మూడవపని.

4. యమునానదికి దక్షిణ పశ్చిమ దిక్కులందున్న చిల్లర నాయకులతో నేస్తము (స్నేహము) గట్టుట నాల్గవపని.

5. బుందేల్ ఖండమును తమ రాజ్యములో కలుపుకొనుట అయిదవపని.

( ఈ అయిదుపనుల కొరకట కుంపిణీవారి యుద్ధమును రేపెట్టినది. అసలు నిజమిది. )

ఈ అయిదింటిలో ఒక్క మొదటిది తప్ప తక్కిన అన్ని పనులు నెరవేరునట్లు ధాత విధించెను. ఈ మొదటి పని మాత్రము నెరవేరలేదు. దానికి తగిన కారణము లున్నవి. ఏమనగ— నిజమున కక్కడ ఆ యమునానది ఒడ్డున— ఫ్రెంచిస్థానమనునది ఒకటి వుంటేగా ? అంతయు హుళక్కే. ఈ ఫ్రెంచిసంస్థాన మనునది కేవలము మాయాకల్పితము. ఇది దీనిని కల్పించినవారి బుర్రలలో తప్ప యింకెక్కడను లేదు. ఇది లోకమును మోసగించుటకు వేసిన ఒకటక్కరి యెత్తు. (ఇంగ్లీషువారికిని ఫ్రెంచివారికిని అప్పుడు కలహములు జరుగుచుండెను గద.) కాబట్టి, ఫ్రెంచి సంస్థానమును నాశనముచేయుటకై దండెత్తుచున్నామంటే, యింగ్లీషువారంతా సంతోషిస్తారుగా ! ఇదంతానిజమే అనుకుంటారుగా ! ఇందు కొరకై వేసినయెత్తుయిది ! కాని నిజముగ హిందూదేశస్థుల దృష్టిలోచూస్తే, యమునానది ఒడ్డున ఫ్రెంచిసంస్థానము

లేదు—గించిసంస్థానము లేదు. కలలోగాంచిన వస్తువులెంత సత్యమో, యీ యమునానది యొడ్డుననున్న ఫ్రెంచిసంస్థానము కూడ అంతసత్యమే! దీనిలోని నిజమేమని నిగ్గుదీసినప్పుడు తేలినసారాంశ మేమనగ:- 1803 సం॥ నాటికి మహారాష్ట్ర ప్రముఖుల కొలువులలో ఒకడజనుఫ్రెంచి ఆఫీసర్లుమాత్ర మున్నారట! వీరికిని తక్కినఆఫీసర్లకును తేడాయేమియును లేదట. ఈ ఫ్రెంచి ఆఫీసర్ల కక్కడ తక్కినవారికంటె యెక్కువ ఘనతగాని, ప్రాముఖ్యతగాని యేమియు లేదట. పైగా, యీ ఫ్రెంచి ఆఫీసర్లలో ప్రధానుడగు పెర్రిక్ అను వానికిని, యీతని నుంచుకొనిన సింధియా మహారాజునకును బొత్తుగ పడకుండెనట. అందుచే నీతడు సింధియా కొలువును విడిచి, సాధ్యమైనంత త్వరలో యింగ్లీషువారిలో చేర వలెననికూడ చూచుచుండెను. సంగతి సందర్భము లిట్లున్నట్లు తెలిసియుండియు, "యమునానది యొడ్డుననున్న ఫ్రెంచి సంస్థానమును కూలద్రోయుట యీ యుద్ధములో చేయవలసిన మొదటి పని" యని వెల్లస్లీ తన సేనానాయకుడగు లార్డు లేక్ కు వ్రాసెను!

అహమ్మదునగర కోటను పట్టుకొనుటకై ఆర్థర్ వెల్లస్లీ మైసూరు వైపునుండి 8900 సైన్యమును నడిపించుకొని వచ్చెను. కాన్ఫూర్ వైపునుండి లార్డు లేక్ అనువాడు పది వేల బలముతో మహారాష్ట్ర దేశములో ప్రవేశించెను. జనరల్ స్టీవెన్సన్ అనునాతడు 7,900 కాల్బలముతో గోదావరీ తీరమున విడిసియుండెను. కృష్ణతీరమున జనరల్ స్టువార్టు అను వాడు పెద్ద మూలబలమును గూర్చుకొని యుండెను. జనరల్

మరో యనువాడు 7,300 సైనిక బలగములతో ఘూర్జర (గుజ రాతు) దేశములోని దుర్గముల నాక్రమించుకొనెను. బుందేల్ ఖండమందు 3500 శిపాయీలతో కర్నల్ పవల్ అను సేనా నాయకుడు విడిసియుండెను. మహారాష్ట్ర రాజ్యముపై దండె త్తుట కింకను 5000 సైన్యము నిలువలో నుంచబడెను. ఈ రీతిగ మహారాష్ట్ర రాజ్యమునకు నలుముఖముల దావాగ్ని దరికొ నెను. ఈ మహా సంగ్రామమున కంతకు తానే యుద్ధ మంత్రిగనుండి నడిపింతునని వెల్లస్లీ ప్రగల్భముల గొట్టు చుండెను. "సైన్యమును తగ్గించుటకు నేనెందుకు ఒప్పు కొనలేదో, దానివల్ల యేమి ప్రయోజనము గలదో సీమ డైరెక్టర్లకు నేనిప్పుడిదిగో చేసి చూపించె దను" అని వెల్లస్లీ నిశ్చయించుకొనెను. తదనంతర మీ యుద్ధమందు జరిగిన మహా ఘనకార్యముల గూర్చి మనమందర మెరిగియే యున్నాము. మహారాష్ట్ర రాజ్యముపై యీ రీతిగా దండువిడిసిన సేనలు లెక్కకు మిక్కిలియై యెల్లెడల నతిశ యిల్లియుండెను. విజయమును జూరగొన్న యీ సేనలలో మూడవవంతు 'అసే' యను రణరంగమందు హతులైరి.

కాని, అచ్చట కొట్టినదెబ్బయు, దానివెంటనే లాస్వారీ యనుచోట కొట్టినదెబ్బయు యేకమై సింధియాను

రేవనీయ లేదు. ఆగ్రాకోట ముట్టడించ

అక్కడ కొల్లగొట్టిన ధనమంతయు కుంపిణీసేనలు

ఇందులో పెద్దలాటు వైస్రాయియగు వెల్లస్లీకి

రావలసిన మామూలువున్నది. ప్రస్తుతమప్పుడతడు చాల చిక్కుస్థితిలో కూడ నుండెను. చేతిలో దమ్మిడీలేకుండెను;

అప్పులలో మునిగియుండెను; అట్లయ్యును, తనవంతుకు మామూలుగవచ్చు కొల్లధనమంతయు తన కక్కరలేదనియు, దానిని తన శిపాయిలకు పంచిపెట్టవలసినదనియు ఆతడాజ్ఞాపించెను. ఢిల్లీ పడిపోగానే, దానిలో బహుకాలమునుండి సింధియాచే చెరయందుంచబడిన షాలం చక్రవర్తికి విముక్తి గలిగెను. ఈతని విమోచనము యావన్మహమ్మదీయ ప్రపంచమునకు మహోత్కృష్ట ఘనకార్యమనియు, యిది యింగ్లీషువారి మహోపకారబుద్ధికి, మహోదారబుద్ధికి ప్రబల నిదర్శనమనియు లోకమంతను జాట బంపిరి. రాజస్థానమందలి యనేక చిల్లర రాజులను కూడ యిట్లే మహారాష్ట్రుల బానిసత్వమునుండి విడిపించితిమని ప్రకటించిరి. ఓర్వలేనివారు కడుపుమంటచేతనో, రాజకీయ తాంత్రికము చేతనో పరులపై నికృష్టమగు స్వార్థపరత్వబుద్ధిని ఆరోపించవచ్చును. కాని ప్రపంచమునకు నిజము నిలకడమీాద తెలియకపోదు. తుదకెట్లయిననేమి సంధిచేసుకొనిరి. గుజరాతు రాజ్యమును కుంపిణీవారి కిచ్చెదనని వెనుక పీష్వా యన్నప్పుడు, యీా సింధియా హోల్కారు మున్నగు మహారాష్ట్ర ప్రముఖులు ఒప్పుకొనలేదుగా! కాబట్టి దానికి ప్రతిఫలముగ బీరార్ రాజునుండి, కటకము, బాలసోర్ జిల్లాలనే గాక, మంచి ప్రత్తిపండు జిల్లాయగు వార్ధా జిల్లాను కూడ తీసికొనిరి. గంగా యమునా నదుల మధ్యనుండు యావత్ప్రదేశమును— ఆగ్రా, ఢిల్లీ, బుందేల్ ఖండములతో సహా సింధియానుండి తీసికొనిరి. "యుద్ధానంతర మంతయు, లెక్కవేసిచూసుకోగా, పాపమీా సింధియా కేమియు మిగుల

లేదు. ఇకముందు తన స్వరక్షణార్థమై తగినబలము నుంచుకొ తగినంత ఆదాయ మితని కెక్కడను కనబడలేదు" అని కుంపిణీవారే యనిరి. ఇట్లుండగ తన వంశమువారికి పారంపర్యముగ వచ్చుచున్న పెద్ద జాగీరులుగల బ్రోచ్, అహామ్మదు నగర జిల్లాలను కూడ కుంపిణీవారు లాగికొనిరి. ఈ ఒక్క రెండు జిల్లాలపైననే తమకు సాలుకు పదిలక్షల రూపాయల నికరాదాయము రాగలదని కుంపిణీవారు అంచనా వేసికొనిరి.

" ఆరుదళముల కాల్బలమును, దానికి తగిన ఫిరంగులు వగైరా హంగుతో సహా, నీ కవసరమైనప్పుడు జీతబత్తెముల వగైరా షరతులతో ఏమియు నిమిత్తము లేకుండా నీ కిచ్చెదము " అని కుంపిణీవారు సింధియాకు వాగ్దానము చేసిరి. ఈ వాగ్దానము సిరాజ్ అంజన్ గామ్ వద్ద వ్రాయబడిన సంధి పత్రములో నొక షరతుగ నుండెను. గవర్నర్ జనరల్ అగు వెల్లస్లీకి సింధియాపై యింతటి అవ్యాజకరుణ గలుగుట కేమికారణము? దీనికతడు చెప్పిన కారణము బహు చమత్కారముగనున్నది. దీని నందరు గమనింపవలసినదే. ఈ యుద్ధమందు సింధియాయొక్క సైనికబలము, అధికారము, కీర్తిప్రతిష్టలు చాలవరకు క్రుంగిపోయెను. కాని, యాతని ప్రతికక్షియగు హోల్కారుబలము మాత్రము తగ్గలేదు. ఈతడెట్లో పోయినస్థానములను తిరిగి సంపాదించుకొని వెనుకటికంటె యెక్కువ పేరుప్రతిష్టలను సంపాదించుకొనెను. కావున ఆతడిప్పుడు సింధియాకంటె యెక్కువ బలవంతుడై యుద్ధమునకు పూర్వముకంటె యిప్పుడాత డన్నివిధ

ముల అధికుడై యుండెను. కాబట్టి, ఆతడిప్పుడు సింధియా పైకి రాకమానడు. ఉభయులు సమానబలముగలవారై యుండి, యెవరు జయింతురో, యెవరు ఓడుదురో నిశ్చయింప వీలులేనిస్థితియే యుండియున్నయెడల, కుంపిణీవారిందులో నిజముగ జోక్యము కలుగజేసికొనెడివారుకారు. (అంతయు పూర్తియగువరకు తమాషాచూచుచు ఊరకుండి అటుపిమ్మట యెటువాటముగ వుంటే అటుచేరేవారు.) కాని యిప్పుడన్ననో, అట్లుకాదు. హోల్కారు బలవంతుడై యున్నాడు; సింధియా యొంటరివాడైనయెడల హోల్కా రాతనిని అవలీలగ మ్రింగి వేయగలడు; లేదా ఆతనిని తనకు శాశ్వతముగ దాసుని చేసి కొనగలడు. కాబట్టి హోల్కారు పొగరణచుటకుగాను సింధియాను తమలో కలుపుకొనుట కుంపిణీవారి కిప్పు డవసర మయ్యెను. కాబట్టి సింధియా కిప్పుడేదో యెరవేయవలెను గద. "ఈ సేనలకు నీవద్ద నేమియు అద్దె పుచ్చుకొనము. దీనికేమియు నీకు ఖర్చుండదు; నీ రెవిన్యూ తగ్గిపోదు; కాబట్టి, యీ సేనను నీవగ్గర వుంచుకొని మాలో కలియుదువా? లేక హోల్కారుకు గురియగుదువా?" యని కుంపిణీవారు పెద్దయెరను సింధియాకు వేసిరి. ఇదివరకే సింధియా మంత్రులందరు కుంపిణీవారితో చేరవలసినదని ఆతని నెంతయో ప్రోత్సహించుచుండిరి. కాని, యీ సేనల కర్చుమాత్రము తాను పెట్టుకోవలసివచ్చేయెడల, సింధియా యీ పద్ధతికి ఒప్పుకొనడని కుంపిణీవారు కనిపెట్టిరి. కాబట్టి "యీ కర్చు నీవు పెట్టుకో వద్దులే" యని కుంపిణీవారనిరి. ఇట్లంటేనేగాని సింధియా యీ యెరలో పడడని కుంపిణీవారు గ్రహించియే ఆతని

కీసౌకర్యముల నిచ్చిరి. ఈ సంధిలో యింకొక తమాషా షరతుకూడ కలదు. "ఈ సేన సింధియాకును, ఆతని ప్రజలకును గలుగు తగాదాలలో జోక్యము గలిగించుకొన రాదట! కాని ప్రజ లెదురుతిరిగినప్పుడు—ఆ తిరుగుబాటు యేకారణముచేత జరిగినా సరే—సింధియా ఉత్తరువుల ప్రకారము సదరు తిరుగుబాటుదార్లను శిక్షించి, అణచుటకు సదరు సేన సర్వకాలసర్వావస్థలయందును సంసిద్ధముగ నుండునట! ఏమి యీ మాటల కర్థము? ఇదియా మన యూరోపియనుల నాగరికత, స్వాతంత్ర్యనిరతి, నీతివర్తన! సింధియా క్రూరుడని, విశ్వాసఘాతుకుడని ఈ కుంఫిణీవారే పలుమార్లునిందించి యుండిరిగద. అట్టి క్రూరుని చేతిలో, అట్టి నిరంకుశుని చేతిలో "నీ యిష్టమువచ్చినట్లు, నీయిష్టము వచ్చినన్నాళ్లు సేనను నీ వద్దవుంచుకో, నీ యిష్టము వచ్చిన క్రూరఘాతుక కృత్యములను యీ సేనచేత చేయించుకో" అని చెప్పి తమ ఇంగ్లీషు సేనను కుంఫిణీవారు యీతనికి కూలికిత్తురా? (ఎంత ఘోరము! ఇది యీ యూరోపియనుల నాగరికత, నీతివర్తన, స్వాతంత్ర్యనిరతి.) ఇన్ని బలములుకూడి తనపై వచ్చినను హోల్కారింకను బలవంతుడై నిలిచి 1805 సంవత్సరమువరకు లొంగక, యుద్ధము చేయుచునేయుండెను. తుదకు వెల్లస్లీ స్థానమందు యింకొక వైస్రాయి వచ్చుటయు, ఆతడెట్లయినను యుద్ధమును విరమించెదమని పట్టుపట్టుటయు, అంతలో హోల్కారు నుండి యెంతమాత్రము రాజ్యభాగమును కోరకయే యుద్ధము విరమింపబడుటయు జరిగెను.

ఈ పరరాజ్యగ్రసనశకమందు కుంపిణీవారికి గలిగిన ఆర్థికఫలితము లెట్లుండెనో తెలిసికొనుట మంచిది. 1794 సం॥ లో బ్రిటిషు ఇండియామీద కుంపిణీవారికి వచ్చిన ఆదాయము రు 8 కోట్ల 27 లక్షల 67 వేల 700 లు. ఇందులో (అప్పుమీద వడ్డీసహా) ఖర్చు 6 కోట్ల 63 లక్షల 39 వేల 510 రూపాయలు పోను నిలువ ఒకకోటి 64 లక్షల 28 వేల 190 రూపాయలు. మరు సంవత్సరము యుద్ధములేమియు లేకపోయినను నిల్వతగ్గిపోయెను. 1797-98 సం॥ లో వెల్లస్లీ వైస్రాయిగ వచ్చునాటికి 11 లక్షల 87 వేల 460 రూపాయిలు లోటు వుండెను. ఈతనికాలములో చాలా దుబారాఖర్చు జరిగెను. ఈతడు యీ ఉద్యోగము మానుకొని వెళ్ళునాటికి—అనగ 1805 సంవత్సరమునాటికి—కుంపిణీవారి జమాఖర్చు లెట్లుండె ననగ :—

జమ 15 కోట్ల 40 లక్షల 34 వేల 90 రూపాయలు.

ఖర్చు అప్పులమీద వడ్డీసహా :—17 కోట్ల 67 లక్షల 20 వేల 170 రూపాయలు.

లోటు :-2 కోట్ల 26 లక్షల 86 వేల 80 రూపాయలు.

1793 సం॥ లో అప్పు 16 కోట్ల 96 లక్షల 27 వేల 430 రూపాయలు.

1797 సం॥ లో అప్పు 17 కోట్ల 5 లక్షల 91 వెయ్యి 920 రూపాయలు.

1805 సం ॥ లో అప్పు 31 కోటి 63 లక్షల 88 వేల 270 రూపాయలు.

1810 సం॥ లో అప్పు 41 కోటి 23 లక్షల 38 వేల 760 రూపాయలు.

ఈ రీతిగ కుంపిణీవారి ఆర్థిక వ్యవహారములు బహుచిక్కులలోపడిపోయెను. ఈ చిక్కులలోనుండి బయటపడుటకుగాను తాము వెనుక సీమగవర్నమెంటువారికి పెట్టుబడిపెట్టిన 1 కోటి 20 లక్షల రూపాయలను యిచ్చివేయవలసినదని కోరిరి. వెనుకముందు లాలోచించక, డబ్బునంతను తగులవేసి, ఊరక యుద్ధములు రేపెట్టి, దమ్మిడీ లాభమురాని దిక్కుమాలిన దేశముల నన్నిటిని నెత్తిన కట్టుకొనుటవలన కుంపిణీవారికి చాల నష్టము వచ్చెను; వచ్చిన ఆదాయము ఖర్చుకు చాలక, లోటువడెను. ఈ లోటును పూర్తి చేసుకొనుటకుగాను తమ కింకొక కోటి 20 లక్షల రూపాయలను అప్పుగ కూడ యివ్వవలసినదని 1808 సంవత్సరము మార్చి 11 వ తేదీన కుంపిణీవారు సీమ గవర్నమెంటును కోరిరి. మహారాష్ట్రులను అనవసరముగ రేపెట్టి వారితో యుద్ధములు సాగించి తమ డబ్బు నంతను తగులవేసినందుకు సీమలోని కుంపిణీ డైరెక్టర్లు వెల్లస్లీని తీవ్రముగ ఖండించుచు వ్రాసిరి. కాని యీ రికార్డును యిండియాకు పంపించకుండ సీమలో ప్రభుత్వపుబోర్డు అక్కడే నిలిపివేసిరి. అంతట కుంపిణీ భాగస్వాములు యావన్మంది సమావేశమై యిండియా పరిపాలన విషయములో తమ హక్కును, అధికారమును, స్థాపించుటకై డైరెక్టర్లు చూపిన జాగ్రత్తను, పట్టుదలను పొగడుచు, ఒక తీర్మానమును గావించిరి. ఈ తీర్మానమునకు అనుకూలముగ 928 మందియు, ప్రతికూలముగ 195 మందియు వోటు చేసిరి.

పరరాజ్యాక్రమణ గావించుట తమ ఆంగ్లజాతియొక్క కోర్కెకు, గౌరవమునకు, నీతికి విరుద్ధమని లోగడ పార్లమెంటు సభవారు ప్రకటించియున్నారు. కాబట్టి, పరరాజ్యములపై దాడివెడలి వాని నాక్రమింపజూచు పన్నాగములనెల్ల నిరోధించుటకును, రాజ్యాంగ ద్రవ్యము దుర్వ్యయము గాకుండ తగు కట్టుదిట్టముల చేయుటకును మా కుంపిణీవారి కధికారము గలదని సదరు భాగస్వాముల సభలో ఘంటాపథముగ తీర్మానించిరి.



# భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన

## 18 వ అధ్యాయము.

### కత్తియూరలో నుండబడెను 1805—1813



మనదేశ లాభములకును, చట్టములకును విరుద్ధముగ దండయాత్రల గావించి, పరదేశముల జూరకొందమను ఆవేశోద్రేకములు దేశమెల్లడల వ్యాపించి యున్నవి. ఈ యావేశోద్రేకములలో పెద్దపెద్ద వారని, నిదానము గలవారని నేను తలంచుచుండిన పెద్దలందరు పడుటకూడ ఆశ్చర్యము. ఇందువలన కలిగిన విపరీతఫలితములగూర్చి నే నెంతయు నిరసింతును. ఇట్టి వంచనకుగాని, కవ్వించి పరులపై దుముకుటకుగాని, యెంతమాత్రము అవకాశమివ్వక మిక్కిలి యుదారభావమును చూపవలెనను గట్టి మనోనిశ్చయముతో నేనీ సైన్యవ్యవహారములను నడిపెదను.

—కారన్ వాలీస్

వెల్లస్లీ యవలంబించిన "కవ్వించి పరులపైపడు" రాజ్యతంత్రమును సీమలో పిట్టుమంత్రి యామోదించి, చాల మెచ్చుకొనెను. కాని సీమలోని రాజకీయపక్షములవారెవరు దీని

నామోదించలేదు. ఇది వారెవరికి యిష్టములేదు. ఈ సంగతి
పిట్టుమంత్రికి పూర్తిగ తెలియును. ఈ రాజ్య తంత్రమును
సమర్థించుటకు గాని, దాని నిక కొనసాగించుటకు గాని
ప్రజాంగీకార మెంతమాత్రము లేదని పిట్టుమంత్రి 1804 సం॥
శీతాకాలమునాటికి పూర్తిగ గ్రహించెను. క్రొత్త యెన్నికలై
తిరిగి తాను రెండవపర్యాయము మంత్రిగ వచ్చినప్పు డిట్టి
తంత్రము నంగీకరింపజేయుటకవకాశముండవచ్చునని పిట్టు
తలంచెను కాని, ఆతని తలంపు నెరవేరలేదు. ఈతను రెం
డవపర్యాయము మంత్రిగ వచ్చినప్పుడు కూడ ప్రజలలో యీ
విషయమై ఉత్సాహమేమియు కలుగలేదు. తన శరీరపాట
వము క్షీణింపనారంభించెను. దేశమందంతటను మిక్కిలి
సంకటస్థితి యేర్పడెను. సీమ ప్రభుత్వమువారికి అప్పులెక్కువై
పోవుచుండెను. ప్రజలపై పన్నులును నానాట హెచ్చుచు
చుండెను. ఫ్రెంచివారి యధికారము పూర్వముకంటె
మిక్కిలి హెచ్చుగుచుండెను. దాని నణచుటకై తాము
పూనుకొన్నగాని వీలులేనట్లు తోచెను. కాని, ఫ్రెంచివారి
యధికారము పూర్వముకంటె మిక్కిలి హెచ్చుగుచుండెను.

కాబట్టి యింటివద్ద యేర్పడిన యిట్టి సంకటస్థితిలో హిందూదేశ
విషయమై కొంచెము శాంతి వహించుట మేలనియెంచి, పిట్టు
మంత్రి నెమ్మదిగ యిండియాలోని పరరాజ్యాక్రమణ తంత్ర
మును మార్చి, క్రొత్తగ శాంతితంత్రమును నడుపుటకు నిశ్చ
యించుకొనెను. ఇందుకొరకై కారన్‌వాలీస్‌నే తిరిగి రెండవ
సారి యిండియాకు వైస్రాయిగ పంపుటకును, ఆతడు యుద్ధ
ములనన్నిటిని కట్టిపెట్టి శాంతి జేసికొనుటకును, ఆ శాంతినే

1810 సం॥ లో అప్పు 41 కోటి 23 లక్షల 38 వేల 760 రూపాయలు.

ఈ రీతిగ కుంపిణీవారి ఆర్థిక వ్యవహారములు బహుచిక్కులలోపడిపోయెను. ఈ చిక్కులలోనుండి బయటపడుటకుగాను తాము వెనుక సీమగవర్నమెంటువారికి పెట్టుబడిపెట్టిన 1 కోటి 20 లక్షల రూపాయలను యిచ్చివేయవలసినదని కోరిరి. వెనుకముందు లాలోచించక, డబ్బునంతను తగులవేసి, ఊరక యుద్ధములు రేపెట్టి, దమ్మిడీ లాభమురాని దిక్కుమాలిన దేశముల నన్నిటిని నెత్తిన కట్టుకొనుటవలన కుంపిణీవారికి చాల నష్టము వచ్చెను; వచ్చిన ఆదాయము ఖర్చుకు చాలక, లోటువడెను. ఈ లోటును పూర్తి చేసుకొనుటకుగాను తమ కింకొక కోటి 20 లక్షల రూపాయలను అప్పుగ కూడ యివ్వవలసినదని 1803 సంవత్సరము మార్చి 11 వ తేదీన కుంపిణీవారు సీమ గవర్నమెంటును కోరిరి. మహారాష్ట్రులను అనవసరముగ రేపెట్టి వారితో యుద్ధములు సాగించి తమ డబ్బు నంతను తగులవేసినందుకు సీమలోని కుంపిణీ డైరెక్టర్లు వెల్లస్లీని తీవ్రముగ ఖండించుచు వ్రాసిరి. కాని యీ రికార్డును యిండియాకు పంపించకుండ సీమలో ప్రభుత్వపుబోర్డు అక్కడే నిలిపివేసిరి. అంతట కుంపిణీ భాగస్వాములు యావన్మంది సమావేశమై యిండియా పరిపాలన విషయములో తమ హక్కును, అధికారమును, స్థాపించుటకై డైరెక్టర్లు చూపిన జాగ్రత్తను, పట్టుదలను పొగడుచు, ఒక తీర్మానమును గావించిరి. ఈ తీర్మానమునకు అనుకూలముగ 928 మందియు, ప్రతికూలముగ 195 మందియు వోటు చేసిరి.

పరరాజ్యాక్రమణ గావించుట తమ ఆంగ్లజాతియొక్క కోర్కెకు, గౌరవమునకు, నీతికి విరుద్ధమని లోగడ పార్లమెంటు సభవారు ప్రకటించియున్నారు. కాబట్టి, పరరాజ్యములపై దాడివెడలి వాని నాక్రమింపజూచు పన్నాగములనెల్ల నిరోధించుటకును, రాజ్యాంగ ద్రవ్యము దుర్వ్యయము గాకుండ తగు కట్టుదిట్టముల చేయుటకును మా కుంపిణీవారి కధికారము గలదని సదరు భాగస్వాముల సభలో ఘంటాపథముగ తీర్మానించిరి.



# భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన

## 18 వ అధ్యాయము.

### కత్తియూరలో నుంచబడెను 1805—1813



మన దేశ లాభములకును, చట్టములకును విరుద్ధముగ దండయాత్రల గావించి, పర దేశముల జూరకొందమను ఆవేశోద్రేకములు దేశమెల్లడల వ్యాపించి యున్నవి. ఈ యావేశోద్రేకములలో పెద్దపెద్ద వారని, నిదానము గలవారని నేను తలంచుచుండిన పెద్దలందరు పడుటకూడ ఆశ్చర్యము. ఇందువలన కలిగిన విపరీతఫలితములగూర్చి నే నెంతయు నిరసింతును. ఇట్టి వంచనకుగాని, కవ్వించి పరులపై దుముకుటకుగాని, యెంతమాత్రము అవకాశమివ్వక మిక్కిలి యుదారభావమును చూపవలెనను గట్టి మనోనిశ్చయముతో నేనీ సైన్యవ్యవహారములను నడిపెదను.

—కారన్ వాలీస్

వెల్లస్లీ యవలంబించిన "కవ్వించి పరులపైపడు" రాజ్యతంత్రమును సీమలో పిట్టుమంత్రి యామోదించి, చాల మెచ్చుకొనెను. కాని సీమలోని రాజకీయపక్షములవారెవరు దీని

నామోదించలేదు. ఇది వారెవరికి యిష్టములేదు. ఈ సంగతి పిట్టుమంత్రికి పూర్తిగ తెలియును. ఈరాజ్య తంత్రమును సమర్థించుటకు గాని, దాని నిక కొనసాగించుటకుగాని ప్రజాంగీకార మెంతమాత్రము లేదని పిట్టుమంత్రి 1804 సం॥ శీతాకాలమునాటికి పూర్తిగ గ్రహించెను. క్రొత్త యెన్నికలై తిరిగి తాను రెండవపర్యాయము మంత్రిగ వచ్చినప్పుడిట్టి తంత్రము నంగీకరింపజేయుటకవకాశముండవచ్చునని పిట్టు తలంచెను కాని, అతని తలంపు నెరవేరలేదు. ఈతను రెండవపర్యాయము మంత్రిగ వచ్చినప్పుడు కూడ ప్రజలలో యీ విషయమై ఉత్సాహమేమియు కలుగలేదు. తన శరీరపాటవము క్షీణింపనారంభించెను. దేశమందంతటను మిక్కిలి సంకటస్థితి యేర్పడెను. సీమ ప్రభుత్వమువారికి అప్పులెక్కువై పోవుచుండెను. ప్రజలపై పన్నులును నానాటి హెచ్చగు చుండెను. ఫ్రెంచివారి యధికారము పూర్వముకంటె మిక్కిలి హెచ్చగుచుండెను. దాని నణచుటకై తాము పూనుకొన్నగాని వీలులేనట్లు తోచెను. కాని, ఫ్రెంచివారి యధికారము పూర్వముకంటె మిక్కిలి హెచ్చగుచుండెను. కాబట్టి యింటివద్ద యేర్పడిన యిట్టి సంకటస్థితిలో హిందూదేశ విషయమై కొంచెము శాంతి వహించుట మేలనియెంచి, పిట్టు మంత్రి నెమ్మదిగ యిండియాలోని పరరాజ్యాక్రమణ తంత్రమును మార్చి, క్రొత్తగ శాంతితంత్రమును నడుపుటకు నిశ్చయించుకొనెను. ఇందుకొరకై కారన్‌వాలీస్‌నే తిరిగి రెండవ సారి యిండియాకు వైస్రాయిగ పంపుటకును, అతడు యుద్ధములనన్నిటిని కట్టిపెట్టి శాంతి జేసికొనుటకును, ఆ శాంతినే

యికముందుకూడ పాటించుటకును, వలయు నేర్పాట్లను చేయుటకు పిట్టుమాంత్రి యెట్టకేలకు ఒడంబడెను.

వయోవృద్ధుడగు కారన్‌వాలీస్ తిరిగి రెండవ పర్యాయము వైస్రాయి పదవికి వచ్చినప్పుడిక్కడ యిండియాలో పరిస్థితులెట్లుండెనో ఆతడే వర్ణించుచు సీమకు జాబు వ్రాసెను. అందులో యిట్లున్నది. “మనమింక హూల్కారుతో యుద్ధము చేయుచునే యున్నాము. సింధియాతో శాంతి చేసికొనలేదు. నేనిప్పుడు తక్షణమే పై (ఉత్తర) రాజధానులకు పోయినగాని అక్కడ జరుగు యుద్ధములను త్వరలో పరిసమాప్తి నొందింపజాలను. అథవా ఒకవేళ మనకీ యుద్ధములో అద్భుతమగు విజయము కలిగినను, మనకు దానివల్ల వచ్చు లాభము కించిత్తయినను లేదు. కాబట్టి ఇట్టి యుద్ధమును మన మింకను కొనసాగించుటవలన మనకు కేవలము నష్టమేగాని వేరు ప్రయోజన మేమియునుండదు. దీనివలన కలుగు ద్రవ్యనష్టముల మనమీ జన్మలో కూడదీసికొనలేము. కాసిల్ రే ప్రభువుకువ్రాసిన జాబులో కారన్‌వాలీస్ ప్రభువు తానిచ్చటి కుంపిణీ వ్యవహారముల స్థితిగతులలో చూడగలిగిన ఆశ్చర్య విషాదముల నీరీతిగ వివరించెను. “ఇక్కడ కుంపిణీ ఖజానాయంతయు ఖాళీయైనది. కాశీ మున్నగు ప్రదేశములలో కుంపిణీవారి పరపతి పూర్తిగ చెడిపోయినది. దుబారా ఖర్చుదారుడగు వెనుకటి వైస్రాయి (వెల్లస్లీ) యీ ప్రదేశములం దెల్లెడల కుంపిణీ తరఫున తాత్కాలిక ఋణముల పెక్కింటిని చేసెను. గ్వాలియరు కోటను నేను వదలిపెట్టనని సింధియా ఒకచెంప పట్టుపట్టుచుం

డగ దానిని నీకెట్లయిన యిప్పింతుననిచెప్పి వెనుకటి వైస్రాయియగు వెల్లస్లీప్రభువు రాణాకరత్ సింగ్ అనునతనితో బాసయిచ్చెను. దీనివలన అనేకచిక్కులు రానున్నవి. " కుంపిణీవారికిగలిగిన చిక్కులనుగూర్చి పైన పల్కిన మాటలు అతిశయోక్తులుకావు.... ..... జయపురంరాజగు జగత్ సింగ్ లోగడ కుంపిణీవారికి ఆశ్రితుడై యుండి వారిరక్షణయం దుండెను. కాని యిటీవల ఆతని ప్రవర్తనవలన ఆతడు కుంపిణీవారి రక్షణకు అనర్హుడైపోయెను. ఈ సంగతి కారన్ వాలీస్‌కు తెలిసినప్పుడు "యీరీతిగనే, గోహాడ్ దేశపు రాణాను, యింకను మనపై ఆధారపడి మనకుబరువుగనున్న మనమిత్రులను, ఆశ్రితులనుకూడ వదలించుకుంటె మనకెంత హాయిగనుండునురా దేవుడా ?" అని అతడనెను. కారన్ వాలీస్ వైస్రాయి పదవిలో ప్రవేశించు రోజుకు అప్పటికి అయిదు మాసములనుండి సిపాయిలకు జీతములు బకాయ పడినవి. సివిల్ డిపార్టుమెంటులలో యింతకంటె యెక్కువ అన్యాయములు జరిగినవి. దీనికి గతియేమి ? కారన్ వాలీస్‌న కేమియు తోచలేదు. అప్పుడు యింగ్లాండు నుండి చీనాకు యిర్సాలు చేయబడుచున్న రొఖద్రవ్యమును మార్గమధ్యమందు ఆపివేసి, యిక్కడవారికి జీత బత్తెముల సరిపెట్టుట తప్ప ఆతని కింకొక మార్గము కనిపించలేదు. అతడీ సందర్భమందిట్లు వ్రాసెను. "మనకీ మధ్య గలిగిన యుద్ధ జయములవల్ల మనకు కావలసినంత బంజరుభూమి లభించినది. దీనిలో చిల్లిగవ్వైనను మనకురాదు. నిరర్థకులై మనకు బరువులచేటగు మిత్రులు, ఆశ్రితులు, మనకు చాలమంది దొరికి

నారు." శాంతిని స్థాపించుటకంటె, యుద్ధములు చేయుటయే మేలను నభిప్రాయములు కలకత్తా నగరమందున్న రాజకీయోద్యోగుల కందరకును గాఢముగ నున్న సంగతి కారన్‌వాలీస్‌కు తెలియును. హోల్కారువంటివాడుకూడ సైనిక వలసల నేర్పరుపవలెనను కుతూహలముతో నుండెను. వాని కొరకై యీతడు స్కీములను తయారుచేసి సిద్ధముగకూడ నుంచెను. దీని వలన తాత్కాలిక కష్టములంతరించుటే గాక, భావికాలమందలి రాజ్యాక్రమణలకుకూడ మిక్కిలి అనుకూలమగు మూలాధారముగ నుండునని ఆతడనుచుండెను. కాని, యీ విషయమై కారన్‌వాలీస్ ఆతనితో గట్టిగ యిట్లుచెప్పెను. "మహారాష్ట్రులతోడి యీ యుద్ధము మనకు చాల నష్టదాయకమైనది. ఇందులో మన కెంత జయము కలిగినను, మన నష్టముమాత్రము పూడదు. మనకు గౌరవహాని లేకుండ దీనిలోనుండి తప్పించుకొనుటకు యేక్షణమందు వీలైతే ఆక్షణమందే దీనిని వదలుకొనవలెను. అంతకుమించి యింకొక క్షణముపైగా మనము యుద్ధము చేసినామంటే మనము నష్టము నెన్నడును కూడదీసికొనలేము. షాలం చక్రవర్తిని, ఢిల్లీ నగరమును, రక్షింతుమని మనము పైనివేసుకొనియుండుట నిజముగ మనకెంతయు దురదృష్టము. అద్దెసేనలనిచ్చు ఒడంబడికలను హెచ్చుచేయుటకంటె, వానిని తగ్గించి, నిరసించుటకే యీ క్రొత్త వైస్రాయి కారన్‌వాలీస్ పూనుకొనెను. వివేకవంతుడును, కరుణార్ద్రహృదయుడునునగు యీతడు ఈ విషయమై తనకుగల యభిప్రాయమును దాపరిక మేమియు లేకుండ యెల్లరకు తెలియ

జేసెను. మూడవ మైసూరు యుద్ధము ముగిసిన పిమ్మట, యీ యద్దెసేనల పద్ధతిని మహారాష్ట్ర రాజ్యములోకూడ జొప్పించవలయునని కారన్‌వాలీస్ ప్రయత్నించినట్లును, దానిని మహారాష్ట్రులు తిరస్కరించినట్లును కొందరు అపోహ పడిరి. ఇది నిజముకాదని చెప్పుట కీదిగువ చెప్పబోవు యుదంతమే నిదర్శనము. మైసూరు యుద్ధమందు విజయము గొన్న మిత్రమండలివారు (అనగ కుంపిణీవారు, మహారాష్ట్రులు, నైజామువారు) యుద్ధానంతరము సంతృప్త హృదయులై యెవరి యిండ్లకు వారు వెళ్లిపోవుచున్న సమయమందు "నైజాముతోపాటు మీరుకూడ అద్దెసేనల నిస్తాము. తీసి కోండి, అని యేల మీరు పీష్వాతో అనలేదు" అని మహా రాష్ట్ర సైన్యాధ్యక్షుడగు హరిపంతు కారన్‌వాలీస్ నడిగెను. (చమత్కారముగ) "ఇట్టి యొడంబడికలు నాకెంతమాత్రము పనికిరావు. వీనివలన మేము అనవసరమైన యుద్ధాలలో— మాకు సంబంధించని యుద్ధాలలో దిగవలసి వస్తున్నది. ఈ నైజాముతోటి యొడంబడికైనను యెప్పుడో చాల సంవత్సరాల క్రిందట జరిగిపోయినది. అయిందేమో అయింది కాని, యికముందుమాత్ర మిట్టియొడంబడికల జోలికి నేను పోను" అని కారన్‌వాలీస్ గట్టిగ చెప్పెను. తుదవరకు ఆత డిట్టి నిశ్చయములోనే యుండుటకు స్థిరపరచుకొనెను. అందు ముఖ్యముగ వెల్లస్లీకాలములో ఆతడవలంబించిన తద్విరుద్ధపద్ధతి వలన గలిగిన యనుభవమునుబట్టి కారన్‌వాలీసిప్పుడీ యకుటిల మార్గమునే యవలంబించి యుండుటకు కృతనిశ్చయుడ య్యెను. చతురమతియగు మహారాష్ట్ర యోధుడు హరిపంతు

తన నీ ప్రశ్న యెందుకు వేసినాడో, కారన్‌వాలీస్ పైకిచెప్పడు-
గాని, మనస్సులో మాత్రము పూర్తిగ గ్రహించినాడని మన
మనుకొనవచ్చును. ఈ యుద్ధాంతము జరిగిన యనంతరము,
(వెల్లస్లీ కాలములో) బేసిన్ సంధికై పీష్వాతో రాయబార
ములు జరుగుచున్న కాలమందు, యీ సంధిషరతులనుగూర్చి
పీష్వా మంత్రులు జరిగించిన కర్మకాండనంతను బట్టిచూడగ వారు
కుంఫిణీవారుకోరినషరతుల నెట్టి అసహనముతో, యెట్టిఅసహ్య
ముతో చూచిరో నిస్సందేహముగ తెలియగలదు. పీష్వా యేషర
తులకు ఒప్పుకుంటే ఆతని రాజ్యములో అద్దె సేనల నుంచుదు
మని కుంఫిణీవారు చెప్పిరో, ఆ షరతులను గూర్చి విన్నప్పుడు
వారికి యెంతయో రోతయు, అసహ్యమును పుట్టెను. ఆనాడు
వారివంతు, కారన్ వాలీస్‌ను ఆ ప్రశ్న యెందుకు వేసినాడో
తెలియునా ? విజయోద్రేకముచే మైమరచియున్న సమయ
మందు యీ యద్దెసేన నిజతత్త్వము నేమైన చప్పున బయట
పడవేయునేమో చూతమను తలంపుతో — ఆతని హృద
యాంతరాళమందు గూఢముగ దాగియున్న నిజమును బయ
టికి లాగుదామనే తలంపుతో ఆతడీ ప్రశ్న వేసెను. కుం
ఫిణీవారితో మాట్లాడి, అద్దెసేనల కుదుర్పు విషయమందు
నిజముగ వారివంతు కేమియు అప్పుడు పీష్వా అధికారమిచ్చి
యుండలేదు. కాని, ఆకస్మికముగ వేసిన యీ చమ
త్కార ప్రశ్నచే, కారన్‌వాలీస్ నొక వాయింపు వాయించి
చూచి, ఆతని మనస్సులోనున్న నిజమును బయటికి లాగ
గలిగినచో యీ యద్దెసేనల గూఢార్థమును— యింకను
యెట్లో తంటాలుపడి తమ స్వాతంత్ర్యమును నిలువబెట్టుకొన

గలిగిన రాజ్యములలో జొరబడి, వారి స్వాతంత్ర్యము నపహ రించుటకే యీ యద్దసేన లుద్దేశింపబడినవను నిజతత్వమును పైకి కుంపిణీవా రిదివరకు చెప్పని యీనిజోద్దేశ్యమును— యిప్పుడీ కారన్ వాలీస్ నోటిమీదగ హఠాత్తుగ పలికించ గలిగినచో— బలే! నామంత్రము పారినదిరాయని మిక్కిలి సంతోషముతో చంకలు కొట్టుకొని గంతులు వేసెడివాడే. మరియు పరరాజ్యముల దిగమ్రింగుటకే యీ యద్దసేన లుద్దే శింపబడినవిసుమా, జాగ్రత్తయని తన పీష్వాతో ముందుగ హెచ్చరించి చెప్పెడివాడే. ఇట్టి హెచ్చరిక పీష్వా రాజ్యమున కెంతయు నమూల్యముగ నుండెడిదనుటలో సందేహము లేదు. కాని కారన్ వాలీస్ యీ తాంత్రికోద్దేశ్యమును బయటపెట్టక "నేనీ పద్ధతి నిక సాగించదలచలేదు" అని నిష్కల్మష చిత్తముతో హరిపంతు ప్రశ్నకు చెప్పిన జవాబు వలన, పునహాలోని పీష్వా సంస్థానము వారికి కుంపిణీవారి యెడ అపనమ్మకము కొంతవరకు తగ్గుటకు కారణమయ్యెను. ఇంకొక పది సంవత్సరములవరకు దీని ప్రశంసయే రాలేదు. ఈకారణముచే, మహారాష్ట్రులు కొంత అజాగ్రత్త స్థితి లోనికి జారుటకు కారణమయ్యెను. ఇతర రాజ్యములనెడి యడవి గుర్రముల పొగరణచి, వానిని స్వాధీనపరచుకొని, వానిపైనెక్కి స్వారిచేయుటకుగాను కలకత్తాలోని కుంపిణీవా రెన్ని పన్నాగములను పన్నుచున్నను, యెన్ని జీనులను తయారు చేయుచున్నను, తమ విషయములో మాత్రము కుంపిణీవారిట్టి దురుద్దేశ్యములోలేరని మహారాష్ట్రులు పాపము నమ్మిరి! విచ్చలవిడిగ తిరుగు యితర రాజ్యములనెడి యడవి

గురి)ముల మూపులపై వేయుటకెన్నిజీనులను తయారుచేయు చున్నను తమనోటికి మాత్రము కుంపిణీవారు కళ్లెముల తగిలించరనియు, తమ కంఠములకు పాశములబోసి వైసా)యి యను కట్టుకొయ్యకు కట్టివేయరనియు— పాపము— మహారాష్ట్రులు నమ్మిరి. కారన్‌వాలీసు, సర్‌జాన్‌షోరులు, గవర్నరుజనరలుగ నున్నంతకాలము యీ తాటస్థ్యభావము సాగెను. కాని యెప్పుడైతే వెల్లస్లీ వైసా)యిగ వచ్చెనో అప్పుడే యీ పద్ధతి పూర్తిగమారిపోయెను. స్థిరత్వములేక యెప్పటికప్పుడు మారిపోవుచుండు యీ కుంపిణీవారి రాజనీతి దేశీయరాజులకు దుర్గ్రాహ్యముగ నుండెను. "మీదేశీయ రాజ్యముల జోలికిరామ"ని మొదట కుంపిణీవారు 1792 సం॥లో చెప్పిరి. కాని పదేండ్లయిన పిమ్మట తమరాజ్యాధికారపు కాడిని తీసికొనివచ్చి వదలించుకొందమన్నను వదలించుకొనుటకు వీలులేనిరీతిగ దేశీయరాజుల మెడలపై తగిలించిరి. దీనినిబట్టి, కుంపిణీవారికీ దురుద్దేశ్యము మొట్టమొదటినుండియు కడుపులో వుండివున్నది సుమా యని దేశీయ రాజులనుకొనుటలో ఆశ్చర్య మేమున్నది? 1805 సంవత్సరములో కారన్‌వాలీస్ తిరిగి రెండవ పర్యాయము వైసా)యిగవచ్చినప్పుడు తాను మొదట యేర్పరచిపోయిన యేర్పాటులన్నియు కేవలము తలకి)ందులై పోయినట్లు గ్రహించెను. మధ్య తాను లేని కాలములో — వెల్లస్లీ కాలములో— జరిగిన దాని నంతను తానిపుడు తిరుగ దోడబూనుట దుర్ఘటముగ కనిపించెను. దుష్పరిపాలన యొక్క ఫలితమిదియేగద! దుష్పరిపాలన వలన గలిగిన దుష్ఫ

లితములను కూడదీయుట — చక్కపరచుట — కేవలము సాధ్యము కానిపని. అట్లు చక్కబరుపజూచుట సులభమును కాదు — క్షేమమును కాదు! ఒకవేళ ధైర్యము వహించి చక్కబరుప దలంచినను దానిని సాధించుటకు అసలు మార్గములే కనిపించవు. నమ్మకమను మొక్కను ఒక్కసారి బలవంతముగ ఊడబెరికినచో, దానిని పిమ్మట యెంత జాగ్రత్తగ నాటినను, యెంతటి పశ్చాత్తాప బాష్పజలములబోసి పెంచినను, అది యెన్నటికిని బ్రతుక జాలదు. కారన్ వాలీస్ పరాగుడుకాడు; కాని సంయత వృత్తిగలవాడు. న్యాయబుద్ధిగలవాడు. తాను మొదట వైస్రాయిగ నున్నప్పటికి, యిప్పటికి — యీ మధ్యకాలములో— కుంపిణీవారి రాజ్యనియతియందును, క్షమా శీలములందును, దేశీయరాజులకు నమ్మకము పూర్తిగ చెడిపోయినదిగదాయని పాప మీతడు చివరరోజులలో యెంతో దుఃఖపడెను. ఆతని జీవితముయొక్క చరమదశ యీ విషాదచ్ఛాయలచే నంధకారబంధుర మయ్యెను.

పునహాలో పీష్వా రాజ్యములో ప్రతి శాఖయందును, అరాచకము ప్రబలి యుండెను. దీనిని గూర్చి ఆక్కడ కుంపిణీవారు రెసిడెంటుగ పెట్టిన కర్నల్ క్లోజ్ అనువాడు చాల మందలించెను. ఆయా శాఖలలోగల ఉద్యోగస్థులను, తాబేదార్లను, కుక్షింభరులను, నయమునను, భయమునను యెన్నియోవిధములు మందలించి జూచెను. కాని ప్రయోజనము లేకపోయెను. ఎట్లుండును ? తన స్వాతంత్ర్యము గోల్పోయి, పరిభవభారముచే కుంగిపోయిన పీష్వా

చెవిలో నిరంతరము అనేక పుకార్లు వచ్చిపడుచుండెను. ఈ దుర్వార్తలను నమ్మకపోవుటకు వీలు లేకుండెను. తనను బలవంతపరచి తన స్వాతంత్ర్యమును చేతులారా ధారపోయించి, తన జాతి ధర్మముల నన్నిటిని మంటగలిపించి, తానెంత మితవ్యయము నవలంబించినను తన జన్మలో తీర్చుకొనుటకు వీలులేని ఋణములను, యితరబాధ్యతలను తన నెత్తికి చుట్టించి, తన నీ యధోగతిలోనికి తోయించినదీ కుంపిణీవారి ప్రభుత్వముకాదా? తన నీదిక్కుమాలిన స్థితికి దెచ్చిన యీ పరప్రభుత్వపు ప్రతినిధి కాదా యీ యింగ్లీషు రెసిడెంటు! ఒకవైపున తమ రాజ్యమే నశించిపోవుచున్నప్పుడు యిక దేశీయోద్యోగులందరు రాజ్యాభిమానముతో నుండవలసిన పనియేమి? రాజ్యాభిమానముకొరకై తమ సౌఖ్యములను, స్వలాభములను వదలుకొనవలసిన పనియేమి? వారిలో యీ సుగుణము లుండుట వలన యేమి ప్రయోజనము? కాబట్టి అయినకాడికి, వీలైనంతవరకు ముఖస్తుతుల చేతనో, అవినీతుల చేతనో, సొమ్ము దోచుకొనుటయే ఉత్తమపద్ధతి. పీష్వా రాజ్యమెట్లో నశించియే పోవుచున్నది. ఇది నిశ్చయము. దానినిక బ్రతికింపబూనుట నిరర్థకము. దీపమెట్లో ఆరియేపోవుచున్నది; యిక దానికొరకై పాకులాడుట యెందుకు? ఆకాస్త దీప ముండగనే—— అది పూర్తిగ ఆరిపోకముందే—— యిల్లు చక్కబెట్టుకొనుట మంచిది—— అని పీష్వా రాజ్యములోని యుద్యోగులు తలచిరనుటలో తప్పేమున్నది? "రాజ్యములో యేవైన దుష్కార్యములు జరుగుతూవుంటే, వానిని చక్కబరచవలసిన బాధ్యత

పీష్వా కేమున్నది? అంతా చక్కబరచేవారు కుంఫిణీవా రున్నారుగా? మా కేజబాబుదారీ యున్నది?" అను భావము పీష్వాకును, పీష్వా రాజ్యములోనివారికిని క్రిమక్రిమముగ పట్టెను. సజీవమై, చైతన్యయుతమై సర్వకాల సర్వావస్థల యందును జాగరూకతతో, మెళకువతో, అప్రమత్తతో తన రాజ్యమందలి మంచిచెడ్డల నిరంతర మారసికొనవలసిన బాధ్యత జబాబుదారీగల దేశీయరాజ్యము— యీ కుంఫిణీ వారి చల్లనిహస్తము నెత్తిన పెట్టబడుటతోడనే— అది నిర్జీవమై, చైతన్యశూన్యమై యింద్రియవ్యాపారమణగి పోయి, కాళ్ళుచేతులు చల్లబడి మృతప్రాయమైపోయెను. ప్రజలమొరలు, పెద్దలనీతులు, శ్రవణేంద్రియములు గ్రహింప జాలకుండెను. చక్షురింద్రియములు చూడజాలకుండెను. పరాధీనమను యీ విషము, పరరాజ్యరక్షణయను యీ విషము— పీష్వా రాజ్యాంగమందు నరనరము లకు యెక్కి అది చేయవలసినపని చేయనారంభించెను. దానితో యితరరాజ్యములలో గలిగిన దుర్గుణములే— రోగ ములే యిక్కడకూడ పుట్టెను. వీనినిచూచి పాపము కారన్ వాలీస్ యెంతో యేడ్చెను. దేశమంతయు సంచారము చేసి, అలసి సొలసి కలకత్తాకు చేరుకొని కొంచెము విశ్రాంతిగైకొనుచున్న సమయమందు యీ దుఃఖము నంతను సీమలోని రహస్య సం ఘమువారి యెదుట వెళ్లబోయుచు వారికి ఉత్తరమువ్రాసెను. "దుర్బలమై, దిక్కుమాలియున్న పీష్వారాజ్యపు ఆంతరంగిక స్థితినిచూస్తే నాకు యేడ్పు వచ్చుచున్నది. దక్కను సుబేదారు రాజ్యముకూడ యీ స్థితికేవచ్చుచున్నది. ఉన్న దుర్గుణము

లేమో పైకి స్పష్టముగానే కనుపించుచున్నవి. కాని, వానికి మందుమాత్రము కనిపించడము లేదు. ఇదియంతయు చాల దురదృష్టమైనసంగతి. మనము వారితో చేసుకొన్న ఒడంబడికలనుబట్టి చూడగ వారి యాంతరంగిక పరిపాలనయందు వారికే సంపూర్ణాధికారమున్నట్లు స్పష్టముగ కనుపించుచున్నది. ఈ సంగతిని నేనువారికి గట్టిగ తెలియచెప్పితిని. "ఇదిమీకు సంబంధించిన వ్యవహారము సుమా! ఇదిమీహక్కు. దీనిని మీరు గట్టిగ చలాయించు కోండయ్యా" అనినేను వారికెన్నియోసార్లు నొక్కిచెప్పితిని. "వారిరాజ్యములోవారు వారి యధికారమును గట్టిగ చలాయించుకొనేటట్లు మీరు వారిని ప్రోత్సాహపరచండి. ఇదిచాలా అవసరముసుమా! ఏలననగ, అట్లయినగాని, వారిరాజ్యమునకు శ్రేయస్సు వుండదు ; వారి ప్రజలకు భద్రతయుండదు —" అని నేను యెన్నియో సార్లు అక్కడవున్న మన కుంపిణీ రెసిడెంట్లతో కూడ గట్టిగ చెప్పితిని. సంక్షుభితమై, క్షీణదశ నొందిన, దేశీయరాజ్యపు ఆంతరంగిక కుట్రలలోను, ప్రజాపీడనలలోను కుటిల తంత్రములలోను మనము కూడ దూరుట చాల సిగ్గు మాలినపని. ఇట్టి సిగ్గుమాలిన పని నుండి మనము నెమ్మదిగ తప్పుకొని బయట పడవలసియున్నది. కాబట్టి తామిదివరకు పైనవేసికొనిన బాధ్యతలను నెమ్మది నెమ్మదిగ ఒకటొక్కటే వదలించుకొని — ముండ్లకంచెమీద వేసిన బట్టనుతీసికొనినట్లు జాగ్రత్తగబయటపడవలసినదని నేను పునహాలోను, హైదరాబాదులోను వున్న మన కుంపిణీ రెసిడెంట్లకు జాబులను వ్రాసియుంటిని. నేనేవైన యెడల

అసలు మొదట యీ బాధ్యతలను వారిపై పెట్టెడివాడనే కా'' ననెను. ఈ మధ్య క్రొత్తగ జయించిన రాజ్యములో కుంపిణీ సైన్యముల కధ్యక్షుడైయున్న లేక్ ప్రభువుకు కారన్ వాలీస్ యీరీతిగవ్రాసెను. "భారతదేశమందింతటి యలవిగాని పెద్ద సామ్రాజ్యమును మనమునిలుపుకొనజూచుట కేవలము సాధ్యము కాని పనియని సీమదేశములోని మంత్రులు, రాచకీయవేత్తలు మున్నగు పెద్దలేగాక సమస్త సామాన్యప్రజకూడ యేకరీతిని అభిప్రాయపడుచున్నారు. ఈ సామ్రాజ్యమువలన మనకు యేటేటా సీమ దేశమునుండి యెక్కడలేని సేనలను డబ్బును కూడ దిగుమతి చేసుకొనవలసి వచ్చుచున్నది. పోసీ, తుదకు దీనివలన ఫలిత మేమైనా వున్నదా యని చూచిన, వట్టి డాబుసరి ప్రకటనలు, గెజటీలుతప్ప వేరు లాభమేమియు గాన్పించుటలేదు. మనవలన సమస్తమును గోల్పోయిన బీరారు రాజును, తదితర రాజులునుకూడ మనయెడ కించిత్తయినను, మిత్రభావము వహింతురనుట వట్టికల్ల. ఇక సామాన్యప్రజలన్ననో, వారి మనస్సులలో పెద్దమార్పు కలిగించినగాని,— మన యుద్దేశ్యములనుగూర్చి వారి మనస్సులలో గలిగిన భావములను తొలగించినగాని,— మనమిక్కడ శాశ్వతముగ, ప్రశాంతముగ, రాజ్యము చేయగలమను ఆశ నాకెంతమాత్రమును లేదు. మన కనేక రాజ్యములు యుద్ధజయము వల్లను, దానపత్రముల వల్లను సంక్రమించినవి. వీని వ్యవహారము లన్నియు బహు చిక్కుగ నున్నవి. వీనిలో మనవేవో, మనవికానివి యేవో చెప్పుట కెంతమాత్రము అవకాశము లేకుండా వున్నది. కాబట్టి పైకి మన గౌరవానికి

భంగము లేకుండా వుండేటట్టు చూచుకొని వీనిలో వీలైనన్ని మెల్లగ వదలివేస్తే బాగుంటుందని నాయభిప్రాయము.”

ఈరీతిగ కారన్‌వాలీస్ సూచించిన శాంతిమార్గము లార్డ్‌లేక్ మున్నగువారి కెంతమాత్రము నచ్చలేదు. దీని వలన వారికి చాలా ఆశాభంగమయ్యెను. అంతేగాదు, యింక యెక్కువభావములుకూడ పుట్టెను. రణరంగమందు వ్యూహములు పన్ను నేర్పు, పట్టుదల, ధైర్యము మున్నగు లక్షణముల సమ్మేళనముచే తమ కిదివరకుగలిగిన జయములనుబట్టి, యింక ముందింతకంటె ఘనమగు జయములగాంచవచ్చునను ఆశ వారికి పూర్తిగగలిగెను. ఇట్టి విజయము లింకను యెక్కువగ గాంచక యింతటితో వదలివేసినచో, తామిదివరకు జయించిన జయముల లాభముకూడ పోవునని వారు గట్టిగ నమ్మిరి. తామిదివరకు జయించుకొన్న రాజ్యములను ఒక్కొక్కటే తిరిగి యిచ్చివేయవలసినదని కారన్‌వాలీసు సూచించినప్పుడెల్లా వారికి నిరాశ మరింత హెచ్చెను. “ఎంతో ధైర్యగాంభీర్యములతోనుండవలసిన రోజులలో, యీ దిక్కుమాలిన పిరికితనము, పేనాసితనము, యెక్కడవచ్చినదిరా బాబూ,” అని కుంపిణీతాబేదార్లందరనుకొనిరి. వెల్లస్లీ చూపిన ధైర్యసాహసములు, దృఢసంకల్పము, ఫలోన్ముఖముకానైయున్న తరుణమున, అయ్యో! యీ దిక్కుమాలిన కారన్‌వాలీసుయొక్క పిరికితనమువచ్చి, సర్వనాశనము చేసెగదా! మహారాష్ట్రులను సగమే జయించితిమి. పూర్తిగ లొంగదీయలేదు. అట్టిచో వారు మన పిరికితనమును, దుర్బల సంకల్పమును చూచి, మనలను వెక్కిరింతురు. పరిహాసింతురు. మనమువారికి

అలుసై పోదుము. పోయినరాజ్యములనన్నిటిని తిరిగి సంపాదించు టకు వారు యుద్ధమునెడ తెగక సాగింతురు. మనసైన్యము లిది వరకు బహుజయోద్ధతితో గావించిన పనియంతయు, అయ్యో తుదకిప్పుడు బూడిదలోపోసిన పన్నీరై పోవును గదా! తిరిగి, రెడ్డివచ్చి మొదలాడె నన్నట్లు యిదంతయు మరల చేసికొనవలసి వచ్చునుగదా! ఇదంతయు తలచుకొన్నప్పుడు మనస్సున కెంతయో విచారము గలుగక మానదు! మహానీయుడు, ఆ వామనాకారుడు, ఆ వెల్లస్లీప్రభు వేగనుక యింకొక్క యేడాదిపాటు కలకత్తాలోవుంటే, వహ్వా, సర్వము సంపూర్ణములయ్యేవిగదా! కాని, దిక్కుమాలినవాళ్ళు, అతడా యుద్యోగము వదలుకొని వెళ్ళేవరకు ఆతనిని వేధించిచంపిరి. అట్టి మహానీయుని స్థానములో ఒక ముసలితొక్కను, శరీరపాటవము, బుద్ధిపాటవము పోయిన వానిని, యేపనికి యిక పనికిరానివానిని— తీసికొని వచ్చి పెట్టిరి! సర్కారు ఖజానాలో డబ్బులేదన్నమాట మాకు తెలియును. సిపాయీలజీతాలు నెలనెలా బకాయిపడుచున్న మాట మాకు తెలియును. కాని, యీ స్వల్పమైన యిబ్బందుల నన్నిటని తీర్చుటకు ఒక్కటే సులభమైన మార్గమున్నది. ఆ మార్గము మాకు— యుద్ధమందు విజయముగొన్న మాకు— తెలియును. అదేమనగా :- మన ఖజానాలో తక్కువబడిన సొమ్మంతా చావగొట్టి మనశత్రువులనుండి లాగికుంటేసరి! ఇంకా తాను ఓడిపోలేదని పొగరుబోతుతనమున తలయెత్తే శత్రువు నెత్తిమీదగొట్టి, వాడిఖజానా అంతా కాజేస్తేసరి. ఇట్టి పద్ధతిలోగల అయుక్తత, అన్యాయము మున్నగు సున్నితభావములు రణరంగమందు పాటింపబడజాలవు.

ఇక్కడ యిండియాలో వుండే పరిస్థితులు, లోతుపాతులు మాకు- చిరకాలమునుండి యిక్కడవున్న మాకు— తెలియును గాని, నిన్న నేడు సీమనుండి దిగిన యీ ముసలాయన కేమి తెలియును ? కాబట్టి, యిట్టివిషయములలో యెప్పుడేమి చేయ వలయునో మేము ఆయనకు సలహా చెప్పవలయునేగాని, ఆయన మాకుసలహాచెప్పగలడా ? యీయనయీ మనుష్యులనాజ్ఞాపించి నడిపించునది?" అని యీరీతిగా కుంపిణీ సేనాధ్యక్షుడును, తదితర యుద్యోగస్తులును తలపోయసాగిరి. కాని, ఒక్క సంగతి మాత్రము వారెరుంగరు! ఇది చాలా ప్రధానమైనది. వెల్లస్లీ యిండియానుండి వెళ్లిపోవునప్పుడు, ప్రస్తుత స్థితిని గూర్చియు, యికముందు జరుగవలసిన పనిని గూర్చియు, యీతడును, కారన్‌వాలీసును, కూడ— ఉభయులు సంప్రతించుకొనిరి. మహారాష్ట్రరాజ్యముల విషయమున యిక ముందవలంబించవలసిన విధానమునుగూర్చి, సర్ జార్జిబార్లో యనునతడొక విపులమగు రిపోర్టు వ్రాసెను. ఈ రిపోర్టులోని సూచనల కన్నిటికిని క్రొత్త పాత వైస్రాయి లిరువురు అంగీకరించిరి. వేయేల చేతికి రావీలైయున్న రాజ్యములనుకూడ పూర్తిగ వదలుకుని, యెట్లయినను శాంతి చేసికొనుటయేతప్ప, వేరు గత్యంతరము లేదని తోచెను. అప్పుడింటికి బోవుచున్న వెల్లస్లీ ప్రభువుకుకూడ గట్టిగ తోచెను. అప్పటి పరిస్థితులలో, "శాంతి, శాంతి," తప్ప వేరుమార్గము సాధ్యముకాదని గట్టిగా నచ్చెను.

ఇంతకు పూర్వము చేసిన యుద్ధములలో పూర్తిగా జయమబ్బెనేగాని, ఫలితము మాత్రము శూన్యమయ్యెను.

మహారాష్ట్ర సైన్యముల నొక్కొక్కదానినే ఓడించి, చెదర గొట్టిరి. కాని, వెంటనే అవి యింకొక చోట కూడుకొనెను. తన సంస్థానములోనున్న ఇంగ్లీషు రెసిడెంటును చెరబట్టుటకు కూడ సింధియా సాహసించెను. దీని కాతడు చెప్పిన కారణ మేమనగా:— తనతో లోగడ చేసికొన్న ఒడంబడికకు విరుద్ధముగ కుంపిణీవారు గ్వాలియర్ పట్టణమును స్వాధీన పరచు కొనిరట. ఆకారణముచే ఆపట్టణమును కుంపిణీవారు వదలివేసే వరకు యీ యింగ్లీషు రెసిడెంటును బంధించెదనని సింధియా చెప్పెను. ఏకారణముచేతనైనా సింధియాతో బహిరంగముగ పోరాటము గలుగునేమోయను భయముచే "ఆత్మరక్షణ కొరకుతప్ప, నీ వాతని మీదకు పోవద్దు" అని కారన్‌వాలీసు లేక్ సేనానికి ఖచితముగా నుత్తరువుల బంపెను. ఈ ఉత్తరువులు రాగానే, "ఛీ, యిక నేనీ సేనాధ్యక్షపదవిలో నుండను" అని విసుగుదలతో లేక్ సేనాని కత్తినావల పారవేసెను; తనపదవికి రాజీ నామానిచ్చెను. "తొందరపడవద్దు; నీనిశ్చయమును మార్చు కొనవలసినది; మన మిద్దరము చాలాస్నేహితులముగామా! నీవుచేసిన అపారమగు దేశసేవ నేనెరుంగనిదికాదు. తొంద రపడి సైన్యాధ్యక్షపదవి వదలుకొనవద్దు; మనమిద్దరము కలసు కుని, ముఖతః స్వయముగ, మనస్సులలోనున్న అభిప్రాయము లను ఒకరికొకరు బహిరంగముగ తెలుపుకుని, మాట్లాడుకొను వరకును, నీవా పదవిని వదలుకొనవద్దు" అని కారన్‌వాలీసు లేక్ సేనానికి తిరిగివ్రాసెను. పాపమిదియే ఆతడు ఉద్యోగ రీత్యా వ్రాసిన ఆఖరు ఉత్తరము! ఏలననగ, మృత్యుదేవత

అప్పుడేవచ్చి గుమ్మములో సిద్ధముగా కాచుకుని కూర్చుండెను. అక్టోబరు 5 వ తేదీన కాశీరాజ్యములో చేరిన ఘాజీపురములో, కారన్ వాలీసు కాలధర్మమునొందెను.

తిరిగి ఇంకొకవైస్రాయి ఓడదిగేవరకు— యీమధ్య కాలములో— కౌన్సిలులో సీనియరుమెంబరైన సర్ జార్జి బార్లో అక్టింగు వైస్రాయిగనుండెను— కారన్ వాలీసు పద్ధతియే యీతనికి నచ్చెను. అందుచే ఆతనిమార్గమునే యీతడనుసరించెను. ఆంగ్లసేనలన్నిటిని యుత్పాత స్థానములనుండి వివేకముతో వెనుకకు మరలించెను. చిల్లరరాజులతో సంధి చేసుకొని, దేశమందంతట శాంతినెలకొల్ప సంకల్పించెను. పరిసరరాజ్యములవారి తగాదాలలో తాను మధ్యవర్తిగ ప్రవేశించననియు, "మీతంటాలు మీరేపడవలసినదనియు" గట్టిగ చెప్పివేసెను. "ఎవరితగాదాలు వారే స్వయముగా, యేతంటాలోపడి తీర్చుకునేటట్టు వదలివేయడం మనవిధి" యని ఆతడనెను. బార్లో అవలంబించిన యీ తాటస్థ్యభావము— యీయుదాసీనత— వెల్లస్లీ పెట్టిన "బలాత్కార సంరక్షణాపు" బడిలో చదువుకున్న పిదపబుద్ధులగు యువక తంత్రజ్ఞులకందరి కెంతయో నిరుత్సాహ జనకముగను, మనో వ్యథాకారణముగను గన్పట్టెను. ఇంతేగాక యీ తాటస్థ్య భావమువలన మరికొన్ని గొప్పనష్టములుకూడ గలుగునని వారు భయపడిరి. "ఇంతవరకు మనమవలంబించిన ప్రచండ దండనీతివలన రాజ్యముల పొలిమేరలలో చెలరేగుచుండిన, పోరాటములు, యుద్ధములు, కలవరములు, దోపిడీలు, యెక్కడివక్కడ మాటుమణిగి యుండెను.

కాని, యిప్పుడీ కారన్‌వాలీసు, బార్లో మున్నగువార్లు అవలంబించిన సాధుపద్ధతివలన అణగిపోయినవనుకున్న ఆ పోరాటములు, ఆ కలవరములు, ఆ దోపిడీలు, అన్ని తిరిగి తలయెత్తును. ఇది అన్నిటికంటె చాలా అపాయకరమైనస్థితి. దేశమందు శాంతి భద్రతలు శాంతముగా నెలకొనవలెనంటే రెండే మార్గములున్నవి. తిరిగి తలయెత్తకుండ హోల్కారు పొగరణచుట మొదటిపని. ఆతనిని అసలే బొత్తుగా నాశనం చేస్తే మరీ మంచిది. హిందూస్థానమందున్న చిల్లర రాజులతో నేస్తము నెరపి వారిపై మనసర్వాంసహాధికారము శాశ్వతముగ నెలకొల్పుట రెండవ పని"—అని కుంపిణీయుద్యోగములోనున్న యువకులందరు తలంచుచుండిరి. ఈ విధముగ కవ్వించి కయ్యమునకు కాలుత్రివ్వి పరులపై బడుదమను పద్ధతిలో చేరినవాడు మెట్‌కాఫ్ అనునతడొకడుండెను. ఈతడు తదుపరి కొన్నాళ్ళు వైస్రాయిగకూడ నుండెను. చిన్నప్పుడీతనికుండిన యీ యభిప్రాయములు, యీతడు పెరిగి పెద్దవాడై నిజపరిస్థితుల నెక్కువగా తెలుసుకున్నప్పుడు చాలా వరకు మారిపోయెనని అతనే ఒప్పుకొనెను. ఇట్టివాడుకూడ హోల్కారునెడ జూపబడిన సహనభావమును ఆమోదించలేదు. అయినను అప్పుడారోజులలో అంతకంటె వేరుమార్గము కానుపించలేదని ఆతడే చెప్పెను.

అప్పటి కా సంవత్సర మింకను ముగియలేదు. ఈలోగా హోల్కారుకు, కుంపిణీకి సంధికుదుర్చుటకై తాను మధ్యవర్తిగా నుందునని రణజిత్‌సింగ్ చెప్పెను. ఈ సంధికి కావలసిన ఉపక్రమణ మంతయు జరిగెను. ఈ సంధిలోని

షరతులన్నియు, కుంపిణీవారికి చాలా తలవంపులుగానున్నవని ఆంగ్ల సైనికోద్యోగులు లోలోన సణగుకొనిరి. కాని, అప్పటి స్థితినిబట్టి యివేచాలబాగున్నవని వైస్రాయియు ఆతని కౌన్సిలు వారును సంతోషించిరి. తనప్రజలు యుద్ధముచేసి విసిగి వేసారియున్నారనియు, యుద్ధమెప్పుడు ముగియునా యని వారలు బహుఆత్రముతో యెదురుచూచుచున్నారనియు, కాబట్టి, యుద్ధమిక ముగిసినదని తెల్పుటకు సూచకముగా తన ప్రజలకు తృప్తిగలుగునట్లుగ, తామొక ఆంగ్లరాయబారిని తన వద్దకు బంపవలసినదనియు హోల్కారు కోరెను. ఈజస్వంతరావు హోల్కారుకు ఒక్కటేకన్ను. అందుచే యితనికి, "యేకాక్షి," లేక "ఏక్ - ఆక్షమ్ - ఉల్ - డౌలా" యని మారు పేరుండెడిది. ఈతడు చాలా మోటుమనిషి, అనాగరికుడు అని మెట్‌కాఫ్ మున్నగు కుంపిణీ యుద్యోగస్థు లనుకొనుచుండెడివారు. కాని, నిజముగ యీతడు మోటుమనిషి కాడనియు, మంచి మర్యాద, పొందిక, నాగరికత గలవాడనియు, వారి కిప్పుడు తెలిసివచ్చెను. యుద్ధభూమియం దాతని శిబిరము ఆడంబర రహితమై, ఆతడు తన శరీరముపై ధరించిన యమూల్యమైన యాభరణములుతప్ప తదితర ఐశ్వర్య చిహ్నములేవియు అందు కానబడెడివికావు. తనకున్న యైశ్వర్యమంతయు యెప్పుడు తనవెంట తన జీనులోనే మోసికొని పోవుచుందునని యాహోల్కారు యిటీవలనే, మంచి హుషారీగానున్న సమయమున ప్రగల్భము ప్రకటించుకొనెను. ఆతని రాజ్యములో చాలాభాగ మిప్పుడు తిరిగి ఆతనికి వచ్చివేసెను. కొత్త గవర్నరుజనరలుయొక్క మెత్తదనమును

చూచి, సింధియాకుకూడా సంధిగుణము పుట్టెను. ఈ సమయములోనే కుంపిణీతో సంధిచేసికొనుట మంచిదని సంతోషించి, ఆతడు కుంపిణీతో సంధి చేసికొనెను. ఇంతటితో ఇదివరకున్న వ్యవహారపు చిక్కులన్నియు తీరిపోయెను.

శాంతి వలదని లేక్ సేనాని తాను చెప్పవలసినన్ని విధముల చెప్పిచూచెను. కాని, తన మాటెప్పుడైతే సాగలేదో, అప్పటినుండి అతడీ రాచకార్యముల జోలికి పోవుట మానివేసెను. ముఖ్యముగా "టోంకు" రాంపుర సంస్థానమును సింధియాకు యిచ్చివేయుట లేక్ సేనానికి యెంత మాత్రము యిష్టములేదు. ఏలనో సింధియాకూడ యిది తన కక్కర లేదనెను. తక్కిన సంధిషరతు లన్నియు ధ్రువపడిన పిమ్మట తుట్టతుదకు దీనినికూడ హోల్కారుకే—అతడు అడుగకుండగానే,— యిచ్చివేయుచున్నామని చెప్పి, ఆ సంధిపత్రములో చిట్టచివర యింకొక వాక్యమును చేర్చిరి. "సర్ జార్జిబార్లో రాజనీతి" యను పేరుతో 1806 సం॥ లో మెట్‌కాఫ్ ఒక గ్రంథమును వ్రాసెను. దానిలో మన రాజ్యరక్షణకొరకై పొరుగు రాజ్యములలో కలహములను పెంచుచున్నాడను నేరమును ఆతడు బార్లోపై మోపుచున్నాడు. ఇది చాల అనాగరికము, అసమర్థనీయము, పైశాచికముఅని మెట్‌కాఫ్ నిందించి యున్నాడు. "ఇంతకంటె అన్నిరాజ్యముల నణచి, అన్నిటిపై మనమే సర్వంసహాధికారమును వహిస్తే బాగుంటుం" దని అతని అభిప్రాయము. "ఇప్పటికి ఇండియాలో రెండే బలిష్ఠమైన రాజ్యాలు నిలిచియున్నవి. అవేవనగ —

ఒకటి కుంపిణీవారు; రెండు మహారాష్ట్రులు. మన సర్వాంసహాధికారమును స్థాపించలేనిచోట, అక్కడనున్న ప్రజల నందరను, పాపము మహారాష్ట్రుల బారికి, వారి యిష్టమువచ్చినట్లు పీడించడానికి, బాధ పెట్టడానికి— వదలివేసితిమి! కాని, మనమేమి చేయగలము? అప్పుడు మన ఇంగ్లీషు గవర్నమెంటువా రవలంబింప నిశ్చయించుకొన్న రాజనీతి యిట్లుండెను! యమునానదికి పశ్చిమభాగమందున్న మన భూములను, ఆశ్రిత రాజ్యములను, వదలివేయుటకై మనము నిశ్చయించుకొంటిమి. 1806 సం|| లో చేసికొన్న యొడంబడికలలో యీ సిద్ధాంతము పొందుపరుబడియున్నది.

సట్లెజ్ నదికి ఉత్తరమందున్న రాజ్యముతోగాని ప్రజలతోగాని కుంపిణీవారెట్టి జోక్యము కలిగించుకోరాదని 1809 సం|| ఏప్రిల్ 25 వ తేదీని కుంపిణీవారును, పంజాబు మహారాజగు రణజిత్ సింగ్‌ను చేసికొన్న ఒడంబడికలో నున్నది. తన రాజ్యముయొక్క ఆంతరంగికపరిపాలన కవసరమగు సేనలకంటె హెచ్చు సేనలను రణజిత్ సింగ్ సట్లెజ్ నదికి యెడమపార్శ్వమం దుంచరాదనియు, చుట్టుపట్లనున్న చిల్లర రాజ్యములలో తాను జొరబడుటగాని, యితరులను జొరబడనిచ్చుటగాని, చేయరాదనియు కూడ ఆ యొడంబడికలో కలదు. ఈ రీతిగా, యమునా, సట్లెజ్ నదుల మధ్యమున్న భూభాగ మంతటిపైనను కుంపిణీవారు సర్వాంసహాధికారులని యిందు ప్రకటింపబడెను. ఈ భూభాగమందున్న రాజు లందరితోడను యిదివరకు కుంపిణీవారి కెట్టి సంబంధముండెనో యెక్కడను ఖచితముగ వివరింపబడి యుండలేదు.

కాని యిప్పుడీ సంధివలన యిదివరకు అనిర్ణీతముగా నున్న సంబంధములుపోయి, వాని స్థానమున వీరందరిపై కుంపిణీవారి సర్వంసహాధిపత్యము స్థాపింపబడెను. తదనుగుణముగ సర్‌హింద్, మాల్వా రాజ్యములు కుంపిణీవారి రక్షణక్రిందికి వచ్చె నని వెంటనే ప్రకటింపబడెను. "ఈ రాజులవల్ల మేమేమియు కప్పము కోరము. కాని, తమ రాజ్యములగుండా కుంపిణీవారి సైన్యములు నిరాఘాటముగా పోవుటకును, కోరినప్పుడు తాముకూడావచ్చి కుంపిణీవారితో చేరుటకును మాత్రము యీరాజులు బాధ్యులై యుందురు" అని ప్రకటించిరి. సర్వసహాధికారికి సామంతరాజుకు ఉండు సంబంధమునుబట్టియు, తమ యంతఃకలహములలో తక్కువ వాని తీర్పుపై యెక్కువ వానివద్ద అప్పీలుచేసికొనుటకు ప్రజలకుగల సహజమగు హక్కును బట్టియు, దేశములో శాంతినెలకొల్పవలసిన అని వార్యమగు బాధ్యతనుబట్టియు,— యిన్నికారణములచే కుంపిణీవారు యీ సామాంతరాజ్యముల ఆంతరంగిక పరిపాల నలో జోక్యము కలిగించుకోవలసి వచ్చిన సందర్భము లనేక ములు అచిరకాలములోనే తటస్థించెను. ఈరీతిగ కొంతకాలము జరుగుచుపోగా, యీ రాజ్యములలో జోక్యము కలిగించు కొను హక్కు తమకుగలదనియు, అట్లు కలిగించుకొనుటకు తాము పూర్తిగ సంకల్పించుకొంటి మనియు, కుంపిణీవారు విధిలేక ప్రకటింపవలసి వచ్చెనట! ఈ రాజ్యములలో వారస త్వము నిర్ణయించు అధికారము మొదటినుండియు సార్వభౌ మాధికారులగు కుంపిణీవారికి కలిగియే యున్నదట! సామంత రాజులకు వారసులులేనప్పుడు ఆరాజ్యములను సార్వభౌముడు

తన సామ్రాజ్యములో కలుపుకొనుహక్కు— భారతవర్షములో అనాది నుండియు ఉన్నదేగద! కాబట్టి, యిప్పుడుకూడ, రాజకీయావసరములబట్టి, కుంపిణీవారుకూడ యీ సిద్ధాంతమునే అమలు జరిగించవలసిన అవశ్యకతవచ్చినదట !

1806 సంవత్సరమందేర్పడిన సీమమంత్రివర్గములో యిండియా వ్యవహారముల జూచుపని బర్కుమిత్రుడగు సర్ గిల్బర్టు ఇలియట్ అనునతనికి వప్పగించబడెను. వారన్ హేస్టింగ్సుమీద కేసుపెట్టిన సందర్భములో నితడుకూడ నొక ఫిర్యాదిగనుండెను. ఇతని మిత్రభావము, సామర్థ్యము తనకా కేసులో యెంతవిలువగనుండెనో తెలుపుచు బర్కువ్రాసిన ఉత్తరములిప్పటికిని గలవు. 'ఇంపే' మీద కేసును నడిపించు భారము ప్రత్యేకముగ నీతనిమీద పెట్టబడెను. కృతాపరాధుడగునీ 'యింపే' పై యీతడొనర్చిన యభియోగవాదములు యీతని నెంతయు ప్రశంసాపాత్రునిజేసెను. సాధారణముగ ప్రపంచములో యెవరిని మెచ్చుకొనని కఠిన విమర్శకులు సైతమీతని సామర్థ్యమును చాలగ పొగడిరి. మధ్యధరాసముద్రములోగల కార్సికాలంకను కలుపుకొనుటకై రాయబారములు నడపుట కీతనిని 1793 సం॥ లో సీమ గవర్నమెంటువారు పంపించిరి. ఈ లంకకితడు చాలకాలము గవర్నరుగ నుండెను. ఫ్రెంచివారి కనుకూలురగు మంత్రివర్గము అధికారమునకు వచ్చిన పిమ్మట యితడా గవర్నర్ పదవికి రాజీనామా నివ్వవలసినవాడాయెను. తదుపరి యితడు సీమప్రభుత్వము తరఫున "వియన్నా" నగరములో రాయబారిగ నుండెను. ఇప్పుడితడు "బోర్డుఆఫ్ కంట్రోలు"కు ప్రెసిడెంటుగవచ్చెను.

ఇతనికి యిండియావిషయమై చాల అనుభవముగలదు; పర దేశములలో రాజ్యతంత్రముల నడపుటయందును చాల మెదిగి యున్నాడు. తన సహోద్యోగుల యనుమతితో యిండియాకు "లాడర్ డేల్" ప్రభువును గవర్నర్ జనరల్‌గ నియమింప దలంచెను. కాని, కుంపిణీ డైరెక్టర్లు దీనికి యెంతమాత్రము సమ్మతింపలేదు. దీనికంటె, యిప్పుడున్న సర్ జార్జిబార్లోనే గవర్నర్ జనరల్‌గ ఉండనిస్తే బాగుంటుందని వారనిరి. ఈ పేచీలతో కొన్ని వారములు గడచెను. తుట్టతుదకు బోర్డులో నున్న మింటోప్రభువే గవర్నర్ జనరల్‌గ యిండియాకు వెళ్ళు నట్లును, బోర్డులో ఖాళీయైన యీతనిస్థానమందు "డండాస్" వచ్చునట్లును, ప్రస్తుతము తాత్కాలికముగ, యిండియాలో గవర్నర్ జనరల్‌గనున్న సర్ జార్జిబార్లోను మద్రాస్‌గవర్నర్‌గ పంపునట్లును ఏర్పాట్లుజరిగెను. ఈ మింటోప్రభువు యిండి యాలో ఆరేండ్లు గవర్నర్ జనరల్‌గ నుండెను. ఈతని కాలము శాంతముగ జరిగిపోయెను. కవ్వించి పరరాజ్యము లపై దాడివెడలుపద్ధతి లేకుండెను. ఈతని సహజస్వభావ మును బట్టియే యీతని కీపద్ధతి రుచించలేదు. ఈతడవలం బించిన యీ శాంతిపద్ధతి సీమలో—ఒక్క గ్రెన్‌వెల్ ప్రభు వుకు తప్ప— తక్కినపెద్దలందరికిని రుచించెను. ఈతడు రాజ్యమునకు వచ్చుకాలమునకు కుంపిణీవారి ఆర్థిక స్థితి మిక్కిలి యస్తవ్యస్తముగ నుండెను. దీని నెట్లయి నను చక్కబరుచుటకే తన నిక్కడికి పంపించిరను సంగతిని మింటోప్రభువు చక్కగ తెలిసికొనెను. ఈ పనిని నిర్వ హించుటకై వర్తకమును, పరిశ్రమలను, పెంపొందించుటయు

సివిల్ మిలిటరీ డిపార్టుమెంటులలో ఖర్చును తగ్గించివేయుట యును— అవసరమని ఆతడు నిశ్చయించుకొనెను. ఇట్లుండగ, 1808 సం॥ లో తిరువాన్కూరులో తిరుగుబాట్లు బయలుదేరెను. ఈ సంస్థానమున కారోజులలో నీతి నియమములు లేని పాపంపుడొకడు దివానుగ నుండెను. రాజు పేరునకు మాత్రము రాజుగనుండి యావదధికారములను యీ దివానునకే నప్పగించి యూరకొనెను. ఈ దివానుని చెప్పుడు మాటలను విని, పాపము కొందరు ప్రజలు మోసపోయి, దేశమం దరాచకమును గల్పించి, అనేక క్రూరకృత్యములను, ద్రోహపు పనులను గావించిరి. కుంపిణీవారి రాజ్యాధికారమును త్రోసివేయుట కీతడు కొచ్చిను మలబారు రాజులతో చేరి కుట్రలు పన్నసాగెను. ఎట్లయిననేమి, కొంత ప్రాణనష్టము జరిగినపిమ్మట దేశమందు తిరిగి శాంతి నెలకొల్పబడెను. "దివాన్ చేసిన కుట్రల సంగతి నాకేమీ తెలియదు" అని రాజు తప్పుకొనెను. తన ప్రజలు చేసిన దుర్మార్గకృత్యములకు చాల విచారమును గనుపరచెను. కాని, కుంపిణీవారతనిని 3, 4, యేండ్లవరకు క్షమించలేదు. 1813 సం॥ లో తిరిగి కొన్ని నిర్బంధములపెట్టి, తన రాజ్యమును తాను యేలుకోవచ్చునని చెప్పిరి. అప్పటినుండి నేటివరకు దేశము కల్లోలములులేక శాంతముగనే యుండెను.

తిరువాన్కూరు రాజ్యములో ప్రజలిట్లు తిరుగుబాటు చేయుటకు రేపెట్టిన కారణములేమి? ఏమనగ:— క్రైస్తవ మిషనరీలవలన తమ సనాతనధర్మములు మంటగలియునేమో యను భీతియే వారి నిట్లు ఉద్రేకపూరితుల గావించెను. ఈ

మిషనరీలకు యింగ్లీషు గవర్నమెంటువారు వెనుకనుండి మద్దతు చేయుచున్నారని ప్రజలు తలంచిరి. ఇదిగాక, యింగ్లీషు రాజ్యమును కూలద్రోయుటకై మహారాష్ట్రులును, తదితర హిందూజాతులును యేకమై పెద్ద పన్నాగములు పన్నుచున్నారనియు, దానిలో తాముకూడ చేరవలసి యుండుననియు ఊహ ఒకటి వారికెట్లో పుట్టెను. ఈ కారణములచే ప్రజలు తిరుగుబాటు చేసిరి. ప్రజలలో యిట్టి భావము లుత్పన్నమగుచున్న సంగతి సూక్ష్మదృష్టియు, కుశాగ్రబుద్ధియు గలిగి అప్రమత్తులై యుండు కుంపిణీ వారికి తెలియకుండునా? ఒకదాని కొకటి సంబంధములేని భిన్నభిన్న స్వభావములుగల సామాగ్రితో వారీ సామ్రాజ్య సౌధము నెట్లో త్వరత్వరగ, ఆత్రముతో— పూసిపెట్టి నిర్మించుకొనిరి. ఇట్టి సౌధమునకు పునాదులు బహు దుర్బలముగనున్న సంగతి వారెరుంగుదురు. పైకి డాబుగ కనిపించుచున్నదేగాని, లోపల నిజముగ బలము లేదను సంగతియు వారెరుంగుదురు. "ప్రజల కందరకు మతసంబంధమగు అనుమానముగనుక మనమీద కలిగిందా అంటే, యిక మనపని వట్టిదే" అని వారు భయపడుచుండిరి. "లేదా, ప్రజలందరు యేకమతస్థులైపోయినా మన రాజ్యమునకు ముప్పమే" అని కుంపిణీవారు భయపడుచుండిరి. కుంపిణీ వారికి గల నిజమైన భయమిది. "రాచకీయ సంబంధమగు ఐకమత్యత ప్రజలలో ఎన్నడూ లేదు. ఇకముందును కలుగబోదు." కాబట్టి, యీ విషయమై భయము లేదు. ఉన్న భయమంతా మతసంబంధమగు నైకమత్యములోనే వున్నది.

"ఇండియాలోని ప్రజానాయకు లందరుగనుక క్రైస్తవులై పోయినారా అంటే మన రాజ్యము మరునాడే పోతుంది" అని ఒక గొప్ప కుంఫిణీ యుద్యోగి వ్రాసెను. అదిగాక, క్రైస్తవ పాదిరులువచ్చి ప్రజల నందరిని కిరస్తానీ మతములో కలుపుకొనుచునుండుట ప్రజల కందరకు చాల భీతావహము గలుగించుచున్నది. ఈ భీతావహము కూడ తుదకు మనరాజ్యమునకు ముప్పుదెచ్చిపెట్టవచ్చును.

ఈ మధ్య ఫ్రెంచివారితో గలిగిన యుద్ధమువల్ల కుంఫిణీ వారి ఓడ వ్యాపారమంతయు నశించెను. ఫ్రెంచి యుద్ధనౌకలు మారిషస్, బోర్బన్ లంకలనుండి ఫిరంగులతోడను, తదితర యుద్ధ పరికరములతోడను బయలుదేరివచ్చి కుంఫిణీవారి వర్తకపుఓడల బాధించెను. ఈ వర్తకపుఓడల సంరక్షించుటకు తగు యేర్పాట్లు లేకుండెను. ఇట్టి బాధను తొలగించుకొనవలయునని కుంఫిణీవారు చాల రోజుల నుండి యోచించుచుండిరి. 1809 సం॥ లో కెప్టెన్ రాలీ, కర్నల్ కీటింగ్ అనువారు కొలది సైన్యముతో సాహసించి ఆకస్మికముగపోయి బోర్బన్ లంకమీదపడిరి. వారా లంకలో కాలూని నిలుచుటయేగాక, ఆలంకకు ప్రధాన నగరమగు "సెంటుపాల్" అను పట్టణమునుకూడ స్వాధీనపరచుకొనిరి. అయినను, వారివద్ద తగినన్ని సైన్యములు లేనందున, అక్కడ స్థిరముగ పాదుకొనుటకు వీలులేకపోయెను. కాని, ఆపట్టణము మిక్కిలి బలిష్ఠమైనదని, దుర్భేద్యమైనదని, యిదివరకు అనుకొనెడివారు—కాని, దానిబలాబలము లిప్పుడు వారికి పూర్తిగ తెలిసివచ్చెను. దానిబడాయి

లిప్పుడు బయటపడెను. ఈ ధైర్యముచే మరుసటి సంవత్సర మింకొక దండయాత్రను బంపి కుంఫిణీవా రీలంక నేగాక, మారిషస్ లంకనుకూడ అవలీలగా స్వాధీనపరచుకొనిరి. ఇవి యిప్పటికిని యింగ్లీషువారి క్రిందనేయున్నవి. ఇంతకంటె ఘనమైనకార్య మింకొకటి చేయవలెనని 1811 సంవత్సరములో మింటోప్రభువు సంకల్పించెను. "(ఒలందా) హాలండు దేశ మిప్పుడు పూర్వమువలె స్వతంత్రరాజ్యముకాదు. అయినను వీరి తాలూకు బటేవియాలంక ఒకటి యింకను యీ వైపున మిగిలియున్నది. వారికున్నవానిలో యిదే చాలపెద్దది. ఇది మన కుంఫిణీవారి రాజ్యమునకు చాలాచేరువలోనున్నది. కొంపదీసి, దీనిని మనశత్రువులెవరైనా పట్టుకున్నచో, మన రాజ్యమునకు చాలాముప్పము. కాబట్టి దీనినెట్లయినను మనమే కలుపుకోవలెను" అని మింటో తలపోసెను. వెంటనే తగిన సన్నాహములగావించి, కెప్టెను ఆలీ యాధిపత్యము క్రింద ఒక యుద్ధనౌకాదళమును సిద్ధపరచి యీ లంకపై పంపించెను. ఇందులో ఆశ్చర్యమేమనగా, మెత్తనివాడనుకొనిన మింటోప్రభువు తానుకూడా స్వయముగా బయలుదేరి యీదండయాత్ర వెంట బోయెను. ఈతనెంతో మెత్తనివాడని, శాంతపురుషుడని అనుకొనినవారికందరికి ఆశ్చర్యమయ్యెను. ఈ లంకలో ఒకచోటు శత్రురక్షితముగాక ఖాళీగానుండెను. కుంపిణీవారి సేనలిక్కడ ఓడదిగి, యీ ఖాళీప్రదేశములో నిరాటంకముగా మకాముచేసి యుండెను. బటేవియా నగరము కూడ నిరాటంకముగ స్వాధీనమయ్యెను. కొండప్రదేశములో మాత్రము కొంచెము యుద్ధము జరిగెను. విశేషము

రక్తపాతము లేకుండగనే, చిరకాలము డచ్చివారి స్వాధీనములోనున్న కోటలు, ఓడరేవులు— సమస్తము ఇంగ్లీషు వారి స్వాధీనమయ్యెను. ఇవి యీమధ్యను పరాసువీరుడగు లాలియనునతని వలన రాజ్యములుగ నేర్పడియుండెను. కాని. యిప్పుడు వీనిని కుంపిణీవారే స్వాధీనపరచుకొనుటచే, కుంపిణీవారికి నిర్భయమయ్యెను. యిండియాకు చుట్టుపట్టుల నున్న సముద్రములో నెక్కడనుకూడ ఇంగ్లీషువారి మాటకు యెదురు లేదు. వారి జెండా యెగురని చోటు లేదు. ఈ బటేవియా లంకకు మూడేండ్లవరకు సర్ స్టామ్ఫోర్డు రాఫిలిస్ అనువాడు గవర్నరుగ నుండెను. యుద్ధానంతరము తిరిగి దీనిని సగౌరవముగ హాలండున కిచ్చివేసిరి. (ఇది సముద్రముమీది వ్యవహారము.) ఇక మెట్టను, యిండియాలో మాత్రము మింటో ప్రభువు శాంతి మార్గమునే అవలంబించెను. అప్పుడప్పుడు సింహాసనారోహప్పు దోపిడులవల్లకాని, ఘూర్కారాజుల గర్వ ప్రవర్తనముజూచి చుట్టుపట్టులవారు తన కతిశయోక్తిగ చెప్పు మాటలవల్లగాని, మింటోప్రభు వొక్కరవ్వయైనను తనశాంతి మార్గమునుండి మరల దలచలేదు. తన యధీనమునందున్న యీ దేశముయొక్క నిజస్థితి నాతడు గ్రహించకపోలేదు. ఎన్ని విషయముల జూచినను, దేశమునకు శాంతియావశ్యకమని ఆతడు గట్టిగ నమ్మెను. ఇటు ఒకమూల యిదివరకే కుంగిపోవుచున్న ప్రజలపైని క్రొత్త పన్నుల విధింపకుండ, అటు యింకొకమూల తన కంపెనీ భాగస్వాములు కోరు ఉచితలాభమును, తన శక్తివంచనలేక ప్రయత్నముచేసి ప్రభుత్వముయొక్క పరపతిని, నిలువబెట్టుటయే తన పనియని నిశ్చయించుకొనెను.

"మితవ్యయము, మితవ్యయము" అను ఘోషయే ఆరోజులలో నెక్కువగానుండెను. ఒడలుమరచి పరరాష్ట్ర రాజ్యములపై పడురోజులు గతించినవి. ఇప్పుడు కొంచెము ఒళ్లుతెలిసి, ఖర్చుతగ్గించుకోవలసిన రోజులువచ్చినవి. దుబారా ఖర్చును తగ్గించుకోవలెను. పోనీ పాతఋణములు దీర్చలేక పోయినా, యికముందైనను ఆదాకు ఖర్చు సరిపెట్టి, క్రొత్త ఋణములు చేయకుండావుంటే అదేపదివేలు. సైన్యపుఖర్చు తగ్గించడానికి వీలులేదు; దీనిని తగ్గించుచున్నట్లు కనబడుటయు అపాయమే! భుజబలముచేత సంపాదించుకున్న దానిని, ఆ భుజబలముచేతనే నిలుపబెట్టుకొనవలసియుండునని కుంపిణీ రాష్ట్రాధిపతులెల్లరు నిర్మొగమాటముగా, దాపరికమేమియు లేకుండా చెప్పివేసిరి. వీరందరు సమర్థులు, దూరదృష్టిగలవారు, మంచి అనుభవజ్ఞులు. "ఇక్కడ యిండియాలో మనస్థితి మొదటినుండి ఒడుదుడుకుగానే యున్నది. ఇప్పటికిని అట్లేయున్నది. సీమగవర్నమెంటువా రిప్పుడు మనపై విధించిన యీకొత్త శాంతి పరిస్థితివలన — యీ తప్పుపద్ధతివలన, మనపని యిప్పుడు యిదివరకుకంటె మరింత అధ్వాన్నమైపోయినది. ఈపెద్ద మహాసామ్రాజ్యమును యిక్కడ మనము కొద్దిమంది యూరోపియనులమేయుండి పాలింపవలసివచ్చుచున్నది. మనకాదేశమందింకను గట్టిపట్టు చిక్కలేదు; మనకు నలువైపుల బలవంతులును, రణోద్వేగశీలురునుఅగు శత్రువులు క్రమ్ముకొనియున్నారు. ప్రజలకా మనపై ద్వేషము, అసహ్యము పూర్తిగ లోలోపల సర్వత్ర పాదుకునియున్నవి. ఇట్టి సంకటస్థితిలో సైన్యముసంఖ్య నేమాత్రము తగ్గించినను

మనకు తప్పక ముప్పు వాటిల్లును" అని సర్ చార్లెస్ మెట్‌కాఫ్ అనునతడు వ్రాసెను. సైన్యపుఖర్చు తగ్గించుటకు వీలులేదు కాబట్టి, యిక యేమి చేయవలెను? సివిల్ డిపార్టుమెంటులో ఖర్చు తగ్గించవలెను. కాని, దీనికిమాత్రి మెవ్వరొప్పుకొందురు? శివిల్ ఉద్యోగులు దీనికి ఒప్పుకోలేదు. కుంపిణీ వ్యవహారములలో కొంచెము పలుకుబడిగల సీమలోని పెద్దలందరు తమ యుద్యోగములు పోవుననే భయముచేత ఒప్పుకోలేదు. యిక్కడ యిండియాలోనున్న దొరలుకూడ దీనికి ఒప్పుకోలేదు. ఏలనన, దీనివలన తమకో, తమ స్నేహితులకో యేవో లాభములు వచ్చుచున్నవి; ఈ లాభమును వారెట్లు వదలుకొందురు? అయినప్పటికి, యిన్ని చిక్కులు అభ్యంతరములు వచ్చినను మింటో ప్రభువెట్లో తంటాలుపడి కొంచెము పని చేసి చూపించెను. తనకు ముందుండిన తక్కిన వైస్రాయిలవలెగాక, "నా కాలములో కొత్త అప్పు లేమి చేయలేదు" అనేమాటను మింటోప్రభువు వాసును యెట్లో దక్కించుకున్నాడు.



# భరతఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన

## 19 వ అధ్యాయము

### సింధియా, హోల్కార్ 1814—1817



"ఇప్పుడున్న చిక్కులన్నిటికి ఒక్కటేమందువున్నట్లు నాకు తోస్తుంది. అది యేమిటో యిక్కడ చెప్పుట మంచిదనుకుంటాను. మనగవర్నమెంటు, పైకి ప్రకటించకపోయినా, క్రియకు సర్వంసహాధికారియై యుండవలెను. ఈ సంకల్పము నెప్పుడు మనము దృష్టిలో పెట్టుకుని పని చేయవలెను. లెక్కైన రాజ్యాలనన్నిటిని, పైకేగాక పోయినా, అసలు నిజానికి మనక్రింద దాసానుదాసులై యుండేటట్లు చేసుకోవాలి. మొగలాయీ సామ్రాజ్యములోనున్న సామంతరాజ్యాలవలె కాదు — వీనికి సంపూర్ణమైన ఆంతరంగిక పరిపాలనాధికార ముండవచ్చును. మనమిచ్చు రక్షణకు, భద్రతకు ప్రతిఫలముగ యీ సామంతరాజ్యములు మనకు రెండు వాగ్దానముల నివ్వవలెను. ఒకటి — మనము పిలిచినప్పుడల్లా వారు తమ యావత్తు సైనికబలముతో వచ్చి మనకు సహాయము చేయవలెను. రెండు, తమలో తమకు తగాదాలు వచ్చినప్పుడు, ఒకరిమీద ఒకరుపడకుండా మన దగ్గరకువచ్చి చెప్పుకుని, మనముచెప్పు తీర్పును శిరసావహించ

వలెను. ఇవిగాక యింక కొన్ని చిల్లర షరతులను కూడ మనము వారిపై విధింపవచ్చును. ఇందుకు ప్రతిఫలముగ, వారసత్వము వగైరాలలో వారికి కొన్ని మినహాయింపులను మన మివ్వవచ్చును— ఈ ప్రకారము మన మేర్పాటు చేసికొన్నయెడల అట్లే, వారికి స్వాతంత్ర్యమిచ్చినట్టూ వుండదు; అట్లే, చిక్కులు పెట్టినట్టూ వుండదు. సర్వము సంపూర్ణమగును.

—హేస్టింగ్సు ప్రభువు

మాయిరా ప్రభువు మంచిపొందికయగు నడవడిక కలవాడు; చక్కని మనోభావములు గలవాడు. పార్లమెంటు సభ్యునికి లక్షణమగు మెత్తనిబుద్ధిగలవాడు; అంతులేని ఋణాభారము మూపుపైగలవాడు. ఉద్యోగరీత్యా యితడు శిపాయి; వృత్తిచేత రాజాస్థానసభికుడు: చేసే పనులనుబట్టి అమిత వ్యయపరుడు. ఈత డొనర్చిన ఘనకార్య మొకటియు కంచుకాగడాలువేసి వెతకినను కనుపడదు; అయినను, యీతనికి రాజకీయవేత్తలలోను, గొప్పగొప్ప కుటుంబముల వారిలోను మంచిపలుకుబడిగలదు. ఈతని కిట్టి పలుకుబడి యెట్లు లభించినదా యనునది మిక్కిలి ఆశ్చర్యకరమైన సంగతి. స్వలాభముతప్ప, రాజకీయపక్ష సిద్ధాంతము లేవియు యితనికి పట్టవు. యువరాజు తమ్మును మోసగించె నను అసహ్యముతో తక్కిన మిత్రులందరు ఆతనిని వదలివేసినను, ఈ మాయిరామాత్రము ఆతనినే అంటిపట్టి యుండెను. కీటెంటు కృతజ్ఞత యనున దెరుంగజాలడని చాలమంది యభిప్రాయము. కాని, యెవరినెట్లు నుపయోగించుకోవలెనో ఆతనికి బాగా తెలియును. మాయిరా చాల

నమ్మకమైన వాడని రీజెంటు తలచెను. అందుచే 1812 సం॥ లో రీజెంటు యీతని పిలిచి, మంత్రివర్గము నిర్మింపుమని కోరెను. "కాని, తగిన మనుష్యులు లేనికారణముచే,—రాజుయొక్క విశ్వాసమునకు పాత్రులగువా రెవ్వరును లేని కారణముచే,— యీ పని సాగలేదు. దానికి మాయిరా యేమి చేయగలడు?" అని రీజెంటు సమాధానము చెప్పెను. మాయిరా చేసిన ఘనకార్యమునకుగాను, తగిన ప్రతిఫలము మరుసంవత్సరమే లభించెను. (ఇతనికి యిండియా వైస్రాయి పదవి నిచ్చిరి!) ఈ పనికి యితడు తగిన మనిషికాడని, దానికి యిటువంటివాడు పనికిరాడని, యిండియా సంగతి తెలిసిన పెద్దలంతా చాలా అసంతృప్తితో నిట్టూర్పు విడిచిరి. కాని "యీ నియామకము మేము చేసినదికాదుసుండీ" అని కుంపిణీ డైరెక్టర్లు భుజములు ఎగురవేయుచు బదులు చెప్పిరి. మాయిరా ఋణములలో మునిగియున్నాడని యిదివరకే చెప్పియుంటిమిగదా. ఈతని ఋణదాతలందరు కలసి యీతనికి యుద్యోగ మిప్పించిరట! ఈతనికీ ఉద్యోగమైన సంగతి విని ఆ ఋణదాతలందరు బహు సంతోషించి, తమ అదృష్టమును గూర్చి తామే అభినందించుకొనిరట! ఇంతేకాదు; "వద్దన్న కొద్దీ ముప్పువచ్చు" తమ ఋణస్థుని యోగక్షేమముల నారయుచు, ప్రతినెల ఆతనికివచ్చు వల్లిమాలిన జీతములో కొంత తమ ఋణములక్రింద తీసికొనుటకుగాను ఆతని వెంటనే యింగ్లీషు యాకు నక్షత్రకుని (సర్కారు రిసీవరును) పంపించిరట! అసాధ్యుడగు యీనక్షత్రకుడు యీ మాయిరా కంటెముందుగానే కలకత్తాకు వెళ్లి ఆతని రాకకై యెదురు చూచుచుండెనట! బళే!

మార్గమధ్యమందు మాయిరా మద్రాసులో దిగెను. కర్ణాటక నబాబుస్థితి అప్పటికే చాలహీనస్థితిలోనుండెను. "నీ స్థితి నింక అధ్వాన్నస్థితిలోనికి తీసికొనిరానులే- భయపడకు" అని మాయిరాప్రభువు నబాబుకు గౌరవానుగ్రహపూర్వక మగు మధురవాక్కులతో అభయహస్తమిచ్చెను. "మిమ్ము లను గౌరవముగ కాపాడుటయే మాకు గౌరవము. కాబట్టి ప్రస్తుతమున్న ఒడంబడికలను మీకు అనుకూలముగురీతినే అర్థముచేసెదను. భయపడవలదు" అనిచెప్పెను. ఈనవా బును చూచినప్పుడు "ఈతడెంతటి ఐశ్వర్యములలో తులదూ గుచు, యెట్టిఅధికారమును లేక, నిర్వ్యాపారుడై యున్నాడు గదా. ఇట్టినిర్వ్యాపారుని జీవితమెంత చేతనశూన్యమై, యెంత విసుగుదలను గలిగించనలెను?" అని ఆశ్చర్యపడెను. "ఆహా! ఇంతటి మహోన్నత పదవి నలంకరించియున్న యీ మానవుడు పాప మెట్టిదుర్భరమగు నిర్భంధములలో కట్టువడి యున్నాడు! మృగయావినోదముకై షికారీవెళ్లుదమన్నను యీతనికి స్వాతంత్ర్యములేదు—కుంపిణీవారి అనుజ్ఞకావలె నట! ఆతనిపై పెట్టిన అదుపుఆజ్ఞలు అంతకఠోరముగ నున్నవి! పూర్వమత్యంత మహోన్నతదశ ననుభవించిన కర్ణాటక నవాబు సంతతివానికా నేడిట్టిగతి! ఆపూర్వీకులు చేసిన పాప మేమి? వారు కుంపిణీవారితో యెడతెగక స్నేహముచేసిరి! (దీనికి ఫలితమిది.) ఆపాపమునకు ఫలితమిదియని ప్రజలు తలం చుచుండిరి." ఈమాటలు మాయిరాప్రభువు తన ప్రయివేటు డెయిరీలో వ్రాసుకున్నవి. ఈడైరీని పూర్తిగ పరిశీలించి చూచినట్టయితే, యింకననేక చిత్ర విచిత్రములగు క్రొత్త

సంగతులు, భావగర్భితమగు ఒప్పుదలలు మొన్నో దొరకును. వైసారియిగా ఆతడవలంబించిన రాజనీతిసంగతి మనకేమి తెలియకుండ యీ ఒక్క డైరీ బట్టియే—ఆతడు తనలోతాను తనమనోభావములనుగూర్చి స్వగతముగ మాట్లాడుకొని నట్లున్న యీ ఒక్క డైరీలోని సంగతులను బట్టియే ఊహించి చూచినయెడల, దేశమందింక చిరకాలము శాంతియే ప్రబలియుండు భాగ్యమబ్బబోవుచున్నదా యేమియని ఆశపుట్టించునదిగా నున్నది. కుంపిణీవారి వర్తకపుపట్టా 1813 లో తిరిగి యివ్వబడినప్పుడు, దానివెంటనొక క్రైస్తవబిషప్ (ఫాదిరీ) నుకూడ యిండియాకు పంపిరి. ఈతడే యిండియాకు మొదటి ఫాదిరీ- మొదటి క్రైస్తవమతగురువు. ఈ మతగురువుపేరుతో నొక క్రైస్తవపీఠమును స్థాపించిరి. ఈపీఠముయొక్క జరుగుబాటుకై (పోషణకై) కొంత ధర్మాదాయము నేర్పాటుచేసిరి. ఈప్రకార మీపీఠము 50 యేండ్లుజరుగునప్పటికి, దీనికి రాజ్యాంగముపై కొంత పలుకుబడి యేర్పడెను. ఈ ఫాదిరీల మాటలకు కొంత గౌరవము చూపుచునే గవర్నమెంటువారు యేపనినైనను చేయుచుండిరి. ఏసుక్రీస్తుప్రభువు బోధలకును నిజమగు క్రైస్తవమత ధర్మములకును— మాయిరాప్రభువు తన ప్రయివేటుడైరీలో వ్రాసికొన్న నీతిమార్గములకును,— తదుపరి గవర్నమెంటు వారవలంబించిన చర్యలకు యెంతటి వ్యత్యాసముకలదో, భారతవర్షపు సంగ్రామోదంతములే చెప్పక చెప్పుచున్నవి. మాయిరాప్రభువు వైసారియిగావచ్చు నాటికి కుంపిణీవారి కలకత్తాఖజానాలో డబ్బులేదు. ఇది మామూలేగదా— యీసంగతి వేరుగ చెప్పనక్కరలేదు.

సీమలోకూడ డబ్బులేనిసంగతి యితనికి జ్ఞాపకమువచ్చెను. వారూరక డబ్బుపంపించమని వత్తిడిచేయుచుండిరి—"సరే, తరువాతసంగతి యేమాతుందో చూచుకుందాం; ముందు అటునుంచి నాకుఒత్తిడిచేస్తున్నాడు"— అన్నట్లుగ, యిక్కడ నున్న బంగారునవరసులు— మొహారీలు— అన్నీ మూటలు గట్టి, 30 లక్షల రూపాయిల విలువగల నగదు సీమకుపంపించి వేసెను. దీనితో యిచ్చట నోటికిచేతికి అందకుండెను. అందుచే రణోద్వేగశీలురగు నేపాళదేశమువారితో రాయబారములు జరుపుచు మాయిరాప్రభువు కాలక్షేపము చేయజూచెను. సింధియాతోడను, ఆవా (బర్మా) రాజుతోడను రాజీపడి తగాదాలను మాపుకొనెను. ఈయిరువురివల్ల తనకేమి భయములేనట్లు తోచెను. ఇట్టివారితో అనవసరపు చిల్లరపేచీల పెట్టుకున్నందువల్ల తనకంతగ వచ్చేలాభము కనుపించలేదు. "లాభములేకపోగా, యీచిల్లర కజ్జాలవల్ల, యిదివరకే మనచేత దెబ్బతినియున్న వీరందరి హృదయములలో మనపై ద్వేషము చల్లారకుండ అనవసరముగ యెప్పటికప్పుడు రగులుకొను నట్లు చేసినవారమగుదము"— అని మాయిరా ప్రభువు తలంచెను.

మనచే దెబ్బతిని, అవమానితులై యుండియు, యింకను దర్పములోనున్న రాజులమనస్సులలో రగుల్కొనుచున్న పరిభవాగ్నికణముల క్రమక్రమముగా చల్లార్చుటకై, వారికి యెప్పటికప్పుడు మనపై నమ్మకము, విశ్వాసము పుట్టించు అవకాశములు కల్పించుచుండవలెను. రాచకీయవిషయము లలో మనము వారు కలసి సమానగౌరవముతో పనిచేయు

చున్నట్లు చూపవలెను—అట్లు పని చేయుటకు అవకాశములు కల్పించవలెను. ఇట్టి యవకాశములు కల్పింపనిచో, వారికి మనయందు నిరంతరము అపనమ్మకము అనవసరముగ హెచ్చుచుండును. పరిభవాగ్ని వారిమనస్సులలో చల్లారక యెప్పటికప్పుడు నిరంతరము—కలకవేయుచునేయుండును." అయితే వైసాాయియు, ఓడిపోయి తలవంచుకునియున్న యీ రాజులును ఒకరి నొకరు కలసుకుని యేమి రాచమర్యాదల నడుపుకొందురు? ఒకరి మొగము నొకరెట్లు మర్యాదతో, గౌరవముతో చూచుకొందురు? వారు వీరు కలసి యేమి మాట్లాడుకొందురు? మాట్లాడుకొనుటకు మాటలే లేవే! ఇక రాచకీయాభిప్రాయములసంగతి వేరే చెప్పనే అక్కరలేదుగద! (వారి భావములు వారేమని చెప్పుదురు? వీరి భావములు వీరేమని చెప్పుదురు?) ఇకకాగా, పోగా ప్రజల చిల్లర యిబ్బందులను తీర్చుటకై యేవో కొన్ని చిల్లరపనులనుగూర్చి ముభావముగా మాట్లాడుకోవలెను. యింతే- యింతకు మించి రాజులకేమియు పనిలేదు. కుంపిణీవారితో మాట్లాడవలసిన గొప్ప రాచకార్యాలేమియులేవు. బాధ్యతలేమియు లేవు. అధికారములు అంతకు మునుపేలేవు. అట్లుగాక, వారినికూడ మనము మనఃపూర్తిగ మన రాచకీయాలోచన సభలోనికి తీసికొని, వారితో నిరాఘాటముగా సంప్రతించి, వారి రాజ్యములలోని ధనసాధన సంపత్తులను, ప్రజల శక్తిసామర్థ్యములను పెంపొందించుటకును, తద్వారా వారును మనమును క్షీరనీరము వలె కలిసి మిక్కిలి సోదరభావములతో భారతసామ్రాజ్యమును దిద్దుపరచి, పాలింపగడంగినచో, భారతవర్షస్థితి యిప్పటి

కంటె యెంతభిన్నముగా నుండెడిదో గదా ! "గతించిన రాజులే మంచిరాజులురా బాబు" అని తన ప్రజలకును, మంత్రిపురోహితాదిపెద్దలకును అనిపించే యేకించెత్తుపనిని చేసినను, దానిని తీసికొనిపోయి సార్వభౌమాధికారులగు కుంపిణీవారి చెవిలో వూది, "చూచావా, యీ రాజుగూఢముగ యెంతపని చేస్తూన్నాడో; యెల్లా మీపై యెదురుతిరిగి బెదరించడానికి చూస్తూన్నాడో చూడండి" అని దుర్మార్గులు యెవడే కొండెపుమాట యెప్పుడు చెప్పునోయని ప్రతిదేశీయరాజు- తాను స్వతంత్రుడనని యనుకున్నవాడు, అనుకోనివాడుకూడ- భయపడుచుండేవాడు; ఇట్లు భయపడుటకు తగిన కారణము లుండెను. (కుంపిణీవారికి రాజులపై యింతటి అనుమానముండెడిదన్నమాట.) ఈ సంగతుల నన్నిటిని మాయిరాప్రభువు మిక్కిలి బుద్ధిసూక్ష్మతతో గ్రహించెను. వానిని తన మనస్సులో నిశ్చయపరచుకొనెను. "మనబలమును, అధికారమును చూస్తే, దేశీయరాజులకు యీర్ష్య వుండవచ్చును. ఇది సహజమే. అయితే దానివల్ల మనకు అంతముప్పేము లేదు. కాని, ప్రతి చిన్నవిషయములోను మనము చుట్టునున్న రాజులందరితోను, అనవసరముగ జోక్యము కలిగించుకుని, వారిని సూదులుపెట్టి పొడిచినట్లు పొడుచుచున్నాము. దీనివల్ల మనకెక్కువనష్టము- యెక్కువ ఉపద్రవము వస్తుంది. జాగ్రత. ఈ సూదిపోట్లువల్ల కలిగేకోపములో సగమైనా వారికి యీర్ష్యవల్ల కలగదు. ఈ సూదిపోట్లు భరింపలేక వారు మనపై చేసే కుట్రలలో సగమైనా, యీ యీర్ష్యవల్ల చేయరు. మనచే యిదివరకు పొందియున్న యవమానముల చే

దేశీయరాజులు లోలోన మండిపడుచున్నారు. మరియు, యిక ముందేయుపద్రవములు వచ్చునోయను అనుమానముచే, వారు మనదరికిచేరక బెదురుబెదురుగా, దూరదూరముగ నుండుచున్నారు. ఈ రెంటినిబట్టి చూడగ, యిక ముందే దైన కించిత్తు అవకాశము లభించినయెడల, యీ రాజులందరేకమై మనపై పడుదమాయని కనిపెట్టుకొనియున్నట్లుగ స్పష్టముకాగలదు. బ్రిటిషురాజ్యపు సరిహద్దునందు రంజిత్ సింగ్‌వున్నాడు. ఈతని పలుకుబడి, చురుకుదనముచూచి, బ్రిటిషురాజ్యమున కేదైన అపాయంవస్తే యీతనివల్లనే రావచ్చునని వైస్రాయి (మాయిరాప్రభువు) ఊహించెను. కాని, యీ యూహ తప్పని తరువాత ఋజువయ్యెను. కాని, యీ యూహలో ఆతను పొరపడినను దేశమందు సర్వత్ర సర్వసామాన్యముగ వ్యాపించియున్న అపాయస్థితిని గుర్తించుటలోమాత్ర మాతను మిక్కిలి బుద్ధిసూక్ష్మతను గనుపరచెను. "మన కొరడాదెబ్బలచే రోషకషాయితు లగునట్లు మనము చేతులార చేసికున్న రాజుల క్రోధాగ్ని నొక్క దానినేగాదు మనము గమనింపవలసినది. ఇంక యింతకంటె విశేషముకలదు. మనచే దెబ్బలుతినని తక్కినరాజులందరు కూడ, 'మనకుకూడ రేపీగతి పట్టవచ్చురా' " యని లోలోన అనుమానపడుచు, తమకండ్లయెదుట పరిభవింపబడి, వంచింపబడుచున్న తమ తోడిరాజులతో రహస్యముగ సానుభూతి జూపుచుండి యుండవలెను.

ఈ కాలమందు, అయోధ్యవజీరు కుంపిణీవారియెడ తీవ్రకోపముతో మండిపడుచుండెను. 1801 వ సం॥ లో

యితడు తనరాజ్యములో సగభాగము కుంపిణీవారి కిచ్చివేసిన పుడు, తక్కిన తన సగభాగములో తనకే సంపూర్ణాధికార ముండుననియు, దానిజోలికి కుంపిణీవారు రామని వాగ్దానము చేసియుండిరి. కాని, వారివాగ్దానమునకు విరుద్ధముగా, ఆతని సగభాగములోకూడ, కుంపిణీవారు కలిగించుకుని, ఆతని చేతులకు కాళ్లకు అడ్డముపోవుచుండిరి. దానితో ఆతనికి తీవ్ర ముగు కోపమెత్తి, "యీకుంపిణీవారు ఆఖరుకు నన్నునిరాశుని జేసివేసిరి" అని ఆ వజీరు బహిరంగముగ తనదర్బారులో యెలుగెత్తి చెప్పెను. ఇట్లే బీరారురాజును, మనతో పైకి స్నేహముగా నున్నను, లోలోన ఆతడు మనయుద్దేశ్యముల గూర్చి అనుమానపడుచునే యుండెను. అతడిట్లనుమాన పడు టకు తగినకారణమున్నదని తమపరి చరిత్రవలన తెలియు గలదు. "చాలకాలము క్రిందటనే మనయద్దెసేనల తీసికున్న నైజాముజంటి వాడుకూడ, తనకు మనయెడనున్న కటికద్వేష మును, అసహ్యమును, దాచియుండలేదు." కాని, మన మాతని మెడమీద వేసిన కాడిని వదలించుకొనుటకు శక్తిలేక యేమిచేయుటకు చేతగాక— ఊరుకున్నాడు. అంతే! సింధి యాకూడ తనసేనల నన్నిటిని ఒకచోట చేర్చియుంచుట మంచి దికాదని యెంచి, వాటిని యితరరాజ్యములలో అచ్చటచ్చట చేర్చి పెట్టుకొనుచున్నట్లు అనుమానము వేయుచున్నది. హోల్కా రుకూడ సరిగ యిదేస్థితిలో నున్నాడు. ఈ విధముగ మనకు నలుప్రక్కల చుట్టుముట్టి యెండియున్న యీ నిబిడాటవియం దెప్పు డేక్షణమున నిప్పురవ్వపడి, మహాప్రళయాగ్నిగ మం డునో తెలియదు. అట్టి ప్రళయాగ్నిజ్వాలలే గనుక

రేగిన యెడల, ఆ తప్పు మనదే యగునుగాని, ఒరులది కాజాలదు. మనకును, యీ దేశీయ రాజులకును గల సంబంధ మెట్టిదో మనకే తెలియదు. దీనిని యిదమిత్థమని ఖచితముగ మన మెన్నడు నిర్ణయించుకోలేదు— "ఇదిగో యింత వరకు మీ యధికారము— అంతవరకు మా యధికారము" అని యెన్నడు ఆ రాజులతో నిష్కర్షగా చెప్పలేదు. మన యధికార మెంతవున్నదో మనకు తెలియనప్పుడు, యిక వారితో మనమేమి చెప్పగలము? ఈవిధముగ ఖచితమగు నిర్ణయము లేమియులేక— అంతయు ముసుగులో గుద్దులాటగ వుంచుటచేతనే, యిట్టి అపాయస్థితి— యిట్టి తీవ్రదావానల మెప్పుడో ఒకప్పుడు చుట్టుముట్టితీరును— మనము వారితో చేసికున్న ఒడంబడికలలో "మీరందరు స్వతంత్ర రాజులని" చెప్పి యొప్పుకుంటిమి. కాని, వెంటనే— నక్షత్రకులవలె— యింగ్లీషు రెసిడెంటులను పంపించితిమి. ఈ రెసిడెంట్లు కుంపిణీ వారికిని, దేశీయరాజులకును మధ్య సమాధానము కుదుర్చు రాయబారులుగ నుండుటకు బదులుగ, వీరు దేశీయ రాజులపై సర్వాంసహాధికారమును చలాయింపసాగిరి. ప్రతి చిన్న ప్రయివేటు విషయములోను వీరు రాజునకు అడ్డము పోవుచుండిరి. వారిపై యవిధేయులగు ప్రజలను ఉసుకొలుపుచుండిరి; తమ యధికారమును బహుదర్పాటోపములతో ప్రదర్శించుచుండిరి.

కర్నూల్ నబాబు చనిపోయెను. అతని కుమారుడు రాజధాని స్వాధీనపరచుకుని, తానురాజునని ప్రకటించుకొనెను. ఈతని అన్నగారాసమయమందు యింగ్లీషురాజ్యములో

నుండెను. "నీకు రాజ్యమిప్పిస్తామని" యింగ్లీషువారిత
మద్దతుచేసిరి. దీనికతడు సమ్మతించెను. ఈ యొడంబ
రైన తక్షణమే, అప్పుడే, మద్రాసు గవర్నమెంటువా
వైస్రాయికి యీవిధముగ వ్రాసిరి:— "మనసేనలు కర్నూ
లు రాజధానిని ముట్టడించియున్న సమయమందే, మనర
యందున్న యీనబాబు పెద్దకొడుకును అడ్డమువుంచుకుని
మధ్యస్తునిచేసి— కర్నూలురాజ్యమును కాజేద్దామా ?"
సలహాచెప్పిరి. ఈ సలహావిన్నప్పుడు వైస్రాయిమండి
తిరస్కరించెను. "మనమతనికిచేసే సహాయమిదియా ?
మాతనికి దయాదాక్షిణ్యముతో వదలివేసే భాగముత
మిగతా రాజ్యాధిపత్యములో గాని, ఆదాయములో గా
ఆతనియెడ యెట్టితప్పును నిరూపింపకయే, మనముకాజేయ
కూడనిపని" అని వైస్రాయిమందలించెను. వైస్రాయి నిర్ణ
చించిన యీధర్మముకూడ, పూర్వమునుండి కుంపిణీవారవలం
బించుచు వచ్చిన ప్రాతధర్మశేషమేగాని వేరొండులేదు—
యీ ధర్మములోనుండే రహస్యమేమనగా— యిదివాటమ
వారిధర్మము— మనకువీలైనప్పుడు ధర్మము— వీలుకానప్పు
డధర్మము. ఏదైనా రాజ్యములు కాజెయ్యడానికి, వీలు,
సమయముకాకపోతే, యేమో అవసరములేకపోతే- అది
అధర్మము- వీలుంటే ధర్మమే! ఇట్టి కుటిలధర్మము నవలంబిం
చుట రాజనీతికాదని గ్రహించెను. "వారసత్వపు"
హక్కును నిర్ణయించడానికి మనకే అధికారము వున్నది"
అని చెప్పడంలో, మనము దేశీయరాజుల మనస్సునెంతో
నొవ్వజేసినాము. ఏ యితరవిషయములలోకూడ వారికి

మనమింత నొప్పిని గలిగించలేదు. "రాజ్యాధికారము జ్యేష్టునికే వస్తుందనేమాటను మన యింగ్లీషుగవర్నమెంటు వారు గనుక బహిరంగముగ గట్టిగ ఒప్పుకుంటే, దానినే మహమ్మదీయులందరు కూడ శిరసావహిస్తారని మనమూహించినాము. కాని, మనఊహ కేవలము తప్పని నాకు గట్టిగ తోచుచున్నది. ఈపద్ధతికి మహమ్మదీయులెవ్వరును యెన్నడును ఒప్పుకొనరు. కాకపోతే సింహాసనమునకు రాగోరు జ్యేష్ఠుడెవడైనా వుంటే, వాడు వీలైనంతవరకు మన సహాయమును వినియోగపరచుకోవచ్చును. అంతే అంతవరకేదాని ప్రయోజనము. కాని, యీ విధముగ యీ పద్ధతివల్ల మనసహాయమును పొంది రాజ్యానికి వచ్చిన జ్యేష్ఠుడు తదుపరి, తన యనంతరము తన పిల్లలలో నెవరికి రాజ్యమివ్వవలెనను ప్రశ్నవచ్చినప్పుడు మాత్రము— యీసూత్రము, జ్యేష్ఠునకే రాజ్యము రావలెనను సూత్రము యెన్నటికిని అంగీకరింపబడదు. తన కాలములో తనకు ఉపయోగపడిన సూత్రమునెడగాని, మనయెడగాని, యెంతమాత్రము కృతజ్ఞతను చూపడు. తనపిల్లలలో తనయిష్టమువచ్చినవారికే రాజ్యమిచ్చెద ననునుగాని, జ్యేష్టునికే యిచ్చెదననడు. ఇది నిజమైన, మహమ్మదీయ మతధర్మము. వారికీ మతధర్మమునెడ గల అభిమానము పట్టుదల అంతగట్టివి. దానిముందర మనము చేసిన సహాయము జ్ఞాపకముండునా ? తనకు సహాయపడిన సూత్రమునందు, పద్ధతియందు— విశ్వాసముండునా ?" ఈ విధముగా, యీ వారసత్వపు సమస్య ప్రివిధమమునుండియు కుంఫిణీపరిపాలకుల మనస్సులలో మధింప

బడుచునే యుండెను. ఈ సమస్య రానురాను యిటీవల తీవ్రమై, భారతేతిహాస ప్రకారమునంతను త్రిప్పివేసెను.

ఘూర్కాలతో యుద్ధమువచ్చెను. ఇందు వైస్రాయి తప్పేమియు లేదు. ఈ యుద్ధమాతడు కావలెనని కోరలేదు. అదే బలవంతముగ వచ్చి యితనిమీాద పడెనని చెప్పవచ్చును. యుద్ధము లేకుండా, యెట్లాగైనా తప్పించుకోవాలని వైస్రాయి బహు తంటాలుపడెను. చాలాఓర్పుతో చాలామంది రాజులను చూచెను. చిట్టచివరకు యీాయన ఓర్పునుచూచి, తక్కిన కుంపిణీ ఉద్యోగస్థులందరికి కోపముకూడ వచ్చెను. ఈయన ఓర్పును, వివేకబుద్ధినిచూచి కుంపిణీవారు అశక్తులని, ధైర్య స్థైర్యములులేని పిరికిపందలని ఘూర్కాలుకూడ అపోహ పడజొచ్చిరి. తమ రాజ్యము దూరముగ యెక్కడనో కొండలమధ్యనుండుటచే, యెవరికీ అందదనియు, తమ యుద్ధ నైపుణ్యము మనుష్యసామాన్య మైనదనియు, సురక్షితములగు కోటలు తమకసంఖ్యాకములుగ గలవనియు, వీని నెవరు భేదింపజాలరనియు, తమ రణోద్యోగ మజేయమనియు, ఘూర్కాలు గర్వించి మైమరచి యుండిరనుటలో సందేహము లేదు. ఉక్కు తునకలవంటి యీా కొండజాతివారితో గలిగిన ఘోరపు పోరాటము,— యింతటి విశాలప్రదేశముపై జరిగిన పోరాటము— ఇండియాలో యిదివర కెన్నడును జరుగలేదు. నానావిధాయుధసమన్వితముగ లక్షకు పైగా కుంపిణీవారి సైనికులు రణరంగమునందు నిలచిరి. ఘూర్కా సైనికులు యింతకు మిక్కిలియై యుండవలెను. కుంపిణీ వారి పదాతివర్గములు పలుసార్లు వెనుకకు కొట్టబడెను.

సైన్యదళములు పలుసార్లు పలాయనము లయ్యెను. కాని యెట్టకేలకు మనకే (కుంఫిణీవారికి) జయము గలిగెను. అయినను, యిదివర కెన్నడును కనివిని యెరుగనిరీతిని, కుంఫిణీవారి కెంతయో జననష్టము, ద్రవ్యనష్టము కలిగెను. జయింపబడిన ప్రదేశము పెద్దదికాకున్నను, అది చాల ప్రాముఖ్యమైనది. దీనివలన మన యధికారము యమునానది మొదలు సట్లెజ్ నదివరకు వ్యాపించెను. మాయిరా ప్రభువు యింతటితో సంతృప్తిపడియుంటే బాగుండేది. కాని యుద్ధశిబిరముందుండగా, అంటుజాడ్య మితనికికూడ అంటుకొనెను. రణవిజయకాంక్షనుగాని, చుట్టునున్నవారి స్తోత్రపాఠములను, భళాభళులనుగాని, ఆతడు త్రోసివేయజాలకపోయెను. ఈ మోహమం దాతడు పడెను. చాలాకాలము క్రిందటనే ఆతడు మెట్‌కాఫ్ మాటలనువినుటకు రుచిమరగెను. మెట్‌కాఫ్ వైస్రాయిని పూర్తిగ వశపరచుకొనెను. నూతన రాజ్య సంపాదనరూపమగు నానావిధ మోహాన చిత్తరువుల సృష్టించి, ఆతడు వైస్రాయి కండ్లయెదుట ఆడించుచు, ఆతని ఊరించుచుండెను. ఆతడు మాటిమాటికి వైస్రాయికి నోరూరునట్లు చేయుచుండెను. నేపాళ యుద్ధమును గూర్చియు, దానిని బహుశః యితర ప్రాంతములకుకూడ వ్యాపింపజేయుటను గూర్చియు, వైస్రాయికి రహస్యముగ జాబువ్రాయుచు, దానిలో, నిర్వివాదమని చెప్పు రెండు ప్రధానసూత్రముల నాతడు నిర్వచించెను. "మనసైనికబలముయొక్క యుత్కృష్టతచేతనే మనమీ యిండియాలో సామ్రాజ్యమును స్థాపించ గలిగినాము. కాబట్టి, యీ సామ్రాజ్యముయొక్క స్థిరత్వము

నుండెను. "నీకు రాజ్యమిప్పిస్తామని" యింగ్లీషువారీతనికి మద్దతుచేసిరి. దీనికతడు సమ్మతించెను. ఈ యొడంబడిక యైన తక్షణమే, అప్పుడే, మద్రాసు గవర్నమెంటువారు వైస్రాయికి యీవిధముగ వ్రాసిరి:— "మనసేనలు కర్నూలు రాజధానిని ముట్టడించియున్న సమయమందే, మనరక్షణ యందున్న యీనబాబు పెద్దకొడుకును అడ్డముపుంచుకుని— మధ్యస్థునిచేసి— కర్నూలురాజ్యమును కాజేద్దామా?" అని సలహాచెప్పిరి. ఈ సలహావిన్నప్పుడు వైస్రాయిమండిపడి తిరస్కరించెను. "మనమతనికిచేసే సహాయమిదియా? మన మాతనికి దయాదాక్షిణ్యముతో వదలివేసే భాగముతప్ప, మిగతా రాజ్యాధిపత్యములో గాని, ఆదాయములోగాని, ఆతనియెడ యెట్టితప్పును నిరూపింపకయే, మనముకాజేయుట కూడనిపని" అని వైస్రాయిమందలించెను. వైస్రాయి నిర్వచించిన యీధర్మముకూడ, పూర్వమునుండి కుంపిణీవారవలంబించుచు వచ్చిన ప్రాతధర్మశేషమేగాని వేరొండులేదు— యీ ధర్మములోనుండే రహస్యమేమనగా— యిదివాటము వారీధర్మము— మనకువీలైనప్పుడు ధర్మము— వీలుకానప్పుడధర్మము. ఏదైనా రాజ్యములు కాజెయ్యడానికి, వీలు, సమయముకాకపోతే, యేమో అవసరములేకపోతే- అది అధర్మము- వీలుంటే ధర్మమే! ఇట్టి కుటిలధర్మము నవలంబించుట రాజనీతికాదని గ్రహించెను. "వారసత్వపు" హక్కును నిర్ణయించడానికి మనకే అధికారము వున్నది" అని చెప్పడంలో, మనము దేశీయరాజుల మనస్సునెంతో నొవ్వజేసినాము. ఏ యితరవిషయములలోకూడ వారికి

మనమింత నొప్పిని గలిగించలేదు. "రాజ్యాధికారము జ్యేష్ఠునికే వస్తుందనేమాటను మన యింగ్లీషుగవర్నమెంటు వారు గనుక బహిరంగముగ గట్టిగ ఒప్పుకుంటే, దానినే మహమ్మదీయులందురు కూడ శిరసావహిస్తారని మనమూహించినాము. కాని, మనఊహ కేవలము తప్పని నాకు గట్టిగ తోచుచున్నది. ఈపద్ధతికి మహమ్మదీయులెవ్వరును యెన్నడును ఒప్పుకొనరు. కాకపోతే సింహాసనమునకు రాగోరు జ్యేష్ఠుడెవడైనా వుంటే, వాడు వీలైనంతవరకు మన సహాయమును వినియోగపరచుకోవచ్చును. అంటే అంతవరకేదాని ప్రయోజనము. కాని, యీ విధముగ యీ పద్ధతివల్ల మనసహాయమును పొంది రాజ్యానికి వచ్చిన జ్యేష్ఠుడు తదుపరి, తన యనంతరము తన పిల్లలలో నెవరికి రాజ్యమివ్వవలెనను ప్రశ్న వచ్చినప్పుడు మాత్రము— యీసూత్రము, జ్యేష్ఠునకే రాజ్యము రావలెనను సూత్రము యెన్నటికిని అంగీకరింపబడదు. తన కాలములో తనకు ఉపయోగపడిన సూత్రమునెడగాని, మనయెడగాని, యెంతమాత్రము కృతజ్ఞతను చూపడు. తనపిల్లలలో తనయిష్టమువచ్చినవారికే రాజ్యమిచ్చెద ననునుగాని, జ్యేష్ఠునికే యిచ్చెదననడు. ఇది నిజమైన, మహమ్మదీయ మతధర్మము. వారికి మతధర్మము నెడ గల అభిమానము పట్టుదల అంతగిట్టివి. దాని ముందర మనము చేసిన సహాయము జ్ఞాపకముండునా? తనకు సహాయపడిన సూత్రమునందు, పద్ధతియందు— విశ్వాసముండునా?" ఈ విధముగా, యీ వారసత్వపు సమస్య ప్రతివిధమునుండియు కుంపిణీపరిపాలకుల మనస్సులలో మధింప

బడుచునే యుండెను. ఈ సమస్య రానురాను యిటీవల తీవ్రమై, భారతేతిహాస ప్రకారమునంతను త్రిప్పివేసెను.

ఘూర్కాలతో యుద్ధమువచ్చెను. ఇందు వైస్రాయి తప్పేమియు లేదు. ఈ యుద్ధమాతడు కావలెనని కోరలేదు. అదే బలవంతముగ వచ్చి యితనిమీద పడెనని చెప్పవచ్చును. యుద్ధము లేకుండా, యెట్లాగైనా తప్పించుకోవాలని వైస్రాయి బహు తంటాలుపడెను. చాలా ఓర్పుతో చాలామంది రాజులను చూచెను. చిట్టచివరకు యీాయన ఓర్పునుచూచి, తక్కిన కుంపిణీ ఉద్యోగస్తులందరికి కోపముకూడ వచ్చెను. ఈయన ఓర్పును, వివేకబుద్ధినిచూచి కుంపిణీవారు అశక్తులని, ధైర్య స్థైర్యములు లేని పిరికిపందలని ఘూర్కాలుకూడ అపోహ పడజొచ్చిరి. తమ రాజ్యము దూరముగ యెక్కడనో కొండలమధ్యనుండుటచే, యెవరికీ అందదనియు, తమ యుద్ధ నైపుణ్య మనన్యసామాన్యమైనదనియు, సురక్షితమగు కోటలు తమ కసంఖ్యాకములుగ గలవనియు, వీని నెవరు ఛేదింపజాలరనియు, తమ రణోద్యోగ మజేయమనియు, ఘూర్కాలు గర్వించి మైమరచి యుండిరనుటలో సందేహము లేదు. ఉక్కు తునకలవంటి యీ కొండజాతివారితో గలిగిన ఘోరపు పోరాటము,— యింతటి విశాలప్రదేశముపై జరిగిన పోరాటము— ఇండియాలో యిదివర కెన్నడును జరుగలేదు. నానావిధాయుధసమన్వితముగ లక్షకు పైగా కుంపిణీవారి సైనికులు రణరంగమునందు నిలచిరి. ఘూర్కా సైనికులు యింతకు మిక్కిలియై యుండవలెను. కుంపిణీ వారి పదాతివర్గములు పలుసార్లు వెనుకకు కొట్టబడెను.

సైన్యదళములు పలుసార్లు పలాయనము లయ్యెను. కాని యెట్టకేలకు మనకే (కుంఫిణీవారికి) జయము గలిగెను. అయినను, యిదివర కెన్నడును కనివిని యెరుగనిరీతిని, కుంఫిణీవారి కెంతయో జననష్టము, ద్రవ్యనష్టము కలిగెను. జయింపబడిన ప్రదేశము పెద్దదికాకున్నను, అది చాల ప్రాముఖ్యమైనది. దీనివలన మన యధికారము యమునానది మొదలు సట్లెజ్ నదివరకు వ్యాపించెను. మా యిరా ప్రభువు యింతటితో సంతృప్తిపడియుంటే బాగుండేది. కాని యుద్ధశిబిరమందుండగా, అంటుజాడ్య మితనికికూడ అంటుకొనెను. రణవిజయకాంక్షనుగాని, చుట్టునున్నవారి స్తోత్రపాఠములను, భళాభళులనుగాని, ఆతడు త్రోసివేయజాలక పోయెను. ఈ మోహమం దాతడు పడెను. చాలాకాలము క్రిందటనే ఆతడు మెట్‌కాఫ్ మాటలనువినుటకు రుచిమరగెను.

మెట్‌కాఫ్ వైస్రాయిని పూర్తిగ వశపరచుకొనెను. నూతన రాజ్య సంపాదనరూపమగు నానావిధ మోహన చిత్తరువుల సృష్టించి, ఆతడు వైస్రాయి కండ్లయెదుట ఆడించుచు, ఆతని ఊరించుచుండెను. ఆతడు మాటిమాటికి వైస్రాయికి నోరూరునట్లు చేయుచుండెను. నేపాళ యుద్ధమును గూర్చియు, దానిని బహుశః యితర ప్రాంతములకుకూడ వ్యాపింపజేయుటను గూర్చియు, వైస్రాయికి రహస్యముగ జాబువ్రాయుచు, దానిలో, నిర్వివాదమని చెప్పు రెండు ప్రధానసూత్రముల నాతడు నిర్వచించెను. "మనసైనికబలముయొక్క యుత్కృష్టతచేతనే మనమీ యిండియాలో సామ్రాజ్యమును స్థాపించ గలిగినాము. కాబట్టి, యీ సామ్రాజ్యముయొక్క స్థిరత్వము

కూడ మన సైనికబలముపైననే ఆధారపడియున్నది. ఈ పునాదిని గనుక మనము తీసివైచినామంటే, యీ సామ్రాజ్యసౌధము కూలిపోవును. ఇండియాప్రజల ప్రేమవల్లను, దేశీయరాజులయెడ మనముచూపు సహనము, మిత్రత్వము వల్లను,- యీ రెంటివల్లనే మన సామ్రాజ్యమునకు భద్రము కలుగునని కొందరుపెద్దలు భ్రమపడితే పడనీగాక ; కాని నిజమాలోచించినయెడల, మన యీ రాజ్యాధికారమునకు పునాది కేవల మొక్క సైనికబలమేతప్ప రెండోదిలేదు, లేదు-ముమ్మాటికిలేదు-ఘంటాపథముగ నమ్మండి. కాని, యిట్టి మహోత్కృష్టమగు మన యీ సైనికబలమునకుకూడ యీ మధ్య కొంత దెబ్బతగిలినట్టుతోస్తుంది. నేపాళయుద్ధములో భరతపురం, కుళుంగ, కుమానో మున్నగుప్రదేశములలో మనకు గలిగిన స్పష్టమైన పరాజయమునుబట్టి చూడగా, మన భుజబలము పూర్వమువలె అవారితము, అజేయముకాదని తోచుచున్నది. "మనల నెదిరించి, ఓడించేవారు లేరని, పూర్వమువలె, యికమీదట తలవిరియబోసికొని తిరుగుటకు వీలులేనట్లుగ కనిపించుచున్నది. మనకు గలిగిన ప్రతియోటమిని కొంచెము జాగ్రత్తగ పరిశీలించి చూచుకొందము. పోనీ, యీమధ్యకాలములో మన శత్రువులకు కొంచెము ధైర్యము, రణశిక్షణ, యెక్కువైనదనే అనుకొందము. అయినను, "మన పూర్వపుసైనికబలప్రఖ్యాతి భరతపురమునందు మంటిలో పూడ్చిపెట్టబడుటచే" తదుపరి మనకెన్నిజయములు గలిగినను, ఆ పూర్వపుప్రఖ్యాతిలో కించిత్తయినను మనకు తిరిగిరాలేదు. మనశత్రువులు పూర్వముకంటె యెక్కువ

ధైర్యముగ యుద్ధముచేయుచున్నారు. యికమన సైన్యములన్ననో వారికి పూర్వమున్న ధైర్యము లేకపోవుచున్నది. కుంపిణీ సైనికుల తెల్లమొగములను, యెఱ్ఱచొక్కాలనుచూచి, పూర్వము మనశత్రువులు గాబరాపడి పారిపోయేవారు. కాని, యిప్పుడాభయమంతా పోయినది. మన సైనికవ్యూహముల నడకసంగతి వారికి యిప్పుడు బాగా తెలిసిపోవుటచేతనో, మొట్టమొదట మన జయోద్ధతిని చూచి పడినగాభరా కాల క్రమేణా యిప్పుడు తగ్గిపోవుటచేతనో, లేక యితరకారణముల చేతనోగాని, మనమిప్పుడు పూర్వమున్నంత అజేయులముగ లేము. కాబట్టి మనరాజ్యము విస్తీర్ణత నొందుచున్నకొలది, మన సైనికసంఖ్యకూడ హెచ్చుగుచుండవలెను." భారతవర్ష మందు మన సామ్రాజ్యము కత్తిబలముమీదనే ఆధారపడి యుండవలెనుసుమా! ప్రజలప్రేమమీద అది యెన్నడును ఆధారపడి యుండదుసుమా! దానివేళ్ళు ప్రజలప్రేమలో పాతుకొలేదుసుమా!-" యను ప్రధానవిషయములు మెట్‌ కాఫ్, వైస్రాయియగు మాయిరాప్రభువుకు మాటిమాటికి జ్ఞాప కము చేయుచుండెను. "మన యిరుగుపొరుగు రాజ్యములవారి ప్రేమవల్లగాని, మంచితనమువల్లగాని మనకేమియు లాభము లేదు. అవి మనసామ్రాజ్యమునకు బలమునివ్వజాలవు. సర్వ విధముల, న్యాయానుగుణముగ, మన సైనికబలమును అత్యా ధికమొనర్చుకొనుటకేపద్ధతి వీలగునో ఆ పద్ధతియే మనకీ దేశమందు పరమశరణ్యము. బాగుగ, తరిబీతు చేసి, సమస్త ఆయుధములతో సన్నాహమొనర్పబడిన సైనికబలముల నెక్కువ చేసికొన్నకొలది, మనకు యెక్కువ విజయములు

యెక్కువ రాజ్యములు వచ్చుచుండును. క్రొత్తరాజ్యములు మనకు కలియుచున్నవి. యింకను యెక్కువ సేనయు చేర్చుకొనుటకును, వాని శిక్షణకును, పోషణకును వలయు సాధనములకును మన కెక్కువ అవకాశములు గలుగుచుండును. వేయేల, మెట్కాఫ్‌యొక్క సిద్ధాంత మొక్కటీ ఏమనగ:— "మనము రాజ్యసంపాదనలో చాలదూరము పోయినాము. ఇక వెనుకకు తిరిగిన ప్రయోజనము లేదు— ఈ స్థితిలో యిప్పుడు వెనుకకు తిరుగుటవల్ల అపాయముకూడ రావచ్చును. కవ్వించి పరులపైపడు తలంపును మన మిప్పుడు మానుకున్న యెడల, మన మొక్కక్షణమైనను, ప్రజల యసంతృప్తిని నిరోధింపజాలము. మన చుట్టునున్న శత్రువుల యుద్ధతి నొక్కక్షణమైనను ఆపజాలము. మన రాజ్యపు పొలిమేరల నానుకొని, బలవంతులగు శత్రువులు మూగియున్నప్పుడు, మనము వారిని యెల్లప్పుడు అవలకు నత్తి వేయుచుండవలెను. మన పొలిమేరలు యెప్పటికప్పుడు ఆవలికి నత్తబడుటకు వీలుగ నుండవలెను.

సీమలోనుండగను, కలకత్తాకువచ్చిన క్రొత్తలోను మిక్కిలిశాంతి, సమానభావములతోనున్న మాయిరాప్రభువు, అచిరకాలముననే యిక్కడి మందలోగలిసెను. యుద్ధభూమికి అలవాటుపడెను. తనచుట్టు ప్రబలియున్న భావములకును, చేష్టలకును తానుకూడ అనుగుణ్యముగ నడవనేర్చెను. ఈతడు వైస్రాయిగనున్న తొమ్మిదేండ్లలో చాలభాగము యుద్ధములతోడనే సరిపోయెను. పెక్కుప్రాణములేగాక, అసంఖ్యాకమగు ధనముగూడ బలియయ్యెను. ఇంతచేసియు, ఫలిత

మంత యెక్కువగ చెప్పుకొనదగినదేదియు లేకనేపోయెను. మధ్యహిందూస్థానమందలి దోపిడిగాండ్రగు పిండారీలను బహుదూరము, బహురక్తముతో వెంబడించి, వేటాడి తుదకు హతమొనర్చిరి. వారి నాయకు డొక గుహాలో తల తరుగబడి పడియుండెను. మాయిరాప్రభువు గావించిన నష్టకర యుద్ధములలోనికెల్ల యిదె కొంచెము ఉపయోగకారియని చెప్పవచ్చును. ఘూర్ఖాలతో యింతకంటె కష్టతరమగు యుద్ధము జరిగెను; వారి కోటలన్నియు నేలమట్టము గావింపబడెను. వారి రాజ్యములో కొంతభాగము యింగ్లీషువారు కలుపుకొనిరి. రణదర్పితులును, యోధాగ్రేసరులును నగు యీ కొండజాతివారితో అనేక యుద్ధములు చేసి, విసిగి, తుదకు వారితో యెట్లయినను సంధిచేసికొని, వారినిక విడిచి పెట్టుదమని మాయిరాప్రభువు తలంచెను. ఇకమీద వారి మీదికి పోకుండ, వారిస్వేచ్ఛకు భంగము గలిగించకుండ, అంతటితో వదలివేసినందుకు ప్రతిఫలముగ, యీ ఘూర్ఖాలు తమపరి ఇంగ్లీషువారికి కృతజ్ఞతాపూర్వకముగ మంచి యుపకృతినే జూపిరి.

1816 సం॥ నాటికి మధ్యమభారతమందలి దేశీయ సంస్థానములస్థితి మహాగందరగోళముగ నుండెను. అవి విచ్ఛిన్నమై, అల్లకల్లోలపూరితముగ నుండెను. వీనిని జూచి మాయిరాప్రభువుకు నోరూరెను. వీనిలో జొరబడి, వీని నెట్లయిన కాజేయవలయునని ఆశ పుట్టెను. కొంచెము స్వతంత్రముగ బ్రతుకుచున్న మహారాష్ట్రప్రముఖులెల్లరు ఒకరియెడ నొకరు యీర్ష్యాళువులై యుండిరి. కాని వీరిలో

ప్రతివారికి కూడ నానాటికి పెచ్చుపెరిగి వచ్చుచున్న యింగ్లీషువారిపై క్రోధము కంఠగతముగ నుండెను. ఈ కుంపిణీవారిచే వీరందరు పదేండ్లక్రిందట వంచింప బడిరిగదా! ఆ క్రోధ మింకను వారిలో ప్రతివాని యందును రగుల్కొనుచునే యుండెను. ప్రతిరాజు తన సంస్థానములో నుంచబడిన యింగ్లీషు రెసిడెంటునెడ అస హ్యము, బెదురుగలిగియుండెను. తమ కుంపిణీవారిచే లోగడగలిగిన పరిభవమునకు చిహ్నముగను, తమ ప్రస్తుత దౌర్బల్యస్థితికి సాక్షీభూతుడుగను, భావిసంఘర్షణకు కారకుడుగను యీ రెసిడెంటును ప్రతిదేశీయరాజు పరి గణించి, అసహ్యించుకొనుచుండెను; కాని, బెదురుచుండెను. ఈ రెసిడెంటు నెట్లయిన తప్పుత్రోవలో పెట్టుదమని చతురుడగు ప్రతిదేశీయోద్యోగియు చూచుచుండెను. ఆత నిని వ్యర్థునిచేసి కూర్చోపెట్టవలెనని యుక్తిపరుడును, సృష్టికి ప్రతిసృష్టి జేయజాలినట్టియు, ప్రతిదేశీయరాజ్యతంత్రజ్ఞుడును ప్రయత్నించుచుండెను. పెచ్చుపెరిగివచ్చుచున్న కుంపిణీవారు యీ రాజ్యములనుకూడ గబళించుటకై తంత్రములు పన్నుచున్నారను వదంతులు దేశీయసంస్థానములందు ప్రబలియుండెను. ఈ వదంతులకు ఆధారము లేకపోలేదు. ఇట్టి తంత్రము సాగకుండ జేయుటకై దేశీయరాజులు, వారి మంత్రులు యేమిచేసినను చేసినవారే. ఇక, కుంపిణీవా రన్ననో, తమ్మును కూలద్రోయుటకై మహారాష్ట్రులేవో పన్నాగములు పన్నుచున్నారనియు, అందులకై వారేమిచేసి నను చేయవచ్చుననియు ప్రతిక్షణము అనుమానపడుచుండిరి.

"కాబట్టి వారిని— మహారాష్ట్రులను - పూర్తిగ నాశనము చేయవలెను; లేదా వట్టిదుర్బలులను చేసి కూర్చో పెట్టవలెను. మనకు దాసానుదాసులై, ఆశ్రితులై యుండు నట్లు చేసికొనవలెను. ఇట్లయినగాని మనకు శ్రేయము లేదు." కాని, యిదివరకే దుర్బలులై, మనకేమియు హానిచేయ జాలని సంస్థానములను సంరక్షించుట తెలివితేటలుగల రాజ్యముయొక్క లక్షణము; ఔదార్యబుద్ధిగల రాజ్యాంగముయొక్క విధి; న్యాయము. మనకేదైనా అపాయము వస్తే సింధియా, హోల్కారు, బీరారులవల్లనే రావలెను. కాని, వీరు మనకు (కుంపిణీకి) వ్యతిరేకముగ యేపనియు చేసియుండలేదే! వీరిపై పోయిపడుటకు యేదో కొంచెము మిషయైనను లేదే! అయితే, ఒకసంగతి మాత్ర మున్నది. వీరందరు పిండారీలకు తమ రాజ్యములో ఆశ్రయ మిచ్చిరి. వారికి లంచము లిచ్చిరి; వారికి జీతములిచ్చి అప్పుడప్పుడు సైన్యములలోకూడ చేర్చుకొన్నారేమో చెప్ప లేము. ఈ పిండారీల నెట్లయిన అణచివేయుట తమ విధి యని కుంపిణీవారు ప్రకటించిరి. వీరుండుటయే లోకమునకు రోత! వీరిని శిక్షింపక విడిచిపెట్టుట మహాసామ్రాజ్యమని పేరుపెట్టుకొన్న వారికి అప్రతిష్ఠ! మహారాష్ట్రరాజ్యములవారు కూడ పూర్తిగ తోడ్పడితేనేగాని, యీ పిండారీలను పూర్తిగ నాశనము చేయడానికి వీలులేదు. ఈ దోపిడీగాండ్రపై ధ్వజ మెత్తుట కొక పథకము పన్నబడెను. దీనిద్వారా రాతగిన, లేక, వచ్చునట్లు చేసికోతగిన, యితరఫలితములనుగూర్చికూడ ఆ పథకమందు స్పష్టముగా వక్కాణించియున్నారు. దోపిడీ

గాండ్రైను, వేటాడ సాగించినప్పుడు, మధ్య ఫలానివారు అడ్డము వచ్చినారనిగాని, రాలేదనిగాని, పారిపోయే దొంగలకు సహాయము చేసినారనిగాని, చేయలేదనిగాని, యెవరు నిర్ణయించి చెప్పగలరు— (సందడిలో సడామియా) ప్రతిరోజు, ప్రతిక్షణము, యేదో కలహకారణము వస్తూనేయుంటుంది. ఏ దోపిడీగాడైనా దాగుకుంటే, "ఇదిగో, యీ దొంగనుదాచావు" అని నేరము మోపవచ్చు; "ఇదిగో ఫలానిదొంగకు నీవు మద్దతుచేసావు; వాడితో షరీకైనావు" అని యెవనిబట్టిన వానినవచ్చు. ఈ విధముగా లెక్కలేనన్ని కారణములు— లెక్కలేనన్ని నిష్ఠురవ్వలు— పుట్టవచ్చును. పరస్పరము అపనమ్మకము, ద్వేషము మున్నగు వాయువులవలన, యీరవ్వలన్నియు వృద్ధియై, ప్రళయాగ్నిజ్వాలలుగ చెలరేగవచ్చును. "పిండారీల వేటాడుటకై మీరాజ్యాలగుండా త్రోవయివ్వవలసినది" అని మహారాష్ట్ర రాజ్యములవారిని అడగవచ్చును. "మేము యివ్వము" అనివారంటే, బలే, మరీ సంతోషము! వెంటనే యుద్ధము ప్రకటించవచ్చును. పిండారీల వేటాడు విషయములో సింధియా, హోల్కారు, బీరారు రాజులు మనకు సహాయము చేయకపోయినచో— కనీసము తటస్థముగనైన నూరుకోనకపోయినచో— వీరందరుగాని, వీరిలో కొందరుగాని, మన పనికి అడ్డము వచ్చునెడల— మనము వారిని శత్రువులుగ భావించి, డీకొనుటయేతప్ప, మనకు వేరొండు గత్యంతరములేదు. యుద్ధపు ఖర్చులకిరింద వారి రాజ్యము నూడలాగుకొందము. అవియే యీ ఖర్చునకు తగిన ప్రతిఫలమగును; ఈ రాజ్యముమీద మనకు వచ్చు

అదనపు రెవిన్యూయే మనము పెట్టుకొను హెచ్చు సైన్యముల జీతబత్తెములకు పనికివచ్చును. కాబట్టి, యిట్టి విస్పష్టమగు వాక్యములతో, సందేహమున కెక్కడను తావులేని వాక్యములతో, పెద్ద సన్నాహములతో యుద్ధరంగమునకు బయలు దేరు తలంపు ప్రకటింపబడెను. ఈ యుద్ధ మేసంకల్పముతో, యెందుకొరకై చేయబడుచున్నదో, ఆ సంగతినికూడ దాపరిక మేమియు లేకుండ పాపము వారు ప్రకటించిరి.

యుద్ధకాండ సరిగ అనుకున్నట్లు జరుగలేదు. కాని, హిందూస్థానమందు మనము నిర్వర్తింపదలచిన సంకల్పము మాత్రము మొత్తముమీద నెరవేరినదనియే గట్టిగా చెప్ప వచ్చును. పెద్ద పెద్ద దేశీయ రాజ్యములచుట్టునున్న పిల్లరాజ్య ములతో స్నేహముకట్టుకొనుట చాల అవసరమని చుట్టు నున్నవారందరు చెవిలో నూదిరి. "మీ కందరికి మా సామ్రాజ్యరక్షణ యిస్తాము; అందుకు ప్రతిఫలముగ మాకు కొంత కప్పము కట్టండి. ఆ కప్పముతో క్రొత్త సేనను నిర్మించి మీరాజ్యములో వుంచుతాము" అని కుంపిణీ వా రందురు. ఈ యెత్తుకు సింధియా, హోల్కారులు సహజ ముగ ఒప్పుకొనరు. తమ చుట్టురు యీ యాంగ్లేయాశ్రిత రాజ్యములనబడు చిచ్చును దరికొల్పుకొనుటకు వా రొప్పుకొం దురా? ఒప్పుకొనకపోతే మరీమంచిది! కలహానికి యింకో కారణం దొరుకుతుంది; ఈ కలహముతో వారిని పూర్తిగ రూపుమాపవచ్చును! "వీరినందరిని జయించి, వీరి రాజ్యాల నన్నిటిని మన యింగ్లీషురాజ్యములలో కలుపుకోడానికి, మన మెల్లప్పుడుసర్వశక్తులమై యుండాలి. లేదా, యేమన్నా వారుమన

క్రింద దాసులై పడియుండాలి; యీ ప్రకారముగ గాకున్న, వారిలో వారు ఒకరి నొకరు భక్షించుకొనేటట్లో, లేక వారంతట వారు క్రమముగా క్షీణించునట్లో వుండాలి" అని మెట్‌కాఫ్ వ్రాసెను.

ఈ దురాగతపు చర్యలకు పాపము వారిలో నొక వ్యక్తి మాత్రము తీవ్రముగ ప్రతిఘటించెను. ఈతని పేరు సర్ తామస్‌మన్రో! (యీతడెవరో తెలియునా? మైసూరు యుద్ధములో మనకు తగిలినాడు.) ఈతడు మొదటి రోజులలో కేవలము, యుద్ధమంటే యుద్ధమని ఉరికేవాడు. కాని ప్రజాపాలనలో కొంచెము మెదిగిన తరువాత, యీతని ఉడుకు అణాగి, కొంచెము నెమ్మది, వివేకము, న్యాయము, దయా దాక్షిణ్యము అనేవి నేర్చుకున్నాడు. ఇది అసాధారణమైన విషయము. ఏమనగ, ప్రజాపరిపాలనలో మెదిగినవారు, సాధారణముగ అంతకంతకు కఠినులగుదురే గాని, సాధువు లగుట అరుదు. ఈ సమయమందు మన్రో వచించిన వాక్యములు భావగర్భితములై, యెన్నటికి మరువదగనివిగ నున్నవి. 1817 సం॥ లో వైస్రాయియగు మాయిరా ప్రభువు యిట్లు వ్రాసెను :— దేశీయ రాజ్యములు దుర్బలములై యున్నవి. వీనిని పాలించురాజులును దుర్బలులై యున్నారు. ఇదంతయు చూడగ యుద్ధమున కెక్కడను అవకాశ మున్నట్లు నాకు కనిపించడములేదు. మనలను దీర్ఘకాల మెదుర్కొని నిలుచువారంతకంటె లేరు. దేశీయ రాజ్యములలో ప్రజల యందెంత మాత్రము విధేయత యనునదే కనబట్టదు. కాబట్టి, ఇట్టి అవిధేయ ప్రజలను పాలించాలంటే, మన యూరోపి

యన్ రాజ్యాలలో కంటె ఇక్కడ ఎక్కువ శక్తి యుక్తులు కావలెను. సింధియా యెప్పుడును — ఆతని ప్రతాప మెక్కువగ నున్నరోజులలో సైతము — అజేయుడై యుండ లేదు. ఇక హోల్కారు కూడ అంతకంటె దుర్బలుడు. లేక్ సేనానిపై ఆత డెదిర్చిన ఎదిరింపులు సింధియా యెదిరింపుల కంటె కూడ చాల బలహీనముగ నుండెను. అప్పటి కంటె కూడ ఇప్పుడు ఈ సింధియా హోల్కారు లిరువురి బలముకూడ తగ్గిపోయినది. కాబట్టి వీరుగాని, అమీర్ ఖాన్ గాని, పిండారీలనణచు విషయములో మనలను భుజబలముతో నెదిర్చి నిలువదలంతురనుట కల్ల. కాని, తమ రాజ్యములలో కొంత భాగమును గోల్పోయి అవమానితులైయున్న దేశీయ రాజులలో అప్పుడప్పుడు ఒక విధమగు ఆవేశము ఎగవేసి కొనివచ్చి, ఓడిపోతామని తెలిసియుండి కూడ, నిరాశతో "ఈ వున్న కాస్తకూడ పొతేపోనీ" అని మొండి ధైర్యముతో తిరుగబడడముకద్దు." దేశీయరాజ్యములతో బ్రిటిష్‌గవర్నమెం టుకు ఉన్నసంబంధము ఈ 20 ఏండ్లమధ్య చాలా మారిపోయి నది. మొదటిరోజులలో ఇంగ్లీషువారు కొద్దిసైన్యమునే యుద్ధ భూమిలోనికి తెచ్చేవారు. అశ్వదళములు బొత్తుగ ఉండేవే కావు. కాని ఇప్పుడో శత్రువులకంటె సంఖ్యలోను, గుణము లోనుకూడ యెక్కువైనట్టి అశ్వబలమును కాల్బలమునుకూడ యింగ్లీషువారు తెచ్చుచున్నారు. ఇట్టిచో యుద్ధపర్యవసానము చెప్పకయే తెలిసిపోవుచున్నది. ఊరికే సైన్యాలను తీసికొని వచ్చి, యుద్ధభూమిలో నిలువబెట్టితేచాలు ; వేరేయుద్ధ మక్కరలేదు; తమయిష్టమువచ్చిన షరతులను శత్రులవుపై

విధించి వారిచేత సంధిపత్రము వ్రాయించుకోవచ్చు; ఒకవేళ యేదైనా యుద్ధముజరిగినా, దాని పర్యవసానము క్షణములో తేలిపోతుంది. శత్రువునికిది కేవలము నిష్ఫలమైన యుద్ధము అని మన్రో వ్రాసెను. అద్దెసేనలపద్ధతిని విస్తరింపజేయుట కూడదని అతనివాదన. అంతకాదు "1805—6 సంవత్సరములో మనము సింధియా కిచ్చివేసిన జిల్లాలను తిరిగి మనకిచ్చివేయమంటే బాగుంటుంది" అని మన్రో సూచించెను. "ఏ రాజ్యమందైతే యీ అద్దెసేనలు కాలుపెడతవో— ఆదేశపు రాజు మహాఘనుడైతేతప్ప— సర్వసాధారణముగా ఆరాజ్యమంతా ధ్వంసమైపోతుంది. దానిచిహ్నములు— పాడైన పూళ్ళు, ప్రజానాశనము— వెంటనే కనబడితీరుతవి. ఈ పాడుచిహ్నములు పీష్వా, నైజాము రాజ్యములలో యిదివరకే చాలాకాలమునుండి బాగా కనబడుతున్నవి. యిక మైసూరు రాజ్యములోకూడ కనబడడము ప్రారంభించినవి. ఈ యద్దెసేనల ఫలితమేమంటే, దేశీయరాజ్యాల నన్నింటిని క్రమేణా తప్పకుండ యింగ్లీషువారి కాలిక్రిందికి తీసికొనివచ్చి పెడుతుంది." ఈ పని కర్నాటకనవాబు విషయములో యిదివరకే పూర్తిగ జరిగింది. పీష్వా, నైజాము రాజ్యాలలోకూడ, కొంతవరకు జరిగింది. ఇంకకొంత కాలానికి, యీ రెండు రాజ్యాల గతికూడ నిస్సందేహముగ కర్నాటకపునవాబు గతికే వస్తుంది. పీష్వా బహుశః తిరిగి మనతోడిమైత్రికి భంగము కలిగించవచ్చును. నైజాముకూడ ఆపనే చేస్తాడు. మనతో అంటిపెట్టుకొనివుండాలనే పీరికివున్నా, పీరి చుట్టునున్నవారు వూరుకోరు. మనతో సంబంధము విడగొట్టుకొనుమని వారికి

నిరంతరము పుల్లింగములు పెట్టుచుందురు. మహోదార సమన్వితమగు స్వాతంత్ర్యనిరతి యనునది దేశములో వున్నంత వరకు— పరుల యాధిపత్యమును సహింపక తోసివేయవలె నను స్వాతంత్ర్యకాంక్ష దేశములో యేమాత్రమైన నిలిచి వున్నంతవరకు— యిట్టి సలహాదార్లు, యిట్టి పుల్లింగములు పెట్టువారు— యెపుడూ వుండనేవుంటారు. ఇట్టి స్వాతంత్ర్య నిరతి భారతప్రజలలో యెన్నటికైన పూర్తిగ పోవునని నే నెన్నడును అనుకొనను. నాకు వారి సంగతి బాగుగ తెలి యును; నా కీవిషయములో వారియెడ మంచి యభిప్రాయమే యున్నది. ఈ అద్దెసేనల పద్ధతి— యిది పోకినచోట్లనెల్ల దానిపని యది పూర్తిగ చేసియే పోవును; విడిచిపెట్టదు. దాని దుష్ఫలితములు దానివెంటనే వచ్చుచుండును. ఏ రాజ్యాన్ని అయితే రక్షిస్తానని అది బయలుదేరుతుందో, ఆ రాజ్యాన్ని అది సర్వనాశనం చేసిందన్నమాటే. (ఇది భస్మా సురవరము.) అంతఃకల్లోలంవల్ల మన కేమి వుపద్రవం రాకుండా చేసికొన్నా, దేశాన్ని శాంతముగ అణచిపెట్టి యుంచినా, దేశప్రజలస్థితి, దేశీయ రాజులకిందకంటె మనకింద యెక్కువ సౌఖ్యవంతముగ నుంటుందనేమాట నాకు చాల సందేహాస్పద ముగ కన్పట్టుచున్నది. బ్రిటిష్‌వారు తమ భుజబలమువల్ల యిండియాను జయించడంవల్ల వచ్చేఫలితము ప్రజల స్థితిని బాగుపరచి వారిని పైకి తెచ్చుటకంటె, వారిని యావన్మందిని మరింత అధోగతిలోనికి త్రొక్కివేయుటయే యగును. కాని వేరొండుకాదు. ప్రపంచములో అనేక రాజులు పరరాజ్యా లను ఆక్రమించుకొన్నవారు వున్నారు. కాని, దేశీయ ప్రజ

లను యీరీతిగ— యీ యింగ్లీషు గవర్నమెంటువారు చేసి నట్లుగ, రాజ్యపరిపాలనాధికారమునుండి పూర్తిగ వెళ్లగొట్టిన పాపమున యెవరును పోలేదు. దేశీయ రాజ్యములలో యెన్ని అల్లకల్లోలము లున్నను, ప్రతివాడు పైకి రావడానికి నిరాటంకముగ అవకాశములున్నవి. కాబట్టి, వారిలో ఒకరినిచూచి ఒకరు నేర్చుకొనుటకు ప్రోత్సాహము, చురుకుదనము, స్వాతంత్ర్యపిరతి మున్నగు ఉత్తమగుణములున్నవి. మన ఇంగ్లీషువారి రాజ్యముక్రిందనున్న దేశీయప్రజలుచూపు నీచమగు దాస్యభావముకంటె ఈ యుత్తమ గుణము లెంతమేలు! బ్రిటిష్ గవర్నమెంటువారి రాజ్యాధికార మిప్పుడు (1817) యెదురు లేని ప్రతాపముతో వెలుగుచున్నది. ఎందరు శత్రువులు, యెన్నివిధముల యేకమై మనపైకి వచ్చినను, మనము భయపడవలసిన పనిలేదు. అద్దెసేనల పద్ధతి నిక విస్తరింపజేయ నక్కరలేకయే, మనల నెందరెన్నివిధముల వంచింప జూచినను, అవమానింపచూచినను, మనము లెక్కచేయవలసినపని లేదు.'' కాబట్టి, యీ అద్దెసేనల పద్ధతి నిక విస్తరింపజేయ వలదని నిరుత్సాహపరుచుచు సర్ తామస్ మన్రో మాయిరా ప్రభువుకు—యుద్ధమున కిక బయలుదేరబోవు సమయమందు-వ్రాసెను. కాని మాయిరాప్రభు వీ మాటలనన్నిటిని త్రోసివేసి, రణభేరీ మ్రోయించెను.



# భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన

## 20 వ అధ్యాయము

క్రీ. శ :—1818—1823



ఆంగ్లేయుల యందు గట్టి మనోనిబ్బరముతో కూడిన ధైర్యము, అత్యంతజాగ్రత్తతో కూడిన దూరదృష్టి మిళితమై యున్నవి. తమ మిలిటరీ వ్యవహారము వచ్చినప్పుడు వారెంత జాగ్రత్త, యెంత ఆతురత చూపుదురో, అట్లే రైతుల యెడలను భూస్వాముల యెడలను కూడ అంత ఆతురత చూపితే,— భగవంతుని బిడ్డలగు బీద ప్రజలయెడల వీరంతటి ప్రేమను జాగ్రత్తను చూపితే—యిక లోకములో రాజ్యపాలనకు తగినవారు వీరంత వారింకెవరును వుండబోరు. కాని యీ దేశ ప్రజలఎడల వారు కించిత్తయినను శ్రద్ధ వహించుటలేదు; వారి యోగక్షేమముల నావంతయు పాటించుటలేదు. అందుచే, వీరిపాలన క్రిందనున్న ప్రజలు సర్వత్రదరిద్రులై దిక్కులేనివారై, అన్నమో రామచంద్రా యని యడలుచు, నానా యిడుములఁ గుడుచుచున్నారు.

—ముటాకెరన్

వైసా(్రయి చుట్టుచేరిన సలహాదార్లందరు తమ మనస్సులలో యేమి తలంచుచున్నారో, మహారాష్ట్రులు తక్షణమే సులభముగ కనిపెట్టిరి. దీనిని కనిపెట్టుటకు పెద్దతెలివితేటలు కావలెనాయేమి? "మీరు చేసినవన్నీ అవివేకపు పనులే-ఛీ" అని కుంపిణీవారు మాటిమాటికి చివాట్లు పెట్టుతూవుంటే, అవన్నీ విని మెదలకుండ ఊరుకున్నంతవరకు మహారాష్ట్రులు మంచివారే! హతశేషమగు రాజ్యదర్పమును గాని, రాజ్యకాంక్షనుగాని మహారాష్ట్రులు యెన్నడైన పొరబడి పైకి కనబరచినప్పుడు కుంపిణీవారు, హుమ్మని హుంకరించి, కనుబొమ ముడిపెట్టి, దబాయించుచుండిరి. ఈ భ్రూభంగవిక్షేపములకు మారుమాటాడక నోరుమూసికొని పడియున్నంతవరకు మహారాష్ట్రులు మంచివారే. అంతవరకు వారినిక కష్టనష్టముల పాల్సేయకుండ నూరుకుండవచ్చునట! కాని కుంపిణీవారు వీరిని నిరంతరము గిల్లి, యేదో చిల్లరకజ్జాలను దెచ్చిపెట్టుచుండిరి. తుచ్ఛమగు నిట్టి సూదిపోట్లను మానవుడైనవాడెన్నాళ్ళు ఓర్పుతో సహించి యూరకొనగలడు? వీనిచే గలిగిన రోష క్రోధములచే, వారికొక్కొక్కప్పు డొడలుమండి కుంపిణీవారియెడ మర్యాదను, గిర్యాదను పాటింపక యేమైనాసరే కానీయుని తిరుగబడుచుండిరి. దేశీయసంస్థానములలోను దర్బారులలోను యింగ్లీషు రెసిడెంటు చలాయించు సర్వంసహాధికారమును అధికార గర్వోన్మత్త ప్రలాపపు ధోరణినిచూచి అచ్చటనున్న దేశీయోద్యోగులకు—అందు ముఖ్యముగ మిడిమిడి జ్ఞానముగలిగి, ముక్కోపులై వున్నవారికి—మరింత కోపకార

ణములగుచుండెను. (ఇట్టి గర్వోన్మత్తపు ధోరణిని చూపుట ఒక్కొక్కప్పుడు యింగ్లీషు రెసిడెంట్ల యుద్దేశము కాకపోయినను, యీ ముక్కోపులకట్లు తోచుచుండెడిది.) ఈ విధముగ రోషపూరితులై, అసంతృప్తులైయున్న తమ యుద్యోగుల గొణుగుళ్లను మనోనిబ్బరములేక దుర్బలులైయున్న రాజులు విన్నప్పుడు, వీరుకూడ కుంపిణీవారిఎడ విముఖులై వారితో చేసికొన్న యొడంబడికలయెడ అంత గౌరవమును పాటింపక వానిని తోసివేయుతలంపును మనస్సులో పెట్టుకొని తద్వారా తుదకు అపాయకరస్థితిలోకి వచ్చుచుండిరి. తమప్రజల యొక్క అసంతృప్తిని గొణుగుళ్లను విన్నప్పుడు, కుంపిణీవారి ఎడ యీ రాజులకెట్లు విముఖతగలుగకుండును? ఎవరికైనను గలిగితీరును. "బ్రహ్మకైనను బుట్టు రిమ్మతెగు" లన్నట్లు యిట్టిమాటలు విన్నప్పుడు యెవరికైనను క్రోధము అసహ్యము పుట్టును. అట్లుపుట్టుటలో ఆశ్చర్యములేదు ; పుట్టకపోవడమే ఆశ్చర్యము !

ముఖ్యముగ పూనాలో అశాంతిప్రబలెను. అక్కడ రెసిడెంటుగనున్న ఎల్ఫిన్‌స్టన్ అనువాడెంత శాంతివాక్యముల బోధించినను నిరర్థకమయ్యెను. ఈ రాష్ట్రపు సరిహద్దులలో భయానకమగురీతిగ దండువిడిసియుండెను. పూనాదర్బారులో త్రియంబకరావు అనునాతడుండెను. ఈతడు కుట్రపరుడు. క్రూరస్వభావము గలవాడు. మంచిచెడ్డల నాలోచింపక యేమి వచ్చినాసరేయని మూర్ఖముగ నిర్లక్ష్యముగ వర్తించువాడు. ఈతడు పీష్వాపై అమితమగు పలుకుబడిగలిగి యుండెను. తుట్టతుదకు యీతడే పీష్వాకొంపతీసెను— పీష్వా

కూలిపోవుటకు యీతడే కారకుడయ్యెను. తన రహస్యము లెవరు కనుగొనలేరన్నట్లు యీ త్రియంబక రావు హోల్కారు, భాన్స్లే, సింధియాలతో రహస్యముగ స్నేహము గట్టుటకు యత్నించెను. వీరందరు కలిసి అవసరమైతే శత్రువులపైకి పోవుటకును, లేకపోతే, శత్రువులెవరైనా తమపైకి వచ్చినపుడు అందరుకలసి యేకమై యెదిరించుటకును, యీ స్నేహము యొక్క ఉద్దేశము. కాని, యింగ్లీషు వారిచే బాగా మేపబడుచు, కంట్లోకనుపాపను తీసే గూఢచారి ముండావాండ్ల యెదుట యీ రహస్యములు దాగునా? ఈ రహస్యము బయటపడి, "యేమి నీ విట్లా చేయుచున్నావట, యేమి?" అని ముఖాముఖిని అడిగినప్పుడు ఆతడు కించిత్తయినను చలించక, "నే నెరుగనని" చెప్పెను. ఇట్టి నిశ్చలత్వము— యిట్టి గుండెలు తీసినబంటుతనము— యూరోపియను దేశములలోనైతే "బలేమంచిది, యిది సహజమైనది, న్యాయమైనది" అని పొగడేవారే. కాని, పాప మీతడు హిందూదేశస్తుడగుటచే, "ఛీ! ఛీ! యిది కేవలము పశుప్రాయమగు మృషాభాషణమని" ఆనాడు కుంపిణీవారెంతో అసహ్యించుకొనిరి.

తన స్వాధీనములోనున్న మొగలాయి చక్రవర్తిని కుంపిణీవా రెప్పుడైతే లాగికొని వెళ్లినారో, అప్పటినుండి తానిక పీష్వాకు సంరక్షకుడనని చెప్పుకొనుటకు దౌలత్ రావు సింధియాకు మొగము చెల్లలేదు. ఏలననగ, తనకంటె బలవంతులగు కుంపిణీవా రున్నప్పుడు, యేక్షణమందు— వారు మొగలాయి చక్రవర్తిని లాగుకొని వెళ్లినట్లుగ— యీ

పీష్వానుకూడ తన స్వాధీనములోనుండి, తన రక్షణలోనుండి లాగుకొని వెళ్లుమరో చెప్పలేము. అట్టి సందర్భములో "నేను పీష్వాకు సంరక్షకుడను— పీష్వాను సంరక్షిస్తాను" అని చెప్పినందువలన యేమి ప్రయోజనము? అందుచే, తాను పీష్వాకు సంరక్షకుడనను తలంపును సింధియా మానివేసెను. తన స్వజనమగు తదితర మహారాష్ట్ర ప్రముఖులనుండి విడిపోయి, పిండారీలను వేటాడు విషయమై కుంపిణీవారికి సహాయము చేసెదనని సింధియా ఒప్పుకొనెను. కుంపిణీ వారితో చేరవద్దని పాపము పీష్వా బాజీరావు, సింధియా కెంతో ప్రాధేయపూర్వకముగా వ్రాసెను. "మీతండ్రి మహాదాజీ సింధియా, మమ్ముల నెంతో భక్తివిశ్వాసములతో కొలిచియుండెను. నీవు రాజ్యానికి వచ్చినపిమ్మట నీవు ఇంగ్లీషు వారితో చేరినావు. ఇదియా నీవు హిందూస్థానమును పరిపాలించు పద్ధతి? ఇదియా నీవు మాయెడ కృతజ్ఞతను జూపుపద్ధతి? ఇంతకంటె నీవు గాజులు తొడిగించుకొని, ఆడుదానివలె యింట్లో కూర్చుంటే బాగుంటుంది. నా అధికారం పోయిన తర్వాత, నీ అధికారాన్ని మాత్రం వుంచుతారనుకున్నావా యేమిటి కుంపిణీ వారు"అని పీష్వా బాజీరావు సింధియాకు వ్రాసెను. ఇందుకు బదులుగ "అసలు మొట్టమొదటగ బేసిన్ వద్ద యింగ్లీషు వారితో సంధి చేసికొన్నది నీవు కావా" యని సింధియా పీష్వాను తిరిగి యెత్తిపొడిచెడివాడే. కాని, పీష్వా వ్రాసిన నిందాపూర్వకమగు యీ విజ్ఞాపనను చూచినప్పుడు సింధియా మనస్సు కరిగిపోయెను. ఆతడు తక్షణమే కుంపిణీవారితోడి పొత్తును విడగొట్టుకొనేవాడే! కాని, వీలులేకపోయినది—ఏల

ననగ, కుంపిణీవారితోడి వ్యవహారము చాల దూరమువరకు వెళ్ళిపోయెను; తిరిగి వెనుకకుమరలుటకు వీలులేనిస్థితి యేర్పడెను. అందుచే పాపము, సింధియా యేమియు చేయ లేక పోయెను. అమిత సంఖ్యాకములగు శత్రుసేనలు దాడి వెడలివచ్చి సిద్ధముగనుండెను. అందుచే, సింధియా యేమిం చేయుటకు — ఒక్క అడుగు యీవల పెట్టుటకు కూడ — వీలులేకపోయెను. తుదకు ఫలితమేమంటే కథ అడ్డము తిరిగెను. తనజాతికెల్ల బలవత్తముడగు రాజని భావించి, మహారాష్ట్రు లంద రీతనిపై యేక్షణమందైతే ఆశలు పెట్టు కొని యున్నారో, ఆక్షణమందే, వా రందరియాశలు నిరాశ లై యీతడు తన యావజ్జాతియొక్క శ్రేయమును భంగపుచ్చి, శత్రుపక్షమున చేరవలసినవాడయ్యెను." అని మాల్కొమ్ అను నాంగ్లేయుడు వ్రాసెను. కాని, నిజమునకు, పెచ్చు పెరిగివచ్చుచున్న పరరాజ్యాధికారము నావలికి నెట్టుటకు ఆతడొకవేళ దీర్ఘకాలము పోరాడియుండినను, తుదకు ఫలిత మేమియు నుండెడిది కాదనియే చెప్పవచ్చును. కాకపోతే, పోరాట మింకొక కొంచెము దీర్ఘమయ్యెడిది —అంతే! ఇది యిట్లుండ, "మాతో శాశ్వతపు టొడంబడిక చేసికొన్న యెడల, మా సామ్రాజ్యైక్యతతోపాటు, నీ స్థానిక స్వాతంత్ర్యమును కూడ కాపాడుదు మ"ని కుంపిణీ వారభయమిచ్చిరి. నిష్ప్రయోజనమగు పోరాటమును సాగించుటకంటె, "వీరితో కలిసి, వీరి చల్లని సామ్రాజ్యపు నీడను నారాజ్యములో నేను హాయిగ, స్వతం త్రముగ వుంటే చాలదా" అని సింధియా ఆశపడెను.

" నా ప్రజల కింతశాంతి, భద్రతలు, దక్కితవి. వారు హాయిగ వుంటారు. నా యీ రాజ్య మేమౌతుందో అనే దిగులు కూడ వుండదు" అని సింధియా తలపోసెను. ఈ ప్రకారముగ తలపోసి, సింధియా యెట్టకేలకు కుంపిణీవారితో బేరము కుదుర్చుకొనెను. ఆ బేరపు షరతులను అతిక్రమించకుండ, జాగ్రతగ నడుచుకొనుచుండెను. ఒక యాభై సంవత్సరములపాటు ఆతడును ఆతని సంతతివారును కూడ బ్రిటిష్వారి యెడ భక్తి విశ్వాసములతోనే వుండిరి. మిక్కిలి కష్టపు రోజులలో కూడ వారు సంధి షరతుల నతిక్రమించకుండ, భక్తి విశ్వాసములతోడనే యుండిరి.

కాని, "లాపాయింటు" లను వాక్యార్థపు చెదపురుగులుపుట్టి, యీ యొడంబడికలోని షరతులను, ఈ సంధిపత్రములను యేరోజునైన ఆకస్మికముగ తినివేస్తే దిక్కేమిటి? అధర్మభీతిలేక, నిశ్శంకముగ, లోలచిత్తుడై తిరుగుచు "యిద్దరి ముగ్గురిని చంపిచూస్తే నేగాని వైద్యుడుకాడను" సామెత సార్థకపరుచు కొత్తవైద్యు డొకడు బయలుదేరి, యీ యొడంబడికల నన్నిటిని పట్టి, రసాయనిక ప్రయోగముచే బట్టీపెట్టినప్పుడు, వానిలోని అసలు ప్రాణవాయువులే యెగిరిపోయినచో యిక దిక్కెవ్వరు?

కౌలుదారుడు భూమికిచేసిన మరమ్మతుయొక్క ప్రయోజనము ఆతనికి కౌలున్నంతవరకే యుండుగాని, తదనంతరముండదన్నట్లు, ప్రజలు రాజునెడ జూపు విశ్వాసమువలని ప్రతిఫలము ప్రజలకు కొంతకాలమువరకే— రాజుచిత్తము ప్రసన్నముగనుండువరకే,— వుండునుగాని, తదనంతరము

వుండదని హఠాత్తుగ యెవరైనా ఒకరోజున ప్రకటించిన యెడల, యికప్రజలకు దిక్కెవ్వరు? పురుషవారసులులేని యాపత్తు రాజ్యములు— యిదివరకు యింగ్లీషువారి క్రింద వున్నాసరే లేకపోయినాసరే— యిప్పుడు బ్రిటిష్‌వారికి సంక్రమించునని యిటీవల క్రొత్తగా లేవదీసిన ధర్మసూత్రము యొక్క తాత్పర్య మిదిగాక, మరియేమి? ఇట్టి బెదరింపు నోటీసుల నింకను గ్వాలియరు సంస్థానముపై కుంపిణీవారు జారీచేయని మాటవాస్తవమే. అయినను గ్వాలియరు సంస్థానము వారికి లోపలమాత్రము భయముగనే వుండెను. ఎప్పుడీ నోటీసు తమకు కూడవచ్చిపడునో యని వారు లోలోన అనుమానపడుచునే యుండిరి. కాని, ఆమాటపైకి అంటే యేమి అంకువచ్చునో అనుభయము చేత పైకేమియు మాట్లాడక ఊరకుండిరి. ఏ మాత్రము ప్రాముఖ్యతగల దేశీయరాజ్యము వారైనను యిట్టిభయముచే లోలోన కుళ్ళిపోవుచున్నారనియు, యీ భయకారణమునే మిషగగొని కుంపిణీవారిరాజ్యముల కాజేయుచున్నారనియు తలంచుటకు మనకనేక నిదర్శనములున్నవి. దేశీయరాజ్యములలో అనేకచోట్ల కుంపిణీవారు చేసిన, చేయజూచిన, చేష్టలనుబట్టి చూచినయెడల, దేశీయ రాజులకట్టి భయములేదని తలంచుట శుద్ధవెర్రి.

హోల్కారు మైనరుగనున్న రోజులలో 1817 సం॥లో అతని యసంఖ్యాకములగు అశిక్షితసేనలు తిరుగుబాటుచేసెను. ఈతనికి గార్డియన్ అగు తల్లి తులసీబాయి సంస్థానమున కధిపతియయ్యెను. కాని, సంస్థానమందు వ్యక్తిద్వేషములు, కలహములు మెండై, దర్బారంతయు నానా

భీభత్సముగనుండెను. పీష్వాతో కలియుదమను ఉద్దేశము చాలవరకు ప్రబలియుండెను. కాని, శాంతిని నెలకొల్పుట కెవ్వరికిని సాధ్యముకాకుండెను. ఈ లోపుగ, యింగ్లీషు సేనలు బయలుదేరి, మహిదుపురమువరకువచ్చెను. శీప్రా నదీతటమున సంకులసమరమయ్యెను. మహారాష్ట్రులు ఓడి పోయి ముందిసూరు పట్టణమువద్ద సంధిచేసికొనిరి. రాజ పుత్ర సంస్థానములన్నిటిపై మహారాష్ట్రులు తమ యాధిపత్య మును వదలుకొనిరి. జయపురభూములపై కూడ తమ యధి కారమును వదలుకొనిరి. సాత్పురాపర్వతపంక్తికి దక్షిణమున నున్న దేశమంతటిని యింగ్లీషువారికిచ్చివేసిరి. ఇక పోగా మిగిలిన రాజ్యములు విచ్ఛిన్నమొనర్పక యీామైనరుకును, అతని సంతతివారికిని పారంపర్యముగ చెందునట్లు కుంపిణీవారు పూచీ పడెదమనిరి. అల్లకల్లోలము, భీభత్సముపోయి దేశమందు ప్రశాంతమగు పరిపాలనయేర్పడెను. చిరకాలమునుండి శత్రు వులకు గుండెదడగనుండిన హోల్కారుసంస్థానపు అశ్వదళ మంతయు విచ్ఛిన్నమొనర్పబడి, ఆఖరుకు పూర్తిగ తొలగింప బడెను. ఆ రోజునుండి తిరిగి యిందూరురాజులు (హోల్కారు సంతతిరాజులు) యెవరును కుంపిణీవారిపై కత్తికట్టినిలచిన పాపమునపోలేదు. (రెండురెక్కలు కొట్టివేయబడిన పక్షి వలె.) తనకు ప్రాపుగనుండిన సింధియా హోల్కారు రాజ్య ములు రెండును నాశనమగుటచే, పీష్వా యింకేమిచేయ గలడు? బేసీన్ సంధివలన కుంపిణీవారు తనపై విధించిన షర తుల నెట్లు తప్పించుకొనగలడు? ఈ సంగతి అక్కడ రెసిడెం టుగనుండిన ఎల్ఫిన్స్టన్ కూడ సులభముగ కనిపెట్టెను.

కాని, పీష్వాకు మంత్రిగనుండిన, త్రియంబకరావుయొక్క ప్రవర్తన కుంపిణీవారికి చాల సహింపనిదిగనుండెను. "ఈతనిని వెంటనే రాజ్యమునుండి వెడలగొట్టవలసినది; లేదా యీ బేసిన్ సంధిషరతుల నమలుజరుపుటకు హామీగా యీతనిని మాకు వప్పగించవలసినది" అని కుంపిణీ వారు పీష్వాను కోరిరి. త్రియంబకరావు పారిపోయెను. "అతనెక్కడికి పారిపోయినాడో నాకు తెలియదు" అని పీష్వా తెలియనట్లు నటించెను. సాయుధముగ తిరుగుబాటు చేయుటకై ఆతడు కుట్రలు పన్నుచున్నాడని తెలిసినప్పుడు గూడ, ఆతనిని కుంపిణీవారికి వప్పగించుటకు పీష్వా తిరస్కరించెను. ఈ త్రియంబకరావుకును, పీష్వా బాజీరావునకును జరుగుచున్న ఉత్తరప్రత్యుత్తరములు బయటపడెను. అంతట అప్పటి కింకను పూనాలోనే నివసించియున్న ఆతని కుటుంబమువారిని వప్పగించవలసినదని రెసిడెంటు పీష్వాను వత్తిడి చేసెను; మరియు, పట్టణమునకు చుట్టుపట్లనున్న కోట లన్నిటిలో అద్దెసేనల నుంపుటకు అంగీకరించవలసినదని కూడ నిర్బంధించెను. దీనికి పీష్వా అంగీకరింపలేదు. "జాగ్రత్త, యిది యుద్ధకారణముగ మేము యెంచుకుంటాము" అని కుంపిణీవారతనిని బెదరించిరి. పీష్వా కాలహరణము చేసెను. తక్షణమే కొత్త సంధిషరతులను వ్రాసి, వానికి "ఒప్పుకుంటావా, లేదా" యని ఎల్ఫిన్‌స్టన్ చేత పీష్వాకు అంత్యసందేశ మంపిరి.

అందులోని షరతులేమనగ :— అద్దెసేనల నెక్కువ చేయవలెను; వారి పోషణకై సాలుకు 30 లక్షల 40 వేల

రూపాయలు ఆదాయమువచ్చే రాజ్య భాగమును కుంపిణీవారి కిచ్చివేయవలెను. ఇతర సంస్థానములతో పీష్వా రాయబార ములు జరుపరాదు. మంత్రి త్రియంబకరావును కుంపిణీవారికి అప్పచెప్పివేయవలెను. ఇక ఆఖరుషరతు యేమనగ :—ఇక మీదట పీష్వా మహారాష్ట్రసామ్రాజ్యమున కంతటికి అధిపతి ననుమాట శాశ్వతముగ వదలుకొనవలెను. ఈ షరతులు "అంగీకరిస్తావా, లేదా" యని, బెదరించుటకు గాను అద్దె సేనలను తీసికొనివచ్చి పీష్వా కోటగుమ్మమువద్ద నిలిపి, "24 గంటలలో జవాబివ్వవలసినది" అని కబురంపిరి. తన యొక్క నిస్సహాయస్థితిని పీష్వా బాజీరావు అప్పుడు తెలిసి కొనెను. మంత్రులకుకూడ తత్తరము పుట్టెను. ఏ యధి కారమునైతే యెదిరించవలసినదని నిన్నటివరకు యీ మంత్రులు పీష్వాకు సలహాచెప్పుచుండిరో ఆ యధికారులవద్దకే (కుంపిణీవారివద్దకే) వారువచ్చి పీష్వాయెడ క్షమాపణను దాక్షిణ్యమును జూపవలసినదని యెంతో ప్రాధేయపడజొచ్చిరి. "ఇదివరకు పీష్వాయితరులకు కొన్ని హక్కుల నిచ్చియుండు టచే, పీష్వాస్థితియిప్పుడు క్లిష్టమై పోయినది. దానిని మీరు కొంచెము గమనింపవలసియున్నది. విదేశీయ సైన్యములచే గలిగింపబడు వంచన శౌర్యవంతులగు రాజులకును, అమాయి కులగు ప్రజలకును దుస్సహముగ నుండును. ఈసంగతినికూడ తాము కొంచెము గమనింపవలసి యున్నది. ఇంతటి నిర్దాక్షి ణ్యముగ చూపును బరగించుటయు, యింత పరిభవకారణముగు కఠిన షరతులను విధించుటయు లోకము భరింపజాలదు. ఒక వేళ, పీష్వా వీనికి సమ్మతించినను, వీని నాతడు విశేషకాలము

పాటింపజాలడు. ఏలననగ, వీనిని పాటించుట కాతని కేమి యుండును? అధికారమా శూన్యమగును. గౌరవమా అంతకు మునుపే యుండదు— అట్టిచో, ఆతడిక పాటించునదేమి? ఈ రెండును పోయినపిమ్మట ఆతని రాజ్యమే పోయినట్లగును గద" అని యీరీతిగ మంత్రు లెంతయో చెప్పిరి. వీరు చెప్పినదంతయు సత్యమే. అందొక్కటియు పొల్లుమాట లేదని విన్నవారందరికి నచ్చెను. కాని, "యీ షరతులలో యేదీ కూడ వదలవద్దు" అని ఎల్ఫిన్‌స్టన్ యిచ్చిన యుత్తరువులలో నుండెను. ఇక తక్కినవా రేమిచేయగలరు? ఆతని వాక్యము అనుల్లంఘనీయము. బహు దీర్ఘకాలము నిష్ఫలమగు వివాదము జరిగినపిమ్మట, క్రొత్త సంధిపత్రముపై పీష్వా సంతకము చేసెను. 1803 సం॥ లో పీష్వా వంట్లో యెక్కించిన విషము అది చేయవలసిన పనిని పూర్తిగ చేసివేసెను. ఆ విష మిప్పుడు మెదడుకుకూడా యెక్కి, దాని లక్షణములజూప నారంభించెను. పీష్వారాజ్య మిప్పుడు వంచితమై అంగవైకల్యమునొంది యున్నది. అది యింతటినుండి చేయు ప్రతి పనియు మెదడు చెడిపోయిన పిచ్చివాడు చేయు పనివలె నుండెను. దానికొక సందర్భముగాని, నేర్పుగాని లేకుండెను. సంధిపత్రముపై సంతకము చేసిన మరుక్షణమునుండి ఆతడు విచారమును పశ్చాత్తాపమును బొందుచుండెను. దానిని కుంఫిణీవారు బహిరంగముగ ప్రకటించినపుడు పీష్వాబాజీరావు మనస్సు డోలాయమానముగ నూగులాడజొచ్చెను— "అయ్యో," అని నిరాశచే కొంతసేపును— "ఆ! కసి తీర్చుకొందున" ని కొంతసేపును,— యీరీతిగ పిచ్చియెత్తిన

వానివలె పీష్వా ఉన్మాదావస్థయందుపడి కొట్టుకొన నారంభించెను. ఈ కాడిని ఆతడు తన చేతులతోనే యెత్తి తన మెడమీద పెట్టుకొన్నాడు; అయినప్పటికి అది బరువుగాకుండా వుండునా? నిరాశాహతుడై, పీష్వా సర్వత్యాగ మొనర్తుగాక యని కొంతసేపు కొట్టుకులాడియాడి, తిరిగి యేమైనను సరే కుంపిణీ రాజ్యమును కూలద్రోయుదుగాక యని పన్నాగములు పన్నదొడంగెను. దీనివలన కొలదిమాసములలోనే, తనకును, తన కుటుంబమునకును, తన సింహాసనమునకును, తీరని పరిపూర్ణమగు వినాశనమును తెచ్చిపెట్టుకొనెను. అర్ధసేనలన్నియు వచ్చి, తన రాజధాని నాక్రమించుకొనెను. పట్టణమున కిరువైపులనుండి రెండు ఆంగ్లసేనలు వచ్చి ముట్టడివేసెను. "ఈ పీష్వా రాజ్యమునంతా యింగ్లీషు రాజ్యములో కలుపుకొన్నామని 1818 సం॥ ఫిబ్రివరి 11 వ తేదీన కుంపిణీవారు ప్రకటించిరి. రెండు నెలలు యుద్ధము జరిపిన పిమ్మట, పీష్వా బాజీరావు సర్ జాన్ మాల్ కాంకు ఖైదీగ చిక్కెను. అప్పటినుండి తన యవసాన దశవరకు కుంపిణీవారిచ్చు 8 లక్షల మనువృత్తితో (పింఛనుతో) కాన్ పూరువద్ద నున్న 'బిటూరు' అనుచోట కాలము వెళ్లబుచ్చి, బాజీరావు కాలధర్మము నొందెను. పుత్రసంతతి లేనందున, తానిక కొలది సంవత్సరములకు చనిపోతాననగనే, 'నానాసాహెబ' ను ఒక కుమారుని బాజీరావు పెంచుకొనెను. మధ్యమ భారతవర్షమందలి రాజవంశములలోనికెల్ల పేరు ప్రఖ్యాతులగాంచి, ఒక శతాబ్దకాలమునకు పైగా, మహాప్రతిభతో వెలిగిన తనవంశకర్తయగు బాలాజీవిశ్వనాథుని వంశము అంతే

టితో అంతరించిపోక శాశ్వతముగ నిలుచునను ఆశ చివరివరకు తన్ను వదలకపోవుటచే, బాజీరావు తన శరీరముపై నున్న సర్వాభరణములను—తన మనస్సులో కుంపిణీవారిపైనున్న క్రోధరోషములతో సహా- తన దత్తకుమారునికి వప్పగించి, వెళ్ళిపోయెను.

నాగపురాధీశ్వరుడగు అప్పాసాహెబ్ న్ భాన్స్లేకూడ దర్పోద్ధతుడగు పీష్వాతో చేరి మొదటినుండియు రహస్యముగ పనిచేయుచునే యుండెను. ఈ యుద్ధసేనల బాధనుండి తప్పించుకొనవలెనని యీతడుకూడ ప్రయత్నించుచుండెను. ఇందుకుగాను యింగ్లీషు రెసిడెంసీని హఠాత్తుగ ముట్టడించియు, అసంఖ్యాకమగు సేనల ప్రోగుచేసి, సుశిక్షితమగు కుంపిణీ సేనల నోడించియు చూతమని భాన్స్లే యత్నించెను. కాని, యీ యత్నము విఫలముకాగా ఆతడంతటితో పారిపోయి, సిక్కులలో దాగుకొనెను. ఈతని స్థానమున రఘోజీభాన్స్లే మనుమని నొకనిని తీసికొనివచ్చి నాగపుర సింహాసనముపై కూర్చుండబెట్టి, వానితల్లి బంకాబాయిని గార్డియన్ గ పెట్టిరి. కాని, పరిపాలనయంతయు రెసిడెంటగు 'జెంకింసన్' చేతి మీదుగనే జరుగుచుండెను. ఈతడు దేశపు ధనమూలము లను వృద్ధిపరచి, ద్రవ్యోత్పత్తి సాధనముల పెంపొందించెను. క్రొత్తరాజుకు మైనారిటీ వెళ్ళేవరకు, యీ దేశీయరాజ్యము యొక్క నామమాత్రపు టధికారమును కొంచెము నిలువబెట్టిరి. ఈ కుర్రవానిని పేరుకు రాజుగ కూర్చుండబెట్టిరేకాని, పరి పాలనాధికారమేమియు యీతనికి లేదు. "పరిపాలన యావత్తు పూర్తిగ మనచేతిలోనికే తీసికొన్నాము. ప్రతిజిల్లాలోను

సంపూర్ణాధికారములతో యూరోపియన్ ఆఫీసర్ల నేవేసినాము. రాజ్యపరిపాలన అంతయు కేవలము వీరివల్లనే నడుపబడు చున్నది. నేటివుల పరిపాలన అనేది లేనేలేదు. మనమీ రాజ్యములో కలిగించుకొనే జోక్యము యెట్లావున్నదంటే, మన రెసిడెంటుకు యెదురులేదు; ఆతనిమాటకు భిన్నము లేదు. సర్వ సంపూర్ణాధికారములు ఒక్కటికూడ నేటివుల చేతులలో లేకుండ— సమస్తము మన రెసిడెంటు చేతులలో నేవున్నది" అని మెట్‌కాఫ్ వ్రాసినాడు.

మధ్యమ భారతవర్షమును పాలించు సర్వసంపూర్ణాధికార ములు 1818 సం॥ లో సర్ జాన్ మాల్‌కామ్ అను వాని చేతి లోనికివచ్చెను. యుద్ధానంతరము దేశమందు పరిశ్రమాభి వృద్ధి బహుతృప్తిగ జరిగినదని యీతడు చెప్పుచున్నాడు. సింధియాయొక్క శిక్షిత కాల్బలములు 26 వేలనుండి 13 వేలకు తగ్గించిరి. తక్కిన శిక్షితసేన నంతటిని పూర్తిగ తీసివారవేసిరి. రెవిన్యూ హాటికవంతు హెచ్చించిరి. యుద్ధకల్లోలపు రోజు లలో పారిపోయిన ప్రజలందరు తిరిగివచ్చి, దేశమందు శాంతి ప్రబలినందుకు సంతోషించుచు, యెవరిగ్రామములకువారు, ఎవరియిండ్లకు వారు చేరుకొనిరి. హోల్కారు రాజ్యమున కెట్టి కోల్కొనుశక్తి గలదో తెలిసికొనుట కింకను నిదర్శనములు గలవు. అంతఃకల్లోలములవల్లను, బహుకాలము ప్రజలు సైన్యశిబిరములయందే యుండిపోవుటవల్లను, పంటలన్నియు బీడుపడిపోయెను. ఈ కల్లోలసమయమందు తమ సంస్థానా ధీశులయందలి ప్రేమపాశముతప్ప, తక్కిన సాంఘికపాశము లన్నియు ప్రజలయందు విచ్ఛిన్నమైపోయెను. కాని యిట్టి

సమయమందుకూడ, రాజు అమితమగు పన్నుల విధించ లేదు. ఒకరి సొకరు దోచుకొనుటకు బదులుగ, నెమ్మదిగ యెవరి పంటలను వారు పండించుకొనుచుండిరి. యుద్ధములచే విసిగి వేసారియున్న యిట్టిప్రజలు, తిరిగి తమ తమ వృత్తులను శాంతముగ జేసికొనుట కవకాశము చిక్కి సంతోషించుచుండిరి. ఇదివరకు సాలుకు 4 లక్షలు వచ్చుచుండిన రెవిన్యూ, యిప్పుడు 1820 సం॥ లో 16 లక్షలు వచ్చినది. అశాంతి, అభద్రతలు పోయి, దేశమందు తిరిగి శాంతిభద్రతలు నెలకొను చిహ్నములు కన్పట్టసాగెను. ఇంతవరకు బాగానే వున్నది. దీనిని బట్టి యేమి తెలియుచున్నది? సర్వం సహాధికారము వహించిన (పర) రాజ్యాంగమందు కూడ ప్రజలకు సంతృప్తి, దేశ సంపదకు అభివృద్ధి — కొన్ని పద్ధతుల ప్రకారము నడచినచో— వుండవచ్చునని యేర్పడుచున్నది. ఆ పద్ధతులేమనగ :— ఆ యధికారమును సహనబుద్ధితోను, వివేకముతోను, వినియోగించవలెను. ఇది మొదటిషరతు. మరియు ప్రజలలో ఆత్మగౌరవముండుట సహజము. తమ సనాతన ధర్మములందును, అనుశ్రితాచారములందును, గ్రామములలో యెన్నికవలన యేర్పడిన పంచాయితీ వగైరా స్వపరిపాలనా సంస్థలయందును, ఉన్నతరాజ్యాంగమున వంశక్రమానుగతముగ వచ్చు రాజవంశీకుల పరిపాలనయందును, వేయేల తమ స్వదేశీయ రాజ్యపరిపాలనయందును ప్రజలకు యెక్కువ అనురాగము, అభిమానము ఉండుట సహజము. ఇది ప్రకృతిస్వభావము. ఇట్టి అనురాగమును అనవసరముగ భంగపుచ్చకుండ— దానిని బలాత్కారముగ పెరికి

వేసి వారి మనస్సులకు నొప్పి కలగించకుండ— చూడవలెను. ఇది రెండవ షరతు—ఈ రెండు షరతులు—యీ పద్ధతులు —నెరవేరినచో, సర్వాంసహాధికారము వహించిన (పర) రాజ్యాంగము దేశశ్రేయమునకు విరుద్ధముగ నుండవల సిన పనిలేదు. కాని, యీపని యెంతవరకు జరుగును? ఈ పద్ధతులు— యీ షరతులు యెంతవరకు నేరవేరును— అనునది గొప్ప సమస్య. "మనిషి అన్నములేక చావడు, మనిషి ఒక్క అన్నమువల్లనే బ్రతుకడంలేదు" అనిపెద్దలు చెప్పుదురు. ఒక్క మనషికి వర్తించిన యీ సూత్రమే దేశములకు, జాతు లకు కూడవర్తించును. మాళవరాజ్యము— యిదివరకు చెప్పినట్లుగ—దేశీయపరిపాలన యందు సుభిక్షితముగనుండెను. ప్రజలు సంతుష్టులైయుండిరి. విదేశీయ పరిపాలనలో కూడ మాళవరాజ్యము సుభిక్షముగనే యుండెను. కాని, ప్రజ లకు సంతుష్టిలేదు. భయములేని రోడ్లు, అభివృద్ధినొందు చున్న వ్యవసాయము, పెంపొందు ధరలు; తగ్గిపోవుచున్న నేరములు, సర్కారుకు వచ్చుచున్న హెచ్చురివిన్యూ,— యివన్నికూడ నిస్సందేహముగ క్రొవ్వు చిహ్నములే. ఏవస్తు వైనా కొనుక్కొనువానికిగాని, అమ్మకొనువానికిగాని, బరువే ప్రధానమగు నెడల, ఎముకలకంటె క్రొవ్వే యెక్కువ లాభము. ఈ క్రొవ్వుకు ప్రశాంతమే కారణముగను, ఫలి తముగను కూడ వుండును. దీనిని బట్టి అంతయు సంతృప్తిగ నున్నదని చెప్పుదురు. సరే, యివన్నియు వప్పుకొన్నను,— "అయితే, యికముందేమి" అని చరిత్రమాత్రము ప్రశ్నిం చును?

ఢిల్లీనుండి బ్రిటిష్ రెసిడెంటు మెట్‌కాఫ్ వచ్చెను. గవర్నర్ జనరల్ వచ్చి తన నొకసారి దర్శనముచేసి వెళ్లునట్లు ప్రోత్సాహపరచుటకై మొగలయి చక్రవర్తి షాలం యెన్ని ప్రయత్నములు చేయుచున్నది యీతడు గవర్నర్ జనరలుకు చెప్పెను. ఇంగ్లీషు గవర్నర్ జనరల్ వచ్చి తనను దర్శించుటకు ఒక్కటే యిబ్బంది యున్నదని యింగ్లీషునారతని కనేకసార్లు చెప్పియుండిరి. "భారత సామ్రాజ్యపు చక్రవర్తిగ నీవు కోరుచున్న అధికారమును మేము ప్రత్యక్షముగగాని, పరోక్షముగగాని ఒప్పుకొనము. ఇండియాలో ఇంగ్లీషువారి స్వాధీనములో నున్న యావత్తుదేశములపై సర్వం సహాధికారము ఇంగ్లీషు చక్రవర్తిదే కాని, యింకెవరిది కాద"ని 1813 సం॥ పార్లమెంటు ఆక్టులో స్పష్టముగ వక్కాణించియుండిరి. కాబట్టి, యిందుకు విరుద్ధముగ, యిక్కడ యిండియాలోనున్న యేపూర్వవంశీకుల యాధిపత్యమునుగాని అంగీకరించుచున్నట్లు కనబడే యేపనినిగాని ఆంగ్లచక్రవర్తికి ప్రతినిధిగ యిక్కడనున్న వైస్రాయిచేయరాదు. అట్లుచేయుట సదరుఆక్టులోని ప్రకటనకు విరుద్ధముగ నుండును" అని షాలం చక్రవర్తితో చెప్పియుండిరి. అదిగాక, ఈ షాలంచక్రవర్తి కొడుకు జహంగీరు మంచి సాహససామర్థ్యములు గలవాడు. యీతడు త్వరలో— తన తండ్రియనంతరము—రాజ్యమునకు రానున్నాడు. ఇంగ్లీషువారి రాజ్య మీహిందూస్థానమందుండుట ఆతనికెంతమాత్రము గిట్టదని తెలియుచున్నది. మన మిప్పుడు యీతని పారంపర్యపు హక్కును గనుక ఒప్పుకున్నామాఅంటే, ఆనందుచూచుకొని, ఆతడు ముస

ల్మాన్ రాజ్యముల వారినందరిని తిరుగదీసి, మనపై కత్తి కట్టించ వచ్చును. అట్టిచో, మనసిద్ధాంతమున కనుగుణముగ, మన స్థితిని వాదించి సమర్థించుకొనుట మిక్కిలి కష్టమగును. అది గాక, క్రియాభాగములోకూడ — అనగ యుద్ధములోకూడ- మనముజయించుట కష్టమేకావచ్చును '' అని వైస్రాయియగు మాయిరాప్రభువు తలంచెను. పదేండ్లనుండియు తనమన స్సులో పెట్టుకొనియున్న ఆశలన్నియు పాలంచక్రవర్తికి ఒక్క పెట్టున శాశ్వతముగ నిరాశలైపోయెను. మహారాష్ట్రుల చెరనుండి తనను విడిపించెద మని కుంపిణీవారు చెప్పినమాట లన్నియు కేవలము వారు 1802 సం॥లో జరుపదలచిన యుద్ధ మునకు మిషలేగాని వేరొండుకావు. తనను మహారాష్ట్రుల చెరనుండి విడిపించినప్పుడు, పాపము, తనకిక స్వాతంత్ర్యము వచ్చినదని పాలంచక్రవర్తి మురిసెను. “ రాష్ట్రములు రాష్ట్ర ములు నాసామ్రాజ్యములో నుండి పోసీగాక, నారెవిన్యూ అంతయు తగ్గిపోయిన పోవునుగాక, ఢిల్లీనగరపు పేరు ప్రతి ష్ఠలు లోకములో మాసిపోవునుగాక, ఢిల్లీయొక్క సామ్రాజ్య దర్పము భగ్నమైన అగుగాక; అక్బరు, ఔరంగజేబుల సింహాస నము మిగిలితే అంతేచాలు'' అని పాలంచక్రవర్తి తలపోసెను.

ఆ ఢిల్లీ సింహాసనముపై కూర్చున్నవారిలో యీతడు 33 వ వాడు. విశ్వాసహీనులగు సామంతరాజులు కప్పములు కట్టక మరచిపోవుదురుగాక; తానును, తనతండ్రియు, యుద్ధరంగ మందోడించిన నాయకులు అనువర్తనపాశములద్రెంచుకొనిన ద్రెంచుకొందురుగాక ; అయినప్పటికి, యావద్భారతవర్షము లోని మహమ్మదీయుల కెల్లరకు యీతడే కండ్లకు కనిపించు

నేతగ గన్పట్టుచుండెను. మహమ్మదీయ ప్రజలెల్లరు యీతని నే యింకను తమ నాయకునిగ భావించి, అంగీకరించుచుం డిరి. ఉత్పాతములు, యుద్ధములు, జయాపజయములు మున్నగు యీ కాలచక్రపరిభ్రమణ మందెప్పు డేముప్పు వచ్చునో యెవరెరుంగుదురు ఈ చక్రభ్రమణ మందీతని కెంతేనాడు తిరిగి పూర్వవైభవ దర్పాధికారములతో ఢిల్లీ సామ్రాజ్యమును పాలించునేమో యెవరుచెప్పగలరు? దుర్మార్గులగు హిందువులీతనిని చెరయుంచుంచిరి; పుణ్యాత్ములగు క్రైస్తవులు వచ్చి విడిపించిరి; కనీసము, యీ పనికోసము యుద్ధానికి వెళ్తున్నామనినైనా అన్నారు. "అంతమాట క్రైస్తవులు అన్నప్పుడు, వారిమాటలను నేను నమ్మకుండా యెట్లావుండేది? మొట్టమొదట వీరీ దేశమునకు వచ్చినప్పుడు యిక్కడవుండి వర్తకం చేసుకోడానికి మాతండ్రి అనుజ్ఞ యివ్వలేదా? తరువాత భూములు, యితర అధికారములు యివ్వలేదా? తరువాత మూడు పెద్దరాష్ట్రములపై పన్ను వసూలు చేయు అధికారమివ్వలేదా? తదుపరి, యింకా చాల ప్రదేశములపై రాజ్యాధికారమునే యిచ్చివేయలేదా? వీరు నాతోను, మాతండ్రితోను ప్రమాణ పూర్వకమగు ఒడంబడికలను చేసుకొనలేదా? నిన్న మొన్నటివరకు పొంగి పొరలు కృతజ్ఞ విశ్వాసపూర్వకవాక్యములతో నా సార్వభౌమాధికారమును ఒప్పుకొనుచు మన్నించలేదా? నా దర్బారునందు తమ విశ్వాసపాత్రుడగు రెసిడెంటును రాయబారిగ వుంచలేదా? ఇదంతయు వట్టి మాయయని, బూటకమని నేనెట్లు అనుమానపడేది?" అని పాపము పాలం చక్రవర్తి

తలపోయుచుండెను. బంగారము తోడను, నవరత్నముల తోడను పొదిగిన తన జైలుఖానా తలుపులను కుంపిణీవారు తెరచినమాట వాస్తవమే; కాని "తలుపులైతే తెరచినాము గాని, నీవు మాత్రము దానిలోనే వుండు. బయటికి రావడానికి వీలులేదు" అని కుంపిణీవారు చెప్పిరి! ఈ మాటలు మొట్టమొదటవారు నెమ్మదిగ చెప్పిరి. రాను రాను దబాయించి చెప్పదొడగిరి. ఈ జైలుఖానా తలుపుదగ్గర మేము కాపలా వుండి, దుర్మార్గులగు ఘూర్కాలుగాని, మహారాష్ట్రులుగాని, నీ మీదికి రాకుండా కాపాడుదుము. నీవు అందులోనేవుండు. బైటికిరాకు. బైటికివస్తే పిల్లియెత్తుకు పోతుంది; ఈ పంజరములో కూర్చుని, తింటూ, తాగుతూ, హుక్కా పీల్చుకుంటూ హాయిగా దాల్లో కూర్చోలేవా? నీకేమి తీపరమా? హాయిగ నీవు దాల్లో కాలుమీదకాలు వేసుకొని కూర్చుని, నీ పరివారానికంతా రోజూ హుకుములు జారీ చేయిస్తూవుండు; సాయంత్రింపూట మక్కావైపుతిరిగి నమాజు చేసుకో; చంచలమగు యీ దిక్కుమాలిన రాజ్యలక్ష్మినిగూర్చి నీ కొడుకుకు వేదాంతం చెప్పుకో— మహారాజువు నీకేమితక్కువ! నీకు కావలసినంతమంది నౌకర్లను, చాకర్లను యిస్తాము; ఈ ఢిల్లీ నగరము చుట్టు సస్యశ్యామలములగు పంటచేలు,— శాలిక్షేత్రములు— ఉద్యానవనములు- తోటలు, తోపులు,- సమస్తము వైభవోపేతముగ నున్నవి. ఇవన్ని నీ కోసము, నీ భోగముకొరకు జాగ్రత్తగ అట్టేపెట్టినాము. హాయిగ భోగపరుడవై, సంతతవిహారలీల లనుభవించుచు, యిచ్చాను

గుణాముగ, యింద్రియసుఖముల ననుభవించుచు, అలరుచుండుము. వీని యన్నిటిపై వచ్చు శిస్తును, పంటను, నీకోసము మేముజాగ్రత్తగ వసూలుచేసి యివ్వడానికి పూచీపడతాము. ఆ బాధంతా, ఆ అవస్తంతా మేమే పడతాము. నీవుమాత్రము హాయిగ కాలిమీద కాలువేసికుని కూర్చుని అనుభవిస్తూవుండు అంతే- అని కుంపిణీవారనిరి. కుంపిణీవారొకప్పుడు యీ షాలంచక్రవర్తికి అత్యంత ప్రియమిత్రులు. యిప్పుడు మాత్రంకారాయేమి? అయితే, యింతదగ్గరలో వున్నప్పుడు వైస్రాయి ఒకపర్యాయము వెళ్ళి, పాపము, తన దర్శనంకోసము అఘోరిస్తూవున్న ఆముసలాణ్ణి— తమ ప్రాణమిత్రుని- షాలంచక్రవర్తిని ఒక్కసారి చూచిరారాదా? ఒక్కమాట మాట్లాడిరారాదా? తన నోటిముత్యాలు రాలిపోతవా? అతడు చక్రవర్తికాడని అతని బిరుదునెవరును తిరస్కరించలేదే? పాపము ఆతడుకూడ, యింగ్లీషువారు కష్టపడి కత్తితోజయించుకొన్న రాజ్యాలపై "మీకధికారం లేదని" యెప్పుడు అనలేదే! భారతసామ్రాజ్యమున కంతటికీ ఢిల్లీరాజధానియై యుండెను. భారతసామ్రాజ్య మంతయు పోయినది. ఈ ఢిల్లీనగరముకూడ తనకికనుండి జైలుఖానా యయ్యెనుసుమా యని గ్రహించుటకు--తన భ్రమవీడుటకు--పాపము ఆముసలివానికి--షాలంచక్రవర్తికి--పదేండ్లుపట్టెను.

షాలం చక్రవర్తికి కాపలాపెట్టిన యింగ్లీషు రెసిడెంటు పాపము కొంచెము మెత్తని మనస్సు గలవాడు; నెమ్మదియైనవాడు; పాపభీతికలవాడు. ఆత డీదిక్కుమాలిన జైలుకాపలా పని చేయుటకు యెంతో జంకెను. ఈయవస్థయందున్న చక్ర

వర్తియొక్క మనోభావముల నాతడెట్లు గ్రహింప జాలకుం డును? "మనము అత్యంత శ్రద్ధతో, ఆదరణతో, యీ చక్రవర్తిని చూచినంత మాత్రమున మన గౌరవమునకు లోపమగునా? చిన్నచిన్న చిల్లర విషయములలో మన మాతని యిష్ట ప్రకారమేల పోకూడదు? ఆతని భావమునేల గౌరవించరాదు? ఇంత మాత్రముచే మనకేమి కొంప మును గును? చిల్లర విషయములలో మనమాతని యిష్టప్రకారమే పోయినచో, అవసరమైతే, పెద్ద పెద్ద విషయాలలో ఆతని మాట సాగకుండ, మన యిష్టప్రకారమే పోవచ్చునుగా! చిల్లర విషయాలలో కూడ, అనవసరముగ ఆతనిని మనమేల అగౌరవపరచవలెను?" అని యీ యింగ్లీషు రెసిడెంటు తలంచెను. కాని, మెట్‌కాఫ్ అన్యథా తలంచెను. "రెక్కలు తీసి పంజరములో వుంచిన యీ పక్షి మనచేతికింద వట్టిపిండి బొమ్మవలె వుండవలెను. తానింకా చక్రవర్తి ననేభ్రమలో వీడున్నాడు; ఈ భ్రమను తక్షణమే విడగొట్టడము ఆతనికే మంచిది. అట్లుగాక కేవలము అబద్ధమగు దొంగగౌరవ మును మనమాతని యెడ జూపుచున్నట్లు నటించుచు, ఆతడింకను యీ భ్రమలోనేపడి కొట్టుకొనేటట్లు చేయడము పాపమాతని యెడ దొంగప్రేమను, దొంగదయను జూపి నట్లగును. మనమీ దొంగగౌరవమును చూపుచున్నంత కాలము "నేనింకా చక్రవర్తిననే భావము వీడిమనస్సులో చావక కలకవేయుచునే యుండును; ఈ ప్రకారముగ, యీ భావము వానిమనస్సులో కలకవేయనివ్వకూడదు. దానిని తక్ష ణామే చంపివేసి, శాశ్వతముగ, తిరిగియెన్నటికి తలయెత్తకుండ

దీర్ఘనిద్రపుచ్చవలెను" అని మెట్‌కాఫ్ తలంచెను. తాను లేసి కొంటయిన తక్షణమే—ఒక్క క్షణమైననువృధపుచ్చకుండ— అమలులో పెట్టెను. చక్రవర్తిభృతిమను ఒక్కక్షణములో విడ గొట్టెను. ఢిల్లీనగరపుచుట్టునున్న భూములను, తోటలను, తన స్వాధీనములోనికి తీసికొనెను. ఢిల్లీనగరములోపల తన పోలీసు దళములను కాపలాపెట్టెను. స్థానిక న్యాయపరిపాల నాధికారమును చక్రవర్తినుండి తొలగించి, తానేవహించెను. ఇవన్నియు ఒక్కటొక్కటేజరిగెను. ఇవన్నియు యింకను ఆ పేరుతో నిలిచియున్న ఢిల్లీ సంస్థానములో ఆంగ్లరాయబారి చేయవలసిన విధులట! కొన్నిరోజులగునప్పటికి— "బహో హో, ఖర్చు యెక్కువైపోతోంది, నామమాత్రావశిష్టమగు యీ ముసలిచక్రవర్తియొక్క రాచరికపు ఆడంబరమున పోషిం చుట కింతఖర్చుయెందుకు? తగ్గించండి, తగ్గించండి, అను గర్జనలు పుట్టెను. ఈ రాచకీవి చచ్చుటకు యెంతోకాలము పట్టెను. ఇది ఆఖరుకు చావలేక చావలేక— యెంతో మరణవేదనపడి చచ్చెను. ఆ మరణవేదనను చూచుట దుర్భర మయ్యెను. "ఇన్నాళ్లిట్లు వేదనపడి, తీసుకు, తీసుకు, చావడంకంటె, మొట్టమొదటగ మెట్‌కాఫ్ చెప్పినట్లు ఒక్క సారి, ఒక్కదెబ్బతోనే—చంపేసేస్తే బాగుండేదిరా" అని అది చూచిన ప్రతివారికి అనిపించింది.

వరుసగ నాలుగు దండయాత్రలకొరకు ఖర్చుచేసిన డబ్బుకొరకై గవర్నర్‌జనరల్ యేకాడికైనాసరే ఒకచోట అప్పుచేయవలసి వచ్చెను. ఖజానా దివాళాగా వున్నప్పుడు అప్పుయిచ్చువాడెట్టి షరతులవిధించునో వేరుగ చెప్పనక్కర

లేదు. చాలసొమ్ము అయోధ్యవజీరునుండి అప్పుతీసెను. ఇతరహామీ లేమియు పెట్టుటకు లేకపోయినందున యీమధ్య ఘూర్కాలనుండి లాగికొనిన దేశమును అయోధ్యవజీరుకు అమ్మివేసెను. పాపము — అయోధ్యవజీరు — వెర్రిముండా వాడు — యీక్రియం తనకు చెల్లుతుందనుకున్నాడు! అమ్ముతున్నానని పేరుపెట్టి యిచ్చినకుంపిణీవారు, రేపుప్రతిఫలమేమియు లేకుండానే, గొల్లూడగొట్టి లాక్కుంటారని గ్రహించలేకపోయినాడు! దేశములను, అందలి ప్రజలను కూడ కేవలము విక్రియవస్తువులుగ భావించినాడు — యీమహాను భావుడు మాయిరాప్రభువు! ఈత డితరులవలెగాక, గౌరవము, రసజ్ఞత, ఉదారత గలవాడగుటచే కాబోలు, తనయిచ్ఛ వచ్చినరీతిని మెలగజొచ్చెను! హైదరాబాదులో "పామర్ అండ్ కంపెనీ" అను నొక వర్తకపుకంపెనీ యుండెను. ఈకంపెనీవారు నైజాముకు అప్పుపెట్టి, విపరీతమగు వడ్డీలులాగుచుండిరి. ఈవ్యాపారము అపరిమితమగు ఘోరకలిగనుండెను. ఈ ఘోరకలిని చూచి, సీమలోని కుంపిణీడైరెక్టర్లుకూడ అసహ్యించుకొని, మందలించిరి. "సమస్తమర్యాదలను, నీతిని, అతిక్రమించి మీరు నడుచుచున్నారని" డైరెక్టర్లు ఖండించిరి. ఇట్టి ఘోరవ్యాపారమొనర్చు కంపెనీలో తన దగ్గరబంధువు నొకని యీ మాయిరాప్రభువు భాగస్వామిగ చేర్చెను. కొత్తగ ప్రభుబిరుదము లభించిన యీ మాయిరాప్రభువు యీ పామర్ కంపెనీవారిని వెనుక వేసికొనివచ్చెను. "ఈకంపెనీవారిని అక్రమముగ, అన్యాయముగ, అవమానము చేశారు. కావలిస్తే, వీరి లెక్కలన్నీ పరీక్ష

చేసి చూసుకోండి" అని సవాలు చేసెను. లెక్కలలో తప్పు కనబడేటట్లు చేసుకుంటారా తెలివిగలవాళ్లు! "డబ్బంటే మన మాయిరాకు లక్ష్యము లేదండి; ఈ వెధవడబ్బు వాడికి కావలెనా? హైదరాబాదులో పామర్ కంపెనీవారు చేసిన సిగ్గుమాలిన పనులలో వీనికేమీ జోక్యములేదు; పాపము, దానికోసము వీనిని నిందించడము న్యాయముకాదు" అని వైస్రాయికీ మిత్రులగువారంద రనుకొనిరి. "వాడిడబ్బు వాడే తగలేసుకున్నాడు; ఒకడి డబ్బు వాడికికావాలా యేమిటి? పైగా, తన ఋణదాతలందరికి డబ్బు యెగబెట్టకుండ యెట్లాగైనా కష్టపడి, వాళ్ల ఋణము తీర్చుకుందామని చెప్పి, పాపమీతడు యిండియా పరిపాలనా భారమంతయు నెత్తిమీదవేసుకొని మోస్తున్నాడు. ఇంతకంటె ఉత్తమ కార్యము, మహోన్నతాదర్శము, యేదైనకలదా? దీనినిబట్టి ఆతడు "మిక్కిలి ఘనతజెందిన" ప్రభువని చెప్పుటకేమైన ఆక్షేపణ వున్నదా? నిజమే, యీ పామర్ కంపెనీవాళ్లంతా జేరి. నైజామును పూర్తిగ గొరిగినమాట వాస్తవమే; యీ కంపెనీలో, యీ జట్టులో, మన మాయిరాప్రభువు చుట్టము కూడ ఒకడు వున్నమాట నిజమే. కాని, యీ జట్టులో జరిగిన దుండగమంతా పాపము మాయిరా కేమి తెలియును? తన చుట్టముమీద పాపమీ మాయిరా కెంతో నమ్మకము, ప్రేమ. కాబట్టి ఆతడీ దుండగపుపని చేస్తాడని యెట్లా అనుకుంటాడు?" కాబట్టి, యెట్లాగైతేయేమి, మెటుకు నైజాముకు పూర్తిగ క్షవరమైంది! మాయిరాప్రభువు యింటికి వచ్చేశాడు — అంతే — అంతటితో ఆఖరు. ఇతని

అనంతరము 1823 సం॥ లో 'అమహారెస్టు' ప్రభువు వైస్రాయిగ వచ్చాడు. ఇతడు నాల్గవజార్జి చక్రవర్తి బడిలో చదువు కొన్న నాగరక పురుషుడు కాడు. ఇతడు యేదోకొంచెము నిజాయితీమనిషి. ఇతడు వైస్రాయిగ రాగానే మొట్టమొదటగ చేసినపని యేమంటే:— నైజాముకు డబ్బుయిచ్చి, "పామర్ కంపెనీ కివ్వవలసిన ఋణములన్నీ తీర్చుకో" అని చెప్పెను. అయితే ఒక్కషరతుమాత్రము విధించెను. ఇక మీాద యీా కంపెనీతో నైజాము యెట్టి వ్యవహార సంబంధము పెట్టుకోరాదని గట్టిగాచెప్పెను. నైజాము కాతా పోగానే, కొద్దిరోజులకే, ఆ కంపెనీవారు వ్యాపారము యెత్తివేసికొని లేచిపోయిరి! ఘూర్కాలను, మహారాష్ట్రులను జయించిన విజేత, మాయిరాప్రభువు, తిరిగి లండనునగర వీధులలో యధాప్రకారంగా చేతిలో దమ్మిడీలేక, అల్లాడుచు తిరుగుచుండెను. తైమూరులంగ్ వంశీకులదగు ఢిల్లీనగర సింహాసనమును పట్టుకొని, కొలదికాలము ఆనదమంత్రపు భోగమనుభవించిన యీా మానవుడు, తన చరమదశనెట్లో వెళ్లదీయుటకై, తేరగ పనియేమియులేక పింఛనువలెవచ్చు జీతముతోకూడిన మాల్టాగవర్నర్ పదవి దొరకినదే చాలుగదాయని సంతోషముతో నంగీకరించెను.



భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన

## 21 వ అధ్యాయము

### బెంటింకు ప్రభువు:—1824—1835



ఇండియాను పరిపాలించుటకై గవర్నర్ జనరల్‌గ సీమనుండి యెవరైతే వత్తురో, ఆ మనిషియొక్క నడతననుసరించియే యిండియాప్రజలు సీమ ప్రజలయెడ గణ్యతనుంతురు. ఇండియాను పరిపాలించుటకై సీమనుండి గవర్నర్ జనరల్‌గ వచ్చిన బెంటింకుప్రభువు యిక్కడ వెనుక మొగలాయి ఫాదుషాలెక్కిన సింహాసనమందు కూర్చుండియున్ననూ, ఆ ఫాదుషాలవలె తానును డాబు దర్పముల ప్రదర్శింపక, శుద్ధ అలౌకికచాంధస బ్రాహ్మణుని వలె ప్రవర్తించుచున్నాడు. అఖండ భారతసామ్రాజ్యమునకు సర్వాంసహాధి కారియయ్యు యీతడు సామాన్య మానవునివలె చంకను గొడుగుపెట్టుకొని వీధులవెంట నడచిపోవును ; వెంట పరివార మెవరులేక సాధారణ వస్త్ర ముల ధరించి గుఱ్ఱమెక్కి వెళ్లుచుండును. ఇదంతయుచూచి గవర్నర్ జనరల్ అగువానియొక్క యిట్టి అలౌకిక ప్రవర్తనవలన బ్రిటిష్‌సామ్రాజ్యపటిమ విచ్ఛిన్నమై పోవుచున్నదని భ్రమించువారు చాలమంది గలరు. అమెరికా స్వాతంత్ర్యమును సంపాదించిన వాషింగ్‌టన్ వలె యీ బెంటింక్ ప్రభువును

అనేక యుద్ధములలో పాల్గొనెను. ఇట్టి రక్తపాతములలో, కల్లోలములలో మునిగి తేలినవారికి సున్నితమును, సహజమునగు మానవస్వభావము సాధారణముగ నశించిపోయి, వారియందు రాక్షసత్వము ప్రవేశించును. కాని, యీ బెంటింకు ప్రభువును వాషింగ్టన్ వలెనే— తానెన్ని యుద్ధములలో తిరిగినను, తన మానవత్వమును మాత్రము గోల్పోవక, దానిని జాగ్రతగ కాపాడుకొన గలిగెను. కుటిల రాజతంత్రమను అగ్నిపరీక్షనుండి అకుటిల మనస్సుతో నిర్మలాంతఃకరణతో, ఋజుప్రవర్తనతో యీతడు బయటపడెను.

బర్మాదేశీయులు చేసిన కొన్ని దుడంగములకై వారిపై కసితీర్చుకొనుటకుగాను యింగ్లీషు వారు యుద్ధమునకు సిద్ధమైరి. ఈ యుద్ధము సరియగు సన్నాహములు లేకుండగనే తలపెట్టబడెను. అందుచే ఇది 1823 సం॥ మొదలు 1826 వరకు యీడికగ జరుగుచునే యుండెను. తుదకెట్లో 1826 సం॥ లో ఉభయులకు సంధి జరిగి యుద్ధము పరిసమాప్తమయ్యెను. ఈ సంధి షరతుల ననుసరించి "ఆవా" (బర్మా) రాజు కోటి రూపాయలను, పదకొండు సముద్రతీరపు పరగణాలను కుంపిణీవారి కిచ్చివేసెను. ఈ యుద్ధమువలన కుంపిణీవారికి విశేష ధననష్టము, ప్రాణనష్టము కూడ కలిగెను; ఇంత నష్టపడి సంపాదించిన దేశమైనను సారవంతమైనదికాదు. అందుచే, సీమ ప్రజలకీ యుద్ధమెంతమాత్రము గిట్టకుండెను. సీమ ప్రజలలో యెవరు కూడ దీని నామోదించలేదు. అయితే నేమి? యీ యుద్ధమునకు కారకుడైన అమహార్స్టు ప్రభువునకు మాత్ర మింకొక బిరుదమును తగిలించిరి. కుంపిణీవారి కేంద్ర ఋణము లక్షలకొలది పెరిగిపోయెను. బర్మాలో

ఐరావతీనదీ తటముల తమ ప్రాణముల నర్పించిన వీరుల భార్యలకు, బిడ్డలకు కుంఫిణీవారి ఆదాయమునుండి శాశ్వత మనువృత్తి యీయవలసి వచ్చెను.

"1826 సం॥ లో జరిగిన యీ బర్మా యుద్ధము న్యాయమైనదే" యని యెట్లో సమర్థింపబూనువారు కూడ, "ఆవారాజునుండి బలాత్కారముగ లాగికొని కలుపుకొన్న ప్రదేశము లప్పుడంత విలువయైనవిగ నుండలేదని" తప్పక ఒప్పుకొందురు. అదిగాక, యింకొక విశేష మేమనగ:—"మనం కలుపుకొన్న రాజ్యములోని ప్రజలు మనవలన తాము రక్షణపొందుతామని కలలోనైనా అనుకొనలేదు. పైగా మన మా దేశములో పాదం పెట్టగానే, అచ్చటి జనము యావత్తు నశింపై పోయినది. ఏండ్ల తరబడి ఆ ప్రదేశము లన్నియు నిర్మానుష్యములై, నిష్ఫలవంతములై, యెడారులై పోయెను. ఆ ప్రదేశములను సంపాదించుటకై మనము ఖర్చుపెట్టిన డబ్బులో ఒక్క చిల్లిగవ్వయైనను ప్రతిఫలము మనకు ముట్టలేదు. ఇదివరకు చేసిన యుద్ధముల ఖర్చుకును, క్రొత్తగ జయించిన యీ దేశములను ఫలవంతమొనర్చుటకై పెట్టిన పెట్టుబడికిని, కుంఫిణీవారు కోటి తొంభైలక్షల పౌనులు అప్పుచేసిరి. ఈ మొత్తములో కొంత చిల్లర ఋణముల తీర్చుటకై వినియోగించిరి. సాలీనా ఖర్చులు శాశ్వతముగ పదిలక్షల పౌనులు హెచ్చయ్యెను. ఉపరి, యిరువదియైదు లక్షలపౌనులు యింగ్లాండులో "రాష్ట్రఖర్చుల నిమిత్తమని" పేరుపెట్టి చెల్లించిరి.

ఈమధ్యలో, బర్మాయుద్ధమునకై సేనలనన్నిటిని తీసికొని వెళ్ళుటచే మధ్య యిండియాలో కుంపిణీవారి సైన్యబలములు చాల నీరసస్థితియందుండెను. అందుచే, ఆంగ్లసామ్రాజ్య ప్రభుత్వమువారు తమ అంగబలము నంతటిని యీ యుద్ధమునకే వినియోగించినారనే వదంతి పూర్తిగ దేశమందంతటను ప్రాకిపోయినది. అనేకచోట్ల అల్లరులు బయలుదేరెను. ఎట్లయిననేమి బహుకష్టముతో వీని నణచివేసిరి. "కాని, దేశీయరాజులకును, ప్రజలకునుకూడ కుంపిణీవారియందు పూర్తిగ అసంతృప్తి పెరిగిపోయెను. పాలకపాలితులమధ్య యెంతమాత్రము సానుభూతి లేకుండెను. ఈ ప్రభుత్వమెప్పుడు కూలిపోవునా? ఈ పతనమును మనమెప్పుడు కన్నులు చల్లగా చూతుమాయని ప్రజలెంతో యాతురతను జూపుచుండిరి.

ఇట్టి స్థితిగతులలో యిండియాకు గవర్నర్ జనరల్‌ను నియమింపవలసివచ్చెను. ఇది అప్పుడు సీమలో ప్రధానమంత్రిగనున్న కానింగ్ ప్రభువు చేతిలోనిపనిగ నుండెను. ఈ కానింగ్ ప్రభువుకు వెల్లస్లీ ప్రభువుతో చాలస్నేహము. పైగా యీ కానింగ్ ప్రభువు కంట్రోలుబోర్డుకు అధ్యక్షుడుగ నున్నప్పుడు, యిండియాలో మహారాష్ట్రులను నేపాళదేశస్థులను జయించివచ్చిన హేస్టింగ్సునున్ను ఆతనిసైన్యమునున్ను పార్లమెంటు మహాసభయెదుట యెంతో ఘనముగ పొగడియుండెను. ఈ సందర్భములను బట్టి, కానింగ్ ప్రభువుకు కూడ పరరాజ్యాక్రమణతృష్ణగలదని యనుకొనుటకు కారణముగలిగినది. కాని, యిది శుద్ధ తప్పుఅభిప్రాయమని ఆయన 1827 సం॥లో చేసిన గవర్నర్ జనరల్ నియామకమునుబట్టి

తేటతెల్లమైనది. అప్పుడుతనకు పార్లమెంటులో గల కష్టపరి స్థితులనుబట్టి తన యెదిరికక్షివారి నెట్లయిన సంతృప్తిపరచి తనకష్టముల బాపుకొనుటకై తనచేతిలోనున్న యీ గొప్ప యుద్యోగమును వారిలో యెవరికైనా యిస్తే బాగుండునని అతడనుకొనుట కప్పుడనేక అవకాశములుండెను. కాని, ఆతడిట్టి యూహాలలో పడలేదు. ఇట్టిపద్ధతి ఆతనికి నచ్చలేదు. భారతవర్షమందు శాంతి భద్రితల నెట్లయిన నెలకొల్పుటయే ఆతడు ప్రధానకార్యముగ పెట్టుకొనెను. అంతేగానితనయెదిరిపార్టీ వారిగోల నెట్లయిన నణచి తానుభద్రిముగ తనయుద్యోగమందుండుటయే తన ప్రిధానాశయముగ ఆతడు పెట్టుకొనలేదు. అందుచే పరరాజ్యాక్రిమణయందు విముఖత్వముగల వాని నొకని (విలియం బెంటింక్ ప్రిభువును) యిండియాగవర్నర్ జనరల్ పదవికి నియోగించెను. విలియం బెంటింకుకు పర రాజ్యాక్రిమణయందెంతమాత్రిము యిష్టము లేదని కానింగ్ ప్రిభువుకు పూర్తిగ తెలియును. బెంటింక్ యిదివరలో యిండియాలో పనిచేసెను. ఈతడు వెల్లూరులో నున్నప్పుడు సిపాయిలు తిరుగుబాటుచేసిరి. మతావేశముచే వారిట్టి తిరుగుబాటుచేసిరని గ్రిహించి బెంటింక్ వారిని దండించక వదలివేసెను. ఇందువల్ల, పై యుద్యోగస్తుల కీతనిమీద కోపము వచ్చెను; అంతట బెంటింక్ యీ యుద్యోగమును వదలుకొని సీమకు వెళ్లిపోవలసివచ్చెను. తిరిగి యిట్టివాని కిప్పుడు కానింగ్ ప్రిభువు గవర్నర్ జనరల్ ఉద్యోగమిచ్చినాడంటే "వారికి వారికిగల చుట్టరికముచేతను, యితర అభిమానములచేతను యిచ్చినాడని" సీమలో అప్పుడుచాలమంది అనుకొనిరి. నిజ

ముగ యితడు తనకు చుట్టమనే అభిమానముచేతనే కానింగ్ ప్రభువీతని కీఉద్యోగమిచ్చియుంటే, అది కేవలము కానింగ్ ప్రభువుయొక్క స్వార్థబుద్ధిని, స్వలాభాపేక్షను, సూచించును. కాని, యీ యుద్యోగనియామకమందు కానింగ్ ప్రభువుకు యెంతమాత్రము స్వలాభాపేక్షలేదని చెప్పుట కొక్కటే ప్రబలనిదర్శనము కలదు. కొంచెములోతుగ ఆలోచించిన యెడల సర్వము తేటతెల్లముకాగలదు. ఈతనికీ యుద్యోగమివ్వక పోవుటవల్ల, తనకువచ్చే గొప్ప ఉపద్రవమేమియులేదు; ఇచ్చినందువల్లవచ్చే మహా లాభమేమియులేదు;—ఈతనికీ ఉద్యోగమిచ్చినందువల్ల కానింగ్‌కు పార్లమెంటులో తుదకొక్క వోటైనను యెక్కువరాదుగద. కానింగ్ ప్రభువు నిజముగ తన లాభమునే చూచుకొనేవాడే అయితే,— యిచ్చినందువల్ల మహాలాభమునుగాని, యివ్వనందువల్ల మహానష్టమునుగాని, పొందజాలని యీ యుద్యోగమును బెంటింక్ వంటివాని కేల యిచ్చును ? కావున కానింగ్ ప్రభువు నిజముగ తనలాభమునే చూచుకొనియుండియున్నట్లయిన, యీ యుద్యోగమును బెంటింక్‌కు యిచ్చుట కెంతయో జంకెడివాడన్నమాట. కాబట్టి కానింగ్ ప్రభువు బెంటింక్‌న కీయుద్యోగమును స్వలాభాపేక్ష చేతకాక, కేవలము హిందూదేశ భద్రతకొరకే యిచ్చెనని స్పష్టపడుచున్నది.

ఈ రీతిగ నియమింపబడిన బెంటింక్ ప్రభువు యిండియాకు బయలుదేరకమునుపే, సీమ మంత్రివర్గమందు మార్పు గలిగెను. వెనుకటివారుపోయి, కొత్త మంత్రులు వచ్చిరి. తన యుద్యోగ మీ కొత్త మంత్రుల కిష్టమగునో కాదోయను

ఊహతో "మీకిష్టము లేకపోతే, నేనీ యుద్యోగమును వదలుకొందు" నని బెంటింక్ కొత్త మంత్రులకు చెప్పెను. కాని, కొత్త ప్రధానమంత్రియగు వెల్లింగ్టన్‌కు మన బెంటింక్ సంగతి బాగుగ తెలియును. ఈతని విలువను ఆతడు పూర్తిగ గుర్తించెను. రాచకీయముగ యిరువురకు చాల భేదాభిప్రాయము లున్నప్పటికిని, "నీయందు నాకు నమ్మకముగలదని" చెప్పి, కొత్తమంత్రి (వెల్లింగ్టన్) మన బెంటింక్‌నకు యీ యిండియా గవర్నర్ జనరల్ ఉద్యోగమును ఖాయపరచెను. నిజానికి, వెల్లింగ్టన్‌కు యెప్పుడూకూడ అంత తీవ్రమైన పరరాజ్యతృష్ణ లేదు. ఉంటే కొద్దిగా—మితముగ—వుండవచ్చునుగాని, అంత అమితదాహముమాత్ర మాతనికి లేదు. ఇండియాలో కుంపిణీవా రవలంబించుచు వచ్చిన పద్ధతుల కీతడు మొట్టమొదటినుండికూడ అభ్యంతరములు చెప్పుచునేయుండెను. వియన్నా పట్టణమందును, ప్యారిస్ పట్టణమందును జరిగిన యూరోపియన్ రాజుల మహాసభలో కూడా—యీతనినోటివెంట యేమి మాటలు వచ్చునోయని మహాయాతురముతో యీతని ముఖవిలాసమును వీక్షించుచు నెదురుచూచుచున్న రాజులకందరకు సిగ్గు వచ్చునట్లు "యుద్ధము లెంతమాత్రము పనికిరావు; వానివలన మహానర్థములు వాటిల్లు"నని చెప్పి యీ వెల్లింగ్టనే నిర్మొగమోటముగ, దేశాభిమానపూరితమగు నిగ్రహబుద్ధితో పలికియుండెను. ఇండియాలో కూడ పరరాజ్యాక్రమణ యందతనికంత యిష్టము లేకుండెనని ముందు మనము చూడగలము. విలియం బెంటింక్ యిదివరలో సీమలో రెండు మూడుసార్లు

మంత్రిపదవి నధిష్ఠించియుండిన పోర్టులండు డ్యూక్ యొక్క రెండవ కుమారుడు. బెంటింక్ ప్రభువు యుద్ధవీరుడు. ఈతడు యిటలీ, సువరోవ్ యుద్ధములందు పాల్గొనెను. స్పెయిన్ దేశమందు తాను ప్రత్యేకమొక సిపాయిదళమునకు నాయకత్వము వహించెను. తరువాత మద్రాసు గవర్నరుగనుండి సైన్యాధిపతులతో విభేదము గలుగగా యింగ్లాండునకు పిలిపింపబడెను. తిరిగి స్పెయిన్, సిసిలీలలో సైన్యాధిపత్యము వహించి అచ్చటి వారి మన్ననలకు, ప్రేమకు పాత్రుడయ్యెను. ఇప్పుడీతడు యిండియాకు గవర్నర్ జనరల్‌గ చాలమంచి యుద్దేశములతో బయలుదేరెను. ఆతని యుద్దేశములు సఫలమగుటకు మంచి అవకాశములుకూడ ఆతనికి లభించెను. ఇంతకుముందు అధికారము వహించిన వారికిట్టి సదుపాయములు తక్కువగ నుండెను. కాని, యిప్పుడీతని కాలములో స్థితిగతులు చాల అనుకూలముగ నున్నవి. దేశములో శాంతి ప్రబలెను. హిందువులు అణగద్రొక్కబడి ఉత్సాహము లేకుండనుండిరి. మహమ్మదీయులు తమ "నశీబు" నకు విధేయులై పోయిరి; సరిహద్దు ప్రాంతములలో విరోధులనువారెవరు లేకుండిరి. సిక్కులు, ఆఫ్ఘనులు తప్పితే బలవంతులని చెప్పదగిన జాతియే యిండియాలో లేకుండెను. కాని, యీ రాజ్యాధిపతులుకూడ తమ మామూలుపద్ధతికి భిన్నము లేకుండ శాంతముగనే యుండిరి. ఈ పరిస్థితులవలన మన గవర్నర్ జనరల్‌కు దేశములో రాజ్యాంగపద్ధతిని సంస్కరించి, శాంతిపరిస్థితులను పూర్ణముగ నెలకొల్పుటకు విశేషమైన సావకాశము లభించెను. ఇతని పరిపాలననుగురించి యీతని

వద్ద చాలకాలము పనిచేసిన ఒకానొకయుద్యోగి యితనిని గూర్చి యిట్లు చెప్పుచున్నాడు:- "గవర్నర్ జనరల్ పదవి నధిష్టించిన వారిలోకెల్ల బెంటింక్ ప్రభువు ఉత్తమోత్తముడని చెప్పుటకెట్టి సందేహమును లేదు. ఆపదవిలో చాలమంది మంచివారును గొప్పవారునుకూడ నుండి యుండిరి. కాని, యీయనకుసాటి యెవ్వరును లేరని చెప్పవచ్చును. హిందూదేశవాసులయెడ తన పరమధర్మమును నెరవేర్చి వారికి మేలుచేయవలెనను ఉద్దేశ్యము ఆతని మాటలయందును, చేతలయందును కూడ ప్రకటితమయ్యెను." ఇదిచాల గొప్ప పొగడ్త. కాని, యిట్టిగొప్ప పొగడ్తకీతడు తగినవాడని చెప్పక తప్పదు.

బెంటింక్ తన పరిపాలనలో మొట్టమొదటగ ఆలోచించిన విషయము "సతి" లేక "సహగమనము" అను క్రూరపుటాచారమును రూపుమాపుట. ఇదివరలో యీ యాచారమును మాన్పించవలెనని కారన్‌వాలీస్, వెల్లస్లీ మున్నగువారు ప్రయత్నించియుండిరి. కాని, దీనివలన ప్రజలలో అనవసర ఆందోళన బయలుదేరునేమోయని భయపడి వారా ప్రయత్నములను పూర్తిగ కొనసాగింపక మానుకొనిరి. కాని, బెంటింక్ ప్రభువన్ననో ముందుగా నీ విషయమై చాలజాగ్రత్తగ విచారణ సలిపెను. దేశీయులయొక్కయు, పాశ్చాత్యులయొక్కయు అభిప్రాయముల కనుగొనెను. ఈ మూఢాచారమును తొలగించుటకు జేయు ప్రయత్నఫలితమునుగూర్చి పలువురు పలువిధములుగా అభిప్రాయముల వెలిబుచ్చిరి. చివరకు తనకౌన్సిలు సమ్మతితో

"వితంతువులను వారి సమ్మతినిగాని, బలవంతపరచిగాని చితిపై హత్యగావించుట నేరమగున" ని ప్రకటించెను. ఇట్టి ఆత్మహత్యకు తోడ్పడినవారిని కోర్టుల కీడ్పించవలెనని పోలీసు డిపార్టుమెంటున కనుమతినొసంగెను. బంగాళమునం దీ క్రూర కర్మము ప్రబలముగానుండెను. కొంతకాలమువరకు మాత్రము అచ్చటి ప్రజలు సణగుచుండిరి. ఈ చట్టమును తప్పించుకొన వలెనని గూడ ప్రయత్నములు జరిగినవి. కాని దీని నెదిరించు టకు మాత్రి మెవ్వరును సాహసించలేదు. ఇతర రాష్ట్రము లలో నొక్కచోట మాత్రము పోలీసుల లెక్కచేయకుండ "సతి" కావింపబడెను. మధ్యరాష్ట్రమునందును, ఉత్తరము నందును యీ దురాచారమంతగా ప్రబలియుండలేదు. ఆ కార ణమున యీ చట్ట మెంతమాత్రము అలజడికలిగించలేదు. దేశములోని యితరరాజులుకూడ యీ పద్ధతినే అవలంబించి తమతమ రాజ్యములలో యిట్టి అమానుషకృత్యము జరుగకుండ ఫర్మానాలను జారీచేయించిరి. విదేశప్రభుత్వము వారు కలుగ జేసికొని యిట్టి దురాచారమును రూపుమాపుటచేత ప్రజల యందు కొంతవరకు విశ్వాసము కుదిరెను. వారియం దెట్టి అనుమానమునుగాని లేకుండెను. వైస్రాయిచేసిన యీ గొప్పమార్పునకు అతని ప్రతికక్షులుకూడ నతని నభినందిం చిరి. దీనికి సంబంధించినదే మరియొక చట్టమును 1832 సంవ త్సరములో గవర్నరుజనరలు ప్రకటించెను. మనుస్మృతి నను సరించి హిందువులు తమ ధర్మమును వదలి యితరమతములలో కలిసినప్పుడు వారి యావదాస్తిలోను వారి కొక్క చిల్లిగవ్వ యైనను దక్కుటకు వీలులేకుండెను. దీనిని రద్దుపరచి అన్య

మతస్వీకారులగు వారికికూడ తమ ఆస్తియందు హక్కును యీ చట్టము కలుగజేసెను.

ఎంతోకాలము దుష్పరిపాలనకు లోబడిన సంఘము లందు మార్పులు కలుగజేయుట యనునది చాలకష్టము. అట్టిపరిపాలన కలవాటుపడినవారు మంచిపరిస్థితులను కలుగ జేయబోవునప్పుడు వాటిని హానికరముగా తలంచుట నిజము. ఈ సందర్భము లట్టి ప్రయత్నములు జేసినవారికి గాని బోధ పడవు. అయినప్పటికి, విలియంప్రభువు సదుద్దేశ్యము లకు కొంతవరకు ఫలితము కలుగకపోలేదు. యితర విషయములెట్లున్నను, దుబారాఖర్చులు, అధికారదుర్న యములు మొదలైన వానియందు ప్రజలలో ఏవగింపు కలిగెను. రాజ్యాక్రమణావసరము లేకుండగను, యితరులపై దండెత్తనక్కర లేకుండగను చక్రవర్తి యధికారమున కెట్టి న్యూనతగాని కలుగకుండ కాపాడవచ్చునని మన బెంటింకు ప్రభువుయొక్క ఋజుమార్గప్రవర్తన తేటపరచెను. సామా న్యముగా నధికారవర్గమునందు లంచగొండితనము, అనవసర దుబారాతనము హెచ్చుగానుండెను. దీనిని నాశనము చేయుటకు ప్రయత్నము జరిగినప్పుడు కుంపిణీ ఉద్యోగులు కోపగించు కొనిరి. కాని యీతడు వీరిని లక్ష్యపెట్టక దుర్వ్యయముల తగ్గించి ప్రభుత్వపు ఆదాయవ్యయముల సరిపెట్టవచ్చునని రుజువుపరచెను. సామ్రాజ్యపు భద్రత కెట్టిభంగము లేకుండగను, పాశ్చాత్యులకు హానిలేకుండగను దేశీయులకు కూడ చాల ముఖ్యవిషయములందు న్యాయము కలుగజేయ వచ్చునని అతని మంచితనము తేటపరచెను. మతముపై

దండెత్త నవసరము లేకుండగ, ద్వేషభావములు తలయెత్తకుం డగ, హిందూమతమునందలి దురాచారములు రూపుమాపి, క్రైస్తవమతసంజనితములగు సదాచారముల నెమ్మదిగ నెల కొల్పవచ్చునని ఆతడు నిరూపించెను. పైకి ఆర్భాటము లేకుండ, డాంబికదర్పముల నిరసించి, ప్రజాభిప్రాయముల నణగద్రొక్కుటద్వారా తన చర్యల సమర్థించుకొనుట నీచ కార్యమని గ్రహించు నుద్యోగి ప్రజల గౌరవమునకు, ప్రేమకు పాత్రుడుకాగలడని బెంటింక్ ప్రభువు నిరూపింప గలిగెను.

మైసూరురాజ్యమందు ద్రవ్యసంబంధమగు చిక్కులు హెచ్చుగనుండెను. ధనముకొరకు ప్రజలు పీడింపబడు చుండిరి. అందుచే 1831 సం॥ లో తిరుగుబాటు జరిగెను. రాజుకును, ప్రజలకును మధ్య రాజీకుదర్చవలెనను సదుద్దేశ ముతో మదరాసు కుంపిణీవా రీ వ్యవహారమందు జోక్యము కలిగించుకొనిరి. కాని, రాజీ కుదురలేదు. ఎట్లయినను ప్రజలకు రాష్ట్రమునందు భద్రతను కలుగజేసి వారివ్యాపా రాభివృద్ధికి తోడ్పడవలెనని కుంపిణీవారు తలపెట్టిరి. మైసూరు రాజునకు దిట్టతనముగాని, పట్టుదలగాని లేకుండెను. చెప్పుడు మాటలనువిని రాజ్యవ్యవహారములు పాడుచేయు చుండెను. అతనికి కుమారులు లేరు. ప్రజలలో యీతని యందు దపనమ్మకము అసహ్యతకలిగెను. అందుచేత అతనిని నెమ్మదిగా రాజ్యము వదలుకొనునట్లుచేసిరి. పరిపాలనకు కమిషను ఏర్పాటుచేసి ఆంగ్లరాయబారిని రాష్ట్రాధ్యక్షునిగా జేసిరి. రాష్ట్రాదాయమునం దైదవవంతు రాజునకగు వ్యయ

మునకు ప్రత్యేకించిరి. ఇందునుబట్టి మైసూరు ప్రభుత్వపు రాజ్యార్హత కెట్టి భంగమును కలుగలేదు. ఆర్థిక, న్యాయ, సైన్యాధికారములన్నియు రాష్ట్రప్రజల చేతులయందే ఉండెను.

గవర్నరుజనరలు ఒక్కసారిమాత్రమే హిందూ రాజుల పరిపాలనయందు జోక్యము కలుగజేసికొనవలసివచ్చెను. "కూర్గు" (కొడగు) రాజ్యమునేలిన రాజులలో వీరరాజేంద్రుడు చివరవాడు. ఈ రాజులు హైదరాలీచే నణగద్రొక్కబడి, కూర్గురాజ్యము మైసూరునందు కలుపుకొనబడెను. తిరిగి యింగ్లీషువారి సహాయమున కూర్గు విడదీయబడి రాజున కిచ్చివేయబడెను. వీరరాజేంద్రుడు పరమదుర్మార్గుడని విషయాసక్తుడని పేరొందెను. అతనికి పిచ్చికూడ కలదట. రాజేంద్రుడనేక దుర్ణయములు చేయుచున్నప్పటికి గవర్నరు జనరలు చాలఓపికపట్టెను. అనేకవిధముల నయమున బోధించిచెప్పెను. అంతయు బూడిదపోసిన పన్నీరయ్యెను. తుదకు వీరరాజేంద్రుడు తిరుగబడుటకు సిద్ధమయ్యెను. పదిరోజులలో యీ తిరుగుబాటు అణచివేయబడెను. సులభముగా కోటస్వాధీనమయ్యెను. రాజు బందీకృతుడై కాశీపట్టణమునందు ఖైదీగా ఉంచబడెను. కాని, రాజకుటుంబమునందు మగవారెవ్వరు రాజ్యార్హులు లేకుండిరి. స్త్రీ వారసుల హక్కులను బ్రిటిషు ప్రభువెందులకు గమనించలేదో కారణము తెలియదు. రాజ్యము బ్రిటిషువారి ఆక్రమణక్రిందకు తీసికొనిరాబడెను. తరువాత రాజ్యమునందు మామూలునెమ్మది నెలకొల్పబడెను. ప్రజలు మందులై ఉత్సాహములేక యంత్రములవలె కాలమును పుచ్చుచుండిరి. సైన్యాధికారి నొకని "కలక్టరు-జడ్జి"

గా నియమించిరి. అతడు తెలివైనవాడు, మంచిఉద్దేశ్యములు గలవాడైనప్పటికి ప్రజలతో వ్యవహార విషయములందు తప్ప యితర సంబంధము లేక ఒంటరిగా నుండుచువచ్చెను. దేశీయు డొక్కడు మాత్రము న్యాయాధికారిగా నుండెను. సామాన్య విషయములందు తప్ప విశేష వ్యవహారములందతడు జోక్య ము పుచ్చుకొనకుండెను. ఇంగ్లీషువారు కాఫీతోటలవలన డబ్బుచేసికొనుచుండిరి. తమ తగాదాల "కలక్టరు—జడ్జి" తీర్మానము తృప్తికరముగాలేదని తోచినప్పుడు చెన్న పట్టణము సుప్రీము కౌన్సిలుకు అప్పీలు చేయుచుండిరి. కూర్గు నివాసులకు మాత్రము తమకు అన్యాయము జరిగి నప్పుడు 600 మైళ్ళు పోయి న్యాయము సంపాదించుకొనుటకు శక్తిగాని, కాలముగాని, నమ్మకముగాని లేకుండెను. వారి గతులను కనిపెట్టువారు కూడ లేకుండిరి.

ప్రభుత్వము చాల అప్పులలోనున్నట్లు బెన్టింక్ ప్రభువు కనిపెట్టెను. అధికవ్యయమును సరిపెట్టుటకు తరుచు అప్పు జేయబడుచుండెను. కాని బెన్టింక్ ధైర్యముగా ఖర్చులను తగ్గించుటకు మొదలుపెట్టెను. జీతములు, అల్లవెన్సులు, బహుమానములు అన్నిటిలోను కోతలుపెట్టెను. కాని మామూలుగా ఖర్చునకు అప్పులకు అలవాటు పడియుండుటచే యీ తెగ్గోతలంతగా ఉద్యోగులకు నచ్చలేదు. సైన్య, న్యాయ శాఖలందుండు ఉద్యోగులు యీతడు ఖర్చు తగ్గించు టకుప్రయత్నించుచున్నాడని బెంటింక్‌ను యెప్పుడూ నిందించు చుండిరి. పన్నులు ఎక్కువచేసి యింకను అప్పు చేయవలెనని వారికోరిక. బెన్టింకుప్రభువు యీ రెంటిలో ఒక్కదానికి

కూడ యిష్టపడలేదు. బంగాళమునందున్న ఉద్యోగుల జీతములు చాల హెచ్చుగానున్నవని ఆతడు తలంచెను. ఈ ఉద్యోగులు సాలీనా 97 లక్షల రూపాయిలు సంపాదించుచుండిరి. ఈమొత్తమును 91 లక్షలకు తగ్గించి 416 మందికి పంచిపెట్టెను. హెచ్చుజీతము లనుభవించువారి అల్లవెన్నెలను, సోమరిపోతుల వృథావ్యయములను తగ్గించగా యింకను సగటున ఒక్కొక ఉద్యోగికి 25,000 రూపాయల ఆదాయముండెను. యిందుకై యీతడు పొందిన శాపనార్థములకు మితిలేకుండెను. దీనినిగురించి ఒకచిన్న కథకూడా చెప్పెదరు. సర్క్యూటుచేసే న్యాయాధికారి ఒకడుండెడివాడట. ఆతడు మహా డాంబికుడు; కూడా లెక్కలేని నౌకరులను తీసికొని పోవుచుండెడివాడు. ఆతడు పల్లకీదిగగానే నడచుటకు రత్నకంబళ్లు పరవవలసివచ్చెడిది. ఒక రాయనను "నీవు బెంటింక్ దొరసానికి బంధువువుకావా" అని అడిగిరి. అందులకాతడు "కాదండీ దురదృష్టవశాత్తు ఆపశువుకే (అనగ, బెంటింక్ కే) బంధువుడనని" చెప్పెను. బెన్టింక్ ప్రభువునెడ ప్రతివానికి అంత ద్వేషముండెడిది. అయితే దీనికేమియు వైస్రాయిలెక్కచేయలేదు. ఆమాదిరిగాఖర్చుతగ్గించుకురాగా ప్రభుత్వపుదుబారాతగ్గుటయేగాక, ప్రభుత్వవిధానమునందు అసమర్థత, ఆలస్యము సోమరితనము పూర్తిగా నశింపుజేసెను. ప్రజలకు న్యాయముకలుగజేయవలెనను తలంపుతోనే ఆతడు బయలుదేరెను. ఒకరిచేతులలో బొమ్మగా ఉండుటకుగాని, ఒక కులమువారి లాభమునకు పరిపాలించుటకుగాని ఆతడిష్టపడనట్లు చూపించెను. పైగా తనకు సలహాల నిచ్చుటకు తన తప్పుల నిరూపించి దిద్దుబాటు

చేయుటకు, అన్ని జాతులవారికి అన్ని తరగతుల ఉద్యోగులకు విలుగలదని నిరూపించెను. తన వాగ్దానములను పూర్తిగా చెల్లించెను. ఏడాదిలో కొన్ని నెలలు తన విస్తార రాజ్యములోని కొన్ని జిల్లాలలో గడుపుచుండెడివాడు అందుచే మామూలుగా తెలిసికొనుటకు సాధ్యముగాని ప్రజల సాంఘికపరిస్థితుల నతడు సులభముగా తెలిసికొనగలిగెను. ఇదిగాక స్థానిక వ్యవహారములగురించియు, వ్యక్తులను గూర్చియు, మామూలుగా కలకత్తాకు పంపబడు రిపోర్టులేక గాక, తనకు ప్రత్యేకముగా రహస్యపు రిపోర్టులను పంపుటకు తన తాజేదార్లకు ఆజ్ఞాపించెను. దీనివలన అధికారులు సాధారణముగా తెలియజేయు విషయముల కెంత విలువనీయవలెనో గవర్నరు జనరల్ నిర్ణయింప గలిగెను. పైకిరావలెనని ప్రయత్నించుచున్నవారి యోగ్యతా యోగ్యతలను కూడ నీతడు తెలిసికొనెను. తాను మామూలుగా చేయు పనులకు యివి మరింత కష్టమును కలుగజేసెను. అదేగాక, దీనివలన ఉద్యోగులలో ద్వేషభావము కూడ వృద్ధినొందెను. యీ విధముగా యిదివరకెన్నడు నిర్బంధములకు లోబడియుండని కారణమున, సోమరులు అసమర్థులును నగు ఉద్యోగులకు వైస్రాయి చర్యలు కంటకములుగా నుండెను. "మాపై గూఢచారులను నియమించి మా చర్యలను కనుపెట్టుచున్నార" ని చాలకాలమునుండి పనిచేయుచున్న విశ్వాసపాత్రులగు నౌకరులు గూడ మొరబెట్టుకొనుచుండిరి. కాని బెంటింక్ అవలంబించిన పద్ధతియందు నీచమగు యీ పోలీసు విధానమొంత మాత్రము లేకుండెను. దురహంకారులగు అధికారులు బల

హీనులయెడ చేయు దుర్న్యయములకు వారిని పెట్టు బాధలకు కొంత రక్షణ కలుగవలెనన్న, బాధల నొందు వారినుండి వివరములు తెలుసుకొనుట కంటె వేరుమార్గము లేదని పరిపాలకులు నిర్ణయించిరి. స్వపరిపాలన ననుభవించు దేశములలో తమ కష్ట సుఖములను ప్రజలు యథేచ్ఛగా తెలుపుకొనుటకు వీలున్నది. పాలక పాలితుల మధ్య సుహృద్భావము లేక, ఏకజాతివారు గాక, ఒక్క ఆశయము గలవారుగాక నిరంకుశముగా ప్రభుత్వము నడచు హిందూదేశమువంటి రాజ్యములలో తమ కష్టసుఖములను యిబ్బందులను ప్రధానాధికారులకు తెలుపుకొను సావకాశము కలిగించుట నిశ్చయముగా ఉదారభావజనితమనుటకు సందేహము లేదు.

ఈ సమయమందే పత్రికా స్వాతంత్ర్యముకూడ కలుగ జేయవలెనని తలపెట్టిరి. ప్రాతఉద్యోగస్తు లెవ్వరును యిందుల కిష్టపడలేదు. బెన్టింకు ప్రభువునకుకూడ పత్రికా స్వాతంత్ర్య ఫలితమును గూర్చి అనుమానము కలుగలేదు. తప్పక దేశములో గొప్ప ప్రబోధము గలిగి తమ బ్రిటిష్ రాజ్యాధికారమునకు కూడ అపాయము గలుగవచ్చునని ఆతడెరుగును. మెట్కాఫు మాత్రమట్లు తలంపలేదు. మొత్తముమీద యిట్టి సంస్కరణ ప్రవేశపెట్టుటకు సమయము వచ్చినదని అందరును సమ్మతించిరి. "ప్రజలలో ప్రబోధము కలుగుటవలన సామ్రాజ్యమునకు అపాయము కలుగగలదని భయపడవలసి వచ్చిన యెడల, అట్టి ఫలితమునకు మనము తప్పక సంతోషించ వలసినదే. అట్టి స్థితిని తప్పించుటకు మనము ప్రయత్నించుట కూడనిపని. అట్టి ప్రయత్నము చేసినను

అది ఎంతమాత్రము కొనసాగదని నమ్మవలెను " అని మెట్కాఫు చెప్పెను. పత్రికా నిర్బంధమును తొలగించు అవకాశమును, ఆ కీర్తిని తన తరువాతవచ్చు వైస్రాయికి విలియం ప్రభువు వదలివేసెను.

1830 సం॥ లో మెట్కాఫుప్రభు విట్లు చెప్పెను. " మన విపరీత ఖర్చులకు తగినట్లుగా, ప్రజాసౌఖ్యముకూడ వృద్ధిపొందినదా యని నన్నడిగినయెడల, నా నమ్మకమును బట్టి లేదనియే చెప్పవలసి వచ్చుచున్నది. మనది విజాతీయ ప్రభుత్వము. మనయందు దేశీయులకు విద్వేషము సహజముగనే కలుగుచున్నది. మనము దౌర్జన్యమువల్లనే దేశమును ఏలకలుగుచున్నాము. ఈ దౌర్జన్యము వల్లనే దీనిని కొనసాగించ వలెను." ఇట్టి దారుణ సిద్ధాంతముయొక్క నిజస్థితిని, అవసరమును విలియంబెన్టింకు ప్రభువు గుర్తించలేక పోయెను. ప్రపంచములో తాను ఒక గొప్పజెయిలుఅధికారిగా తలపబడుట ఆతనికి నిజముగనే విచారమును కలిగించెను. తాను, తనసీమదేశముకూడ, భారతప్రజలచే నిజముగ ప్రేమింపబడి, గౌరవింపబడుటకే అతడు కోరుకొనుచుండెను. అందుకొరకే ఆతడు ప్రయత్నించుచుండెను. ఇతడు తన పరిపాలనయందు ముఖ్యమై, గమనింపదగిన సంస్కరణలను ప్రవేశపెట్టెను. సివిలు ఉద్యోగములందు దేశీయులకు ప్రవేశము గలిగించెను. లార్డుకారన్వాలీసు అధికారమునందుండగ యిట్టి ఉద్యోగములు దేశీయులకు లభింపకుండ కట్టుబాటు చేసెను. వారి సపర్యలకు ప్రతిఫలముగ వారిట్టి ఆశను పొందుటకు గూడ సందులేకుండ జేసెను. ఆతని తరువాతకూడ

దేశీయులకు ఉద్యోగముల నీయకూడదను సిద్ధాంతమే అనుస రింప బడెను. ఈ నిర్బంధమును తొలగించుటకు బెన్టింకు ప్రభువును ఆతని కౌన్సిలు సభ్యులును నిశ్చయించిరి. వారి అనుభవమువలన నైపద్ధతి ఎంతహానికరమో తెలిసికొనిరి. యిది శుద్ధ అన్యాయమని వారికి రుజువుపడెను. అందుచే వీరు ఒకరితరువాత ఒకరిని నమ్మకమైన పనులలో ప్రవేశ పెట్టుచువచ్చిరి. యింతమాత్రముచేతనే దేశీయుల మనస్సు లలో పాదుకొనియున్న ద్వేషభావములు తొలగిపోవునని గవ ర్నరు జనరలు అభిప్రాయపడియుండలేదు. నమ్మకము ఉంచు టచేత యిదివరకు వ్యక్తుల మనస్సులలో నున్న రాజద్వేష భావములు తొలగిపోవునని కూడ ఆతడనుకొనలేదు. దేశీ యులయందు అపనమ్మకము తొలగించుటకు గట్టి ప్రయత్న ములు చేసినమీదటకూడ ద్రోహులు కృతఘ్నులు ఉండగల రనియే ఆతడు తలంచెను. అందులకని తాను చేయవలసిన ధర్మమును నెరవేర్చకుండ నుండలేదు. ఎప్పటికైనను చివరకు మంచికలుగునని ఆతడు నమ్మెను. పాలితులయెడ పాలకులు నిర్వర్తించవలసిన ధర్మమును గుర్తించి, దుష్ఫలితములు కలుగునను భయములేకుండ ప్రవర్తించెను. దేశీయులసామ ర్థ్యమును, విజ్ఞానమును తమదేశముకొరకు వినియోగపడు నట్లు చేయుటవలననే, హిందూదేశమునందు తమపలుకుబడిని వృద్ధిచేసుకొనుటకు సరియైన మార్గమేర్పడునని బెన్టింకు ప్రభువు కనిపెట్టెను.

ఆతడు పరిపాలించిన ఏడుసంవత్సరములలోను తాను నిర్మూలింపదలచుకొన్న దుర్మార్గములను పోద్రోలుట కాత

నికి శక్తి చాలలేదు. కేంద్రప్రభుత్వమునకు ప్రజలలో బలుకు బడి లేకుండుటకు అసమానమైన హెచ్చుపన్నులే కారణ మని తెలిసికొనెను. కాని దీనిని సరిచేయుట కాతనికి మార్గము కనుపించలేదు. దేశీయసైన్యము నమ్మతగినదిగాదని అభిప్రాయపడి "యింత పనికిమాలినదియు వ్యయకారియు నగు సైన్యము ప్రపంచమున మరిచూడబోము" అని వ్రాసి పోయెను. శాంతిమార్గముల పరిపాలనచేయుటవలన ప్రజా హృదయములయందు మార్పుగలిగి తమ ప్రభుత్వమునందు భయద్వేషములకు బదులు ప్రజలకు నమ్మకముకలుగునని ఆతడు ఆశించి ఆప్రకారము చేయుటకు ప్రయత్నించెను. ఇండి యాలో బ్రిటిషు ప్రభుత్వము పశుబలముమీద నాధారపడి యున్నదని ఆతడు పూర్తిగా గ్రహించెను. తమ సైన్యములు విశ్వాసముతో నున్నంత కాలమే యీ బలప్రయోగము చెక్కుచెదరకుండ నుండగలదనియు, దేశీయులకు ప్రభుత్వము నందు విశ్వాసముగాని నమ్మకముగాని లేదనియు నమ్మెను.

కుంపిణీ ప్రభుత్వము ప్రారంభించిన తరువాత యీతని కాలమందు మాత్రమే ఆంగ్లదేశమునందు హిందూ దేశము కొరకై చేయబడిన ఋణము కొంతవరకు తీర్చబడెను. తన పూర్వికులు చేసిన దుష్పరిపాలన ఫలితముగ యుద్ధములు, మొదలగు వానికైన మూడుకోట్ల పౌనుల ఋణమును తన సప్తవార్షిక సత్పరిపాలనలో రెండుకోట్ల అరవైతొమ్మిది లక్షల నలభైయేడువేల పౌనులకు తగ్గించగలిగెను. ఆ సమయమున పరిస్థితులు కూడ ఆతనికి అనుకూలముగ లేకుండెను. 1833 సంవత్సరమున కంపెనీవారి హక్కులను తగ్గించి, దేశ

ములో అందరికిని వర్తక హక్కులను హెచ్చు చేయుట వలన కలకత్తాలో చాలమంది యింగ్లీషు ధనాఢ్యులు దివాళాతీసిరి. తత్ఫలితముగ పరిశ్రిమలకును, వర్తక సరళికిని చాలనష్టము కలిగెను. అప్పటికిని పదునైదు సంవత్సరముల క్రిందట ఎంత ఆదాయముండెనో యిప్పుడును దానికి సమానముగనే యుండెను. ఖర్చులు పదిహేను లక్షలకు పైగా తగ్గింపబడెను. చివరకు హిందూదేశాదాయవ్యయ పట్టికయందు లోటునకు బదులు రాబడి హెచ్చుగా కాన్పించెను.



భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన

## 22 వ అధ్యాయము

### ఆఫ్ఘనుస్థానము:—1835—1841



గవర్నరుజనరలు త్రొక్కిన మార్గమునకు అగత్య మెంతమాత్రమును లేదు. ఆతని పద్ధతులయందు న్యాయముకూడ కాన్పించదు. సాధారణ హేతునియమములు కూడ నాతడుల్లంఘించెను. సిమ్లాప్రభుత్వ ఫర్మానా ప్రకటించుటకు నాకభ్యంతరములేదు. కాని, దానిలోని వ్రాతలకు మాత్రము నాకభ్యంతరము కలదు. అదిప్రకటింపబడిన విధమునకు అభ్యంతరము లేక పోయినను అందు ప్రకటించబడిన విషయమునకు తప్పక అభ్యంతరముగలదు ”

—లార్డు బ్రూగామ్.

విలియం బెన్టింకు ప్రభువు గవర్నరుజనరల్ పదవి చాలించుకొనిన తరువాత, యింగ్లాండులోని అధికారులు మరి యొకరిని నియమించువరకును, కౌన్సిలునందు మొదటి సభ్యు డగుటచే సర్ సి. మెట్కాఫు, ఫోర్టు విలియమునకధికారము వహించెను. యిదివరకే పరిపాలనయందు పూర్తిగా అను భవముగలవాడగుటచేతను, మంచి చెడ్డ వివక్షత బాగుగా

నెఱిగినవాడగుటచేతను, తాను పరిపాలనయందున్న కొలది కాలములోను భవిష్యత్తునందు తనపేరు బాగాజ్ఞాపక ముండునటుల ప్రవర్తించి ఒక్కఘనకార్యమును చేయగలిగెను. ఈతడు కంపెనీవారికి వ్రాయుచుండు వ్రాతలను బట్టి మాత్రమెవ్వరును ఈతడిట్టి ఘనకార్యమును చేయగలడని నమ్ముటకు సావకాశము లేకుండెను. ఈతడెప్పుడును బలప్రయోగమువలన తప్ప యూరపియనులు సామ్రాజ్యమును విస్తరింప జేసికొనుటకు మార్గములేదని ఘట్టినమ్మకముతో నుండెడివాడు. ఆతని వ్రాతలు తమ రాచకీయ దౌర్బల్యముతోడను, దానిని బలపరచు విధానములతోడను నిండుచుండెను. అట్టివాడు హిందూదేశమున పత్రికా స్వాతంత్ర్యము నెలకొల్పుటకు సమకట్టెను! కౌన్సిలునందు న్యాయశాఖాసభ్యుడగనున్న మెకాలే యితనికి అండగా నిలచెను. కాని, కంపెనీఆఫీసువారు దీనికొప్పుకొనక ప్రతిఘటించిరి. హిందూదేశపు గవర్నరు జనరలుగ నుండమని డైరెక్టరులు మౌంటు స్టూఆర్టు ఎల్ఫిన్‌స్టనును కోరిరిగాని, ఆతడు తనఆరోగ్యస్థితి చెడినదను నెపమున ఒప్పుకొనలేదు. సర్ రాబర్టుపీల్ హెౌటెసుబరీ ప్రభువును నియమించెను. ఆతడు ప్రయాణమునకు సిద్ధమగునప్పటికి బ్రిటిష్ ప్రభుత్వమునందు మార్పు గలిగి, 1835 ఏప్రిలు నందు విగ్గులు అధికారమునకు వచ్చి యీతని నియోజకమును రద్దుచేసిరి. రద్దుచేయుట న్యాయమేనా అని వారిని ప్రశ్నింపగా వారిట్లు సమాధానమును చెప్పిరి. "గవర్నరు జనరలు నియామకముచాల ప్రాముఖ్యమైనది. అట్టి స్థానము నాక్రమించువారి రాచకీయాభి

ప్రియములందును, వ్యక్తి గుణగతములయందును మంత్రులకు సంపూర్ణ నమ్మకముండవలెను. ఎవరియందైతే అట్టి నమ్మకము గలదో వారినే నియమించుటకు మంత్రులకు హక్కుగలదు." గ్రీన్‌విల్లు ప్రభువు యీ హక్కును చట్టబద్ధముగ జేసెను. కానింగు ప్రభువుకూడ, గవర్నరు జనరలు పదవి కాళీవచ్చినప్పుడు, యింగ్లాండునుండి రాజుగారి ప్రతినిధిని పంపవలసియున్నదని చెప్పుచుండెను. దానివలన, సామ్రాజ్యము యొక్క అధికారము ఏకముఖమున నడచుచున్నట్టు స్పష్టపడగలదని ఆతడనెను.

విలియం బెంటింకు ప్రభువు యింగ్లాండుకు తిరిగివెళ్ళే వరకు యీ విషయమై ఏమియు నిర్ణయింప బడలేదు. అప్పుడు ఆక్లండు ప్రభువును నియమించినట్లు తెలియజేయ బడెను. ఈ నిర్ణయము చాలమందికి ఆశ్చర్యము కలిగించెను. ఆక్లండు నియామకము వట్టిపనికిమాలినదని చాల మంది అభిప్రాయము. కొంతమందికి మాత్రము దీని అసలు రహస్యము తెలియును. ఇది కేవలము అభిమానజనితమని గమనించిరి. మెట్కాఫునకు మాత్రము చాల పరిభవమయ్యెను. తాను చిన్నతనమునుండియు పనిలోనుండి అనుభవము గడించి యీ గొప్పపదవి నధిష్ఠించుటకు తగియుండగా ఎంతమాత్రము అనుభవములేని క్రొత్తవానిని నియమించుట బాగుగా లేదని ఆతడనెను. అయితే అభిమాన గ్రస్తుల మార్గము లెవ్వరు కనుగొనగలరు? ఆక్లండు ప్రభువునకు పశ్చిమార్ధగోళమును గురించి బొత్తిగా తెలియదు. అం

దుచే మొదట "జమైకా" కును తరువాత "కనడా" కును గవర్నరుగా బంపబడెను.

ఆంగ్లో యిండియాలో నిస్తబ్ధత ప్రబలెను. ఎన్నదగిన కార్యము లేవియు జరుగకుండెను. నిద్రమత్తుగల జడ్జీలకును, పనిలేని కలక్టరులకును అప్పుడప్పుడు స్వదేశ సంస్థానములందు కలుగుచు వచ్చిన వారసత్వపు హక్కుల గూర్చిన తగాదాలు కొంచెముగా ఆతురతను కలుగ జేయుచుండెను. ఎదురు లేని నిరంకుశ ప్రభుత్వము అడ్డులేకుండ జరిగిపోవుచుండెను. విజయోత్సాహము చల్లబడెను. యిదివరకు కలిగిన విజయము హెచ్చైనను తృప్తికలుగలేదు. క్రొత్త ఆహారము కొరకు వెదకులాడవలసి వచ్చెను. ఎముకలు కొరికి తినుట కవకాశము మాత్రము లభింపకుండెను. ఏ కొండ జాతివారైనను ఎదిరించుటకు వత్తురేమో యని ప్రతి ఖిల్లాయు యెదురు చూచుచుండెను. కాని ఏమిలాభము? ఘూర్ఖాలు నెమ్మదిగా కాలము గడుపుచుండిరి. సిక్కులు ప్రేమాస్పదులైరి. బర్మీయులు మిన్నకుండిరి. సమరోత్సాహము చని పోయెనా ఏమి? రాచకీయోత్తేజము గల ఒక్క యువకుడైనను ఏదోసాకుబెట్టి కజ్జాకు కాలుదువ్వుటకు సంసిద్ధతను చూపలేకుండెను. ఆలెగ్జాండరు బరన్సు తన ఉత్సాహమును వెల్లడించుపని కల్పించుకొనుట కేదైన సావకాశము చిక్కునా యని తల్లడిల్లుచుండెను. గవర్నరుజనరలగు ఆక్లండుప్రభువున కేమియు నవసరములేకుండెను. అతని అలక్ష్యభావము నుండి మేల్కొల్పుటకు బరన్సుకు సావకాశము చిక్కియుండెడిదే కాదు. కాని, యింతలో, యింగ్లాండుదేశము నందలి

రాచకీయవేత్తలలో గొప్పకలవర ముదయించెను. రషియా దేశపు చక్రవర్తియగు జారు తమ ప్రాగ్దేశముల నాక్రమించ వలెనని ప్రయత్నించుచున్నాడను భయోత్పాతమును పుట్టించిరి. మధ్యఆసియాలో సరిహద్దులనున్న అన్ని సంస్థానములలోను రషియా రాయబారులుండి కుట్రసల్పుచున్నట్టు వదంతులను పుట్టించిరి. పర్షియాకు లంచమిచ్చి, సింధు కాంధహారు దేశములపై దండెత్తుటకు ప్రోత్సహించుచున్నట్లు చెప్పుకొనిరి. ఆఫ్ఘనులతోకలసి రషియనులు కుట్రసలుపుచున్నట్టు అనుమానపడిరి. రంజిత్ సింగు రాజభక్తిననుమానించుటకు సావకాశము లేనప్పటికి ఆతనిని నమ్మకుండిరి. ఇండియాలోని ఇంగ్లీషుసామ్రాజ్యమునకు సింధునది సరిహద్దుగా దైవముచే ఏర్పాటుచేయబడినదేనని భావించిరి. అయితే దాని దగ్గరకు చేరుకొనుట యెట్లనునదే యిప్పుడు ప్రశ్న. శాంతముతో ప్రజలు కాలముగడుపుచుండిరి. ఈ ప్రశాంత స్థితిలో వారినియుద్ధమునకు పురికొల్పుట కష్టముగా నుండెను. వ్యాపారసరళిని యీ వ్యవహారమును కదలించవలెనని బరన్సు సలహానిచ్చెను. సింధునదీ ముఖద్వారమునుండి పైవరకును నావికాయాత్రకెట్టి యభ్యంతరము లేక అందరకు స్వేచ్ఛయుండవలెనని వారడిగిరి. ఏదో నాలుగుడబ్బులు చేసుకొని ఎవ్వరికి అపకారమనేది లేకుండా తోచినంతమట్టుకు ఉపకారంజేసి కాలం వెళ్లబుచ్చుకుందామని వచ్చినవారు కాబట్టి యీలా అడగడంవల్ల తాము దురుద్దేశ్యముతో నున్నామని అనుమానపడుటకు వీలులేదని వారుతలచిరి. పైగా కేవలము పరోపకారబుద్ధియు ఉదారాశయములే యిట్లడుగుటకు కారణములట!

అనాగరకులును, అనుమానగ్రస్తులునగు జాతులు ఇంగ్లీషువారి నిస్స్వార్థపు అభిప్రాయముయొక్క విలువ తెలిసికొనలేక పోవచ్చును! కాని, వారు గ్రహించేటట్లు చేయవలెను! ఎప్పుడైతే కొంచెముకాలు త్రొక్కుకొనుటకు సావకాశము చిక్కినదో యిక మిగిలినదానికి ఆలోచించ నక్కరలేదు. ఒక వంక రషియా తన ప్రతినిధిరాయబారులద్వారా క్రమంగా ఎవ్వరికి తెలియకుండా సింధునది ప్రాంతాలకు వచ్చిపడుచుండెను. సింధునదిదాటి ఆవల నిలువద్రొక్కుకొన్న తప్ప రషియనుల నడ్డగించుటకు మార్గములేదు. ఏడాదినుండి షరిషియను ప్రభుత్వమువారు హీరతును ముట్టడించియుండుట వలన యీ దురాలోచనలు మరింత బలపడుటకు కారణమయ్యెను.

1837 సం॥లో కాబూలు, సింధు, హైదరాబాదు నబాబులవద్దకు వర్తకసదుపాయముల నిమిత్తము రాయబారములు పంపబడెను. కాని అందువల్ల ఏమియు ఫలితము కలుగలేదు. ఆఫ్ఘనుస్థానము నేలుచున్న దోస్తుమహామ్మదు పిషావరు పట్టుకొనవలెనని పరితపించుచుండెను. ఈతనికి ముందు ఆఫ్ఘనుస్థానము నేలుచుండి, రాజ్యభ్రష్టుడై, అడవులపాలైన షాసుజా పిషావరును రంజితుసింగునకు కలిపివేసెను. పిషావరును లాగుకొనుటకు బరన్సు దోస్తుమహామ్మదుకు సహాయ్యము చేయలేననెను. పర్షియనురాయబారి సహాయము చేయించెదననెను. అందుకై ఆఫ్ఘనునబాబు హీరతు ముట్టడియందు పర్షియాకు సహాయపడుట కొప్పుకొనెను. ఈసమయమందే ఇంగ్లీషురాయబారియగు "యమ్‌నీలు" తాను టెహెరెను

వద్ద అవమానింపబడితినని ఫిర్యాదుచేసెను. రాజ్యభ్రష్టుడైన షాసుజా తనసింహాసనమును తిరిగి పొందుట కేమిచేయ మన్నను చేయుటకు సిద్ధముగానుండెను. రంజితుసింగు పిషావరు కొరకై ఏషరతులకైన ఒప్పుకొనుటకు సిద్ధపడెను. అదృష్టదేవత అన్నివిధముల అనుకూలపడినది. ఇక నెందులకు యోచన? 1838 సం॥ జూను 26 తేదీని లాహోరువద్ద ముగ్గురునుకలసి సంధిపత్రము సంతకముచేసిరి. దీనినిబట్టి ఆక్లండుప్రభువు బ్రిటిషుసైన్యమును ఆఫ్ఘనుస్థానమునకు బంపి, షాసుజాకు సింహాసనము స్వాధీనముచేయుటకు ఒప్పుకొనెను.

సిక్కు-సింహామగు రంజిత్ సింగ్‌కు సింధునది కుడిప్రక్క-నున్న కొంతరాజ్యమును యిప్పించుటకును యీ ముగ్గురుకలసి ఎల్లప్పుడును స్నేహభావముతో నుండి, పరరాజ్యములు కుట్రపన్ని తమమీదికి దండెత్తివచ్చినప్పుడు కలసిపారద్రోలుటకును ఏర్పాటుచేసికొనిరి. తక్షణము యుద్ధసన్నద్ధులగుటకు అనుజ్ఞ ఒసంగబడెను. అన్నివైపుల ఉత్సాహామునకు పట్టపగ్గములులేకుండెను. ఇన్నాళ్లకైనను నిస్తేజము వదలి సమరోత్సాహ ప్రకటన కవకాశము కలిగినదిగదాయని సంతోషము ప్రబలెను. ఈ పన్నుగడ విషయమై యింగ్లాండులో ఏమిమాయచేసినను, హిందూదేశమునందు మాత్ర మనుమానము లేకుండెను. 1838 సం॥ అక్టోబరు 1 వ తేదీని సిమ్లా నుండి గవర్నరు జనరలు చేసిన ప్రకటనలో ఆఫ్ఘను సైన్యమునకు మన సైనికులను సహాయమిచ్చి కాబూలు సింహాసనమునకు న్యాయమైన హక్కు-దారుని రాజుగాజేసి, మనసైనికులను వెనుకకు మరలించెదమని వాగ్దానము చేసెను. అప్పుడుగాని, దానికి తరు

వాతగాని, ఎవరున్న దోస్తు మహమ్మదు యొక్క నిపుణులగు సైనికులచు సింధుదేశ సరిహద్దులలో మనచేతగాని క్రొత్త సైన్యము ఎదుర్కొనుటకు తగియుండుననిగాని, రాజ్యభ్రష్టుడై చాలకాలము క్రితమే మరచిపోబడి మనవైస్రాయిచే నభిమానింపబడిన షావద్ద మన సైన్యపు ఖర్చుల కిచ్చుటకు లక్ష రూపాయి లున్నవనిగాని ఊహించి యుండలేదు. 1839 సం॥ పు పార్లమెంటు సభాసమావేశమునందు అబర్డీను, ఎల్లెనుబరో, భూస్వాముప్రభువులు సిమ్లా ప్రకటనను పూర్తిగా ఖండించిరి. ఆ ప్రకటనను సమర్థించుట కనేక కాగితములు ప్రభువులసభ ఎదుటను కామన్సుసభఎదుటను దాఖలు చేయబడెను. వానిలో పాశ్చాత్యదేశములనుండి ఆంగ్లేయ రాచకీయవేత్తలు 1837 సం॥ ములో వ్రాసిపంపిన రహస్యపు టుత్తరువులుండెను. ముఖ్యముగా సింధునదీ ప్రాంతములలో రషియావారు కుట్రపన్ని మనలను కూలద్రోయుటకు ప్రయత్నించుచున్నారని బరన్సు వ్రాసియుండెను. ఇందుతో తృప్తిపొందక యీ విషయమై తరచితరచి అడిగినమీదట మెల్బోరను ప్రభువు చెప్పినదేమనగా "సెంటుపీటర్సు బర్గులోవున్న మన మంత్రిద్వారా రషియను ప్రభుత్వమువారి నీ కుట్ర విషయమై సంజాయిషీ యిమ్మని కోరినాము. వారి జవాబు సంతృప్తికరముగా నున్నది." కాని, రషియావారిమీద నారోపింపబడిన నేరములతోబాటు వారి సంజాయిషీకూడ పార్లమెంటు సభకు తెలియజేసిన బాగుండెడిదే. ఈ సంజాయిషీ కప్పిపుచ్చి వారి నేరములనుమాత్రము బయలుపెట్టి అవి ప్రజల మనస్సులలో బాగుగా పాదుకొనుటకు తగినంత అవ

కాశమిచ్చి హిందూదేశమునుండి ఆఫ్ఘనుముట్టడి ఫలితమునకు ఎదురు చూచుచుండిరి. ఈలోగా పార్లమెంటు సభకు క్రొం చెము క్రొంచెముగా నివేదింపబడిన జాబులు కలకత్తాకు చేరి నవి. జారు చక్రవర్తి మీాద నేరములమోపిన ప్రధానపురు షుడే తాను తెలియజేసిన సంగతులకును, ప్రకటింపబడిన వాని కిని కొండంత తారతమ్యముండెననియు, తానెప్పుడుకూడ తెలియ జేయని సంగతులు నిజమైనవానిగా ప్రకటింపబడుట తనకు మరింత ఆశ్చర్యమును కలుగజేయుచున్నదనియు చెప్పెను. ఇట్టి శుద్ధతప్పులన్నిటిని తాను ఎల్లరకు తెలియునటుల సరి చేసెదనని ఆక్లండు ప్రభువుతో బరన్సు చెప్పెను. అట్లు చేయు టకు వైస్రాయి ఎంతమాత్రమును ఒప్పుకొనలేదు. "ఇప్పుడు మనదేశము బ్రహ్మాండమైన ఎత్తుమీాద నడచుచున్నది. ఆ పద్ధతి కిక తిరుగు ఉండకూడదు. ఇప్పుడు వారిఉద్దేశ్యములు సరియై నవికావని నీబోటి నమ్మకమైనబంటు అనుమానమును కలిగిం చుట రాజద్రోహకరమగు సంగతి" అని వైస్రాయిబరన్సునునిరో ధించెను. ఈ అబద్ధములన్నియు కావాలని సృష్టింపబడినట్లత డనుకొనలేదు. "అంతా మంచికే వచ్చినది. మంచితోనే ముగి స్తుంది. చరిత్ర ప్రసిద్ధమైన విషయాలు తప్పని, సరిగ్గాలేవని చెప్పి తను బాధపడి, యితరులను బాధపెట్టటంకంటె ఆఫ్ఘని స్థానములో రాచకీయవ్యవహారాలు సరిచూచుకోవడం మంచి ద"ని ఆతడభిప్రాయపడెను. ఆ సమయానికంతయు జయ సూచకముగా నుండెను. సైన్యసహాయమువల్లను రాచకీయ చతురతచేతను కలిగిన ముఖ్యమగు మార్పులకు తానుకారకు డని తనపేరు చిరస్థాయిగా నుండగలదని బరన్సు ఆశించెను.

తాను ముందుగా యింగ్లాండుకు బంపిన రహస్యపుటుత్తరము లలో ముఖ్యమైన వాటిలో కావలసిన దిద్దుబాట్లు చేసి ఇంగ్లాండులోని తన స్నేహితులకు పంచిపెట్టకొనుటకు లోపాయి కారీని అచ్చువేయించుకొనెను. యీవిధమైన ఆధారములవల్ల చరిత్ర వ్రాయఁబడుచున్నది! నిజస్థితులెవ్వరికి తెలియగలవు? ఆరోజులలో ఏవిషయమైనను నిజమో అబద్ధమో ఋజువు చూచి, సరిచూచి, దిద్ది, నిజమును వెల్లడించడానికి అవకాశము లేకుండెను. ఇంగ్లాండులోని ప్రజలకు యీ తగాదా ఎందులకు వచ్చినదో తెలిసికొనుటకు ప్రభుత్వముద్వారా గాని, పత్రికలద్వారా గాని మార్గములేకుండెను. కేవలము తమ విజయోత్సాహమును ప్రకటించు శతఘ్నుల మోతలను విని తమ జాతీయజండాకు గలుగుచున్న గౌరవమునకు సంతోషించుచు సుఖముగా నిద్రించుచుండిరి. అంతేకాని, తమ పేరిట ఎట్టిదుర్మార్గములు జరుగుచున్నవో వారు తెలియ లేకుండిరి.

గొప్ప సిక్కుదళమొకటి సర్ విల్లూచికాటన్ ఆధిపత్యము ననున్న బ్రిటిషు సైన్యమును ఫిరోజుపురమువద్ద కలిసికొనెను. ఇద్దరును కలసి "బోలాను" కనుమగుండా నడచి "క్వెట్టా" వద్ద "సర్ జానుకీన్" యొక్క ముఖ్యసైన్యాధి పత్యమున నున్న సైన్యముతో కలసి కాంధహారు పై దండెత్తిరి. 1839 మేలో "షాసుజా" ను రాజుగా ప్రకటించిరి. తరువాత "ఘజ్నీ" కోటను ముట్టడించి, దానిని పట్టుకొనిరి. దోస్తు మహమ్మదు తనరాజధానిని వదలిపెట్టి పారిపోయెను. ఆగష్టు 7 వ తేదీని బ్రిటిషు బలప్రదర్శనముతో "షాసుజా" ను

కాబూలు సింహాసనముమీద కూర్చుండబెట్టిరి. కొన్ని నెలల వరకు దోస్తుమహమ్మదు యీతని అధికారమునకు కొంత అడ్డంకు కలిగించెను. కాని "పుర్వాక్" యుద్ధముతో దోస్తుమహమ్మదు నిరాశజెంది లోబడిపోయెను. ఆతనిని కలకత్తాకుబంపి అచ్చట ఆతని దర్జాకు తగినట్టుగా ఆదరించుచుండిరి. ఇంతటితో ఆఫ్ఘనుస్థానము లొంగిపోయినట్లు కనుపించెను. "సర్ జానుకీను" నకు ప్రభుబిరుద మొసంగబడెను. సర్ విలియం మెక్నాటెను పడినశ్రమకు ఆతనికి బొంబాయి గవర్నరు పదవినొసంగి నివారింపబూనిరి. ఆతడు కాబూలువదలి బొంబాయికి ప్రయాణసన్నాహమునం దుండెను. బ్రిటిషు సైన్యమునందు కొంతభాగము ఆఫ్ఘనుస్థానమునువదలి మరలిపోయెను. కొత్త ప్రభుత్వపక్షమునకు సహాయముగా జనరలు ఎల్ఫిన్స్టనను మాత్రము 5000 భటులతో ఉండిపోయెను. కాంధహారులో శాంతిపరిస్థితుల నెలకొల్పుటకు "నాట్టు" నాయకత్వమున ఒకదళము నివాస మేర్పరచుకొనియుండెను. ఇంతశ్రమపడి సామ్రాజ్యప్రభుత్వము క్రిందకు తీసికొనివచ్చిన యీ దేశములో సర్ అలెగ్జాండరు బరన్సు రాయబారిగా నియమింపబడెను. ఈ పదవి నధిష్ఠించుట కాతడు సిద్ధముగానుండగా దేశముయొక్క లొంగుబాటు మంచు విడిపోయినట్లు విడిపోయి అతడున్ను ఆతనిజాతి వీరులున్ను తిరిగి తలఎత్తకుండా నశించిపోయిరి. ఆంగ్లేయులు ఆఫ్ఘనుస్థానము నాక్రమించిన రెండుసంవత్సరములలోను దేశము నిరంకుశత్వమునకులోనై చెప్పరాని బాధల ననుభవించెను. దేశములో అల్లకల్లోలము లుదయించెను. ప్రభుత్వమునందు

పట్టరానికోపాగ్ని ప్రజ్వరిల్లెను. అనేకచోట్ల కుట్రలు బయలు దేరెను. అవి తెలిసికొనబడి అణచివేయబడుచుండెను. తిరిగి తల ఎత్తుచుండెను. వీనిసంగతి కనిపెట్టుచు ప్రజలలో గలిగిన అలజడిని గమనించుచున్న కొందరు, రహస్యముగా ప్రభుత్వము నకురానున్న అపాయమునుగూర్చి హెచ్చరించుచు వచ్చిరి. కాని 80 సంవత్సరములనుండి కలిగిన అడ్డులేని అధికారాహం కార మమత వారిహృదయములయందు నాటుకొనిపోయెను. ఎదిరించువారు పుట్టబోరని వారు నమ్మిరి. ఇట్టినమ్మకము నుండి వారినెవ్వరు మేల్కొల్పగలరు? తోలుబొమ్మయగు "షాసుజా" మనస్సురంజింపజేయుటకు "బాలాహిస్సార" ను బలమైనకోటను జనానాక్రింద మార్చివేసిరి. ఇతరవిషయము లన్నిటిలోను చాల అజాగ్రత్తగా సంచరించుచు వచ్చిరి. వచ్చే శీతకాలమునకు తగినసామగ్రి నిల్వజేసికొనుటగాని, చుట్టుప్రక్క లనున్న దుర్గములలో సైన్యపుఏర్పాట్లుజేసి భద్రతకాపాడుకొను ప్రయత్నములు గాని చేయబడలేదు. నవంబరు 24 తేదీని ఏకారణముగాని, అవకాశముగాని లేకనే, ప్రజాసమూహము తుపాకులతో రాయబారియగు సర్ అలగ్జాండరు బరన్సు కచేరిని ముట్టడించి ఎంతగా మొరలిడుచున్నను వినక వానిని, వాని ఉద్యోగులను నిర్దాక్షిణ్యముగా చంపివేసిరి. ఈప్రదేశ మును ఆక్రమించుటకు పంపబడిన చిన్న సిపాయిదళమును వీధులలో అడ్డగించి కదలకుండజేసి అనేకమందిని చంపివేయగా మిగినవారు పారిపోయిరి. అధికారులకు దారి తెన్నులు తెలియకుండెను. అసమర్థత, పిరికితనము ప్రబలిపోయెను. "జలాలాబాదు" లోనున్న "సేలు"నకును, కాంధహారులో

నున్న "నాట్టు"నకును తక్షణము సహాయమురమ్మని "మెక్నా ఘెను" కబురుపంపెను. ఇతనిసమాచారములు కొన్ని వారి కందనేలేదు. చివరకు యీ అపాయకరస్థితిని తెలుసుకొన్న "సేలు" శీతకాలమందు శత్రుదేశముగుండా పోయి సహాయము చేయుటకు తగినంత సైన్యదళముగాని మందుగుండుసామాను గాని తనవద్దలేదని జవాబుచెప్పెను. ఆరువారములు నిష్ప్రయో జనమైన రాయబారములతో గడచెను. ఆహారము కరవయ్యెను. చలిబాధ మిక్కుటమగుచువచ్చెను. దినదినము చుట్టిముట్టివచ్చు చున్న శత్రుసైన్యములు పెరిగిపోవుచుండెను. దానితో వారి నా యకులు అడుగుచున్న షరతులుకూడ ఒప్పుకొనుటకు అవమాన కరములగుచు వచ్చెను. తుదకు పరిస్థితులు భయంకరమయ్యెను. తిరుగుబాటుదారుల నాయకుడగు "అక్బరుఖాను" మాట లాడుటకు రమ్మని కబురుబంపి బ్రిటిషురాయబారిని పిలిపించి మోసపుచ్చి వానిమీద నొక్కుమ్మడి విజృంభించి నరికివేసెను. దీనికి ప్రతీకారము సల్పుటకేమియు ప్రయత్నము జరుగలేదు. కొన్ని దినములైన తరువాత ఇరువైపులవారు కొన్ని షరతుల కంగీకరించిరి. ఆ ఘను తిరుగుబాటుదారులకు పదునాల్గు లక్షల రూపాయిలు అపరాధము చెల్లించి, ఆరుతప్ప తక్కిన ఫిరం గులుయిచ్చివేసి తమసైన్యములు తక్షణము పూర్తిగా అఫ్ఘను దేశము వదలివెళ్లువరకు ఆరుగురు అధికారులను హామీఉంచు టకు బ్రిటిషుఅధికారులు ఒప్పుకొనిరి. ఇంతజేసినను వారికి అపాయస్థితి తప్పినదికాదు. సైన్యములు తమ స్థానములను వదలి తిరుగుముఖము పట్టగానే శత్రుసేనలు వారిపైబడి దును మాడ మొదలిడినవి. మూడవరోజున మాత్రము అక్బరు

ఖాను యీ ద్రోహమును ఖండించినట్లు నటించి అధికారుల కుటుంబములను తనకు ఒప్పగించినఎడల రక్షింతునని చెప్పెను. తిరిగిపోవుచున్న సైన్యము కొండజాతుల మధ్యనుండి పోవలసి యుండుటచే యిట్లుచేసినగాని వారిని కాపాడుటకు తాను సమర్థుడనుగానని తెలియజేసెను. వీని సహాయమున పదిరోజులకు ఎల్ఫినుస్టను సైన్యాధిపతియు, కొందరు ఉద్యోగులును, స్త్రీలును బ్రతికి బయటపడిరి. నాలుగు వేల సైనికులు, పదకొండువేల నౌకరులును జలాలాబాదు చేరుకొను ప్రయత్నములో నామ రూపములులేకుండ నశించిరి. ఒక్క అధికారిమాత్రమీ దుఃఖసమాచారమును తెలుపుటకో యనునట్లుచటికి చేరకలిగెను. పాపము, క్లైవు, వెలస్లీల దేశీయుల కిట్టి దుర్ఘటన ఎప్పుడును సంభవించి యుండలేదు! ఈ సమాచారము తెలిసినచోట భయోత్పాతమును కలిగించెను. ఇప్పటికి ఆక్లండు పరిపాలనా కాలముకూడ ముగిసెను. తన దౌర్భాగ్యపు పద్ధతివలన కలిగిన దురవస్థను తొలగించు బాధ్యత నితరుల కొప్పగించిపోవుట కాతడు కడుసంతసించెను.

ఎల్లెనుబరో ప్రభువును వైస్రాయిగా నియమించిరి. సర్ రాబర్టుపీలు యీఆఫ్ఘను వ్యవహారము తక్షణము గౌరవమునకు లోటుకలుగకుండ ముగించవలెనని వైస్రాయికి తెలియజేసెను. వైస్రాయి రాగానే జలాలాబాదును రక్షించు ప్రయత్నములో వైల్డుసేనాని దళము చాల నష్టముతో పరాజయము పొందెనని మొదటి వర్తమానము తెలిసెను. ఈ పరాజయముతో ఘుజ్ని లొంగిపోయెను.

కాంధహారులో 'నాట్టు' నకు సహాయపడబోయిన "యింగ్లండు" సేనాని పరాజితుడయ్యెను. ఇట్టి కష్టములలో "ఎల్లెనుబరో" ప్రభువు జాగ్రతతో సంచరించెను. "నాట్టు" "పోలకు" ల క్రింద క్రొత్త సైనికులను బెట్టి అక్బరుఖాను నోడించి, కాబూలునుండి తరిమివేసిరి. అది తిరిగి పట్టుకొనబడి, చివరకు వదలివేయబడెను. "షాసుజా" యీ యుద్ధములో చనిపోయెను. ఆతని వంశమును గురించి ఆలోచించువారే లేకపోయిరి. దోస్తుమహమ్మదును వదలివేయగా ఆతడు ఆఫ్ఘనుస్థానమును ఏబాధలులేకుండ ఇరువదిసంవత్సరములు రాజ్యమేలెను. ఇంతధనము వెచ్చించి, యింతరక్తమును ధారవోసి, యిన్ని అవమానములను దుఃఖములను భరించినందుకు యిండియా ప్రభుత్వమువారికి సోమనాథదేవాలయపు తలుపులుతప్ప వేరులాభము లేకుండెను. ఘజ్నిలో మహమ్మదుయొక్క గోరీకి తలుపులుగా ఉన్న ఎనిమిదివందల సంవత్సరములనాటివగు వీనిని మన సైనికులు విజయ చిహ్నముగ ఊడదీసికొని వచ్చిరని "ఎల్లెను బరో" ప్రభువు ప్రగల్భములను బల్కుచుండెడివాడు. తీరా చూడగా ఆతడుచెప్పినట్టివి సోమనాథదేవాలయపు అసలు తలుపులుకావనియు, కాబూలునందు దొరకు దేవదారుకలపతో ఆ మాదిరిగా చేయబడిన నవీన పనితనపు తలుపులనియు తేలినది !

భరతఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన

## 23 వ అధ్యాయము.

---

### సింధుదేశపు అమీరులు 1843—1844



“ మన హిందూసామ్రాజ్యమున జరిగిన విషయములలో అమీరులయెడ మనము జరిపినంత అవమానకరమైనదియు, ఘోరమైనట్టియు చర్య మరియొకటి లేదని నేను ఘట్టిగా చెప్పగలను. ఆ సంగతి వినినప్పుడెల్ల నాకు ఒడలు మండుకొని పోవుచున్నది. ఏ విధముగా ఆలోచించినను మనగౌరవమునకు విశ్వాసమునకు గలిగిన మచ్చ తుడిచివేయగలదారి కనుపించదు. అట్టి భక్తి గల దేశమువిషయమున యితరులందరికంటెను నేను బాగుగా తెలిసినవాడ నగుటజేసి నా అభిప్రాయములను పూర్తిగా వెల్లడించుటకు నాకు సంపూర్ణమైన వాక్కు గలదు. నా విచారమును అసహ్యతను వెల్లడించుటకు సరియైన మాటలుకూడ నాకు కనుపించుటలేదు.

—సర్ హెన్రీపాటింగరు

ఆఫ్ఘనుస్థానమునుండి బ్రిటిషుప్రదేశమునకు తిరిగి వచ్చుచున్న సైనికులకు ఫిరోజపూరువద్ద రంజితుసింగు కుమారుడు విందుజేసెను. చివరకు శాంతిపరిస్థితులు నెలకొల్పబడినందుల కొకరి నొకర రభినందించుకొనిరి. ఇకను యుద్ధావసరము కలుగకూడదని శపథమునుబట్టిరి. అయినప్పటికి ఖడ్గముల నింకను ఒరలలోనికి పూర్తిగా దింపనేలేదు. ప్రతి

చోటను మొన్న తమకు జరిగిన అపజయమునకు, పరిభవము నకు ప్రతిక్రియ జరుగవలెనను తీవ్రమైన తలంపులు బయలు దేరెను. ఎట్లైననుసరే తాము విజేతలమను గౌరవము స్థాపించు కొనవలెనని పట్టుదలగలిగెను. తెలియకుండగనే యింకొక యుద్ధమునకు ఏర్పాటులు జరుగుచుండెను. ఆఫ్ఘను పరా జయమును మరపించుటకు మఱియొక విజయము కలిగితీర వలెను. 1839 సంవత్సరములో సర్. జె. కీను, సర్ విలియం కాటనుల సైన్యములు "కచ్చి", "సింధు" రాష్ట్రములలో తదాష్ట్రాధిపతుల అనుమతిలేకుండగనే దండు విడియుచు వచ్చెను. ఆ దేశములను సైన్యాధికారులు "అమీరుల" ను పేరిట రాజ్యమేలుచుండిరి. ఇంగ్లీషుసైనికులు ఆఫ్ఘనుస్థాన ముపై యుద్ధముజరుపుటకు తమ రాష్ట్రములో స్థానమేర్పరుచు కొనుట వారికెంతమాత్రమును గిట్టలేదు. ఇందులకు తమ అయిష్టతనుకూడ ప్రకటించిరి. వీరికి ఆఫ్ఘనులయందేమియు యిష్టముండికాదు. మనవలనరాబోవు యిబ్బందులకు వారు భయపడిరి. దేశమునందు మనదాడికి పూర్వమునుండియు నివాసముగా ఉన్నవారీ అమీరులవిషయమై మంచిగనే చెప్పు చున్నారు. వ్యవసాయకులు, చేతిపనులవల్ల జీవనము చేయు పరిశ్రామికులు వీరివలన బాధలులేకుండ సుఖజీవ నము చేయుచుండిరి. అమీరులు యుద్ధసమయములలో తమ బెలూచిస్థానపు అనుచరులతో బయలుదేరుచుండిరి. శాంతి సమయములలో మోటుగాను బాధ్యతలేకుండగాను ప్రజలకు న్యాయనిర్వహణ మొనర్చుచుండిరి. యూరపు రాజ్యములు చిల్లర రాజులచే నేలబడుకాలములో (ఫ్యూడలు

టైమ్సులో) ఏ మాదిరిగా నుండెనో వీరి వ్యవహారము కూడ ఆలాగున నున్నదని చెప్పుటలో వ్యత్యాసము లేదు. వీరిది వ్యక్తి నిరంకుశత్వ పద్ధతి. ఈ నిరంకుశత్వము వ్యక్తులకు గలుగుకీడును తొలగించుటలో చాల తీవ్రరూపము దాల్చి తగిన ప్రతీకారము కొరకు నిరీక్షించెడిది. ఇస్లాము మతధర్మము ననుసరించి చట్టదృష్టిలో మనుజులందరు సమానులను అభిప్రాయము ప్రబలియుండుటచే యీ నిరంకుశాధికారము చాలవరకు తగ్గుటకు కారణమైనది. ఆవేశపరులై కత్తి దూసినను కొట్టుటకు జంకుచుండిరి. సాధారణముగా ఒరలోనుండి సగము కంటె పైకి కత్తి రానివ్వబడునదికాదు. వచ్చినప్పుడిక రెండుతునకలు కావలసినదే. ఖైరుపూరు ఖాజి కుమార్తె "మహమ్మదుఖాను తాల్పూరు" యొక్క జనానాలో స్త్రీలకు కురాను నేర్పెడిది. ఆమె చాల అందకత్తె. మహమ్మదుఖానుడు వ్యామోహితుడై ఆమెను చెరిపెను. ఆమె తండ్రి యీఅక్రమమునుగూర్చి ఎవ్వరితో నేమియు చెప్పకుండ తిన్నగా అమీరు కూర్చున్న చావడిలో ప్రవేశించి వాని అనుచరులు చూచుచుండగనే రెండుముక్కలుక్రింద ఖండించెను. ఇతర అమీరులు వీనిని దండించుటకు మారుగా అపాయము కలుగకుండ రక్షించిరి. "తాల్పూరు" చేసినపని భరింపశక్యముగానిదనియు, దాని కతడు పొందినశాస్తి తగినదేననియు వారు తలంచిరి. న్యాయనిర్వహణమునం దీ యమీరులు చాల దయతో ప్రవర్తించుచుండెడివారు. రక్తపాతమంటే వారికి పరమఅసహ్యత. కొండజాతులు మాత్రము వీరికి లొంగుబాటులో నుండెడివికావు. అనుచరులు సంతృప్తితో

నుండెడివారు. యూరపియను రాష్ట్రప్రజలకంటె వీరి స్థితి గతులు బాగుగనున్నవని చెప్పుట కెంతమాత్రమును సందే హము లేదు. హిందువుల స్థితికూడ బాగుగనేయుండెను. ఐర్లాండులోని "క్యాథలిక్కు"లకు" ను, యింగ్లాండులోని "డిస్సెంటర్ల" కును ఏబది సంవత్సరములక్రితము ప్రభు త్వము నెడ నెట్టి సంబంధముండెడిదో హిందువులకును తమ మహమ్మదీయ పరిపాలకులఎడ నట్టి సంబంధమే యుండెడిది. వీతములతో నిండిన దట్టమైన వరిచేలు, చెరకుపంటలు, ప్రజాసమూహముయొక్క పరిశ్రమ, సౌఖ్యము, భద్రతలను చెప్పకయే చెప్పుచుండెను. అమీరుల విషయమై మరియొక గొప్ప సంగతికూడ చెప్పవలసియున్నది. రాచకీయముగా శిక్షిం పబడినవా రెవ్వరైననుసరే తమ శరణుజొచ్చిన ఎడల వారిని నిర్భయముగా నాదరించుచుండెడివారు. నాగరికతాగ్ర ధర్మ ములఎడ గౌరవాధిక్యత గలదని గొప్పజెప్పుకొను పాశ్చాత్య ప్రభుత్వములలో కొన్నిటి విషయమున యీవిధముగా చెప్పు కొనుటకు నోచుకొనలేదు.

పాశ్చాత్యులు తమ వ్యవహారములలో జోక్యము కలుగ జేసికొనుట అమీరుల కెంతమాత్రము యిష్టములేనట్లు చాల కాలమునుండియు తెలియజేయుచుండిరి. 1775 సంవత్సర ములో "టట్టా" నగరమున స్థాపింపబడిన ఫ్యాక్టరీ 1792 లో వదలివేయబడి, తిరిగి 1799 లో స్థాపించుటకు ప్రయత్న ములు జరిగెను. కాని, ఆ ప్రయత్నములు ఫలించలేదు. 1809 సంవత్సరమున ఎంతో కష్టముమీద మింటోప్రభువు అమీరు లను తనతో సంధిజేసికొనుటకు ప్రోత్సహించెను. వీరిరు

వురు స్నేహభావముతో నుండి, అమీరులు పరాసు వారితో ఎట్టి వర్తక వ్యవహారములుగాని, రాచకీయ సంబంధములు గాని పెట్టుకొనకుండునట్లు ఏర్పాటుజరిగెను. దీని తరువాత 1820 లో కొంతవరకు వర్తక హక్కులు గలిగిన సంధిజరిగెను. 1831 సంవత్సరములో అలెగ్జాండరు బరన్సు సింధునదీ ప్రాంత దేశములను చూడబోయినప్పుడు ఆతనిని కలసికొన్న సయ్యదు "సింధునదిని యింగ్లీషువా రెప్పుడైతే చూచినారో అప్పుడే సింధుదేశము మా చేతినుండి జారిపోయినదన్నమాటే. సింధు దేశమును జయించుటకు మార్గమీనదిని జూచుటవల్ల తేట తెల్లమై పోయినది" అని చెప్పెను. మరుసటి వత్సరము పాటింగరు అమీరులతో వర్తకపు టొడంబడిక జేసికొనెను. దానివలన ఇంగ్లీషు వర్తకులకు దేశములోని పట్టణములకు సముద్రతీర ప్రదేశములకు ప్రవేశము లభించెను. ఏ ప్రదేశమునందును వీరు స్థిరనివాస మేర్పరచుకొన గూడదనియు, తమపని నెరవేర్చుకొనగనే దేశమును విడచిపో వలయుననియు, నదులుగాని,రహదారులుగాని, యుద్ధవ్యవహార ములకు ఉపయోగింపబడకూడదనియు నిర్ణయింపబడెను. ఇంకొక విషయముకూడ దానిలో చేర్చబడెను. సింధుదేశ ములో నీయవలసిన టోలుగేటుపన్నులు, సుంకములు, బ్రిటిషు ప్రభుత్వమువారి అభిప్రాయములో హెచ్చుగానున్నఎడల తగ్గింపబడవలెనని యుండెను. 1838 సంవత్సరములో అమీ రులు తమ రాజధానిలో నొక బ్రిటిషు రాయబారిని శాశ్వత ముగా నుంచుకొనుట కొప్పుకొనిరి. సిక్కు-ఆఫ్ఘను-ఆంగ్లేయ టొడంబడిక జరిగిన తరువాత అమీరులు "షాసుజా"కు

చెల్లించవలసిన కప్పమునుగూర్చి తాను మధ్యవర్తిత్వము జరిపెదనని ఆక్లండుప్రభువు చెప్పెను. సింధు ఒకప్పుడు ఆఫ్ఘను స్థానమునకు చెందిన రాష్ట్రమగుటచే యీ కప్పము చెల్లించవలసియుండెనని చెప్పబడెను. ఈ మధ్యవర్తిత్వమునకు అమీరు లొప్పుకొనెదరో లేదో అడిగినవారేలేరు. తామెంత మాత్రము దీనిని చెల్లించవలసిన అవసరములేదని వారనిరి. కాని, మేజరు ఔట్రాము బలవంతపర్చగా ఆఫ్ఘనురాజునకు తాము లోగడ చాలసొమ్మునిచ్చి తమబాధ్యతల నన్నిటిని యిది వరకే వదలించుకొన్న ఏర్పాటును బయటపెట్టిరి. ఔట్రామునకు దీనిపై నేమిచెప్పుటకు తోచకుండెను. "దీనిలోనుండి తప్పించుకొనుటకు నా కేమియు మార్గము కనుపించుటలేద" ని ఆతడు కలకత్తాకు వ్రాసెను. దురదృష్టవశాత్తు దీనికి జవాబు ప్రభుత్వపు సహజధోరణిలో నుండెను. "అమీరులు చెప్పిన కారణముల నిజస్థితి తెలిసికొనుటకు బ్రిటిషుప్రభుత్వమువారి కెట్టిబాధ్యతయు లేదని గవర్నరుజనరలు అభిప్రాయపడుచున్నాడ" ని కబురు పంపిరి.

ఈ సమయమునందే నాయకుడొకడు "ఔహారను" ప్రభుత్వముతో నుత్తరప్రత్యుత్తరములు జరుపుచున్నట్లు తెలియజేయబడెను. ఇది కుట్ర, ద్రోహమునని ఖండింపబడెను. ఈతనిచర్యకు తక్కిన అమీరులందరు బాధ్యులుగా నెంచబడిరి. తక్షణమే దేశములో బ్రిటిషుసైన్యదళమును ప్రవేశపెట్టుట కంగీకరించవలెనని రాయబారిచే కబురు చేయబడెను. ఆఫ్ఘనుస్థానముపై దండెత్తుటకు సింధుసైన్యమునంతటిని తయారుచేసి పంపవలెననిరి. సైన్యములన్నియు షికారుపూరు

వద్దచేరగనే అమీరుల కొకసంధిపత్రమొసంగబడెను. "టట్టా" వద్ద శాశ్వతముగా నొక బ్రిటిషుపటాలము ఉండవలయు ననియు, గవర్నరుజనరలు యిష్టానుసారము పటాలములో సిపాయిలసంఖ్య నిర్ణయింపబడుననియు, దీనికగు వ్యయములో కొంతభాగము అమీరులు చెల్లించవలసి యున్నదనియు, దానిలో వ్రాయబడెను. ఇదివిని అమీరు లాశ్చర్యమును పొందిరి. వారిలో నొకడు పాతఒడంబడికలు బయటికిదీసి "వీటిగతి ఏమికావలె" నని అడిగెను. "మొట్టమొదట సంధి జరిగినప్పటినుండి ఏదో ఒకటి క్రొత్తది పుడుతూనే ఉన్నది. మీతో ఐకమత్యముగా ఉండవలెననియే మా కోరిక. కాని యీ విధముగా మీరు బాధపెటుతూఉంటే భరించలేము. మారాష్ట్రములోనుండి మీ సిపాయిదళము లకు దారి యిచ్చియున్నాము. అప్పుడే వాటిని మా దేశ ములో స్థిరముగా ఉంచవలెననుచున్నారు!" అని అమీరు అడిగెను. కాని పరిస్థితులన్నియు వారికి వ్యతిరేకముగా నుం డెను. అనేకవిధముల తమ అసమ్మతిని వెలిబుచ్చియు చివరకు పట్టుదలలేక లొంగిపోయిరి. కాని, కరాచి రేవుపట్టణమును బ్రిటిషువారు తమకుగల తక్షణఅవసరము తీరిపోగానే, విడిచి వెళ్ళిపోవలెనని అమీరులు షరతుపెట్టిరి. ఈ షరతులతో ఒడం బడికను ఔట్రాము గవర్నరుజనరలుకు పంపెను. దానిలో బ్రిటిషు ప్రభుత్వమువారు తమ రాష్ట్రములో నుంచదలచు కొన్న పటాలము టట్టానగరములోనే ఉండవలెననికూడ అమీరులు కోరిన షరతు ఉండెను. ఈ రెండు షరతులును ఒడంబడికనుండి కొట్టివేయబడెను. బ్రిటిషువారి యుద్దేశ్య

ములో కరాచి పట్టణమును తిరిగియివ్వవలెనని ఎప్పుడూలేదు. పటాలముకూడ హెచ్చించుటకుగాని, ఒకచోటినుండి మరి యొక చోటుకు మార్చుటకుగాని వీలుకలుగవలెను. ఈ విధముగా అమీరులను యిబ్బందిపెట్టి పరిభవించుచున్నను, వారు మన భంగపాటు సమయమునకూడ విరోధభావము పూని యుండలేదు. వీరెప్పుడైనను కొంత చిరచిరలాడినను దానివలన మన కపాయమేమియు నుండబోదని ఔట్రాము తెలియజేసెను. కాని వారు తమకు జరిగిన అన్యాయములకు నష్టములకు నాగరకులుగాని, అనాగరకులుగాని ఏవిధముగా అనుకొందురో ఆవిధముగానే వీరును అనుకొనుట వైరాయి కోపమునకు కారణమయ్యెను. సింధు యుద్ధచరిత్రను వ్రాసిన సర్ విలియం నేపియర్ యీవిధముగా వ్రాసెను. సింధు దేశములో నాయకత్వమువహించి ఘనకార్యములు చేసిన సర్ చార్లెసు నేపియరు అన్నగారే యీయన. "అమీరుల స్వాతంత్ర్యమును హరించుట కిది మొదటి ప్రయత్నము. ఈ అన్యాయము కాదనుటగాని, లేదనుటగాని అసంభవము. వారి రాష్ట్రమును హరించుట కిది జబర్దస్తీ ప్రయత్నముగాక మరేమి? అమీరుకున్ను ఆఫ్ఘను సుల్తానుకున్ను మధ్యవర్తిత్వము చేసెదమని చెప్పుట వట్టిమోసమును, అవినీతికరమునై యున్నది. లాభమును పొందుటే వారి ముఖ్యాశయము. పైకిమాత్రము సింధుదేశము యొక్క స్వాతంత్ర్యము నంగీకరించుచు, సృహృద్భావము, న్యాయము, శాంతికొరకు పాటుపడుట తప్ప మరొక ఉద్దేశ్యము లేదని చాటుచుండిరి.

1842 అక్టోబరులో ఎల్లెనుబరో ప్రభువు సింధుదేశ సైన్యాధిపత్యమును వహించుటకు సర్ చార్లెసు నేపియరును ఆజ్ఞాపించెను. అమీరులలో నెవరైనను తన అధికారమును తృణీకరించి ఎదురుతిరుగుటకు ప్రయత్నించినారేమోనని విచారించి తనకు తెలియజేయవలసినదిగా చెప్పెను. "ఎవరైనను అట్టి ద్రోహచింతగలవారున్న ఎడల అట్టివారికి గవర్నరు జనరలు, యితరులందరికి బుద్ధివచ్చునట్లు, తగినదండన విధించుటకు నిశ్చయించెనట. అమీరులతో జరిగిన ఒడంబడిక నుండి ఏమాత్రమైననుసరే వ్యతిరేకముగా ప్రవర్తించినట్టు తోచినఎడల వాటినన్నిటిని నేపియరుకు నివేదించవలెనని ఔట్రాము ఆజ్ఞాపింపబడెను. అందుచే ఒకరిద్దరు తమకుగలిగిన పరిభవములచే చేసిన అనపాయకరములగు చేష్టలను ఆతడు తెలియజేయవలసి వచ్చెను. రాయబారిగానున్న తన అభిప్రాయములో వారిచేష్టలు దండనార్హములు కావనికూడ చెప్పెను. మొత్తముమీద ఎక్కువమంది విశ్వాసపాత్రులుగా నుండిరనియు, చాల అపాయకరస్థితులందుకూడ వారు ప్రతికూలభావము వహించలేదనియు కలకత్తాలోని ప్రభుత్వమునకు తెలియజేసెను. సర్ చార్లెసు నేపియరు ఈతని అభిప్రాయముతో నేకీభవించలేదు. అమీరులఎడ సాదరభావముతో వర్తించి, పరిపాలనా విధానమునందు మంచిమార్గములు వారికి నేర్పవలెనని ఔట్రాము నేపియరుకు బోధించెను. అమీరులమీద మోపబడిననేరము వారు సుంకములను వసూలుచేయుచున్నారని! అదియైనను యింగ్లీషు వారివద్దనుండికాదు, దేశీయులవద్దనుండి వసూలుచేయుటవలన

వర్తకవ్యవహారములు మందగించుననియు, అందుచే అవి విధింపబడకూడదనియు చెప్పబడెను. ఒడంబడికలో యిందుకు సంబంధించిన నియమములు అమీరులకు చూపించగా వాని అర్థము అదేయని వారికి తెలియలేదనియు, తెలిసియుండిన ఒడంబడికసంతకము చేసియుండెడివారము కామనియు వారు బదులుచెప్పిరి. రాయబారి నీవిషయమై అడుగగా తాను అమీరులుచెప్పినదే సరియైనట్టుగా నెంచుచున్నానని చెప్పెను. కాని, సర్వాధికారియైన నేపియరు ఔట్రాముచెప్పినది కొట్టి వేసి, అమీరులు తాను చెప్పినట్టుగా విని తమ అహంభావత్వము తగ్గించుకొనవలయుననియు, లేనిఎడల తనకోపమునకు గురియగుదురనియు గద్దించెను. వారు తనతో క్రొత్త ఒడంబడిక చేసికొని, సాలీనాతమకు చెల్లించవలసిన మూడులక్షలకు బదులు నదీతటములనున్న ప్రదేశము తమకు కలుపవలెనని నేపియరు వారినడిగెను. ఏవిధముచేతనైనను కొంతరాష్ట్రమును భావల్పూరుఖానునికి బహుమానముగా నీయవలెననెను. అమీరులలో ముఖ్యుడును, భాగ్యవంతుడును, వృద్ధుడునైన "మీరు రుస్తుం" జనరలునేపియరుతో మాట్లాడుటకు సావకాశమిప్పింపగలందులకు కోరుకొనెను. కాని, ఏలులేదని చెప్పబడెను. ఎల్లప్పుడు బ్రిటిషువారికి నమ్మకమైన స్నేహితుడుగా నీతడుండెను: వృద్ధుడైనను మంచి తెలివితేటలును పలుకుబడియు కలిగియుండెను. "తిరస్కరింపబడిన యీ అమీరుగాని యితరులుగాని బ్రిటిషుఅనుచరులలో నొకనిని తలవెండ్రుకకైనను అపాయమొనర్చి యుండలేదు. పైగా మనముఖ్యావసర సమయములందు తమ దేశమును, తమ సర్వస్వమును

మనవశము చేసియుండిరి.'' దీనికి ప్రతిఫలము వారిప్పుడనుభవించ వలసియుండెను. డిశంబరు 6 వ తేదీని క్రొత్త ఒడంబడిక యొకటి వారిసంతకమునకై పంపబడియెను. దానిలో పైషరతులేగాక, సింధునదిలోపోవు యింగ్లీషు స్టీమరులకు కావలసిన కట్టెలు అమీరులు సరఫరా చేయవలెననియు, లేని యెడల వారి అనుమతి అవసరము లేకుండగనే దాపుననున్న అడవులలోనుండి తీసికొనెదమనియు, అమీరు ప్రభుత్వమువారు యికముందు తమ స్వంతనాణెములు ముద్రించ కూడదనియు, వైస్రాయినాణెములు ముద్రించి దానికొకప్రక్క ఇంగ్లాండు రాణిబొమ్మను వేయవలెననియు షరతులు వ్రాయబడెను. ఈ షరతులకు అమీరులు ఒప్పుకోని ఎడల తాను తక్షణము పైనవ్రాసిన రాష్ట్రముల నాక్రమించెదనని నేపియరుజనరలు తెలియజేసెను. తన పత్రములోని విషయములు అమీరులు కప్పిపుచ్చి ప్రకటించరేమోనని, తనకు కలుపవలసిన రాష్ట్రములలో సంవత్సరాదినుండియు క్రొత్తపన్నులు గాని, యిప్పుడున్న సుంకములుగాని వసూలు చేయబడకూడదని చాటింపించెను. ఈవిధముగా సంధిపత్రములోని విషయములు చర్చించుటకు కూడ సావకాశము లేకుండ జేయబడి, రాయబారము జరుపుకొను హక్కులు కూలద్రోయబడెను. అమీరులతో ఒడంబడిక జరుపుకొనుచున్నామని చెప్పునది కేవలము పరిహాసాస్పదముగ పరిణమించెను. ఔట్రాముమాత్రము యీపద్ధతుల నామోదించలేదు. కాని ఏమిచేయగలడు ? నిష్ప్రయోజనమై, నిష్ఫలమగు విరోధభావమును బూనవద్దని అమీరులకు తెలియజేయుట తన

విధియని తలచి వారిలో చాలమంది యీ అవమానకరమగు సంధిపత్రముపై సంతకము చేయునట్లు ప్రోత్సహించెను. తమ ఆవేశపరులగు అనుచరులు యీ నియమములకు ఒప్పుకొనుట చాల కష్టమనియు, రాజధానివైపునకు యింగ్లీషు సైన్యము ఉపక్రమించుట మాననిఎడల వారిని అణచియుంచుట అసాధ్యమగుననియు సంతకము చేసిన అమీరులు చెప్పిరి. ఇదివరలో అమీరుల దుండగములగూర్చి అనేక కథలు అల్లబడెను. దేశములోని ప్రజలు భరింప శక్యముగాని బాధల ననుభవించుచున్నారనియు, వీరి బారినుండి ఎప్పుడు తప్పించుకొనగలమా యని నిరీక్షించుచున్నారనియు, చెప్పబడెను. ఈ కథలలో ఒక్కటైనను నిజమైనయెడల తమను రక్షింప బూనుకొన్న యింగ్లీషు వారిఎడల అభిమానము లేకపోయినను తమ కష్టములు గట్టెక్కినవిగదా యని ఒక్కరైనను సంతోషించి యుండవలసినది. ఏ సంఘముగాని, జాతిగాని మనయందు విశ్వాసముగాని, మనను కలుగజేసికొన్నందులకు కృతజ్ఞతగాని, మన సైన్యములు దగ్గరకు వచ్చుచున్నవని సంతోషముగాని ప్రకటించియుండలేదు. ఈ దాడి నెవ్వరును ఎదిరించలేదు. కాని, బెలూచిసిపాయిలు మాత్రము, ఔట్రామే తమ నాయకులను భంగపర్చుటకు కారణభూతుడని నమ్మి వాని యింటిపై బడిరి. ఆతడు పారిపోయి నేపియరుసేనాని మరుగుజొచ్చెను. ఫిబ్రవరి 17 వ తేదీన "మీానీ" వద్ద కలిగిన విజయము సందర్భముల స్థిరపర్చెను. ఈ యుద్ధములో దయాదాక్షిణ్యము లనునవి ఏ వైపునను కనుపించలేదు. అపారమైననష్టము కలిగెను. అచ్చట చూపబడిన

శౌర్యపరాక్రమములగూర్చి చాల వ్రాయబడియెను. రాత్రి యగుసరికి ఆరువేలమంది బెలూచిసైనికులు యుద్ధభూమిని చచ్చిపడియుండిరి. "పారిపోవుచున్న సైన్యసమూహములు హెచ్చుగానుండుటంజేసియు, ఏమాత్రమును సందివ్వక పట్టుదలతో నడచుచుండుటచేతను, వారిని తరుముకొనిపోవుటకు ప్రయత్నము జరుగలేదు."

అనేకసంవత్సరములనుండియు భగ్నమగుచువచ్చిన ఆశలు, నేపియరుజనరలుకు యిప్పటికి ఫలించినవి. శౌర్యవంతములగు సిపాయిదళమునకు నాయకత్వమువహించి, అనేకములగు శత్రుసేనల దునుమాడి యీ గొప్పయుద్ధమును నేపియరు జయించెను. కీర్తికాముడై హిల్లుప్రభువు హిందూదేశమునందు సేనానాయకత్వ మిచ్చెదననగనే సంతోషముతో స్వీకరించెను. "ఎల్లెనుబరో" ప్రభువుకు వ్రాయుఉత్తరములలోకూడ తాను గొప్పపేరు సంపాదించుప్రయత్నములే వర్ణించుచుండెను. చివరకు ఆతని ఆశ తృప్తిజెందెను. కాని యిట్టిఘోరరక్తపాతము లేకుండగనే ఆతడు తన ఆశయమును నెరవేర్చుకొని యుండి యుండగలడు. విశ్రాంతికి ముందు యుద్ధభూమికేగి చనిపోయిన శత్రుసేనలమధ్య తిరుగాడుచు అప్రయత్నముగా "నట్టి భయంకరదృశ్యమునకు, నాశనమునకు తాను కారకుడనాడునా" యని భగవంతుని ప్రశ్నించెను. ఆతని అంతరాత్మ "కాదు" అని బదులిడినట్లతడు చెప్పుచున్నాడు. అర్థరాత్రిసమయమున ఆత్మసంశయనివారణ కాగానే, ఆతడు సుఖముగా నిద్రించెను. ఈ యుద్ధము నాతడు తప్పింపగలిగి యుండెను. తప్పించలేనప్పటికి యీ ఘోరములనైనను తగ్గించి

యుండగలడు. యిట్టి సంశయము లాతని మనమునం దెన్ని మారు లుదయించెనో ఎవ్వరు చెప్పగలరు? ఒక్కన్యాయ మును మాత్రము ఒప్పుకొనవలసియున్నది. ఈ యుద్ధానంత రము తాను కలిగించిన నాశనమునకు, నష్టమునకు తగిన ప్రతీకారమునుజేయుట కాతడు జాగ్రతతో కష్టపడి ప్రయ త్నించెను. దేశముయొక్క సర్వనాశనమునకు శాంతిభద్రి తలు తగిన ఉపకారమైయెనడల సింధుదేశమును శవప్రాయ ముగ జేసినతరువాత ఆహారపానీయములనిచ్చి నిద్రబుచ్చి నందుకు ప్రజలు సంతృప్తిజెందియుండిరని మనము నమ్మ వచ్చును. బెలూచీలు తమ శత్రువులతో సమాధానపడుటకు ఎంతమాత్రము యిష్టపడని సంగతి చరిత్రకారుడు రెండు వాక్యములలో చూపించెను. "మీానీ" యుద్ధానంతరము గాయపడినవారిలో ముగ్గు రింకను జీవించియున్నారు.

మరుసటి ఉదయమున రాజధానిని తనకు వశపరచవలె నని నేపియరు కబురుపంపెను. ఏ షరతులమీాదనని అడు గగా "ప్రాణముల రక్షించుపద్ధతినే" యని ఆతడు జవాబు చెప్పెను. ఆరుగురు అమీరులు ఆతని గుడారమునకుంబోయి లొంగిపోయిరి. హైదరాబాదు (సింధు) ఖజానాలో నాలుగు లక్షలపౌనులును, యింకను అనేకవిధములగు విలువగల వస్తు వులును అన్నియు బ్రిటిషువారి పరమయ్యెను. కొద్దివారము లలో "షేరు మహమ్మదు" 25 వేల సైనికులను ప్రోగుజేసి బ్రిటిషువారి నెదిరించెను. కాని త్వరలోనే ఆతడు పరాజితు డయ్యెను. దాని తరువాత నెవ్వరును ఎదుర్కొనుటకు ప్రయ త్నించలేదు. షేరుపురము, ఒమరుకోటయున్న లొంగి

పోయెను. దేశమంతయు నణచివేయబడెనని నేపియరు తెలియజేసెను. అంతటితో సింధుదేశము బ్రిటిషుపరిపాలన క్రింద కలుపుకొనబడినదని ప్రకటింపబడి, సింధుదేశ గవర్నరు పదవితో నేపియరు బహూకరింపబడెను.

ఔట్రాము యింగ్లాండుకు తిరిగిపోయెను. ఆత డచ్చట చెప్పిన సంగతులనుబట్టి సింధుదేశముపైకి దండెత్తుట అకారణమనియు, దానిని కలుపుకొనుట శుద్ధఅన్యాయమ నియు ధృవపడెను. పార్లమెంటుమాత్రము వైస్రాయిని, నేపియరుజనరలును, సైన్యములను అభినందించెను. హిందూ దేశపరిస్థితులు సరిగా తెలిసినవారును, వాటికష్టములను గుర్తెరిగినవారును చాలమంది తమకు జయము కలిగినప్పటికి ఎల్లెను బరో ప్రభువు పద్ధతులకు విచారమును వెలిబుచ్చిరి. "మనము అమీరులతో చేసికొన్న ఒడంబడికలన్నియు వారు సంధిచేసి కొనుటకెట్టి కారణములు కనుపించుటలేదని నిరూపించి తమ అసమ్మతిని వెలిబుచ్చుచుండగనే జరిగినవని జ్ఞాపకముంచుకొన వలెను. స్వాతంత్ర్య దేశములగుండ, వాటిప్రభువుల కిష్టము లేకుండగనే సైన్యముల నడిపించుట; అడవులలో కలపకొట్టించుట; సుంకములు ఎత్తివేయుట; కోటలలో సైన్యముల ప్రవేశ పెట్టుట; వానిలో నిలవయున్న పశువులను, ధాన్యములను కొనివేయుట—యివన్నియుకూడ యూరపులో అంతర్జాతీయ చట్టములకు వ్యతిరేకమని తప్పక తలంచబడును. సింధువిషయ మున మాత్ర మెంతమెరుగుపూసినను తలచినంత మాత్రము ననే ఒడలు జలదరించునట్టి అన్యాయము జరిగినదని జ్ఞాపక ముండకతప్పదని చెప్పుచున్నాను." ఈ మాదిరిగా సింధుదేశ

ములో 1831 మొదలు 1841 వరకు రాయబారిగానుండి వారిభాష, వారి ఆచారములు తెలిసి, వారి మంచిచెడ్డలను గుర్తించగలిగిన ఔట్రాము చెప్పుచున్నాడు. సర్ చార్లెసు మెట్కాఫునకు, మౌంటు స్టూఆర్డు ఎల్ఫిన్ స్టనను వ్రాయుచు "సింధుదేశము మన నిరంకుశత్వమునకును, పొగరుబోతు తనమునకును, గురియైన దేశమని" చెప్పియుండెను. ఆఫ్ఘని స్థానములో జరిగిన పరిభవము తర్వాత సింధుదేశ వ్యవహార మెట్లున్నదనగా, "వీధులలో తన్నులుతిని, చేయునది లేక, యింటికిపోయి, కసితీర్చుకొనుటకు భార్యను మర్దించిన వాని కథను జ్ఞాపకము తెచ్చుచున్నది."

సింధునదీ ప్రాంతముల కలిగిన యీ విజయమున కుప్పొంగి గవర్నరుజనరలు సంవత్సరము ముగియక పూర్వమే సులభసాధ్యములును, చేతగానివియునగు ప్రదేశములను జయింప సమకట్టెను. ఇరువదియైదు వత్సరములనుండియు గ్వాలియరు సంస్థానము నేలుచున్న మహారాష్ట్ర ప్రభువులు బ్రిటిషు ప్రభుత్వముతో చేసికొన్న ఒడంబడికకు భంగము లే కుండగా రాజ్యమేలుచుండిరి. యిప్పుడైనను వారు నెరవేర్చ వలసిన విధులను భంగమొనర్చినట్టులేదు. మహారాజు చని పోవుటచేతను, ఆతని పెంపుడుకుమారుడు చిన్నవాడగుట చేతను, ఆతనికి సంరక్షకుని ఏర్పాటుచేయవలసి వచ్చెను. పరి పాలనా విధానములో సంరక్షకుడగు "మామాసాహెబు" నకును, వితంతువగు రాణీసాహెబునకున్ను కక్షలేర్పడునట్టులుం డెను. వీనికి కారణములనుగాని, వివరములుగాని, ఫలితము లుగాని యిచ్చట వివరించుట అనవసరము. గ్వాలియరులోని

రాయబారి జోక్యముకలుగజేసికొని, సమాధానపర్చ జూచెను గాని లాభములేక పోయెను. చివరకు దేశీయ సైనికులను అల్లరిమూకల నణచవలసినదిగా ఆజ్ఞాపింపగా వారు అవిధేయతతో ప్రవర్తించి ఆజ్ఞల నుల్లంఘించిరి. "కలోనలు నేపియరు" ఆజ్ఞోల్లంఘనజేసి తిరుగుబాటొనర్చిన వారిని శిక్షింపవలయుననియు, అందులకు తానొక దళమును పంపెదననియు చెప్పెను. అందులకు గ్వాలియరు రాజప్రతినిధి ఒప్పుకొనలేదు. దానివల్ల దేశములో అసూయ, కలతలు పెరిగిపోవుననియు, యితరవిధములుగా తాను వారిని శిక్షింతుననియు చెప్పెను. దురదృష్టవశాత్తు, ఆతని సంకల్పము నెరవేరలేదు. ఆతని పలుకుబడి తగ్గిపోయెను. అందుచే నాతడు ప్రభుత్వస్థానమును వదలివేయవలసి వచ్చెను. ఒకటి తరువాత నింకొకటిగా అల్లరులు ప్రబలిపోయెను. అందుచే ఆగ్రాపద్దను యింకను యితరచోట్లనుఉన్న బ్రిటిషుసైన్యములు అల్లరులు జరుగు ప్రదేశములకు నడిపింపబడెను. ముఖ్యసైన్యాధ్యక్షుడగు "సర్ హూ ఫ్‌గఫ్" యొక్క విడిదికి గవర్నరుజనరలు వెళ్లి అచ్చటనుండి యీ విధముగా ప్రకటించెను. "గ్వాలియరు సంస్థానమునందు జరుగుచున్న అల్లరులవల్లను తిరుగుబాటులవల్లను దగ్గరనున్న రాష్ట్రములలో శాంతికి భంగము సంభవించునట్లు కనుబడుచున్నది. తిరుగుబాటును అణచివేసి సింధియాప్రభుత్వ అధికారమును నెలకొల్పుటకు సైన్యముల బంపుచున్నాను." మహారాష్ట్రనాయకులు తొందరపడవద్దని గవర్నరు జనరలును కోరిరి. ఈ అల్లరులు తాత్కాలికమైనవనియు యింకను వ్యవహారము తమచేతిలోనుండి

మిగిలిపోలేదనియు తెలియజేసిరి. ఎన్నివిధములు చెప్పకొ
న్నను వినక సైన్యము ముందుకుపోవుటకు ఆజ్ఞయిచ్చిరి.
మహారాజపూరు వద్దకు పోవుసరికి సైన్యాధ్యక్షుడు తలవని
తలంపుగా బ్రిటీషుసేనలను సింధియా సైన్యము ఎదుర్కొనెను.
డిశెంబరు 29 తేదీని అచ్చట భయంకరయుద్ధము జరిగెను.
దానిలో ఇంగ్లీషువారికి జయముకలిగినను వారినష్ట మపార
ముగ నుండెను. వైస్రాయి క్రొత్తఒడంబడిక నొకటి ఏర్పా
టుచేసెను. దాని ప్రకారము గ్వాలియరులో నుంచినపటా
లమును హెచ్చించుటకును, దానికగు ఖర్చులను భరించుటకు
గాను కొన్ని జిల్లాలను బ్రిటీషువారికి కలుపుటకును నిర్ణయిం
పబడెను. యువరాజునకు పదునెనిమిదవఏట రాజ్యార్హత
కలుగునట్లును, ఈలోగా రాజ్యవ్యవహారములు ప్రతినిధిసం
ఘమువల్ల జరుపబడుటకును, వీరన్నివిషయములలోను ఇంగ్లీ
షురాయబారి సలహానను సరించి నడుచుకొనుటకును, యీ
తడు గవర్నరుజనరలు వద్దనుండి ఎప్పటికప్పుడు సలహా బడ
యుటకును ఏర్పాటుజరిగెను. మహారాణికి నామకః ఉన్న
అధికారము తొలంగించినందులకుగాను సాలీనా మూడు
లక్షలు మనువర్తి ఏర్పాటుచేసి ఆమెకండ్లనీళ్లు తుడిచిరి. పది
సంవత్సరములపాటు రాజ్యవ్యవహార మంతయు గ్వాలియరుకు
బదులుగా కలకత్తానుండి నడుపబడినదని చెప్పుటలో అతిశ
యోక్తి ఎంతమాత్రమును లేదు. ఈ దేశమును కలుపుకొను
టకు చేసిన ప్రయత్నములలో నిది మొదటిది. తరువాత
అనుకొనని పరిస్థితులు ఏర్పడబట్టిగాని లేకపోయిన గ్వాలియరు
బ్రిటీషువారిచేతులలో పూర్తిగా పడిపోయెడిదే.

ఇంగ్లాండులోని డైరెక్టరులు ఎల్లెనుబరోప్రభువు రాజ్యపద్ధతికి పూర్తిగా తమ అసమ్మతిని వెల్లడించి, యింగ్లాండుకు పిలిపించవలెనని తీర్మానించిరి. వెల్లింగ్టనుడ్యూకు వీరి చర్యను ఖండింపగా ఆతని సంతృప్తిపరచుటకై తత్క్షణము హార్డింజి ప్రభువును గవర్నరు జనరలుగా నియోగించిరి.



భరత ఖండమున

# ఆంగ్ల రాజ్య స్థాపన

## 24 వ అధ్యాయము

### పంజాబు, పెగు (బర్మా): 1845—1852



ప్రపంచములోని అన్ని జాతులవారు తమంతట తాముగవచ్చి నిజమగు యీ క్రైస్తవ మహాసామ్రాజ్యపు రెక్కలనీడను చేరుటవలన, తత్సామ్రాజ్యమీ లోకమందెల్లెడల సర్వంసహాధికారము వహించి ప్రఖ్యాతిగాంచునని అనేకులు తలంచుచున్నారు. కాని, కుంపిణీవా రవలంబించు నిట్టి పద్ధతుల వల్లమాత్రము యింగ్లండుదేశ మీ భారతవర్షముపై సర్వాధికారము వహింప గలదో లేదో చూడవలసియున్నది. ఏది యెట్లున్నను మనముమాత్రము మంగళప్రదమగు శుభశకునములతో ప్రారంభింపలేదని నా యభిప్రాయము. సరే, మంచి వృత్తితో మనమిక సంపాదించేది లేనేలేదు. పోనీ, యే దుర్వృత్తితోనో, యే అన్యాయార్జితముగనో, సంపాదించుకొన్నదానినైనా మరీ దుర్వృత్తికిపోయి పోగొట్టుకొనకుండా నిలుపుకుంటే అంతేచాలు! క్రైస్తవులమని పేరుపెట్టుకొనిన విజేతలమగు మనము భారతదేశీయులను గొడ్లమందలవలె దాస్యపు బందెలలోనికి తోలుకొనిపోవుచుండగ, వారు మనపై అనేక శాపవాక్యముల గురిపించుచున్నారు. “ సర్వేశ్వరుడగు

భగవంతుడు తిరిగి అవతారమెత్తి వస్తేనేగాని మనకీ ఘోర కలిబాధ వదలి న్యాయము జరుగదురా, తండ్రీ," యని వారు మనపై దుమ్మెత్తి పోయు చున్నారు. ఘోరమగు యీ కళంకమును తుడిచివేసికొనుటకు మన మొక్క క్షణమైనను ఆలస్యము చేయరాదు.

—షాఫ్ట్సుబరీ ప్రభువు

హార్డింజిప్రభువు యిండియాకు చేరునప్పటికి సిక్కులు మిక్కిలి కలవరస్థితిలోనుండిరి. వారి మహారాజగు రంజింత్ సింగ్ నెవరో హంతకులు రహస్యముగ చంపిరి. పదేండ్ల పిన్నప్రాయముగల ఆతని తమ్మునొకని సిక్కులు వారసుగ నంగీకరించిరి. ఈతడు ముందు మంచివాడగునను ఆశలు మెండుగ నుండెను. శిక్కుసర్దారులందరు తమలో తమ కెన్ని మనస్పర్థలున్నను అపాయకరస్థితిలోనున్న యీ శిక్కు సింహా సనమును కాపాడు విషయములోమాత్ర మేకగ్రీవులైరి. వీరి కెంత చదువు రాకపోయినను, యెంతనిర్లక్ష్యులైనను తమకు ముందురానున్న అపాయమును గుర్తింపలేకపోలేదు. కుంపిణీ వారు అన్యాయముగపోయి ఆఫ్ఘనిస్థానముపై పడిరి. ప్రజలు బహుపట్టుదలతో యెదిరించుటనుబట్టి వారు బ్రతికిరిగాని, లేక పోతే యీపాటికి ఆఫ్గనిస్థానము కుంపిణీవారి నోటపడెడిదే గదా. తమప్రక్క జరుగుచున్న యీ సంగతినంతను శిక్కులు కండ్లారచూచుచునే యుండిరి. అంతకంటె, యిటీవలనేగద కుంపిణీవారు సింధుదేశమును బెదరించి, దానిమీదపడి, దానిని పూర్తిగ తమక్రింద బానిసత్వములోనికీడింపిరి. ఈ యుదంత మునుకూడ శిక్కు లొకప్రక్కనుంచి చూచుచునేయున్నారు. ఈ రీతిగనే, తమవంతుకూడ యెప్పుడువచ్చునోయను జాగ

రాకతతోనే శిక్కులుండిరి. ఇట్టిస్థితిలో తాముమాత్రము భద్రముగ నుండగలమని శిక్కులలో యెట్టిశాంతిప్రియుడైనా, యెట్టి వెర్రినమ్మకముగలవాడైనా, నమ్మునా ? వీరిని లొంగదీయువిషయమై పార్లమెంటు వారిదివరకే నిశ్చయపరుచుకొన్నారు. ఇక యెప్పుడాయనునది మాత్రమే చర్చనీయాంశముగ నుండెను. "సింధుదేశాన్ని వశపరుచుకొన్న రెండేండ్లలో పంజాబుదేశముకూడ మనదైపోతుంది" అని కొందరప్పుడే జోస్యముచెప్పిరి. ఈమాట ఉద్యోగస్థులు తమనోటిమీదుగ అనలేదులెండి. వారంత బహిరంగముగ చెప్పుటవారికి మామూలులేదు. అప్పుడు యిండియామంత్రిగనున్న "పీలు" గారు పార్లమెంటువారి అనుశ్రుతాచారమునే అవలంబించెను. కాని, యీ విషయమై "రోబక్" అను యింకొక మెంబరుచెప్పిన జోస్యము కాదనిమాత్రము పీలుమంత్రి అనలేదు. హార్డింజిప్రభువు లోగడ సైన్యములో చాలకాలము పనిచేసి ప్రఖ్యాతిగాంచెను. ఈతని నిప్పుడు యిండియాకు వైస్రాయిగ పంపుటకు నిశ్చయించిరి. ఈతని నిట్లు యిండియాకు పంపునప్పుడు తోడియుద్యోగస్థులీతని చెవిలో నేమియూదిపంపిరో తెలియదుగాని, యిట్టి శిపాయీలలో పనిచేసినవానిని వైస్రాయిగ పంపుటనుబట్టిచూడగ, శిక్కుల అనుమానములు శాంతించునని నమ్ముటకు వీలులేకుండెను. తానిండియాకువచ్చిన నింతత్వరలోనే శిక్కులతో ఘర్షణ పెట్టుకొనకుండా వుండుటకు వైస్రాయి యిష్టపడేవాడే. ఆతడు న్యాయబుద్ధిగలవాడనియు, ఉదారస్వభావము గలవాడనియు, అనవసరముగ ఘోరమగు—రక్తపాతయుతమగు—యుద్ధమొన

ర్చి పేరుప్రతిష్ఠలు, బిరుదులు, సంపాదించుకొందమను దురాశ లేనివాడనియు, ఆతని మిత్రులు తలంచవచ్చును. ఇందులో కొంత నిజముకూడ వుండవచ్చును. యుద్ధమంటే యెంత ఘోరమైనపనియో యీతడు చూచియుండెను. అందుచే, అట్టియుద్ధములిక "వద్దురాబాబు" అని అనుకునే స్వభావము గలవాడు. ఆకాలమందు శిక్కులలోనే గనుక అత్యున్నత మేధాశక్తియు, వ్యవహారదక్షతయుగల పెద్దనాయకు డెవడైన నుండియుండినయెడల, "అరే, మీరెవరు భయపడవద్దు, మరేమీ ఫరవాలేదు" అని తక్కినవారి కందరికి భయమును పోగొట్టి, వారియుద్రేకమును చక్కగ అదుపులో వుంచే వాడు. వారిశక్తి సామర్థ్యముల నన్నిటిని బలపరుచుకొని, తొందరపడకుండ, ముందువ్యవహారము లెట్లురానున్నవో మెళకువతో నిరీక్షించుచుండెడివాడు. అట్లు జరిగియుండినచో, కుంపిణీవారింత త్వరలో శిక్కులజోలికి వచ్చెడివారుకారు; శిక్కులింత సులభముగ లొంగిపోయేవారును కారు. కాని, దైవగతి వేరుగనుండెను. సాయుధపాణులగు శిక్కుల "ఖాల్సా" సైన్యము బహు భయంకరముగ విజృంభించెను. ఈ విజృంభణ నణచుట యిండియాకప్పుడే క్రొత్తగవచ్చిన హార్డింజికి మొదటిపనియయ్యెను. ఖాల్సాసైన్యములు నానాటికి కుంపిణీయెడ విశ్వాసమునుగోల్పోయి, మరింత గందరగోళము చేయసాగెను. వారికిట్టి అపనమ్మకము గలుగుటకు తగు కారణములు లేకపోలేదు. ఈ విధముగ విజృంభించిన సైన్యముల యుద్ధతిని ఆపుట, రాణికిని ఆమె మంత్రియగు "లాల్‌సింగు" కును బహుకష్టమైపోయెను. కుంపిణీవారి

క్రొత్తసైన్యములు నానాట పెచ్చు పెరిగివచ్చి "సట్‌లెజ్" నది కావల బలిసి విడియుచున్నవను వార్తలు రోజురోజు యీవలికి చేరుచుండెను. "భవల్పూరు" మున్నగు చిల్లర, దుర్బల సంస్థానములను చదరంగపాళినుండి తుడిచివేయుటయే కుంపిణీవారికముందు వేయబోవు యెత్తుఅని చాలమంది యను కొనుచుండిరి. లోగడ, భవల్పూరురాజు తమకు చేసియున్న సహాయమునకు బహుమతిగ కుంపిణీవా రాతనికి సింధురాజ్య ములోనుండి పగులగొట్టినముక్క నొకదానిని యిచ్చియుండిరి. కాని, "కుంపిణీవారిచ్చిన దానమును తిరిగి కుంపిణీవారే తీసు కుంటార" ను సంగతి వారి చరిత్రియందవిచ్ఛిన్నపారంపర్య ముగ వచ్చుచునే యున్నది. "సైతాను తమ్ముడగు సర్ చార్లెస్ నేపియర్ కూడ యింకను సింధుదేశములోనే యుం డెను. ఆతడొక్కడొనర్చియున్న ఘనకార్యములకు పార్లమెంటు వారెంతయో సంబరపడి ఆతనిని మెచ్చుకొనలేదా?" నా సైన్యాలకు భుజములతీట యింకను వదలలేదు. యింక యేపనినైనా చేయడానికి సిద్ధముగవున్నవి. (యేదైనాపని చూపించండి) అని ఆతడని యుండలేదా? కాని, తదనంతర చరిత్రినుబట్టిచూడగ ఆతడింతటి ప్రగల్భములు కొట్టుటకు నిజ ముగ తగియుండలేదని స్పష్టమైనది. అవి యన్నియు శుష్క ప్రగల్భములుగ పరిణమించెను. అయినప్పటికి, తదుపరి శిక్కులతో జరిగిన ఘోరయుద్ధమీతని తీవ్రరణోన్మాదము చేతనే ప్రేరేపింపబడినట్లు స్పష్టముకాగలదు. ఎనుబదివేలమంది సిక్కు యోధులు సపరివారముగ తమమహారాజగు రణజిత్ సింగ్ యొక్క గోరీవద్ద సమావేశమైరి. తమయనుశ్రితాచారము

ననుసరించి శిక్కు గురువప్పుడు వారి వేదగ్రంథమునుండి తత్కాలోచితమగు బుక్కులను పఠించెను. వారి విధివిహితముననుసరించి గురువు వారికందరికి రొట్టెను, ద్రాక్షాసవమును పంచియిచ్చెను. ఇట్టి ప్రసాదమును పుచ్చుకొని ప్రతివాడు పాంచాళసింహమగు రణజిత్ సింగ్ గోరీపై కప్పిన వస్త్రపు అంచును స్పృశించి, "మేము చచ్చినను, బ్రతికియున్నను సరే, మేమునీతమ్ముడగు యీ బాలమహారాజునెడ భక్తి విశ్వాసములతోనుందు" మని గంభీరముగ ప్రతిజ్ఞావాక్యముల బల్కుచు గోరీ కద్దరినిపోయి నిలుచుండిరి. 1845 సం॥ డిశెంబరు 4 వ తేదీన శిక్కువీరులందరు సట్లెజ్ నదిని దాటి రణభేరి మోగించిరి. "మాక్రిందనున్న రక్షిత రాజ్యములన్నియు వచ్చి సహాయపడవలసినద" ని హార్డింజిప్రభువు పెద్దప్రకటన గావించెను. 32 వేలమంది సైనికులు — చాలమంది యూరోపియన్ దళముతోసహా — యిదివరకేవచ్చి మీరత్ పట్టణము వెలుపల విడిసియుండిరి. ఇతరచోట్లనుండికూడ సైన్యములు బయలుదేరుటకు సిద్ధముగనుండెను. నాలుగు ఘోరసంకులసమరములు జరిగెను. ఈ నాల్గింటియందును శిక్కులు తమ నిర్భయయుక్తమగు శౌర్యప్రతాపముల కీర్తిని చెక్కుచెదరక నిలుపుకొనిరి. తమశత్రువుల కెంతయో ఘోరమగు నష్టమును గలిగించిన పిమ్మటగాని, "సోబరాన్" రణక్షేత్రమందుకూడ సిక్కులుపూర్తిగ ఓడిపోలేదు. "గోలాబ్ సింగ్" అను ఒకానొక శిక్కునాయకుడు మాత్రము యీ యుద్ధమందు ప్రవేశించక దూరముగనుండెను. తనతోడి దేశస్థులందరు వెనుకముందు చూడక,




రంజిత్ సింగ్ (సిక్కు సింహము)



దిలీప్ సింగ్

(రంజిత్ సింగ్ తమ్ముడు — బాలమహారాజు)

గుర్రిడ్డిరణోన్మాదముతో పరుగెత్తుచుండిరని యీతని యభిప్రాయము. కావున, ఆంగ్లసేనాధ్యక్షుడగు "సర్ హ్యూగా" కాసూరులోనుండగ ఆతనివద్దకు రాయబారిగ వెళ్ళి యీతడు ఉభయపక్షములకు సంధిగుదుర్చ జూచెను. సంధిజరిగెను. బీయాస్, సట్లెజ్, నదులమధ్యనున్న రమ్య ప్రదేశమగు జలందర్ పరగణాయావత్తు కుంపిణీవారి కిచ్చి వేయబడెను. దీనితోపాటు యిదివరకే కుంపిణీవారి యధీనములోనున్న మరికొన్నిపరగణాలునుకలిసి యావత్తు "మా కుంపిణీరాజ్యములో కలుపుకొన్నాము" ని ప్రకటించిరి. కోటిన్నర రూపాయిలు యుద్ధపుజరిమానాగా శిక్కులపై విధించిరి. కాని, లాహోరు ఖజానాలో సొమ్ములేనందున కాశ్మీరరాజ్యమును గోలాబ్ సింగుకు అమ్మి శిక్కులు యీ జరిమానాను చెల్లించిరి. లాహోరుసంస్థానములో ఒక బ్రిటిష్ రెసిడెంటును వుంచుకొనునట్లును, సట్లెజ్ నది కావల పదివేల మంది కుంపిణీసైన్యమును వుంచుకొనునట్లును షరతుల విధించిరి. ఈ సైన్య మెందుకట! కుర్రవాడగు దిలీపసింగ్ మహారాజు క్షేమముకొరకై ఆతని రాజ్యములో శాంతిని కాపాడుటకట! శిక్కుసంస్థానముల ప్రత్యేకవ్యక్తిత్వమును, స్వాతంత్ర్యమును అంగీకరింతుమని కుంపిణీవారు యీ సంధిషరతులలో ఒప్పుకొనిరి. దిలీపమహారాజు మైనారిటీలో నున్నంతవరకు తామాతనికి రాచకీయసంరక్షకులుగ (గార్డియనులుగ) నుందుమని వ్రాసయిచ్చిరి. ఈ షరతు దిలీపమహారాజునకు పదునారేండ్లు వచ్చుటతోడనే— లేక 1854 సం॥ సెప్టెంబరు 4 వ తేదితో —అంతమొందవలయునని విధింపబడెను. గార్డియన్ పదవిని

గూర్చిన యీ షరతు యొక్కవ బహిరంగముగ దేశమంతటనూ తెలియపరచవలసినదని హార్డింజిప్రభువు కోరెను. ఏలననగ, యీతడు సైనికుడేగాక, రాచకీయవేత్తకూడాను. ఈతని హృదయమందు భూతదయ యుండెను. నిజాయితీగ, గౌరవముగ నుండవలయుననుబుద్ధి యీతని కుండెను. "బియాస్ నది కావలనున్న మా శిబిరమున కొకసారి మీ మహారాజువచ్చి మాకు దర్శన మివ్వవలయును; తదుపరి, యీ సంధిపత్రి మంగీకరింపబడిన పిమ్మట, నేనుకూడ మీ మహారాజు దర్శనార్థమై లాహోరునగరమునకు వచ్చి మిత్రి భావము నెరపుదునని నేను శిక్కు సర్దారులతో యేర్పాటు చేసికొన్నాను" అని హార్డింజివ్రాసెను. ఈ విషయమై తదుపరి చేసిన ప్రకటనలో గవర్నర్ జనరల్ యిట్లుచెప్పెను. "పసివాడగు మహారాజునకు విద్యాబుద్ధులు గఱపుటలోను, ఆతని సంరక్షించుటలోను నాకతనియందు పితృవాత్సల్యమున్నది. ఈతని రాజ్యములో శాంతి భద్రితల నెలకొల్పుటయే నామనస్సునందున్న పరమసంకల్పము. ఈతని రాజ్యమును సుస్థిరమొనర్చి, యీ మహారాజు యొక్కయు, అమాత్యుల యొక్కయు పేరు ప్రతిష్ఠలను, గౌరవమును, నిలుపుటయే నా మనస్సునందు నేను పెట్టుకొనిన పరమసంకల్పము." ఈ విధముగ గవర్నర్ జనరల్ గారిచే నిర్వచించబడిన సంరక్షణాధికారకాలమందు విక్టోరియా మహారాణీ ప్రతినిధినని పేరు పెట్టుకొన్న యితడు యీ శిక్కు రాజ్యములో తన యిచ్చవచ్చినచోట, తన యిచ్చవచ్చిన వారిని నిలుపుటకును, రాజ్యపు పొలిమేరల నాక్రమించుకొనుటకును అపూర్వమగు

యీ సంరక్షణాధికార భారమును తాను నిర్వహించుటకు గాను లాహోరు పట్టణమందు తనకవసరమని తోచు సైన్య మును నిలుపుటకును, అవసరమయ్యెనట. శిక్కు రాజ్య పరి పాలనకు యావత్తు అక్కడనున్న యింగ్లీషు రెసిడెంటే సర్వాధి కారి. మహారాజా సంరక్షణ కొక చిన్న కౌన్సిలు (సభ) యొకటి యేర్పరుపబడెను. ఈ కౌన్సిలు వారే మహారాజు యొక్క గృహకృత్యముల నన్నిటిని పరిపాలించుట కధికారు లట. ఈ కౌన్సిలుకు యింగ్లీషు రెసిడెంటే ప్రెసిడెంటుగ నుం డునట! ఇక యీ రెసిడెంటు చేతికి అడ్డేమి! మనిషి అనే వాడు యీ లోకములో కోరదగిన యావత్తు అధికారములు మన యింగ్లీషు రెసిడెంటు చేతిలో నుండెను. హార్డింజి నిర్ణ యించిన షరతులలోని భావమేమియో ఆతడే స్వయముగ నిర్వచించి యుండెను. రెసిడెంటు అక్కడ యేరీతిగ నడచుకొనవలెనో అతనికి సలహాచెప్పెను. "నేటివ్పులతో నున్న కౌన్సిలు సభవారు నీతోకూడ అనుసరించి మెలగే ట్లు చేసుకోవడం రాజనీతి. నీ వెల్లప్పుడు యీ ప్రకారం చేయుచుండవలెను" అని హార్డింజి లాహోరులోనున్న యింగ్లీషు రెసిడెంటును మందలించెను. "కావలిస్తే, అందులోనుంచి నీ వెవరినైనా తీసివేయవచ్చును. కొత్త వాళ్లను చేర్చుకోవచ్చును. ఏలననగ, వారందరు పూర్తిగ నీ చేతిలోనే— నీ అధికారములోనే— వున్నారు" అని హార్డింజి వ్రాసెను. ఇక, మిలిటరీ వ్యవహారములలో చెప్ప వలసినదే లేదు— ఈ రెసిడెంటే సర్వాధికారి. ఈతని అధికారమునకొక మితమంటూ లేనేలేదు. హార్డింజిప్రభుపు

లోగడ సీమలో మంత్రివర్గములో పనిచేసియుండెను. అక్కడ మంత్రివర్గములో ఒక్క ప్రధాన మంత్రియే సర్వాధికారి; అతను తలుచుకుంటే తక్కిన మంత్రుల నందరిని డిస్మిస్ చెయ్యవచ్చును. కాని, అంతమాత్రముచేత తక్కిన మంత్రులందరు గడగడ వణుకుచు, నోరుమూసుకొని, కుక్కినపేనుల వలె, పడియుండవలయునను భావమా మంత్రివర్గ సభా నిర్మాణమందు లేదను సంగతి యీ హార్డింజికి పూర్తిగ తెలియును. రాజ్యాంగపు మంత్రులతో కూడుకొన్న యీ మంత్రివర్గ సమాలోచనాపద్ధతి చెడ్డదికాకపోగా, పైగా, రాజ్యపు స్థిరత్వమునకును, పటిష్టతకును, చాల ఉపకరించునను సంగతి హార్డింజికి అనుభవమువలన పూర్తిగ తెలియును. ఈ పద్ధతి ప్రకారము కొన్నాళ్లు లాహోరులో రాజ్యపరిపాలనచేసి చూడగ యిది నిష్ప్రయోజనముకాక, చాల పనికి వచ్చేటట్లే కనిపించెను. "న్యాయముగ, సహేతుకముగ తాను పొందదగిన సహాయమునంతను శిక్కు దర్బారు వారు మన యింగ్లీషు రెసిడెంటుకు చేయుచునే యున్నారు. ఈతని నుండి తప్పించుకొని, తామే యధికారుల మగుదమని వారప్పుడప్పుడు కొంచెము నెమ్మదిగ ప్రయత్నించుచుండిరి. కాని, యీ పనిని మన రెసిడెంటు సాగనిచ్చేవాడు కాడు. అతడీ పనిని పైకి వారందరితోను బహుమర్యాదగ వుండే చేస్తూవుండేవాడు. ఇప్పుడిప్పుడు యీ కౌన్సిలులోని మెంబర్లందరు క్రమక్రమముగ మన దోవలోకి వస్తూవున్నారు." ఫరవాలేదు. ఇదొక మాదిరిగ నయమే. సార్వభౌమునకును, సామంతరాజునకును మధ్యగల సంబంధమును న్యాయముగ

నిర్ణయింపబూనుటకిది యొక నిజాయితీయైన ప్రయత్నమని మాత్రము చెప్పవచ్చును. అంతే. ఇది అచ్చముగ, కేవలము, ఆదర్శప్రాయమైన ధర్మకార్యమని చెప్పుటకు వీలు లేదు. ఆట్టే లోతుగదిగి విచారించిచూస్తే యిది కేవలము నిర్దుష్టమైన కార్యమని చెప్పుటకు వీలులేకపోవచ్చును. దీనికి అంతు యెక్కడికి ? రాచకీయతత్వశాస్త్రరీత్యా చర్చపెంచితే పెద్దగ్రంథ మౌతుంది. కాబట్టి, అంతదూరముపోయి ప్రయోజనములేదు. ఏదో సంసారపక్షముగ,—అతి ధర్మలేశములు వెతకకుండా—చూస్తే, యిదే కొంచెము గుడ్డిలో మెల్లగ-నయముగ— కనిపించుచున్నది. తెలుసుకోదగిన వారందరికి యిది సులువుగ అవగాహన అవుతుంది. (ఆట్టే లోతుకుదిగితే యెవరికి తెలియదు). దీనివల్ల మనకు చేలోకువైన రాజ్యాల వారిఆత్మగౌరవమును కాపాడి వారి విశ్వాసమును సంపాదించుకొన్నట్టావుంటుంది ; మన సామ్రాజ్యపు శాంతిభద్రతలను కాపాడుకొని,దానిని బలపరుచుకొన్నట్టావుంటుంది.(ఉభయత్ర లాభముగ వుంటుంది). కాని, అదేమి కర్మమోగాని, యీ పద్ధతి రుచించనివారు ఉభయపక్షములందును వుండిరి. చివరి కెట్లైతేనేమి వీరందరు చేరి యీ పద్ధతిని చెడగొట్టిరి. "ఎదురులేని సర్వంసహా కేంద్రాధికారము యథేచ్ఛగ విహరించే పద్ధతివుంటేనేగాని యిండియాలో యేపనీ సాగదండీ" అని చెప్పేవారికి మరింత అలుసైనది. కాని, వక్రగతినొందని సత్యమునుమాత్రము పరిశీలించి చూచినయెడల పైయభిప్రాయము సరికాదని తెలియగలదు. ఏదేశముగాని తప్పులు చేయకుండ, విఘ్నములు రాకుండ, రాజ్యాంగ నిర్మాణ

మును నేర్చుకొనలేదు. అయినను, జీవితములో యితర పాఠములన్నిటికన్న, యిదే యెక్కువగ నేర్చుకొన దగినదై యున్నది.

చంచలయగు అదృష్టదేవతయొక్క వక్రగతులచే వంచింపబడక, నిశ్చంచల దేశాభిమానముతోడను, అజేయమగు ధీరతతోడను నిండి యీ భరతఖండమందనేక వీరాధివీరులను, వీరమాతలను కన్న సుప్రసిద్ధ శిక్కువంశమందు జన్మించినది యీరాణీ "చందాదేవి"— రణజిత్‌సింగ్ నృపాలుని అర్ధాంగి. ఆంగ్లరాజ్యాధిపత్యమునకు విరోధమగు పాఠముల నీతడు (దిలీప్‌సింగ్) చిన్నప్పుడే నేర్చుకొన్నట్లు సూచనలగుపించెను. ఈపాఠముల నీతనికెవరు నేర్పిరో సులభముగ గ్రహింపవచ్చును. బ్రిటిష్‌రాజ్యమును త్రోసివేయు పన్నాగమొకటి బయిటపడినదని చెప్పి, దీనినొక మిషగ పెట్టి, తల్లిని కొడుకును విడదీసిరి. రాణీనితీసికొనిపోయి "శికాపురము" కోటలో విడిగనుంచిరి. రాజ్యాధికారమును లాగివేసి, చుట్టు యెంత ఫారావేసినను, ఆమెధీరత్వము పౌరుషము మాత్రము అణగిపోలేదు. ఆమెవిడుదలకై అనేకవేల రహస్యమంత్రాంగములక్కడ నిత్యము జరుగుచుండెను. ఈ పాతాళహోమముల కన్నిటికి శికాపురపుకోట కేంద్రస్థానమయ్యెను. పైకి చిల్లర అలలెన్నిలేచినను ప్రవాహము మాత్రము ప్రశాంతముగ, నిశ్చంచలముగ, సాగిపోవుచున్నట్లే కనుపించెను. తాను యిండియాను విడిచి వెళ్లిపోయేరోజున హార్డింజి ప్రభువేమని ప్రగల్భములు కొట్టెను ? "పంజాబు దేశమంతయు మాటు మణగి చాల ప్రశాంతముగనున్నది" అని వ్రాసెను.

ఈతడింత ధైర్యముతో, నమ్మకముతో, వ్రాయుట కింకొక హేతువేమనగా:— "సట్లెజ్ నదీ లోయయందు ఆయువు పట్లవంటి చోట్ల ఖాయముగ 50 వేల యింగ్లీషు సైన్యమును 60 ఫిరంగులను నిలిపినాము. ఇక సిక్కు బలమో నాలుగేండ్ల క్రిందట 85 వేల సైన్యమును, 350 ఫిరంగులును గలిగినది యిప్పుడు అక్కడక్కడ చెదరిపడియున్న మొత్తము 24 వేల మందితోను, 50 ఫిరంగులతోను మాత్రముండి మన యింగ్లీషు రాజ్యపు పొలిమేరకు రెండురోజుల ప్రయాణపు దూరములో నున్నది."

హార్డింజి పరోక్షమందు డాల్హౌసీ ప్రభువు యిండియాకు వైస్రాయిగ వచ్చెను. ఈతడు కలకత్తాలో కాలుపెట్టగానే అన్ని తరగతులవారు యీతని నెంతయో ఘనముగ కీర్తించిరి. ఒక పత్రిక యీతని నిట్లు ప్రశంసించెను. "డాల్హౌసీ మంచి అనుకూల తరుణములో యిండియాకు వచ్చినాడు. ఇండియాదేశమును సంపూర్ణముగ, తిరిగి లేవకుండ, నిద్ర పుచ్చుటానికి యిదివరకు ఒక్కటే ఆటంకముండెను. ఆ యాటంక మిప్పుడు తీరిపోయినది. మనకు కొంచెము భయమును కలిగించే ఆ ఆఖరు సేన—శిక్కుసేన— కూడ నశించిపోయినది. దేశమందు శాంతి శాశ్వతముగ, గట్టి పునాదులమీద, నాటుకొని పోయినది. (ఇక భయములేదు). ఏ దేశీయరాజుల స్వాతంత్ర్యనిరతియు, మన యెడ వారికి గల విరోధభావమును, వెనుకటి వైస్రాయీల మనస్సులకు కలవరకారణముగ నుండెనో— ఆ రాజులందరిని యిప్పుడు మనము నిరాయుధుల గావించితిమి. ఇటు సింధునది మొదలు అటు కన్యాకుమారి

అగ్రిమువరకు మనపై ఒక్క ఫిరంగివేటునుకూడ పేల్చు వాడిక కానరాడు" అని "ఫ్రెండు ఆఫ్ యిండియా" యను పత్రిక వ్రాసెను. రాచకీయవాతావరణము బహుప్రశాంతముగ నుండెను. ఒక్క పిల్లగాలియైనను యిటుఅటుకదలుటలేదు. కాని, యీ శాంతి ప్రజాసంతుష్టితో కూడిన శాంతికాదు—తుపాను రేగే ముందువుండే శాంతియిది. అత్యంత పౌరుషశాలురగు శిక్కులు తమకు వెనుక సోబరాన్ రణక్షేత్రమందు గలిగిన పరాజయముచే—అందువలన తమపై విధింపబడిన దాస్యశ్రృంఖలములచే— మిక్కిలి వంచితులై వాని నెట్లయిన బలాత్కారముగ త్రెంచివేయుటకై లోలోన నిశ్శబ్దముగ తగు సన్నాహముల గూర్చుకొనుచుండిరి. ఈ ప్రశాంతమునకు కారణమిది. లాహోరులో కుంపిణీవారు నిలవ యుంచిన పదివేల బాకులును, కూతవేటు దూరములో నున్న అంతకు మూడురెట్లు బాకులునువచ్చి దేశీయులకు యీ ఫరంగీరాజ్యముపై గల క్రోధమును అదిమిపెట్టియుంచ వచ్చును. ఈ ఫరంగీలు తమ తురకనౌకర్లచే హిందూప్రజలపై గావింపించు అత్యాచారములను వారు కొంతకాలము సహించునట్లు అణచిపెట్టియుంచవచ్చును. కాని, యీ క్రోధము నెన్నడును వారు పూర్తిగ నశింపుచేయలేరు.

రాజ్యపరిపాలన యింకను బాలుడగు దిలీపమహారాజు పేర నే జరుపబడుచుండెను. శిక్కుప్రముఖులతో కూడుకొనిన రీజెన్సీకౌన్సిలుసభయే దేశీయుల దృష్టిలో పైకిగాన్పించు రాజ్యాధికారముగనుండెను. నిజముగ, అసలు రాజ్యాధికారమును చలాయించుచున్న విదేశీయాధికారమునకు పైకి

దేశీయబురకాను తొడిగిరి. "దేశీయప్రముఖుల అధికారము లను తీసివేస్తాము" అని యింకను బహిరంగముగ అనలేదు. కాని, మొదటిరోజులలో కుంపిణీవారు బంగాళాదేశములో చేసినట్లుగ ప్రజలనుండియు రాజులనుండియు అపారమగు ధనమును మాత్రములాగి, వారిని పరమదౌర్భాగ్యులనుగ జేయుచుండిరి. ప్రజారంజకుడగు రాజయొక్క అధికారగౌర వముల నెప్పుడుపట్టిన నప్పుడు తీసివేయుదుమను అభిప్రాయ ములు బహిరంగముగ తెలియుచుండెను. ఈ కారణముచే ప్రజలలో నిదివరకే నివురుగప్పిన నిప్పువలె నణగియున్న క్రోధానలమును విసనకర్రతో విసరి మహాజ్వాలగ రాజేసినట్లయ్యెను. ముల్తాన్ రాష్ట్ర పరిపాలకుడగు మూల్ రాజనునతడు లాహోరు దర్బారు వారికి 18 లక్షలరూపాయ లివ్వవలసియుండెను. తన కీ పదవి యిచ్చి నందుకుగాను యీ సొమ్మును— నజరానాను— లాహోరు దర్బారువారి కిచ్చుట కీత డంగీకరించెను. ఈ సొమ్ము తక్ష ణమే చెల్లించవలసినదని దర్బారు తరఫున కుంపిణీ రెసి డెంటు మూలరాజు నడిగెను. ఆ ప్రకారము మూల్ రాజు సొమ్మునంతయు చెల్లగట్టెను. ఇది చాలక సాలుకు అతడు 9 లక్షల పైక మిచ్చుచుండునట్లుకూడ యేర్పాటు చేసిరి. ఈ మొత్తమును "నే నిచ్చుకోనజాల" నని అతడు కొన్నిదినములైన పిమ్మట చెప్పుకొనెను. కాని, యీ మార్పుకు రెసిడెంటు ఒప్పుకొనలేదు. ఇక వీరితో తాను తగవులాడుట కిష్టములేక, "పోనీలెండి, నాకీ ముల్తాన్ గవ ర్నర్ పదవి వద్దు. నేను వదలుకుంటాను; అనుకూలమైన

వారిని యింకెవరినైనా నియమించుకొనండి; నా మనువృత్తికై యేదైనా చిన్న జాగీరు యిచ్చి నన్ను వదలివెయ్యండి. నేను వెనుకటి బాకీయావత్తు చెల్లించివేసినట్లు నాకు రశీదుయిచ్చి పంపివెయ్యండి" అని మూల్‌రాజు చెప్పెను. కాని, రెసిడెంటు అతని నింకను బహు కఠినముగ పిండవలెనని తలచెను.

ఇది బహు కఠోరమైన ప్రవర్తన. "కావలిస్తే, మూల్‌రాజు తన ఉద్యోగమును వదలుకొని వెళ్లవచ్చును; అంతేగాని, అతనికి పింఛను, గింఛను, యివ్వడానికిమాత్రం వల్లకాదు; అదిగాక, పదేండ్లనుండి ఆత డివ్వవలసిన లెక్క యావత్తుయిచ్చి మరీ కదలవలెను" అని కర్కోటక షరతుల విధించెను. "ఆ పాతకాగితాలన్ని— మా తండ్రినాటి కాగితాలు— నా కిప్పు డెక్కడ దొరుకుతవి? అవన్ని చదలు తినివేసినవి; ఒకవేళ, యెక్కడైనా యేవైనా మిగిలినా, అందులో యీ లెక్క లేమికనుపించును? వానివల్ల ప్రయోజనమేమికలుగును?" అని రెసిడెంటుయొక్క భ్రూభంగములచే తాడితుడగు మూల్‌రాజు మనవిచేసికొనెను. "వీరి చేతిలో చిక్కియున్నాను; వీరు నన్నెట్లును నాశనము చేయువరకు విడిచిపెట్టరు; గావున, యిక పెనగులాడి ప్రయోజనమేమి?" యని మనస్సులో అనుకొని, "ఇక మీ చిత్తము; మీ చేతిలోచిక్కియున్నాను" అనెను మూల్‌రాజు. ఈ మాటలకు "నా ఉద్యోగాన్ని వదలుకొన్నాన" ని అర్థమట! నీ "ఉద్యోగం తీసివేసి, నీ స్థానములో యింకొకరిని నియమించినాము" అని ఆతనికి వెంటనే నోటీసు నిచ్చిరి!

1848 సం॥ యేప్రిల్ 14 వ తేదీన క్రొత్త గవర్నరు గారగు సర్దార్ ఖాన్ సింగును వెంటబెట్టుకొని యింగ్లీషు రెసిడెంటును, యింకొక యింగ్లీషు యేజెంటును ముల్తాన్ నగరమునకు విచ్చేసిరి. నగరము వెలుపలనే పదభ్రష్టుడగు దివాన్‌తో యేమేమో ముచ్చటించిరట. 19 వ తేదీన రాజమందిరమును స్వాధీనపరచుకొని, తాళపుచెవులను క్రొత్త గవర్నర్ అగు సర్దార్ ఖాన్ సింగుగారికి వప్పగించిరి. పాత పారావాళ్లను తీసివేసి క్రొత్తవాళ్లను పెట్టిరి. పదభ్రష్టుడైన మూల్‌రాజును అతనిపరివారమును కోటగుమ్మము దాటి వెలుపలనున్న తమశిబిరమునకు వచ్చుచుండగ శిక్కుల ప్రధమ సంక్షోభము కన్నులయెదుట పొడగట్టెను. కొందరు శిక్కులు చెలరేగి యింగ్లీషు ఆఫీసర్లపైబడిరి. వారికి బాగుగ గాయములు తగిలెను. కాని, యెట్లెట్లో తప్పించుకొని పారిపోయి తమ గుడారములలో దూరిరి. "మీరందరు యీక్రొత్త గవర్నర్‌గారి ఆజ్ఞలప్రకారం నడుచుకొనవలసిన దోహో" యని యింగ్లీషు రెసిడెంటు ముల్తానులోనున్న ప్రజాప్రముఖుల కందరికి వర్తమానముపంపెను. "మూల్‌రాజెమాకు నాయకుడు; మేమందరము—హిందువులము, శిక్కులము, ముసల్మానులము— మా పవిత్ర వేదగ్రంథములగు, "గురుగ్రంథము" పైనను, "కొరాను" పైనను ప్రమాణముచేసి యిదే చెప్పుచున్నాము—మేము మా మూల్‌రాజుపక్షముననే నిలిచి పోరాడుదుము" అని ముల్తాన్ ప్రముఖులందరు వెంటనే రెసిడెంటుకు ప్రత్యుత్తరముపంపిరి. ఇక్కడ శిక్కులు తిరుగబడ్డ సంగతి అప్పుడే లాహోరుమున్నగు చోట్లకు వర్తమానములు

పంపబడెను. ఇతరచోట్లనుండి సహాయము వచ్చువరకు యిక్కడ యిద్దరు యింగ్లీషువారుండి యెల్లెట్లో ఖాౝసింగు సహాయముతో ఆత్మరక్షణ గావించుకొనుచుండిరి. కాని అసంతృప్తియను అంటుజాడ్యము వీరికి పారాయున్న 500 మంది లోకూడ వ్యాపించెను. సాయంకాల మగునప్పటికి యీ 500 మందికూడ వీరిని వదలిపెట్టి పోయిరి. ఇక వీరికి యింటి లోనున్న కొలదిమంది నౌకర్లును, 5,6, గురు శిపాయిలును తప్ప యింకెవరును దిక్కులేకుండిరి. ఎవరైనా వచ్చిమీద పడితే వీరిపని వట్టిదే. ఈపనియు త్వరలోనే జరిగెను. మహోద్రేకముతోనున్న శిక్కుగుంపులు గాయపడియున్న యింగ్లీషువారియొక్క గదులలో ప్రవేశించి, వారినిచంపి, వారితలలను నరికి, ముల్తానులోనున్న రాజమందిరములోనికి కొనిపోయిరి.

మొదటి తిరుగుబాటులోగాని, తదుపరి జరిగిన యీ మారణ కృత్యములోగాని, మూల్‌రాజుకు కించిత్తయినను సంబంధమున్నట్లు చెప్పుట కెక్కడను సావకాశములేదు. అదిగాక, యీ విషాదవృత్తాంతము జరిగిన పిమ్మట తిరుగుబాటుదార్ల నాయకులు వ్రాసియిచ్చిన స్టేటుమెంటును బట్టి చూడగ యీ కుట్రలో మూల్‌రాజున కెంతమాత్రము జోక్యములేనట్లు స్పష్టపడుచున్నది. శిపాయిలును, మరికొందరు శిక్కు గురువులును కలిసి యీ కుట్రపన్నినట్లే తెలియుచున్నదిగాని, యిందు మూల్‌రాజున కేమియు సంబంధమున్నట్లెక్కడను కానరాదు. తమ నాయకుడగు మూల్‌రాజును పదభ్రష్టుని గావించుటచే శిపాయిలకు చాలక్రోధముగలిగెను. పైపెచ్చు, ఆతనిస్థానమం

దొంగానొకని—— యింగ్లీషువారి మోచేతిక్రింది నీళ్లు త్రాగే సన్యాసినొకని—— యిద్దరు ఫరంగీ వెధవలు వెంటబెట్టుకొని వచ్చి, యెప్పుడైతే తమ మూల్‌రాజు కూర్చునే తక్తుమీాద కూర్చుండ బెట్టినారో అప్పుడే శిక్కు గురువులకును, శిపాయిలకును పట్టరాని వెర్రికోధము పుట్టుకొనివచ్చెను. ముల్తాన్‌లో గలిగిన యీ శిపాయిల సంక్షోభమువలన లాహోరులో మరికొన్ని అనుమానములు పుట్టుటకు కారణమయ్యెను. ఖైదులో నున్నరాణియు, దర్బారులోనున్న ప్రతిసర్దారును కూడ—— వీరందరుకలిసి యేదో గొప్ప కుట్ర చేయుచున్నట్లు కుంపిణీవారు ఉలికిపడిరి. "రాణీమీాద బహిరంగముగ యేదైనా చర్యతీసుకుంటే మనకొంప మునుగుతుంది. ప్రజలలో దేశాభిమానము పొంగి పొరలి మనలను ముంచివేస్తుంది; యీ పద్ధతి మనకెంతయు ఉపద్రవకరము. కాబట్టి, యీమెను రహస్యముగ గొంపోయి యెక్కడైనా దాచుదాము" అని కుంపిణీవారూహించిరి. ఆమెను ఆకస్మికముగ ఒకనాడు యెవరికి తెలియకుండ రహస్యముగ యెత్తుకొనిపోయి కాశీ పట్టణములో—— అపాయములేనిచోట—— దాచిరి. ఇక్కడి లాహోరులో తక్కిన చిల్లర ప్రముఖులను కొందరిని పట్టుకొని, లాహోరు కోట గుమ్మమువద్ద ఉరిదీసి, ప్రజల కెల్లరకు భయకంపమును గలిగించిరి.

మొట్టమొదట ముల్తాన్‌లో శిక్కుశిపాయిలు తిరుగబడుటకును, తదనంతరము వారు యింగ్లీషువారిని చంపుటకును మధ్యగల కొలదికాలములో సదరు యింగ్లీషువారెట్లో యీవార్తను లాహోరు రెసిడెంటుకును, సింధునదిమీాద ఫత్తేన్‌ఖాన్

పట్టణములోనున్న తమ సైన్యాధ్యక్షుడగు ఎడ్వర్డ్సుకును పంప గలిగిరి. ఈవార్త తనకు చేరినవెంటనే ఎడ్వర్డ్సు తన దేశస్తులను సంరక్షించుటకై పరుగుపరుగున ముల్తాన్‌కు సైన్యసమేతముగ వచ్చెను. కాని, ఆతడు వచ్చునప్పటికే యిక్కడ సర్వము ముగిసెను. తనదేశీయులగు యింగ్లీషువారు మడిసిరి. శత్రుసేనలు అసంఖ్యాకములుగ నుండుటచే ఆత్మసంరక్షణార్థమై ఎడ్వర్డ్సు యెట్లో కొంతకాలము పోరాడవలసివచ్చెను. ఇంతలో, యింగ్లీషువారికి మిత్రుడగు భవల్పూరునబాబువచ్చి యీాతనికి తోడ్పడుటచే ఎడ్వర్డ్సు మూల్‌రాజును "కినెయూర్" వద్ద ఓడించగలిగెను. తదనంతర మొకనెలదైన పిమ్మట "సుదాసెక్" అనుచోట మూల్‌రాజు మరల ఓడిపోయి ముల్తాన్‌నగరములో దాగెను. ఈ ఎడ్వర్డ్సు యొక్క అత్యద్భుతమేధాశక్తి, సామర్థ్యముల వలననే పంజాబులో యింగ్లీషువారి గౌరవము, పలుకుబడి, నిలిచినది. శిక్కులలో తిరుగుబాటు కలుగగనే, తనకు వెంటనే సహాయము పంపవలసినదని చెప్పి లాహోరులోనున్న రెసిడెంటు కలకత్తాలోనున్న గవర్నర్‌జనరలున కెంతయో ఆతురతతో కబుర్లమీద కబుర్లుపంపెను. లాహోరులో తనవద్దనున్న యూరోపియను శిపాయిల నందరిని ముల్తాన్‌పంపివేస్తే, యిక్కడ లాహోరులోనున్న యింగ్లీషువారిగతి యేమౌతుందో అని రెసిడెంటు భయపడెను. లాహోరులోనున్న యింగ్లీషువారి నందరిని దేశీయుల దయాదాక్షిణ్యములకు నమ్మి వదలుటకు వీలులేదని రెసిడెంటు భయపడెను. పోనీ, శిక్కు శిపాయిలనే ముల్తాన్‌కు పంపుదామాఅంటే, వీరంతా పోయి

శత్రుపక్షములో చేరుతారేమోఅని భయము! ఇది మరింత అధ్వాన్నముగ నుండునుగద. కాబట్టి, కలకత్తానుండి తక్షణం సహాయము పంపిస్తేనేగాని వీలులేదని రెసిడెంటు వ్రాసెను. ఈ అవమానమునకు తగిన ప్రతీకారం మనము చేస్తేనేగాని—అందులో వెంటనే చేస్తేనేగాని—వీలులేదు. లేకపోతే, అటువైపునుండి ఆఫ్ఘనులు వచ్చి సింధు నదిమీద పీఠము వేసికొని కూర్చుంటారు. సట్లెజ్ నదికి అద్దరినున్న జాతుల వారందరు తిరుగబడతారు. వేలకొలది శిక్కులు వచ్చి మూల్‌రాజుతో చేరుతారు. "శిక్కు రాజ్యమును తిరిగి యీతడు పునఃప్రతిష్ఠిత మొనర్చునని శిక్కు గురువులు జోస్యము చెప్పుచున్నారు. ఈ జోస్యమును నిజ మొనర్చుటకై వేలకొలది శిక్కులు ఆవేశముతో వచ్చి మూల్‌రాజుకు మద్దతు చేయుదురు" అని రెసిడెంటు యెన్నియో విధముల వ్రాసెను. కాని, కలకత్తాలోనున్న సైన్యాధ్యక్షుడు అప్పుడు యుద్ధకార్యములకై పూనుకొనుటకు సాధ్యపడదని చెప్పెను. సైన్యముల నిప్పుడు పశ్చిమోత్తర పరగణాలకు పంపవలసినంత అవసరమేమియు కాన్పించదని సైన్యాధ్యక్షుడు చెప్పెను. ఈ అభిప్రాయముతో గవర్నర్ జనరలును యేకీభవించెను.

తమ స్వదేశీయులగు శిక్కులను ఉరిదీయుట, దేశము నుండి వెడలగొట్టుట, ప్రతివారిమీద బహిరంగముగ అనుమానపడుట,— యీ మున్నగు కార్యము లన్నియు యిదివరకే అసంతృప్తులై యున్న శిక్కుప్రముఖులను, శిపాయిలను, మరింత రెచ్చగొట్టెను. వెనుకటి యొడంబడికలను, వాగ్దానములను,

కుంపిణీవారు మంటగలిపి, దేశీయాచారముల నావలికి త్రోసి వేసి, తమయిచ్చవచ్చిన రీతిని చెలరేగి చేయుచున్న పనుల నన్నిటిని బట్టిచూడగ, శిక్కువంశమును, శిక్కురాజ్యమును పూర్తిగ కూలద్రోయుటకై కుంపిణీవారు సంకల్పించుకొన్నట్లు స్పష్టమైనది. ఇదిగాక, తమ రాణీని రహస్యముగ గొంపోయి యెచ్చటనో దాచుటవలన శిక్కులకు మరింత క్రోధముగలిగెను. ఇదివరకు యేపక్షమునను చేరక అటుయిటు ఊగులాడుచున్న మహాబలవంతులగు శిక్కుసర్దారులందరు స్వప్రజాపక్షమున చేరుటకు ఒక్కుమ్మడిగ నిశ్చయించుకొనిరి. "మహారాణిని తనబిడ్డకును, ప్రజకును యెడబాపి మనము రహస్యముగ గొంపోయిననాటినుండి శిక్కుప్రజలలో మహాతీవ్రమగు కోపానలము చెలరేగుచున్నది. పైకికనబరచు దానికంటె లోలోపల నెంతయేని క్రోధజ్వాలలు రగుల్కొను చున్నవి." దీని విషయమై అసంతృప్తుడైన షేర్‌శింగ్ అను ఒకానొక శిక్కుసర్దారుచేసిన ప్రకటన నిర్భోగ మోటము గను, నిరాతంకముగను యీ సంగతిని యావత్తు వెల్లడించు చున్నది. ఆతడీ ప్రకటనయందిట్లువ్రాసెను:— "మహారాజా రణజిత్‌సింగ్‌గారి అర్ధాంగియగు మన మహారాణీని యీ ఫరంగీలు యెంత దౌర్జన్యముతో, యెంత క్రౌర్యముతో, పీడించి, హింసించి, అవమానపరచిరో సజ్జనులగు శిక్కుప్రజల కెల్ల రకు— వేయేల లోకమునకంతకు— తెలిసియేయున్నది. ఈ మనదేశప్రజలపై యెన్ని క్రూరఘాతుకకృత్యము లొనర్చి నదికూడ యెల్ల రెరింగియేయున్నారు. మన ప్రజల కందరకు కన్నతల్లియగు యీ మహారాణిని చెరసాలయందు ద్రోసి,

ఆమె నెచ్చటికో పంపివేసిరి. ఇది కుంపిణీవారు మనతో చేసి కొన్న ఒడంబడికకు కేవలము విరుద్ధము. ఈ ఒడంబడిక నీ రీతిగ భంగపుచ్చుట కుంపిణీవారు చేసిన మొదటితప్పు. కుంపిణీవారి క్రూరపరిపాలనవలన మనయీ శిక్కుజాతి పడరాని యిడుముల పాలైనది. అందుచే, మన మతధర్మములకే భంగమువచ్చెను. మన మతధర్మముల నన్నిటిని కుంపిణీవారు పెరికివేసిరి. ఇది రెండవతప్పు. ఇదిగాక, మన శిక్కురాజ్యఖ్యాతిని లోకమందు రూపుమాపిరి. ఇది మూడవతప్పు. ''

కుంపిణీ వారీ రీతిగ మహారాణిని దేశాంతరములపాలుజేసి గావించిన నిరంకుశ చర్యవలన దేశప్రజల మనస్సులందెట్టి తీవ్రభావములు—— కుంపిణీ రాజ్యమున కపాయకరములగు భావములు—— ఉత్పన్నములయ్యెనో లాహోరునందు రెసిడెం టుగనున్న యింగ్లీషువాడే కలకత్తాలోనున్న గవర్నర్ జనరల్ కు వ్రాసెను. దానివలన కుంపిణీవారి శిబిరమందున్న శిక్కు శిపాయీలలో తిరుగుబాటు పుట్టెను. "మా మహా రాణీ పోయినది; బాలుడగు మా మహారాజు మీ కుంపిణీ వారి చేతులలో చిక్కియున్నాడు. ఇక మేము మా మూల్ రాజు నెదిర్చి యేమి ప్రయోజనము? కాబట్టి, యీ కుంపిణీ సైనికోద్యోగులనందరిని పట్టి పల్లార్చి మా మూల్ రాజుతో పోయి చేరుదుము'' అని కుంపిణీ కొలువులోనున్న శిక్కు శిపాయిలందరు మెుకుతిరిగి బహిరంగముగ ప్రకటించిరి! ఈ సంగతులను యావత్తు యింగ్లీషు రెసిడెంటు కలకత్తాకు వ్రాసెను. "శిక్కులు రోజురోజు మహా అసంతృప్తు లగుచు న్నారుసుమా! జాగ్రత్త "అని యింగ్లీషువారికి స్నేహితుడును,

కాబూల్ పరిపాలకుడును అగు దోస్తు మహమ్మద్ కూడ లాహోరులోనున్న రెసిడెంటుతో హెచ్చరించి చెప్పెను. "అందు ముఖ్యముగ, మీరు మహారాణీయెడ గావించిన అత్యాచారమే శిక్కులను మరింత రేపెట్టుచున్నదిసుమా" యనికూడ అతడు చెప్పెను. వారి గృహముల యెడలను, స్వదేశమునెడను, శిక్కులకు అత్యంత అభిమానము గలదు. ఈ దేశాభిమానమను ఉన్మాదము వారి మనస్సులకు గట్టిగ పట్టుకొని యున్నది. కాబట్టి, రాజకీయ నేరములకై దేశము నుండి వెడలగొట్టుట యను శిక్ష వారికి మరణదండనకంటె హెచ్చుగ నుండును. కాబట్టి, "యిట్టి శిక్ష చాల నీచమనియు, ఆక్షేపణీయమనియు శిక్కులు భావింతురు. దీనికంటె మరణదండన విధించిన మేలని శిక్కులలో గొప్పవారు కొద్దివారుకూడ భావింతురు" అని దోస్తుమహమ్మదు యింగ్లీషు రెసిడెంటుకు వ్రాసెను. దేశీయ రాజులతో వ్యవహరించునప్పుడు ధర్మము, న్యాయము అను మాటలను బొత్తుగ పాటింపకుండ కుంపిణీవారు మొట్టమొదటినుండి యెట్లు ప్రవర్తించుచువచ్చిరో యనుదానికిది మరియొక నిదర్శనముగ నున్నది. ఇది బ్రిటిష్ యిండియా చరిత్రయందు పరిపాటైపోయినది. రణజిత్‌సింగ్ భార్య మొదటినుండియు పంజాబులో యింగ్లీషువారి రాజ్యమునకు విరోధురాలనుమాట నిశ్సంశయముగ నిజమే. అందులో సందేహమేమియు లేదు. కాని, ఆమె తక్కినవారితో కలిసి కుట్రచేయకుండ కుంపిణీవారు యెక్కువ జాగ్రతగ బందోబస్తు చేసికొనివున్నట్టయితే క్రమ క్రమముగ ఆమెపలుకుబడి తగ్గిపోయెడిది. "ఆవిడ ఆజ్ఞవిని

తుపాకి బుజానపెట్టుకొనే శిపాయి ఒక్కడూ లేడు" అని ఆ రోజులలో దేశీయుల మనోభావములను బాగుగ గుర్తించిన ఒకానొక పెద్దమనిషి వ్రాసెను. "కాని, తమకు మహా రాణీయను నామె ఒకతెవున్నదను సంగతిని మాత్రము ప్రజలు మరచిపోలేదు. ఏలననగ, ఆమె వారికి మరచుదమన్నను మరపునకురాదు. ఇట్టిస్థితిలో రెసిడెంటుచేసిన అవివేకపుపని వలన ఆమె తన స్వదేశముకొరకై కష్టము లనుభవించుచున్న వీరమాత యను నభిమానముద్రి శిక్కులందరి మనస్సులందును గాఢముగ నాటుకొనెను." గాఢమగు అనుమానమునకు కారణమున్నను, తీరా, కోర్టులో, "లా" ప్రకారము బుజువు పరచమంటే ఆమెమీాద సాక్ష్యమేమియు దొరకదు. "అయి నను, మనపై రాజద్రోహము చేయుచున్నారని అనుమాన మున్న వారినందరిని తగురీతిగ శిక్షించి, మన బ్రిటిష్ గవర్న మెంటుయొక్క గౌరవమును, స్థిరత్వమును, కాపాడుకొనుటకు మనమిప్పు డెంతమాత్రమును వెనుకముందు లాలోచింపవలసిన రోజులు కావివి" అని రెసిడెంటు వ్రాసెను. అయితే, కుం పెణీవారికి పంజాబులో యీస్థితి,—యీ రాజ్యాధికారము— యెట్లు లభించినది? దేశీయ సర్దారులతోకూడ కలిసి జాయంటు ట్రస్టీలుగ దేశమును పరిపాలించవలయునని కాసూరు మున్నగు చోట్ల చేసికొన్న ఒడంబడికలను బట్టికాదా వీరి కీస్థితి పంజా బులో లభించినది? ఇంకొక విధముగ వా రిచ్చుట ప్రవర్తించు టకు వీలే లేదుగద! రాజ్యాధిపత్యమునకు నిజముగ హక్కు దారుడు మైనరుగనున్న దిలీపసింగు. ఈతడు మేజరు కాగానే, యితని రాజ్య మితనికి యిచ్చివేయవలసియే యున్నదిగద.

కాని, మహారాణీని రాజ్యమునుండి వెడలనడచు హుకుముపై రీజెన్సీ కౌన్సిలులోని మెంబర్లందరు సంతకములు చేసిరి. వీరిలో ఒకడు రాణీకి గర్భశత్రువని అందరెరింగిన విషయమే. మిగత యిద్దరు భిన్నమత శాఖకు చెందినవారు. అధికసంఖ్యాకు లీ హుకుముకు ఒప్పుకొన్నారని పైకి చూపించుటకుగాను వీరిలో నొకని తమ్ముడగు యింకొకనిచేతకూడ సంతకము చేయించిరి! కాని, యీ హుకుముకు మతలబు వ్రాసిన దేశీయుడు మాత్రము తన ఉపోద్ఘాతమును బహుచమత్కారముగ వ్రాసి యీ దొంగనటనను బయలుపుచ్చెను. "సర్ ఫ్రెడరిక్ కర్రి, ఫకీర్ నూరుద్దాలాగార్ల సలహావల్ల యీ హుకుము జారీచేయడమైనది" అని ఆతడు ఉపోద్ఘాతములో వ్రాసెను. వీరిలో మొదటివాడు యింగ్లీషు రెసిడెంటు; రెండవవాడు రెసిడెంటుకు అంతరంగికుడగు మహమ్మదీయుడు. "సరియైన విచారణచేసి, ఆమె శిక్షార్హురాలని చెప్పుటకు తగు సాక్ష్యమెక్కడను దొరకదని" రెసిడెంటు చెప్పినమాట నిజమే. ఏల ననగ, రెసిడెంటుఉత్తరువు ప్రకారము ఆమెయింటిని, పెట్టెలను, కాగితములను సోదాచూచినప్పుడు అందు అనుమానాస్పదమగు కాగితమొక్కటియు దొరకలేదు. తనపైమోపిన నేరమును తగురీతిని విచారించి, ఋజువుపరచి, మరి శిక్షించవలసినదని ఆమెకోరెను. కాని, ఆమెమాటల నెవరు విందురు? తామేమందుగ గిల్లికజ్జాకల్పించి, ఉసుగొలిపి, రేపెట్టి, నాశనముచేయుట కుంపిణీవారికి ఆచారమైపోయినది. ఈ అనుశ్రుతాచారము ననుసరించి, కుంపిణీవా రామె యాస్తినంతను దొంగిలించిరి; ఆమెవంటిపైనున్న నగలనన్నిటిని ఒలుచు

కొనిరి. ఆమెకిచ్చు మనువృత్తిని యెగబెట్టిరి. మొట్టమొదటి ఒడంబడిక ప్రకారము ఆమెకు సాలుకు లక్ష 50 వేల రూపాయల మనువృత్తి యిచ్చుటకు కుంపిణీవారు ఒప్పుకొనిరి. పిమ్మట, యీమెను శికాపురపుకోటలో బంధించిన పిమ్మట, యీ మొత్తమును 48 వేల రూపాయలకు తగ్గించిరి. తిరిగి యిప్పుడు 12 వేలకు తగ్గించిరి.

ఈ కారణములచే శిక్కులలో చెలరేగిన క్రోధభావములు యింగ్లీషు యేజెంట్లు చేసిన మరికొన్ని నిరంకుశ చర్యల వలన మరింత తీవ్రరూపము దాల్చెను. హజారారాష్ట్ర పరిపాలకుడగు సర్దారుచత్తర్‌సింగ్ యొక్క కూతురును, సిక్కు రాజసైన్యమున కధిపతియగు షేర్‌సింగ్‌యొక్క చెల్లెలును అగు కన్యను మహారాజగు దిలీపసింగునకిచ్చి వివాహముచేయు నట్లు శిక్కుప్రముఖులును రాజబంధువులును నిశ్చయించిరి. మహారాజుకు గార్డియన్‌లుగనున్న యింగ్లీషువారీ వివాహమునకు తాము జూపు అంగీకారానంగీకారములనుబట్టి వారి మనోభావములు గ్రహించుట కొక పరీక్షగనుండునని పైనుదహరించిన శిక్కుసర్దారు లిరువురు తమలో అనుకొనిరి. పెండ్లికొరకొక రోజు నిర్ణయించ వలసినదని కోరుచు వీరు లాహోరులోనున్న యింగ్లీషు రెసిడెంటుకు అర్జీపంపిరి. అప్పుడక్కడ సేనానాయకుడుగ నున్న ఎడ్వర్డ్సు — సునిసితమగు రాజ్యతంత్రజ్ఞత్వమును, రణకౌశలమును గలిగినవాడు — ఈఅర్జీని మంజూరు చేయవలసినదని శిఫార్సుచేయుచు ఒక ఉత్తరమును వ్రాసి, ఆయర్జీతోకూడ పై వారికి పంపించెను. ఈ విషయమై తానిదివరకు శిక్కురాజ్య సైన్యాధ్యక్షుడగు షేర్‌సింగ్

తో గావించిన ప్రసంగధోరణి నాతడీ యుత్తరములో వివరించెను. "ఈమధ్య శిక్కు సైన్యములు చేసిన తిరుగుబాటును, అల్లరులను ఒకసాకుగగొని మన బ్రిటిష్ గవర్నమెంటువారమీా పంజాబు దేశమునంతను కలుపుకొను దురుద్దేశముతో నున్నామను భావమొకటి పంజాబు దేశమందంతటను విరివిగ వ్యాపించియున్న సంగతి నిస్సంశయము. కాబట్టి, యీావివాహవిషయమై మనము సంపూర్ణాంగీకారమును తెలియపరచుచు శిక్కుప్రజకు మనయెడ గలిగిన అపోహను తొలగించుకొనుటకిదియే మంచియదను. మనము వారితో వెనుకచేసికొన్న ఒడంబడికలకు భంగముకలిగింప నుద్దేశింపలేదని యీా రూపముగ బహిరంగముగ ఋజువుపరచి వారికి మనయెడ గట్టినమ్మకము పుట్టునట్లు చేసికొనుట వివేకము — రాజనీతి. అట్టిరాజనీతిని, రాజ్యతంత్రమును, నడుపుటకిదియే మంచితరుణము. మనమిప్పుడిట్లు చేసినయెడల పంజాబుప్రజల మనస్సుల కెంతయో శాంతిగలుగును. వారి యుద్రేకము చల్లారి మనస్సులు స్థిమితపడును." ఈ జాబునకు యింగ్లీషురెసిడెంటగు ఫ్రెడరిక్ కర్రియిచ్చినజవాబు యిదమిత్థమని లేదు. ఈ సందిగ్ధపు జాబువలన శిక్కుప్రజల అనుమానములు మరింత హెచ్చుగుటకే తోడ్పడెనుగాని, తగ్గుటకు తోడ్పడలేదు. "దర్బారువారందరితో సంప్రతించి చెబుతాను; వధూవరుల యొక్కయు, ఉభయకుటుంబముల వారియొక్కయు యోగక్షేమములు, గౌరవములు పెంపొందించుటయే బ్రిటిష్ గవర్నమెంటువారియొక్క పరమసంకల్పము. కాని, యిప్పుడీ మహారాజుపెళ్లికి మనము ఒప్పుకోడానికిని, యీా పంజాబురాజ్య పరిపాలనా విషయమై

యిప్పుడుగాని, యికముందుగాని మనమవలంబింపబోవు రాజ్య తంత్రమునకును సంబంధమేమిటి? ఈ రెంటికి సంబంధము న్నట్లు నాకు కనిపించడములేదే" అనికూడ ఒకవిషపుమాటను చివరచేర్చెను. శిక్కుప్రముఖులు ఋజుమార్గముగ కోరిన కోర్కెకు యింగ్లీషు యేజెంటు చెప్పిన యీ వంకరజబాబు వలన వారిమనస్సులలో గట్టిగ అనుమానములు పుట్టెను. దీనికితోడు పెండ్లికూమార్తె తండ్రియొక్క రాష్ట్రమగు హాజారా రాష్ట్రములో యింగ్లీషు రెసిడెంటు గావించిన దుర్నడతవలన యీ అనుమానములు మరింత హెచ్చయ్యెను. ఈఇంగ్లీషు రెసిడెంటు (కర్నల్ ఆబట్) అదేమికర్మమోగాని ప్రతిదేశీయప్రముఖునితోను, ప్రతి చిన్నవిషయములోను, విరోధించుచుండెను. అట్లయ్యును అతని నీ సందిగ్ధసమయమందింకను ఆ యుద్యోగ మందే యుండనిచ్చుట నిశ్చయముగ దురదృష్టమే. ఈ కథ జరుగుటకు చాలకాలము క్రిందటనే యీతని ప్రవర్తనను గూర్చి సర్ హెన్రీలారెన్సు యిట్లు వ్రాసియుండెను. "అదేమి ఖర్మమోగాని, ప్రపంచములో వానిదృష్టికి ప్రతిది చెడుగనే-ప్రతిదీ మేడుపుగొట్టుగనే— కన్పించును. వానిదృష్టి తిమిరావృతమై తుమ్మలలో ప్రొద్దు గ్రుంకినట్లుండును. దివాన్ జౌలాసాహే కతడు అనుద్దేశపూర్వకముగ యెంతయో హాని చేసెను. ఈ దివాన్ చాలమర్యాదస్తుడు. మిక్కిలి సామర్థ్యముగలవాడనుటలో సందేహములేదు. "ముల్తానులో మొట్ట మొదట శిపాయీల తిరుగుబాటు జరిగినప్పుడు హాజారా పరిపాలకుడగు యీ చుత్తర్‌సింగ్‌కూడ మూల్‌రాజుతోచేరి యింగ్లీషురాజ్యాన్ని కూలద్రోయడానికి ప్రయత్నిస్తున్నట్లు

అన్యాయముగ యీ రెసిడెంటు అనుమానపడెను. ఈ అనుమానమును కడుపులో పెట్టుకొని యీతడు వారియెడ అవమానకరముగ ప్రవర్తింపసాగెను. ఇదిచూచి పై ఆంగ్లేయోద్యోగులే యీతనిని గట్టిగా చివాట్లు పెట్టేటంతవరకు కూడ వచ్చినది. "ఈ రెసిడెంటు (కర్నల్ ఆబట్) చుత్తర్ సింగునెడ యింత బహిరంగముగ అనుమానమును చూపుచుండుటచే చుత్తర్‌సింగ్‌కుకూడ యీ రెసిడెంటునందు అసహ్యముపుట్టెను. ఇది సహజమేకద. ఈ చుత్తర్‌సింగ్ రాజద్రోహము కరగిపోసిన బొమ్మయని ఆబట్‌యొక్క అభిప్రాయము. "తనను, యీ యావత్తు శిక్కుసైన్యమును సమయము చిక్కినప్పుడు నలిపి నాశనముచేసి పారవెయ్యవలెనను దుర్వృత్తితో యీ ఆబట్ ఉన్నాడ" ని చుత్తర్‌సింగ్ గట్టిగ అనుమానపడుచుండెను. ఈ రీతిగ యింగ్లీషు రెసిడెంటుయొక్క అనుమానమునకు గురియైన చుత్తర్‌సింగ్ వయోవృద్ధుడును, అందుచే దుర్బలుడును నై యుండెను. ఈతనికి శిక్కురాజవంశముతో సంబంధముండెను. అందుచే, దానినిబట్టియైనను యీతడు మన(కుంపిణీ) యెడ అంత అనురాగముతో కాకపోయినను మనమంటే కొంచెము జాగ్రత్తగ ఒడలుదగ్గిర పెట్టుకొని, సావధానముతో సంచరించుచుండునని నమ్మటకొక హామీగానున్నది. "మతిపోయిన ముసలి తొక్క; వీడు మననేమి చేస్తాడు?" అని మరియొక ఆంగ్లేయోద్యోగి యీతనినిగూర్చి నిరసనగ చెప్పెను. కెప్టెన్ ఆబట్ యితనితో స్వయముగ యెట్టిజోక్యము పెట్టుకొనక పట్టణమునకు దూరముగ— 35 మైళ్ల దూరములో— తన శిబిరమేర్ప

రుచుకొనెను. ఒక అశ్వదళము తిరుగుబాటు చేసినప్పుడు దాని నాయకుడగు చుందాసింగ్ పెద్దకుట్రలో చేరి పనిచేయుచున్నాడని యీ రెసిడెంటు అనవసరముగ అతనిమీద నింద మోపెను. "ఛీ, ఛీ, అనవసరముగ లేనిపోని యిట్టి ప్రేరేపణలను పెట్టకుము; ఇట్టి నింద కెంతమాత్రము ఆధారము లేదుపొమ్మ"ని యింగ్లీషుయేజెంటు కర్రియను నతడితనిని గట్టిగ చివాట్లు పెట్టెను. "ఈ శిక్కునాయకుడు చుందాసింగువలన యెంతమాత్రము తప్పులేదు. నేనిచ్చిన ఉత్తరువుల నన్నిటిని అతడు తు, చ, తప్పకుండ అనుసరించినాడు. ఈ కెప్టెన్ ఆబట్టుకు యెక్కడచూచినా కుట్రలు, రాజద్రోహాలు, రహస్యమంత్రాంగములే కనబడతవి. ఇదుగో పులి అంటే, అదుగో తోక అంటాడు. ఎవరైనా వీటిమాట చెప్పితే చప్పున నమ్ముతాడు. ఇది యితని స్వభావమైపోయింది. ఇతనికి అందరిమీద—దగ్గరవాడిమీద, దూరంగా వున్నవాడిమీదకూడ—అనుమానమే. తన యింట్లో నౌకర్లనే నమ్మడు. తాననుకొన్నదే నిజం, తక్కిన వాళ్ళదంతా అబద్ధం అనే పిచ్చి అహంకార మీతనికి బాగా పట్టుకుంది. తన అభిప్రాయం సరికాదని యెన్నిసార్లు ఋజువైనా యీతనికీ పిచ్చిమాత్రం వదిలిందికాదు" అని సర్ ఫ్రెడరిక్ కర్రి గవర్నర్ జనరలుకు వ్రాసెను. చుత్తర్‌సింగ్ యింటివద్దనున్న చిన్న సైన్యదళమొకటి ముల్తాన్‌లో తిరుగబడ్డ శిపాయిలతో "మేము కూడాపోయి చేరుతామ"ని కొంచెము అభిప్రాయమును కనబరచిరి. కాని, వీరిసంఖ్యయెంత? బహుస్వల్పము. ఈ అభిప్రాయమును పై యుద్యోగులెవరును అంగీకరించలేదు.

ఈ తిరుగుబాటు స్వభావమును అణచడానికి వీరు ప్రయత్నించి యుండిరికూడాను. చుత్తార్‌సింగ్ యీ తిరుగుబాటు స్వభావమును అంగీకరించి నాడనిగాని, ప్రోత్సాహపరచినాడనిగాని అనుకొనుటకెక్కడను అవకాశమే లేదు. అయినను, "ముల్తాన్ తిరుగుబాటులో వీరుకూడ చేరినట్లే" అని అర్థముతీసి, కెప్టెన్ ఆబట్ వీరిపైకి మహమ్మదీయ సిపాయిలను ఉసుగొల్పెను. భిన్నమతస్థులగు మహమ్మదీయ శిపాయిల మత పిచ్చను రేపెట్టి జిల్లాలోనున్న మహమ్మదీయు లందరువచ్చి చుత్తర్‌సింగ్ కాపురమున్న హరిపురముపై పోయిపడునట్లు ఉసుగొల్పెను. ఈమూకలువచ్చి యీరీతిగ తనపట్టణమును ముట్టడించి, నానాగోల చేయుచుండుటచే, తనపైపడు ధాటిని మరలగొట్టుటకుగాను చుత్తర్‌సింగ్ విధిలేక తన శిపాయిలను వీరిమీద ప్రయోగించుటకేర్పాటు చేసికొనవలసి వచ్చెను.

చుత్తర్‌సింగ్‌యొక్క ఫిరంగిదళమునకు "కనోరా" యను అమెరికా దేశస్థుడొకడు నాయకుడుగ నుండెను. తక్కిన తనసేనతోపాటు యీ ఫిరంగిదళమును కూడ మూకలపై నడిపించుకొని పోవలసినదని చుత్తర్‌సింగ్ ఆజ్ఞాపింపగ, "ఆబట్‌యొక్క ఆజ్ఞ లేనిది నేనునడవన"ని యితడు తిరస్కరించెను. "ఈమూకలువచ్చి యీ ఫిరంగులనన్నిటిని మొత్తుకొని పోయేస్థితిలో నున్నారనుసంగతి ఆబట్ కేమి తెలియును. కాబట్టి, నీవు ఫిరంగులతో మూకలమీదికి నడవవలసినది" అని చుత్తర్‌సింగ్ రెండవసారి తన అమెరికన్ నౌకరగు "కనోరా"కు కబురంపెను. కాని, యీ రెండవయాజ్ఞ కూడ అవిధేయుడగు నా యుద్యోగుని కదలించలేకపోయెను.

అంతట చుత్తర్‌సింగ్ తనయుత్తరువుల ప్రకారమములు జరుపు టకు గాను రెండు శిక్కు-కాల్బలములను "కనోరా" యున్న వైపునకు పంపించెను. "కనోరా" అప్పుడు తన ఫిరంగు లలో మందుకూరి తనవైపువచ్చుచున్న శిక్కు- కాల్బలముల మీద కాల్చవలసినదని తన ప్రక్కనున్న నేటివుహావల్దారుల కాజ్ఞాపించెను. "మేము కాల్చము పొమ్మ"ని యీ హావ ల్దారులనిరి. అంతట "కనోరా"కు పట్టరాని కోపమువచ్చి తక్షణమే అందొకనిని కత్తితో నరికివేసి, ఫిరంగిలోకూరిన మందుకు తానే స్వయముగ నిప్పంటించెను. కాని, యేలనో నిప్పంటుకొనలేదు. ఈలోగా యితనిపైకి వచ్చుచున్న శిక్కు- కాల్బలముల ఫిరంగివేట్లుల చే నీతడు నేలగూలెను. చనిపోవు లోపల యీతడిట్లో యిద్దరు శిక్కు-ఆఫీసర్లను తన పిస్తోలుతో కాల్చెను. తన అవిధేయతకు తగిన శిక్షను "కనోరా" పొందినాడనుటలో నిష్పాక్షికులగువారికెల్లర కెట్టి సందేహ మును వుండదు. కాని, యీ యుదంతమున కంతకు యేదో రంగుపూసి "చుత్తర్‌సింగ్ కనోరాను బుద్ధిపూర్వకముగ, ఘోరముగ, చంపించెన"ని ఆబట్ లాహోరుకొక రిపోర్టు వ్రాసిపంపించెను. కాని, నిజముగ జరిగిన సంగతినంతను చుత్తర్‌సింగ్ తానుకూడ ఒకరిపోర్టునువ్రాసి లాహోరుకు పంపించెను. ఈరెండు రిపోర్టులలోనున్న నిజానిజములను లాహోరులోనున్న ఆంగ్లేయాధికారి గ్రహించెను. మదో దేశీయుగు తన తాబేదారుడు చేసిన యిట్టిపనికై ఆతనిని గట్టిగ తలవాయునట్టు చివాట్లుపెట్టుచు లాహోరులోని ఆంగ్లే యాధికారి ఆబట్‌కు తిరిగి జాబువ్రాసెను. ఈచివాట్లు

బహు తీక్షణముగనున్నను న్యాయముగనే వున్నవి. "చుత్తార్‌సింగ్ కనోరాను నీచముగ చంపించినాడని చెప్పి ఆతనిపై అన్యాయముగ— వట్టిపుణ్యానికి— నేరముమోపుట శుద్ధ పనికిమాలినపని. తన పైయధికారియగు చుత్తర్‌సింగ్ యొక్క సక్రమమగు ఆజ్ఞలను ఉల్లంఘించినందువలన గలిగిన సందర్భములలో ఆతడు— కనోరా— న్యాయముగ హతుడు కావలసివచ్చెను. అందు అన్యాయమేమున్నది?" అని లాహోరులోని ఆంగ్లేయాధికారి వ్రాసెను. హజారారాష్ట్రములో అవివేకబుద్ధితో ఆబట్ రేపెట్టిన అంతః కల్లోలమును గూర్చి యీ యాంగ్లేయోద్యోగి చాలవిచార పడెను. "హజారారాష్ట్రములో సేనల సమకూర్చుమని నీకెవరు చెప్పారు? జీతాలిచ్చి శిపాయిదళాల నిర్మించమని నీ కెవరధికారమిచ్చారు? ఇటువంటి అవసరాలక్కడ కలుగుతవని నేనెన్నడు అనుకోలేదే? నీకీ పనులు చేయమని నేనెన్నడు అధికారం యిచ్చివుండలేదే? పరిపాలనా విషయాలలో చుత్తార్‌సింగుతో మాట్లాడకుండ దూరముగ (35 మైళ్ళదూరం) పోయి కూర్చుండమని నేనెన్నడు నీకు చెప్పలేదే! నీ మట్టుకు నీవిట్లు తనితో మాట్లాడుట మానివేసి ఆతడేవిషయమైనా నోరెత్తి మాట్లాడినా, మాట్లాడక మౌనమువహించినాకూడ, నీయిష్టము వచ్చినట్లు నీ వాటము ననుసరించి అతనిమీద తప్పో, ఒప్పో, పెడదామనియా నీ ఉద్దేశము? నీవుచేసే యిట్టి పనులకు నేనెన్నడు అనుమతించజాలను. రాజధానీ నగరమునుండి నీ కచేరీని అప్పుడే యెత్తివేసి యెక్కడో దూరముగ పెట్టు

కున్నావు. ఈ పని నిన్నెవరు చెయ్యమన్నారు ? చుత్తర్‌సింగ్‌తో స్వయముగ యేవ్యవహారమునుకూడ జరిపించడంమాని వేశావు. పైగా, "నీయజమానిమీద నాకేమీనమ్మకం లేదని" చుత్తర్ సింగ్ యొక్క వకీలుతో చెప్పావు? కాబట్టి, యిట్టి సందర్భములలో పౌరుషశాలియయ్యు దుర్బలుడైయున్న రాజుమనస్సుకు కష్టముతోంచి మనమంటే అతనికి లోపలకోపము, అసహ్యము కలిగిందంటే ఆశ్చర్యపడవలసిన దేమున్నది? " అని ఆ యాంగ్లే యోద్యోగి ఆబట్‌ను చివాట్లుపెట్టుచు వ్రాసెను. ఇంగ్లీషు గవర్నమెంటుకు తాబేదార్లగు చిల్లరయుద్యోగస్థుల ప్రవర్తనకిది యొక్కటే నిదర్శనముకాదు. ఇంక యిట్టివెన్నియో యున్నవి. మన కుంపిణీ యేజెంట్ల అనవసరపు అనుమానములవల్లను, వారి రాజ్యాధికార మదాంధతవల్లను శిక్కు ప్రముఖులకు ఒడలుమండి, తుట్టతుదకు వారు బహిరంగముగ మనమీద తిరుగబడుటకు కారణమయ్యెను. ఇందుకు కావలసినన్ని నిదర్శనములు ఆ కాలపు రికార్డులలో కుప్పతిప్పలుగ నున్నవి. " దీనికంతటికి మొట్టమొదటగ రేపెట్టినవాడు మన కెప్టెన్ ఆబట్టె! ఈతడుపెట్టిన ప్రేరేపణను పైయుద్యోగస్థులెవరు తగురీతిగ మందలించి అణచలేదు. అట్లు మందలించక పోగా పైపెచ్చు, " నీరాజ్యాన్ని, నీ రాజబిరుదాన్ని ఊడలాగుకుంటామ "ని చెప్పి, చుత్తర్‌సింగును మాటిమాటికి బెదరించిరి. ఆఖరుకు ఆతనికి విసుగెత్తి తనవలెనే అవమానితులై పరిభవాగ్నిచే దహించిపోవుచున్న తన తోడిదేశీయులతో పాటు కలిసి, మన కుంపిణీ రాజ్యముపై బహిరంగముగ తిరుగబడెను " అని సర్ ఫ్రెడరిక్‌కర్రి వ్రాసెను. ఈతని

కుమారుడు షేర్‌సింగ్ తనకు మన కుంపిణీయెడ గల భక్తి విశ్వాసములను ఋజువు పరచుటకును, తన సేనలు తిరుగబడకుండ వుండుటకును, తన శాయశక్తులా— పాపము— తంటాలు పడెను. తన తండ్రి వ్రాసిన ఉత్తరముల నన్నిటిని యీతడు ముల్తాన్ మకాములో యింగ్లీషు సేనానియగు ఎడ్వర్డ్సుకు చూపించెను. "ఈ విషయముల నన్నిటిని ఆతడు మంచి సద్బుద్ధితో నాతో చర్చించెను" అని ఎడ్వర్డ్సే ఒప్పుకొనెను. "ఇటువంటి సందర్భములో నాతండ్రి అబట్‌ను యెదిరించక యేమిచేస్తాడు చెప్పండి? ఇది యెంతయు సహజము గద. ఇందు నాతండ్రి తప్పేమున్నది మీరే చెప్పండి. ఎవడుగాని ఆఖరుకు యెదురుతిరగకుండ తన్ను చంపించుకోడానికి ఒప్పుకోడుగదా?" అని షేర్‌సింగ్ ఎడ్వర్డ్సుతో చెప్పుకొనెను. "ఆగస్టునెల ఆఖరువరకుకూడ షేర్‌సింగ్ యింకను మనయెడ విశ్వాసముతోనే వుండెను. తన శిపాయిలలో యెంతమాత్రము మనయెడ ద్రోహబుద్ధి పుట్టకుండా వుండడానికి యే పని చెయ్యమన్నా చెయ్యడానికి సిద్ధముగానే వుండెను" అని యీ ఎడ్వర్డ్సే ఒప్పుకొనెను. కాని, సెప్టెంబరు మొదటివారములో యితనికి తండ్రినుండి జాబులువచ్చెను. తనకు కుంపిణీవారు చేయుచున్న అవమానములను, అక్రమములనుగూర్చి నిరాశను దెలుపువాక్యము లా జాబులందుండెను. ఈ జాబులు చూచుకొన్న పిమ్మట ఆతని మనస్సు మారిపోయెను. "నేనిక మనతండ్రితోచేరి, మన మత రక్షణార్థమై పాటుబడుటకు నిన్ననే నిశ్చయించుకొన్నాను" అని చెప్పి.

యితడు సెప్టెంబరు 14 వ తేదీన లాహోరులోనున్న తనసోదరుడగు గులాబ్‌సింగ్‌కు జాబువ్రాసెను.

మొట్టమొదట కేవలము శిపాయిల అసంతుష్టి వలన గలిగిన చిన్నతుంపర రానురాను బ్రిటిష్ ఉద్యోగు లవలంబించిన వక్రతంత్రమువలన చిలికి చిలికి బ్రహ్మాండమగు గాలివానగ పరిణమించెను. జులై నెలవరకు కూడ "సర్దారులందరు మనస్ఫూర్తిగ మనపట్టుననే యున్నార"ని రికార్డులను బట్టి తెలియగలదు. ఈ శిపాయిల తిరుగుబాటునది సేనలయందంతటను సర్వత్ర వ్యాపించకుండ నివారించుటకై వీరెంత శ్రమపడినది కూడ తెలుపుటకు కావలసినంత సాక్ష్యమున్నది. 18 వ ఆగస్టు తేదీన "జనరల్ విష్" అధ్యక్షతక్రింద కొంత బ్రిటిష్‌సేనవచ్చి ఎడ్వర్డ్సుకు సహాయముచేసెను. అంతటితో ముల్తాన్ ముట్టడి ప్రారంభమయ్యెను. కాని, షేర్‌సింగ్ సెప్టెంబరులో యింగ్లీషువారిని వదలి వెళ్లుటచే యింకను ముట్టడి సాగించుట అపాయకరముగ గన్పట్టెను. అందుచే, సెప్టెంబరు 15 వ తేదీన ముట్టడి విరమించబడెను. ఈరీతిగ, యింగ్లీషువారిని విడిచి వెళ్లిన షేర్‌సింగ్‌ను ముల్తాన్ ప్రజలు నమ్మలేదు. ఇంతకాలమునుండియు యింగ్లీషువారి పట్టుననున్న యితడేదో దురుద్దేశముతో యిటువచ్చినాడని ప్రజలనుమానపడజొచ్చిరి. వీనికితోడు యింగ్లీషువారి శిబిరమునుండివచ్చిన కొన్ని దొంగ ఉత్తరములవల్ల కూడ ప్రజలకీతనిపై అనుమానము మరింత హెచ్చయ్యెను. ఈరీతిగ తన ప్రజలు తన్ననుమానించుటచే షేర్‌సింగ్‌కు విసుగుతోచి మూల్‌రాజు సైన్యమును విడిచి తన తండ్రియగు చత్తర్

సింగ్ సేనతో చేరుటకు వెళ్లెను. డిశంబరులో యింగ్లీషు వారికి బొంబాయినుండి సైనిక సహాయము వచ్చెను. అంతటితో డిశంబరు 26 వ తేదీన ముల్తాన్ ముట్టడి తిరిగి ప్రారంభమయ్యెను. ముల్తాన్ నగరము 1849 సం॥ జనేవరి 2 వ తేదీన యింగ్లీషువారి వశమయ్యెను. కాని, కోట యింకను మూల్‌రాజు స్వాధీనములోనే యుండెను. మూల్‌రాజు యీ కోటలో విడిసియుండెను. దీనినికూడ యింగ్లీషు వారు ముట్టడించ నారంభించిరి. మహాధీరతతో పెక్కు దినములు పోరాడి మూల్‌రాజు 22 వ తేదీన యెట్టి షరతులు లేకయే యింగ్లీషువారికి లోబడెను. "నన్ను తక్షణము ఉరి దీసివేయవలసినదేగాని, దేశమునుండి వెడలగొట్టవద్దు. సముద్రమువిూద ద్వీపాంతరవాసమునకు పంపవద్దు" అని మూల్‌రాజు ప్రార్థించుపడెను. రామ్‌నగర్, సుదాల్‌పూర్ మున్నగుచోట్ల యింగ్లీషువారి సేనలు అపారమగు నష్టమును పొందెను. దీనిని బట్టి రణోత్సాహ కౌశలము లొక్క యింగ్లీషువారి సొమ్మే కాదుసుమా యని ఋజువయ్యెను. షేర్ సింగు సైన్యమిప్పుడు 30 వేల మందితోను, 60 ఫిరంగుల తోను వుండెను. ఇతని తండ్రి చుత్తర్‌సింగ్ పిషావర్, అటక్ మున్నగు ఉత్తరప్రాంతముల కిప్పుడు నాయకుడై యుండెను. ఈతడిప్పుడు తనవద్దనున్న సైన్యముతో తన కుమారుని చేర వచ్చుచుండెను. "నీవిక యెంతమాత్రము ఆలస్యము చేయక తక్షణమేపోయి శత్రువులమీదపడి దెబ్బకొట్ట వలసినది"ని హ్యూ ప్రభువుకు ఉత్తరువులు వచ్చెను. 13 వ జనేవరి తేదీన ఘోర సంగ్రామము "చిలియన్‌వాలా"

క్షేత్రమందు జరిగెను. అందులో మన కుంపిణీవారికి చావు దప్పి కన్ను లొట్టవోయెను. పరాజయ, పలాయనములం దాదాపు మనపాలబడునట్లు వచ్చెను. షేర్ సింగ్ శత్రువుల కనుగప్పి నిరాఘాటముగ తన సేనలనెల్ల విజృంభింపజేసి గుజ రాతులో నున్న తన తండ్రిసేనతో వచ్చికలిసెను. ఈ యుభయసేనలు చేరి 40 వేల వరకుండెను. వీరక్కడ నొక బలిష్ఠస్థాన మాక్రమించుకొని 60 ఫిరంగులతో కాపు వెట్టుకొని యుండిరి. ఇక అటు ముల్తాన్‌లో పని తీరిక యైన సేన "జనరల్ విష్" అధ్యక్షత క్రిందవచ్చి హ్యూ ప్రభువుసేనతో చేరెను. ఈ యిరువురి సేనలు కలిసి 25 వేల మందియు, 100 ఫిరంగులును వుండెను. ఈ యుభయపక్ష సేనలకు ఫిబ్రవరి 21 వ తేదీన యుద్ధము జరిగెను. ఉదయము పొద్దు పొడిచినది మొదలు మధ్యా హ్నము రెండు జాములవరకు ఫిరంగుల ద్వంద్వయుద్ధము ఘోరముగ చెలరేగెను. బ్రిటిష్‌వారి ఫిరంగులు బలిష్టము లును అధిక సంఖ్యాకములును నగుటచే క్రమక్రమముగ శిక్కు ఫిరంగులమోత నణచి, వానిని వెనుకకు మరలింప గలిగెను. బ్రిటిష్ కాల్బలములును తమ తుపాకుల బల ముతో శిక్కుసైన్యమును బలిష్ఠస్థానములనుండి చలింపజేయ గలిగెను. ఇంగ్లీషువారి అశ్వదళముల ధాటితో శిక్కు సైన్యముల చీకాకును, పలాయనమును పరిపూర్తియయ్యెను. ఈ గుఱ్ఱపుదాడియందు హ్యూప్రభువుకూడ స్వయముగ పాల్గొనెను. ఇంగ్లీషువారికి వెనుక చిలియన్‌వాలాతో గలిగిన పరాజయము యిప్పు డీ గుజరాతులో గలిగిన విజ

యమువలన మాసిపోయెను. ఇంతటితో రెండవశిక్కు యుద్ధము ముగిసినట్లే చెప్పవచ్చును. చెదరిపోయిన శిక్కు సేనల వెంబడించుటకై వేగవంతమగు సైన్యదళము లంప బడెను. అందులో ముఖ్యముగ దోస్తు మహమ్మద్ అధ్యక్షత క్రింద వచ్చిన ఆఫ్ఘన్ అశ్వదళమును పట్టుకొని నాశనము చేయుటకుగాను యీ సైన్యము పంపబడెను. కాని, ఈ ఆఫ్ఘన్ అశ్వదళ మెట్లో చెల్లాచెదరగాక, ఉన్నది ఉన్నపాళ ముగనే యుద్ధరంగము నుండి సీచముగ పలాయనమై కైబర్ కొండకనుమలో దూరెను. మార్చి 14 వ తేదీన రావల్ పిండివద్ద చుత్తార్ సింగ్ షేరుసింగు లిరువురు హ్యూపప్రభువుకు లోబడి విశ్వాసపూర్వకములగు నజరు లర్పించిరి. మరి 35 గురు చిన్నసర్దారులును తమ కృపాణముల క్రిందపడవైచిరి. వీరి పరివారమును బారులుతీరియున్న ఆంగ్లసేనలమధ్యనుండి నడచిపోవుచు తమ కత్తులను, కవచములను విజేతలపాదముల కడ గుట్టలుగ పేర్చుచుపోయిరి.

ఈ విజయవార్తను తక్షణమే లాహోరు రెసిడెంటుకు చేర్చుచు శిక్కులు యీ రీతిగ ఓడిపోయి తమ పాదములకడ దాసానుదాసులై యున్నారనువార్త రీజెన్సీ కౌన్సిలుకు తెలు పవలసినదని ఆతనికి హుకుము పంపిరి. రాజ్యకబళమును గుటుక్కున నోటవేసికొనుటకు డాల్హౌసీ ప్రభువుకు యిదే మొట్టమొదటి అవకాశము. నోరూరజేయు యీ ప్రథమ కబళమును నోటిలోవేసికొనుటలో గల అపరిమితానందము నాతడవ్వారిగా అనుభవించుచు పంజాబుదేశమును సీమరాణీ రాజ్యములో కలిపివేసెను. పంజాబు రాష్ట్రమును ఆంగ్ల

రాజ్యములో కలుపుకొన్నామని చెప్పు రాజశాసనము నెదిరింప నెవరైన సాహసించినచో అట్టి వారిని తక్షణమే అణచివేయుటకుగాను ఒక సైన్యదళమును లాహోరుకు పంపిరి. గవర్నర్ జనరల్ కు శెక్రటరీ అయిన "ఇలియట్" అను నాతడు గవర్నర్ జనరల్ యొక్క ప్రతినిధిగ లాహోరు దర్బారునందుండునట్లు యేర్పాటు గావింపబడెను. ఇకముందు పంజాబు రాష్ట్రము నేరీతిగ పరిపాలించవలయునను విషయమై ఇండియా గవర్నమెంటువారు చేసికొన్న నిశ్చయమునుగూర్చి పంజాబు రాష్ట్రీయ ప్రభుత్వమునకు తెలుపవలసిన తరుణమువచ్చినది. ఈ నిశ్చయముతో శిక్కుదర్బారువా రేకీభవించిన మంచిదే. ఆ నిశ్చయమేమిటి ? "పంజాబురాష్ట్ర పరిపాలనాధికార బిరుదములను తాము శాశ్వతముగ వదలుకొన్నామని శిక్కుదర్బారువారు బాలుడగు మహారాజు తరఫున అంగీకరించినచో తమకును మహారాజుకుకూడ తగిన జాగీరులను పింఛనులను యిత్తుము. అట్లుగానిచో యింగ్లీషు గవర్నమెంటువారు తమ యిష్టమువచ్చిన ప్రకారమే చేసికొందురు. దర్బారులో వారికిగాని, మహారాజుకుగాని, పింఛనులు గింఛనులుయేమి వుండవు. ఈ రెంటిలో శిక్కుదర్బారువారి కేదియిష్టమో కనుగొనవలసినదని లాహోరులోనున్న రెసిడెంటుకు వ్రాసిరి. దర్బారులోనున్న యెనమండుగురు సర్దారులలో ఆర్గురు మొట్టమొదట ముల్తాను వద్ద శిపాయిల తిరుగుబాటుజరిగిన నాటనుండి నేటివరకుకూడ బ్రిటిష్ వారిమెడ భక్తివిశ్వాసములతోనే వుండిరి. ఇదంతయు ఉద్యోగాలుపోయి, అపఖ్యాతిపాలై యున్న యేకొలదిమంది శిపాయిలో చేసిన అల్లరేగాని, అంత

శిక్కు-వేమియు కాదనియు, మొట్టమొదటలోనే దీనిని త్రుంచివేయుటకు కొంచెము గట్టిచర్య తీసికొన్నయెడల యీ అల్లరి అణగిపోవుననియు యీ సర్దారు లభిప్రాయపడిరి. కాని, బ్రిటిష్ యేజెంట్ల నిర్లక్ష్యమువల్లను అనవసరపు అనుమానములవల్లను, బుద్ధిపూర్వకముగ చేసిన పొగరుబోతు తనమువల్లను యీ అల్లరి శిక్కు-సైన్యమందంతటను ప్రాకెను. తమ మనస్సుల కెంతమాత్రము యిష్టము లేక పోయినను విధిలేక యిద్దరుశిక్కు- ప్రముఖులు మాత్రము తాముకూడ యీ అల్లరిలో పడవలసివచ్చెను. ఇట్టిస్థితిలో యిప్పుడు పంజాబుపరిపాలన విషయమై యిండియాగవర్నమెంటు చేయదలచుకున్న చర్య చాలా అన్యాయమనియు, అక్రమమనియు శిక్కు-దర్బారులోని ప్రముఖులు యిండియాగవర్నమెంటువారు పంపిన రాయబారితో గట్టిగ చెప్పిరన్నచో ఆశ్చర్యమేమి? అదిగాక, గవర్నమెంటు వారిప్పుడు చేయబూనిన యీచర్యకొక మిషగ యేర్పడిన యీయుద్ధమును—— యీ యుద్ధమునకు దిగుటలో ఉభయపక్షములు చూపిన అతితొందరను—— కూడ వారు నిర్మొగమోటముగ ఖండించిరి. మహారాజును, దర్బారుసహితముగ దేశమునుండి వెడలనడచు పని మానవలసినదని వారందరెంతో ఆవేశముతోను, ఆతురతతోను వాదించిచెప్పిరి. "వారు రాజమందిరమును, అందుండు నియమములను వదలివెళ్ళినచో వారు అవినీతిమార్గములబడి రణజిత్ సింగ్ మహారాజుకీర్తికి కళంకము దెత్తురు" అని శిక్కు-దివాన్ ఆగు "దీననాథు" డెంతయో చెప్పెను. అందుకుబదులుగ, "మీ మహారాజును దక్కను పంపుదుము"

అని యింగ్లీషుయేజెంటు చెప్పెను. "ఆతనినక్కడికి పంప రాదు. ఏలననగ, అక్కడి ప్రజలు హిందువులో మహమ్మదీయులో మాకు తెలియదు ; భగవంతునికే తెలియవలెను. పోనీ, పంపిస్తే కాశీకిపంపించండి" అని తేజసింగ్ చెప్పెను. "పవిత్రమగుగంగానదినుండి బహుదూరము తీసికొనివెళ్లములే" అని యింగ్లీషురెసిడెంటు వాగ్దానము చేసెను. తుదకెంత ప్రార్థించినను, యెంత యెదిరించినను లాభములేదని తెలిసి కొన్నవారై దర్బారులోని శిక్కుప్రముఖులు రాజ్యపరిత్యాగ పత్రముపై తమ హస్తాక్షరుల నుంచిరి. భారతవర్షచారిత్రమం దాంగ్లేయులిక నూతనాశ్వాసమును ప్రారంభించుటకొక తెూ౦మైనను వృథపుచ్చలేదు. మరునాడు (1849 సం॥ మార్చి 29 వ తేదీన) శిక్కుప్రముఖుల ఆఖరు దర్బారు లాహోరు రాజమందిరమున జరిగెను. ఇదియే దేశీయ రాజ్యాధికారపు ఆఖరుదర్బారు. వారి రాజ్యాధికార మింతటితో సరి. రెసిడెంటుగ మరలవచ్చిన సర్ హెన్రీ లారెన్సును, బలిష్టమగు అశ్వదళముచే పరివేష్టింపబడిన గవర్నర్ జనరల్ యేజెంటగు ఇలియటున్ను కోట గుమ్మమువద్దకు రాగానే బాలుడగు దిలీప మహారాజు వారికెదురుగబోయి వారిని ఉభయులను సపరివారముగ రాజమందిరములోనికి గొనిపోయెను తన మహారాజునెడ యింగ్లీషువారు గావించు కాఠిన్యమును తగ్గింపవలెనని దివాన్ అగు దీననాథు డిచ్చటకూడ మరియొకసారి— కడసారి— ప్రయత్నించెను. "ఫ్రెంచివీరుడగు నెపోలియన్ పతనానంతరము ఫ్రెంచిదేశమును ఫ్రెంచి ప్రజల కెట్లు తిరిగి యిచ్చివేసినారో ఆప్రకారమే పంజాబుదేశమును తిరిగి మా దేశీయ పరి

పాలకులకే యిచ్చివేయవలసినద" ని ఆత డెంతయో దూరము చెప్పెను. కాని, యీ వాక్యములు వారి మనస్సుల కెక్కునా? ఈతడు చెప్పు వాక్యముల నెంతమాత్రమును పాటింపక, వజ్రసన్నిభమగు కాఠిన్యమును వహించి, "యీ రాజ్యపరిత్యాగ పత్రముపై, నీ హస్తాక్షరి నుంచుమ" ని పసి బాలుడగు దిలీపమహారాజును యీ యింగ్లీషుసర్దారులు కోరిరి. కర్మకాండ అంతటితో పూర్తియయ్యెను. ఆంగ్ల రాయబారులీ పత్రమును చేతపుచ్చుకొని రాజమందిరమును వీడ్కొనిచనుసమయమందే ఆంగ్లరాజ్యపతాకము (యూనియన్‌జాక్) కోటగోడపై నెగురవేయబడెను. "నేటి నుండి పంచనద దేశమగు యీ పంజాబు రాష్ట్రము మా ఆంగ్లరాజ్యములో చేరిపోయినదహో" యని లోకమున కెరుకపరచుటకోయన ప్రళయకాలమేఘగర్జారవముల ననుకరించు ఫిరంగి మ్రోతలు మిన్నుముట్టెను. దేశీయప్రజలు మూకలుగ కూడిరి. ఈ సభాసమావేశపు టుద్దేశమును ప్రజలకు తెలియజెప్పుటయను కపటనాటకము యథావిధిగ నడచెను. రణజిత్‌సింగ్ మహారాజు చనిపోయిన నాటినుండి నేటివరకు యింగ్లీషువారికిని, శిక్కులకును మధ్యనడచిన వ్యవహారములనెల్ల— తమ యింగ్లీషువారి దృష్టికి గోచరించిన రీతిని— ప్రజాసమూహముల కెల్ల తెలియునట్లు యింగ్లీషు, పార్షి, హిందూస్థానీ భాషలలో చెప్పించిరి. పరాజయమునొంది, స్తబ్ధులై పడియున్న శిక్కులు సత్యాభాసములగు యీ కపటతాంత్రికపు వాక్యముల విమర్శించుటకుగాని, వానివలన క్రోధోద్రిక్తులగుటకుగాని అశక్తులై యుండిరి.

బలవంతముగ పండవేసిన అన్యాయార్జిత విజయఫల మీ రీతిగ చెట్టునుండి యెంతమాత్రి మాలస్యము లేకయే కోసికొన బడెను. "పంజాబు రాష్ట్రము నేటినుండి ఆంగ్ల రాజ్యములో నొకభాగమై పోయెన" ను ప్రకటన మార్చి 30 వ తేదీన ఫిరోజుపురమునుండి యిండియాయాం దంతటను ప్రకటింపబడెను. దిలీపమహారాజుకు సాలుకు 5 లక్షుల పింఛనును, పదభ్రష్టుడగు రాజుకు చూపవలసిన మామూలు మర్యాదలును కలుగజేయు రాజ్యత్యాగ పత్రమును యేప్రిల్ 5 వ తేదీన గవర్నర్ జనరల్ ధ్రువపరచెను. ఈ రీతిగ పంజాబు దేశమును, రాజ బిరుదమును, దిలీప మహారాజు నుండి హరించుటతో యింగ్లీషువారి ఆశతీరలేదు. శిక్కు రాజ వంశీకులు సీమ రాణియగు విక్టోరియా రాణికి విధేయులమని చెప్పుకొనుటకుగాను చిరకాలమునుండి శిక్కు రాజవంశీకుల తలపాగలో శిరోరత్నముగ వెలుంగుచున్న "కోహినూరు" వజ్రమును సదరు రాణికి యిచ్చివేయ వలయునని సదరు పత్రములో వ్రాసిరి. ఈ వజ్రపు చరిత్ర మహాద్భుతము; మహాశ్చర్యము. ఇది అమూల్యమగుమణి. దీనికి కోహినూర్— అనగ "వెలుతురుకొండ" (తేజో నగము) అనిపేరు. ఇది భారతకాలమందు అంగరాజగు కర్ణుని స్వాధీనములోనున్నట్లు వినుచున్నాము. దీనికొరకనేక దండయాత్రలు యుద్ధములుజరిగి, యిది కొంతకాలము మహమ్మదీయులవద్దను, కొంతకాలము హిందువులవద్దను, మరికొంత కాలము ఆఫ్ఘనులవద్దనుపుండి తుదకిప్పుడు శిక్కులవద్దకు చేరినది. ఈ మణిని ధరించినవారిలో చాలమందికి విషమో,

ఫిరంగిగుండో, ఖడ్గధారయో, బందిఖానాయో, పరాజయమో గతియైనట్లు దీనిచరిత్రనుబట్టి తెలియుచున్నది. కాబట్టి, దీనిని ధరించినవారికి తప్పక కీడుమూడునను మూఢ నమ్మకమొకటి భారత దేశీయులకు కలదు. దీని వెనుకటి చరిత్రనుబట్టి చూచినట్లయితే, వీరినమ్మకము చాలవరకు నిజమని తెలియుచున్నది.

పంజాబుదేశములో కుంపిణీవారు గావించిన యావత్తు చర్యను కేవలము దిఙ్మాత్రముగ సూచించినప్పటికి— లేక దానిని సమర్థించుట కెంతటి చాకచక్యముతో పూతపెట్టినప్పటికి— సువిచారమనస్కులగు పాఠకులకు మాత్రమిందు విషయమై గొప్పఅనుమానములు పుట్టకమానవు. చరిత్రలో పైకి ప్రధానాంశములుగ గన్పడు అంశము లనేకములున్నవి. కాని, వీనినన్నిటిని సూత్రప్రాయముగ కలిపి, వీనికి యేక వాక్యతనిచ్చు సంగతు లనేకము లింక గవర్నమెంటు రికార్డులలోను ఉద్యోగస్థులు ఒకరికొకరు వ్రాసికొన్న జాబులలోను, ప్రయివేటు ఉత్తరములలోను అణగి యెవరికి తెలియకుండ పడియున్నవి. వీనినన్నిటినిత్రవ్వి పైకితీసి పరిశీలించినగాని, పైకి అక్కడక్కడగాన్పించు ప్రధాన చారిత్రాంశములలోని నిజ తత్వమును, అందుపాత్రలై నటించిన మానవుల గుణశీలములను, లోకమున కెరుకబడవు. సత్యమగు, సంపూర్ణమగు పాంచాల రాజ్యాపహారణచరిత్ర అప్పుడుగాని బయటపడదు. లోకములో మన మేన్యాయసూత్రము ననుసరించి చూచినను దిలీపమహారాజు నీరీతిగ రాజ్యభ్రష్టునిగావించి, అతని రాజ్యమును దిగమ్రింగుట యెంతమాత్రము న్యాయముగ సమర్థింప

గల కార్యముగ గన్పట్టదు. ఆతడు పసిబాలుడు; మైనరు; కాబట్టి, రాజకీయ కార్యముల కాతడెన్నడును స్వయముగ బాధ్యుడు కాజాలడు. ఈతని మైనారటీకాలములో రాజ్య పాలనను కొనసాగించుటకుగాను రీజెన్సీకౌన్సిలు నేర్పరచిరి. ఆ కౌన్సిలుకు యింగ్లీషు రెసిడెంటే అధ్యక్షుడు. శిపాయిల తిరుగుబాటు చెలరేగుచున్నన్నాళ్లు యీ రెసిడెంటు చేయు రాచకార్యముల కెవరును, యేక్షణమందుగాని, అడ్డు రాలేదు. రాజధానీ నగరమగు లాహోరులో యెట్టి కల్లోలమును జరుగ లేదు. పోనీ, ప్రజాసామాన్యము తిరుగబడ్డారను పల్లెత్తు మాటనైన యే యింగ్లీషువాడును, యెన్నడును, కలలోనైన అనలేదు. రాణీ యెక్కడనో కాశీలో వెయ్యిమైళ్ల దూరములో బందిఖానాలో వున్నది. అత్యంత బలవంతుడును, ధనాఢ్యుడును అగు గులాబ్‌సింగ్ మన యింగ్లీషువారి పక్షముననే చెక్కుచెదరక నిలిచియున్నాడనుసంగతి యింగ్లీషు వారందరు ఒప్పుకొన్నదే. బ్రిటిష్ సేనలకు అలవిగాకుండ తిరుగబడినది ఒక్క ముల్తాన్ పట్టణమే. దానినెట్లో యింగ్లీషువారు స్వాధీనపరుచుకొననే పరుచుకొనిరిగద. హతభాగ్యులగు నా నగరవాసులు గావించిన నేరమునకై కుంపిణీవారు వారిమీద పూర్తిగ కసితీర్చుకొననే తీర్చుకొనిరిగద. ఇక కావలసినదేమున్నది. ఇక మహారాజును పదభ్రష్టుని గావించవలసినంత అవసర మేమివచ్చినది? ఈ తిరుగుబాటులో దౌర్జన్యము చేసిన శిపాయిలను శిక్షించుటకును ప్రజలకు ప్రభుత్వమునకు కలిగిన నష్టమును కూడదీసికొనటకును కొంత కాలమువరకు ప్రజలకు సాధారణ శివిల్‌హక్కులను నిలిపి

వేసి, "మార్షలులా" ను (మిలిటరీ పరిపాలనను) ప్రక టించి, తిరుగుబాటుచేసిన సేనలను చెదరగొట్టివేసి యుండి యున్నయెడల, నిక్కచ్చియగు న్యాయము అందరికి జరిగెడిది గద. ఇంతకు మించిచేసిన యావత్తు పనులు కేవలము దొంగల దోపిడియని నిష్పాక్షికమగు లోకచారిత్రము ఘోషింపక మానదు.

క్రొత్తగవచ్చిన పంజాబుదేశమును తనయబ్బ సంపాదించిపెట్టిన సొంతయెస్టేటుగ భావించి డాల్హౌసీప్రభువు దాని కెన్నియోరీతుల అలంకారములు—— తోటలు, దొడ్లు, రోడ్లు, మున్నగునవి—— విలాసముగ చేయించుచుండగ, యిటు ఆకస్మికముగ తనవిశాల సామ్రాజ్యపు ఆవలికొననుండి యింకొక విజయాహ్వానమువచ్చుటచే ఆతడు తక్షణమే కలకత్తాకు పరుగెత్తుకొనివచ్చెను. బర్మాదేశములోని "చిట్టగాంగు" పట్టణమునుండివచ్చిన యింగ్లీషువారి వర్తకపుటోడయజమాని తన సరంగుపై క్రౌర్యమొనర్చెనను అన్యాయపు అపవాదము మీద రంగూనులోని అధికారులచే వెయ్యిరూపాయిలు జరిమానా విధింపబడెను. అట్లే యింకొకయోడ కెప్టెన్ తన నౌకర్లను హింసించెనను నేరముపై రంగూన్ అధికారులచే శిక్షింపబడెను. తమవారినిట్లు అక్రమముగ శిక్షించినందుకుగాను రంగూన్ అధికారులు తమకు నష్టపరిహార మివ్వవలసి యుండునని యింగ్లీషు గవర్నమెంటువారు కోరిరి. ఈ కోర్కెను అమలుజరుపుటకుగాను బర్మాదేశములోని ఐరావతీ నదీ ముఖ ద్వారముపైకి యింగ్లీషువారు రెండు యుద్ధనౌకలను పంపించిరి. బర్మాగవర్నరును తీసివేసి, ఆతని స్థానమం దింకొకరిని నిలి

పిరి. ఈతడు యింగ్లీషువారు చెప్పినట్లు ఒప్పుకొనుటకు సిద్ధముగ నుండెను. కాని, యీలోగా అల్పమగు యేవో ఆస్థాన మర్యాదలలో—నడవళ్లలో—యిరుపక్షములకు అపోహాలు కలిగెను. దీనినొక మిషగ గొని, "కత్తివాడి చూపుట కిదియే మంచి సమయము" ని కమాండర్ లాంబర్టు తలంచెను. అంతట రంగూన్ పట్టణములో నున్న యావన్మంది యింగ్లీషు ప్రజలను రేవులోనున్న రెండు ఓడలపైకి తక్షణమే వచ్చివేయ వలసినదని ఆజ్ఞాపించిరి. పిమ్మట జనేవరి 6 వ తేదీన యీ యింగ్లీషు కమాండర్ ఐరావతీ నదిలో యెవరు కాపలా లేకుండ వున్న బర్మారాజు ఓడను అర్ధరాత్రివేళ పోయి పట్టుకొనెను— ఎవరికి చెప్పకుండ యీ రీతిగ దేశ శాంతికి భంగము కలుగజేయుట బర్మావారికి సహింపరానిదయ్యెను. ఇది సహజమేగద. అంతట బర్మారాజు కోట నుండి ఫిరంగులు ప్రేల్చబడెను. దీనికి ప్రతీకారముగ యింగ్లీషువారి యోడలనుండి వినాశకరమగు ఫిరంగిగుండ్లు వచ్చి పడెను. ఈ రీతిగ యేదోమిష కనిపెట్టుటకైనను యెంత మాత్రము వ్యవధిగాని, కష్టముగాని అవసరము లేకుండగనే— అపూర్వమగు రీతిని— బర్మావారితో రెండవసారి యుద్ధము ప్రారంభమయ్యెను.

బర్మావారు కుంపిణీవారికేవో అవమానములు, ఉపద్రవములు, మనక్లేశములు, మున్నగునవేవేవో చేసిరని చెప్పి పెద్దజాబితానొకటి చదివి వారిపై యీదోషారోషణాలను శరపరంపరలుగ గురిపించిరి. ఈ దోషారోపణలను లోకము వినుటకు యిదే మొదటిపర్యాయము. "తేరగావచ్చే

టట్టయితే మాచాడింకొక డున్నాడన్నట్లు" దేశము పేరిట పరుల నుండి నష్టపరిహారము లాగికొనుట కవకాశమున్నప్పుడు, "నాకునష్టము కలిగిందంటే, నాకునష్టము కలిగిందని" మొగ బడేవారు చాలమంది బయలుదేరుతారు. "సువర్ణపాదము"ను ప్రఖ్యాతిగాంచిన బర్మారాజ్యప్రజల కింతటి అహంకారమున్నం దుకు తగురీతిగ వారికిబుద్ధిచెప్పి, నాగరకరాజ్య సిద్ధాంతముల గూర్చి వెనుక వీరికి చెప్పిన పాఠమును తిరిగిజ్ఞాపకము చేయ వలసియుండెను. బర్మాప్రభుత్వమువారు తామొనర్చిన అక్రమ ప్రవర్తనకు బహిరంగముగ క్షమాపణకోరి, నష్టపరిహారము క్రింద పదిలక్షలరూపాయలిచ్చి, రంగూనులో శాశ్వతముగ యింగ్లీషు రెసిడెంటును వుంచుకొనుటకు ఒప్పుకొనవలెననిరి. ఈ షరతులకు బర్మావారు అయిదువారములలోగా ఒప్పుకొ ననియెడల, యింక యెక్కువ పరిహారమును యితరవిధముల బలాత్కారముగ లాగికొందుమనిచెప్పిరి. ఈ షరతులకు బర్మావారెట్లును ఒప్పుకొనరను సంగతి అందరికితెలిసినదే కాబట్టి, మదరాసు బొంబాయిలనుండి సేనలను రప్పింప నారం భించిరి. సముద్రముమీద ప్రయాణము చేయుటకు శిపాయిలు ఒప్పుకొనలేదు. "మమ్ములను మెట్టప్రదేశములలో ఉప యోగించుటకే చేర్చుకొన్నారుగాని, సముద్రముమీద పంపుటకుకాదు" అని శిపాయిలనిరి. అందుచే ఓడలలో యెక్కవలసినదని ఆజ్ఞాపించినప్పుడు వారు "మే మెక్కము" ని నిరాకరించిరి. ఎంతచెప్పినను వారు విన లేదు. అందుచే వారిని మెట్టదారిని డక్కామీదుగ పంపిం చిరి. డక్కాలో అప్పుడు కలరా విశేషముగ రేగుచుండెను.

చాలమంది శిపాయిలీ జాడ్యముచే నశించిరి. మిగిలినసేనల నెట్లో నెమ్మదిగ ఓడలెక్కించి బర్మాలో దింపిరి. ఈ వ్యవహారమందు గవర్నర్ జనరలగు డాల్హౌసీ అత్యుత్సాహముతో-పట్టరాని సంబరముతో- దిగెను. ఏలననగ, "సామ్రాజ్య సౌందర్యమును" పొందికగ దిద్దుటయందీతని కెంతయో ఉత్సాహముండెను. ఆ ఉత్సాహమును— ఆ ఉబలాటమును— తీర్చుకొనుటకిప్పుడు మంచి అవకాశము చిక్కెను. తనరాజ్యముచుట్టు యీతడొక మెరని గుండని గీతగీసెను. ఈ గీతకు యే పరాయివారిరాజ్యము అడ్డమువచ్చినా, యీ గీతలోపల యే పరాయిరాజ్యమైనావుండి దానివల్ల మొరికి యేర్పడి అందము చెడగొట్టినా, అట్టిరాజ్యములనెల్ల మెదలకుండ తన రాజ్యములో కలుపుకొని యూరకుండుట కతడు నిశ్చయించుకొనెను! ఇంగ్లీషువారికిచెందియున్న అరెకాన్, మోల్మెన్ రాష్ట్రములమధ్య వెక్కిరించినట్లుగ పరాయి దేశస్థులదగు "పెగూ" రాష్ట్రమున్నది. "దీనినికూడ యింగ్లీషువారు కలుపుకుంటే చక్కగ అందముగ, యింగ్లీషువారిరాజ్యమంతా యేకఖండముగ వుంటుంది. కాబట్టి, దీనినెందుకు కలుపుకోకూడదు? విధిగ కలుపుకొని తీరవలసినదే; సందేహము లేదు. సరే, అయితే పదండి, "పెగూ"ను కలుపుకుందాము" అని బయలుదేరినారు కుంపిణీవారు. కోటి రూపాయలు, వృథాగా కలకత్తా ఖజానాలో మూల్గుచున్నవి. దీనికేదైనా వినియోగ ముండవద్దూ? బర్మాదేశములో కోస్తా వెంబడి కావలసినంత ఆడవిప్రదేశమున్నది. ఈ యడవిలో అనేకరకములగు ద్విపాద, చతుష్పాద జంతువు లున్నవి. వీని ముందు

గతి యెట్లుండవలెనను విషయమై వీనితో సంప్రదింపవలసిన పని లేదు-అవి సంప్రదింప నర్హ్హములుగావు. ఇట్టిప్రదేశమునుకలుపు కొనుటకై పెట్టుబడి పెట్టుటకంటె యీ కోటి రూపాయలకు యింకొక విధముగ సద్వినియోగ మేమికలదు? బర్మావారు చేసినారన్న నష్టముకంటె, యిప్పుడు కుంపిణీవారు తత్ప్రతీ కారముగ చేసిన నష్టమే హెచ్చుగ నుండెను. అదిగాక, బర్మావారు తమకు నష్టపరిహార మిచ్చువరకు హామీగా కుం పిణీవారు బర్మారాజు ఓడను తమవద్ద నుంచుకొనిరి. కాబట్టి, యిట్టిస్థితిలో, యెవరికైనా అక్రమము జరిగిందంటే, బర్మా వారికి జరిగిందికాని, కుంపిణీవారి కేమియు జరుగలేదు— అయితేయేమి ? డల్హౌసీకి పెగూ దేశము కావలసివచ్చి నది; తక్షణమే యుద్ధపుటోడలు బయలుదేరెను— ఇంతే— ఎక్కువమాట లెందుకు? మార్టబాన్, రంగూన్ నగరములు విశేషనష్టమేమియు లేకుండగనే ఏప్రిల్‌లో కుంపిణీవారి వశ మయ్యెను. వర్షకాలములో యుద్ధ మాపుదలచేయబడుట వలన అక్టోబరు నెలవరకు "ప్రోమ్" పట్టణమును ముట్ట డించలేదు. పిమ్మట,— కొద్ది గంటలమాత్రము యెదిరిం చిన పిమ్మట— యీ పట్టణముకూడ కుంపిణీవారి వశమ య్యెను. కుంపిణీ సేనలో లెక్కకొక్క శిపాయి మాత్రము నష్టమయ్యెను. కుంపిణీవారికి అప్పు డక్కడనున్న శీతోష్ణస్థితివలననే యెక్కువ ఉపద్రవము గలిగినది కాని, శత్రువులవల్ల యేమియు కలుగలేదు. ఇదియే వారి కెక్కువ శత్రువై బర్మావారి పక్షమునజేరి ఘోరముగ పోరాడెను.

అకారణకల్పితమును, అపకీర్తికరమును నగు యీ బర్మా దండయాత్రవల్ల యెంత ద్రవ్యనష్టము కానున్నదో డల్హౌసీకి తెలియకపోలేదు. బర్మాలో నింక యెక్కువగ రాజ్యసంపాదన జేయబూనుట, "యుద్ధాపజయముకంటె యెక్కువ ఆపత్తును తెచ్చిపెట్టునని" ఆతడే మొట్టమొదట ఒప్పుకొనుచున్నట్లు నటించెను. మరియు, ప్రోము పట్టణము వశమైనదని తెలిసినపిమ్మట, "అంత దూరములో అట్టి దేశమధ్యమందు 20 వేల మంది సైన్యమును పోషించుట శుద్ధదండుగ; దీనివలన యిండియా గవర్నమెంటువారి నిల్వరొక్కముతగ్గి, తిరిగి వారు అప్పుల పాలగుటయే తటస్థించునుగాని, వేరొండులాభము లేదు" అని అతడే ఒప్పుకొనెను. ఇదంతయు తెలిసినవాడు యింతద్రవ్యనష్టమును ప్రాణనష్టమును గలిగించు యీ దండయాత్రనేల పంపినాడు? బర్మావారేదో కుంపిణీయుద్యోగస్థులకు చేసినారని చెప్పిన కించిత్తు అమర్యాదకు పరిపూర్ణముగ కసితీరునట్లు వారివల్ల నష్టపరిహారమునుపొందిన పిమ్మటకూడ, 'పెగూ' రాజ్యమును యేమైనాసరే దిగమింగవలయునని యీ డల్హౌసీయేల పట్టుపట్టెను? ఈప్రశ్నలకీతడు చెప్పిన యీ క్రింది సమాధానమును లోకచారిత్ర మొప్పుకొనునా? "పరదేశముల నాక్రమించుకొందమనుకోర్కె నిజముగ మనకెంతలేకపోయినను, మన కోర్కెకు కేవలము విరుద్ధముగ విధి మనలను బలాత్కారముగ ముందుకుతోస్తూవుంటే మనమేమిచేస్తాము? విధియాజ్ఞ ప్రకారము మనమువెళ్లి మనపైయాతడు పెట్టిన విధాయక కృత్యమును నెరవేర్చకతప్పునా? కాబట్టి, మనమాతనియాజ్ఞ

ప్రకారము వెళ్లి మనవిధిని నెరవేరుద్దాము, రండి" అని డప్లాసీ తాను చేసినపనుల కన్నిటికి సమాధానము చెప్పుకొనుచున్నాడు ! ఇదినిజమైన సమాధానమేనా ? దీనిని లోకమొప్పుకొనునా ?

ఇది కేవలము పాలిశక్కి సమాధానము. ఆలోచనారహితమగు మిథ్యావాదము. తానొనర్చినపని తప్పని ఆతడే ఒప్పుకొనెనుగద. ఇక యీశుష్కసమాధానములవల్ల ప్రయోజనమేమి? వీనినెవరు నమ్మెదరు ? "మనము చెప్పిన యీ సమాధానము మనము నిజాయితీబుద్ధితో— దేవుని ముఖముచూచి— చెప్పినదేయని లోకమును నమ్మింపజూచినచో, యిక దీనియందిమిడియున్న మనరాజ్యతంత్రనిపుణతను గూర్చి లోకమేమను కొనవలసియుండు?" నని రిచ్చర్డుకాబ్డెన్ అనునతడు నిర్మొగమోటముగ అడుగుచున్నాడు. "విధికృతము, మనమేమి చేయగలము?" అను వెర్రిసిద్ధాంతమును నేను ఒప్పుకొనను. "ఈ వెర్రిసిద్ధాంతము మహమ్మదీయుల ఎదుటను, హిందువులయెదుటను పనికివచ్చునేమోగాని మన క్రైస్తవులముందుమాత్ర మిట్టి కుంటిసమాధానము సాగదు. కేవలము మనస్వార్థముకొరకుకానిచో బర్మాను కలుపుకోవలసినంత అవసరమేమి కలిగినది? "శత్రురాజ్యములలో కొంతైనా కలుపుకోకపోతే వారు మనలను హేలికగ చూస్తారని" కొందరొక సమాధానము చెప్పుచున్నారు. అంటే యేమన్నమాట?— మూడులక్షల సైన్యసమూహము తోడను, యావద్బ్రిటిష్ సామ్రాజ్యసర్వాధికారసన్నాహములతోడను బలిసియున్న యిండియా దొరతనమువారి రీతిగ

స్వవినాశకరమగునిట్టి అన్యాయమార్గ మవలంబింపనిచో వారికి బర్మావారిదృష్టిలో న్యూనత కలుగుననియా భావము? బలేసమాధానము!" అని రిచ్చర్డుకాబ్డెన్ వ్రాసెను. "రు 9,900 లును, ఒక క్షమాపణ యిస్తేచాలునని" బ్రిటిష్‌సామ్రాజ్య చక్రవర్తినియగు విక్టోరియా మహారాణిగారి ప్రతినిధి ఒకానొక బర్మాపట్టణ పరిపాలకుని మొదటకోరెను. ఇందలి న్యాయాన్యాయముల గూర్చి కొంచెమాలోచించుటకైనను అవకాశ మివ్వకుండ తక్షణమే, "పదిలక్షల రూపాయ లును, బర్మా రాజ్యమునేలు రాజునుండి క్షమాపణయు" కావలెనని యీ రాణీ ప్రతినిధి కబురంపించెను. "దీని విష యమై రాయబారులద్వారా మాట్లాడుకొని ఫైసల్ చేసు కుందాము" అని బర్మారాజు మర్యాదగ వ్రాసిన ఉత్తరము నకు సమాధాన మేమియు పంపకపోగా, హఠాత్తుగ కుంపిణీ సేన నాతని దేశముపైకి పంపించి— నష్టపరిహారాలు, క్షమాపణలు మున్నగు మాటల నటుంచి— ఆతని రాజ్య ములో విశాల భూభాగమును కొంత కాజేసి పైపెచ్చు యీ యుద్ధపుఖర్చులు నీ వివ్వకపోతే, నీ రాజ్యములో యింకా కాజేస్తానని బెదరిస్తాడా— యీ పెద్దమనిషి— సీమ మహా రాణీ ప్రతినిధినని పేరుపెట్టుకొన్న యీ దత్హౌసీ! బుద్ధి పూర్వకముగ యింతపనిచేసిన యీ పెద్దమనిషి, "ఎబ్బెబ్బే, యిదంతా చెయ్యడం నా మనస్ఫూర్తిగ యిష్టములేదండీ; విధిలేక, ఆత్మరక్షణార్థమై, బలాత్కారముగ చేయవలసి వచ్చింది" అని చెప్పి లోకమును నమ్మించి మోసపుచ్చవలె నని చూచుచున్నాడా యీ పెద్దమనిషి! యుద్ధము

చేయవలసి వచ్చినంతగ యెంతమాత్రము యెంత మందబుద్ధి గలవానికినికూడ కనుపించని యేవో హేతువులను శుష్క-మిషలను సిగ్గువిడిచి బహిరంగముగ యేకరువుపెట్టుచు, "యిక యింతటినుండి కోస్తాపరగణాయగు 'పెగూ' రాష్ట్రమునుకూడ మా యింగ్లీషు రాజ్యములో కలుపుకొడానికి మంత్రిమండల పరివేష్టితుండగు బర్మా గవర్నర్ గారు నిశ్చయించినారహో" యని చెప్పి, 1852 సం|| డిశంబరు 20 వ తేదీన బర్మా ప్రజలకెల్ల తెలియునట్లొక పెద్ద ప్రకటనను గావించిరి. అందులో బర్మా రాజునుకూడ యీవిధముగ బెదరించిరి:— "నీవు పూర్వమువలెనే, యింగ్లీషువారితో స్నేహముగ వుండకుండ, మమ్ముల నీ పెగూ రాజ్యవిషయములో తగాదా చేసినావంటే, జాగ్రత. మా గవర్నర్ జనరల్ గారి చేతిలోనున్న యావత్తు బలమును నీమీద మరల ప్రయోగించి, నిన్ను, నీ రాజ్యాన్ని, నీ కుటుంబాన్ని యావత్తు కూలద్రోసి, నిన్ను, నీ వంశమువారిని దేశమునుండి వెళ్లగొడతాము, జాగ్రత" అని బెదరించిరి. కాని, తమకెంతటి వంచన గలిగినను, అపజయమును కూడదీసికొనుఆశ పూర్తిగ పోయెననిగాని, తమ రాజ్యమును పగులగొట్టి కుంపిణీవారు శాశ్వతముగ తీసికొందురనిగాని, పాపము, బర్మా రాజుగాని, ఆతని మంత్రులుగాని తలంచియుండలేదు. "ఇప్పు డాక్రమించుకొన్న దేశమును వదలివేసి, పూర్వమున్న సరిహద్దుల లోపలికి మరలిపోయినచో, యీ యుద్ధపు ఖర్చుల నన్నిటిని నేనిచ్చుకొందున"ని పాపము, బర్మారాజు కబురు పంపించెను. దీనికి బదులుగ మన కుంపిణీవా రేమిచేసిరి? పెగూ రాజ్య

ము మాత్రము వదలిపెట్టకుండ, "శాశ్వత మిత్రత్వమును, ప్రశాంతభావములను" తెలుపు మామూలు పాటతో ఒక ఒడంబడిక పత్రమును వ్రాసి "కెప్టెన్ ఫెయిర్"యను వానిచేతి కిచ్చి బర్మారాజువద్దకు పంపించిరి. కాని, దీనిపై బర్మారాజు సంతకముచేయలేదు. ఇప్పటికీ కథజరిగి 20 యేండ్లైనది. కాని పెగూరాజ్యమును కుంఫిణీవారికి యిచ్చివేసినట్లుగ దెలుపు పత్రము— బర్మారాజు దస్కతుతోనున్న పత్రము—యీ రోజువరకులేదు. "బందిపోటుచేస్తామనే బెదరింపులను ఫలానికాలములోపల అమలుజరుపవలెను—లేకపోతే, దానికి లిమిటేషన్— కాలదోషము— పట్టిపోతుంది" అనిచెప్పే శాసనము (ఆక్టు) యేదైనావున్నదా? లేదా? బర్మావారిం కను మూర్ఖముగా నేవున్నారు. కాబట్టి, యిదొకమిషగపెట్టి వారి రాజ్యాన్ని యికపగులగొట్టి పంచుకుంటామని కుంఫిణీ వారు అనదలచుకొన్నారా?



# భరతఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన

## 25 వ అధ్యాయము.

జులుము :— 1849-1853



మనయెడ ననురాగముతోనుండు దేశీయరాజులను తీసివేయకుండ నిలుపుటవలన మనకు భద్రత యెక్కువగునేగాని తగ్గదు. పరదేశ శత్రువులెవరైనావచ్చి యిండియామీద పడినప్పుడుగాని, లేక, యింగ్లండుకేదైన యితరచిక్కులు యిబ్బందిగలిగి, యీయసాధారణభారమునంతను యిండియాయే భరింపవలసినప్పుడుగాని, మనకు ఈదేశీయరాజ్యములు పెట్టనికోటలుగ నుండును. కాని, వారికీతీరుగ, మనకు మంచి యండగ నుండవలెనంటె మనము వారిని, వారికుటుంబములవారిని యెంతోమర్యాదగ, జాగ్రత్తగ ఉదారభావములతో చూడవలెను. వారికి, లోపలమనస్సులో యెంత అనుమానమున్నను, అట్టి యనుమానమునకు తావులేదనియు, "మీస్వాతంత్ర్యమునకు మేము భంగకలిగించమనియు, యేదోసందుచూచి మీరాజ్యాలను మా యింగ్లీషురాజ్యంలో కలుపుకోడానికి మేము చూడడంలేదనియు" యీదేశీయరాజులకు చక్కగ నచ్చునట్లు బోధించవలెను.

—కానింగ్ ప్రభువు

సామ్రాజ్యసంపాదనాసౌధము గిలాబాతోసహా పూర్తియైనది. ఈ సౌధములో నింకను అక్కడక్కడ పాత రంగులు, పాతరూపములు నిలచియున్నవి. ఇవన్నియు యీ నూతన సామ్రాజ్యపు పూతతో గిలాబాతో సరిపోక వెక్కిరించినట్లుగ వున్నవి. కాబట్టి, వీని ముఖముమీద కూడ కొత్తరంగులు— కొత్త గిలాబా— పూస్తేనేగాని, పని యావత్తు పూర్తియై, సౌధమునకు అందమివ్వదు. ఇప్పుడీపని యొక్కటే కురదలాగా వున్నది. యావద్భారత వర్షములోను మూడింట రెండువంతులు మనచెప్పుచేతలలో నున్నది. తక్కిన ఒక వంతుకూడ మనలను ధిక్కరించే స్థితిలో లేదు. చాలామంది హిందూమహమ్మదీయ రాజు లింకను అక్కడక్కడ మిగిలియున్నారు. వీరు తమ ప్రజలపై సర్వాధికారములను— ప్రాణముల నిచ్చుటకును, తీసివేయుటకునుకూడ అధికారములను— గలిగియున్నారు. తమ రాజ్యములలో పన్నులవేసికొనుటకును, సైన్యదళ ముల సమకూర్చుకొనుటకును, దర్బారుల సాగించుటకును, రాయబారుల నంపుటకును, తమ రాజవంశమునకు అనాదినుండియు వచ్చుచున్న గౌరవప్రతిష్ఠల ప్రజల వల్ల రాబట్టుకొనుటకును,— యీ రాజులందరు యింకను అధికారముగలవారై యున్నారు. కాని, వీరి రాజ్యములన్నియు నిరంతరము పెచ్చుపెరిగివచ్చుచున్న పర రాజ్యాధికారమనబడు మహాసముద్రజలములచే నలుముఖముల నావరించబడి, తమ్ము నీసముద్రజలములెప్పుడు ముంచివేయు నోయను భయముతోనున్న చిన్నలంకలవలెనున్నవి. నిన్నటి

వరకు తమవలెనే మహాస్వాతంత్ర్య వైభవములతో తుల తూగుచున్న తమ తోడిదేశీయరాజ్యములన్నియు నేడువిచ్ఛి న్నమైపోయి, వాని తాలూకు పగిలిపోయిన ముక్కలన్నియు, తమచుట్టు చిందరవందరగ విరజిమ్మబడియున్నవి. నామ మాత్రపు స్వాతంత్ర్యమును నిలువబెట్టుకొన్న రాజ్యములలో ఒక్కటికూడ, సంపూర్ణ స్వాతంత్ర్యమునకై పెనగులాడు చుండుటలేదు. అవి యీ పెనగులాటను మానివేసి, నోరు మూసికొని పడియున్నవి. ఈ మహాసామ్రాజ్యపు వలలో నుండి తప్పించుకొని బయటపడుదమను నాశ వారికి స్వప్నసదృశ మయ్యెను. ఇదివరకు మహారాష్ట్రులక్రిందనో, మహమ్మదీయుల క్రిందనో, పడియున్న చిల్లరరాజ్యములన్నియు నేడు నోరెత్త కుండ బ్రిటిష్‌సామ్రాజ్యపు సార్వభౌమాధికారమునకు జోహా రులొనర్చుచుచు పడియున్నవి. మరికొందరురాజులు లోలోన సణుగుకొనుచు, "మనఖర్మమురాబాబూ!" అని విలపిం చుచుండిరి. కాని, పైకిమాత్రము నోరెత్తి సార్వభౌమాధి కారమును ధిక్కరింపజాలకుండిరి. వీనికిని, సార్వభౌమాధి కారమునకును గల సంబంధములు ప్రతి రాజ్యమువారితోను చేసికొన్న ఆయా ఒడంబడికలలో నిరూపింపబడియున్నవి. ఆ యొడంబడికలు యిప్పటికిని నిలచియున్నవి. ఈ యొడంబడికలలో ప్రతిదానిలోను స్పష్టముగ నిరూపింపబడి యున్న ప్రధానసూత్ర మొకటిగలదు. అదేదనగా:—ప్రతి దేశీయరాజ్యముయొక్క ప్రత్యేకవ్యక్తిత్వము అంగీకరింపబడి యున్నది; మరియు, అప్పుడు రాజ్యముచేయుచున్న రాజు కు వంశపారంపర్యాధికారము తీసివేయకుండ అప్రతి

హాతముగ నుంచుదుమని కుంపిణీవారు హామీయిచ్చిరి. వారసత్వపుహక్కు యేసూత్రములపై ఆధారపడియున్నదని గాని, దానికేవైనా మినహాయింపులుంటే ఆ మినహాయింపు లేమియనిగాని, యితరసందర్భములం దేవైనా హక్కులు నిర్ణయింపవలసివస్తే, వాని నేసూత్రప్రకారము నిర్ణయింపవలె ననిగాని యింతమంది వైస్రాయిలు, యింతమంది రాజులతో, యిన్నేండ్లనుండి చేసికొన్న యిన్నియొడంబడికలలో ఒక్కదాని యందైనను వివరముగ నిరూపింపలేదు. ఇట్టి వివరములగు నియమములను మరి యేయితరరాజ్యాంగములైనా, యేకాలమందైనా, యిట్టి దస్తావేజులలో వ్రాసికొన్నట్లుగాని, వ్రాసికొను నాచారమున్నట్లుగాని లోకములో యెవరైనా, యెప్పుడైనా విన్నారా? లేదు. ఈయొడంబడిక దస్తావేజులు చాలవరకు ప్రపంచములో అనాదినుండియు క్లుప్తమగు భాషలో వ్రాయబడు నాచారముకలదు. ఇందలి షరతులు సర్వసామాన్య నియమములుగ వ్రాయబడి, ఉభయపక్షములవారి ఒప్పుదలలను, ఉద్దేశములను సామాన్యముగ నిరూపించునేగాని ముందు రాగలవని ఊహించదగినట్టియు, ఊహించరానట్టియు సమస్త సందర్భములను— ఒక్కచీమ దూరు సందుకూడ లేకుండ— అన్ని సందర్భములను యేకరువు పెట్టజాలవు. ఏ పద్ధతులపై ఉభయపక్షములవారు శాంతిని, సమాధానమును పొంది యుండ దలంచిరో ఆ పద్ధతులలోని సర్వసామాన్య నియమములను— విశాలభావములనుమాత్రము అక్లిష్టవాక్యములతో సంధిపత్రములు నిరూపించును. ఇందలి షరతులను ముందు వచ్చే ప్రతి యే క్రొత్తసందర్భమునకు వర్తింపజేయుటలో

ఉభయపక్షములవారు కలిసి అంగీకరించే పద్ధతినో, లేక, నిష్పక్షపాతులగు మధ్యవర్తులు చెప్పు పద్ధతినో వర్తింపజేయ వలసి యుండుననునది యిట్టి సంధిపత్రములలో సర్వసామాన్య ధర్మమైయున్నది.

ఇదియే సంధికి ఒడంబడు ఉభయపక్షములవారి యుద్దేశ మని గ్రహించవలసి యున్నది. విస్పష్టమగు నిట్టి అంతర్జాతీయ ధర్మసూత్రప్రకారమాలోచించి చూచినచో, యీ సంధిషరతులందు దేశీయరాజులకు వంశపారంపర్యపు హక్కు నిస్సందేహముగ అంగీకరింపబడినట్లును, దానిని ఉభయులు ఆప్రకారమే అర్థముచేసికొనునట్లును నిస్సందేహముగ ఋజువు కాగలదు. ఎవరైతే క్రమముగ వారసునని ఋజువుపరచుకొనగలడో వానికే యీ రాజ్యాధికారము, రాజబిరుదము, హోదా, సమస్తము సంక్రమించును. ఏ "లా" ప్రకారము, యేధర్మసూత్రప్రకార మీవారసత్వము నిర్ణయింపబడవలెను? ఈ ఒడంబడికకు పాత్రులైన విదేశీయుల ధర్మసూత్రము ననుసరించి కాదు. ఏరాజ్యమునకైతే యీసంధి వర్తించునో, యే రాజ్యపుస్థానికాధికారమును రక్షించుటకీ యొడంబడిక పుట్టినదో—ఆరాజ్యపు స్థానికధర్మసూత్రములననుసరించి వారసత్వము నిర్ణయింప బడవలెననుట సామాన్య, సహజధర్మమై యున్నది. ఈ సంధిచేసికొనిన కాలమందు ఉభయపార్టీలు యీ సహజధర్మమునే ఉద్దేశించినట్లు స్పష్టముకాగలదు. విజయ పరివేష్టనము ఒక చుట్టు పూర్తిగ తిరిగి వచ్చువరకు యీ ధర్మసూత్రముయొక్క నిజాయితీని గూర్చి యెవరుగాని పల్లెత్తుమాటయైన పలుకలేదు. పురుష

సంతతిలేని కారణముచే కొడగు రాజ్యమును లోగడ యింగ్లీషువారు కలుపుకొని యుండిరి. కాబట్టి, ఆ ప్రకారమే తక్కిన రాజ్యములనుకూడ యేల కలుపుకొనరాదని కొందరు వాదింపజొచ్చిరి. కాని, కొడగురాజ్య సందర్భమునకును— తక్కిన వానికిని యేకోశమునను పోలికలేదు. ఈ రాజ్యములలో గలిగిన సందర్భ మేమనగ:— దత్తత వలనగాని, తదితర కారణములచేగాని యేర్పడిన వారసులకు రాజ్యాధికారము కలదా లేదా యనునదే యిటీవల ప్రబలినప్రశ్న. ఇట్టి వారసులకు రాజ్యాధికారము తప్పక వచ్చితీరుననునది భారతీయుల ప్రాచీనాచారమైయున్నది. ఈ విషయమై భారత ప్రజలయందెట్టి సందేహమును యేకోశమందును, కించిత్తైనను లేదు. 1818, 1819 సం॥ లో సతారా రాజ్యముతో చేసికొన్న ఒడంబడికలో, తద్రాజ్యమునకు పారంపర్యపు హక్కుగలదని యంగీకరించినను, యిప్పుడాదేశపు రాజు పురుషసంతతి లేకుండ చనిపోయినాడు గాన, అది సార్వభౌమాధికారులమగు బ్రిటిష్ వారికే సంక్రమించునని డల్హౌసీ ప్రభువు అర్థముచెప్పెను. ఆరాజు ప్రతాపసింగు అను కుర్రవానిని దత్తతచేసికొనెను. అయినను, యీ ప్రతాపసింగు ఔరసపుత్రుడు కాడుగాన, యీతనికి రాజ్యమురాదని డల్హౌసీప్రభువు వాదించెను. ఎంత ఆశ్చర్యము! ఇంతకంటె లజ్జాహీనమగు, దురంతమగు రాజ్యాపహారణ కార్యమేముండును? ఇంతకటె, "యీ ప్రతాపసింగు "పిట్టులు," "గాలులు" మున్నగు యింగ్లీషురాజ వంశములకు చెందినవాడు కాడుగాన, యీతనికీ సతారారాజ్యము

రాదు పోమ్మం'' టే బాగుండేది! హిందూధర్మశాస్త్రప్రకారము హిందువులకు దత్తతాధికారము కలదనుట అనాది సిద్ధము; సర్వలోక విదితము. ఇంగ్లీషు లాప్రకారము, యింగ్లాండులో, ప్రతివాడు తన స్వాంతఆస్థిని నిరాటంకముగ అమ్ముకొనుటకు యెట్టిహక్కు,— యెట్టినిరాక్షేపణయగు హక్కు — అనాదినుండియు కలదో అట్లేయిక్కడ యిండియాలో ప్రతి హిందువునకుకూడ దత్తత చేసికొను హక్కు నిరాక్షేపణముగ అనాదిసిద్ధముగ గలదు. ఆస్థినిగూర్చియు, తదితర హక్కు విశేషములను గూర్చియు, వివిధరాజ్యములలో వివిధాచారము లుండియుండవచ్చును. కొంత కాలమునకు మహమ్మదీయులుకూడ కొన్ని హిందూధర్మసూత్రములను తమ ధర్మసూత్రములలో చేర్చుకొనసాగిరి. వానిలో ప్రధానమైనది దత్తతాధికారము. రాజ్యపాలకుడగు నవాబుగాని, మహారాజుగాని, జీవించి ఆరోగ్యవంతముగ నున్నన్నాళ్లు, తన కింకను సంతతి కలుగునని ఆసించుచుండును. అందుచే, తన తదనంతరము రాజ్యము ఫలానివానికి పోవలెనని ముందుగా పరాయివాని కెవనికిని యిచ్చివేసెడివాడు కాడు. ఏలననగ, అట్లు యిప్పుడే యిచ్చివేసినచో తన యవసానదశయందు— తన వార్థక్యమందు— వాడు తనను సరిగా ఆదరించి, పోషించునో లేదో యనియు, తన వార్థక్యదశయందు వాడు చెలరేగి తనను రాజ్యభ్రష్టుని చేయునేమో యనియు భయపడుచుండును. కాని, తన యవసానదశ వచ్చుచున్నదని తనకు తెలిసినప్పుడు, సంతానహీనుడగు రాజు యనంతరము తన రాజ్యభారమును వహించుటకును, తన

కిన్నినీళ్లు చల్లుటకును, ఒక పుత్రుని దత్తతచేసికొనవలెనని తప్పక కోరును. ఇట్టికోర్కె ప్రతి భారతీయుని హృదయమందును తప్పక కలిగితీరును. ఇట్లు దత్తతచేసికొనబడిన కుర్రవాడు పసివాడో, దుర్బలుడో, లేక దుర్మార్గుడో అయిన యెడల ఒకొక్కప్పుడు మరియొకడు తాను వారసుడనని బయలుదేరి, ప్రజానురాగమును సంపాదించి దత్తునిపై దండెత్తి వానిని రాజ్య భ్రష్టునిజేసి తాను సింహాసనమెక్క జూచుచుండును. జ్యేష్టునికే రాజ్యాధికారము గలదని నిస్సంశయముగా నంగీకరింపబడిన యూరపు ఖండమందలి క్రైస్తవ రాజ్యములలో యిట్టి పోరాటములు లేవా? "జ్యేష్టుడు రాజ్యార్హుడుకాడు, నేనే సింహాసనమునకు వారసుడను"అని యూరపుఖండమందు కొందరుచెలరేగి పెంచినపోరాటములసంగతి మనము వినలేదా? విప్లవమునకును, ధర్మశాస్త్రమునకును, సంబంధమేమి? అవి రెండును పరస్పర విరుద్ధములు. విప్లవమనునది ధర్మశాస్త్రములో భాగముకాదు. దానికది కేవలము విముఖము, విరుద్ధము. ధర్మబాహ్యమగు నిట్టి విప్లవమును కల్పింప సంకల్పించిన బ్రిటిష్ గవర్నమెంటుకు న్యాయమగు వారసులతో, ధర్మశాస్త్రప్రకార మేర్పడిన వారసులతో పనిలేదు. ఎవడుబలవంతుడై చెలరేగి గెలిస్తే యేదొంగవారసుడు చెలరేగి నిజమైన వారసునోడించి వానికి కొక్కుపెడితే— వాడే బ్రిటిష్‌గవర్నమెంటుకు కావలెను. వాడే బ్రిటిష్‌గవర్నమెంటుకు అండ. వానినే బ్రిటిష్ గవర్నమెంటువారు మద్దతు చేస్తూవుంటారు. కాబట్టి, ధర్మశాస్త్రమును పాటింపక, కేవలము దౌర్జన్యమే ప్రధానముగ చేసికొని, వారసత్వమును నిర్ణయింప బూనిన

పుడు యిక దొంగవారసులకు కొరతయేమి ? ఈ అధర్మభూతముయొక్క కోరలలోనుండి మొతమందియాయి నను పుట్టుకువస్తారు. మృత్యుదేవత యెవరినిగాని మన్నించదు. దానికొక వేళాపాళా లేదు—రోగి యే నిద్రలోనో వుండగావచ్చి హఠాత్తుగ వానిని యెత్తుకొనిపోవును. కావున, తన పరోక్షమందు తనకు వారసుడు ఫలానివాడు అని నిర్ణయించి చెప్పుకొనుటకు—(దత్తత చేసికొనుటకు) అతనికి అవకాశముండదు. అయినను, అతని యభిప్రాయములు అతనిభార్యకు—రాణీకో, బీగముకో—తెలిసియుండును గాన, ఆపనిని ఆమెయే నిర్వర్తింపవలయునని బ్రాహ్మణ పురోహితుడును, మహమ్మదీయ ముఫ్తీలును నిశ్చయించుచుండిరి. ఇట్లనేక సందర్భములందు జరిగినట్లును, దానివలన ఉపద్రవము లేమియు రానట్లును ఋజువు పరుచుటకు అసంఖ్యాకములగు నిదర్శనములు కలవు. ఒకొక్కప్పుడు పినతండ్రియో, లేక సన్నిహితజ్ఞాతియో, దురాశావతుడై చెలరేగి యీ దత్తునితో పోరాడుటయు గలదు. ఇట్టి పోరాటములు యింగ్లీషు దేశచరిత్రలోకూడ కలవు. వారసత్వాధికారము లేని "ట్యూడర్" వంశస్తుడొకడు బయలుదేరి వెనుక చనిపోయిన రాజుయొక్క దత్తకుమారుని తొలగించి, వానిని శిరచ్ఛేదమొనర్చి, తాను తక్తునెక్కి కూర్చున్నయుదంతము మన మెరుంగమా ? వెనుకటిరాజుచే మరణశాసనమందు నిరూపింపబడిన "నార్మన్" వంశస్తుడొకడొచ్చి, అదివరకే సింహాసనము నాక్రమించుకొని కూర్చున్న "శాక్సన్" వంశస్తునొకని క్రిందికి పడలాగి తాను తక్తు

నెక్కి కూర్చుండలేదా ? కాని, యిట్టి అధర్మకార్యములు అప్పుడప్పుడు యేదేశమందైన జరుగుచున్నను— అంత మాత్రముచేత— ఆ దేశపు అసలు ధర్మశాస్త్రము మారిపోయినదని ఎవరైన ఎప్పుడైన అనగలిగిరా ? ఇట్టి సందర్భములు కేవలము ధర్మమును, బాహుబలమును,— రెంటినికూడా— అతిక్రమించి జరిగిన విద్ధూర్యములు— సంక్షోభములు. ఇట్టి సంక్షోభము యేదేశమునకైనగాని నిత్యధర్మమై యుండజాలదు. ఈ సంక్షోభము అణగిన తరువాత మామూలు ధర్మశాస్త్రము యథాప్రకార ముగా సాగుచునేయుండును. ఆస్థియొక్కగాని, రాచ రిక క్రమముయొక్కగాని, ఆకారముమాత్రము మారకుం డెను. పురుష సంతతి లేనప్పుడు, స్త్రీ సంతతిద్వారా వార సత్వమువచ్చుట యూరపుఖండమందును, హిందూస్థానమం దునుకూడ, యుగయుగములనుండి అనుశ్రుతాచారమై యున్నది. భూములను, రాజ్యాధికార గౌరవ బిరుదములను, తదితరహక్కులను, స్త్రీలు కొంతకాలమనుభవించినంత మాత్రముచేత అవి అన్యాక్రాంతములై పోవనుమాట సూర్యా డస్తమించు పశ్చిమఖండములందెంత ప్రబలముగ నుండెనో, సూర్యుడుదయించు ప్రాక్ఖండములందుకూడ అంతప్రబలము గనే యుండెను.

ఇన్ని ప్రబలనిదర్శనములు కనిపించుచున్నను, వీని కన్నిటికి విరుద్ధముగ పోవలెననుబుద్ధి యుండియా వైస్రాయికి పుట్టెను. ఈబుద్ధి పుట్టగానే అతడు హిందూ మహమ్మ దీయుల వారసత్వపు ధర్మశాస్త్రములకు అర్థము చెప్పుటకు

తనకే అధికారము కలదని ప్రకటించెను. ఈతడు అహంకరించి తనకుతా నారోపించుకొనిన యీ యధికారమందు నైతికమగు నట్టిగాని, చట్టసమ్మతమగునట్టిగాని సత్యమావంతయేని లేదు. ఇట్టి అహంకారముతో నాతడు బయలుదేరి, యిటు భారతధర్మ శాసకులగు, మను, మహమ్మదు, అక్బరులకుగాని, అటు యూరోపియను ధర్మశాసకులగు "ఆల్ ఫ్రిడ్," "మూడవ ఎడ్వర్డు," "ఎలిజబెత్తు," "క్రామ్ వెల్" మున్నగు వారికి గాని, యెన్నడు తోచని క్రొత్తవ్యాఖ్యానముల నల్లెను. వారసులు లేరను మిషపెట్టి యీ రాజ్యముల నన్నిటిని కాజే యుటకై తాను తలపెట్టిన యీ రాజ్యతంత్రముయొక్క రహస్యమునంతను డల్ హౌసీ ప్రభువు తానుసీమకు మొదటిరోజులలో వ్రాసిన ఉత్తరములలో విపులముగ వివరించియుండెను. "క్రొత్త రాజ్యములను, రెవిన్యూను యెక్కువగ సంపాదించు కొనుటకు మనకు మంచి సరియైన అవకాశములు అప్పుడప్పుడు వచ్చుచుండును. అట్టి అవకాశములు వచ్చినప్పుడు మనము వానిని యెంతమాత్రము వదలివేయరాదు. ఇది వివేకవంతమును, నిర్దుష్టమునగు రాజ్యతంత్ర లక్షణము. ఈవిధముగ మనకు చేలోకువైయున్న రాజ్యములను సందుచూచి మన రాజ్యములో కలుపుకొనుటకు మనకు అవకాశములు అనేక విధములుగ రావచ్చును. ఎట్లనగ:- ఆరాజ్యములకు యేవిధమగు వారసులు లేకపోవడం ఒక అవకాశము. ఆదేశపు రాజునకు ఔరసపుత్రులు లేకపోవడం యింకొక అవకాశము. (ఈరెండు అవకాశములవల్ల మనమీరాజ్యాలను కాజేయవచ్చును.) ఔరసపుత్రులు లేకపోతే మనయింగ్లీషు గవర్న

మెంటువారు అనుజ్ఞయిస్తేనేతప్ప తమ హిందూలాప్రకారం చేసుకునే దత్తత చెల్లనేరదని గట్టిగ చెబుదాము. కాబట్టి, మనమీప్రకారము గట్టిగ పనిచేసితీరాలని నానిశ్చితాభిప్రాయము." ఒక్కపెట్టున రాజ్యాలనన్నిటిని దిగమ్రింగే సుడిగాలివంటి యీసూత్రమును అమలులో పెట్టుటకు 1848 సం॥లో సతారాసంస్థానములో మొట్టమొదటగ సందు దొరికెను.

1818 సం॥ లో పీష్వా పడిపోయినప్పుడు, "శివాజీ సంతతివారిని పదభ్రష్టులగావించి, క్రమముగ రాజ్యమునకు వచ్చిన యీ పీష్వాపరిపాలన నంతమొందించితిమి. ఇక శివాజీవంశమునకు న్యాయముగ వారసుడగు వానిని తీసికొని వచ్చి యిప్పుడు సింహాసనముమీాద కూర్చుండబెట్టి, అతని రాజ్యమును, వంశగౌరవమును నిలుపుటకు తగినంత రాజ్యము నతనికిచ్చి, ఆరాజ్యము నాతడు సర్వస్వతంత్రుడుగ పరిపాలించు కొనేటట్లు చేయుచున్నాము" అని బ్రిటిష్‌గవర్నమెంటువారు ప్రకటించిరి. ఈప్రకటన ప్రకారము 1819సం॥లో అప్పుడు వైస్రాయిగనుండిన "మాయిరా" ప్రభువు శివాజీ వంశములోని వాడగు "ప్రతాపసింగ్" అను వానినొకనిని తీసికొనివచ్చి, సతారాసింహాసనముపై కూర్చుండబెట్టి "యీ రాజ్యమును నీకును— నీవారసులకును— ఔరసులకుగాని, దత్తులకు గాని— శాశ్వతముగ యిచ్చివేయుచున్నా"నని హామీా పూర్వకముగ ప్రకటించెను. ఇన్నిరకముల వారసులను గూర్చి చెప్పిన సార్థపదములు ప్రతాపసింగుకు యిచ్చిన పత్రములో స్పష్టముగ వక్కాణింప బడియున్నవి. ఇవి సరియై

నవి కావని యెవరు, యెన్నడు, ప్రతిఘటించి యుండలేదు. కాని, యింగ్లీషు వారివద్దనున్న యింగ్లీషు నకలులో మాత్రి మీాపదములు అంతకంటే క్లుప్తముగను, సామాన్యముగను నున్నవి. 17 సంవత్సరములు యీాప్రతాపసింగు యింగ్లీషువారికి బహువిశ్వాసపాత్రుడగు భక్తుడుగ నుండెను. ఈసంగతిని యింగ్లీషు వారందరు ఒప్పుకొనియేయున్నారు. ఈతడు చాల యోగ్యుడని, సమర్థుడని, నిజాయితీగలవాడని అక్కడ రెసిడెంటులుగ నుండిన యింగ్లీషువారందరు యేకరీతిగ సాక్ష్యమిచ్చుచునేయుండిరి. ఈతని యకుంఠిత భక్తి స్నేహాములకు మెచ్చి 1835 సం॥ లో కుంపిణీ డైరెక్టర్లతనికి రత్నఖచితమగు ఖడ్గము నొకదానిని బహుమతిచేసిరి కూడాను. తరువాత కొన్నిజాగీర్ల వారసత్వపుహక్కునుగూర్చి యితనికిని బొంబయి గవర్నమెంటువారికిని యేదో కొంచెము వివాదము ప్రారంభమయ్యెను. తనవారసత్వపుహక్కును స్థాపించుకొనుటకై ప్రతాపసింగ్ బొంబాయి గవర్నమెంటువారి కెన్నియో సార్లు చెప్పుకొనెను. కాని, వారు వీని మొరలనన్నిటిని పెడచెవిని పెట్టిరి. అంతటితో యితని మనస్సుకు కష్టముతోచి, పీష్వాపతనానంతరము తనకీరాజ్యము నిప్పించిన 'ఎల్ఫిన్‌స్టన్' దొరగారితో చెప్పుకుంటే యేమైనా లాభముంటుందేమో అనే ఆశతో, ఆతని మధ్యవర్తిత్వమునను అంగీకరింతునని చెప్పుకొనెను. దీనికికూడ బొంబయి గవర్నమెంటువారు సమ్మతించలేదు. ఈ విధముగ కాలము వృథాగా గడచిపోవుచుండెను; ప్రతాపసింగుకు విసుగుదల, నిరాశ, పుట్టుచుండెను. దీనినుండి క్రమక్రమముగ అనుమాన ముత్పన్న

మయ్యెను. ఈయనుమానమునుండి క్రోధరోషములు ప్రజ్వ
రిల్లసాగెను. "సరే, ఆహా, నాస్థితి పరుదాటిన తరువాత
తెప్పతగులవేయు చందమునకువచ్చెను. నావల్ల యీ కుంపిణీ
వారు, తమ తాత్కాలిక ప్రయోజనమును గడుపుకొని,
యిప్పుడు అవసరము తీరగానే, నన్ను, నా రాజ్యమును కూడ
దిగమ్రింగడానికి చూస్తున్నారుకాబోలు—హా! హతవిధీ!—"
అని ప్రతాపసింగ్ తలపోయసాగెను. ఇతని యుపాలంభన
ముల తీవ్రతను చూచి బొంబయి గవర్నమెంటువారికి కొం
చెము కోపావేశము గలిగెను. రానురాను యీ కోప
మెక్కువై వారు అధర్మమార్గముల బట్టసాగిరి. వీరు పట్టిన
మార్గములు యెంతమాత్రము న్యాయమని సమర్థించుట కెక్క
డను సాధ్యముకాదు. మూడేండ్లు యితనిపై రహస్యపుదోషా
రోపణలు చేయసాగించిరి. ఇతనిపై గూఢచారులను ప్రయో
గించి, దొంగల కదలికలను రహస్యముగ కనిపెట్టినట్లు కనిపెట్టు
చుండిరి. ఎంతనీచమైనపని! ఈ పనిని చూచి సీమలోని కుం
పిణీ డైరెక్టర్లుకూడ అసహ్యించుకొనిరి. "ఇదంతా శుద్ధ దం
డుగ; అనవసరపు కాలహరణము; మనగవర్నమెంటు యొక్క
పేరు ప్రతిష్టలకు యెంతో భంగకరము—" అని డైరెక్టర్లనిరి.
అయినప్పటికి, బొంబయి గవర్నమెంటువారు మాత్రమీ పనిని
మానలేదు. "నామీద దోషాలేమిటో నాకుచెప్పండి" అని
ప్రతాపసింగు అడిగెను. కాని, వారుచెప్పరైరి. అంతట ప్రతా
పసింగు ఒకనాడు బయలుదేరి బొంబయి గవర్నరువద్దకు ఒంట
రిగవచ్చి "నేను మీహవాలీలో వుంటాను; నానిర్దోషత్వము
ఋజువగువరకు నేను నారాజ్యాన్ని యావత్తు వదలుకొని,

మీవద్ద ఖైదీగా వుంటాను, వుంచుకోండి" అని చెప్పెను. దీనికి కూడ గవర్నర్ ఒప్పుకోలేదు. "నేను తప్పుచేశాను" అని ఒప్పుకుంటూ కాగితంవ్రాసి యిమ్మన్నారు! "ఛీ, నే నెందుకు వ్రాసియిస్తా" నన్నాడు ప్రతాపసింగు. ఇతడు సింధియాతోను, నైజాముతోను, దొంగతనముగ కుట్రచేస్తున్నాడని యితని సంస్థానములో రెసిడెంట్లుగనుండిన "స్టూఆర్టు" "మెట్కాఫ్" అనువారొక అబద్ధపు పుకారును పుట్టించిరి. అంతటితో పరస్పరము అనుమానములు హెచ్చయిపోయెను. పోనీ, యిక్కడ వీరు వినకపోతే, యింగ్లండులో కుంపిణీ డైరెక్టర్లో, పార్లమెంటువారో తన గోడువిని, తనకు న్యాయం కలుగజేస్తారనే ఆశతో పాపము ప్రతాపసింగు తన యేజెంటు నొకనిసీమకు పంపించెను. "చూశావా, వీడు పైకి మనతో యిక్కడ మాట్లాడుతున్నట్లేవుండి, రహస్యముగ మనమీద చాడీలు చెప్పడానికి సీమకు రాయబారం నడుపుతున్నాడని" యిక్కడ బొంబయి గవర్నమెంటువారు అనుమానపడ జొచ్చిరి. ఆఖరుకు అర్థరాత్రివేళ ప్రతాపసింగును అంతఃపురములో నిద్రించుచుండగ పట్టుకొని, యెక్కడికో బహు దూరము గొంపోయిరి. తన కత్యంత ప్రియమై, సకలైశ్వర్యములతో తులదూగుచున్న తన మాతృభూమినిక ప్రతాపసింగు చూచుకొన నోచుకొనలేదు. అదే ఆఖరుచూపు.

ఖాళీయైన సింహాసనము నేమిచేయవలెను? "అసలు మొదట సతారాను స్వతంత్ర రాజ్యముగ నుండనిచ్చుటయే తప్పైనది. ఏలననగ, బ్రిటిష్ రాజ్యమువిచ్ఛిన్నముగ యీ కొసనుండి ఆ కొసవరకు యేకరీతిగ— యేక ఖండముగ

నుండకుండ— మధ్య యీ దేశీయరాజ్యముండుట వలన, మన బ్రిటిష్ రాజ్యములో వెక్కిరించినట్లు మొరికె యేర్పడి నది. వెనుకటి తప్పును సవరించి, అందవిహీనమగు యీ మొరికను తీసి పారవేయుట కిదియే మంచిసమయ " మని కొందరు కుంపిణీ యుద్యోగస్తులు సలహాచెప్పిరి. పూర్వ మిట్లు చేసిన దృష్టాంతములు లేకపోలేదు. " మీ గౌరవ మును పెంపొందింతుమనియో, లేక మా సంరక్షణ నొసంగి మిమ్ము కాపాడుదుమనియో చెప్పి, క్రమక్రమముగ అనేకమంది దేశీయరాజులను నెమ్మదిగ మన కాలిక్రిం దికి తీసికొని, ఆఖరుకు వారిని, వారి రాజ్యములను కూడ " సహేంద్రతక్షకాయ స్వాహా"యని గుటుక్కున మ్రింగివేసిన యుదంతములు బ్రిటిష్ యిండియా చరిత్రయందు కుప్పతిప్పలుగ పడియున్నవి." అయితే, మొదట యీసతారా రాజ్యమును కూడ యేలమ్రింగలేదని కొందరడుగవచ్చును. ఏలననగ, అప్పటి పరిస్థితులను బట్టి వీలు చిక్కకపోయెను. అప్పటి సంగతిసందర్భములలో అట్లు చేయుట అంతమంచిది కాదని తోచినది. అందుచే, దానిని మ్రింగక అట్లే యుంచిరి. " తప్పేమియు రాజు చేసియుండలేదే " అని ప్రజలు అనుమానపడతారు. కేవలము మనస్వలాభముకొరకే ఉపక రించేలాగున మనము రాజును శిక్షించినామంటే, ఆతడు తప్పు చేసినాడన్నమాటను ప్రజలు మన మెంతచెప్పినానమ్మరు. మా రాజును మీ అవసరము వచ్చినన్నాళ్లు ఉపయోగపరచు కొని యిప్పుడు మీ అవసరం తీరగానే, వీని రాజ్యాం గాజేసు డానికి బహువాటముగ వున్నదిరా అనే ఉద్దేశముతో

మీరెన్నాళ్లనుంచి కడుపులో పెట్టుకునియున్న యీ దురంతపు టుద్దేశ్యమును— యిప్పుడేదో మిషపెట్టి సాగించుకోడానికి చూస్తున్నారా" అని ప్రజలు మనకెదురెత్తుగ వాదింతురు. ఈ దురుద్దేశముతో మనమూరాజుమీద యేదోనేరములు బనాయించితిమని ప్రజలు వాదింతురు. ఈ వాదనను లోక మంతా బహుసులభముగ నమ్ముదురు" అని 30 జనేవరి 1837 సం॥లో "సర్ రాబర్టుగ్రాంటు" అనునతడు కౌన్సిలు ప్రొసీడింగ్సులో వ్రాసెను. ఇండియాకప్పుడు వైస్రాయిగ నున్న "అక్లండు" ప్రభు వాసమయమందు ఆఫ్గనిస్థానము పైకి దండయాత్ర వెడలబోవుచున్నాడు. కాబట్టి, ఈసమ యములో యిక్కడ బొంబాయిరాజ్యములో కూడ అనవసర ముగ గిల్లి కజ్జాలు పెంచుకోవడము యెందుకని తలంచెను. కాబట్టి, సతారారాజ్యమును కేవలము తామే కాజేయడం కంటె, అప్పాసాహెబను ఒకనిని తీసికొనివచ్చి సింహాసనం మీద కూర్చుండ బెట్టితే బాగుంటుందని అక్లండు ప్రభువు నిశ్చయించుకొనెను. పదభ్రష్టుడైన ప్రతాపసింగు తమ్ముడే యీ అప్పాసాహెబు. ఈతనిని సింహాసనముపై కూర్చుండ బెట్టి, యిదివరకు తన అన్నతో తగాదాలు పడుచున్న జాగీ రులపై హక్కుపూర్తిగ వదలుకొనేటట్లు ఆతనిచేత ఒప్పించిరి. అప్పాసాహెబు తన తదనంతరము తన జ్ఞాతికొకనికి రాజ్యము వచ్చునట్లుగ నియోగించి చనిపోయెను. జ్ఞాతియే అప్పా సాహెబు మరణానంతరము అతనికి ఉత్తరక్రియలు కూడ చేసెను. పిమ్మట యెట్టితగాదాలు లేకుండ, శాంతముగనే, రాజ్యమునకు కూడ వచ్చెను. కాని, యితనికి పోటీగ "నాకీ

రాజ్యము రావలె" నంటూ యింకొకడు బయలుదేరెను. ఇతడెవరనగ, పదభ్రష్టుడైన ప్రతాపసింగుని పెంపుడు కొడుకు. ప్రతాపసింగు చనిపోవుచు మూడేండ్ల కిందట ఒకమరణ శాసనమును (విల్లును) వ్రాసిపోయెనట. అది యిప్పుడు బయటపడినది. ప్రతాపసింగు 1847 సం॥లో చనిపోయెను. కాబట్టి, ప్రతాపసింగు అప్పాసాహెబు అను యీయిద్దరన్న దమ్ములచే పెంచుకోబడిన యీయిద్దరు జ్ఞాతులలో రాజ్యమెవరికి రావలెననునదే ప్రశ్న. ఈసమస్యను గూర్చి సతారాలో అప్పుడు రెసిడెంటుగ నుండిన "ఫెర్రే" యనునతడు వైస్రాయియగు డల్‌హౌసీ ప్రభువు కిట్లు వ్రాసెను:— "ఈ దత్తులిరువురుకంటె తమకెవరికి యెక్కువ హక్కు వుండజాలదని తక్కిన సన్నిహిత జ్ఞాతులందరు అనుకొనుచున్నారు. ఏలననగ, యీ దత్తతలు సక్రమమైన వనియు, అందుచే తాము దూరపు వారసులమై పోయినా మనియు, తక్కిన జ్ఞాతులందరు గట్టిగ నమ్ముచున్నారు. ఈ దత్తతలే లేకపోయినయెడల, వీరందరు తమ వారసత్వపు హక్కుకై గట్టిగ పోట్లాడేవారే. ఇప్పటికి కూడ, మనమీ దత్తతలను రద్దుపరచినామన్న మాటను— ఆ మృత్యుమంత్ర మాటను— వారుగనుక కాస్త విన్నారంటే, 'నాది వారసత్వము, నాది వారసత్వము' అని పరుగెత్తుకు వచ్చేవారు చాలమంది వున్నారు. ఈ దత్తతకుమారులుగాని, సంతు లేనివారి కందరికి మేమే వారసులమంటూ ఇటీవల బయలుదేరిన మన యింగ్లీషుగవర్నమెంటు వార్లముగాని, మధ్య లేకపోతే, యీ జ్ఞాతులందరు వెనుకటి రాజగు ప్రతాపసిం

గుకు రక్తసంబంధీకులగు సన్నిహితజ్ఞాతులమనియు తద్వారా తమకే యీ రాజ్యము న్యాయముగ రావలెననియు, వీరు యే కోర్టునందైనను సరే గట్టిగ ఋజువు పరచుకొన గలరు. దానికి తగినంత సాక్ష్యమున్నట్లు నా వద్దనున్న రికార్డునుబట్టి తెలియుచున్నది. ఔరససంతతిలేనివారి కంద రికి మేమే వారసులమంటూ మనమిప్పుడు కొత్తగ లేవదీసిన యీ నూతన సిద్ధాంతము తప్పితే, న్యాయముగ, మన మిది వరకు చేసికొన్న ఒడంబడికనుబట్టి చూస్తే, మనమీ రాజ్య మును కాజేయుటకు ఇంకొక హక్కు యెంతమాత్రము లేదు."

హిందూసంఘమందు సర్వత్రవ్యాపించి యున్న దత్త తాధికారమును మన మిప్పుడువచ్చి కాదనుట కేవలము పరి హాసాస్పదము. ఇంతకంటె పరిహాసాస్పదమైన విషయమింకొ కటి యుండబోదు. సంతతిలేనివారు దత్తత చేసికొనవలసిన విధి లేదనుట కేవలము సనాతన ధర్మములలోని ధర్మాధర్మ నియ మముల భ్రష్టమొనర్చుటయేయగును. కేవలము ఆస్థికి వారసుని తెచ్చుకొనుటకేకాదు, దత్తతచేసికొనుట. తన తదనంతరము తన యాత్మశాంతికై తనకిన్ని తిలోదకములు వదలుటకే ముఖ్య ముగ హిందువుడగువాడు పుత్రుని దత్తతచేసికొనును. పుత్రసంతతి లేనివానికి—పుత్రుని చేతి తిలోదకములకు నోచు కొననివానికి—పున్నామనరకముతప్పదని ప్రతిహిందువుడును భయపడుచుండును. ఔరససంతతిలేనివాని రాజ్యము— ఆస్థి- గవర్నమెంటుకు పోతుందని మధ్య నడమంత్రముగ మనము కల్పించిన యీ దిక్కుమాలిన సూత్రముకంటె బుద్ధిమాలిన

సూత్రము యింకొకటిలేదు. ఇంతకంటె దేశీయుల మనస్సులకు అవమానమును, నొప్పిని కల్గించు సూత్రమింకొకటి యుండ బోదు. దీనివలన వారిమతమునకేమి, నైతికసాంఘిక, రాజకీయాది సాంప్రదాయ భావములకేమి, భంగముకలుగుచున్నది. సతారా విషయములో యింకొక విశేషమేర్పడుచున్నది. ప్రతాపసింగు సింధియా, నైజాములతో రహస్యముగ కుట్రచేయుచున్నట్లు 1837 సం॥ లో యింగ్లీషు రెసిడెంట్లొక పుకారును పుట్టించిన సంగతి మనమిదివరకు చూచియున్నాము. ఇట్టి పుకారు పుట్టించి అప్పుడింత గందరగోళము చేయుటకుగల నిజకారణమేమో మనకిప్పుడు స్పష్టమగుచున్నది. సతారాను యింగ్లీషురాజ్యములో కలుపుకొన్న సందర్భము యూరోపియను జాతులవారికికూడ అసహ్యము పుట్టించి, "యిదిచాల అన్యాయమని" యనిపించిన సందర్భమింకొకటిగలదు. అదేమనగ:— శివాజీవంశీకుడైన యీ ప్రతాపసింగును తీసికొనివచ్చి తిరిగి యీ సతారాసింహాసనముపై ప్రతిష్టించుచున్నాను. నేనెంతఘనకార్యము—న్యాయమైన కార్యము— చేయుచున్నానో చూడండహో!" యని మాయిరాప్రభువు లోకమంతను చాటంబాడెను. అయితే, యీప్రతాపసింగు శివాజీకి ఔరసరీత్యాగాక, దత్తతరీత్యానే వారసుడైనాడన్నసంగతిని నెవరు మరచిపోగలరు? ఏదత్తత సూత్రమైతే చెల్లదని యిప్పుడు డల్హౌసీ ప్రభువు నిరాకరించుచున్నాడో, ఆదత్తత సూత్రరీత్యావచ్చిన యీ ప్రతాపసింగునే యేల వెనుక మాయిరా ప్రభువు గొప్పగ తీసికొనివచ్చి సతారా సింహాసనముపై పునఃప్రతిష్టితము గావించెను?

శివాజీవంశము రెండుసార్లు నిస్సంతుకాగా, దత్తతరీత్యాదానిని రెండుపర్యాయములు నిలువబెట్టుకున్నారు. ఆఖరుపర్యాయము, యిటీవల మొన్నమొన్ననే 1777 సం॥ లో శివాజీవంశమంతటితో అంతరించకుండ దత్తతవలన— సహజమగు, న్యాయమగు, యిదివరకెన్నడు వివాదగ్రస్తముకాని యీ దత్తతాధికార సూత్రమువలన— నిలువబెట్టుకొన్నారు. ప్రతాప సింగుతమ్ముడు అప్పాసాహెబు మంచి బుద్ధిమంతుడగురాజు. తన రాజ్యాదాయములో నూటికి యెనుబది రూపాయలు- ప్రజోపయోగకార్యములకై వినియోగించుటకు గాను, ప్రత్యేకించి యుంచెడివాడట! ఈతని పరిపాలన బాగుండలేదని పల్లెత్తుమాట యన్నవా రారోజులలో యెవరును లేరు. ఇట్టి రాజ్యమునైనైన కాజేయుటకుగాను యే తప్పు, యే మిష, దొరుకునాయని కుంపిణీవారు నిరర్థకముగ నిరంతరము చేయుచున్న అసహ్యాకరమగు వెదకులాట- పడుచున్న దేవులాట—. యెట్టివారికైనను— అబ్బబ్బ— రోత పుట్టక మానదు. ఇట్టి అసహ్యకరమగుపని రాజ్యధర్మమునకు గాని, వ్యక్తులహక్కులకు గాని కేవలము భంగకరము.

మాల్వా, రాజపుత్రస్థానము లందంతటను యీవార్తలు విస్మయవిద్వేషముల గల్గించెను. కుంపిణీవారు పెట్టిన యీ కొత్త సూత్రములవలన యెవరికెప్పుడెట్టి ముప్పులు, దేశమందెంతటి బహుళధర్మ విప్లవములు రానైయున్నవో యెల్లరికి స్పష్టమయ్యెను. తమ వంశమందు సర్వస్వతంత్ర హక్కులతో అనాదినుండియు యున్నభూములు యెప్పుడేక్షణమందు పోయి గవర్నమెంటులో కలిసిపోవునో యెవరికెరుక! యుక్తాయుక్త

వివేకములు, శాస్త్రనియమములు, అనుశ్రితాచారములు, మంచీమర్యాదలు,— సమస్తము ఒక్క దెబ్బతో తుడిచిపెట్టు కొని పోవుచున్నవి. "మనయందు దేశీయరాజ్యములకు నమ్మకము చెడిపోయిన"దని "సర్ జాన్‌లో" అను యింగ్లీషు రెసిడెంటొకడు వ్రాసెను. "ఈ వారసత్వ సమస్యను గూర్చి సింధియా మున్నగు హిందూరాజులెల్లరు చాల ఆదుర్దా పడుచున్నా" రని గ్వాలియర్ సంస్థానమందున్న రెసిడెంటు వ్రాసెను. "సతారాకేసులోని తీర్పు హిందూదేశమందంతటను గొప్ప కలవరమును, విస్మయమును గల్పించె నని" బెంగాలు కౌన్సిలు మెంబరొకడు వ్రాసెను. "పెంచు కొనుటకు సార్వభౌమాధికారులఅనుజ్ఞ అవుసరముగాన, అసలు పెంచుకునే హక్కే-సామంతరాజులకు లేదని గాని, పెంచుకొనినవానికి రాజ్యాధికారమునకు హక్కు లేదనిగాని, వాదించుట కేవలము కువాద'మని ఆతడు ఖండించెను. ఏల ననగ సార్వభౌము డామోదించినగాని, ఔరసుడైనను సింహాసనముపై కూర్చుండజాలడు. కావున, దీనినిబట్టి ఏమి తెలియుచున్నదనగ:- సార్వభౌమునికి గల అధికార మెంతవరకంటే, సామంతరాజు నియమించుకొన్న వానినిగాని, ఔరసునిగాని, తానుకూడ ఆమోదించి, ధ్రువపరచి, అతనికి రాజ్యాభిషేచన సంస్కారము గావించునంతవరకే సార్వభౌముని యధికారము గాని, అంతకుమించి అతని కెక్కువ అధికారములేదు. ఇట్టి రాజ్యాభిషేచనాధికారము పూర్వమునుండి, సార్వభౌముల కేమి, మతాధిపతుల కేమి ఉండనేవున్నది. కాని. అంత మాత్రము చేత, "నీయిష్టమువచ్చిన వానిని పెంచుకోవద్దు,

నాయిష్టమువచ్చిన వానిని పెంచుకో," అని వంకలు దిద్ది చెప్పడానికి గాని, రాజుమరణవేదన యందుండగా దొంగ విల్లులను సృష్టించి, తద్వారా తాను వారసుఁడనని బయలు దేరు మోసగాండ్రను, దుర్ణయపరులను, అసమర్థులను తీసి కొనివచ్చి, బలాత్కారముగా సింహాసనముపై కూర్చుండ బెట్టుటకు గాని, సార్వభౌముని కెన్నడును అధికారము లేదు. బుద్ధివివేచన లేక, సమస్త రాజ్యములను దిగ మ్రింగుదుమను తలంపుతో, సార్వభౌముడు గనుక యిట్టి పనికిమాలినపనిని చేసినట్టయితే, అసలు అతని సార్వభౌమాధి కారమునకే మోసమునచ్చును. అతని సార్వభౌమాధి కారమే అతనియొక్క ఔరసుని కెంతరాజ్యార్హత యున్నదో, దత్తునికి కూడ అంతరాజ్యార్హత యున్నదనియు, సార్వభౌ ముఁడు ఔరసుని అర్హతనంగీకరించుట యెంతధర్మమో, దత్తుని అర్హతను కూడ అంగీకరించుట అంతధర్మమే యనియు, సర్ జాన్ లాకు అనునతడు మాటిమాటికి అనేక పర్యాయములు చెప్పియుండెను.

రాజపుత్రస్థానములోని 'కరౌలీ' యను చిన్నసంస్థానము నొకదానిని యీసిద్ధాంతముపై కాజేయవలెనని 1852 సం॥లో డెల్హౌసి తలపెట్టెను. కాని, 'సర్ ఫ్రెడరిక్, కర్రీ' మున్నగు కొన్నిలుమెంబర్లు తీవ్రముగ ప్రతిఘటించిరి. ఈ విధముగ బెదరింపబడుటకు రాజపుత్రస్థానములో నిదియే మొట్టమొదటి రాజ్యము. ఆనాడు దానిని నిజముగా ఇంగ్లీషు గవర్నమెంటు వారు కాజేసియున్నయెడల, రాజపుత్రస్థానములో నెంతయో తీవ్రావహాముప్పతిల్లెడిది. తదనుగుణముగ ఇంగ్లీషు గవర్న

మెంటుపై చెప్పరానంత అసహ్యము, రోత, పుట్టెడిది. ఈ రీతిగ ఇండియాలో గవర్నమెంటు చర్యలవలన గలుగబోవు ఉపద్రవములను గూర్చి సీమకు కబురువెళ్లెను. ఈ కృత్రిమ సిద్ధాంతములోని అన్యాయ అవివేకములను "యిండియా రిఫారము అసోసియేషన్" వారు బహిరంగముగ, నిర్మొగమాటముగ ప్రజలకు తెలియచెప్పిరి. వైస్రాయిపై పార్లమెంటులో అభిశంసన తీర్మానమును పెట్టెదనని బ్లాకెట్ అను మెంబరు బెదరించెను. తమ పార్టీలోనివాడగు వైస్రాయిపై ఇట్టి తీర్మానము వచ్చినయెడల, తమ పార్టీకి అప్రతిష్టవచ్చునని భయపడి "పీలు" మంత్రివర్గమువారు "యికముందీపని మానివెయ్యి" అని యిండియా వైస్రాయికి కబురుపంపిరి.

ఈ విధముగ "కరౌలీ" సంస్థానమెట్లో యింగ్లీషువారి నోటబడక, బయటపడెను. అనేక మాసములు యేమియు తేలక, డోలాయమానస్థితియందుండి, తుట్టతుదకు "మదన పాల్" అను నతని దత్తతకు గవర్నమెంటువారు అంగీకరించిరి. అప్పటినుండి ఆరాజ్యమాతని పాలనక్రింద హాయిగ, శాంతముగ, నడచుచుండెను. సరే, సర్ ఫ్రెడ్రిక్, కర్రీ మున్నగువారి బలవంతముమీద యెట్లయిననేమి యీ యుపద్రవము అప్పటికి గడచినది. కాని, యెల్లకాలము వీరుందురా? వీరు వెళ్లిన తరువాత తిరిగి యీకథయే ప్రారంభమైనచో దిక్కేమి? రేపేమి యుపద్రవమువచ్చునో ఎవరేమి చెప్పగలరు? మహారాష్ట్ర రాజ్యములవారికి— గొప్పవారికి కొద్దివారికి— తగిలిన యీదెబ్బలు వారెన్నడు సులభముగ మరువజాలనివిగ నున్నవి. "వీరిలో సంతులేనివారున్నారు. మన

మీా సిద్ధాంతమును బయలుదేరదీసినప్పటినుండి,— నా గతి యేమగునోయని— నావంశము నాతోనే అంతరించును కాబోలు అని—వారందరు యెంతో భయపడజొచ్చిరి. వారిలో నీవిధమగు ఆందోళన, భీతావహము పుట్టెను.

ఒకప్పుడు బలిష్ఠరాజ్యముగ నుండిన బీరారుసంస్థానము,— 1805 సం॥ నాటి విభాగానంతరము పోగా మిగిలినది (నాగపురభాగము) భాన్స్లే సంతతివారికి వదలివేయబడెను. 1818 సం॥ లో మహారాజును పదభ్రష్టుని గావించి, దేశమునుండి వెడలగొట్టిరి. ఆతని స్థానమున వెనుకటిరాజుయొక్క జ్ఞాతినొకని సదరు సంస్థానప్రముఖులు తీసికొనివచ్చి నాగపురసింహాసనముపై కూర్చుండబెట్టిరి. దీనికి బ్రిటిష్ గవర్నమెంటువారును పూర్తిగ అంగీకరించిరి. వారసత్వమునుగూర్చి యెవరుగాని, యెట్టి తగాదాగాని చేయనేలేదు. అప్పుడక్కడ రెసిడెంటుగనుండి రాజునకు మంచి విశ్వాసపాత్రుడుగ నుండిన "జెంకిన్సు" అను నతడు కూడ "నాగపురరాజ్యము యిండియాలోని గొప్ప రాజ్యములలో నొకటియై తన పూర్వపు గణ్యతను తిరిగి పొందె" నని చెప్పెను. ఇట్టిచో, "నాగపురసంస్థానమును మేము నిలువబెట్టినాము గనుక, అవసరము వచ్చినప్పుడు, దానిని తీసివేయడానికి కూడ మాకే అధికారమున్న" దని గవర్నమెంటువారు వాదింపజూచుట కేవలము నీచత్వము, అల్పత్వము. 1854 సం॥ లో యీా నాగపురరాజు నిస్సంతుగ మరణించెను. కాని, ఆతనికొక దత్తపుత్రుడుండెను. రాజ్యమీా దత్తపుత్రునకే రావలయునని వారి వంశము వారందరును కోరుటసహజము. దీనికి

సార్వభౌమాధికారులగు యింగ్లీషు గవర్నమెంటువారుకూడ ఆమోదింప వలసినదని వారు రెసిడెంటుద్వారా తమకోర్కెను తెలియపరచిరి. ఇదిచాలా న్యాయమైనకోర్కెయని రెసిడెంటుకూడ గట్టిగ నిస్సంశయముగు వాక్యములతో వ్రాసెను. "మనము దేశీయులయెడ యెంతమాత్రము సానుభూతి చూపడంలేదని—అందు ముఖ్యముగ కులీనులగు రాచవంశములవారియెడ బొత్తుగ చూపడంలేదని— దేశములో నలుముఖముల ఘోష యెక్కువగనున్నది. దేశీయరాజుల యభివృద్ధి మన చేతులలోనే వున్నదనియు, వెనుకటి రాజ్యములలోనున్న చెడుగులన్నిటికి కొంతవరకు సార్వభౌమ ప్రతినిధులమగు మన యొక్క అనాదరణయే కారణమనియు, ప్రజలెంతో నిష్ఠురముగ ఘోషించుచున్నారు" అని ఆ రెసిడెంటు వ్రాసెను. ఈ వ్రాతలనుచూచి వైస్రాయియు, అతని మంత్రివర్గమును, యెంతో చీదరించుకొనిరి. "ఇక పీకె డబాయించు, యిక, నీవిట్టి సలహాలుమాకు చెప్పనక్కరలేదులే" అని చెప్పి ఆతని యుద్యోగము వెంటనే యూడదీసిరి! రాణులకు వెంటనే పింఛనులను కోసివేసిరి. వారి జవాహరీ (నగలు) యెంతెంత ఖరీదుగలవి వున్నవో అవి యన్నియు జాబితాలు వ్రాయించిరి. రాజ్యలక్ష్మిని, రాజ్యదర్పమును గోల్పోవనున్న వీరికి నగలెందుకనిరి! ఇకవీరికివి వంశక్రమానుగతమగు రాజలాంఛనములుగ నుండవీలులేదని అన్నిటిని ఒలిపించి అక్కడ పెట్టింపదలంచిరి. దత్తతకుమారుడగు "జస్వంత అహిరావు" తండ్రికి ఉత్తరక్రియలు నెరవేర్చెను. సంస్థానప్రముఖులూ ఉద్యోగులు పరివేష్టించియుండ జస్వంతరావు వంశక్రమానుగత

మగు నాగపురసింహాసనముపై పట్టాభిషిక్తుడయ్యెను. దీనికప్పు డెవ్వరును యెట్టి అభ్యంతరమును సూచనగనైన చెప్పియుండ లేదు. ఇట్లుండగా ఆకస్మికముగ అక్టోబరు నెలలో ఒకనాడు యింగ్లీషు సేనలువచ్చి రాజమందిరమును ముట్టడివేసెను. కోటిరూపాయలు ఖరీదుగల రాజ్యాభరణములను, రత్నఖచితభూషణములు గల మందసములను పట్టుకొని తీసికొనిపోయిరి. పిమ్మట వీనిని వైస్రాయిపేరట బహిరంగ వేలమువేసిరి. రాణులను వారిపరివారమును ఖైదీలుగ పట్టుకొనిరి. అంతఃపురమునకు వెలుపలివారితో వీరెవరుమాట్లాడకూడదని ఒక కమీషనరును—నిన్నటివరకు మనకు మిత్రుడుగనున్న వానిరాజ్యమును కాజేయుటకై నేడు ప్రయోగింపబడిన ఒక కమిషనరును- అక్కడ కాపలాపెట్టిరి! "వెనుకటిరాజుకు పురుషసంతతిలేని కారణముచే యీ నాగపురరాజ్యము మా యింగ్లీషురాజ్యములో కలిసిపోయినదహో!" అని డల్‌హౌసీప్రభువు పెద్ద ప్రకటన చేసెను. "అంతఃపురస్త్రీలను, పరిచారికాజనమును, రాచవంశపు పసిపిల్లలను యిట్లు నిర్బంధించుట పాడిగాదని,—పాపము—వయోవృద్ధురాలగు మహారాణీ బంకాబాయి తమపై కాపలాయున్న శూరమ్మన్యులగు కాపలావార్లతో యెంతయో వాదించెను. కాని, నిరర్థకమయ్యెను. ఇదివరకు కుంపిణీవారెంతో పైకి గౌరవమును నటింపుచు, మర్యాదగ చూచుచున్న పెద్దలను—యిదివరకు యెంత మాత్రము కించిత్తైనను అనుమానము లేనట్లుగ నటింపుచు గౌరవింపుచున్న పెద్దలను—కొందరిని తమ గోడును గూర్చి కలకత్తాలోని వైస్రాయితో చెప్పుకొనుటకనుజ్ఞ యివ్వ

వలసిదని ఆమె యెంతయో ప్రార్థయపడెను. కాని, యిదియు నిరర్థకమయ్యెను.

ఈ కమీషనరుద్వారాతప్ప, యింకొక విధముగ బయటికి కబురు వెళ్లకుండ నెలలతరబడి నిర్బంధించిరి. ఇట్టి నిర్బంధమునుండి తప్పించుకొనుటకు చీమదూరు సందుకూడ లేకుండ బిగించిరి. దురదృష్టదశయందున్న యీ రాణులకు భక్తిపూర్వకముగ తగుసహాయ మొనరింతమని నాగపురమునకు బయలుదేరి వచ్చుచున్న "కర్నల్ జాన్లీ" యను వానిని నాగపురము చేరకుండ దోవలోనే పట్టుకొని బంధించివేసిరి. మరియు, ఏని విడుదలకు వలయుసొమ్మునిచ్చి, యీ రాణులను నెల్లైన విడిపింతమను భక్తి విశ్వాసములతో బయలుదేరి వచ్చుచున్న "మహాజరు" లనబడు షాహుకార్లనుకూడ ఆ రాణులయెడ జాలిచూపిన పాపమునకై యిట్లే పట్టుకొని బంధించి చెరసాలలో త్రోయించిరి.

విలువగలిగిన వస్తువుల నన్నిటిని కోటదాటించి తీసికొని వెళ్లిన యనంతరము,—పట్టణములో సంక్షోభముగాని ప్రతిఘటనగాని యికరాజాలదని ధైర్యముచిక్కిన యనంతరము,—ఖైదీలుగ బంధింప బడియున్న ప్రముఖులను కొందరిని కొల్లగొట్టబడిన ధనాగారముచెంతకు తీసికొనివచ్చి, వారితమూలకముగ మహారాణీతో మాట్లాడనిచ్చిరి. భర్తృవిహీనయై, పదవడి రాజ్యవిహీనయై, పాపమా మహారాణీ గుండెపగిలిపోయి యుండెను. "నీ వంశమువారికి రాజ్యాధికారము పోయినదనిగాని, నీ దేశము పరరాజ్యములో కలసి పోయినదనిగాని, యేమైననుసరే నీ వెన్నడు ఒప్పుకోవద్దుసుమా"

యని వారు నిస్పృహతో అతిదీనముగ రాణీనిప్రార్థించిరి. సీమలో తమకేమైన న్యాయము జరుగునను వ్యర్థపుటాశతో పాపమామె యెట్లో తంటాలువడి కొందరు యేజెంట్లను సీమకు పంపించెను. సీమనుండి జవాబు వచ్చువరకు వేచి యుండలేక పోయినదా? యెట్లుండగలదు? "ఈ రాజ్యమును వదలుకున్నట్లుగ,— నీవు కాస్తమాట అంటే— ఆ ముత్యమంతమాట అంటే— చాలు. అట్లా వదలుకున్నట్లుగ, యిదిగో యీకాగితంమీద కాస్త సంతకంచేస్తేచాలు. నీకు, దిక్కులేని నీ చుట్టాలకు, నీ ఆశ్రితులకు కావలసినంత ఫింఛను యిస్తాము" అని కమిషనరు వత్తిడి చేయుచుండెను. ఆమెకు ధైర్యమును, సలహాను చెప్పువారెవరు దగ్గరలేరు. తెలివిగలవాడు, మంచి సరియైన సలహాచెప్పేవాడు యెవడైనా యెక్కడైనావున్నాడేమో అని కొంచెము అనుమానంతోస్తే వాడినల్లా పట్టి చెరసాలలో బంధించివేసిరి. మంత్రి యీ పరిభవమును భరింపలేక, రోషమును పట్టజాలక మరణించెను. ఇక పాపమీ ముదుసలి యాడుకూతు రేమిచేయగలదు? వయోవృద్ధురాలగు ఆమె హృదయమందు కుంగిపోవుచున్న ఆత్మగౌరవము, రాజ్యదర్పము, అప్పుడప్పుడు తరంగితమై నిప్పులవ్వలు లేచుచుండెను. కాని, ఎనుబది సంవత్సరముల వయస్సు చెల్లిపోయి, ఆసన్నమృత్యుముఖమునుండి హిమశీతలవాయువు లొక్కపెట్టున వీచుచుండగ, నిరాశాహతిచే కుంగిపోయియున్న ఆమె హృదయమందీ నిప్పురవ్వలెట్లు మహాజ్వాలగ ప్రజ్వరిల్లగలవు? ఈ మృత్యు శీతలవాయువులు వచ్చి, ఆ కొంచెపు నిప్పురవ్వలను జ్వాలకాకపూర్వమే ఆర్పి

వేయుచుండెను. ఒకప్పుడు దుర్జ్ఞేయుడై, శత్రుభీకరుడై, మహాప్రతాపశాలిగా వెలిగిన రఘోజీభాన్స్లే మహారాజు యొక్క ధర్మపత్ని నేడు తుదకు ఒకానొక విదేశీయుని చెప్పుచేతలలో తగిలియుండి, "నా రాజ్యమును నా సర్వస్వమును వదలుకొన్నానని" చెప్పి, దుఃఖాతిరేకమున శరీరము కంపించుచుండగ, కన్నీరు కాల్వలుగట్టగ, వాడు చెప్పినట్లల్లా వ్రాసియిచ్చి దణ్ణముపెట్టవలసిన దౌర్భాగ్యస్థితికి వచ్చినదిగదా— హా! హతవిధీ! ఇట్టి అత్యంత ఘోర దుర్దశయందుకూడ జస్వంతరావు దత్తుడగుటచే రాజ్యాధికారమున కర్హుడుకాడను మాటను ఒక్కడుకూడ అన్నవాడు లేడు. నగరమునకు కాపున్న పూర్వపు రక్షకభటులు తొలగింపబడిరి. వారి స్థానమున కుంపిణీవారికి నమ్మకమగు సేనలువచ్చి, హరింపబడిన యీ నాగపుర రాజ్యపు నలుముఖములు— ప్రతి ముఖ్యస్థానమందును— కాపుండెను. కుంపిణీవారియెడ నింకను రోషము విడువక, మనస్సునందు పెట్టుకొనియున్న ప్రతి ప్రముఖుని చర్యను పరిశీలించి చూచుటకు వారివెంట నమ్మకమగు గూఢచారులను నియమించిరి. దేశముయొక్క సివిల్ పరిపాలన యంతయు కలకత్తానుండి వచ్చు హుకుముల ప్రకారము మార్చివేయబడెను. అనేక యుగములనుండి ప్రబలియున్న నాగపుర స్థానికస్వతంత్రపరిపాలన ఒక్కపెట్టున మాయమయ్యెను. అంతయు ముగిసెను.

లేదు, లేదు, అంతయుముగియలేదు. ఈ ప్రతాప కార్యములో జూరగొన్న విజయచిహ్నముల నింకను లోకమునకు ప్రదర్శింపవలసియున్నది. దోచుకొన్ననగలనన్నిటినీ

అమ్మకొని యింకను డబ్బుచేసికొనవలసియున్నది. ఆ 1855 సం॥ అక్టోబరు 12 తేదీగల "మార్నింగ్ క్రానికల్" అను కలకత్తాపత్రికలో యీ క్రింది ప్రచురణ కానవచ్చును. దాని నిజభావముల నదియే విస్పష్టముగ చెప్పసమర్థమైయున్నది గాన దానిలో నొకపొల్లునైనను విడిచిపెట్టుట పాడికాదు. కాన, దాని నిటపూర్తిగ నుదహరించుచుము.

## —♦ గొప్ప బహిరంగవేలము ♦—

## నాగపురం నగలు

## హామిల్టన్ అండ్ కంపెనీ

నాగపురి ఆభరణములను బహిరంగముగను, నిరాటంకముగను వేలమువేయుటకు దొరతనవారు దయతో మాకు అనుజ్ఞ నొసంగిరని యిందుమూలముగ ప్రకటించుచున్నాము.

శోభాయమానమగు మంచినగలు—ఆభరణములు— అంతఘనమైనవి, అమూల్యమైనవి, కలకత్తాలో యిదివరకెన్నడు ప్రదర్శింపబడలేదు— ఇట్టివిప్పుడు కలకత్తాలో హామిల్టన్ కంపెనీవారి ప్రదర్శన భవనములందు కానవగును. ఎల్లరువచ్చి చూడవచ్చును.

—♦ వాని వివరం ♦—

రవ్వలు :- గొప్పపరిమాణము, తూనికగలవి; సుప్రసిద్ధమైనవి; నిర్మలమగు కాంతిగలవి; దండకడియములలోను మురుగులలోను, ఉంగరములలోను, వివిధమగు తూసికలుగల

పెద్దజంపులుగను పొదిగియున్నవి. పేరెన్నికగన్న "దరియా-ఇ-నూర్-" అను రవ్వకన్న పెద్దరవ్వ ఒకటి వీనిలోగలదు.

ముత్యాలహారములు :— మిక్కిలి పెద్దవి; అపరూపమైనవి; ఒక వరుసవి; రెండు వరుసలవి; నాలుగు వరుసలవి కూడ గలవు. రవల జిగినీలతోను, లోలకులతోను— "దూక్‌దూక్" లతోను వున్నవి.

పెద్ద పచ్చలహారములు :—చక్కగ తరణిపట్టినవి; మెరుగైనవి.

వ్రేలాడు బిందురూపమైన రవ్వలు, యితరహారములు కావలసినన్ని వున్నవి.

హిందూస్థానీ దుద్దులు :— మిక్కిలి రమ్యమైనవి. రవలతోను, ముత్యములతోను పొదిగినవి. అనేకములగు రత్నములు, కెంపులు, పచ్చలు మున్నగువానితో గూడినవి. జీగాలు, సర్పచీలు, గోషిఫేచ్కులు, రాజేష్యాలు, శిరోభరణములు, మిక్కిలి మనోహరమైన రచనలతో చెక్కిన తోరాలు, శిరోవేష్టనాలంకరణములు;— అనేకప్రాలంబముక్తాహారములు గలవి.

అట్టివే అనేక ముత్యాల ఆభరణములు.

ఒక చార్కోబు, లేక రాజుగారి కోటు :—ఇది యంతటను రవ్వలు, ముత్యాలు, కెంపులు, పచ్చలు,— వేయేల నవరత్నములతో కుట్టబడియున్న బంగారు మలా ము పూసిన గుర్రపుసామాను :—గుర్రమునకు వేసే ఆభరణములు! రవ్వలు, ముత్యాలు, కెంపులు, వైడూర్యములు,

పచ్చలు— మున్నగు వానితో చెక్కియున్నవి. గుందాలు; హైకూలులు; కుల్గీలు; గుర్రముల తలలకువేసే పుష్పాకారములు గల ఆభరణములు; రవలతోను, పచ్చలతోను, ముత్యాలతోను కట్టబడిన గుర్రపుజీనులు, చార్మాజాలు, జీనులపై వేయు వస్త్రములు.

మిక్కిలి అందముగ కన్నుల కింపుగానుండు బంగారు పూతపూసిన అంకుశములు. ఏనుగులతోలుటకు గజ్బాగులు— రవ్వలు, కెంపులతో చెక్కబడినవి. నవరత్న ఖచిత మైన డాలులు, బాకులు. మేలి బంగారు పూతపూసిన అత్తరు పాన్దానులు; పన్నీరుబుడ్లు; సుగంధద్రవ్యపు మందసములు; చందుగాపెట్టెలు. సురాయిలు; నీటికూజాలు, కలందాన్లు;— అంతటను స్వచ్ఛమగు అచ్చపు రవ్వలతో, నవరత్నములతో ఖచితమైయున్నవి. మిక్కిలి అందమైన బంగారుపూతపూసిన హుక్కాపాత్రలు, గొట్టములు; చుట్టు నంతటను చక్కని పెద్ద శుద్ధమగు రత్నములతో చెక్కబడినది—చిల్లం, గిన్నె, సర్పొజు, నోటీపీకె, కిరేనా—యివన్ని రత్నఖచితమైనవి. ముత్యాలు, కెంపులు, పెద్ద వ్రేలాడు పచ్చలకుచ్చులు, కుట్టిన ఒక పెద్ద పామువంటి హుక్కాగొట్టము సహా—బంగారు, రవ కెంపులతో చెక్కిన అనేకరకముల కత్తులు; ఖడ్గమృగచర్మములు; డాళ్లు; బాకులు; బల్లెములు; విళ్ళంబులు; బాణములు; శరాసనములు మొదలైనవి. మిక్కిలి విలువగల కత్తిపటకాలు; ముడులు;— రవలు; కెంపులు; ముత్యములు; పచ్చలు గలవి; కేవలసువర్ణరజిత ఆభరణములు; పాన్దానులు; అత్తర్దాన్లు; పన్నీరు

బుడ్లు; సుగంధద్రవ్యము లుంచుకొను భరిణలు; గిన్నెలు; కూజాలు.

బంగారునగలు:— మురిడీలు, మురుగులు, గొలుసులు, హారములు, దండకడియములు, వడ్డాణములు, నడుముపట కాలు, చంద్రహారములు, దుద్దులు, కడియాలు, మట్టెలు, మంగళసూత్రములు వగైరాలు.

కవచములు:— ఉక్కుకవచములు, శిరస్త్రాణములు, తనుత్రాణములు, యీటెలు, గొడ్డళ్లు, పరశుపట్టిసములు, కందములు, కత్తులు, డాళ్ళు,—వీనిలో అనేకములు లోపల బంగారు పూతగలవి.

పళ్లెములుగల పెట్టెలు:- యింగ్లాండునందు చేయబడిన వెండి గిల్టుసామగ్రి; పింగాణీ భోజనసామగ్రి- నూరుమంది భోజనంచేయుటకు సరిపోయేవి.

భారతసామ్రాజ్యమున కంతకు రాజధానియగు కల కత్తానగర వీధులలో యీరీతిగ తమసాటివాడై ఆతడు బ్రతికి యున్నన్నాళ్లు కుంపిణీవారికి భక్తిపరుడగు మిత్రుడైయున్న ఒకానొక మహారాజుయొక్క స్వంతవస్తువులను— అన్నము తినే కంచముగిన్నెసహా— తీసికొనివచ్చి యీ రీతిగ బహిరంగ వేలము వేయుచుండగ చూచినప్పుడు, తక్కినరాజుల కందరికీ మనస్సులలో యెట్టిభావము లుత్పన్నములయ్యెనో వేరుగచెప్ప వలెనా? ఈ బహిరంగవేలపు ప్రకటనను చూచిన ప్రతివారు దానిని బజారులో తిట్టి దుమ్మెత్తిపోయుచుండిరని చెప్పుటలో సందేహమేమి? ప్రతిరాజాంతఃపురస్త్రీయు దానిపేరు చెప్పిన మండిపడుచు, శాపవాక్యముల నుచ్చరించుచుండెననుటలో

సందేహమేమి ? నిరంకుశాధికారమనెడు దొంగతాళపుచెవిచే కుంపిణీవారు సిగ్గులేక తమసొత్తుల నన్నిటిని దొంగిలించుటకు- దోచుకొనుటకు- సిద్ధముగనున్నారు సుమాయని బెదరించుట కదా యీప్రకటన యొక్క అర్థము? కాబట్టి, రేపు యేరాజు కేగతిపట్టునో,— యేరాజు చెంబు తెప్పాలాలను, వంటిమీాద ధరించిన రాజాలంకరణములను కుంపిణీవారు నిలువున నిలువ బెట్టి వలుచుకొనిపోయి వేలము వేయుదురో యెవరుచెప్ప గలరు ? ఫ్రెంచివీరుడగు నెపోలియన్ చెలరేగి ఆకస్మికముగ నొక్కపెట్టున, అప్పుడు ఫ్రాన్సుదేశము నేలుచున్న బోర్బన్ రాజవంశము వారిపైబడి, వారి నంత మొందించి, "బోర్బన్ వంశీకుల రాజ్యమింతటతో అంతరించిన"దని లోకములో ప్రకటించిన యుదంతము చాలఘోరముగ నున్నదని యింగ్లీషు చరిత్రకారులు విసుగులేక మాటిమాటికి శ్రీరంగనీతులు పలుకుచుందురు. అట్లే దుర్బలుడగురాజు నొకనిని బలాత్క రించి, వానిచేత "నారాజ్యం వదలుకున్నా"నని అనిపించి, ఆ రాజ్యమును నెపోలియన్ తాను అన్యాయముగ కాజేసి నాడని చరిత్రకారులు విసుగులేక నిందించుచున్నారు. అట్లే "ఎస్కూరియల్" రాజమందిరమునుండి బలాత్కారముగ లాగికొనిపోబడిన చిత్తరవులను గూర్చియు, 'సాన్‌మార్కు' లోని "పియజ్జా" నగరమునుండి గొంపోబడిన లోహపు గుర్రపు విగ్రహములను గూర్చియు చరిత్రకారులు నిందించు చున్నారు. న్యాయమే! ఇట్టి ఘోరకృత్యములు నిందార్హములే. కావని యెవరును అనరు. కాని, నెపోలియన్ తన పాలబడిన వారి ఒంటిమీాద నగలను, కట్టుబట్టలనుకూడ వలుచుకొని,

అమ్ముకొని తిన్నాడని యెవరును అనలేరు. ప్రష్యాదేశపు రాజగు ఫ్రెడరిక్ యొక్క రాజదండమును నెపోలియన్ హరించుట తప్పే—అంతవరకుతప్పే—ఆతప్పుచాలును. కాని, నెపోలియన్ యెంతపాపభీతిలేనివాడైనను, సదరు ప్రష్యా రాణియొక్క మెడలోని హారములను, నగలను, చేతివుంగరములను, మట్టెలను, మంగళసూత్రములనుకూడ నిలువున ఒలుచుకొని, తదాజధానీనగరపు బజారులలో బహిరంగ వేలము వేయుటకు యెంతో లజ్జించెడివాడని చెప్పవలసియున్నది. ఇంతటి సిగ్గుమాలిన నీచకార్యమునకు ఒడిగట్టుకొనుటకు నెపోలియన్ యెంతటిపాపభీతిలేనివాడైనను జంకెడివాడు.

అధర్మకార్య మొకవేళ జరిగినను, దానియందు నీచతయనునదెంతమాత్రము లేకుండావుంటే, ఆ అధర్మకార్యము యొక్క వికారరూపము సగము తగ్గిపోవునని పెద్దలు చెప్పుదురు. అట్లయినయెడల యుద్ధమనుపేర ప్రజలపై గావించు దౌర్జన్యము నికృష్టమగు దురాశచే కళంకితమైనయెడల, అది మరింత హేయమగునని చెప్పవలసియున్నది. ఒకమూల యొక్కడ యిండియాలో విక్టోరియారాణిగారి ప్రతినిధియగు డల్హౌసీప్రభువు దారిదోపిడిగాడై, తాను దోచుకువచ్చిన సొత్తునంతను యేడుణమందైతే వేలమువేసి అమ్ముకొనుచున్నాడో, ఆక్షణమందే అక్కడ యింకొకమూల, సీమలో రాణీగారి విదేశాంగమంత్రి రష్యాచక్రవర్తికి శ్రీరంగనీతులు బోధించుచుండెను!— ఏమని? రష్యాలో కొందరు ప్రముఖులు రాజద్రోహకరమగు కుట్రలలోచేరి రష్యాచక్రవర్తిని

పడగొట్టవలెనని చూచుచున్నట్లు అనుమానపడి, సదరు చక్రి వర్తి వారియాస్తులను లాగిపారవేయవలెనని ఆలోచించుచున్నా డట!— చక్రివర్తి యిట్లు వారి యాస్తులను లాగిపారవే యుట తప్పుట! ఈ తప్పుపని, యీ అధర్మకార్యము చేయ వద్దని మన యింగ్లీషు రాజ్యాంగమంత్రి రష్యాచక్రివర్తిని మందలించుచుండెను! ఆహా! "ఓ వైద్యుడా, నీరోగాన్ని నీవు నయంచేసికోవోయి!" అని రష్యాచక్రివర్తి మంత్రులు మన ఆంగ్లమంత్రిని త్రిప్పికొట్టితే బాగుండేది !

ఈ కాలమందు జరిగిన యింకొక రాజ్యాపహారణము జాన్సీ రాజ్యమునకు సంబంధించినది. ఈ రాజ్యాధిపతి మొదట పీష్వాకు సామంతుడుగ నుండెను. తదుపరి యిం గ్లీషువారికి సామంతుడయ్యెను. 1835 సం॥ లో జాన్సీ రాజు రఘునాధరావు చనిపోవుచు, ఒక కుమారుని దత్తతచేసి కొనెను. కాని, యీతడు తన దత్తతను స్థిరపరచుకొనలేక పోవుటచే, యీతని పినతండ్రి యొకడు సింహాసనమునకు వచ్చెను. దానికి ప్రజలుగాని, యింగ్లీషు గవర్నమెంటు వారుగాని యేమియు అభ్యంతరపెట్టలేదు. ఈతడీ విధముగ క్రియకు రాజగుటచే— లా ప్రకారముకూడ రాజైనట్లు ఊహించి అప్పుడు గవర్నర్ జనరలుగనున్న బెంటింకు ప్రభువు అంగీకరించుటచే, దీని నాధారముగ చేసికొని "దత్తుడగు వాని రాజ్యాధికారపు హక్కును తీసివేయుటకు నాకు అధి కారముగలదు. ఇదిగో, వెనుక రఘునాధరావు దత్తత కొడుకు విషయములో బెంటింకు చేసిన పనియే యిందుకు దృష్టాంతము— చూడండి" అని 1853 సం॥ లో డల్హౌసీ

ప్రభువు తన సూత్రమును సమర్థించుకొనుట కొరకు ఆధారము దొరికినట్లుగ నటింపసాగెను. దత్తుని యధికారము త్రోసివేసి రాజ్య మెవరికివ్వవలెనని? రక్త సంబంధీకుడగు సన్నిహిత వారసునికికాదు; ప్రజలచే యెన్నుకోబడిన ప్రజానురంజకుడగు యింకొకనికీకాదు; మధ్య తాను— తన యింగ్లీషు గవర్నమెంటు— కాజేయవలయునని డల్హౌసీ ప్రభువుకు బుద్ధి పుట్టెను. రాజ్యమెవరికిరావలెనను తగాదా జ్ఞాతులలో కలిగినప్పుడు, సార్వభౌమాధికారులా తగాదాను తీర్ప వచ్చును; తీర్పకుండ పోవచ్చును. అంతేకాని, మధ్య యేదో సందు జూచుకొని, జ్ఞాతులలో యెవరికో, ఏదో సరియైన హక్కులేదని మిషపెట్టి న్యాయముగ హక్కుదారులగు తక్కినవారినందరిని త్రోసిపారవేసి, మధ్య అంతయుతామే వేసికొనజూచుట సార్వభౌమునికి ధర్మముకాదు; న్యాయము కాదు. కాని, డల్హౌసీప్రభువు చేసినపని సరిగయింతే. 1853 సం॥ లో జాన్సీరాజ్యమును పాలించుచున్న రాజు ఆనందరావను కుర్రవానిని విధ్యుక్తముగ దత్తతచేసికొనెను. ఆరాజు చనిపోవుచు, "యీ కుర్రవానిని మీరుదయతోను జాగ్రతతోను చూచుకొనుచుండవలసినది. నా తదనంతరము నా భార్య యీ కుర్రవానికి మైనార్టీకాలమందు గార్డియన్‌గనుండునట్లు అంగీకరించవలసినది" అని గవర్నర్‌జనరల్ అగు డాల్హౌసీకి గౌరవపూర్వకముగ వ్రాసెను. మరియు, యీ సందర్భమందు తనకును యింగ్లీషు గవర్నమెంటువారికిని లోగడజరిగి యున్న యొడంబడికలోని రెండవషరతునుగూర్చి వివరించెను. అందేమున్నదనగ :— "ఈ రాజ్యమును నీకును,

నీ వారసులకును — ఔరసులకుగాని, దత్తులకు గాని-పారంపర్యముగ శాశ్వతముగ చెందునట్లు హామీ యిచ్చుచున్నాము" అని కుంపిణీ వారందువాగ్దానము చేసి యుండిరి. కాబట్టి యీ షరతుప్రకారము "నేను మీయెడ నెల్లప్పుడు చూపుచువచ్చిన భక్తివిశ్వాసములకు ప్రతిఫలముగ మీరీకుర్రవాని పై తమయనుగ్రహమును చూపుదురని విశ్వసించుచున్నాను" అని పాపమా రాజు డల్హౌసీకి వ్రాసెను. నేటివులుచూపు భక్తి విశ్వాసములు యింగ్లీషువారికి జ్ఞాపకముండునను పిచ్చినమ్మకముతో కంపెనీవా రాతనిని చచ్చిపోవనిచ్చిరి! ఇంగ్లీషుగవర్నమెంటు మహాబలిష్టముగ యుండియీయందు వ్రేల్లుపాతుకొనిపోయినది. కాబట్టి కలకత్తాలోని విలియంకోట కధినాధుడై కూర్చుండియున్న సర్వంసహా నిరంకుశాధికారి డల్హౌసీప్రభువు యేమనితలంచెను?— "ఈ నేటివులు చూపేభక్తివిశ్వాసాలు మనము జ్ఞాపకముంచుకోకపోతే యేమి? వీనిలెక్కయేమి- వీనిని మనము మరచిపోవచ్చును, మనకేమిఫరవాలేదు"- అని తలపోసెను. రాజుమరణానంతరము "యీ కుర్రవానికి రాజ్యాధికారములేదు, పో పొమ్మని" డల్హౌసీ ప్రభువనెను. రాణి లక్ష్మిబాయి కొకమేడయిచ్చి, అందులోనుండి కదలవద్దని చెప్పిరి. అదే ఆమెకు జైలుఖానాయయ్యెను. జాన్సీ రాజ్యాన్ని మా యింగ్లీషురాజ్యంలో కలుపుకొన్నా మొహో యని మరునాడు లోకమంతట చాటింపు వేయించిరి. రాణీ లక్ష్మిబాయి ఘోరముగ శోకించెను. కుంపిణీవారి దుర్నయము నామె యెన్నడు క్షమింపలేదు- జన్మలో మరచిపోలేదు. 1857 సం॥ లో సైనిక విప్లవపు



అప్పాసాహెబు (నాగపురాధీశ్వరుడు)
584 పేజీ చూడుడు.



నానాసాహెబు (ఆఖరుపీష్వా బాజీరావు యొక్క పెంపుడుకొడుకు సైనిక విప్లవనాయకుడు. 583 పేజీ చూడుడు)



జాన్సీరాణీ లక్ష్మీబాయి

[సైనిక విప్లవనాయకురాలు. రణరంగమందు అపరసత్యభామ]

(748—749 పేజీలు చూడుడు)

ిలుపు వినబడగనే, ఆమె పురుషవేషము ధరించి, అశ్వా
రూఢయై నెలలతరబడి గుర్రముమీదనే స్వారిచేయుచు,
సైనికదళములకు, వ్యూహములకు నాయకురాలై వానిని
డిపించుచు తుట్టతుదకు యావన్మహారాష్ట్రసైన్యమునకు
ధినాయకియై అరిభీకరులైచరించు తన చమూసమూహము
కెల్ల నుత్సాహమును రెట్టింపజేయుచు, అపర సత్యభామయో
మనునట్లు మహాఘోరసంకుల సంగ్రామము సాగించెను.

ఆ విప్లవనాయకులలో యెవరుకూడ యింగ్లీషుసేనల
మె గలిగించినంతటి యిబ్బందిని, ఉపద్రవమును గలిగించి
యుండలేదు. పోరు యెంతఘోరముగను, నిరాశగను గంటల
లది యున్నను ఆమె రణరంగమును వీడిపోదే! పరాజయప్ర
లవరమందు యే ప్రక్కనుండియో చెదురుగ వచ్చిపడిన
రంగి వ్రేటుచే లక్ష్మిబాయి నేలకొరగెను. కాని, ఆమె తన
ంశమునకు, దేశమునకు గలిగిన యవమానపరంపరలకు
గిన ఘోరప్రతీకార మొనర్చినపిమ్మటగాని ఆమె మరణించ
దు.



# ఆంగ్ల రాజ్య స్థాపన

## 26 వ అధ్యాయము.

### రాజ్యముల దిగమ్రింగుట :— 1853-1856



తీరరాని రాజ్యతృష్ణచే, మన మీ రాజ్యముల దిగమ్రింగుచు, దాని వలన వచ్చు ఉపద్రవములను గమనించక, కండ్లు మూసికొని, ఊరక పోవుచు న్నయెడల, ఎప్పుడో ఒకరోజున దేశప్రజల భ్రమ హటాత్తుగ వీడి, ఒక్కపెట్టున మనపై—మన యార్థిక సౌధముపై—గొప్ప పిడుగుపడును. అప్పుడు కాని, మన కండ్లు తెరిపిడిపడవు.

—రిచర్డు కాబ్డెన్

మన రాజ్యాపహరణమువలని వత్తిడి హిందువులకు సిక్కులకుకూడ బహు భారమయ్యెను. తానింటికి వెళ్లేలోగా, తన ముద్రను మహమ్మదీయరాజ్యములమీదకూడ వేసి వెళ్ల వలెనని డల్హౌసీ నిశ్చయించుకొనెను. మహమ్మదీయ రాజ్య ములప్రభ నాడే తరిగిపోయెను. కాని, దాని మిణుకుమిణుకు మను కాంతి యింకనుపోక, ప్రాకులాడుచుండెను. చీకట్లు యిదివరకు చాలకాలముక్రిందటనే వానిమీద ప్రసరింప

జొచ్చెను. ఒక మహాకవి చమత్కారముగ వర్ణించినట్లు "అది చీకటికాదు, అంతరించిన వెలుతురట!" ఒకప్పుడు మహాప్రతిభావంతముగ వెలిగిన తేజస్సంతయుపోయి, కనీస మిణుకుమిణుకుమను వెలుతురైనను వున్నదిగదా యను ఆశకూడ లేకుండ — వెనుకటి ప్రతిభ తలంచుకొని ఒకమూలగుండెపగిలి విలపించుచు, యింకొకమూల పోనీ యీ కాస్త వెలుతురునైనా చూచుకొని యూరడిల్లుదమను ఆమాత్రపు ఆశకూడ లేకుండ — సర్వమును కంపెనీవారు నాశన మొనర్చిరి. సర్వనాశకులగు యీ బ్రిటిష్ నిరంకుశాధికారులు దేశీయరాజ్యములను కూలద్రోయుటతోడనే సంతృప్తి చెందక, తమ కంటికి యింపుగా గాన్పించిన పురాతన రాజ్య చిహ్నముల నన్నిటిని నామనిశానీలుకూడ లేకుండ రూపు మాప దలంచిరి. పూర్వపు రాజ్యములను పదభ్రష్ట మొనర్చి తామాస్థానముల నాక్రమించి కూర్చున్నది చాలక, హానిసత్వమందుపడి దుఃఖాతిరేకము చేతను, పరిభవాగ్ని చేతను సంతప్తులగు నారాజుల తాపోపశమనకై ఒక్కవాసోదకపు బిందువునైనను వారికి దక్కనీయకుండ, దానినికూడ వారే దిగమ్రింగుటకై నాలుకలుజాప మొదలిడిరి. తమకక్కరలేని వానినికూడ, తామే వేసికొనవలెనని తహతహలాడుచుండిరి.

ఒక శతాబ్దములోపల నాలుగు మహమ్మదీయరాజ్యములు ఎప్పటికప్పుడు యింగ్లీషువారికి సహాయముచేయుచు వారికెంతయు బలము చేకూర్చుచువచ్చెను. తుదకు యీ నాలిగింటిలో ఒక్కదానినికూడ మిగల్చకుండ, అన్నిటిని యింగ్లీషువారు నాశనముచేసిరి. అవన్నియు యిప్పుడు కుంపిణీవారికి పాదా

క్రాంతములై యున్నవి. వైసాయియగు డల్హౌసీకి అనేకమంచి గుణములున్నవి; కాని, వానిలో దయయనుగుణము మాత్రములేదు. ప్రపంచములో నాతడెవరియెడలను దయయను దానిని జూపిన పాపమునపోలేదు.

మొట్టమొదట మలబారు కోస్తాలో యింగ్లీషువారి వర్తకమునకు దిక్కులేక యల్లాడుచున్నప్పుడు, వారికి రక్షణ నొసంగినవారిలో మొట్టమొదటివాడు కర్నాటక నబాబు. అప్పుడు నబాబుకు ఫ్రెంచివారికి తగాదావచ్చినప్పుడు కుంపిణీ వారతనికి సహాయమొనర్చిరి. అందుకు ప్రతిఫలముగ నబాబు వారికి కొంత నివేశనస్థలమును, సరుకులకొట్లకు కొంత అవకాశమును యిచ్చెను. కుంపిణీవారి అధికారము వృద్ధియైన కొలది, నబాబుపని క్షీణింపసాగెను. నబాబు కత్తి తుప్పుపట్టుచు రాగా, కుంపిణివారి బాకు మెరయజొచ్చెను. తుదకీ కర్ణాటక రాజ్యమెట్లు క్రమక్రమముగ హరింపబడెనో, ఆ కథనంతను తిరిగి యిప్పుడిక్కడ మెవరూ యేకరువుపెట్ట నవసరములేదు. కుంపిణీవారికిని, కర్నాటక నవాబుకును గల ఒడంబడికను పునర్నిర్మాణమొనర్చుటకై వెల్లస్లీప్రభువు పూనుకొన్న కాలమునకు, అప్పటికే, "కర్నాటకరాజ్యము మన స్నేహమను వలలో తగుల్కొనెను; మన సంరక్షణయను వురితాటిలో యిరుకుకొని యుండెను" అని, ఆర్నాల్డు అను యింగ్లీషువాడు వ్రాసెను. కాని, వెల్లస్లీప్రభువు అల్పపీడన మొనర్చు తుచ్ఛబుద్ధిగలవాడు కాడు. ఈ రాజ్యపు బలహీనస్థితినిజూచి వెనుకటి ప్రమాణములు, ఒడంబడికలు, రద్దయి పోయినవవనిచెప్పి తప్పించుకొనజూడలేదు. కర్నాటక

నబాబగు అమదుతుల్లా ఉమ్రా మైసూరు ప్రభువగు టిప్పూ సుల్తాన్‌తో చేరి కుట్రపన్నుచున్నట్లు అప్పుడు కుంపిణీవారు అనుమానపడిరి. అతనికొడుకు ఆలీహుస్సేన్‌కూడ తనతండ్రివలెనే కుంపిణీవారియెడ ద్రోహబుద్ధితో నున్నట్లు అనుమానపడిరి. కాని, దీనిని కారణముగ పురస్కరించుకొని వెనుకటి యొడంబడికలను రద్దుపరచుటకుగాని, వారికిచ్చెదమని యిదివర కనేకపర్యాయములు వాగ్దానము చేసియుండిన రెవిన్యూను తాము లాగికొనుటకు గాని, కుంపిణీవారప్పుడు పూనుకొనలేదు. కాని, కర్నాటకరాజ్య వారసత్వమును నిర్ణయించుటకును, తద్రాజ్యపు సివిల్ మిలిటరీ పరిపాలనయావత్తు తామే వహించుటకును, కుంపిణీవారు కర్నాటక నబాబగు అజీంఉల్‌దౌలాతో క్రొత్త ఒడంబడిక నొకదానిని చేసికొనిరి. రాజ్యపు ఆదాయములో అయిదింట నాలుగువంతులు కుంపిణీవారికిని ఒకవంతు నబాబుకును శాశ్వతముగ చెందునట్లు ఆ సంధిపత్రిములో నాల్గవపేరాలో వ్రాసికొనిరి. ఈ గౌరవములను, డాబుదర్పములను యీతని కొడుకు 1853 సం॥ లో తాను చనిపోవువరకు అనుభవించెను. అంతటితో కర్నాటకరాజ్యముపై కృతజ్ఞత చూపుచున్నామని చెప్పు దొంగనటన — ఈ దొంగనాటకము — నింక చాలించుటకు తెరదింపి నాటకము నింక కట్టివేయుటకు కాలమాసన్నమైనదని డల్హౌసీప్రభువు తలంచెను. సీమలోని మంత్రివర్గమువారును, కుంపిణీ డైరెక్టర్లును కూడ, డల్హౌసీ అభిప్రాయముతో నేకీభవించిరి. వెంటనే "నీవింక కర్నాటకనబాబు అను బిరుదు వహించుటకు వీలులేదు" అని డల్హౌసీ ప్రభువు వెనుకటి నబాబు

కొంతకాలు అజీంషాతో నిర్మొగమోటముగ చెప్పివేసెను. "నీ కిచ్చే ఆయిదింట ఒకటవవంతు రెవిన్యూనుకూడ నీ కివ్వము పొమ్మనెను." దీనికాతడు చెప్పిన కారణమేమనగ:— సార్వ భౌముడు సామంతరాజులతో "శాశ్వతముగ" ఒడంబడిక చేసికొన్నాడంటే, దాని అర్థమేమి? శాశ్వతమనే మాటకు అర్థమేమి— శాశ్వతమనగ, సార్వభౌమునికి అవసరమని తోచే వరకే! అంతకంటె యెక్కువకాలమీ షరతులకు సార్వ భౌముడు బద్ధుడు కావలసిన అవసరము లేదు!" అని డళ్హౌసీ వాదన. అనగ, ఒడంబడికలను విశ్వాసముతో ననుసరించ వలసిన బాధ్యత ఒక్క పక్షమువారికే గాని, రెండవ పక్షము వారికి లేదన్నమాట. ఏలననగ, "నిజమగు రాజ్యాధికార మించుకైనను లేక, వట్టి రాచరీవినటించుట వెక్కిరించినట్లుం డును. ఇట్టి నటన చాల దుష్టమైనది. ఇది వుండకూడదు. దీనిని వెంటనే తీసి పారవేయవలెను" అని డళ్హౌసీ భావన! కర్నాటక నబాబు యొక్క రాజమందిరమగు "చీపాక్ భవన" పు కీర్తి యొకమూలనుండి యస్తమించి పోవుచుండగ, యింక నను తద్భవనమందున్న నబాబుకు రాజ్యాధికారము లున్నట్లు పైకి నటింపజేయుట కేవలము సాహసము. భారతవర్ష దుష్పరి పాలనోదంతమం దింతకంటె ఆశ్చర్యకరమగు,—పరిహాసాస్పద మగు— విషయ మింకొకటి యుండబోదు. నబాబువంశము ఉచ్చదశయందున్న రోజులలోకూడ, నిజమగు రాజ్యాధికారము వీరికెన్నడును లేదు. ఏలననగ, యీ నబాబెన్నడును సర్వస్వతం త్రుడు కాడు. ఈతడు నైజాముకు సామంతుడై యుండెను. ఈ నైజామైనను సర్వస్వతంత్రుడుకాడు. ఈతడును ఢిల్లీపాదు

షాకు లోబడినవాడే. అయితే, స్థానికాధికారమును మాత్రము యీ నబాబువంశమువారు గతనూరేండ్లనుండి అనుభవించు చున్నమాట నిజము. అయితే, స్థానికాధికారము వేరు, రాజ్యాధికారము వేరు. ఈ రెంటికి సంబంధములేదు. కొద్దియో, గొప్పయో,— ఉన్న ఆకాస్తరాచరికము కూడ— దేశమందు లేకుండ శుభ్రముగ తుడిచిపెట్టుకు పోయినది. ఎక్కడికి పోయినదో మద్రాసు, కలకత్తాలలోని "రికార్డు రూములు" తెలుపగలవు. అయితే, రాచరికము పోయినను, తద్రాజ్యపు ఆదాయమును, గౌరవగణ్యతలను కుంపిణీవారు మొన్నటివరకు యెట్లో మన్నించుచువచ్చిరి. ఏలననగ, వీని నన్నిటిని మన్నించెదమని వెనుకటి ఒడంబడికలలో కుంపిణీవారు బహిరంగముగ చెప్పి ఒప్పుకొనియుండిరి. ఇవి ఆ యొడంబడికల యందు షరతులుగ యేర్పడియుండెను. కాని, యిప్పుడా రోజు లన్నియు గతించినవి. ఇప్పుడా సంధిపత్రములను ముక్కలు ముక్కలుగ చింపివేసి, గాలికి తూర్పారబట్టిరి. రాజబిరుదము లను పీకిపారవేసిరి. "మీరింక యీ బిరుదులు వహింపరా"దని హుకుముల బంపిరి. నబాబుల కిచ్చుచుండిన ద్రవ్య మునంతను యిచ్చుట మానివేసిరి. దేశముమీద వచ్చు ఆదాయమును బలాత్కారముగ తామే కాజేయుచుండిరి.

దేశీయరాజులయెడ డల్హౌసీ చేసిన నిరంకుశ చేష్టితము లొక్క వారసత్వ విషయములోనేకాదు. తాను ప్రతినిధిగ నున్న యీ బ్రిటిష్ సామ్రాజ్యముయొక్క అభీష్టమునకుగాని, అధికారమునకుగాని యెదురుచెప్పువా రెవరును లేరుసుమా యని దేశీయుల మనస్సులలో గట్టిగ నాటునట్లు చేయుట కాత

డెట్టి యవకాశమునూ జారవిడువలేదు. బంగాళా నబాబు యిండియాలో మన కంపెనీవారికున్న స్నేహితులలో చాల మొట్టమొదటివాడు. అట్టివానియెడ యీ డల్హౌసీ నెరపిన ప్రవర్తన "అత డింతకుమున్ను పెక్కు లుద్దండత తాను జేసిన విధంబులకెల్ల మెఱుంగుపెట్టినట్లుండెను." బ్రిటిష్ సామ్రాజ్య మను యీ యింటికి బంగాళాదేశము వెనుకదొడ్డిగ నుండెను. 1757, 1760, 1763 సంవత్సరములలో మీర్జాఫర్, మీర్కాసీములతో జరిగిన ఒడంబడికలవల్ల మనకు (కుంపిణీవారికి) ఇచ్చట కాలూని నిలుచుటకు తావును, మొట్టమొదటి రాచకీయాధికారములును లభించెను. 1765, 1767, 1770 సంవత్సరములలో వారి సంతతివారితో చేసికొన్న ఒడంబడికల వల్ల మనము క్రమక్రమముగ దేశీయరాజుల రాజ్యాధికారము ను ఆక్రమించుకొనుట కవకాశ మేర్పడెను. హేస్టింగ్సు కారన్‌వాలీసు, మున్నగువారలు చేసిన రాచకీయాధికార ప్రయోగములవలన దేశీయరాజ్యముయొక్క నామరూపములు కూడ మూర్షిదాబాదు నగరమునందు లేకుండ పోయినవి.

కాని, బంగాళానబాబుల దర్జాను, రాచరీవిని, సాంఘిక మర్యాదలను మేము మన్నించెదమని కుంపిణీవారు అయిదు సంధిపత్రములలో ఒప్పుకొనియుండిరి. ఈ పూర్వరాజుల పోషణకై తగు ఆదాయమును కుంపిణీవారు వీరికి శాశ్వతముగ యిచ్చునట్లు ఆ పత్రములలో విధింపబడియున్నది. ఈ శాశ్వతవిధియను మాటల కర్థమేమో దేవునకే యెరుక. మీర్జాఫర్ సంతతివారందరు సిద్ధాంతభాగములో యెట్లున్నను, క్రియలో నిజముగ రాజులేయని ప్రతిగవర్నర్

జనరలును సీమకువ్రాయు ప్రతియుత్తరములోను స్పష్టముగ నుదహరించుచునేవచ్చిరి. ఒకరు తమ రాచకీయాధికారము లను వదలుకొని, యింకొకరిచేతులలో పెట్టుటయను కార్య మీ యిండియాలో యీ సందర్భములో కత్తిబలముచే జరుగ లేదు; దౌర్జన్యముచేగాని, యుద్ధవిజయముచేగాని జరుగలేదు. "ఇదిగో, నేనీరాజ్యాధికారమును వదలుకొనుచున్నా" నని యెవరును వ్రాసియివ్వలేదు; చెప్పలేదు. కాని, యీరాజ్యా పరివర్తనకార్యము—యీమార్పిడి—యెట్లో నెమ్మదిగ, నిశ్శ బ్దముగ, జరిగిపోయినది. పరరాజ్యాభివృద్ధి నెమ్మదిగ, యేక రీతిగ, జరిగిపోయినది. దేశీయరాజులు తమసైన్యములపైనను, ఖజానాపైనను అజమాయిషీచేయు నధికారమును మొట్ట మొదటుగ కుంపిణీవారికిచ్చిరి! ఇదేకుంపిణీవారి రాజ్యాధికార మునకు మొట్టమొదటి అంకురము. పూర్వము కొందరు మం త్రులు రాజుకంటె బలవంతులై, నిజమగు రాజ్యాధికారము నంతను రాజునుండి లాగివేసి, తామే సర్వాధికారములను చెలాయించుచు మెలంగినరీతిగ యిప్పుడీ కుంపిణీవారుకూడ చేతిలోనికి కావలసినంత డబ్బు, సైన్యమువచ్చినందున నిజమగు అధికారమునంతను దేశీయరాజులనుండి లాగివేసి, తామే క్రియకు సర్వాధికారులై, రాజునెడ పేరునకుమాత్రము గౌరవ లాంఛనముల నెరపుచుండిరి. మీర్జాఫరుసంతతిలో ఆఖరువా డగు ముబారక్-ఉల్-దౌలా రాజ్యమునకు వచ్చునప్పటికి మైన రైనందున, కుంపిణీవారు విజృంభించి తమ రాజ్యాధికార మును సుప్రతిష్ఠితమొనర్చుకొనుటకును, దేశీయరాజ్యాధి కారము నంతరింపజేయుటకును మంచి యవకాశము చిక్కెను.

నబాబుయొక్క యీ మైనారటీకాలములో నిశ్శంకముగ తమ చేతిలోనున్న రాజ్యాధికారమును దిట్టపరుచుకొనుటకు గవర్నరుకున్నూ, అతని కౌన్సిలుకును బలేవాటమైన సందుదొరికినది. నబాబుమైనారిటీ వెళ్లినతరువాత, న్యాయముగ అతని రాజ్యాధికారము నతనికిచ్చివేయుట కెంతమాత్రమును యిష్టపడక కుంపిణీవారు దాని కనేక తిప్పలుపెట్టిరి. అదిగాక, దేశీయ ప్రజలును యింతకాలమునుండి విలియంకోటనుండి వచ్చు యింగ్లీషువారి హుకుములకు అలవాటుపడినవారగుటచే, యిప్పుడా హుకుములను తిరస్కరించి, మూర్షిదాబాదు కోట నుండివచ్చు నబాబు హుకుములను మన్నించుట యెట్లో యెరుంగజాలకుండిరి. కుంపిణీవారి నిరంకుశచర్యను నబాబు ప్రతిఘటించెను. కాని యీతనిమాటలను కుంపిణీవారు చెవినిపెట్టలేదు. అథవా యెప్పుడైన చెవినిబెట్టినను, వానికి తగినసమాధాన మివ్వక యేవో తప్పుకునే మాయమాటలను చెప్పి కాలక్షేపము చేయుచుండిరి. ప్రతిగవర్నర్ జనరలు ప్రతి నబాబును యెక్కడలేని మర్యాదలతో, మహాగౌరవములతో మన్నింపుచునూ వచ్చెనేగాని, ఒక్క అంగుళము అధికారమునైనను వదలుకొని నబాబులకిచ్చిన పాపమున ఒక్క గవర్నరుజనరలైననుపోలేదు. ఈ సంధిపత్రములు చెల్లదగినవి కావనియైన ఒక్క గవర్నర్ జనరల్ కూడ పల్లెత్తుమాట అనియుండలేదు. మీర్జాఫర్ సంతతివారి రాజ్యాధికారములను, గౌరవదర్పములను, మేము మన్నింతుమని యీ సంధిపత్రములలో కుంపిణీవారు నిష్కర్షగ ఒప్పుకొనియుండిరి. నిజమగు రాజ్యాధికారము నంతను మేము లాగికొ

స్నను, నబాబుల దర్జాలుగాని, దానికి సంబంధించిన హక్కులుగాని, ఆ కుటుంబమువారికి లేవని యింతవరకు యెవడుకూడ అనలేదు. అదిగాక, ఈ సంధిపత్రములవల్ల హామీ యివ్వబడిన హక్కులను ఒప్పుకొనుచు, వెల్లస్లీ, మింటో, హేస్టింగ్సు, అమ్హరస్టు, హార్డింజి, ఆఖరుకు యీ డల్హౌసీకూడ సీమకు అనేక ఉత్తరములను వ్రాసియుండిరి. ఈ హక్కులను, దర్జాలను, గౌరవములను, తదితర అధికారములను మన్నింపుదుమను వాగ్దానములుకూడ ఆ జాబులందు స్పష్టముగ గలవు. మీర్జాఫరు సంతతిలో ఎనిమిదవవాడగు "సయ్యదుమున్సూర్ ఆలీఖాన్" అనునతడు మైనారిటీలో నుండగ 1838 సంవత్సరములో రాజ్యమునకు వచ్చెను. పట్టాభిషేక మహోత్సవములను, ప్రకటనలను, అభినందనములను, యథావిధిగ కుంపిణీవారు పూర్వమువలెనే నడిపించిరి. "సయ్యద్ ముర్ మూరు ఆలీఖాన్‌గారు తమ వంశక్రమాగతమగు నబాబుగిరికి, దానికి సంబంధించిన గౌరవబిరుదములతో సహా వచ్చియున్నారు. దీనికి సంబంధించిన అధికారములను, దర్జాలను, హక్కులను, వారు ఇదే పొందుచున్నారోహో! " అని కుంపిణీవారు లోకమందంతటను చాటింపిరి. ఈ పట్టాభిషేక మహోత్సవమును గౌరవపూర్వకముగ ప్రకటించుటకుగాను 19 ఫిరంగులను, మూడు వరసలు తుపాకులబార్లను కంపెనీవారు మోగించిరి. 1770 సం॥ లో జరిగిన ఒడంబడిక వలన నబాబున కిచ్చునట్లు హామీపడిన వార్షికమూల్యములో కొంతభాగముయొక్క వినియోగమునుగూర్చి వచ్చిన యభిప్రాయభేదముతప్ప, పూర్వపు నబాబులకును కుంపిణీవారికిని గల

ప్రాత్తును కలవరపరచు సంఘటనలేవియు సంభవించియుండ లేదు. తమకు హాయిగ గలిగిన రాజ్యవిశ్రాంతిలో నబాబుల కత్యంతప్రియతమమగు హక్కు ఒకటి యుండెను. అదేదనగా:- 'అదాలత్తు' లకుగాని అనగా (దేశీయమగు కోర్టులకుగాని) కుంఫిణీవా రేర్పరచిన సుప్రీముకోర్టులకుగాని, ఈ నబాబు లను విచారించు అధికారములేదు. కాని, 1794 సం॥ లో యీ కోర్టుల కిట్టి అధికారముల నిచ్చుచు కుంపిణీవారు ప్రత్యేక మొక శాసనమును నిర్మించిరి. నబాబు కుటుంబములోవారికి గాని, సంస్థానములోవారికి గాని, పరివారములోవారికి గాని యేమైనా తగాదాలువస్తే, వానిని విచారించి పరిష్కరించు హక్కు యీకోర్టు కివ్వబడెను. నబాబుకును కుంపిణీ వారికిని అధికారరీత్యా జరుగు వ్యవహారములు యేరీతిగ జరుపబడవలెనో నిర్ణయించు శాసనములు యిటీవల 1805, 1806, 1822 సంవత్సరములలో నిర్మింపబడెను. ప్రాచ్యదేశముల యాచారముల ననుసరించి, ఉన్నత రాచకుటుం బమునకు చెందిన నబాబువంటి వానిని వాదిగగాని, ప్రతివా దిగగాని, కోర్టులకు తీసికొనివచ్చుట మర్యాదకాదు గావున, యిట్టి కేసులలో ఆతని తరఫున నబాబు సంస్థానమందున్న కుంపిణీవారి యేజంటే కోర్టుకు హాజరుకావలయునని కుంపిణీ వారేర్పాటుచేసిరి. నవాబునకిచ్చిన యిట్టి హక్కులలో కొన్నింటిని తీసిపారవేయవలెనని 1834 సం॥ లో కొందరు స్థానికాధికారులు ప్రయత్నించిరి. కాని, దీనికి కలకత్తాలో నున్న వైస్రాయిప్రభుత్వము వారు అంగీకరించలేదు. ఈ సందర్భమందు "సర్ చార్లెస్ ట్రెవెలియన్" అను మెంబరు

యిట్లు వ్రాసెను:— "నబాబును స్వతంత్రరాజుగ మన గవర్నమెంటువారము అంగీకరించియున్నాము. ఈతనికీ గౌరవములో నే మాత్రమైనను తగ్గించునట్టిగాని, భంగపుచ్చునట్టిగాని, యేపనియు చేయమని మనము మనజాతిగౌరవము పేరట వాగ్దానముచేసియున్నాము. కాబట్టి, యీ బంగాళానబాబుపై యెట్టి అధికారము చలాయించుటకుగాని, మన సుప్రీముకోర్టుకు హక్కులేదు. కాబట్టి, సుప్రీము కోర్టువారు కోరు యిట్టి హక్కును ప్రతిఘటించుటకు అడ్వకేటు జనరల్ గట్టిగ ప్రయత్నించవలసినది. జిల్లా కోర్టులో వీరి స్వంతగౌరవమునకు గాని, ఆస్తులకుగాని, యెట్టి అమర్యాదయు జరుగకుండుటకుగాను 1825 సంవత్సరచట్టము ప్రత్యేకముగ నిర్మింపబడినది. దీనినిబట్టి నబాబును విచారించుటకు సుప్రీముకోర్టుకు అధికారములేదా యని వాదింపరాదు. ఏలననగ, యిట్టి వాదననంగీకరించినచో, మనము మనజాతి గౌరవముపేరట నబాబుకు వాగ్దానము చేసియున్న మర్యాదలన్నియు క్రమక్రమముగ హరించిపోవును. ఈ సందుచూచుకొని, ఒక్కొక్క మర్యాదనే మనవారు లాగివారవేయుదురు. ఇండియాలో మనకీ ప్రాంతముల మిత్రులగు వారిలో యీతని వంశమే బహుపురాతనమైనది. ఇట్టి పురాతన మిత్రవంశ ప్రతినిధికి మనము న్యాయముగ జూపవలసిన మర్యాదల నిట్లు లాగివారవేయుట మనకు గౌరవము కాదు."

ఈ రీతిగ డల్హౌసీకి పూర్వమున్న కుంపిణీయుద్యోగస్తులందరు నబాబుయొక్క రాజ్యాధికార గౌరవముల నన్నించుట తమ విధియని మనస్సాక్షిపూర్వకముగ నమ్మియుం

డిరి. ఆ కేతిగ, ఖండితముగ, వ్రాసిపెట్టిపోయిరి కూడాను. కాని, సర్వరాజ్యముల నొక్కపెట్టున నాపోశన పట్టుదమను సహంకారముతో వచ్చి కూర్చున్న డల్హౌసీకి యీ వ్రాతలన్నియు రుచించునా? వెనుకటి యొడంబడికలన్నియు తత్కాలముల కనుకూలముగ నిర్మింపబడిన లాంఛనమాత్ర పత్రములనియు, అవసరమైనప్పుడు— బ్రిటిష్ సామ్రాజ్య విజృంభణకివి అడ్డమువచ్చినప్పుడు— నిర్మొగమోటముగ వానిని తీసి దూరముగ పారవేయవచ్చుననియు, డల్హౌసీ తలంచెను. తన బ్రిటిష్‌జాతి గౌరవమును కాపాడుకొనుట కంటె, “భారతీయులను భయముచే హడలగొట్టితి” నను పేరు సంపాదించుకొనుటయే ఆతని కెక్కువగ నుండెను. తన జాతివారు చేసిన వాగ్దానములను నిలిపి వారికి మంచిపేరు తెప్పించుటకన్న, పరజాతులను వంచించి, అవమాన పరచుటవే ఆతని కెక్కువ ఘనకార్యముగ గన్పట్టెను. డల్హౌసీ యొక్క మనోదగ్రతను స్పష్టముగ కండ్లకు గట్టినట్లు తెలుపు యుదంతమొకటి 1853 సం॥ లో జరిగెను. అదేదనగ 1853 సం॥ మార్చి నెలలో నవాబు వేటకై వెళ్లెను. అప్పుడు నవాబు కొజ్జాలలో ఒకని నగలపెట్టెను ఎవరో దొంగిలించుకొనిపోయిరి. ఇద్దరు హిందూబాలురపై అనుమానము తగులగా, నవాబు నౌకర్లు యీ యిరువురు బాలురను పట్టుకొని చావగొట్టిరి; ఆ బాలురిరువురు చచ్చిరి.

ఈ దుష్కృత్యము నిస్సందేహముగ ఘోరమైనదే. ఈ కేసును బహుకాలము దీర్ఘముగ విచారించి నవాబునౌకర్లకు తగుశిక్ష వేసిరి. ఈ కఠినశిక్షకు నిజముగ యీనౌకర్లు

పాత్రులే. నబాబుయొక్క ప్రధానోద్యోగి అమనుఆలీని, యింకా కొంతమంది గొప్పకుటుంబీకులను కూడ మొదట యీ కేసులో ముద్దాయిలుగ చేర్చిరి. కాని, చాలదూరము విచారించిన పిమ్మట వీరునిర్దోషులని చెప్పి సగౌరవముగ విడుదల చేసిరి. నబాబుకుకూడ యిందులో యేమాత్రమైన జోక్యమున్నట్లు రవ్వంత సాక్ష్యమైన లేదు. ఈ కేసు రెండుకోర్టులలో ఇద్దరు ఇంగ్లీషు జడ్జీలయెదుట బహుకాలము విచారింపబడి పై పర్యవసానములు తేల్చబడెను. అట్టి సందర్భములో నిర్దోషులని సగౌరవముగా విడుదలచేయబడిన అమన్ ఆలీ మున్నగు తన నౌకర్లను నబాబుతిరిగి తన కొలువులో చేర్చుకొనుటలో తప్పేమున్నది? కాని యీపని గవర్నర్ జనరల్ అగు మన డల్హౌసీకి యెంతో కోపకారణమయ్యెను. రెండుకోర్టులలో యిద్దరు యింగ్లీషుజడ్జీల యెదుట తేలిన పర్యవసానము నెంతమాత్రము లక్ష్యపెట్టక, డల్హౌసీ మూర్షిదాబాదులో నబాబు దర్బారులోనున్న తన యింగ్లీషు రెసిడెంటు కీరీతిగ మండిపడుచు వుత్తరము వ్రాసెను!— "నబాబు కండ్లారా చూస్తూవుండగా, అతని కళ్లయెదుట యీ దుర్మార్గకార్యము జరిగింది. ఇట్టి దుష్కార్యమీరీతిగ దాదాపు నీకండ్లయెదుటనే జరుగుచుండగా, నీవెందుకు చూస్తూ వూరుకున్నావు ? నీ అధికారము వినియోగించి, యీ దుష్కార్యము నేల ఆపలేకపోయినావు? దీనికి నీవేమి సమాధానం చెబుతావు? "

అయితే యిక్కడ యింకొకసంగతి చెప్పవలసియున్నది. దురదృష్టవంతులగు యీ హిందూబాలురపై గావింపబడిన క్రూరకృత్యముల సంగతి పాపము నబాబున కెంతమాత్రము తెలియ

దనియు, యీ బాలురు నవాబునౌకర్లుకొట్టిన దెబ్బలవల్లగాక, కలరావల్ల చనిపోయిరనియు, యీ కేసులో విపులముగ యిద్దరు యింగ్లీషు జడ్జీలచే విచారింపబడిన సాక్ష్యమునుబట్టి నిష్పక్షపాతబుద్ధులగు యెట్టివారికైనను రూఢికాగలదు. అట్లయ్యును "యీ కేసులో నీప్రవర్తననుగూర్చి తగు సంజాయిషీ చెప్పవలసినద"ని డల్హౌసీ నబాబును కోరెను. మరియు, "యీ కేసు విషయములో గవర్నమెంటువారికి గలిగిన అభిప్రాయమును దృష్టాంతముగ నిరూపించుటకుగాను తగుచర్య తీసికొనవలసియుండును. ఇట్టి పను లిక ముందు జరుగకుండుటకుగాను తగు కట్టుదిట్టముల నేర్పరుపవలెను" అని డల్హౌసీ నిశ్చయించుకొనెను. ఈ రీతిగ కోర్టుతీర్పుకు అతీతముగ డల్హౌసీగావించిన కట్టుదిట్టములేమి ?

(1) నబాబు గౌరవార్థ మిదివరకు 19 ఫిరంగులను మోగించుచుండిరి. వీనినిప్పు డతనికి వంచనగ 13 ఫిరంగులే మోగించవలసినదని డల్హౌసీ ఆజ్ఞాపించెను. (2) నబాబు కాలుకదల్చి యెక్కడికి వెళ్లకుండ ఆతని ప్రయాణమున కనుజ్ఞ తిరస్కరించబడెను. (3) ప్రయాణపు ఖర్చులు పూర్తిగ తీసివేయబడెను. (4) నబాబువెళ్ళినచోటకల్లా ఆతని వెంట నొకపోలీసు ఉద్యోగస్థుని కూడ పంపునట్లేర్పాటు చేయబడెను. (5) ఇదిగాక, "నీ యింట్లో అనుమాన ప్రవర్తన యున్నట్లూహింపబడిన నౌకర్లందరిని తీసివేయువలెను. నీ విక వారితో మాట్లాడకూడదు" అని డల్హౌసీ కఠినముగ వుత్తరువు చేసెను. (6) నబాబును కోర్టులో విచారించుటకు వీలులేదని యిదివరకేర్పడియుండిన చట్టములన్నిటిని డల్హౌసీ

ప్రభువు కౌన్సిలులో రద్దుపరిపించెను. ఏలననగా:—న్యాయ నిర్వహణమున కీ చట్టములు చాల ఆటంకముగ నున్నవట! ఎంత నీరసమైనవాదన! ఈ విధముగ నీతికి, న్యాయమునకు, హేతువాదమునకు, యింగితజ్ఞానమునకు కేవలము విరుద్ధముగ కుంపిణీవారిచే అవమానింపబడి, పీడింపబడిన యీ నబాబు తదనంతరమువచ్చిన శిపాయీల తిరుగుబాటుకాలములో యింగ్లీషువారికి సహాయము చేయక నిజముగ మూతిముణుచుకొని కూర్చుండియున్నను మనమాశ్చర్యపడవలసిన పనియేమియు నుండనవసరములేదు. కాని, కుంపిణీవారిచే యింత అవమానింపబడియు యీ నబాబు వారికి సహాయము చేయకుండ మూతిముడుచుకొని కూర్చుండలేదు. తక్కిన దేశీయరాజులతోపాటు ఆ శిపాయీల తిరుగబాటు రోజులలో ఆత డింగ్లీషువారి కెంతో సహాయము చేసెను. ఈ తిరుగుబాటు రోజులలో ఆతడు మొదటినుండి చివరివరకు మన యెడ చలింపని భక్తితోనే ప్రవర్తించెను. "శిపాయిల తిరుగుబాటు" అను యీ తుపానులో బ్రిటిష్‌రాజ్యము కంపితమయ్యు యెట్లో శిథిలము మాత్రముగాక, బ్రతుకుజీవుడాయని బయట పడినప్పుడు—(చావుతప్పి కన్ను లొట్టపోయి బయటపడి నప్పుడు) "నీవు మాకొనర్చిన అపూర్వ సహాయమునకుగాను నీ కెంత ఖర్చుయినదో చెప్పవలసిన" దని కుంపిణీవారడిగిరి. "ఎంత ఖర్చుయితే నేమిలెండి. యీ ఖర్చును నేను తిరిగి మీవల్ల పుచ్చుకోను. ఏలననగ :—నేను నా విధిని మాత్రము నెరవేర్చితిని. అంతకంటె నేనెక్కువ సాయమేమియు మీకు చేయలేదు. నా పూర్వపు వంశీకులు

మీతో నొనర్చిన ఒడంబడికలలోని షరతులను మాత్రమే నేను నెరవేర్చితినిగాని, నేనంతకంటె యెక్కువ ఘనకార్య మేమియు చేయలేదు" అని నవాబు యెంతో మహో దార భావముతో బదులుచెప్పెను. ఇంతకు పూర్వము 97 యేండ్ల క్రిందట, యీతని పూర్వ వంశీకుడౌక డక్లే కుంపిణీ వారిని మెత్త మెత్తగ చీవాట్లు పెట్టెను. ఏమని— "మీ మాటను మీరు తప్పుట మంచిదనుకున్నారేమో గాని, నా మాటమాత్రము నేను తప్పను" అని. ఇప్పుడీ నవాబు కూడ యిదేరీతిగ, కేవలము మాటలలో గాకపోయినను, క్రియలలో కుంపిణీవారికి సిగ్గువచ్చేటట్లు చేసినాడు. ఈ విధముగ అపకార మునకు ఉపకారము చేసిన యీ నవాబుయొక్క మహోన్నత గుణమును గవర్నమెంటువారేదో రీతిగ అంగీకరించుట మర్యాద—పెద్దమనిషితరహా. కాబట్టి,తిరిగి యితనిగౌరవార్థమై "యథాపూర్వకముగ 19 ఫిరంగులను కాల్చవలసినది. యీ తనివెంట నిఘావేసిన పోలీసు ఉద్యోగిని తీసిపారవేయవలసి నది. ప్రయాణపు ఖర్చులు యెప్పటివలెనే యిచ్చుచుండ వలసినది" అని గవర్నమెంటువా రుత్తరువుచేసిరి. ఇంతే.

తక్కిన విషయములలో డల్హౌసీ చేసిన అపకారములన్నియు— ఆతడు హరించిన హరింపులన్నియు— అట్లేయుండెను. వానిలో నొకచిల్లిగవ్వయైనను తమకింత మేలుచేసిన నవాబుకు తిరిగి ము. నవాబుకును కుంపిణీవారికిని గల లావాదేవీ —లెక్కలన్నియు గవర్నమెంటు యేజెంట్లు దుష్పరి ంచిక్కులలో పడిపోయెను. ఈ లెక్కలచిక్కు ) న్యాయమగు లెక్క తేల్చవలసినదని నవాబు

అనేక పర్యాయములు మొత్తుకొనెను. వారసత్త్వేనా తనకు న్యాయముగ రావలసిన కొంత ద్రవ్యమును తనకిప్పించ వల సినదనియు నబాబుకోరెను. కాని, యీతనికోర్కెల నన్ని టిని గవర్నమెంటువారు తిరస్కరించిరి. వెనుక యితనివంశము వారితో చేసికొన్న ఒడంబడికలన్నియు పాతబడిపోయినవట! యిప్పుడవి పనికిరావట! ఈ ఒడంబడికలెట్టివి? నూరేండ్ల క్రిందట - యింగ్లీషువారికిచ్చుట కాలూని నిలుచుటకు అంగుళ మేని తావులేకుండెను. ఈ ఒడంబడికలే ఆనాడు వారికిచ్చుట యింత నిలువనీడనిచ్చినవి. అట్టియొడంబడిక లిప్పుడు కుంపిణీ వారికి పనికిరావట! అవి పాతబడిపోయినవట! తమకానా డిచ్చుట నిలువనీడనిచ్చిన ఆనబాబుయొక్క సంతతివాడగు యీతని వంశగౌరవమును, రాజబిరుదమును, అంతమొందించెద మని మాటిమాటికి గొణుగుకొనుచు చెప్పుచుండిరి.

1854 సం॥ లో మరిరెండు రాజ్యములు యింకొక మార్గముగుండవచ్చి కుంపిణీవారి నోటపడెను.

నైజాము నెత్తిమీద పెట్టిన అద్దెసేన చాల హెచ్చుగ నున్నదని, ఆతడు పాపము చాలరోజులనుండి మొత్తుకొనుచుం డెను. “ ఇంత హెచ్చుసేన నాకుండవలసిన అవసరమూలేదు. అదిగాక, యింతఖర్చు నేను భరించనూలేను ” అని నైజాము మొత్తుకొనుచుండెను. ఈ సేన చాల అనవసరముగ హెచ్చుగ నున్నదని డల్హౌసీకూడ ఒప్పుకొనెను. ఈ శిబ్బందిని యేమైనా సరే తగ్గించవలసినదనికూడ అతడనెను. కాని, నబాబు యిందు విషయమై యిదివరకే 75 లక్షలు బకాయిపడియుండెను.

పోనీ, యెంతకైనా లోబడి— నూటికి సాలుకు 30 రూపా యిలవడ్డీ యిచ్చెదనన్నను—యెక్కడ ఋణముపుట్టేమార్గము కూడ నైజాముకు కనుపించలేదు. కాబట్టి, దీనికొక చక్కని మార్గమును డల్హౌసీచూపించెను. " మాకివ్వవలసిన పాత బాకీ తీరిపోవడానికిన్నీ, యికముందు అద్దెసేనలకర్చుకు హామీ నా వుండడానికిన్నీ కూడా, సరిపోయేటట్లుగ చక్కని ప్రతిపంట పండుచు కృష్ణా. తుంగభద్రా నదులమధ్యనున్న రాయ చూరు ప్రాంతమును, బీరారుమండలములను, యింక మరికొన్ని భూములను మాకిచ్చివేస్తేచాలు, మేము ఒప్పుకుంటాము " అని డల్హౌసీ నైజాముకు కబురుపంపించెను. ఈ షరతులుగల సంధిపత్రమున కంగీకరించవలసినదని చెప్పి, చిత్తు నకలును నైజాము చేతిలో పెట్టినప్పుడు ఆతడు నిశ్చేష్టితుడై " అరవై యేండ్లనుంచి అవిచ్ఛిన్నముగ జూపుచువచ్చిన స్నేహాభావ మిక్కుండికేతిగ అంతమొందవలసి వచ్చెనా— హా ! " యని నైజాము నిట్టూర్పువిడిచెను. " నాకీ అద్దెసేనవద్దో, మొర్రో అని చెప్పాను; వైస్రాయి మొగమోటంచేత,—ఆయనమాట తీసివేయలేక— నేను సేనను వుంచుకుంటున్నానుగాని, లేక పోతే యిది నాకెందుకు ? దీనివల్ల నాకేమిప్రయోజనము ? కావలిస్తే వైస్రాయిగారి సేనను తీసికొని వెళ్ళిపోవచ్చును.

• అనవసరమైన సంఖ్యను, విపరీతపుబత్తెములను కోసి

వచ్చును. అంతేగాని దీనికోసం నారాజ్యంలో

వదలుకోమనడం యేమిధర్మము ? ఇట్లుచేయుట

నా ప్రజలయెదుట చిన్నబుచ్చుటకాదా ?

, యింత నిర్దాక్షిణ్యముగ చూడడానికి

నేనేమిపాపము చేసినాను ; నేను దీని కెట్లా ఒప్పుకునేది ” అని నైజామెంతయో యేడ్చెను. ఎట్లా ఒప్పుకునేదేమి ? ఒప్పుకొనక యేమిచేస్తాడు. ఆఖరుకు ఒప్పుకుతీరినాడు. ఒప్పుకున్న కొద్దిరోజులకే చచ్చిపోయినాడు. “ ఈ రాజ్యాన్ని యిక నీ యిష్టము, యెట్లాయేలుకుంటావో యేలుకో ” అని తన కొడుకుకు చెప్పి నైజాము చనిపోయెను. కుంఫిణీ వారికి 1853 సం॥ లో వచ్చిన నికరాదాయమంతయు దూది, నల్లమందుతో నిండియుండెను. ఏలననగ, కొత్తగ చేర్చ బడిన బీరారు, రాయచూరు మండలములలో యీ రెండు పంటలు చాల సమృద్ధిగ పండును.

డల్హౌసీప్రభువుయొక్క ఆఖరు కబళము—యెన్నడు మరువరాని ఆఖరుకబళము—దగ్గిరకువచ్చినాము. క్లైవునాటి నుండి నేటివరకు అయోధ్యరాజ్యము స్వతంత్రరాజ్యమనియే ప్రతియింగ్లీషువాడు ఒప్పుకొనియున్నాడు. కుంఫిణీవారి రాజ్యముపైకి అనేకపర్యాయములు దండెత్తి వెళ్లిరి. ఈ రాజ్యమును అనేకపర్యాయములు దోచుకొనిరి; కొల్లగొట్టిరి; విచ్ఛిన్న మొనర్చిరి. ప్రక్కరాజ్యములవారికిని, ఒకప్పుడు ఆరాజ్యప్రజలకును ఉపద్రవము గల్గించుటకుగాను అయోధ్య వజీరుకు కుంఫిణీవారు తమ సేనలను అద్దెకిచ్చిరి. పొరుగు రాజ్యములలో కొన్ని భాగములను హరించి, కుంఫిణీవారు యీ అయోధ్య వజీరుకు కట్టబెట్టుచు, ఆతనిని కొంచెముసేపు ఉబ్బవేయుచుండిరి; తదుపరి, మరికొంత కాలమైనపిమ్మట “మేము కట్టబెట్టిన రాజ్యాన్ని మాకే యిచ్చివెయ్యి; దానిని అసలువారికి యివ్వ

మీతో నొనర్చిన ఒడంబడికలలోని షరతులను మాత్రమే నేను నెరవేర్చితినిగాని, నేనంతకంటె యెక్కువ ఘనకార్య మేమియు చేయలేదు" అని నవాబు యెంతో మహో దార భావముతో బదులుచెప్పెను. ఇంతకు పూర్వము 97 యేండ్ల క్రిందట, యీతని పూర్వ వంశీకుడొక డశ్లే కుంఫిణీ వారిని మెత్త మెత్తగ చీవాట్లు పెట్టెను. ఏమని— "మీ మాటను మీరు తప్పుట మంచిదనుకున్నారేమో గాని, నా మాటమాత్రము నేను తప్పను" అని. ఇప్పుడీ నవాబు కూడ యిదేరీతిగ, కేవలము మాటలలో గాకపోయినను, క్రియలలో కుంఫిణీవారికి సిగ్గువచ్చేటట్లు చేసినాడు. ఈ విధముగ అపకార మునకు ఉపకారము చేసిన యీ నబాబుయొక్క మహోన్నత గుణమును గవర్నమెంటువారేదో రీతిగ అంగీకరించుట మర్యాద—పెద్దమనిషితరహా. కాబట్టి, తిరిగి యితనిగౌరవార్థమై "యథాపూర్వకముగ 19 ఫిరంగులను కాల్పవలసినది. యీ తనివెంట నిఘావేసిన పోలీసు ఉద్యోగిని తీసివేయవలసి నది. ప్రయాణపు ఖర్చులు యెప్పటివలెనే యిచ్చుచుండ వలసినది" అని గవర్నమెంటువా రుత్తరువు చేసిరి. ఇంతే.

తక్కిన విషయములలో డల్హౌసీ చేసిన అపకారములన్నియు— ఆతడు హరించిన హరింపులన్నియు— అట్లేయుండెను. వానిలో నొకచిల్లిగవ్వయైనను తమకింత మేలుచేసిన నబాబుకు తిరిగి యివ్వలేదు. నబాబుకును కుంఫిణీవారికిని గల లావాదేవీ లన్నియు—లెక్కలన్నియు గవర్నమెంటు యేజెంట్ల దుష్పరి పాలనవలన చాలచిక్కులలో పడిపోయెను. ఈ లెక్కలచిక్కు న్నిటిని సవరించి న్యాయముగ లెక్కతేల్చవలసినదని నబాబు

అనేక పర్యాయములు మొత్తుకొనెను. వారసత్వేనా తనకు న్యాయముగ రావలసిన కొంత ద్రవ్యమును తనకిప్పించ వల సినదనియు నబాబుకోరెను. కాని, యీతనికోర్కెల నన్ని టిని గవర్నమెంటువారు తిరస్కరించిరి. వెనుక యితనివంశము వారితో చేసికొన్న ఒడంబడికలన్నియు పాతబడిపోయినవట! యిప్పుడవి పనికిరావట! ఈ ఒడంబడికలెట్టివి? నూరేండ్ల క్రిందట - యింగ్లీషువారికిచ్చుట కాలూని నిలుచుటకు అంగుళ మేని తావులేకుండెను. ఈ ఒడంబడికలే ఆనాడు వారికిచ్చుట యింత నిలువనీడనిచ్చినవి. అట్టియొడంబడిక లిప్పుడు కుంపిణీ వారికి పనికిరావట! అవి పాతబడిపోయినవట! తమకానా డిచ్చుట నిలువనీడనిచ్చిన ఆనబాబుయొక్క సంతతివాడగు యీతని వంశగౌరవమును, రాజబిరుదమును, అంతమొందించెద మని మాటిమాటికి గొణుగుకొనుచు చెప్పుచుండిరి.

1854 సం॥ లో మరిరెండు రాజ్యములు యింకొక మార్గముగుండవచ్చి కుంపిణీవారి నోటపడెను.

నైజాము నెత్తిమీద పెట్టిన అద్దెసేన చాల హెచ్చుగ నున్నదని, ఆతడు పాపము చాలరోజులనుండి మొత్తుకొనుచుం డెను. "ఇంత హెచ్చుసేన నాకుండవలసిన అవసరమూలేదు. అదిగాక, యింతఖర్చు నేను భరించనూలేను" అని నైజాము మొత్తుకొనుచుండెను. ఈ సేన చాల అనవసరముగ హెచ్చుగ నున్నదని డల్హౌసీకూడ ఒప్పుకొనెను. ఈ శిబ్బందిని యేమైనా సరే తగ్గించవలసినదనికూడ అతడనెను. కాని, నబాబు యిందు విషయమై యిదివరకే 75 లక్షలు బకాయిపడియుండెను.

పోనీ, యెంతకైనా లోబడి— నూటికి సాలుకు 30 రూపా యిలవడ్డీ యిచ్చెదనన్నను—యెక్కడ ఋణముపుట్టేమార్గము కూడ నైజాముకు కనుపించలేదు. కాబట్టి, దీనికొక చక్కని మార్గమును డక్లాసీచూపించెను. "మాకివ్వవలసిన పాత బాకీ తీరిపోవడానికిన్నీ, యికముందు అద్దెసేనలకర్చుకు హామీగా వుండడానికిన్నీకూడా, సరిపోయేటట్లుగ చక్కని ప్రత్తిపంట పండుచు కృష్ణా, తుంగభద్రా నదులమధ్యనున్న రాయచూరు ప్రాంతమును, బీరారుమండలములను, యింక మరికొన్ని భూములను మాకిచ్చివేస్తేచాలు, మేము ఒప్పుకుంటాము" అని డక్లాసీ నైజాముకు కబురుపంపించెను. ఈ షరతులుగల సంధిపత్రమున కంగీకరించవలసినదని చెప్పి, చిత్తు నకలును నైజాము చేతిలో పెట్టినప్పుడు ఆతడు నిశ్చేష్టితుడై "అరవై యేండ్లనుంచి అవిచ్ఛిన్నముగ జూపుచువచ్చిన స్నేహభావ మిప్పుడీరీతిగ అంతమొందవలసి వచ్చెనా— హా!" యని నైజాము నిట్టూర్పువిడిచెను. "నాకీ అద్దెసేనవద్దో, మొర్రో అని చెప్పాను; వైస్రాయి మొగమోటంచేత,—ఆయనమాట తీసివేయలేక— నేనీ సేనను వుంచుకుంటున్నానుగాని, లేక పోతే యిది నాకెందుకు? దీనివల్ల నాకేమిప్రయోజనము? కావలిస్తే వైస్రాయిగారీ సేనను తీసికొని వెళ్ళిపోవచ్చును. లేదా అనవసరమైన సంఖ్యను, విపరీతపుబత్తెములను కోసి పారవేయవచ్చును. అంతేగాని దీనికోసం నారాజ్యంలో మూడోవంతు వదలుకోమనడం యేమిధర్మము? ఇట్లుచేయుట నన్ను వంచించి, నా ప్రజలయెదుట చిన్నబుచ్చుటకాదా? నన్నింత కఠినముగ, యింత నిర్దాక్షిణ్యముగ చూడడానికి

నేనేమిపాపము చేసినాను; నేను దీని కెట్లా ఒప్పుకునేది" అని నైజామెంతయో యేడ్చెను. ఎట్లా ఒప్పుకునేదేమి? ఒప్పుకొనక యేమిచేస్తాడు. ఆఖరుకు ఒప్పుకుతీరినాడు. ఒప్పుకున్న కొద్దిరోజులకే చచ్చిపోయినాడు. "ఈ రాజ్యాన్ని యిక నీ యిష్టము, యెట్లాయేలుకుంటావో యేలుకో" అని తన కొడుకుకు చెప్పి నైజాము చనిపోయెను. కుంపిణీ వారికి 1853 సం॥ లో వచ్చిన నికరాదాయమంతయు దూది, నల్లమందుతో నిండియుండెను. ఏలననగ, కొత్తగ చేర్చ బడిన బీరారు, రాయచూరు మండలములలో యీ రెండు పంటలు చాల సమృద్ధిగ పండును.

డల్హౌసీప్రభువుయొక్క ఆఖరు కబళము— యెన్నడు మరువరాని ఆఖరుకబళము—దగ్గరకువచ్చినాము. క్లైవునాటి నుండి నేటివరకు అయోధ్యరాజ్యము స్వతంత్రరాజ్యమనియే ప్రతియింగ్లీషువాడు ఒప్పుకొనియున్నాడు. కుంపిణీవారి రాజ్యముపైకి అనేకపర్యాయములు దండెత్తి వెళ్ళిరి. ఈ రాజ్యమును అనేకపర్యాయములు దోచుకొనిరి; కొల్లగొట్టిరి; విచ్ఛిన్న మొనర్చిరి. ప్రక్కరాజ్యములవారికిని, ఒకప్పుడు ఆరాజ్యప్రజలకును ఉపద్రవము గల్గించుటకుగాను అయోధ్య వజీరుకు కుంపిణీవారు తమ సేనలను అద్దెకిచ్చిరి. పొరుగు రాజ్యములలో కొన్ని భాగములను హరించి, కుంపిణీవారు యీ అయోధ్య వజీరుకు కట్టబెట్టుచు, ఆతనిని కొంచెముసేపు ఉబ్బవేయుచుండిరి; తదుపరి, మరికొంత కాలమైనపిమ్మట "మేము కట్టబెట్టిన రాజ్యాన్ని మాకే యిచ్చివెయ్యి; దానిని అసలువారికి యివ్వ

డానికి వీలులేదు" అని బెదరించి దాని నాతనినుండి లాగికొను చుండిరి. అట్టి సమయములందు యీ వజీ రేమి చేయుట కును చేతగాక, సిగ్గుచే, అవమానముచే, తలవంచుకొని యూరకొనుచుండెను. తప్పించుకొందమన్నను వీలులేని యీ బలాత్కారపు అద్దెసేనల పద్ధతివలన దేశీయరాజ్యముల అధి కారమును నిర్దాక్షిణ్యముగ మట్టిపాల్జేయుచు పోయిరి. అయో ధ్యవజీరుకు తన రాజ్యాంగవ్యవహారములలో నానాటికి యెట్టి జోక్యమును లేకుండ చేయుచువచ్చిరి. అందుచే నతడు తనచుట్టు చేరిన పరాన్నభుక్కులగు స్తోత్రపాఠకుల చేతులలో —పాపము—చిక్కుకొనిపోయెను. వీరందరు చేరి అతని ద్రవ్యమునంతను పాడుచేయుచుండిరి. ప్రజల స్థితిగతులు వజీరుకు తెలియనీయకుండ చేయుచుండిరి. ఎవరైనా వజీ రుతో చెప్పుకొనుటకువస్తే వారి నాతనిదరికి చేరనీయకుండ జేయుచుండిరి. తాలూకాదార్లను అదుపుఆజ్ఞలలో నుంచు వారెవరు లేనందున వారి దురాశ మితిమీరిపోయి, తమ యిష్టమువచ్చినట్లు సంచరింపమొదలిడిరి. అందుచే, వీరివల్ల ప్రజలు చాలా బాధలు పడుచున్నమాట వాస్తవము; సందే హము లేదు. ఇందువలన, యీ తాలూకాదార్ల క్రిందనున్న ఫలవంతములగు భూములలో కొన్ని పాడై బంజరుపడిపో యెను. రాజ్యాంగము బిగువుపీడి, యెక్కడిదక్కడ విచ్చి పోవజొచ్చెను. ఈ దుష్పరిపాలననుగూర్చి యింగ్లీషు రెసి డెంట్లు అప్పుడప్పుడు ఖండించుచునేయుండిరి. పోనీ, వీనిలో కొంత దుర్బుద్ధితో కూడిన అతిశయోక్తి యున్నదని యనుకొ న్నను, మొత్తముమీద వీరి ఖండనవాక్యములకు తగు ఆధార

ములు లేవని చెప్పుటకు వీలులేదు. రాజ్యాంగములో ప్రతి శాఖను బాగుపరుచుట అవసరమయ్యెను.

ఈవిధముగ ప్రతి శాఖను బాగుపరచవలసినదని సార్వభౌమాధికారులగు కుంపిణీవారు గట్టిగ కోరుటలో తప్పేమియు లేదనికూడ చెప్పవచ్చును. కాని ద్రవ్యాశచే దేశీయాధికారముల నాక్రమించి కూర్చున్నవారి దుశ్చేష్టితములచే పాడైన స్థానికసంస్థలను బాగుపరుచుటకును, సామ్రాజ్యాధికారులచే విషముపెట్టి చెరుపబడిన స్థానిక రాజ్యాంగముయొక్క ఆరోగ్యమును పునస్థాపితమొనర్చుటకును స్పష్టమగు మార్గములద్వారా పట్టువీడక అంతఃకరణశుద్ధిగ ప్రయత్నములు చేసినట్లు ఋజువైన పిమ్మటగాని, వానిపై నిరంకుశముగ మరణదండన విధించుట కెంతమాత్రమును న్యాయమగు కారణము గన్పట్టజాలదు. ఈ సంస్థలను బాగుపరచు అధికారము మన కుంపిణీవారి చేతులలోనే యున్నదనియు, దానిని వినియోగించి దానిని బాగుపరచవలసినదనియు, మంచి విజ్ఞానముకలిగి, యిందలి లోతుపాతులనెల్ల నెరింగి, అంతఃకరణశుద్ధిగల పెద్దలెల్లరు గట్టిగ వాదించియే యుండిరి. కాని, యీ పనిని మాత్రము మొదటినుండి చివరివరకు కుంపిణీవారెన్నడు గట్టిగ యత్నించిన పాపమున బోలేదు. అందుచే, దేశీయ రాజ్యాంగవ్యవహారములు నానాటికి చెడిపోవజొచ్చెను. కాని, దేశీయ రాజ్యాంగమిట్లు కుళ్లి చెడిపోవుచున్నను, కుంపిణీవారు తమ నిర్బంధపు వసూళ్ళను మాత్రము మానలేదు. చిట్టచివరకు 1856 సంవత్సరములో దుష్పరిపాలన యను పాపఫలము పండెను. దేనికి ? సామ్రాజ్యాధికారమను కత్తెరచే దుర్మాంస

మును కత్తిరించి రాజ్యాంగమునకు తగు చికిత్స చేయుటకు గాదు— కేవలమా రాజ్యాంగమునే పరరాజ్యగ్రసనమను గొడ్డంటితో నిర్దాక్షిణ్యముగ నరికి పారవేయుటకు !

మహారాష్ట్ర యుద్ధముతో కుంపిణీవారి బొక్కసమంతయు ఖాళీయయ్యెను. ప్రజలలో పరపతి నిలుపుకొనుటకుగాని, శిపాయిల జీతములిచ్చుకొనుటకుగాని ఖజానాలో ఒక్క రూపాయికూడ లేకపోయెను. "మాయిరా ప్రభువు" అయోధ్య వజీరుకు నిరర్థకపు రాజబిరుదమును లంచముగ నిచ్చి ఆతని సొంత ద్రవ్యమునుండి పదిలక్షల రూపాయలు తీసికొనెను. ఆఫ్ఘను యుద్ధకాలములో కొత్తసాధన సామాగ్రి కావలసివచ్చినప్పుడు అప్పుడునైసాయిగనున్న అక్లండు ప్రభువు అయోధ్య వజీరు రాజ్యములో సగభాగము తీసికొని కొత్తసేనల నిర్మించుట కేర్పాటుచేసెను. ఈ విధముగ ప్రతి పర్యాయము కిలకత్తానుండి జారీచేయబడి అయోధ్య వజీరుపై విధింపబడిన రాచతంత్రపు టొడంబడికలలో ప్రతిదానియందు అయోధ్య వజీరుయొక్క రాజ్యాధికారము నంగీకరించుచు, వారి వంశగౌరవమును అమోఘముగ కీర్తించుచు యెంతో మాయా నటనను జరిపిరి. తుట్టతుదకు ఒక్కవేటున సమస్తము తుడిచిపెట్టురోజువరకు కుంపిణీవారు యీ వజీరునెడ అత్యధిక గౌరవ ప్రేమలు ఒలుకుచున్నట్లు నటించుచుండిరి. ముఖస్తుతులచే నుబ్బవేయుచుండిరి.

అయోధ్యరాజ్యమును హరించి, తమలో కలుపుకొనుటకు యెట్టకేలకు కుంపిణీవారు నిశ్చయించుకొనిరి. కాని, దీని విధముగ కలుపుకొనుటకు బయలుదేరవలెనను విషయమై

కుంపిణీ కౌన్సిలులో భేదాభిప్రాయము లేర్పడెను. వైస్రాయి ధర్మచింత నటించెను. "1837 సం॥ లో వజీరు కుంపిణీ వారితో చేసికొన్న ఒడంబడికలో నిరూపింపబడిన రీతిగ ఆతడు తనరాజ్యమును సరిగ పాలించుటలేదుగాన యీతనిరాజ్యమును లాగికొనుచున్నాము" అని చెప్పుదమని వైస్రాయి యనెను. "ఈ విషమీద అయోధ్యనుండి మన సైన్యమును తీసివేయుదము. అప్పుడు అయోధ్యాపురమును, అంతఃపురమునుకూడ దొంగలకు, దోపిడిగాండ్రకు వశమగును. ఈ విధముగ విప్లవము, అరాచకము ప్రబలి, చుట్టుపట్టుల రాజ్యములవారికందరికి భీతావహముకగ్గును. అప్పుడు రాజువచ్చి మన సైన్యరక్షణ కోరును. అప్పుడు మనము వెళ్ళి,—ఒకవేళ రాజు అడగకపోయినా సరే—మన సైన్యములతో అయోధ్య రాజ్యములో ప్రవేశించవచ్చును" అని వైస్రాయి సలహాచెప్పెను కాని, యీ పద్ధతి చాల చుట్టుత్రోవగ నున్నదేమో యనుఅనుమానముకూడ వైస్రాయికి తట్టెను. "ఇంతకంటె సులువైన మార్గమున, దగ్గరత్రోవను, యీ రాజ్యమును కాజేస్తే బాగుంటుంది— తక్కువ అగౌరవంగా వుంటుంది" అని తక్కిన కౌన్సిలుమెంబర్లు సలహా చెప్పిరి. "ఈ రెంటిలో యేపద్ధతి బాగుందో మీరు నిర్ణయించి చెప్పండి" అని యీ రెంటిని సీమలోని డైరెక్టర్లకును, బోర్డుఆఫ్ కంట్రోలుకును పంపించిరి. "మాకేమీ తెలియదు; మేమేమియు చెప్పము; వైస్రాయి తన యిష్టమువచ్చిన పద్ధతి నవలంబించవచ్చును" అని వారనిరి. ఈ గొప్ప ధర్మసందేహము దాటడమెట్లా? వైస్రాయి చాలదూర మాలోచించి ఆఖరుకు తన

సహోద్యోగులు చెప్పినచొప్పున సూక్ష్మములో మోక్షము వచ్చే సులువైన మార్గమునే— దగ్గరతోవనే— అనుసరించెను. "అబ్బాయి, నిన్ను పరీక్షచేసి చూశాము; ఫెయిల్ అయినావు; కాబట్టి, నీరాజ్యం పోయింది" అని అయోధ్య వజీరుతో చెప్పవలసినదని వైస్రాయి అయోధ్యలోనున్న తన యింగ్లీషు రెసిడెంటుకు కబురంపించెను.

ఈ రాజ్యాపహరణచర్యను సమర్థించు పెద్దలేమనుచున్నారంటే:— "దేశీయరాజుగనుక సరిగ పరిపాలించలేక పోతే, ఆ రాజ్యాన్ని యింగ్లీషువారు లాగికొనవచ్చుననే మాట 1837 సంవత్సరపు టొడంబడికలోనే వున్నది. కాబట్టి, యిప్పుడిందులో తప్పేమున్నది" అని అనుచున్నారు. ఈ మాటలలోని కొంటెతనమును మేజర్ బెల్ అనునతడు బయటపెట్టుచున్నాడు. "డల్హౌసీ తన యిష్టమువచ్చినట్లు చేయవచ్చునని 1837 సంవత్సరపు సంధిపత్రములో లేదు. అయోధ్య రెవిన్యూలో ఖర్చులుపోగా మిగిలినడబ్బు డల్హౌసీ తన యిష్టము వచ్చినట్లు ఖర్చుపెట్టుకొనుటకు హక్కులేదు. దానికి సరియగు జమాఖర్చు లెక్కను అయోధ్య సంస్థానమునకు చెప్పితీరవలసిన బాధ్యత డల్హౌసీపై నున్నది. దేశీయ పరిపాలనను స్వాధీనపరచుకొనవచ్చుననుమాట వున్నమాట వాస్తవమే— అయితే యెందుకు? యెంతకాలము? దానిని బాగుపరుచుటకై తాత్కాలికముగ— కొలదికాలముమాత్రమే స్వాధీనపరుచుకొనవచ్చునని యున్నది. ఇట్లు స్వాధీనపరుచుకొన్నను దేశీయుల ప్రాచీన ప్రతిష్ఠాపనలను, రాజ్యపద్ధతులను చెడగొట్టకుండ కాపాడవలసినవిధి కుంపిణీవారిపై నిష్కర్షగ గలదు.

దేశీయ రాజ్యపద్ధతులను, ప్రతిష్ఠాపనలను యిట్లు కాపాడి వానిని బాగుపరచి, తిరిగి వారివి వారి కిచ్చివేయుటకు వీలుగ నుండునట్లు చేయవలయుననికూడ సదరు సంధిపత్రమందు నిర్ధారణగ గలదు.'' ఈ మాటలలోని సమంజసతను, వత్తిడిని, వైస్రాయికూడ గ్రహించెను. కాని, తన కననుకూలముగనున్న యీ మాటల నెట్లయిన దాటుకుపోవలెనని ప్రయత్నించెను. "1837 సంవత్సరపు టొడంబడికలో విధింపబడిన రీతిగ అయోధ్యరాజు మనకు యెక్కువ సేనలను సప్లయిచేయ వక్కరలేదు లే''అని లోగడ సీమడైరెక్టర్లు చెప్పియున్నారు గనుక ఆ యొడంబడికలోని షరతులన్ని యాపత్తు రద్దుపడిపోయినట్లే'' అని డల్హౌసీవ్యాఖ్యానము చేయుట కెంతయో తికమకలుపడెను. ఇంతకంటె అన్యాయమైన— అసత్యమైన— కార్య మింకొకటి యుండునా ? 1837 సంవత్సరపు టొడంబడికను సదరుసంవత్సరము సెప్టెంబరు 18 వ తేదీన కుంపిణీవారు తమ విలియం కోటలో యధావిధిగ నంగీకరించి, ధృవపరచియుండిరి. అప్పుడు సీమరాణియగు విక్టోరియారాణీగారి ప్రభుత్వము వారుకూడ దానినెప్పుడును తిరస్కరించియుండలేదు. సీమ డైరెక్టర్లును దానిని త్రోసివేయలేదు. ఈసంధికి వారి యామోదముకూడ అవసరములేదని అప్పుడు కుంపిణీవారు భావించిరి. అయోధ్యరాజ్యము నెట్లయిన దిగమ్రింగి, దాని రెవిన్యూనంతను కాజేయవలెనను దుర్బుద్ధి డల్హౌసీకి పుట్టు రోజువరకు యీసంధిపత్రము చెల్లదగనిదనిగాని, యిది మామీద బైండింగుకాదనిగాని, యిండియాలోనున్న యేకుంపిణీ యుద్యోగస్థుడుకూడ పల్లెత్తుమాట అనియుండలేదు.''

అయోధ్యరాజ్యములో సౌష్టవమగునట్టి— న్యాయమగునట్టి,— పరిపాలన నెలకొనునట్లు చూడవలసిన బాధ్యత, అధికారము, కుంఫిణీవారికి కలదని లారెన్సు, స్లీమన్ మున్నగు పెద్దలు ఒప్పుకొనియే యున్నారు. "మీరాజ్యాధికారములను మీరుగనుక సరిగ నిర్వర్తింపలేక పోయినచో అవిమీకు తీసివేస్తాముసుమా" అని 1847 సం॥లో వైస్రాయిగనున్న హార్డింజిప్రభువు కూడ గట్టిగ మందలించియుండెను. అయితే, "రాజ్యాధికారములు మీకు తీసివేస్తాము" అంటే, "మీ రాజ్యాన్ని మేము కాజేసి, మాలో కలుపుకుంటాము" అని యా అర్థము? దుర్వ్యయము చేయువాని పింఛనును— మనువృత్తిని— ఆపివేసినామంటే వాని ఆస్తినంతను మేము వేసికుంటామనియా అర్థము? విలియంబెంటింక్ మెత్తనిహృదయము గలవాడు; న్యాయబుద్ధిగలవాడు. ఇతడు వెనుక వైస్రాయిగనున్నప్పుడు అయోధ్యపరిపాలనను బాగుపరచి, అందు యెక్కువ న్యాయమగు, సౌష్టవమగు, పరిపాలనా సూత్రముల ప్రవేశపెట్టు తలంపుతో తాత్కాలికముగ జోక్యము కలుగజేసికొనవలెనని యూహించెను. అవసరమైతే యిట్టి జోక్యము కలుగజేసికొనుటకు తగు అనుజ్ఞను కూడ సీమడైరెక్టర్ల వద్దనుండి తెప్పించి యుంచుకొనెను. కాని, యిప్పుడు 1856 సం॥ లో డల్హౌసీ చేసినటువంటి దురంతకార్యమున కాతడు తలపెట్టినాడని యెవరనగలరు? ఈ విషయమై బెంటింకు యేమిచేయదలచినదియు ఆతడే స్పష్టముగ నిర్వచించియున్నాడు:— అయోధ్యరాజ్య పరిపాలనను నీ పైకి తీసుకుంటే, నీవేమి చేయదలచి

నావు; యేవిధముగ పరిపాలిస్తావు; యెంతకాలము యీ అధికారమును నీ చేతులలో వుంచుకుంటావు — అని నన్నడుగుతావేమో. దీనికి నేను చెప్పే జవాబు యేమిటంటే, మనము యీ రాజ్యమునకు గార్డియన్‌లుగను, ట్రస్టీలుగను వుండి కేవలము దేశీయమగు పద్ధతిని రాజ్యాంగ ప్రణాళికను నిర్మించవలెను. ఈ రాజ్యాంగమును నడుపు వ్యక్తులేమి, సూత్రము లేమి, ప్రస్తుతాభివృద్ధికేగాక, భవిష్యత్కాలమందుకూడ ఉత్తమరీతిని ఉపకరించునట్లు యేర్పాటు చేయవలెను. ఈ రాజ్యాంగమందు యూరోపియను లెవరైనా వుంటె, వారు కేవలము పై అజమాయిషీకేగాని, వారిని రెండోపనికి పెట్టరాదు; అదియైనను, దేశీయరాజ్యాంగము పూర్తిగ బాగుపడువరకే గాని, తరువాత అక్కర లేదు.



HYDERABAD

# హిందూఖండమున

# ఆంగ్లరాజ్యస్థాపన

## 27 వ అధ్యాయము.

### నేడు—రేపు

“ ఏండ్లతరబడి పన్నులు నానాటి వృద్ధియగుచున్నవి. దీనివలన ప్రజలలో ప్రతివారికి—యూరోపియనులకు, దేశీయులకు కూడ—చాల అసంతృప్తి ప్రబలియున్నది. ఈ అసంతృప్తిభావమే యీరీతిగనే ప్రజలలో పెరుగుచు పోయినయెడల, మనరాజ్యమునకే పెద్ద మొప్పమువచ్చును. ఇంతింతని యూహించుటకు వీలులేని మొప్పమువచ్చునని నాభయము. దేశీయ సైన్యము నుండి తీసివేయబడిన శిపాయీలలో ఒకవేళకలుగుఅసంతృప్తి ప్రజలలో సర్వత్ర వ్యాపించిన యీ అసంతృప్తియందు ఒకలెక్కగ కనిపించదు. ప్రజలలో సర్వత్ర సర్వకాలములందు ప్రశాంతి ప్రబలియుండునని మనమనుకొనుటకు వీలులేదు. దేశీయసైన్యములో మనము కొంత తగ్గింపదలచుకొనినందువలన శిపాయీలలో కలుగుఅసంతృప్తికంటె పన్నులవిషయమై యిప్పుడు ప్రజలలో కలిగిన అసంతృప్తియే చాలహెచ్చై, దానివల్లనే దేశములో అల్లకల్లోలములుపుట్టి, మన రాజ్యమున కెక్కువ మొప్పమువచ్చునని నా నమ్మకము. ఈ రెండు చెడుగులలో, తక్కువదానినే నేనేరుకొందును.”

—మేయోప్రభువు

1858 సం॥ లో పార్లమెంటు సమావేశమైనప్పుడు యిక యిండియాను చక్కబరుచుకొను మార్గములేమియా యను యూహాలే ప్రతివానిమనస్సులోను తాండవమాడు చుండెను. ఒక శతాబ్దపు దుష్పరిపాలనవలన యిండియా యందొక భయంకర విప్లవము పుట్టుటకు కారణమయ్యెను. ఈ భయంకర విప్లవమునుజూచి మహాధైర్యశాలురగు యోధానయోధులుకూడ గడగడ వడంకజొచ్చిరి. దానిపేరు తలుచుకుంటేనే వారికి భయముచే ఒడలు గగుర్పొడుచుచుం డెను. బుద్ధిశాలురును, ప్రతిభావంతులునునగు రాచకీయ వేత్తలెల్ల దానినిగూర్చి యెక్కువగ మాట్లాడుకొనక పోవు టయే వివేకమని తలంచుచుండిరి. ఈ భయంకరవిప్లవములో నిజముగ జరిగినసంగతులింక బయటపడనివి యెన్నియోయు న్నవి. భయానకరూపమగు నిట్టిసత్యములు బహుశః యిప్ప టిలో బయటపడవనుకొందును. కాని, యింతవరకు బయట పడిన సంగతులేచాలు. వీనివల్లనే సీమలోని అన్నిపార్టీల వారికి యిండియావిషయమై గొప్పకలవరము, ఆతురతపుట్టె. "యికముందిట్టివి జరుగకుండుటకుగాను, యిండియాలో మన రాజ్యపాలనాపద్ధతి మార్చుకుంటేనేగాని వీలులేదని" అందరి మనస్సులకు గట్టిగతోచెను. "అబ్బాయిలూ! మీరోజులింత టితో తీరిపోయిన"వని చెప్పి, సీమగవర్నమెంటువారు యీస్టిం డియా కుంపిణీవారికి నోటీసునిచ్చిరి. సీమగవర్నమెంటువారును, కుంపిణీవారును కలసిచేయు యీ ద్వంద్వపరిపాలన అధ్వాన్న ముగనుండెను. దీనివలన రాజ్యపరిపాలనయందు జరుగు మంచి చెడ్డల కెవరును బాధ్యతవహింపక, యొవరిమట్టుకువారు

తప్పించుకొనజూచుచుండిరి. ఎవరి ఆశ్రితులను వారు పోషించుకొనుటకే చూచుచుండిరిగాని, పరిపాలనా సౌష్టవమును చూడరైరి. ఈ రీతిగ యీ ద్వంద్వపరిపాలనా పద్ధతి బాగుపడేమార్గము కనిపించకము లేదని చాలమంది యెన్నాళ్లనుండియో అనుకొనుచుండిరి. కుంపిణీవారి దుష్పరిపాలనవలన రాబోవు విపత్తులనుగూర్చి ఆనాడుఫ్రాన్సిస్, బర్కు, ఫాక్సు మున్నగువారు బహుదూరదృష్టితో చేసిన ఖండన సత్యమైనదే యని సీమప్రజలిప్పుడు గ్రహించి వారిఖండనను ధృవపరుచు కాలమిప్పుడువచ్చెను. ఒకానొక జాయింటుస్టాకు కంపెనీ డైరెక్టర్ల రహస్యపుసంఘమొకటి బయలుదేరి అఖండభారతసామ్రాజ్యపు పరిపాలనను, పరిపాలకులను నియమించు నధికారమందు బ్రిటిష్ సామ్రాజ్య మంత్రివర్గముతో పాటు సరిసమాన భాగస్వాములై యుండుటెంతయు కూడనిపని యనియు, యిక ముందీ పద్ధతిని సాగనీయరాదనియు, సీమ ప్రజలు యిప్పటికైనను ఖండితముగ నిర్ధారణచేసికొనగలిగిరి. ఇండియా విషయమందేమి, తక్కిన తదితర చిన్న సామ్రాజ్య భాగముల విషయమందేమి, పార్లమెంటువారు తమవిధిని సక్రమముగ నెరవేర్చి తీరవలెనని బ్రిటిష్ ప్రజలు సీమ పార్లమెంటువారి నాజ్ఞాపించిరి. "హిందూదేశమును మన మే విధముగ సంపాదించినప్పటికి సీమరాణి తన తక్కిన ప్రజల నెల్ల నేవిధముగ జూచుకొను చుండెనో, యిండి యా ప్రజలను కూడ నదే విధముగ చూచుకొనవలసిన బాధ్యత ఆమెపైగల" దని సీమలో అన్ని పార్టీలవారు యేకగ్రీవముగ నంగీకరించిరి. భారతవర్ష పరిపాలన నంతను కుంపిణీ

వారి నుండి తొలగించి, దానిని సీమరాణీయే నేరుగ, సర్వ సంపూర్ణ హక్కులతో వహించునట్లేర్పాటు చేయు సందర్భమందు యీ పైవాక్యములనే అప్పుడు యిండియా మంత్రిగ నున్న స్టాన్లీ ప్రభువు చిరస్మరణీయమగు "రాణీ ప్రకటన" యందు వ్రాయించి, ఆమె నోటిమీదుగ పలికించెను. భారత దేశపు యావత్పరిపాలనాధికారమును, అఖండ గౌరవమును సీమరాణీకే గలదని బ్రిటిష్ పార్లమెంటువారు శాసనాధికారముగ నంగీకరించి ధృవపరచి యున్నను, అంతమాత్రముచే యిక్కడ యిండియాలో సీమ రాణీపేరట నిత్యము జరుగు వ్యవహారముల కన్నిటికి తగు సంజాయిషీ నిక్కచ్చిగ న్యాయముగ కనుక్కొని, దానిని సక్రమమార్గముల నడిపించ వలసిన బాధ్యత—అధిక బాధ్యత—తమకు లేదని పార్లమెంటువారెన్నడును అనలేదు— అన్నట్లు నటించనులేదు. ఈస్టిండియా కంపెనీవారి వర్తకపు పట్టాను అంతమొందించుచు 1858 సం॥ లో సీమ పార్లమెంటువారొక చట్టమును నిర్మించిరి. ఆ చట్టమందే యీ విధమగు ప్రకటనను గూడ చేసిరి:—

"యిక ముందునుండి జాతిమతాధిక్య రూపములగు నహంభావములు సహింపబడవు. "లా" దృష్టిలో యీతడు కులీనుడనిగాని, కులహీనుడనిగాని వుండదు. భారతవర్ష మందలి అన్ని జాతులు, అన్ని తెగలు, నిర్భయముగ నిలువబడి తమయొక్క సంపూర్ణ హక్కులను నిర్భీతిగ కోరవచ్చును. ఇట్టి హక్కులను భారతప్రజలు న్యాయముగ కోరినప్పుడుగాని, తమకు గలిగిన యన్యాయములను తొలగించవలసినదని కోరినప్పుడుగాని, వారి మొరల నాలకించి వారికి తగు న్యాయము చేయుటకు

సీమరాణియు, ప్రభువులును, కామన్సు సభవారును సదా సిద్ధముగనుందురని వాగ్దానము చేయుచున్నాము. ”

ఇకనుండి క్రొత్త రాజ్యములను కలుపుకొనుపద్ధతి మాని వేసేస్తాము— (తూ, నాబొడ్డు తుంబాలు)—అని 1858 సం॥ నవంబరు 1 వ తేదీన సీమరాణీ చేసిన ప్రకటనలో యింగ్లీషు వారు ఒట్టుపెట్టుకొని యున్నారు.

“ఇంతవరకు మాతరఫున ధర్మకర్తలుగనుండి (ట్రస్టీలుగనుండి) గౌరవనీయులగు యీస్టిండియా కుంపిణీవారు పరిపాలించుచున్న యిండియా రాజ్యమును యిప్పు డనేక బలవత్తర కారణములచే మేమే వహించుటకు నిశ్చయించుకొంటిమి గావున, సదరు రాజ్యభారమును మే మిందుమూలముగ వహించుచున్నామని భారతప్రజల కెల్లరకు ప్రకటించుచున్నాము. మా పరిపాలనక్రిందనున్న రాజ్యములలోని ప్రజలెల్లరు, మాయెడలను, మా వారసుల యెడలను, మా యనంతరము రాజ్యమునకువచ్చువారి యెడలను, (మా యుత్తరాధికారుల యెడలను) నిజమగు భక్తివిశ్వాసములు గలిగి యుండవలసినదని యిందుమూలముగ ఆజ్ఞాపించుచున్నాము. “ గౌరవనీయులగు ఈస్టిండియా కుంపిణీవారు మీతో చేసికొన్న ఒడంబడికలనెల్ల మే మంగీకరించుచున్నామని మేమిదే యిండియాలోని దేశీయరాజుల కెల్లరకు ప్రకటించి చెప్పుచున్నాము. ఈ యొడంబడికలను, మేము తు, చ, తప్పకుండ మన్నింతుము; దేశీయరాజులు తాముకూడ యీ యొడంబడికల నిట్లే గౌరవించవలెనని కోరుచున్నాము. మారాజ్య విస్తీర్ణము నిక పెంచుకొనవలయునని మేము కోరము. ఇతరులు మారాజ్య

ము పైకివస్తే మాత్రము మేము ఊరుకోనము. ఇతరుల రాజ్యము పైకిపోయి దాని నాక్రమించుకొనుటకు మేమెవరికి అనుజ్ఞ నొసంగము. దేశీయరాజుల హక్కులను, దర్జాలను, గౌరవములను, మావిగనే చూచుకొని మన్నింతుము."

"మేము మాతక్కిన ప్రజలనెల్ల నెట్టి బాధ్యతతో చూచుకొనుచుండుటకు బద్ధులైయున్నామో అట్టి బాధ్యతతోనే యిండియా ప్రజలనందరిని కూడ చూచుకొనుచుండుటకు బద్ధులమగుచున్నాము. ఇట్టి బాధ్యతలను మేము — పరమేశ్వరుని యాశీఃప్రభావముచే — భక్తివిశ్వాసములతోను, మనస్ఫూర్తిగను పాటింతుము."

దేశీయరాజులీ రాణీగారివాగ్దానములను విని సంతుష్టి చెందిరి. కాని, యిక్కడ యేడువేల మైళ్ల దూరమందున్న రాణీగారి యేజెంట్లు వానిసమగతి నెంత వరకను సరింతురో గ్రహింపజాలని అసమర్థస్థితిలోనుండిరి. వెనుకటి చరిత్రనుబట్టి చూడగ ముందుకుకూడ వారికాశలేమియు గన్పట్టకుండెను. ఏలననగ:— రాణికి మంత్రులెవరుండవలెనో, యిండియాకు వైస్రాయీల నెవరిని పంపవలెనో మున్నగు విషయములనెల్ల పరిష్కరించునది పార్లమెంటు వారే యనుసంగతి యీరాజులకెవరో తెలియజెప్పిరి. (ఇక్కడ ఈగుట్టు కాస్త రాజులకెవరో చెప్పిరి.) యిండియాలో తమపై నియమింపబడిన అధికారుల పొగరుబోతు ప్రవర్తననుగూర్చి వెనుక తమ తాతతండ్రులు సీమవారికెంత చెప్పుకొన్నను, వారితో మొంతమొత్తుకొన్నను, నిరర్థకమగుచువచ్చెనేగాని కించిత్తయినను ప్రయోజనము లేకపో

యైనను సంగతికూడ యీ రాజులకు జ్ఞాపకమున్నది. కాని, కొంతకాలమైనపిమ్మట కానింగ్ ప్రభువు వైస్రాయిగవచ్చి దేశీయరాజవంశములలో అనుక్రమముగ వచ్చుచున్న పూర్వపు దేశీయవారసత్వపు హక్కుల నికనుండి అంగీకరించుటకే గవర్నమెంటువారు నిశ్చయించుకొనుచున్నారని చెప్పినప్పుడు పాపమీ రాజులకు కొంతఆశపుట్టెను. "సత్పరిపాలనను, దేశశాంతిని నెలకొల్పుటకుగాను యిప్పుడు నిలిచియున్న దేశీయ రాజవంశముల నంతరింపజేయక, వానినట్లేయుండనిచ్చుట మంచి" దని గవర్నమెంటువా రప్పుడు తీర్మానించుకొనిరట. "గవర్నమెంటువారు చేసికొనిన యీ తీర్మానమును నేను ప్రకటించినప్పుడు గ్వాలియర్ సంస్థానమందెంతటి సంతోషము—సంబరము— పుట్టెనో చెప్పతరముకాదు— నాకెంతో ఆశ్చర్యమైనది! రాజుగారికి కొడుకుపుట్టితే యెంతసంతోషము, యెంతసంబరం కలుగుతుందో, అంత సంబరంకలిగింది. నాకాశ్చర్యమైనది" అని వైస్రాయియగు కానింగుప్రభువు వ్రాసెను. "అనేక సంవత్సరములనుండి నా మొగముపై తీవ్రముగ మంచుగాలి విసరి కొట్టుచుండెను. కాని యిప్పుడా బాధ పోయినది"— అని సింధియారాజు తనవద్దనున్న రెసిడెంటుతో చెప్పెనట! కాని, అయ్యో యీ సంబరమంతయు— అప్పుడే— తత్క్షణమే మాయమైపోయెనే! "చూస్తూ, చూస్తూ వుండగానే ఉదయించుచున్న ఆ వెలుతురంతయు ఒక్క క్షణంలో— ఒక్క రెప్పపాటులో మాయమై పోయెనే! తిరిగి యెన్నటికి కనిపించకుండ మటు మాయమయ్యెనే! దత్తతాధికారమునుగూర్చి కానింగ్ వ్రాసిన

అక్షరములలోని సిరా యింక యెండకమునుపే గవర్నమెంటు వారు గిరుక్కున వెనుకకు తిరిగిరి. కొత్త తంత్రమును,— పూర్వపుదానివలెనే అన్యాయమగు నొక కొత్త తంత్రమును— పన్ని, తిరిగి యథారీతిగ రాజ్యముల దిగమ్రింగు పద్ధతికి గడంగిరి. "నీ తండ్రిగారి బిరుదములు, అధికారములు, అన్ని నీకు తీసివేసేశాము" అని హఠాత్తుగ ఒకరోజున కుర్రవాడగు ధార్ సంస్థానాధిపతికి హుకుము పంపించిరి! ఒక నేరస్థాపనలేదు; విచారణలేదు, ఏమీలేదు. "నీ రాజ్యాన్ని మా రాజ్యంలో కలుపుకొన్నాము, పొమ్మ"ని ఒక్కటే హుకుము జారీచేయించిరి. కారణమేమిటట— శిపాయీల తిరుగుబాటు కాలములో యీ ధార్ సంస్థానపు శిపాయీలలో కొందరు తాముకూడ తిరుగుబాటు చేసిరట! ఈ సంస్థానాధిపతి వారిని అణచిపెట్టి సరియైన అదుపులోనికి తీసికొని రావడానికి ప్రయత్నంచేస్తే వారు చెప్పినమాట వినకుండ యెదురుతిరిగినారట! ఇది ఆ సంస్థానాధిపతి చేసిన నేరము! "తమ శిపాయిలను తగు అదుపులో వుంచుకోడానికి తమకు శక్తి లేకపోయినా, ఉంచడానికి తాము యిష్టపడకపోయినా, దానివల్లవచ్చే నష్టమునకంతకు మీరే జబాబుదారీసుమా యని యిటువంటి చిల్లరరాజుల కందరికి బుద్ధి చెప్పడానికే నేనీపని చేశా"నని వైస్రాయియగు కానింగు ప్రభువు చెప్పెను. దీనినిగురించి పార్లమెంటు సభలో యెవరో ప్రశ్నించినప్పుడు "యీ పద్ధతి పనికిరాదు; దీనికి నేను ఒప్పుకొనలే"దని అప్పుడు యిండియామంత్రిగనున్న స్టాన్లీ ప్రభువు నిర్మొగమోటముగ జబాబు చెప్పెను. "మన శిపాయిలను

మనమే అదుపులో వుంచుకోలేకపోయినప్పుడు, యిక పాపము చిల్లరరాజులు తమ శిపాయిలను అదుపులో వుంచుకోలేకపోయినారని మన మేమొగము పెట్టుకొని నిందింతుము. కాబట్టి, యీ ధార్ సంస్థానమును తిరిగి వారిది వారి కిచ్చి వేసేస్తూ వున్నాను" అని స్టాన్లీ ప్రభువు బదులు చెప్పెను. ఏపాపమెరుగని ప్రజలపై విధింపబడిన యీ యన్యాయపు శిక్షను తప్పించవలసినదని యాజ్ఞాపించుచు స్టాన్లీప్రభువు యిండియాకు వ్రాసిన లేఖను కానింగ్ ప్రభువు బుట్టదాఖలు చేసెను. "నీ రాజ్యమును మా రాజ్యంలో కలుపుకొన్నాము. నీ ఖజానా, నీ జవాహిరీ, నీ ఆస్తి— అంతా నీ కొలువులో నౌకరిచేసే శిపాయీల కందరికి బహుమతులుగ పంచిపెట్టేశాము" అని రాజాతో చెప్పవలసినదని కానింగ్ ప్రభువు ఇందూరులో రెసిడెంటుగనున్న సర్ రాబర్టు హామిల్టనుకు ఉత్తరువుల బంపెను. "మీ రాజ్యం విషయమైన నిర్ణయాలేవో గవర్నమెంటువారు తరువాత ప్రకటించెదరు. కాని, యీ రాజ్యంమాత్రం తిరిగి మీకు వస్తుందని యెప్పుడు అనుకోవద్దుసుమా" యని దైవోపహతుడగు నా రాజుతో చెప్పవలసినదనికూడ కానింగ్ వ్రాసెను. ఈ సంస్థానపు నిజపరిస్థితులు కానింగుకంటె అచ్చట చాలకాలము నుండి రెసిడెంటుగనున్న హామిల్టన్‌కు యెక్కువ బాగుగ తెలియును. ఈతడు న్యాయబుద్ధిగలవాడు. నిర్భీతిగలవాడు. కాబట్టి, యీ రాజ్యముపై "యిట్టి అన్యాయము చేయవల" దని ఆతడు గట్టిగ వాదించెను. "ధార్ సంస్థానపు రాజులు ప్రజలుకూడ మనకు మొట్టమొదటినుండియు విశ్వాసపాత్రు

లగు మిత్రులుగ నుండిరి. శిపాయిల తిరుగుబాటను తుపాను ప్రచండముగ నలుముఖముల చుట్టుముట్టి రేగుచున్న రోజు లలో, నైజాము రాజ్యములోని శిపాయిలు కొందరు హద్దు మీరి సంచరించుచు ఉపద్రవకరముగ కనబడుటచే వారినక్కడ నుండి తప్పించి తీసికొనివచ్చి, యీ థార్ రాజ్యముపై విచ్చల విడిగ వదలి వేసిరి. ఇది మనము చేసినతప్పే. అప్పుడు థార్ సంస్థానాధీశుడు మైనారిటీలోనుండుటచే రాజ్యపాలన మంతయు ఒకానొక గార్డియన్ చేతిలో నుండెను. ఈ యవకాశ మును జూచుకొని కొందరు మొరకులు బయలుదేరి రాజ ద్రోహమును పురికొల్పిరి. ఈ సమయమందు అక్కడనున్న మన యింగ్లీషు రెసిడెంటు ప్రతిక్షణము రాజాతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచునే యుండెను. "ఆతనిలోగాని, ఆతని బంధువులలోగాని, సలహాదార్లలోగాని యెట్టి లోపము వున్నట్లు కనిపించలేదు." కాబట్టి, యిట్టి విశ్వాసపాత్రుని రాజ్యమును కాజేయుట అన్యాయమని హామిల్టన్ యెంతయో వాదించెను. "ఒకవేళ మీరీ రాజ్యమును కాజేసినను ఆతని స్వంత ఆస్థిజోలికి (నగలు, యింటిలో చెంబు తప్పేలాల జోలికి) మాత్రము పోవద్దు" అని ఆత డెంతయో మొత్తుకొనెను. సీమమంత్రి పెట్టిన చివాట్లచే కానింగ్ ప్రభువుకు శృంగభంగ మయ్యెను. "ఈ చివాట్లకు తగిన సమాధానము నీవు చెప్పి పంపు" మని చెప్పి, ఆ పనిని కానింగు ప్రభువు తన సేనాని యగు కర్నల్ డ్యూరాండుకు వదలివేసెను. థార్ రాజ్యమును సమస్త సంపదలతో సహా హరించు వైస్రాయియొక్క శాస నము నిర్దాక్షిణ్యముగ నమలు జరిగించబడెను. తమపరి

జరిగిన పార్లమెంటు సభలో "బ్రైటు" అను మెంబరు పట్టిష్ట మగు తన పలుకుబడి నంతను వినియోగించి, యీ వ్యవహారము మును న్యాయముగ పరిష్కరింప జూచెను. వెనుక యిండియా మంత్రిగనున్న స్టాన్లీ అప్పుడు లేడు. అతని స్థానమందు "ఉడ్డు" అనునత డింకొకడు వచ్చెను. ఈతడీ వ్యవహారము నేదోవిధముగ సర్దిపారవేయవలెనని జూచెను. రాజాకు మైనారిటీ వెళ్లగానే రాజ్య మిప్పించివేసెదనని యితడు వాగ్దానము చేసెను. రాజాను శిక్షించుటకుగాను అతని రాజ్యాదాయములో 5 వ వంతు గవర్నమెంటువారు శాశ్వతముగ లాగికొనవలయుననికూడ అతడు చెప్పెను. పిమ్మట, యిది జరిగిన రెండేండ్లకు "థార్ రాజవంశమువారి నగలను, రత్నములను,— బహిరంగముగ వేలము వేయుచున్నామహో" యని మాళవదేశమం దంతటను చాటింపు వేయించిరి. ఈవిధముగ వేలము వేసిన "థార్ దోపిడీ" సొమ్ము 8 లక్షల రూపాయల విలువగలిగి యుండెను. తదనంతరముకూడ యీ కుర్రవానికి రాజ్యమివ్వక, "ఆత డింకను పరిపాలనకు తగడని" యేమేమో మిషలు చెప్పుచు— బహుసంవత్సరములు కాలయాపన చేసి, చేసి, తుట్టతుద కెట్లయితేనేమి యెంతో బ్రహ్మాండము మీద ఆతనిరాజ్య మాతనికి యిప్పించినారన్న మాటను సీమలో యీతని హక్కు లేమగునోయని యెంతో ఆదుర్దా పడుచున్న యీ రాజామిత్రుల చెవిని పడెను.

అదేమి పాపమోగాని, మరలకొన్ని సంవత్సరముల నుండి "పరరాజ్యాపహరణ మను ఉన్మాదపు" రోగము యిండియాప్రభుత్వము వారికి తిరిగి పుట్టెను. ఇక్కడ

ఒక్కసంగతిని మాత్రము మరచిపోరాదు. "1857 సంవత్స రపు కష్టపురోజులలో, సకాలమునకెంతో ఉపయోగకరమగు మనుష్య సహాయము, ద్రవ్యసహాయముకూడ చేసినవారు దేశీయరాజులే— ఇట్టిసహాయము దేశీయరాజులలో ప్రతి తెగవారు చేసిరి. ఇట్టి సహాయము చేయని రాజెవడును లేడను సంగతిని మనమెన్నడును మరువరాదు." వీరు చేసిన అత్యం తోపయుక్తమగు సహాయమునకెంతయు వైస్రాయియగు కానింగుప్రభువు వీరిలో చాలమందికి బహిరంగముగ వందన శతంబు లాచరించెను. "ఈ చిన్న చిన్న చెక్కలుగనున్న చిల్లరదేశీయ రాజ్యములుకూడ అక్కడక్కడ అడ్డమునిలిచి, ప్రచండముగ రేగుచున్న శిపాయీల తిరుగుబాటు తుపాను యొక్క వేగమంతయు ఒక్కసారిగ మనమీదవచ్చిపడి, మనను తుడిచివేయకుండ కాపాడినది. ఈ చిన్న చిన్న రాజ్యములే మధ్య లేకపోయినచో, ఆ తుపాను మననీపాటికి ఒక్కదెబ్బ లో తుడిచివేసెడిదే" అని కానింగువ్రాసెను. ఇదివరకు కుంపిణీ వారిచే పీడింపబడి, వారియెడ బహు అపనమ్మకముగ నున్న దేశీయరాజు లీ మాటలను విన్నప్పుడు వారిమనస్సులం దెట్టి భావములుప్పొంగెను? "ఇక ఫరవాలేదు; వీరిలోవుండే కాఠిన్యమంతా పోయింది— మృత్యుదేవత తనకాఠిన్యతను విడిచిపెట్టినది" అని సంతోషించిరి. దుష్ట సాంప్రదాయ ములు—దుర్గుణములు— యెంతకాల మెన్నిచీవాట్లు పెట్టినను —పోవు. అవితిరిగి మెల్లమెల్లగ నెవరికి తెలియకుండ కూడుకొని, అవిచేయవలసిన చెడుపనుల నవి చేయుచునే

యుండను. అపాయముగడవగానె, తిరిగి గవర్నమెంటు వారికి పరరాజ్యముల హరింపుతృష్ణ బయలుదేరెను. మైసూరు రాజ్యమును రెండుసార్లు పగులగొట్టి పంచుకొన్నను, అక్కడ తమ రక్షణక్రిందనున్న రాజునొకని నింకను నిశానీగ అట్టె పెట్టిరి. శ్రీరంగపట్టణము పడిపోయిన పిమ్మట మైసూరు రాజుతో చేసికొన్న ఒడంబడికనుగూర్చి సేనానియగు వెల్లస్లీ తనయన్నయు, వైస్రాయియునగు వెల్లస్లీప్రభువుతో నీవిధముగ బహు దూరదృష్టితో హెచ్చరించి చెప్పెనట:— "మనమిప్పుడిక్కడ పునఃప్రతిష్ఠిత మొనర్చిన యీ రాజుతో చేసికొన్న ఒడంబడికలో, మనస్నేహము శాశ్వతముగ, సూర్యచంద్రాదులున్నంతకాలము వుండునని మనము ప్రమాణపూర్తిగ వ్రాసియిచ్చినను అందులోనుండి వేరే అర్థముతీయుటకు కావలసినన్ని సందులున్నవి. మనకువీలైనప్పుడు, యీ రాజ్యమును మనము లాగుకొనవచ్చునను అర్థముయిచ్చే మాటలు అందులోవున్నవి. మనము యిదివరకు యిండియాలోనడిచిన ప్రవర్తననుబట్టి మనము యెప్పుడో ఒకప్పుడు యేదో సందుచూచుకొని, అన్యాయముగ ప్రవర్తించుటకు జంకమను సంగతి యిదివరకే దేశీయులకు బాగా తెలిసిపోయినది" అని అతడు వ్రాసెను. ఈ వ్రాతలు వ్రాసిన వెల్లస్లీ చనిపోయిన పిమ్మట, యీతని మాటలలోని అర్థమును పైకి తీసిరి. మైసూరురాజుతో చేసికొన్న సంధిపత్రములో యీ రాజ్యము "నీకుయిస్తామని వున్నదేగాని, నీ వారసులకు, నీ అనంతరంవారికి యిస్తామని యెక్కడాలేదు"— అని అంహామని గవర్నమెంటువారు యెత్తువేసిరి. "ఈ రాజుగనుక

పిల్లలు లేకుండా చచ్చిపోతే ప్రాచీనరాజ్యమగు యీ మైసూరు రాజ్యములో గౌరగగా మిగిలియున్న ఆ కాస్త కూడా మన రాజ్యములో తక్షణమే కలుపుకోవలసినదని " సలహాచెప్పుచు డల్హౌసిప్రభువు రికార్డులో వ్రాసిపెట్టిపోయెను. ఈ సలహా ప్రకారమే చేయుటకు యిండియా గవర్నమెంటువారు 1865 సం॥ లో పూనుకొనిరి. రాజుకు సంతతిలేనందున ఆతడు ఆ సంవత్సరమే దూరపు జ్ఞాతినొకనిని దత్తతచేసికొనెను. ఈ దత్తహోమకాలమందు యింగ్లీషుగవర్నమెంటు యేజంటును, సంస్థాన ప్రముఖులునుకూడ హాజరైయుండిరి. ఇట్లు దత్తత జరిగినట్లు యేజంటు గవర్నర్‌జనరలుకు తెలియపరిచెను కూడాను. కాని, అప్పుడు గవర్నర్‌జనరల్‌గనున్న లారెన్సు యీ దత్తత చెల్లకూడదని పట్టుబట్టెను. దీనికి సీమలోనున్న యిండియా మంత్రికూడ మద్దతుచేసెను. కాని, కౌన్సిలులో నున్న తక్కిన అయిదుగురు మెంబర్లు తీవ్రముగ ప్రతిఘటించిరి. వెనుక వెల్లస్లీ సూచించిన దురాగతపు అపార్థములను కల్పించి 1799 సంవత్సరపు టొడంబడికను తలక్రిందు చేయ జూచుట "మనకెంతమాత్రము గౌరవప్రదము కాదని" వారందరొక్కమాటగ యనిరి. ఇంగ్లండుయొక్క గౌరవమును, యిండియాయొక్క చిత్తశాంతిని కాపాడుటకుగాను, అదృష్టవశాత్తు అదేసమయమం దింకొక మహానుభావుడు క్రోధరసమందు ముంపబడిన తన ప్రచండ లేఖినీ ప్రభావముచే యీయాన్యాయమును దూరముగ గొట్టివేసెను. ఈమహానుభావుని పేరు " మేజర్ యివాన్సుబెల్." ఈ కేసులోని యావత్తు చరిత్రను ఆతడు త్రవ్వియెత్తి సమస్తమును విపులముగ సీమప్రజలకు

విప్పిచెప్పెను. మైసూరురాజ్యాపహరణమునకై గవర్నమెంటువారు పన్నిన నీచమగు యీదిక్కుమాలిన పన్నుగడను— యీ దౌర్భాగ్యపుపనిని— ఖండించుటకెంతయో సాక్ష్యము పోగుచేసి సీమకుపంపించి, యీ యన్యాయమును వారింపవలసినదని కలకత్తా కౌన్సిలునుండి సీమప్రజలకు వినబడునట్లు మొరవెట్టెను. "ఈ పని విశ్వాసఘాతక" మని మాంటుగోమేరీ యనునత డతితీవ్రముగ ఖండించెను. "ఈ పని అన్యాయము; "లా" కు విరుద్ధము" అని సర్ కర్రీ యనునతడు బల్లగుద్దిచెప్పెను. "ఈపని కేవలము ఘోరమైన అన్యాయము, అక్రమము" అని సర్ విల్లోబీయనునతడు చెప్పెను. ఎవరోచెప్పిన విపరీతపు సలహాలను నమ్మి మీరీపని చేస్తున్నారు; ఈ సలహాలలో కించిత్తయినను నిజాయితీగాని, పెద్దమనిషితరహాగాని లేదు" అని సర్ జార్జిక్లార్కు పలికెను. "మనసంధిషరతుల బట్టి చూచినను, యిండియాలోని న్యాయశాస్త్రములను, ఆచారములను బట్టి చూచినను, మనము చేసేదానిలో యెంతమాత్రము న్యాయము కనుపించదు" అని కాప్టెన్ యీస్టువిక్ అనునతడు వ్రాసెను. ఈవిధమగుసాక్ష్యముల నన్నిటిని యేకరువుపెట్టి "నిజంగా, మీరు చేసిన పని న్యాయమేమో చెప్పండి" అని యివాన్సుబెల్లు గవర్నమెంటుమీద సవాలుదీసెను. అదృష్టవశాత్తు, అప్పుడు యింగ్లాండులో నుండిన పార్టీచిక్కులవల్ల కూడ యిండియా గవర్నమెంటువారు వేసిన యెత్తు పారుటకు వీలులేకపోయెను. ఈ కారణములచే, యెట్లయిననేమి, యింకొక దేశీయరాజ్యము గవర్నమెంటువారి నోటపడకుండ తప్పిపోయెను. బ్రిటిష్

సామ్రాజ్యము యొక్క ఐశ్వర్యము, సక్రమపాలన, శాంతి, యీవత్తు దేశీయరాజ్యముల స్థిరత్వముపైననే ఆధారపడి యున్న సంగతి యింగ్లీషువారి కందరికి తెలిసియే యున్నదిగద. అట్టిచో, "మా యిష్టమువచ్చినప్పుడు మీా రాజ్యములు లాగికొంటామని బెదరించి, వాని బ్రతుకు "దిన దినగండం నూరేండ్లాయుస్సు" అన్నట్లు అస్థిరముచేయజూచుట" యేటి మాట? (యేటిరాజనీతి?) ఇవన్నీ చూచి తక్కిన దేశీయ రాజులందరు యేమనుకుంటారు? "ఓరి, మన మీా గవర్న మెంటుయందు యెంత భక్తి విశ్వాసములతో నున్నా ప్రయోజనం లేదురా" అని పైకి అనకపోయినా, మనస్సులోనైనా తప్పక అనుకుంటారు. ఇది సహజము. పార్లమెంటుసభ జరిగినప్పుడల్లా, ప్రతి పర్యాయము యిండియా నుండి యేవో కంప్లెయింట్లు — యెవరి రాజ్యాన్నో కాజేశారనో, కాజేస్తామని బెదరించారనో — యేవో చిల్లర పేచీలు వచ్చుచునే యుండెను. ఇవన్ని విచారించలేక పార్లమెంటు మచ్చమాస్తోంది. ఉద్యోగములలో లేసి పెద్దలు బయటవారు కొందరీ సంగతుల నన్నిటిని వివరముగ విచారించి, యిటువంటి దుష్కార్యముల నన్నిటిని— (యీా పనులుచేసిన దుర్మార్గులను కాకపోయినా)—ఖండించుచుండిరి. కాని, యెవరెంత చేసినను, కొసకు ప్రయోజన మేమియు కన్పట్టకుండెను. రాచకీయ సంబంధమగు మూకతో కూడకొన్న యిటువంటి కామన్సు సభ (పార్లమెంటుసభ) యేమిచేయగలదు? వారన్ హేస్టింగ్సు అయోధ్య రాచబూబులకు చేసిన అన్యాయమును గూర్చి ప్రభుసభవారు 1795 సం॥లో యెంత న్యాయముచేసి

యేడిశారో యిప్పుడీ కామన్సుసభవారు కూడ అంతే న్యాయము చేస్తారు! అంతకంటే తక్కువే చేస్తారని కూడ చెప్పవచ్చును. అంతకంటె అధ్వాన్నముగ నున్నది యిది! ఇటువంటి కేసులను విచారించుటకు తగు సాధనములను కని పెట్టువరకు, దేశీయ రాజుల మనస్సులకు శాంతి యుండదు. ఇదివరకు జరిగినదానినిబట్టియు యిప్పుడు మన కండ్లయెదుట జరుగుచున్నదానిని బట్టియు విచారించి చూచి, తాము అన్యాయము చేస్తున్నామని గ్రహించి,—గ్రహించికూడ అన్యాయము చేయుచున్నామే యను సిగ్గును కూడ పడకుండ విడిచి పెట్టి, దేశీయులకు న్యాయము గలుగజేయుటకు తగు కట్టుదిట్టముల నేర్పరుపక అశ్రద్ధగ వదలివేసినచో, పార్లమెంటువారు చేసే పాపమునకు ప్రాయశ్చిత్తమనునది యుండదు. బ్రిటిషు జాతి గౌరవమును కాపాడుటకన్న, విచ్చలవిడిగ స్వైరవిహారమొనర్చు తమ యధికారములను కాపాడుకొనుటయే ఘనముగ చూచుకొను అధికార గర్వోన్మత్తులును, తమోగుణ ప్రవిష్టులును, ఉపేక్షాపరులు, నగువారెల్లరు దీనికి వ్యతిరేకముగ వాదింప వచ్చును. సార్వభౌమునకును సామంతునికిని మధ్య హక్కులు, ఆదాయములు, గౌరవములు, రాజ్యాధికారములు మున్నగు చిల్లర తగాదాల నన్నిటిని తీర్చి దిద్దుటకొరకు పార్లమెంటరీకోర్టు నేర్పరుచుట సాధ్యముకాని పనియట! సాధ్యము కాని పనికాకపోయినను అపూర్వమట! అపూర్వము కాకపోయినను విప్లవకరమట! ఇది వీరి వాదన ధోరణి! సాధ్యముకాదనే వాదనను గూర్చి ప్రతివాదన చేయుట అనవసరము. ఏలననగ, చేయతగ్గపనుల ననేకములను చేయ

సాధ్యముకాదని రాజకీయోద్యోగులు వాదించుట మనమెరుగమా? పాపము, వారి కండ్లకవి అసాధ్యములుగ గన్పట్టును కాబోలు! దానికి మనమేమి చేయుదుము? క్యాతలిక్కులకు స్వాతంత్ర్యమిచ్చుట, ధ్యానపు చట్టములను రద్దుపరుచుట, ప్రతి కుటుంబమువారికి వోటు హక్కు నిచ్చుట మున్నగు కార్యము లెన్నియో సాధ్యముకానిపనులని పెద్ద పెద్దలే మొట్టమొదట వాదించి యుండలేదా? కాని, ఆఖరుకు ఆ పనులు అయితీరలేదా? ఈ పనులు జరిగితీరినంత మాత్రమున ఆకాశమూడి క్రింద పడలేదే? లోకమున కేమియు ప్రళయమురాలేదే! వానివల్ల యెవరికిని యెట్టిఉపద్రవములును రాలేదే? అదిగాక, పైపెచ్చు, వీనివల్ల అనేకమందిమి బాగుపడినామని సంతోషించుచున్నారే! ఇక ఇట్టి యేర్పాటు అపూర్వము; యిట్టిది ప్రపంచములో యిదివరకెక్కడను లేదే" యనువాదనకు సులభముగ జవాబు చెప్పవచ్చును.

ఏమనగ :— ఇండియా విషయమే చాల అపూర్వమైనది. (ఇండియావంటి గొప్పదేశము, యింగ్లండువంటి చిన్నదేశం పాలబడుట యనునదే ప్రపంచములో విడ్డూర్యమైన సంగతి) ఇది చాలఅపూర్వమైన విషయము— యిట్టిది ప్రపంచములో యిదివరకే యుగమందును జరిగియుండలేదు. కాబట్టి, దీని విషయమై చేయవలసిన యేర్పాటులు కూడ, చాల అపూర్వముగనే, విడ్డూర్యముగనే వుండవలసి వచ్చును. (ఇందులో ఆశ్చర్యమేమున్నది?) నిజమునకు దీనిలో గొప్ప విడ్డూర్య మేమియు లేదు. ఏలనన, ఇదివరకే తరచి పరిష్కరింపబడి అనాదిసిద్ధముగ వచ్చుచున్న ధర్మ

సూత్రములనన్నిటి నొకచోట చేర్చి, వానిని కొంచెము జాగ్రతతోను, వివేకబుద్ధితోను పరిశీలించిచూచినయెడల ప్రస్తుతపరిస్థితుల కేయే యేర్పాటులు అవసరమగునో అవి వానియంతట అవియే బయటికివచ్చును. మనంతట మనమే వానిని సులభముగ గ్రహించవచ్చును. వానియంతట యవియే మనకు తట్టును. ఇక యీ యేర్పాటు విప్లవకరమని చెప్పు కొంటెమాట నంతగ పాటింపవలసిన పని లేదు. సామ్రాజ్యసంరక్షణ, ప్రజలసంతృప్తి యనునవే మనకు ప్రధానోద్దేశములైనప్పు డిక యిట్టి కొంటెమాటలతో పని యేమి ? వట్టిసలహాలు చెప్పువా రెంతమందియైన నుండ వచ్చును. కాని, వానిని ఆచరణలోపెట్టి, వాని యోగ్యతను నిరూపింపగలవారు కావలెను. ఇండియాకు పార్లమెంటువారు ప్రమాణపూర్తిగ చేసినవాగ్దానములను సక్రమముగ చెల్లించుటకును, యిండియాప్రజలకు సీమరాణీ యిచ్చిన అభయహస్తమును న్యాయముగ పాలించుటకును, భారతవర్ష ప్రజలకు మనయెడ నిజమగు, నిశ్చంచలమగు ఆశ, విశ్వాసము, సుస్థిరముగ నాటుకొనుటకునూ, యెవరైనాసరే, యే మార్గమునైనాసరే చూపించినట్లయితే చాలు. ఇంకదాని కెవరే కొంటెపేర్లు పెట్టినను— దాని నెవ రెంతవిప్లవకరకార్యమని యాక్షేపించినను లెక్కచేయనవసరములేదు. ఏలననగ :— యిట్టిమార్గమును చూపెట్టినవాడు లోకములో విప్లవముల నన్నిటిని పారద్రోలుటకుగాను యెవరియూహకు అందని మహాఘనకార్యము నొకదానిని లోకమునకుచేసి చూపినవాడగుచున్నాడని నిశ్చయముగ నమ్మండి.

ఇండియాలోని సామంతరాజు లెవరైనా తమకు అన్యాయము జరిగినదనిగాని, తమకు ఫలానిహక్కు వున్నదనిగాని, సరిగ ఋజువుపరుచుకొని చెప్పుకొనుటకు సిద్ధముగ నున్నప్పుడు దానిని విచారించుటకు ఉభయపార్లమెంటు సభలనుండి చెరిముగ్గురు సభ్యులనుయేరి ఒక జాయింటు కమిటీగ యేల యేర్పరుపరాదు ? దౌర్భాగ్యపు పార్టీస్పర్థలు మనస్సులో పెట్టుకొనని నిష్కల్మషచిత్తులగు ముగ్గురేసి సభ్యులను ఉభయ పార్లమెంటు సభలనుండి యెన్నుకొనుట అంతకష్ట మేలకావలెను ? అంతదుస్సాధ్య మేలకావలెను ?

డబ్బువిషయములోనేమి, నైతిక సాంఘిక విషయములలోనేమి, యెంతో గొప్పవియగు, యెంతో క్లిష్టమగు సమస్యలనెల్ల నెట్టి న్యాయబద్ధమగు విధులులేకయే పార్లమెంటుమెంబర్లలో యేనలుగురినోచూచి పరిష్కరించవలసినదని చెప్పి వారిపై నిర్లక్ష్యముగ ప్రతియేటా మన మేలపారవేయవలెను ? నే నిప్పుడు సూచించిన జాయింటుకమిటీని యేర్పాటుచేసినట్లయితే, దాని నొక న్యాయబద్ధమగు కోర్టుగ నియమించి, దానికి తగిన న్యాయశాస్త్రవిధులనెల్ల విధించి నడిపించవచ్చునుగద. ఈ కోర్టు నెట్లునిర్మించవలెనో, దానినే యే సూత్రములప్రకారము నడిపించవలెనో - మున్నగువిషయములనెల్ల బొందుపరుచుచు పార్లమెంటువా రొకశాసనమునే నిర్మించవచ్చునుగద. ఈ ఉభయపార్లమెంటు సభల యధికారమును సమన్వయపరుచుటకుగాను, యీ కోర్టునకు చక్రవర్తి ప్రతినిధి నొకరిని అధ్యక్షునిగనో, అసెసరుగనో యేల నియమించరాదు ? అంతర్జాతీయసమస్యల పరిష్కరించుట

యందు చిరకాలానుభవముగలిగి యిదివరకు హైకోర్టులందు ఛీఫ్‌జడ్జీగనో, ఛాన్సులరుగనో వున్నవారి నేల యీ యధ్యక్షస్థానమున నిలిపి, యీ కోర్టును సక్రమమార్గమున నడిపింపరాదు ? ఒకవంక సర్వంసహాసార్వభౌములై వెలయుచు, అందుచేతనే, తరుచు ప్రమాదావస్థయందుపడుట కెక్కువ అవకాశములున్నట్టి బ్రిటిష్ చక్రవర్తికిని, యింకొకవంక దిక్కులేక యల్లాడుచు, అందుచేతనే సదా అసంతృప్తితోను, అపనమ్మకముతోను దేవులాడు సామంతనృపాలురకును—మధ్య తాము న్యాయతీర్పరులుగ నుండుటకుగాను తమ తోటిసభ్యులచే నెన్నుకొనబడుట తమ కెంతయో మహోత్కృష్టగౌరవమని ఉభయపార్లమెంటు సభలలోని అనుద్యోగీయ సభ్యులేల తలంచుకొని గర్వపడరాదు? ఈ కోర్టు యెల్లరికి పరమప్రమాణపు కోర్టుగనుండి (Court of Record) దీని తీర్పులనబడు చక్కని చెక్కడపు రాళ్లచే తీర్చిదిద్దినట్లు కట్టబడిన బలిష్టమగు "ధర్మరక్ష" యను కోటగోడ క్రింద సమస్త ప్రజలు, రాజులు కూడ హాయిగ, భద్రముగ, గుండెమీద చెయ్యివేసికొని నిద్రపోవుటకును—యెవరి ప్రోత్యముగాని, యెవరి బెదరింపుగాని లేక, రాజులెల్లరు తమ పూర్వపు ఆత్మగౌరవమును రాజకీవిని, తిరిగి నిర్భీతిగ ప్రకటించుకొనుటకును యేల యేర్పాటు చేయరాదు ?

1858 సం॥ పు చట్టప్రకారము విద్యావంతులును, భాగ్యవంతులునునగు దేశీయులను, రాష్ట్రసభలలోనికి తీసికొనుచుండిరి. ఇది మంచిపద్ధతే. దీని నెవరును ఆక్షేపించకాని, దీనివలన రాచకీయ ఫలితమంత యెక్కువగ

నుండునని భ్రమింపరాదు. కలకత్తాకు చుట్టుపట్టులనున్న ముగ్గురు నలుగురు రాజులను అప్పుడప్పుడు గవర్నర్ జనరల్ కబురంపించి పిలిపించి, తన యూరోపియన్ సభ్యులతో పాటు సంప్రదింపుచుండెను. అంతకంటె తక్కువరకపు ప్రముఖులను మదార్సు, బొంబాయి గవర్నరు లిట్లే పిలిపించుచుండిరి. కేవలము విదేశపరిపాలనయే సాగించుచున్నామని అనకుండ, మీ దేశీయులతో కూడ సంప్రదించియే చేయుచున్నామని చెప్పుట కిది పనికివచ్చును. అంతవరకు మంచిదే. కాని, రాజ్యాధికారమందు దేశీయులును విదేశీయులును సరిసమాన భాగస్వాములుగ నుండిరని చెప్పుటకెట్లు వీలగును ? ఈ మాట నెవరు నమ్మెదరు ? కౌన్సిలులో నల్లవారెంతమంది యున్నారు, తెల్లవారెంతమందియున్నారు—అనునది ప్రశ్న కాదు. వట్టి సంఖ్యలనుబట్టి లెక్కజూచుట బడిపిల్లకాయ పని. ఏయే విషయములపై వోట్లు తీసికొనవలెనో ఆ విషయములనెల్ల ముందే పై వారెవరో—వోటర్ల పైవారెవరో—నిశ్చయించినప్పుడిక వట్టి వోట్లవల్ల నేమి ప్రయోజనము ? ఏదైన గవర్నమెంటు ఉత్సవములలో "మీరందరు గుర్రములెక్కి స్వారిచేస్తూ దర్బారుగా రావలసినది" అని యే గవర్నరో చెప్పితే, తమ్మును కేవలము గుర్రాలను మాలీసు చేసేవాళ్లనుగ భావించుచున్నారనే మాటను మరచిపోయి, యీ రాజాలు, యీ జమీందార్లు "మమ్మలనేగదా గవర్నర్ గారింతమర్యాదచేస్తున్నా" రని ఉబ్బితబ్బిబ్బులై బహు సంబరముతో గుర్రము లెక్కివత్తురు ; గవర్నమెంటు విందులలో ఠీవిగ కూర్చుందురు. గవర్నరులు మున్నగువారు

మర్యాదనటించుటకుగాను తమ యింటిలో రాచకీయపరిచా
కలుగనున్న యీ రాజులను రాచకీయవాతావరణమున
గూర్చి అప్పుడప్పుడు మాటవరుసకు "మీ అభిప్రాయమేమి"
యని అడుగుచుండుటయు కద్దు. వారెంతో భయభక్తులతో
వినయపూర్వకముగ విన్నవించుకొను నభిప్రాయములతో
గాలికి, వానకు, యెండకు, దర్బారులో ధరించు దుస్తులరంగ
లకు సంబంధించినంతవరకు గవర్నమెంటువా రంగీకరించి
ఆరాజుల అభిప్రాయముల ప్రకారము పోవుచున్నట్లు మ
మప్పుడప్పుడు వినుచుందుము.—— ఎంత గొప్పసంగతి ? ఎం
గొప్పవరప్రసాదము ! నిజముగ రాజ్యాధికారమునకు సంబ
ధించని యిట్టి చిల్లర, అల్పవిషయములలో సహితమ
రాజుల అభిప్రాయములను చెవియొగ్గి వినుటయే—— వినుట
కంగీకరించుటయే—— మహామేర్భానీయైనప్పుడు,—— మహావ
ప్రసాదమైనప్పుడు—— యిక యీ రాజులను—— వాకిట క
పెట్టుకొనియున్న యీ గుర్రపు నౌకర్లను——మహా మంత్రి
శేఖరులని చెప్పిన యెవడునమ్మును ? ఎట్టి పిచ్చివాడైనను
నమ్మునా ? ఇదివరకు తమ చేతులలోనున్న అధికారమును
తమ చేతులలోనే వుంచుకొని, దానిని కించిత్తయినను విడువ
కుండ, ఊరక అధికారోత్సవములలో మాత్రము పాల్గొనవల
సినదని అనుగ్రహించినచో, అది కేవలము పైపై మర్యాదల
నటించుచు, లోలోన తమ అధికారమును మరింత దిట్టపరుచు
కొనుటకే పనికివచ్చునుగాని, యింకొకటేమియు లేదు.

ఇంతకంటె తక్కువహోదాలో గవర్నమెంటు వా
రింకొక పని చేసిరి. దీనివల్ల నిజముగ దేశీయులకు రాజ్యాధి

కార మిచ్చినట్లే పైకి గాన్పించును. అదేదనగ, చిల్లర నేరములు శిక్షించుటకు మ్యాజస్ట్రేటుపనులు. మనవారికి మ్యాజస్ట్రేటు అధికారములు యిచ్చినారంటే ప్రజలు మొదట నమ్మలేదు; తరువాత "నిజంగా యిచ్చినారా" యని కొంచెము ఆశ్చర్యముతో నవ్వజొచ్చిరి. తరువాత "మేము నమ్మము" అనిరి. చిల్లరవిషయాలలో తన యిరుగుపొరుగు వాండ్లపై అధికారం చలాయించి, "చూడు నిన్ను దండిస్తా నని భయపెట్టడానికి వీలుగవుంటుందనే ఉద్దేశముతో యీ పెద్దవాళ్లంతా పై వాళ్లకు లంచాలిచ్చి యీ అధికారాలు తెచ్చుకొన్నారు" అని ప్రజలకు క్రమక్రమముగ తోచి పోయెను. ఈ యాచారమునే యింకాకొంచెము విస్తీర్ణ మొనర్చి, సీమదేశములో వున్నట్లుగ, అక్కడక్కడ స్థానికముగ మంచి మర్యాద, పలుకుబడి, ఆస్థివున్న పెద్దలకందరికి— సంపన్న గృహస్తులకందరికి—రాచకీయాధికార మిచ్చుచున్నా మను మెహర్బానీగగాక వారి సాంఘికస్థితినిబట్టి న్యాయముగ వారికట్టి హక్కును పొందుట కర్హులను ఉద్దేశముతో వారికి మ్యాజస్ట్రేటుమున్నగు అధికారముల నొసంగి, వానిని తమ యిచ్చవచ్చినరీతినిగాక శాస్త్రబద్ధమగు సూత్రముల ప్రకారము తక్కిన తన తోడివారితో పాటు చలాయించుచుండవలయుననిగనుక మనము (యింగ్లీషు గవర్నమెంటువారము) అన్నయెడల, ప్రజలకు అప్పుడు మనపై మంచినమ్మకము కలుగును. తమ సీమదేశములోనున్న మంచిసంస్థాపనలనే, పేరునకు మాత్రముగాక, నిజమునకుకూడ— యిచ్చుట నెలకొల్పవలయునను సదుద్దే

శములోనే గవర్నమెంటువారున్నారనుమాయని ప్రజలకు మనపై కొంతకు కొంతయైనను నమ్మకము కలుగవచ్చును. స్థానికాధికారమును దేశీయుల కిచ్చు యీ పద్ధతి యిప్పుడిప్పుడే తాత్కాలికముగ నేర్పాటు గావింపబడినది. దీని భావి ఫలితము లెట్లుండునో యిప్పుడే చెప్పుటకు వీలులేదు. ఈ మ్యాజిస్ట్రేటు పనులొసంగబడినవారు చాలాజిల్లాలలో చాల తక్కువగనున్నారు. తీవ్రవివాదమునకు కారణమైన అంశములను నిష్కర్షగ పరిష్కరించుటకు చాలమంది నేటివు మ్యాజిస్ట్రేటులు జంకుచున్నారట.

సక్రమమగు రాజ్యాంగపు ఏర్పాట్లింకను గావింపబడని రాష్ట్రములలో (non-regulation provinces) న్యాయనిర్వహణమింకను చాలవరకు యూరోపియనుల చేతులలోనేవున్నది. మొట్టమొదట సంపాదింపబడిన రాష్ట్రములలో హిందూ, ముసల్మానులే సబార్డినేటు కోర్టులలో మొదటనుండియు జడ్జీలుగ నుండిరి. ఈ ఉద్యోగాలకు పోటీపరీక్షలు పెడితే బాగుంటుందని యీమధ్య చాలమంది పట్టుదలగ చెప్పుచున్నారు. ఈ ఉద్యోగాలకు పరీక్షలెంతమాత్రము అవసరము లేదని యీవిషయమందు చాల అనుభవముగల పెద్దలు చెప్పుచున్నారు. ఏదియెట్లున్నను "ఒకవిషయము మాత్రము మనకు గట్టిగ కనబడుచున్నది. పై పెద్దకోర్టులలోనుండు జడ్జీలలో ఒక్కడుకూడ యీ యిండియా దేశములో పుట్టి పెరిగినవాడు లేడు. ఈరీతిగ యిండియా ప్రజలస్థితిగతులెంత మాత్రము తెలియనివారందరువచ్చి, వారి తగాదాలతీర్చుటకును, తమ యిష్టమువచ్చినట్లెల్ల వారిని ఖైదు చేయుట

కును, కొరడాదెబ్బలు కొట్టించుటకును, జరిమానాలు వేయుటకును, తదితరవిధముల నిర్భాగ్యులను చేయుటకును పూనుకొనుచున్నారు! జడ్జీయగు వాడు కేవలము "లా" ను తెలిసికొనుటమాత్రమే గాక, న్యాయాన్యాయవివక్షణ, ధర్మ చింత కూడ గలిగియుండవలెను. ఈ ధర్మచింత యనునది వానికి వాని యంతరాత్మనుండియే కలుగవలెను. ఇక "లా" యనునది కేవలము బహుగహనముగ నుండును. ఈ "లా" లు, యీ ధర్మశాస్త్రములు — కొన్ని వ్రాసిపెట్టియున్నవి; కొన్ని వ్రాయకుండ ఆచారములుగనున్నవి; కొన్ని అటు యిటు కాకుండ మధ్యస్థముగ నున్నవి. కొన్ని యిటీవల పుట్టినవి; మరికొన్ని అనాదినుండి యున్నవి. వీనికొక తలయు తోకయు కానిపించదు. కొన్ని తుప్పపట్టి, పాచిపట్టి, యెక్కడో యే పాతపుస్తకములలోనో, యే ముసలమ్మల బుర్రలలోనో వున్నవి. అవసరమైనప్పుడెల్ల వీనిని పైకి త్రవ్వితీసి, పై మురికియంతయు తుడిచి, తోమి, పరీక్ష చేయ వలసి వచ్చుచున్నది. అప్పుడుగాని, వీనిలోని ప్రాచీన లక్ష ణాములు బయటపడుటలేదు. ఇంగ్లాండునుండి క్రొత్తగ ఓడ దిగివచ్చి జడ్జీగ కూర్చున్న కుర్రవాడు సూక్ష్మబుద్ధిగలవాడై, కష్టపడి నిజమును కనుగొందమను ఆసక్తిగలవాడైతే, పార్టీలు చెప్పేదానిని యింగ్లీషులో తర్జుమా చేసి చెప్పేవాడొకడు మధ్య వుంటే, వానిద్వారా కొంతకాలమయ్యేవరకు కేసుగొడవ యేమిటో కొంచెము తెలుసుకుంటాడు; చదువురాని రైతులు, దొంగసాక్షులు, అబద్ధాలుచెప్పే తహశ్శీలుదార్లు, ధాన్యము మారించే షాహుకార్లు-వీరందరు ఒకరిమీదఒకరు యేమేమి చెప్తా

కుంటారో కొంచెము కొంచెము ఆ కుర్రజడ్జీకి తెలుస్తుంది. కాని, తాను న్యాయమని ఊహించేదానిలో నిజముగ యెంత వరకు న్యాయమున్నదో యీ సాక్షులు, ప్లీడర్లు కుట్రచేసి తనను కండ్లుకప్పి నిజముగ తనను యెంతవరకు టోపీవేసి, అయోమయావస్థలోకిదింపారో, కనుక్కోడానికి ఆకుర్రవానికి చాలాకాలంపడుతుంది. ఇట్టి అయోమయావస్థలో ఆ కుర్ర జడ్జీ తప్పుచేశాడంటే తప్పేమున్నది? దాని కాతనిని నిందించి ప్రయోజనములేదు. దాని కాత డేమిచేయగలడు? క్రింది కోర్టుజడ్జీ తప్పుతీర్పుచెప్పితే, పైకోర్టుకు అప్పీలులేదా? అని అడుగవచ్చును. నిజమే, అప్పీలుకోర్టు యెప్పుడూ తెరిచే వుంటుంది—కల్లుదుకాణం వలె! కావలసినవారు—దానికి కావలసిన డబ్బుఖర్చుపెట్టుకోగలవారు—తమ మనస్సు తృప్తి కొరకు దానిలోకి నిరభ్యంతరంగా వెళ్ళవచ్చును. కాని, యీ అప్పీలు చేసికొనుహక్కు కూడ అందరికి సులభముగ అందుబాటులో లేదు; దానిచుట్టు లెక్కలేనన్ని ముళ్ళ కంచలు వున్నవి. ప్రతిచిన్నపనికి లెక్కలేనన్ని స్టాంపు డ్యూటీలు, రుసుములు, ఫీజులు పార్టీలు యిచ్చుకొనలేక వారిమచ్చు మాయుచున్నది. ఇవి పార్టీలు భరింపలేనంత భారముగ నున్నవి. విదేశీయపరిపాలకులు విధించిన యీ దిక్కుమాలి విదేశీయార్థిక విధానముచేతనే యిట్టి భారమగు స్టాంపుడ్యూటీలు విధించుట అవసరమైనది. పార్టీలు తమ గ్రామము విడిచి యెక్కడనోనున్న కోర్టుకొరకై బహు దూరము ప్రయాణముచేసి పోవలసివచ్చుచున్నది. తీరా యింతశ్రమపడి వెళ్ళితే అక్కడ కేసు త్వరలోతేలక, వాయి

చాలు పడిపడి, దీర్ఘకాలము యీాడికక్రింద పడిపోవుచున్నది. ఈ యిబ్బందుల నన్నిటిని తీర్పుమార్గ మెచ్చటను కన్పింపదు. ఇప్పటికిని చాల జిల్లాలలో కలెక్టరే జడ్జిగకూడ వుంటున్నాడు. ఈతడు సాధారణముగ సైన్యములో పనిచేసిన సిపాయిగ నుండును. ఏదో తనబుద్ధికి న్యాయమని తోచిన దానిని చేద్దా మనే వీనికి వుంటుంది. కాని, నిజముగ జడ్జీఅనేవాడు యేమి చేయవలెనో వీనికి తెలియదు. ఏపనిచేస్తే నలుగురు నవ్వు తారో, యేపనిచేస్తే నలుగురు విచారపడతారోకూడ వానికి తెలియదు. ఇవాళ్ల అక్బరుకాలపు ఆచారముననుసరించి ఒక కేసులో తీర్పు చెప్పవలసివస్తుంది; రేపు కలకత్తా వర్తకుల ఆచారముననుసరించి దివాళా కేసులలో తీర్పు చెప్పవలసి వస్తుంది; ఎల్లుండి మరియొక కేసులో బ్రాహ్మణాచారముల ననుసరించి వారసత్వము నిర్ణయించవలసి వస్తుంది. సైన్య ములో వుండే కాల్బంటునొకని తీసికొనివచ్చి, లండనులో హైకోర్టుజడ్జీగ కూర్చోపెడితే, లండన్ వారంతా యేమను కుంటారు? ఫిరంగి కాల్బడంలో నైపుణ్యవాణ్ణి తీసికొనివచ్చి, లండన్‌లో పెద్ద క్రిమినల్ శెషన్సు కోర్టుజడ్జీగ కూర్చోపెడితే లండన్ ప్రజ లేమనుకుంటారు? కాని, యిండియా విషయములో మాత్రము,— హిందూదేశ ప్రజలనందరిని మేము రక్షిస్తామని చెప్పి, అధికారగర్వోన్మత్త ప్రలాపములు మనమెన్ని పలికినను, న్యాయము, భూతదయ, ధర్మాధర్మపరిశీలన మున్నగువిషయము లలోమాత్రము యిండియాకు యెటువంటివాడైనను పనికివస్తా డని— తెల్లమొగమువాడైతేసరి, వాడికి చదువు వున్నాసరే లేకపోయినాసరే—బుద్ధి వున్నాసరే లేకపోయినా సరే—

పనికివస్తాడని మనము (యింగ్లీషువారము) అనుకుంటు న్నాము.

సుప్రీముకోర్టులలో దేశీయులగు ప్లీడర్లను జడ్జీలుగ యిప్పుడిప్పుడే చేర్చుకొనవచ్చునన్నారు. ఈ మధ్య కొంత మందిని చేర్చుకొన్నారు కూడాను. వారు యెంతగౌరవముగ, యెంత ఉపయోగకరముగ వుంటారో, వారి ప్రక్కను కూర్చున్న యింగ్లీషుజడ్జీలే దాపరికమేమియు లేకుండ ఒప్పు కొన్నారు. ఇంతవరకు కొంచెమునయమే. ఈ పని రాజ ధాని పట్టణములలోనే గాకుండ దేశమందంతటను కూడ వ్యాపించేటట్లు చేస్తే మరీబాగుంటుంది. మీరు యే "లా" పెట్టినప్పటికి యెక్కడికేసు లక్కడ స్థానికముగ పైసలయితేనే అవి చాల చవకగ, తేలికగ, త్వరగ, ఫయిసలవుతవి. లేకపోతే కావు. అనాదినుండియు నున్న పంచాయితీలను తీసివేసి, వానికిబదులుగ జీతములిచ్చి పెట్టిన జడ్జీల నెప్పుడైతే యేర్పాటు చేసినారో, అప్పుడే వ్యవహారము చెడినది. ఈ జడ్జీలకు ప్రజల ఆచార వ్యవహారములలో గల అసంఖ్యాకము లగు వివరములలో ఒక్కటికూడ తెలియదు. కాబట్టి, వీరు నైతికముగను, న్యాయముగను ప్రజలపై తమ పలుకుబడిని వినియోగించి, వారిని మంచి త్రోవలోనికి తీసికొనివచ్చు టకు కేవలము అశక్తులై పోవుచున్నారు. ఈ విధముగ ప్రవర్తింప జేయబడిన అధ్వాన్నపు "లా" ను మన్నించు టకు ప్రజలు బుద్ధిహీనులై యుండవలెను. పాపము, దీనికి జడ్జీ లేమిచేయగలరు? వారిని నిందించ పనిలేదు. తమ చేతిలో పైవారు యే "లా" ను పెడితే, ఆ "లా" నే

తమకు భగవంతుడిచ్చిన బుద్ధియొక్క యోగ్యతాయోగ్యత లనుబట్టి ప్రయోగింతురు. అంతే! (సరే, గతంనాస్తి, ఇది వరకు అయిపోయినదేమో అయిపోయినది.) కాని, యిక ముందు మాత్రము పార్లమెంటువారు జాగ్రత్తగ నుండవలెను. ప్రజాప్రాతినిధ్యములేని మహాసామ్రాజ్య పరిపాలనమునొక దానిని పార్లమెంటువారు మెడకు తగిలించుకొన్నారు. న్యాయ నిర్వహణమును సరియైన పద్ధతులపై పునఃప్రతిష్ఠితమొనర్చి కొంతవరకైనను భారతప్రజల మనోవాంఛిత ప్రకారము దానిని నడిపింపనియెడల పార్లమెంటువారు తాము పూనుకొనిన యీ విధిని సక్రమముగ నెరవేర్చినవారు కాజాలరు.

దేశీయ రాజ్యాధికారమును భ్రష్టమొనర్చి దానినంత టిని ఒక్కచోటనే కేంద్రీకరించుటవలన ప్రజలలో నిశ్చయముగ అసంతృప్తి, అవినీతి కలిగినను, దానివలన లభించు భౌతికసౌఖ్యములు యీ అసంతృప్తిని, అవినీతిని కప్పివేయు నని కొందరు చెప్పుచున్నారు.

పాటుబడునా ? వడుకు, నేత పరిశ్రమలను, ఖనిజముల త్రవ్వియెత్తు వ్యాపారమును, తదితర వాణిజ్యాదివృత్తులను ప్రజలకు మేలగురీతిని పెంపొందించుటకు యీబ్రిటిష్ సామ్రాజ్యము పూనుకొనునా ? భారతప్రజలు యీ యింగ్లీషు గవర్నమెంటులో నానాటికి భాగ్యవంతులగుచున్నారా ? లేక పేదలగుచున్నారా ! వారు చెల్లించుపన్నులు నిజముగ తేలికయైనవా ? లేక భారమైనవా ? ఇండియా ప్రజలు గవర్నమెంటుకు చెల్లించు రెవిన్యూను యిండియా జనసంఖ్యతో భాగించగ వచ్చేలబ్ధము యింగ్లండుదేశప్రజ లిచ్చుకొను దానికంటె 9 రెట్లెక్కువగ నున్నది. కాబట్టి యిండియా ప్రజలు సీమప్రజలకంటె తక్కువపన్నులే చెల్లించుచున్నారనియు, కాబట్టి యిండియాదేశము యింగ్లండు దేశముకంటె భాగ్యవంతమే యైయుండవలెననియు చెప్పుమాటలు నిజముగ నిజమా ? లేక అంకెలచే గలిగిన భ్రాంతియా ?

ఎవరెక్కువపన్ను లిచ్చుచున్నారు, యెవరు తక్కువ పన్ను లిచ్చుచున్నారు అని పోల్చిచూచుట కాధారమేమి ? పన్నుల భారాభారములను నిర్ణయించుట కేమైన పద్ధతి యున్నదా ? ప్రజలిచ్చు పన్నుల మొత్తములను ప్రజాసంఖ్యచే భాగించి పన్నుల భారాభారములను నిర్ణయించుటకంటె గుర్రములు, కుక్కలు, మున్నగు చతుష్పాదజంతువుల తోకల పొడవుల నన్నిటిని కొలిచి, దామాషా వేసి, మనుష్యరూపములోనున్న ద్విపాదజంతువుల వెన్నెముకల నన్నిటిని కొలిచి యింకొక దామాషా చేసి, యీ రెండు దామాషాలను పోల్చిచూచి యేవి పొడుగైనవో నిర్ణయిస్తే బాగుంటుంది ! ఆశ్చర్య

ములలోకెల్ల ఆశ్చర్యమైన విషయమేమనగ :—పెద్దపెద్ద ఉన్న తోద్యోగములలోనున్న పెద్దలందరు యిట్టి వెర్రి మొర్రి లెక్కల నెట్లు నమ్మి రంట! పన్నులను యెముకలు నెత్తురు రూపముగ యిస్తే, అప్పుడు యిట్టి దామాషాలెక్కలను వేసి చూస్తే, కొంతవరకైనా అర్థము, సబబు వుండేది; కాని డబ్బు రూపముగ యిచ్చు పన్నులలో యిట్టి వట్టి దామాషా లెక్కలలో యెంతమాత్రము అర్థములేదు. ఏలననగ—ఈ పన్నుల భారాభారములను నిర్ణయించుటలో ముఖ్యముగ గమనింప వలసిన ప్రధానాంశములిందు వదలివేయబడినవి. పన్నులను నవి మనుష్యుల శరీరములనుండి కోసి తీసికొనే ముక్కలుకావు; మనుష్యుల డబ్బుసంచులనుండి తీసుకొనే భాగములు. మనుష్యుల డబ్బుసంచులు బహుచిన్నవైనప్పుడు, అవి దాదాపు ఖాళీగానున్నప్పుడు, ఒక్కరూపాయి పన్ను వేసినను అది ఆమని షికి యెంతో భారమేయనిపించును. కాని, డబ్బుసంచి లావుగ, దిట్టముగ, నిండుగ వున్నప్పుడు, అందులోనుండి రు 50 లు తీసికొన్నను అది యతనికి భారమేయనిపించదు. అది ఆతనికొక లెక్కగనుండదు. ఇండియా యిచ్చే రెవిన్యూ 50 కోట్లు; యింగ్లండు యిచ్చే రెవిన్యూ 72 కోట్లు. పైకి చూస్తే, యిండియా చాల తక్కువపన్ను యిస్తున్నట్లుగానే కనిపిస్తున్నది కాని, యీ రెండుదేశములకు వచ్చు ఆదాయములుకూడ పరిశీలించవలసియున్నది. తమకువచ్చే యెంత ఆదాయము నుండి యీ రెండు దేశములు పైనుదహరించిన యీ రెండు మొత్తములను యిచ్చుచున్నవో విచారించవలసియున్నది. ప్రధానమగు యీ సంగతిని విచారించకుండవేయు లెక్క-

లన్నియు వట్టి దండుగలెక్కలు. దీనినిబట్టి చూడగ, మన కేమి తేలును ? ఇండియాయొక్క మొత్తము ఆదాయము సాలుకు 300 కోట్లకు లోపుగ నుండుననియు, యింగ్లండు యొక్క ఆదాయము సుమారు 900 కోట్లుండుననియు, ఆర్థిక వేత్తలు నిశ్చయించి యున్నారు. దీనినిబట్టి చూడగ యిండియా దేశము తనకు వచ్చు ప్రతి పదిరూపాయలలో ను 1—2—8 లు సర్కారుకు పన్నుగ యిస్తూవుంటే, యింగ్లండుదేశము రు0-13-4 లే యిస్తూవున్నట్లు స్పష్టపడుచున్నది. ఈ రెంటికి గల తేడా యింకొక విషయమునుబట్టి మరింత హెచ్చుగుచున్నది. ఏమనగ:—సీమప్రజలిచ్చుకొను పన్నులలో యిరువదింట పందొమ్మిది భాగములు (19/20) తిరిగి సీమదేశములోనే, సీమప్రజల లాభముకొరకే ప్రతిసంవత్సరము ప్రతి రోజు, వేయేల ప్రతిక్షణము, అక్కడిగవర్నమెంటుచే ఖర్చు పెట్టబడుచున్నది. కాని, మనయిండియాయందన్ననో, మనము సర్కారుకు యిచ్చుకొను పన్నులలో చాలభాగము యేటేటా సీమకు— సీమప్రజల భోగలాలసముల కొరకు— యెగుమతియై పోవుచున్నది. ఈవిధముగ తూర్పువైపు చేలలోని బంగారమువంటి యెరువును తీసుకొనిపోయి, పడమర వైపు లంకతోటలలోనికి తోలుకొనుచున్నారు. ఇండియా గవర్నమెంటువారు సీమదేశములో చేసిన అప్పులపై యేటా యిచ్చుచుండు వడ్డీగాక, కేవలము యింగ్లీషు దొరలవల్ల యేటా యీ దేశమునుండి కొనిపోబడు ద్రవ్యము దాదాపు 8 కోట్లవరకుకూడ వుండునని పెద్దలు లెక్కవేసిరి. ఈరీతిగ, యిండియాదేశమను శరీరమునుండి యేటా కారిపోయే నెత్తురు

కొంచెముగ, నెమ్మదినెమ్మదిగనే, కారిపోవుచుండ వచ్చును. కాని, తుట్టతుదకుమాత్రమిది యిండియా ప్రాణము తీయు ననుట నిశ్చయము. తెలివితేటలచేత, కొత్త కొత్త మందుల చేత, జాగ్రత్తయైన పోషణచేత, మనమెన్నియో విధముల యీ రోగమునకు, యీ రక్తస్రావమునకు, ప్రతిక్రియచేయ యత్నించవచ్చును. ఈ మందులను సదా, తప్పకుండ, వాడుచుపోయిన యెడల, యీ మందులయొక్క గుణములను కూడ మనము కనిపెట్టవచ్చును. కాని, ప్రయోజనమేమి? పోనీ, యీ మందులనైన జాగ్రత్తగ వాడుదమను ప్రయత్న మునైన చేసిన పాపమునపోయిన వారెవ్వరైన యింతవరకు గలరా? యిప్పుడైన నున్నారా? లేరు. భారతదేశప్రజలను, రాజులనుకూడ మనము (యింగ్లీషువారము) గొప్పపన్నుల భారముక్రింద పడవేసి యణచినాము. ఒక నూరేండ్లపాటు అనేకరకములగు ప్రయోగములను చేసి చూచినాము. మనము వేయుపన్నులకు మితమే లేకపోయెను; ఆఖరుకు వారిప్పుడు యెంతకోసినను యిచ్చుకోలేక పోవడమనునదే మనకిప్పుడొక మితముగ యేర్పడినది.

"బ్రిటిష్ సామ్రాజ్యము విధించుపన్ను చాలపెరిగి పోయినది. వీనిని తగ్గించవలెను" అని ఒకప్పుడు వైస్రా యిగనుండిన మింటోప్రభువు స్పష్టముగ వ్రాసెను. 1856 సం॥ లో గవర్నమెంటుచేసిన ఖర్చు 33 కోట్ల చిల్లర. 1870 సం॥ లో 50 కోట్ల చిల్లర. అనగ, 14 యేండ్లలో 17 కోట్ల పై చిలుకు హెచ్చు కర్చయినది. అయితే యీ 14 యేండ్లలో ప్రజలగతి యెట్లుండెను? ప్రజలు అతి నీచమగు దారిద్ర్య

వస్థలో పడి, చావునకు మొగమువాచియున్నారు. కాలమానస్థితి బాగుండి కొంచెము పంటలుపండినప్పుడును, కాలమానస్థితి బాగుండక పంటలుపండకపోయినప్పుడును—రెండు విధములకూడ—రైతుగతి దుర్గతిగనే యుండెను. అతని దారిద్ర్య మాతని వెన్నంటియేయుండెను. దైవిక కారణము లచే పంటలుపాడైనప్పుడు రైతుకు పూర్వరాజ్యములలో నెంతకటువుగనుండెనో, యిప్పుడు నాగరక ప్రభుత్వమని చెప్పుకొను యీయింగ్లీషు రాజ్యములోకూడ అంతకటువుగనే యుండెను. అఖండ సామ్రాజ్యమని చెప్పుకొను యీమహా బ్రిటీష్ సామ్రాజ్యపు రాజధానీనగరమగు కలకత్తా నగరము నకు మున్నూరుమైళ్ల దూరములో ఆరులక్షల జనము తిండికి లేక అన్నమో రామచంద్రాయని యడలుచు చచ్చిపోయి యిప్పటికి అయిదేండ్లయినను కాలేదు.

ఇప్పటి పన్నులలో యింకను సగమెక్కువ జేసినను, గవర్నమెంటు ఖర్చుకు చాలడంలేదు. ఈమధ్యను "ఇన్ కంటాక్సు" అనే వింతపన్నొకటి కొత్తగ విధించారు. యింత అన్యాయమైనది—యింత దురాగతమైనది—యింత మోస కారణమైనది యింకొకపన్ను లేదు. ఇట్టి దురాగతపు పన్ను విధించుటకు ఒడిగట్టినను గవర్నమెంటుఖర్చుకు చాలడంలేదు. ప్రతియేటా లోటువచ్చుచునే యున్నది. ఈ లోటును భర్తీ చేయుటకు యేటా గవర్నమెంటువారు అప్పుచేయుచునే యున్నారు. ఇన్ని పన్నులువేసి, యిన్ని ఋణములుచేసి, గవర్నమెంటువారు యీ సొమ్మునంతను యెందుకుగాను ఖర్చుపెట్టుచున్నారు? ఈ ఖర్చంతయు ముఖ్యముగ సైన్యము

కొరకును, రైళ్లు మున్నగు పబ్లిక్‌వర్క్సు కొరకును అగు చున్నది. శిపాయీల తిరుగుబాటు జరిగినప్పటినుండి యూరోపియను శిపాయిల సంఖ్య శాశ్వతముగ హెచ్చుచేయ బడినది. ధరలు పెరుగుటవలన వారి పోషణకగు ఖర్చుకూడ విపరీతముగ హెచ్చెను. రైల్వే కంపెనీలకు ప్రోత్సాహ మిచ్చుట గవర్నమెంటువారికొక రాజ్యతంత్రమై పోయినది. వ్యవసాయమును ప్రోత్సహించుటకును, సరుకులు సులువుగ సరఫరా చేయుటకును, నీటికాల్వల నెక్కువగ త్రవ్వించుట అవసరమయ్యెను. వీనివల్ల చాలా లాభములున్నవని వేరుగ చెప్పనక్కరలేదు. రైలురోడ్డు వేయుటకయ్యే ఖర్చులో ఆరోవంతుపెడితే కావలసినన్ని నీటికాలువలు త్రవ్వించ వచ్చును. ఈ పని గోదావరి ప్రాంతములలో సులువుగ చేయవచ్చును. ఈ కాల్వలమీద పెట్టినడబ్బు తిరిగి వచ్చు టయేగాక ప్రజల కెన్నివిధములనో సౌఖ్యమొనగూర్చ వీల గును. మొదట అనుకొనినంత విరివిగ ప్రత్తిపంట వ్యాపింప లేదు. "యుద్ధతంత్రము ననుసరించి రైల్వేలు మన స్వాధీనములో నున్నంతవరకే మనకు ఉపయోగకరముగ పరిణమించగలవు. కాని, మనమిప్పుడు రైల్వేలను స్థాపించుట వలన, పూర్వపు రవాణాపద్ధతులు తారుమారై, తగ్గిపోవును. మన యుద్ధపుపనులకు అత్యవసరమైనప్పుడు, తిరిగి దానిని ఒక్కక్షణములో, నిర్మించుకొనుట కష్టసాధ్యమగును" అని యింగ్లీషుసేనాని చెప్పెను. సరే యేదియెట్లున్నను, లోక మంతటికి ఆవిరియంత్రములు పరిపాటియైపోయినవి. వాని నిప్పుడు తీసివేయుటకు సాధ్యపడదు. లోకమందలి వాణిజ్యము,

ప్రయాణము, అన్ని యీ ఆవిరియంత్రములద్వారానే జరుగు చున్నవి. మనము (ఇంగ్లీషువారము) రాజ్యాధికారమున కెగ బ్రాకుటలో భారతదేశపు ప్రాచీనమార్గములను, ప్రాచీనసభ్యతాచిహ్నములను సగము నాశనము చేసినాము. కాబట్టి, యిప్పుడు మనము వారికి కనీసము చేయతగ్గ ఉపకారమొక్క టేవున్నది. యంత్రసాధనవల్ల మనమిప్పుడు పొందుచున్న లాభములలో, వారికికూడ కొంతకలుగునట్లు చూడవలసి యున్నది. ఎంతఖర్చయినను కానీయండి, వారికి, రైళ్లు కాకపోయినను, కనీసము కాల్వలనైనను త్రవ్వించి యివ్వవలెను. తమరాజ్యాధికారములను గోల్పోయి, ఆశాభంగముచే కుంగిపోయి, తరతరములనుండి తమవృత్తులవల్ల సంపాదించుకొనియున్న సమస్త సంపదలను పరదేశస్థులకు ధారవోసి, అతిదీనావస్థయందు పడియున్న ప్రజలు యిట్టి పనులను తమంతతాము పూనుకొని చేసికొనుస్థితిలోలేరు. వారి సాహసోత్సాహములను కుంగదీసి, వారికాళ్లు చేతులను విరుగగొట్టి పడవేసినాము. ఇక వారెట్లు లేవగలరు? వారు లేవవలెనన్నచో, మనము వారి కాళ్లచేతులకు కట్లు కట్టి, చంకలకింద పోటీకర్రలనుపెట్టి లేపినగాని లేవలేరు. ఈపని కొంతవరకు జరిగినదని చెప్పవచ్చును. ఎట్లనగా:— "ధనమును వెచ్చించి యెవరైనా రైళ్లువేస్తే, వారు పెట్టిన డబ్బుమీాద కొంతవరకు వడ్డీగిట్టేటట్లు మేము హామీా పడెద" మని యిండియా గవర్నమెంటువారు వాగ్దానము (గ్యారంటీ) చేసియుండిరి. సరే, యింతవరకు బాగానేవున్నది. కాని, రేపు యేదైన యింకొకపనికి డబ్బు కావలసివస్తే, గవర్న

మెంటువారు యెందులోనుండి ఖర్చుపెడతారు? ఈ ఖర్చంతా తమ సామ్రాజ్యము విచ్ఛిన్నముగాకుండ దానిని భద్రముగ నిలుపుకోడానికి బ్రిటిష్ సామ్రాజ్యమువారు చేయవలసిన ఖర్చేకాబట్టి, దీనిని బ్రిటిష్ సామ్రాజ్యపు కాతాకు ఖర్చు వ్రాయవలసి వుంటుందని "లేయింగ్" అను ఒక ఆయన చెప్పెను. "ఈ ఖర్చు యిండియా యెంతమాత్రము భరించే స్థితిలోలేదు.' మనము యీ భారతదేశపు శక్తుల నన్నిటిని కుంగదీసివేసినాము. శరీరములోని రక్తమంతయు కారిపోయి, దేశము నిర్వీర్యమై, నిరుత్సాహమై పడిపోయియున్నది. అదీగాక, యీ యిండియా దేశమును నిలుపుకొనవలసిన బాధ్యత మన యింగ్లీషువారిమీదనే వున్నది. కాబట్టి, యీ ఖర్చంతా యింగ్లీషువారే— యింగ్లీషు సామ్రాజ్యమువారే— భరించవలసి యుండునని ఆత డెంతయో ధర్మబుద్ధితో వాదించెను. కాని, సీమలోని బ్రిటిష్ సామ్రాజ్యమువారీవాదనను త్రోసివేసిరి. తన వాదనకు విరుద్ధమగు తప్పుపద్ధతిని, ప్రజాపీడాకరమగు పద్ధతిని, తాను తన చేతులమీదుగ సీమ గవర్నమెంటువారి బలాత్కారముమీద అమలు జరుపుటకు యిష్టము లేక ఆతడు తన యుద్యోగమునకు రాజీనామా యిచ్చివేసెను. గవర్నమెంటుకు యేటేటా కలుగుచున్న పెద్ద పెద్ద లోట్లను,— యీ నెరియలను— పూడ్చుటకు తమ తరివా రెన్నియో ఉపాయములను పన్నిరి.

ఆయవ్యయపట్టికను (బడ్జెట్టును) సీమ గవర్నమెంటువారు ఒప్పుకొనలేదు. తనపద్ధతి సరియైనదని ఋజువుచేయుటకుగాను యాతడొకపనిచేసెను. యుద్ధములేనిరోజులలో మామూలు పన్నులతో నెంత ఆదావచ్చునో, అంత ఆదాయమునకు సరిపోయే అత్యవసరపు ఖర్చుపద్దులనుమాత్రమే వేసి, మిగతా వానిని అట్టెయుంచి చూపించెను. ఈ మిగతా పద్దులేమనగ:- ఆఫీసుఖర్చులు, శిపాయిలుండు బారకీచులు, కాలువలు, మున్నగునవి. వీనివల్లనే ప్రతియేటా లోటువచ్చుచున్నదనియు, యీ లోటును పూడ్చుటకే యిండియా గవర్నమెంటువారు ఋణములు చేయవలసివచ్చుచున్నదనియు, లేదా ప్రజలపై విపరీతమగు, పీడాకరములగు పన్నుల విధించవలసివచ్చుచున్నదనియు ఆతడు నిరూపించెను. పెద్దపెద్ద శిపాయీల బారకీచులను శాశ్వతముగ కట్టుటకై వినియోగించిన ద్రవ్యమంతయు బూడిదలోపోసిన పన్నీరుచందమయ్యెనని యిప్పటికందరికి తెలిసివచ్చినది. ద్రవ్యమునంతను యీరీతిగ సంగ్రహించి, యిట్టిదండుగ పనులకై వినియోగించుట యూరోపియను రాజ్యములలోనే నష్టదాయకముగ పరిగణింపబడుచున్నది. అట్టిచో యిండియా విషయమై వేరుగ చెప్పనేల? ఇండియావంటి బీదరాజ్యములో యిట్టిపనులు రాజ్యాంగమునకు మృత్యుసదృశముగ నుండును. ఇట్టిదండుగమారి పనులు ఒక్క బంగాళాదేశములోనేగాక, పశ్చిమోత్తర పరగణాలలో కూడ గావింపబడినవి. ఇవన్నియు అధికారధూర్వహులుగావించిన తప్పు పనులకు నిదర్శనములుగ నేటికిని నిలిచియుండి తేరగ తమ చేతికి వచ్చిన ప్రజల ద్రవ్యమునంతను తమ స్వలా

భములకై యీరీతిగ అధికారధూర్వహులు దుర్వినియోగ పరచియుండిరి గదా యని నేటికిని పన్నులభారముచే కుంగి పోవుచున్న ప్రజల మనస్సులకు తోపజేయుచున్నవి. ఇన్ కంటాక్సు వృద్ధిచేయరాదని ప్రతిఘటించుచు 1870 సం॥ మే నెలలో బొంబాయి వర్తకులొక అర్జిని సీమలోనున్న యిండియామంత్రికి పంపించిరి. దానిలో నిట్లున్నది :—" ఇట్టి పెద్ద కట్టడములను కట్టుటకు కావలసిన ద్రవ్యమునంతను సర్కారు వారు ప్రజలు యేటా యిచ్చు పన్నులలోనుండిగాక, వాయిదాబందీ అప్పులుగ యెక్కడనైనా తెచ్చి కట్టితే, ప్రతి యేటా గవర్నమెంటు బడ్జెటులో యీ లోట్లు వుండవు" అని వారు చెప్పిరి. ఇది చాల సబబుగ వున్నది. కాని, యీ సబబును గవర్నమెంటువారు అంగీకరించలేదు. ఇన్ కంటాక్సుపద్ధతి యెంత అన్యాయముగను, యెంత మోసముగను పని చేయుచున్నదో నానాటికి బయట పడజొచ్చెను. ప్రజలలో బహు సంఖ్యాకుల కీవత్తిడి కలుగనిమాట నిజమే. కాని బహు సంఖ్యాకులను, ప్రజా సామాన్యమందరిని బాధించుటకు ఉప్పుపన్ను వున్నదిగా! సముద్రమునకు దగ్గరగ కాపురమున్నవారో లేక ఉప్పు కొఠారుల దగ్గరగ నున్నవారో తప్ప, యింకెవరును యీ పన్నునుండి తప్పించుకొనలేరు. ఇది ప్రతి మానవునకు కావలసిన వస్తువే. ఇది అక్కరలేని వారెవరువుండరు. సముద్రమునకు దగ్గర కాపురమున్న వారు యీ ఉప్పు పన్ను నుండి తప్పించుకొనుటకై తమ అన్నము సముద్రపు నీటితోనే ఉడకబెట్టుకొందురు! ఉప్పుకొఠారులవద్ద నున్నవారు ఉప్పుపలుకులతో కలిసినమట్టిని తమ

అన్నములో కలుపుకొనుచున్నారు! సర్కారుకు వచ్చే రాబడికి సరిపోయే ఖర్చే చేసికోవలెనని ఆర్గైల్ ప్రభువు 1869 సం॥ లో వైస్రాయి కౌన్సిల్ వారికి గట్టిగ నొక్కిచెప్పెను. మిలిటరీ ఖర్చు తగ్గించవలసివుంటుందని మేయో ప్రభువు కూడ అదేరీతిగ చెప్పెను. ఈ విశాల భారతవర్షమందు శాంతిభద్రతల కాపాడుటకు ప్రధానముగ బాధ్యుడైనట్టి వైస్రాయియగు మేయో ప్రభువు కూడ యేమని చెప్పినాడు? "మన ఖజానాలో డబ్బుకు తొందర లేనప్పుడునైతము అనివార్యమని ఋజువుపరచగలదానికంటె ఒక్కచిల్లి గవ్వయైనను యెక్కువగ మిలిటరీ మీద ఖర్చుచేయుట ధర్మముకాదు. ఏటావచ్చే ఆదాను, ఖర్చుకు యెట్లు సరిపెట్టుదమాయను ఆలోచన ఒక్కటేకాదు మనము చూడవలసినది; మిలిటరీ ఖర్చుతగ్గిస్తే, యీ శిపాయిలందరు యేమై పోతారాయను ఆలోచన ఒక్కటేకాదు మనము చూడవలసినది. ఇట్టి యాలోచన లన్నిటికంటె మహోత్కృష్టమైన ధర్మసూక్ష్మ మిందింకొకటికలదు. అనవసరముగ మిలిటరీమీద ఖర్చుచేసే ప్రతిదమ్మిడీయు, మనము న్యాయముగ ప్రజల నైతిక, ఐహిక, పురోభివృద్ధులకై ఖర్చుచేయవలసిన ద్రవ్యమునుండి తగ్గించివేయుచున్నామనుసంగతిని యెన్నడు మరువరాదు. ఈ స్థితియందున్న దేశములో యింత అపారమగు సేన నేలనిలుపవలెను? పరదేశమునుండి దండయాత్రభయమా లేదు; అథవా ఒకవేళవచ్చినను, యిప్పుడున్న రైల్వేలు, టెలిగ్రాములు మున్నగువాని సహాయమున వానినెదిర్చి మరలించుటకు యిప్పుడున్న సేనలో సగముచాలును.

పోనీ దేశములోనుండియే అపాయము పుట్టుకురావచ్చునని యెందుమూ— యికఅట్లయినచో రాజ్యాధికారము నంతను విదేశీయులు తమగుప్పెళ్ల లోనే బిగించుకొని కూర్చుని దేశీయులగు రాజులను, ఉన్నతవంశీకులను, ప్రముఖులను, వణిక్శిఖామణులను, భూస్వాములను— వీరినందరిని వెలిగానుంచినచో యిది మనసామ్రాజ్యమునకే గొప్ప అపాయముకాదా ? దేశీయులకు గొప్ప అన్యాయముకాదా ? మనరాజ్య తంత్రమందు గొప్ప లోపముకాదా ? దీనివలన మనకు నేడుగాకున్న రేపైనను గొప్ప విపత్తురాదా ? ఈ సంగతుల నన్నిటిని పూర్తిగ ఆలోచించుకొనవలసిన తరుణమిప్పుడు పార్లమెంటువారికి రాలేదా ?

రాజ్యకోశమే యీసమస్యకంతకు ఆయువుపట్టు. దీనినిపార్లమెంటువారు తమ చేతులలోనికి తీసికొని గట్టిగపట్టుకొనినగాని, లాభము లేదు. అట్లయినగాని యిండియాదేశ మభివృద్ధిగాంచుటకు నిరాఘాటమగు మార్గమేర్పడజాలదు. విపరీతపు సైన్య ముంచేనేగాని, దుష్పరిపాలన సాగదు. దుష్పరిపాలన వుంటేనే గాని, విపరీతమగు సైన్యపుఖర్చు వుండదు.

ఉద్యోగాలిచ్చేదికాదు; ఇట్టి పనులుచేయడానికి ఒప్పుకొనేది కాదు; ఇట్టి పనులు చేయడానికి దానికి అవసరముండేదే కాదు. భారతీయుల వృత్తులను నాశనము చేయుటమూలమునను, తదితరవిధములను సీమదొర లిక్కడనుండి దోచుకుపోయి తమ యిండ్లలో సొంత ఉపయోగముకొరకై దాచిపెట్టుకొనియున్న అపారమగు ధనరాసులుగాక, చాలవరకు యూరోపియనుల చేతనే నిండియున్న వల్లమాలిన మిలిటరీ సిబ్బందీల జీతబత్తెములకింద, తిండిఖర్చులకింద, యేటా యీ భారతదేశమునుండి అపారమగు ధనము మంచినీళ్ల ప్రాయముగ కాలువలుగట్టి ప్రవహించిపోవుచున్నది. గత శిపాయీల తిరుగుబాటు అణగిపోయి యిప్పటికి 15 సంవత్సరములైనను యింకను యిండియాను అణచిపెట్టుటకై నిలువ జేసియుంచుకొనిన సైన్యము యిండియాగవర్నమెంటు కిప్పటికిని యేటా 16 కోట్ల రూపాయలఖర్చుకు కారణమగుచున్నది. ఈ ఖర్చు శిపాయిల తిరుగుబాటుకు పూర్వమున్నఖర్చుకంటె జాస్తిగనున్నది. ఇటీవల యీజాస్తిగ చేర్చుకొనబడిన శిపాయీలందరు యూరోపియనులే; వీరిజీతబత్తెములకే, వీరిసాధనసామాగ్రికే యీఅదనపుఖర్చంతయు అగుచున్నది. సైన్యపుఖర్చు తగ్గించవలసినదని చెప్పిన యిండియామంత్రిమాటలను కొంతవరకమలుజరుపుదమను ఉద్దేశముతో యిక్కడ వైస్రాయిగనుండిన మేయోప్రభువు కొంత ప్రయత్నించెను. నేటివు శిపాయీలను 7, 8 వేల మందిని తగ్గింపజూచెను. దీనివలన సాలుకు 64 లక్షల రూపాయలఖర్చు తగ్గునని అంచనావేసెను. కాని, " నేను చేయబూనిన యీ పనికి మిలిటరీ అధికారులు తీవ్రముగ ప్రతి

ఘటింతురేమో " యని ఆతడు భయపడెను. కాబట్టి, " నేబూనిన యీ పనికి సీమగవర్న మెంటువారు నన్ను గట్టిగ మద్దతుచేస్తే నేతప్ప, లేకపోతే, నేనిక్కడ చేసేపని నిష్ఫలమై పోతుంది" అని అతడు సీమఅధికారులకు వ్రాసెను. మొత్తము సైన్యమంతా కలిపి రెండులక్షలుంటే చాలు; వీనిలో మూడోవంతు యూరోపియను లుండవచ్చును. ఈ కొద్ది మార్పునుకూడ యెట్లుచేయవలెనను చర్చతో రెండేండ్లన్నర జరిగెను. దీనివిషయమై జరిగిన రికార్డునంతను పరిశీలించి చూచినయెడల పెద్దపెద్దవారికే లోపల యెంతలేసి అనుమానములు, భయములు వుండెనో స్పష్టముకాగలదు. ఇట్టివానిని గూర్చి యేశాసనసభకూడ నిర్లక్ష్యముగ వదలివేయరాదు. " ఇప్పుడున్న సైన్యమును తగ్గించుటకు యెంతమాత్రము యత్నింపనైనరాదు. ఇదిమనకు భద్రముకాదు " అని లారెన్సు, మాన్సుఫీల్డు, అనువారు తమ నిశ్చితాభిప్రాయముగ తెలియబలికిరి. ఇప్పుడున్న సైనాధ్యక్షుడుకూడ యీ యభిప్రాయముతోనే పూర్తిగ నేకీభవించుచున్నాడు. అతడేమనుచున్నాడు ? "మనకు యిండియాలో గలిగిన యీ వత్తు అనుభవమును బట్టిచూడగ దేశములో యెల్లప్పుడు ప్రశాంతమే ప్రబలియుండునని నమ్మరాదు సుమా ! ఈ విషయమై మనమెల్లప్పుడు అప్రమత్తులమై హెచ్చరికగలిగి యుండవలెను. మనమెన్నడు కలలోకూడ అనుకొనని సమయములందే యెక్కడనుండియో హఠాత్తుగ అల్లకల్లోలములు పుట్టుకొని వచ్చును. ఒక్కచోట యీ అల్లకల్లోలము పుట్టినప్పుడు, దానిని గనుక మనము సకాలములో

అన్నములో కలుపుకొనుచున్నారు! సర్కారుకు వచ్చే రాబడికి సరిపోయే ఖర్చే చేసికోవలెనని ఆర్గైల్ ప్రభువు 1869 సం॥ లో వైస్రాయి కౌన్సిల్ వారికి గట్టిగ నొక్కిచెప్పెను. మిలిటరీ ఖర్చు తగ్గించవలసివుంటుందని మేయో ప్రభువు కూడ అదేరీతిగ చెప్పెను. ఈ విశాల భారతవర్షమందు శాంతిభద్రతల కాపాడుటకు ప్రధానముగ బాధ్యుడైనట్టి వైస్రాయియగు మేయో ప్రభువు కూడ యేమని చెప్పినాడు? "మన ఖజానాలో డబ్బుకు తొందర లేనప్పుడునైతము అనివార్యమని ఋజువుపరచగలదానికంటె ఒక్కచిల్లి గవ్వయైనను యెక్కువగ మిలిటరీ మీద ఖర్చుచేయుట ధర్మముకాదు. ఏటావచ్చే ఆదాయు, ఖర్చుకు యెట్లు సరిపెట్టుదమాయను ఆలోచన ఒక్కటేకాదు మనము చూడవలసినది; మిలిటరీ ఖర్చుతగ్గిస్తే, యీ శిపాయిలందరు యేమై పోతారాయను ఆలోచన ఒక్కటేకాదు మనము చూడవలసినది. ఇట్టి యాలోచన లన్నిటికంటె మహోత్కృష్టమైన ధర్మసూక్ష్మ మిందింకొకటికలదు. అనవసరముగ మిలిటరీమీద ఖర్చుచేసే ప్రతిదమ్మిడీయు, మనము న్యాయముగ ప్రజల నైతిక, ఐహిక, పురోభివృద్ధులకై ఖర్చుచేయవలసిన ద్రవ్యమునుండి తగ్గించివేయుచున్నామను సంగతిని యెన్నడు మరువరాదు. ఈ స్థితియందున్న దేశములో యింత అపారమగు సేన నేలనిలుపవలెను? పరదేశమునుండి దండయాత్రభయమూలేదు; అథవా ఒకవేళవచ్చినను, యిప్పుడున్న రైల్వేలు, టెలిగ్రాములు మున్నగువాని సహాయమున వానిర్చి మరలించుటకు యిప్పుడున్న సేనలో సగముచాలును.

పోనీ దేశములోనుండియే అపాయము పుట్టుకురావచ్చునని యందుమా— యికఅట్లయినచో రాజ్యాధికారము నంతను విదేశీయులు తమగుప్పెళ్లలోనే బిగించుకొని కూర్చుని దేశీయులగు రాజులను, ఉన్నతవంశీకులను, ప్రముఖులను, వణిక్శ్రేష్ఠులను, భూస్వాములను— వీరినందరిని వెలిగానుంచినచో యిది మనసామ్రాజ్యమునకే గొప్ప అపాయముకాదా? దేశీయులకు గొప్ప అన్యాయముకాదా? మనరాజ్యతంత్రమందు గొప్ప లోపముకాదా? దీనివలన మనకు నేడుగాకున్న రేపైనను గొప్ప విపత్తురాదా? ఈ సంగతుల నన్నిటిని పూర్తిగ ఆలోచించుకొనవలసిన తరుణమిప్పుడు పార్లమెంటువారికి రాలేదా?

రాజ్యకోశమే యీసమస్యకంతకు ఆయువుపట్టు. దీనినిపార్లమెంటువారు తమ చేతులలోనికి తీసికొని గట్టిగపట్టుకొనినగాని, లాభములేదు. అట్లయినగాని యిండియాదేశ మభివృద్ధిగాంచుటకు నిరాఘాటమగు మార్గమేర్పడజాలదు. విపరీతపు సైన్యముంటేనేగాని, దుష్పరిపాలన సాగదు. దుష్పరిపాలన వుంటేనేగాని, విపరీతమగు సైన్యపుఖర్చు వుండదు. కుంఫిణీవారు పరరాజ్యాక్రమణకు గడంగినది మొదలు, విపరీతముగ సైన్యముల పెట్టుకొనుచుండిరి; సత్పరిపాలనచేయు రాజ్యాంగమే అయినయెడల, యిట్టి వల్లమాలిన సైన్యము నెన్నడు వుంచుకొనేదేగాదు. ఇంతేగాక, మిలిటరీఖర్చను మిషమీద ప్రతివానికి యేదో పేరుపెట్టి ఉద్యోగా లిచ్చుచుండిరి.

అన్నములో కలుపుకొనుచున్నారు! సర్కారుకు వచ్చే రాబడికి సరిపోయే ఖర్చే చేసికోవలెనని ఆర్గైల్ ప్రభువు 1869 సం॥ లో వైస్రాయి కౌన్సిల్ వారికి గట్టిగ నొక్కిచెప్పెను. మిలిటరీ ఖర్చు తగ్గించవలసివుంటుందని మేయో ప్రభువు కూడ అదేరీతిగ చెప్పెను. ఈ విశాల భారతవర్షమందు శాంతిభద్రతల కాపాడుటకు ప్రధానముగ బాధ్యుడైనట్టి వైస్రాయియగు మేయో ప్రభువు కూడ యేమని చెప్పినాడు? "మన ఖజానాలో డబ్బుకు తొందర లేనప్పుడునైతము అనివార్యమని ఋజువుపరచగలదానికంటె ఒక్కచిల్లిగవ్వయైనను యెక్కువగ మిలిటరీ మీద ఖర్చుచేయుట ధర్మముకాదు. ఏటావచ్చే ఆదాకు, ఖర్చుకు యెట్లు సరిపెట్టుదమాయను ఆలోచన ఒక్కటేకాదు మనము చూడవలసినది; మిలిటరీ ఖర్చుతగ్గిస్తే, యీ శిపాయిలందరు యేమైపోతారాయను ఆలోచన ఒక్కటేకాదు మనము చూడవలసినది. ఇట్టి యాలోచన లన్నిటికంటె మహోత్కృష్టమైన ధర్మసూక్ష్మ మిందింకొకటికలదు. అనవసరముగ మిలిటరీమీద ఖర్చుచేసే ప్రతిదమ్మిడీయు, మనము న్యాయముగ ప్రజల నైతిక, ఐహిక, పురోభివృద్ధులకై ఖర్చుచేయవలసిన ద్రవ్యమునుండి తగ్గించివేయుచున్నామనుసంగతిని యెన్నడు మరువరాదు. ఈ స్థితియందున్న దేశములో యింత అపారమగు సేన నేలనిలుపవలెను? పరదేశమునుండి దండయాత్రభయమూలేదు; అథవా ఒకవేళవచ్చినను, యిప్పుడున్న రైల్వేలు, టెలిగ్రాములు మున్నగువాని సహాయమున వానినెదిర్చి మరలించుటకు యిప్పుడున్న సేనలో సగముచాలును.

ఫ్రాన్సు దేశములోనుండియే అపాయము పుట్టుకురావచ్చునని యందుమూ— యిక అట్లయినచో రాజ్యాధికారము నంతను విదేశీయులు తమగుప్పెళ్లలోనే బిగించుకొని కూర్చుని దేశీయులగు రాజులను, ఉన్నతవంశీకులను, ప్రముఖులను, వణిక్శిఖామణులను, భూస్వాములను— వీరినందరిని వెలిగానుంచినచో యిది మనసామ్రాజ్యమునకే గొప్ప అపాయముకాదా? దేశీయులకు గొప్ప అన్యాయముకాదా? మనరాజ్య తంత్రమందు గొప్ప లోపముకాదా? దీనివలన మనకు నేడుగాకున్న రేపైనను గొప్ప విపత్తురాదా? ఈ సంగతుల నన్నిటిని పూర్తిగ ఆలోచించుకొనవలసిన తరుణమిప్పుడు పార్లమెంటువారికి రాలేదా?

రాజ్యకోశమే యీసమస్యకంతకు ఆయువుపట్టు. దీనిని పార్లమెంటువారు తమ చేతులలోనికి తీసికొని గట్టిగ పట్టుకొనినగాని, లాభము లేదు. అట్లయినగాని యిండియాదేశ మభివృద్ధిగాంచుటకు నిరాఘాటమగు మార్గమేర్పడజాలదు. విపరీతపు సైన్య ముంటేనేగాని, దుష్పరిపాలన సాగదు. దుష్పరిపాలన వుంటేనేగాని, విపరీతమగు సైన్యపుఖర్చు వుండదు. కుంపిణీవారు పరరాజ్యాక్రమణకు గడంగినది మొదలు, విపరీతముగ సైన్యముల పెట్టుకొనుచుండిరి; సత్పరిపాలనచేయు రాజ్యాంగమే అయినయెడల, యిట్టి వల్లమాలిన సైన్యము నెన్నడు వుంచుకొనేదేగాదు. ఇంతేగాక, మిలిటరీఖర్చను మిషమీద ప్రతివానికి యేదో పేరుపెట్టి ఉద్యోగా లిచ్చుచుండిరి. సత్పరిపాలనచేయు రాజ్యాంగమే యైనయెడల యిట్టి తేరబత్తెములను, తేరజీతములను యిచ్చి, అడ్డమైనవాడికి యెన్నడు యిట్టి

ఉద్యోగాలిచ్చేదికాదు; ఇట్టి పనులుచేయడానికి ఒప్పుకొనేది కాదు; ఇట్టి పనులు చేయడానికి దానికి అవసరముండేదే కాదు. భారతీయుల వృత్తులను నాశనము చేయుటమూలమునను, తదితరవిధములను సీమదొరలిక్కడనుండి దోచుకుపోయి తమ యిండ్లలో సొంత ఉపయోగముకొరకై దాచిపెట్టుకొనియున్న అపారమగు ధనరాసులుగాక, చాలవరకు యూరోపియనుల చేతనే నిండియున్న వల్లమాలిన మిలిటరీ సిబ్బందీల జీతబత్తెములక్రింద, తిండిఖర్చులక్రింద, యేటా యీ భారతదేశమునుండి అపారమగు ధనము మంచినీళ్ల ప్రాయముగ కాలువలుగట్టి ప్రవహించిపోవుచున్నది. గత శిపాయీల తిరుగుబాటు అణగిపోయి యిప్పటికి 15 సంవత్సరములైనను యింకను యిండియాను అణచిపెట్టుటకై నిలువ జేసియుంచుకొనిన సైన్యము యిండియాగవర్నమెంటు కిప్పటికిని యేటా 16 కోట్ల రూపాయలఖర్చుకు కారణమగుచున్నది. ఈ ఖర్చు శిపాయిల తిరుగుబాటుకు పూర్వమున్నఖర్చుకంటె జాస్తిగనున్నది. ఇటీవల యీజాస్తిగ చేర్చుకొనబడిన శిపాయీలందరు యూరోపియనులే; వీరిజీతబత్తెములకే, వీరిసాధనసామాగ్రికే యీఅదనపుఖర్చంతయు అగుచున్నది. సైన్యపుఖర్చు తగ్గించవలసినదనిచెప్పిన యిండియామంత్రిమాటలను కొంతవరకమలుజరుపుదమను ఉద్దేశముతో యిక్కడ వైస్రాయిగనుండిన మేయోప్రభువు కొంత ప్రయత్నించెను. నేటివు శిపాయీలను 7, 8 వేల మందిని తగ్గింపజూచెను. దీనివలన సాలుకు 64 లక్షల రూపాయలఖర్చు తగ్గునని అంచనావేసెను. కాని, "నేను చేయబూనిన యీ పనికి మిలిటరీ అధికారులు తీవ్రముగ ప్రతి

ఘటింతురేమో" యని ఆతడు భయపడెను. కాబట్టి, "నేబూనిన యీ పనికి సీమగవర్నమెంటువారు నన్ను గట్టిగ మద్దతుచేస్తే నేతప్ప, లేకపోతే, నేనిక్కడ చేసేపని నిష్ఫలమై పోతుంది" అని అతడు సీమఅధికారులకు వ్రాసెను. మొత్తము సైన్యమంతా కలిపి రెండులక్షలుంటే చాలు; వీనిలో మూడోవంతు యూరోపియను లుండవచ్చును. ఈ కొద్ది మార్పునుకూడ యెట్లుచేయవలెనను చర్చతో రెండేండ్లన్నర జరిగెను. దీనివిషయమై జరిగిన రికార్డునంతను పరిశీలించి చూచినయెడల పెద్దపెద్దవారికే లోపల యెంతలేసి అనుమానములు, భయములు వుండెనో స్పష్టముకాగలదు. ఇట్టివానిని గూర్చి యేశాసనసభకూడ నిర్లక్ష్యముగ వదలివేయరాదు. "ఇప్పుడున్న సైన్యమును తగ్గించుటకు యెంతమాత్రము యత్నింపనైనరాదు. ఇదిమనకు భద్రముకాదు" అని లారెన్సు, మార్కున్నుఫీల్డు, అనువారు తమ నిశ్చితాభిప్రాయముగ తెలియబలికిరి. ఇప్పుడున్న సైనాధ్యక్షుడుకూడ యీ యభిప్రాయముతోనే పూర్తిగ నేకీభవించుచున్నాడు. అతడేమనుచున్నాడు ? "మనకు యిండియాలో గలిగిన యీ వత్తు అనుభవమును బట్టిచూడగ దేశములో యెల్లప్పుడు ప్రశాంతమే ప్రబలియుండునని నమ్మరాదు సుమా ! ఈ విషయమై మనమెల్లప్పుడు అప్రమత్తులమై హెచ్చరికగలిగి యుండవలెను. మనమెన్నడు కలలోకూడ అనుకొనని సమయములందే యెక్కడనుండియో హఠాత్తుగ అల్లకల్లోలములు పుట్టుకొని వచ్చును. ఒక్కచోట యీ అల్లకల్లోలము పుట్టినప్పుడు, దానిని గనుక మనము సకాలములో

అణచి వేయకపోతిమా, అది దేశమంతట క్షణములో వ్యాపించును; ప్రతిచోట యిట్టి గల్లంతులే బయలు దేరును. దేశీయరాజులందరు యెవరిమట్టుకు వారు మనతో స్నేహముగనే యుండవచ్చును. కాని వారి క్రింద నున్న అపారమగు సేనలను మాత్రము మనమెన్నడు నమ్మరాదు. అవి మనకు వ్యతిరేకముగపోయి, మనశత్రువులతో చేరవు—అని మనము గట్టిగ నమ్ముటకు వీలులేదు." ఇక ముందు యిండియాలో యేయే ప్రదేశములలో గల్లంతులు, ఘర్షణలు రావచ్చునో కూడ యీతడు పూసగ్రుచ్చినట్లు వివరించి యున్నాడు. అందు ముఖ్యముగ, 1857 సంవత్సరపు శిపాయి తిరుగుబాటు రోజులలో యింగ్లీషువారికి విశ్వాసపాత్రములుగ నుండిన పెద్ద పెద్ద దేశీయరాజ్యములే తుదకు యింగ్లీషువారిపై తిరుగబడును సుమాయని యీ సైన్యాధ్యక్షుడు నిర్మొగమోటముగ దాపరికమేమియు లేకుండ చెప్పివేసెను. నిస్సంతులైపోయిన రాజ్యములను తమలో కలుపుకోవచ్చునని కొందరును, కలుపుకోకుండా దత్తతాధికారమువల్ల ఆయా రాజ్యముల స్థానిక స్వాతంత్ర్యముల నిలుప వచ్చునని మరికొందరును హోరాహోరి ముప్పదేండ్లు వాగ్వాదనల గావించుకొనియుండిరి. కాని, యీ ముప్పదేండ్ల వాగ్వాదనలలో యీ విషయమై తత్రదాజ్య ప్రజల యభీష్టము లెట్లుండెనని వారితో కించిత్తయినను సంప్రతించిన పాపమున పోయిన వాడొకడైనను కానరాడు! వారి భావములను గూర్చి సర్ చార్లెస్ మెట్‌కాఫ్, ఫెరెర్, సదర్ లెండు— మున్నగువారు అప్పుడప్పుడు యేదో మాటవరుసకు అనుచుండెడివారు. "ప్రజలభావము లిందు

విషయమై మనకు వ్యతిరేకముగనే వుంటవి. వానివల్ల మనకు అపాయముకూడవస్తే రావచ్చును ''అని సర్ క్లాడ్ వేడ్ మున్నగు వారు అప్పుడప్పుడు బెదురు బెదురుగ మాట్లాడుచుండిరి. వీరందరు కల్మషరహితమగు దూరదృష్టి, ధర్మచింతగలవారు ; రాజ్యపరిపాలన యెక్కువ న్యాయమార్గముల, యెక్కువ వివేక బుద్ధితో జరుగవలెనని కోరువారు. కాని, అట్టికోర్కె వీరి కొక్కరికి వున్నందువలన ప్రయోజనమేమి ? వీరి పై యధి కారుల కందరికి తద్విరుద్ధమగు అభిప్రాయము లున్నప్పుడు పాపము వీరేమిచేయగలరు ? ఇట్టి విరుద్ధాభిప్రాయములు తమ పైయుద్యోగస్థులలోనేగాక, తమ చుట్టునున్న తమ తోడియుద్యోగస్థులందరిలోకూడ, విరివిగ దట్టముగ, ప్రబలి యున్నప్పుడు, వీరి ధర్మోపదేశముల నచట పాటించువాడెవడు? అందుచే వీరు యిట్టి వాతావరణమధ్యమందు తమ నోరువిప్పి గట్టిగ మాట్లాడుట నిష్ప్రయోజనమనిచెప్పి, తమ సుభాషిత ములనెల్ల తమ భావములందే జీర్ణముజేసికొని యూరుకొనవల సిన వారగుచుండిరి. తాము నోరువిప్పి యిట్టి ధర్మవాక్య ముల బలుక నారంభించినయెడల తక్కిన వారందరు "యివన్ని వెర్రివెంగళప్ప వేదాంతా'' లనిచెప్పి నవ్వి పరిహాసము చేయుదు రనియు, " యివన్నియు క్షుద్రమగు హృదయదౌర్బల్యముచే చెప్పే విపరీతప్రలాపము '' లని నిందింతురనియు భయపడి, పాపము వీరందరు నోరుమూసికొని కూర్చుండెడివారు.

తన జాతిగౌరవమునకు కళంకము రాకుండ కాపాడుకొనవలసి యున్నది. పరస్పర విరుద్ధములగు నిట్టి రెండుధర్మములనందున యిరకటములో పడికొట్టుకొను వానిగతి యెట్లుండును ? అదిగాక, యీ అధర్మమార్గములనుండి తన పై యధికారులను తాను మరలింపలేకపోగా, పై పెచ్చు, యీ అధర్మకార్యమును వారు తనచేతనే నిర్బంధించి చేయింతురేమోయనికూడ భయముకలుగును. ఒకవేళ తానిట్టి అధర్మకార్యము చేయనని తిరస్కరించి, ఆ యుద్యోగమునుండి తాను వెళ్ళిపోయినను తనస్థానమందింకొకడు— పాపభీతి యెంతమాత్రములేని మరి యొకడు—వచ్చి కూర్చుని ఆ అధర్మకార్యము నెట్లయినను సాగించితీరునుకదా ! ఇక తాను బయటపడి ప్రయోజనమేమి ? కాబట్టి, యిట్టిసందర్భములలో ధర్మచింత, న్యాయబుద్ధిగలవారు కొందరు తమ మనస్సులలోనున్న దుఃఖమును, కోపమును,— ఆంతరంగికముగ మాట్లాడుకొనునప్పుడు తమమనస్సులలోనుండి పొంగి పొరలివచ్చు దుఃఖమును, కోపమును— లిఖితపూర్వకముగ గవర్నమెంటు రికార్డులలో వ్రాసిపెట్టియుండకపోయినచో అది వారి తప్పుకాదు. దానికి వారిని మనము నిందించవలసిన పనిలేదు. పై యధికారులకు తమ యభిప్రాయమే సిద్ధాంతముగద. ఈ రీతిగ తన మాటయే వేదవాక్యమను నహంభావముతో కూర్చున్న పై యధికారులకు క్రిందియధికారి ధర్మోపదేశము చేయజూచుట కేవలము నిష్ప్రయోజనముగద. నిష్ప్రయోజనమేగాదు, అంతకంటె చేటుకూడ కలుగవచ్చును. అదిగాక, తనను తక్కినవారందరు వట్టి నిరర్థకునిక్రింద—వట్టి వెర్రి వెంగళప్పక్రింద—కట్టివేయకుండ

కొంచెము గౌరవముతో చూచుచుండినట్లు చేసికొన్ననే గాని —తన ఆత్మగౌరవము కొంచెము నిలుపుకొన్ననే గాని— తన మాటనైనను తక్కినవారు పాటింపరుగద; కర్తవ్యమింకను నిర్ణయింపబడక, త్రాసు యింకను అటుయిటు ఊగులాడుచున్నప్పుడు, ధర్మమువైపు తనమాటయొక్క బరువును వేసి, కార్యనిశ్చయమును ధర్మమార్గమున చేయించుటకు అప్పుడుగద తనకు అవకాశముండును. కనికరముచేగాని, దూరదృష్టిగల రాజనీతిచేగాని, తన మనస్సునం దెప్పటికప్పుడు తరంగములవలె నుద్భవించుచుండు సుహృద్భావముల నెల్ల గుటుక్కున మ్రింగివేయవలసినదేగాని, పైకి చెప్పుటకు వీలు లేదుగద. అట్టిభావములను తెగించి పైకిచెప్పినచో, పై అధికారులందరు "వీడా, మనకు ధర్మోపదేశము చేయునది" అను నహంకారముతో మండిపడుచు, "ఛీ, అపశకునపుపక్షీ! ఎవడవురానీవు, ముందెప్పుడో ఏదోఅపాయం వస్తుందనే అపశకునపు మాటలుచెప్పి, మమ్ముల నిప్పుడే వేధించవచ్చావా? పోపో; ఇట్టికుశ్శంకలు, అనుమానములు తలచుకొని యిప్పుడే యేడవడం యెందుకు? అంతగావస్తే అప్పుడేచూచుకొందాములే; అసలు వస్తయ్యో రావో! వానికోసం ముందుగా యిప్పుడే అఘోరించడం యెందుకు?— పోపో" అని విసరి కొట్టుదురు. ఈ చీవాట్లు పడవలసివస్తుందనే భయముచేత పాపము, యోగ్యులగు అనేక మంది ఆంగ్లేయోద్యోగులు విసుగుదలచే తమ హృదయములోని భావములను, లోలోననే అణచిపెట్టుకోవలసి వచ్చెను. "ఇట్టి సంకటస్థితియందు నోరు మూసికొని యూరకుండుటయు ధర్మముగ కనిపించదు.

అణచి వేయకపోతిమా, అది దేశమంతట క్షణములో వ్యాపించును ; ప్రతిచోట యిట్టి గల్లంతులే బయలు దేరును. దేశీయరాజులందరు యెవరిమట్టుకు వారు మనతో స్నేహముగనే యుండవచ్చును. కాని వారి క్రింద నున్న అపారమగు సేనలను మాత్రము మనమెన్నడు నమ్మరాదు. అవి మనకు వ్యతిరేకముగపోయి, మనశత్రువులతో చేరవు—అని మనము గట్టిగ నమ్ముటకు వీలులేదు." ఇక ముందు యిండియాలో యేయే ప్రదేశములలో గల్లంతులు, ఘర్షణలు రావచ్చునో కూడ యీతడు పూసగ్రుచ్చినట్లు వివరించి యున్నాడు. అందు ముఖ్యముగ, 1857 సంవత్సరపు శిపాయి తిరుగుబాటు రోజులలో యింగ్లీషువారికి విశ్వాస పాత్రములుగ నుండిన పెద్ద పెద్ద దేశీయరాజ్యములే తుదకు యింగ్లీషువారిపై తిరుగబడును సుమాయని యీ సైన్యాధ్యక్షుడు నిర్మొగమోటముగ దాపరికమేమియు లేకుండ చెప్పివేసెను. నిస్సంతులైపోయిన రాజ్యములను తమలో కలుపుకోవచ్చునని కొందరును, కలుపుకోకుండా దత్తతాధికారమువల్ల ఆయా రాజ్యముల స్థానిక స్వాతంత్ర్యముల నిలుప వచ్చునని మరికొందరును హోరాహోరి ముప్పదేండ్లు వాగ్వాదనల గావించుకొనియుండిరి. కాని, యీ ముప్పదేండ్ల వాగ్వాదనలలో యీ విషయమై తత్తద్రాజ్య ప్రజల యభీష్టము లెట్లుండెనని వారితో కించిత్తయినను సంప్రతించిన పాపమున పోయిన వాడొకడైనను కానరాడు ! వారి భావములను గూర్చి సర్ చార్లెస్ మెట్‌కాఫ్, ఫెర్రి, సదర్ లెండు— మున్నగువారు అప్పుడప్పుడు యేదో మాటవరుసకు అనుచుండెడివారు. "ప్రజలభావము లిందు

విషయమై మనకు వ్యతిరేకముగనే వుంటవి. వానివల్ల మనకు అపాయముకూడవస్తే రాచ్చును "అని సర్ క్లాడ్ వేడ్ మున్నగు వారు అప్పుడప్పుడు బెదురు బెదురుగ మాట్లాడుచుండిరి. వీరందరు కల్మషరహితమగు దూరదృష్టి, ధర్మచింతగలవారు ; రాజ్యపరిపాలన యొక్కవ న్యాయమార్గముల, యొక్కవ వివేక బుద్ధితో జరుగవలెనని కోరువారు. కాని, అట్టికోర్కె వీరి కొక్కరికి వున్నందువలన ప్రయోజనమేమి ? వీరి పై యధి కారుల కందరికి తద్విరుద్ధమగు అభిప్రాయము లున్నప్పుడు పాపము వీరేమిచేయగలరు ? ఇట్టి విరుద్ధాభిప్రాయములు తమ పై యుద్యోగస్తులలోనేగాక, తమ చుట్టువున్న తమ తోడియుద్యోగస్తులందరిలోకూడ, విరివిగ దట్టముగ, ప్రబలి యున్నప్పుడు, వీరి ధర్మోపదేశముల నచట పాటించువాడెవడు? అందుచే వీరు యిట్టి వాతావరణమధ్యమందు తమ నోరువిప్పి గట్టిగ మాట్లాడుట నిష్ప్రయోజనమనిచెప్పి, తమ సుభాషిత ములనెల్ల తమ భావములందే జీర్ణము జేసికొని యూరుకొనవల సిన వారగుచుండిరి. తాము నోరువిప్పి యిట్టి ధర్మవాక్య ముల బలుక నారంభించినయెడల తక్కిన వారందరు "యివన్ని వెర్రివెంగళప్ప వేదాంతా" లనిచెప్పి నవ్వి పరిహాసము చేయుదు రనియు, "యివన్నియు క్షుద్రమగు హృదయదౌర్బల్యముచే చెప్పే విపరీతప్రలాపము" లని నిందింతురనియు భయపడి, పాపము వీరందరు నోరుమూసికొని కూర్చుండెడివారు. నిజా యితీ బుద్ధిగలవాడు, ధర్మచింతగలవాడు, యిట్టి సంకటస్థితిలో నుండుట బహుకష్టము. ఇటు ఒకవంక దుర్బలులగు వారికి బాధకలుగకుండ వారింపవలసియున్నది. అటు యింకొకవంక

తన జాతిగౌరవమునకు కళంకమురాకుండ కాపాడుకొనవలసి యున్నది. పరస్పర విరుద్ధములగు నిట్టి రెండుధర్మములసందున యిరకటములో పడికొట్టుకొను వానిగతి యెట్లుండును ? అది గాక, యీ అధర్మమార్గములనుండి తన పై యధికారులను తాను మరలింపలేకపోగా, పై పెచ్చు, యీ అధర్మకార్యమును వారు తనచేతనే నిర్బంధించి చేయింతురేమోయనికూడ భయముకలుగును. ఒకవేళ తానిట్టి అధర్మకార్యము చేయనని తిరస్కరించి, ఆ యుద్యోగమునుండి తాను వెళ్ళిపోయినను తనస్థానమందింకొకడు— పాపభీతి యెంతమాత్రములేని మరి యొకడు—వచ్చి కూర్చుని ఆ అధర్మకార్యము నెట్లయినను సాగించితీరునుకదా ! ఇక తాను బయటపడి ప్రయోజనమేమి ? కాబట్టి, యిట్టిసందర్భములలో ధర్మచింత, న్యాయబుద్ధిగలవారు కొందరు తమ మనస్సులలోనున్న దుఃఖమును, కోపమును,— ఆంతరంగికముగ మాట్లాడుకొనునప్పుడు తమమనస్సులలోనుండి పొంగి పొరలివచ్చు దుఃఖమును, కోపమును— లిఖితపూర్వకముగ గవర్నమెంటు రికార్డులలో వ్రాసిపెట్టియుండకపోయినచో అది వారి తప్పుకాదు. దానికి వారిని మనము నిందించవలసిన పనిలేదు. పై యధికారులకు తమ యభిప్రాయమే సిద్ధాంతముగద. ఈ రీతిగ తన మాటయే వేదవాక్యమను నహంభావముతో కూర్చున్న పై యధికారులకు క్రిందియధికారి ధర్మోపదేశము చేయజూచుట కేవలము నిష్ప్రయోజనముగద. నిష్ప్రయోజనమేగాదు, అంతకంటె చేటుకూడ కలుగవచ్చును. అదిగాక, తనను తక్కినవారందరు వట్టి నిరర్థకునికింద—వట్టి వెర్రి వెంగళప్పకింద—కట్టివేయ కుండ

కొంచెము గౌరవముతో చూచుచుండినట్లు చేసికొన్ననే గాని —తన ఆత్మగౌరవము కొంచెము నిలుపుకొన్ననే గాని— తన మాటనైనను తక్కినవారు పాటింపరుగద; కర్తవ్య మింకను నిర్ణయింపబడక, త్రాసు యింకను అటుయిటు ఊగులాడుచున్నప్పుడు, ధర్మమువైపు తనమాటయొక్క బరువును వేసి, కార్యనిశ్చయమును ధర్మమార్గమున చేయించుటకు అప్పుడుగద తనకు అవకాశముండును. కనికరముచేగాని, దూరదృష్టిగల రాజనీతిచేగాని, తన మనస్సునం దెప్పటికప్పుడు తరంగములవలె నుద్భవించుచుండు సుహృద్భావముల నెల్ల గుటుక్కున మ్రింగివేయవలసినదేగాని, పైకి చెప్పుటకు వీలు లేదుగద. అట్టిభావములను తెగించి పైకిచెప్పినచో, పై అధికారులందరు "వీడా, మనకు ధర్మోపదేశము చేయునది" అను నహంకారముతో మండిపడుచు, "ఛీ, అపశకునపుపక్షీ! ఎవడవురానీవు, ముందెప్పుడో ఏదోఅపాయం వస్తుందనే అపశకునపు మాటలుచెప్పి, మమ్ముల నిప్పుడే వేధించవచ్చావా? పోపో; ఇట్టికుశ్శంకలు, అనుమానములు తలచుకొని యిప్పుడే యేడవడం యెందుకు? అంతగావస్తే అప్పుడేచూచుకొందాములే; అసలు వస్తయ్యో రావో! వాటికోసం ముందుగా యిప్పుడే అఘోరించడం యెందుకు?— పోపో" అని విసరికొట్టుదురు. ఈ చీవాట్లు పడవలసివస్తుందనే భయముచేత పాపము, యోగ్యులగు అనేక మంది ఆంగ్లేయోద్యోగులు విసుగుదలచే తమ హృదయములోని భావములను, లోలోననే అణచిపెట్టుకోవలసి వచ్చెను. "ఇట్టి సంకటస్థితియందు నోరు మూసికొని యూరకుండుటయు ధర్మముగ కనిపించదు.

అట్లూరకొనుట పిరికితనమును, స్వార్థబుద్ధిని చూపించునుగద; ఊరకొనక చేయునదియు కనిపించలేదు. ఎట్టి ధర్మసంకటము నుండి తప్పించుకొనుట? ఆదాయమును మించి చేయు ఖర్చులకై ప్రజలను పీడించి లాగు విపరీతపు ఆర్థిక దుర్వినీతివలనను, అక్రమపు పరరాజ్యాక్రమణలవలనను, భారతదేశమందు నిత్యము తన కండ్లయెదుట జరుగుచున్న దుర్భర దుష్ఫలితములిట్టి ధర్మచింతగల ఆంగ్లేయోద్యోగుల నాలుకలపైనను, లేఖినుల పైనను పగటివేళ బహుభారముగ తాండవమాడుచుండును; రాత్రివేళనవి పాప మా ధర్మాత్ములకు నిద్రపట్టనీయక మనస్సులలో కలచి వేధించుచుండును.

సంతృప్తి, విశ్వాసము, కృతజ్ఞత మున్నగు సద్బీజములనాట తానుత్సహించిన యీ భారతక్షేత్రమందు తనకండ్లయెదుటనే అవిశ్వాసము, క్రోధము, అసహ్యము, మున్నగు విషవృక్షము లుద్భవించి, దీనికంతకు కారకులైన వారిపై కసితీర్చుకొనురోజు యెప్పుడువచ్చునాయను తీవ్రరోషముతో లోలోన కుములుచు మహామౌనదీక్షతో "ఆదినము"నకై నిరీక్షించుచున్నట్లు కానవచ్చుచుండెను. ఆ యుద్యోగస్తుడు నిజమైన ధర్మచింతగలవాడేయైనయెడల, — తనజాతిగౌరవమును, తన ధర్మగౌరవమును, తన దేశగౌరవమును, నిశ్చయముగ పాటించువాడేయైనయెడల— వానికిగలుగు దుఃఖములలోనికెల్ల దుఃఖమేమి? తానెంతపొర్లాడినను, తన యభీష్టమునకింత విరుద్ధముగ తాను తన చేతిమీదుగనే యీ విషబీజముల వెదజల్లవలసివచ్చెగా; మంచివిత్తనములుచల్లుభాగ్య మీచేతులకబ్బలేదుగా—హా— " అని యెంతో దుఃఖించును.

అపహృతస్వరాజ్యులై, తమ సర్వస్వమునుగోల్పోయిన కోట్లకొలది ప్రజలదృష్టికీ రాజ్యాపహారణకార్య మెట్లుగాన్పించెనో యను విషయమునుగూర్చి ఆ వివాదపురోజులలో యెవరుకూడ నోరెత్తి ప్రసంగింపకుండుటకు కొంతవరకు పైనుదహరించిన యసందర్భస్థితియే కారణమని చెప్పవచ్చును. యిండియాలోని రాజ్యాక్రమణాలను గూర్చి సీమలో స్వతంత్రరీతిగ వ్రాసిన విమర్శకులును,నీతిశాస్త్రజ్ఞులునుకూడ యిక్కడ యిండియాలోనున్న ధర్మాత్ములగు తమతోడిదేశీయులుపడిన యవస్థలోనే పడవలసినవారైరి. దత్తతాధికారము నిలుపవలసినదేయని చెప్పు మిక్కిలి సమర్థనీయమగు వాదములెన్నియో బయలుదేరెను.అట్లేదత్తతాధికారమును అంగీకరించరాదనిచెప్పు మిక్కిలి సూక్ష్మమగువాదములును బయలుదేరెను. ఈ వివాదములన్నియు సార్వభౌమసామంతాధికారముల తారతమ్యముపైననే తిరుగుచుండెను. "ఏమైననూసరే బ్రిటిష్‌సామ్రాజ్యాధికారమును నిలువబెట్టి దానిని వ్యాప్తినొందించుటయే పరమ ఆదర్శ" మని ఒక పక్షమువారు గట్టిగ వాదింపజొచ్చిరి. వారుచెప్పు ప్రతి వాదనను యీ యభిప్రాయమును దోహదమొనర్చుకొనుటకె వినియోగించుచుండిరి. అట్లే యింకొక పక్షమువారు, "యేమైననుసరే, దేశీయప్రభువులగు హిందూ రాజులకును, మహమ్మదీయ నబాబులకును అన్యాయము, అక్రమము, కష్టము, కలిగింపరా" దని గట్టిగ వాదింపజొచ్చిరి. వీరుకూడ తమ ప్రతి వాదనను యీ యభిప్రాయమును దోహద మొనర్చుకొనుటకే వినియోగించుచుండిరి. కాని, పరులచే సర్వస్వమును కొల్లగొట్టబడి, దోపిడిగాని కాలిచప్పు

డింకను యేక్షణమందు తన చెవిని బడునోయను భయోత్పా తముచే గడగడ వణకుచు ఒంటరిగ తమ యంతఃపురములలో నణగియున్న దౌర్భాగ్యులగు దేశీయరాజులకు వారి రాజ్యము లను వారికి యిచ్చివేయవలసినదని సామ్రాజ్యాధికారులకు ధర్మోపదేశములు చేయబూనుట కేవలము నిరర్థక కార్యము గద. ప్రఖ్యాత విజేతలగు సైరస్, సిపియోల కాలమునాటి నుండి నేటివరకు కూడ ప్రపంచములో జరిగిన విజయచారిత్ర ములందు చేలోకువగు రాజుల కోటలలోనికి సరాసరి చొర బడకుండ, తేరగ తెరచియున్న వారికోటగుమ్మములకడనే గుర్రపుకళ్ళెముల లాగిపట్టి, అట్టె నిలువబడిపోయిన విజేత లను గూర్చి మనమెన్నడైన వినియున్నామా? కవ్వించి పదులపై నురుకువానితో, "జాగ్రత, మధ్య దొంగఊబులు, గోతులు వున్నవి" సుమాయని చెప్పుము! "జాగ్రత, మధ్య త్రోవలో తుపాకిమందు పాతరలు ప్రేలుటకు సిద్ధముగనున్నవి సుమా" యని చెప్పుము. "తనజన్మలో యెన్నడు, యెవరికినీ స్వాధీనము కానేరని ఏరవంశీకులనేకులు నీపై కసితీర్చుకొనుట కెంతో ఆవేశముతో శపథము పట్టియున్నారుసుమా, జాగ్రత్త" అనిచెప్పుము. "జాగ్రత, ముందుకు ఉరుకుచున్నావు; మరల వెనుకకు పారిపోయి రావలసివచ్చునుసుమా; అప్పుడు నీ వనేక మంచుగుట్టలను దాటవలసివచ్చును; దాహమార్చు కొనుటకు నీ కొక్క నీటిచుక్కయైనను దొరకదు. మధ్య త్రోవలోని బావులలో నీ శత్రువులు విషము కలుపుదురు సుమా! మార్గము లన్నిటికి గండ్లు, ముండ్లకంచెలు కొట్టు చురుసుమా! నీ విప్పు డింత నిర్దాక్షిణ్యముగ శత్రువుపై నురక

వలదు. ఇది కేవలము అవ్యక్తమైనపని—అవివేకమైనపని. దాని వలన నీ కనేక అపాయములు రానున్నవిసుమా" అని అతనితో చెప్పాము. నీకు శత్రువులగు దేశీయరాజులు నీ కిన్ని యిబ్బందులు కలిగించినంత మాత్రమున ఆఖరుకు యెట్లును నిన్ను తప్పించుకొని బ్రతుకలేరనుకో— బ్రతుకలేని మాట నిశ్చయమే. అయిననేమి.? కొంతకాలము తాము ఊపిరి పుచ్చుకొని, నిన్నిబ్బంది పెట్టవచ్చునుగా! భారతరాజ్య సంపాద నోదంతమంతయు యిట్టి హెచ్చరికలతోడనే— జాగ్రత, జాగ్రత, యను హెచ్చరికలతోడనే—నిండియుండెను. కాని, వీని నెవరును లక్ష్యముచేయలేదు. దేశీయరాజులు మనయందెంత భక్తి విశ్వాసములతోనున్నను వారి బ్రతుకు—వారి రాజ్యము— అస్థిరమే అయిపోయెను. "బ్రిటిష్ సామ్రాజ్యము వారిని మనసారనమ్మి "వారియెడ మనమింతటి భక్తి విశ్వాసములతో నున్నాముగద, ఇక మన కేమిభయము; మన రాజ్యమున కేమిభయము" అనుగట్టినమ్మకముతో, నిశ్చింతతో హాయిగ యేరాజును బ్రతుకుటకు వీలు లేకపోయెగద! సార్వభౌమాధికారులై వెలసియున్న యీ అఖండ బ్రిటిష్ సామ్రాజ్యమును యీ చిల్లర రాజులేమి ధిక్కరింపగలరను మన నిశ్చయముకూడ వారిబ్రతుకును స్థిరపరుపలేక పోయెను. (వీరింతటి దుర్బలులుగద, వీరు మననేమిచేయగలరు? వీరిని అనవసరముగ చంపనేలయనియైన బ్రిటీషువారు ఊరుకొనలేదు.) సింధియా, నైజాము, అయోధ్యరాజులు నలుబది సంవత్సరము లవిచ్ఛిన్నధారగ మన బ్రిటిష్ రాజ్యమునెడ నిష్కలంకమగు భక్తివిశ్వాసముల నెరపిరి. ఈ నలుబది

సంవత్సరముల పొడవునను మన బ్రిటిష్ గవర్నమెంటువారు వీరిని "మీరు యింద్రులు, చంద్రులు, మీ అంతటి మిత్రులు మాకీలోకములో లేరు,ఒహో"యని ముఖస్తోత్రములు చేయుచు, లాలించుచు, ఉబ్బవేయుచు, యెక్కడలేని గౌర వాధిక్యతలను వెళ్ళబోయుచుండిరి. ఇంతచేసియు, చివరికి రాజులగతి యేమైనది? మొట్టమొదటివాడగు సింధియా రాజ్యాన్ని పూర్తిగ కలుపుకొన్నారు. రెండవవాడగు నైజాము రాజ్యాన్ని పగులగొట్టి పంచుకొన్నారు. మూడవవాడగు అయోధ్యరాజును — యింకా యీరకంలోచేరిన రాజులను— యేమిచేద్దామా— యీ రాజ్యములను యెట్లా కాజేద్దామా— అని ఆలోచించుచున్నారు. "మనకు మధ్య అడ్డముగనున్న యీ దిక్కుమాలిన దేశీయుల పూర్వాచారములను, వారసత్వపుహక్కులను, ఒక్కపెట్టున తుడిచిపెట్టి, వీరిరాజ్యముల నన్నిటిని ఒక్కముద్దగజేసి గుటుక్కున మ్రింగడమా, మ్రింగకపోవడమా" అని యింగ్లీషు గవర్నమెంటు వారిప్పు డతిదీర్ఘముగ ఆలోచించుచున్నారు. సరిగ యిదేసమయమందు "వాహాబీ" అను నొకానొక మహమ్మదీయ తెగవారి కుట్రలవల్ల జరిగిన విషాదసంభవముల గూర్చిన వార్తలు సీమకు చేరెను. ఎవరోకొందరు రాజద్రోహులు బయలుదేరి యీ మహమ్మదీయుల నీరీతిగ ప్రేరేపించిరని చాలమంది యనుకొనిరి, కాని, యీ యూహా నిజముకాదనియు, యీ వాహాబీల కుట్రకు మన యింగ్లీషువారి దుష్పరిపాలనయే కారణమనియు, అది అసలు యెక్కడ, యెట్లుపుట్టినదో, దేశము నలుగడల యిది యెట్లువ్యాపించెనో,

యావద్వృత్తాంతమును దీనిని బాగుగ పరిశీలించిన డాక్టరు హంటరుగారు వ్రాసగుప్పిచ్చినట్లు వివరించి మనకు చెప్పు చున్నారు. వీరిమాటలు చాల అతిశయోక్తిగ నున్నవనియు, వీరి యూహలు చాల నిరాధారముగ నున్నవనియు చాల మంది పెద్దలు, భాగ్యవంతులు,—యిట్టి ప్రజాకల్లోలము వల్ల నష్టపడువారేగాని, బాగుపడువారు కానట్టి పెద్దలు, భాగ్యవంతులు— తలంచుచున్నారు.

ఈ కాలపు మహమ్మదీయులనుగూర్చి కర్నల్‌లీస్ అను నాతడిట్లు చెప్పుచున్నాడు :— "ఈ బ్రిటిష్ రాజ్యాధికారము చెడ్డదే. అయినను యిది తోసివేసినను పోదు కాబట్టి, దీని నిక విధిలేక భరింతము. మరి, ఏమిచేయుదము అను భావములోనున్నారు. తమ్మును మనబ్రిటిషు గవర్నమెంటు వారు గనుక ఉచితరీతిని చూచుచు, బుద్ధిమంతముగ, చక్కగ పరిపాలిస్తూవుంటే వారు యీ బ్రిటిషు సామ్రాజ్యాన్ని పడ గొట్టి, దానిమీద తమ మహమ్మదీయ రాజ్యాన్ని స్థాపించి, అందులో యెంత హాయిగవుందామని అనుకుంటారో యిప్పు డీ యింగ్లీషు రాజ్యంలో కూడ అంత హాయిగనే, అంత సంతుష్టితోనే వుండడానికి మహమ్మదీయుల కేమీ అభ్యంతరము లేదు" అని కర్నల్‌లీస్ చెప్పుచున్నాడు. కాని, మహ మ్మదీయు లిప్పుడింత సంతుష్టిగ నున్నారా ? "లేరు లేరని" కలకత్తాలోని మహమ్మదీయ కళాశాలాధ్యక్షుడు ఘంటాపథ ముగ చెప్పుచున్నాడు. విద్యా విషయములోనేమి, వ్యక్తుల హక్కుల సంరక్షించుటలోనేమి, మనము వచ్చి పడగొట్టిన తనపూర్వపు మహమ్మదీయ రాజ్యముకంటే యీ మన

బ్రిటిషు రాజ్యమే మెరుగుగ నున్నదిరా యని వారి మనస్సులకు మనము తోపజేయలేకపోగా, పై పెచ్చు మనచర్యలను సమర్థించుటకుగాని, తమ తోడిమతస్థులు మనపై చేయు నిందారోపణలను ఖండించుటకుగాని మన యందెంతో భక్తి విశ్వాసములతో నున్న మహమ్మదీయులకు కూడ వీలులేకుండునంత అధ్వాన్నముగ మన బ్రిటిషు గవర్నమెంటువారు ఇండియాలో ప్రవర్తించి యున్నారు. మన చర్యలను సమర్థింపబూనిన విశ్వాసపాత్రులగు మహమ్మదీయులకుకూడ నలుగురిలో తలవంపు వచ్చేపనులను మనము చేసియున్నాము. వారి మనస్సులను సమాధానపరచి, సమంజసమగునట్టియు, నిలుకడయగునట్టియు, రాజనీతిని నడుపుకొనుచు వారు మనకు వశవర్తులగుటకు అనువగు సందర్భములను వారికి మనము అందించుటకు బదులుగ మనము మొదటినుండియు, అస్థిరమైనట్టియు, అన్యాయమైనట్టియు, అక్రమమైనట్టియు, దిక్కుమాలిన రాజనీతినే నడుపుచుంటిమి. పెచ్చుపెరిగి రా నారంభించిన మన యధికారము, మొట్టమొదటి రోజులలో దుర్బలస్థితి యందున్నప్పుడు మొగలాయి చక్రవర్తియెడ మన మెక్కుడలేని యణకువను, గౌరవమును నటించితిమి. లంచము లిచ్చియు, మోసపుచ్చియు, దబాయించియు, బెదరించియు మనమెట్లో మొగలాయి చక్రవర్తికి సాటిమిత్రులమైతిమి. ఈ పనులు చేసినప్పుడుకూడ మనము మొగలాయి చక్రవర్తియెడ దొంగగౌరవమును నటింప మానలేదు. "శివకేశవుల నారాధించు హిందువులకంటె, యేకేశ్వరోపాసకులగు మీ మహమ్మదీయులే గొప్పవా" రని చెప్పి వారిని ఉబ్బవేయుట

మనము మానలేదు. రాచకీయ బురకాను తీసివేసి, మేమే భారతవర్ష మంతటికి సర్వంసహా సార్వభౌములమను మాటను దాపరికములేకుండ ప్రకటించినప్పుడునై తము, పరమతస్థులకు అన్యాయము చేయమనియు, మా బ్రిటిష్ సామ్రాజ్యము క్రింద అన్నిమతములవారిని సరిసమానముగ ఆదరణతో చూతుమనియు, యెవరును తమ మతమునుగూర్చి భయపడనక్కర లేదనియు— మున్నగు మహా ధర్మసూత్రములను లోకమందంతట మాటిమాటికి చాటబంపితిమి. కాని, యిటీవల బ్రిటిష్ గవర్నమెంటువారు కొన్ని సంవత్సరములనుండి యిందుకు భిన్నమగు పద్ధతి నవలంబింపసాగిరి. స్వల్పసంఖ్యాకులయ్యు పూర్వము రాజ్యాధికారులై యున్న మహమ్మదీయుల యెడల బ్రిటిష్ గవర్నమెంటువారికి తమూపాయగు అపనమ్మకము పుట్టుకువచ్చెను. హిందువులను, శిక్కులను, సమాధానపరుచుట కేమిచేసినను, మహమ్మదీయులను సమాధానపరుచుటకుమాత్రము బ్రిటిష్ గవర్నమెంటువా రేమియు చేయలేదు. తమ రాజ్యమును కాజేసినామను కసి వీరికి లోపల మనమీద చాలకాలమునుండి యున్నది. ఈ కసిని, యీ రోషమును చల్లార్చుటకు మన మేమియు ప్రయత్నము చేయకపోగా, పైపెచ్చు, వారి కీమధ్య అనేక క్రొత్త రోష కారణముల గల్పించితిమి. వీని విషయమై వారెంత మనతో మొత్తుకొన్నను, వానిని మనము పెడచెవిని పెట్టితిమి. అందుచే, వారికి మనయెడ మరింత నిరుత్సాహము, నిరాశ, కలిగెను. బంగాళాదేశములోని మహమ్మదీయులు మనయెడ అసంతృప్తులై యుండుటకు కారణము మనమేగాని, వారి

తప్పేమియు లేదని కర్నల్ లీస్ చెప్పుచున్నాడు. "పూర్వ మునుండి కేవలము శిస్తు వసూలుదార్లుగమాత్రమున్న హిందువులను మనమువచ్చి భూస్వాములను చేసివేసితిమి. ఇది కేవలము మొట్టమొదటి రోజులలో యిండియా గవర్నమెంటువారు చేసినతప్పు. ఇది చాల అక్రమమైనపని. తదుపరి యీ అక్రమమైనపనినే "పర్మనెంటు శెటిల్ మెంటు" ద్వారా ఖాయపరచితిమి. దీనివలన బంగాళాప్రజలు యావన్మందికిని,— అందుముఖ్యముగ మహామ్మదీయులకును చాల అన్యాయము జరిగెను. ఈ "పర్మనెంటు శెటిల్ మెంటువల్ల యిండియా యందంతటను చాల అన్యాయములు జరిగెను. అక్రమముగ కొందరెక్కువ శిస్తులను, కొందరు తక్కువ శిస్తులను యిచ్చుకొనవలసిన వారైరి. బంగాళాయందు చెలరేగిన అసంతృప్తికి నిజముగ యిదే కారణము."

ఇదిగాక, యిండియా యందంతటను యిటీవల మరి కొన్ని బాధకములు కలిగెను. దీనివలన మత యుద్ధమొనర్పుటకై యిదివరకే కుట్రలు పన్నుచున్న ఆవేశపరులగు వాహాబీలకు మరింత చేయూత గలిగెను. తామొనర్పు సన్నాహముల కనుకూలముగ యిట్టివేయేవో కలహకారణములుకొన్ని యెప్పటికప్పుడు విడువక వారికి లభించుచునే యుండెను.

బ్రిటిష్ గవర్నమెంటు వారిటీవల యేర్పరచిన "యినాం కమిషన్" వచ్చి పూర్వము తమకు మహామ్మదీయ ఫాదుషా లిచ్చిన యినాములనన్నిటిని అక్రమముగ లాగివేసెనని దేశములో చాలమంది గోలపెట్టుచున్నారు.

తమ మతసంబంధమగు కర్మలను, హక్కులను నిలుపుటకుగాను తగు కట్టుదిట్టములతో పూర్వకాలమునుండి వచ్చుచున్న "కాజీ" లనబడు మతాధికారులను యీ బ్రిటిష్ గవర్నమెంటువారు తీసివారవేయుటచే మహమ్మదీయుల కెంతో యిబ్బంది గలిగెను.

విద్యావ్యాప్తికై ధర్మాత్ములగు మహమ్మదీయులు పూర్వమెన్నడో యిచ్చిన ధర్మాదాయముల నన్నిటిని యీ బ్రిటిష్ గవర్నమెంటువారువచ్చి లాగికొనిరి. అట్లే మశీదులు వగైరాలకై పూర్వీకులిచ్చిపోయిన దేవాదాయములనుకూడ గవర్నమెంటువారు లాగికొని, ఆ సొమ్మునంతను అన్యత్రి దుర్వినియోగపరచిరి. ఈ దేవాదాయ పరిపాలనకు "మేమే ధర్మకర్తల" మని చెప్పి యీబ్రిటిష్ గవర్నమెంటువారు "తగుదుమమ్మా" యనివచ్చి, యీ దేవుని సొమ్మునంతను యింకొకవిధముగ తమ యిచ్చవచ్చినరీతిని దుర్వినియోగ పరచిరి.

గవర్నమెంటు ఉద్యోగములన్నిటిలో హిందువులే చేరి, తమ్మును మోచేతితో బయటికి నెట్టివేసిరని మహమ్మదీయులు గోలపెట్టుచున్నారు. ఈ అన్యాయమును వారించి, తమ కింతకంటె యెక్కువ సౌకర్యములు చేయకుండ గవర్నమెంటువారు ఉపేక్ష చేయుచున్నారనికూడ వారు మొత్తుకొనుచున్నారు.

మహమ్మదీయ శాస్త్రములు, మహమ్మదీయభాష నేర్చుకొన్న వారికి సర్కారు నౌకరీ దొరకడంలేదనియు, అం

దుచే తమ కులములో మహమ్మదీయ పండితులు కరవై, మహమ్మదీయవిద్యా శాస్త్రములు నశించి, తమ కులమువా రందరు అజ్ఞానమను చీకటిలో పడి కొట్టుకొనుచున్నారనియు మహమ్మదీయులు గోలపెట్టుచున్నారు. గవర్నమెంటువారు చెప్పే విద్యాపద్ధతి తమ పూర్వ విద్యాపద్ధతికి విరుద్ధముగ నున్నదనియు, అందుచే, యీ యింగ్లీషువిద్య చదువుకొన్న మహమ్మదీయుడు కులభ్రష్టుడై తా నెంతటి మంచివాడైనను, తనసాటి కులస్థులయెడల గౌరవమును పొందలేక పోవుచున్నా డనియు మహమ్మదీయులు గోలపెట్టుచున్నారు.

కాని, యిక యింతటితో యీ గ్రంథమును ముగించ వచ్చును. ఇప్పటికి పండ్రెండేండ్ల క్రిందట "బ్రైటు" గారు చెప్పినమాటలు నేటికిని సత్యములు. అవి నేటికిని వర్తించును. "ఈ భారతరాజ్య సమస్య నానాటికి మహా అపాయకరముగ పరిణమించుచున్నది. ఇరువైయేండ్లనుండి నేటివరకుకూడ ఒక్కమోస్తరుగ సర్కారు ఖజానాయందు లోట్లమీద లోట్లు కలుగుచునే యున్నవి. అప్పులమీద అప్పులు కుప్పతిప్పలుగ పెరిగిపోవుచునే యున్నవి. ఎప్పుడో ఒకరోజున యిది మన అంతుకనుక్కుంటుంది. అది కనుక్కోకపోయినా, మనమైనా కనుక్కోనవలసి వస్తుంది. మన మిదివరకు చేసిన తప్పుడుపనులకు ఫలమిది— మన మిప్పుడనుభవించు చున్నది యీ ఫలితమే—అంతకంటె వేరే యేమీలేదు. సరే, గతంనాస్తి. వెనుక జరిగిపోయిన దేమో జరిగిపోయినది. ఇప్పటికైనను యిండియా యేస్థితిలో వున్నదో చూడండి; మన సామ్రాజ్యం యే స్థితిలో వున్నదో

మూడండి. ఈ రెంటిని సరిచూచి యికముందైనా, వెనుక చేసిన దానికంటె మెరుగుగ, స్మేమైనా చేయుటకు వీలుం దేమో ఆలోచించుకోండి” అని బ్రైటు చెప్పెను. “అబ్బో, యీపని చాల కష్టమే” అని అందురేమో. నిజమే, యిది చాల కష్టమైనపనియే. కాబట్టియే, మన మొక్కరోజైనను ఆలస్యము చేయకుండ, దీనిని చక్కపెట్టు కొనవలసిన అవసర మేర్పడుచున్నది. ఇండియాలో మన రాజ్య మును నిలుపుకోవలెనంటే, ఆనిలుపుకు నేపని జరిగి తీరవలెను గద; ఆపని యీరోజునుండియే ప్రారంభము కావలెను. ఒక్కరోజుకూడ ఆలస్యముచేయుటకు వీలులేదు. ఈ విష యమై “ఫాసెట్” మంత్రి కొంతపని చేయుటకు పూను కొనెను. ఇండియాయొక్క ఆర్థికస్థితిని చక్కబరుచుటకై ఆత డొక కమిటీ నేర్పరిచెను. ఇది చాల మంచిపని. ఇట్టిపనికి ప్రారంభించిన కీర్తి ఆతనికే దక్కినది. ఈ కమిటీవా రొనర్చు పనినిగూర్చి యిండియాలోనున్న పెద్దలందరు చాల ఉత్సాహ ముతో చూచుచున్నారు. ఇది మంచికాలమును సూచించు చిహ్నమే. గతమును మార్పజాలము; కాని, భావికాలమందు భారతవర్షపు గతిని నిర్ణయించగల అధికార మింకను మన చేతులలోనే వున్నది.

సంపూర్ణం

ఓంతత్సత్ బ్రహ్మార్పణమస్తు.